# కథలు-గాథలు

తృతీయభాగము



శ్రీ

తిరుపతివేంకటీయము

శ్రీమత్పరదేవతాయైనమః

# కథలు-గాథలు

తృతీయభాగము



రచయిత

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి. శతావధాని



ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P.O.

తూర్పుగోదావరిజిల్లా.



మొదటి కూర్పు

**1960**

వెయ్యి ప్రతులు

## హెచ్చరిక



ముద్రణ

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్

ఆలమూరు.

శ్రీమత్పరదేవతాయైనమః

# వక్తవ్యాంశము

సుమారు ఒకదశాబ్దిపాటు ఎడతెగని దీక్షతో సుప్రసిద్ధములైన ఆంధ్ర - దైనిక - వార - పక్ష - మాస - పత్రికల్లో ప్రచురితములైనట్టిన్నీ కొన్ని అముద్రిత స్వరూపంలోనే ఉన్నట్టిన్నీ వ్యాసములు - కథలు-గాథలు తృతీయభాగము ముద్రించడంతో సశేష స్వరూపాన్నివీడి అశేషస్వరూపం దాల్చినట్లుగానే పాఠక లోకం భావించుకోవచ్చును. గాని మాకు మాత్రం కొంచెం వక్తవ్యాంశం మిగిలియున్నది.

ఈ తృతీయభాగంలో గూడా కొన్ని అసంపూర్ణ వ్యాసావళి ముద్రించక తప్పలేదు. వాట్లకు సంబంధించిన సూచనలు ఇక్కడ విస్తరించడం అనావశ్యంకాదు సరికదా? భావి పరిశీలకులకున్ను సదరు పరిశీలకులకు తోడ్పడే సారస్వతాభిమానులకున్ను చాలా అవసరంకూడా కనుక పై అసంపూర్ణవ్యాసావళికి సంబంధించిన సూచనలు ఉటంకరిస్తాను.

(1) 326 వ పేజీలో ఆరంభింపబడిన రాణాప్రతాపసింహచరిత్ర శీర్షికలో చుక్కలుంచబడిన భాగంలో కొంతవ్యాసభాగం సంపాదింపవలసిఉంది.

(2) 335 వ పేజీలో ప్రారంభించిన అభ్యనుజ్ఞ అనే వ్యాసంలో మిగిలిపోయిన భాగం యేమీలేదుగాని 'త్రియంబక శబ్దవిచారము' అనే వ్యాసం వొకటి పైవ్యాసానికి ముందుగా ప్రకటింపఁబడవలసినది ఉంది. యీ వ్యాసం శ్రీ నాళం కృష్ణారావుగారి షష్టిపూర్తి సంచికలో ప్రచురింపబడ్డది. ఆసంచిక నేను సంపాదింపలేక పోయినందున ఆవ్యాసం యిక్కడ ప్రకటించడం కుదరలేదు.

(3) 396 వ పేజీలో "వింతశ్లేషలు" అనేవ్యాసం ఆంధ్రవాణి పత్రికలో ప్రకటింపఁబడ్డది. ఆరంభింపబడుటలో పూర్వంకొంత వ్యాసం లభింపబడనిది ఉన్నట్లు తెలుస్తూన్నా అక్కడ చుక్కల గుర్తుంచకుండానే

ముద్రణ జరిగింది. అది ఒకటి భావిపరిశీలకులు గమనించాలి. 1941 సం॥ లోని ఆంధ్రవాణినుండి మిగులు భాగాన్ని సంపాదించుకో వలసివుంది ఇదేవ్యాసానికి సంబంధించిన సశేషవ్యాసం కొంత 401 వ పేజీలో కూడా ఉంది. గమనింప గోరుతున్నాను.

(4) భారతాంధ్రీకరణ కాల పరిమితి అనేవ్యాసం మొదటినుండిన్నీ కొంతలభ్యంకానిదే 432 వ పేజీలో ఆరంభింపబడింది. అది 434 వ పేజీలో గూడా కొంత సశేషస్వరూపం తాల్చినట్లు ఆపేజీలో ఉంచిన చుక్కల గుర్తులవల్ల విస్పష్టమేగదా ?

(5) ఇంక 452 వ పేజీలో రామాయణ కల్పవృక్షానికి సంబంధించిన వ్యాసభాగం కొంత లభ్యపడవలసి యున్నట్లు గమనార్హమౌతూనే ఉంది.

(6) ఇంతేగాక 487 వ పేజీలో ' దుర్యోధనుడు ' అనే శీర్షికగల జన్మభూమివ్యాస ప్రక్షిప్తభాగమున్ను. ఆపత్రికలో బాపతే 491 వ పేజీలోని " పండితులపాట్లు " అనే వ్యాసంలో దొరకని భాగమున్ను మరిన్ని "మన పేర్లు" అనే నామధేయంగల 511 వ పేజీలోని జన్మభూమి యందలి వ్యాస శేషమున్ను, సంపాదించవలసి ఉన్నాయి.

(7) 518 వ పేజీలోని పూర్వవ్యాసాలు అనే వ్యాసానికి ఆదిలోనే కొంత ప్రక్షిప్తం కలదేమో అని అనుమానం యిటీవల తగిలింది. ముద్రించేరోజుకు అనుమానం లేనందున అక్కడ గుర్తులు ఉంచలేదు. అవి దాగా గమనించగోరుతున్నాను.

(8) 538వ పేజీలోని నేటిబిరుదుల పరమరహస్యం అనే వ్యాసం ఆద్యంతాలలో కొంత జీర్ణించిందే అయినా దొరికినంతలోగూడా ముద్రింపబడిన ఆంధ్రదిన పత్రిక ( దీని తేదీగూడా అందు కనిపించడంలేదు ) లోని 4 కాలాల మేటరులోనూ మొదటికాలంలోని భాగమే అచ్చాఫీసువారి ప్రమాదంవల్ల వ్యాసారంభంలో చేర్చబడియుండలేదు. అది యిక్కడ చేయిస్తు

న్నాను. యీ చేర్చేదానికి ముందుకూడా కొంత వ్యాసం ఉంటుందనే విష యాన్ని గుర్తుంచుకుంటూ యీ దిగువ వ్యాసపంక్తులు 538 పేజీలో వ్యాస శీర్షికకు ఆదిలోనే చేర్చుకో గోరుతున్నాను.

.....................................................................

మేము యతిలోగాని ప్రాసలోగాని దాన్నివాడలేదు. "కర్ణుఁడు దుర్ణ యుండగుచు" అన్నచోట "దుర్నయుండు" అని దంత్యయుక్తంగా వున్నా చెడేదిలేదు. యమకం యించుమించు దంత్య పాఠంలోనూ వుంటుంది. అయితే శేఖరకారకునిదాకా యీణత్వాన్ని ఖండించిన వారులేరు. (దుస్-దుర్-లక్షణప్రతిపదోక్త పరిభాష వగైరా సాధనసామాగ్రి) కావు ననే ప్రాచీనులు నన్నయ తిక్కన శ్రీనాథ పెద్దన ప్రభృతులంతా ప్రాస లలో వాడుకున్నారు. అందుచేత దిద్దక సాధించవలసి వచ్చింది. ఈలాటి వింకా చాలావున్నాయి.

1. ఏనామనూనాకృతిభాసమానాం, 2. పశ్యాపశ్యా, 3. మృతా యితుఁడు, 4. మరుద్భూపాలుఁడు.

వాట్లల్లో యివిప్రధానాలు. వీట్లని నేను మార్గాంతరం తొక్కి సాధిం చినా సరళంగా అడిగితే యధార్థం చెప్పక పోవడంలేదు.

1. ఏనిని, 2. ఝరులు, 3. ఏతద్భ్రాబ్బిలి, 4. కంజముఖీకబరీభరో త్కరానందదము, 5. లవలేశములు, 6. యజ్ఞయాగములు, మొదలైనవి. ఇవన్నీ నిర్దుష్టములు, ఏటికెదురీదేవి. ప్రపంచమంతా యేకీభవించి వాదిం చినా నిలిచేవి. వీట్లని తగినంత లక్ష్యలక్షణజ్ఞానం చాలక ఆక్షేపించి పద పడి యెన్ని (భారతాదులనుండి) మహాకవిప్రయోగాలు చూపినా మామోలు పాటే పాడుతూ ఆ అపజయాన్ని యీవిధంగా తీర్చుకోవడానికి పాండి త్యానికిగాని కవిత్వానికిగాని ("ధిషణా కషనిక్షిప్తః కి మిషుర్నీరసో భవేత్. చూ.) లేశంగాని లవలేశంగాని తల్లేశ లేశలేశాంశ లేశలేశలవాం శకంగాని సంబంధంలేని ప్రసంగంచేసి సంతుష్టిపడతారు.

ఆయీ సందర్భంలో వాసిరెడ్డివారి సంస్థాన కవులలో నొకడగు బుచ్చివెంకు ( బహుశః యితడు కళావంతుడై వుండాలి ) యీవిధంగా మందలించాడు.

"ఉ. పన్నిన సత్త్రబంధమున బాగుననోగుసు జూడకూరకే
మన్నన మాలి మాకొలము మాటదలంతురు చేమకూర వెం
కన్నకులోపమేమి, కులమా ? కవనానకు వేంకటాద్రి రా
జన్న.... .... .... .... ... .... ...."

కవిత్వంవల్ల వచ్చే గౌరవానికిన్నీ మడిగట్టుకోవడంవల్ల వచ్చే గౌరవానికిన్నీ చుట్టరికం వుండదు. మడిగట్టుకొన్నవారిని వైదికులలో నెక్కుడుగా ప్రేమింతురని లోకం యెఱిగిందే. (జయంతి కూడా చూ.) యీకవి వంశస్థులు భిక్షాటకులనిగాని, కవియే భిక్షాటకుడనిగాని వ్రాసే వ్రాతలు —

పైవిధంగాచేర్చి చదువుకోగలందులకు కోరుతూ వేరేకూడా ఉన్న ఆధారంలో లభించని యీ ఆంధ్రదిన పత్రికకై 1946 సంవత్సరంలో మార్చినెలను ఊహిస్తో పాఠకుల పర్యవేక్షణకు సూచిస్తున్నాము.

శ్రీ కథలు - గాథలు ప్రథమ - ద్వితీయ - తృతీయ భాగములలో ముద్రితములయిన వ్యాసాలుగాక ఏవి అయినా ఉన్నట్లు ఏవరైనా కనిపెట్టి మాకు సూచిస్తే కృతజ్ఞతతో పరిశీలింపగలము.

కడియము
తూ. గో. జిల్లా.
*1-4-1960*

ఇట్లు విన్నవించు విధేయుడు.
విద్వాన్
చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రి
( గ్రంథకర్త కుమారుడు )

# కథలు-గాథలు తృతీయ భాగము నందలి
## విషయానుక్రమణిక



 * ఈ గుర్తుగలవి - అసంపూర్ణవ్యాసములని తెలివిడి.

---*---

# బమ్మెర పోతనామాత్యుడు

(ది 15–11–1939 సం॥ర ఆంధ్రపత్రిక నుండి)

"బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్."
అని షష్ఠస్కంధారంభంలో సింగయకవీంద్రుఁడు మ్రొక్కిన మ్రొక్కు పద్యం చాలారసవంతమైన ధోరణిలో వుండడంచేత అందులో నాల్గోచరణాన్నే నేనిక్కడ వుదాహరించి, పోతరాజుకు నమస్కరిస్తూన్నాను. పోతరాజుగారి జీవితసారాంశా న్నంతనీ సింగయమహాకవి యీ పద్యంలో యిమిడ్చి వున్నాఁడు. అందుచేత తక్కినభాగాన్నికూడా వుదాహరించిన పిమ్మటే కథాభాగంలోకి వస్తాను.

ఉ. "ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ములుగాఁగ వాక్యములు సూరలుసేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర.....................మ్రొక్కెదన్."

యీ పద్యం వ్రాసిన సింగయ కవీంద్రుఁడు మన పోతరాజుగారికి కొంచెె మించుమించుగా సమకాలీనుఁడే అయివుంటాఁడు. యితణ్ణిగురించి అవకాశంవుంటే యీ వ్యాసంలోనే తుట్టతుదను వ్రాయవలసివస్తే వస్తుం దేమో? ప్రస్తుతం పోతరాజుగారినిగూర్చి క్లుప్తంగానే కొన్నిమాటలు వ్రాయటానికి సంకల్పించాను.

ఈ పోతరాజుగారంటే కవులలో అందరికీ అపారమైన గౌరవం. ఆ గౌరవం అంతా యింతా అనిచెప్పడానికి అలవి కాదు. భాగవత ప్రతిపాద్యుడైన శ్రీకృష్ణభగవానుణ్ణి ప్రేమించేవారికంటేకూడా పోతరాజుగారిని ప్రేమించేవారే లోకంలో విస్తారంగా వుంటారు. యీయనవిషయంలో నిన్న మొన్న కొందఱు కొన్ని పత్రికలలో యేదో వ్రాస్తూ "బాలరసాల సాల నవపల్లవ....పోషణార్థమై" అనేపద్యం పోతరాజుగారిది కానేకా దనిన్నీ అది మఱిఒకరిదై వుంటుందనిన్నీ వ్రాశారు. మఱిఒకరు ఆపద్యం

పోతరాజుగారిదే అని సిద్ధాంతీకరిస్తూ కూడా, అది యీయన రచించిన "భోగినీదండకానికి" సంబంధించిం దనిన్నీ, యీ సందర్భానికి ఆపద్యం లోనే వున్న "అప్పుడుపుఁ గూడు" అనేమాట సాధక మవుతుందనిన్నీ కొంత వ్రాసివున్నారు, ఆ వ్రాఁతలు నాకు బొత్తిగా రుచించలేదు. పద్యం మొత్తానికీ పోతరాజుగారిదే అనిన్నీ పద్యంలో వున్న తాత్పర్యం జనరల్‌గా రాజుల కందఱికీ సంబంధించేదే అనిన్నీ సహృదయులు విశ్వసిస్తారని నావూహ. అందుకు—

ఉ. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్నిపుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్."

అనే భాగవత పీఠికలో వున్నపద్యం పూర్తిగా తోడ్పడుతూ వుందని మనవి చేస్తున్నాను. యీ మధ్య పత్రికలలో వ్రాసిన వ్యతిరేకవాదులు యీ పద్యం వుందని లేశమున్నూ గుర్తించి నట్లే నాకు తోఁచలేదు. ఆ కాలంలో చాలామంది రాజులు వున్నా పోతన్నగారి హృదయంలో వున్నవారు వేంకటగిరివారే. ఆ సంస్థానంవారికి "కర్ణాటక దేశాధీశ్వరులు" అనేబిరుదనామం వున్నట్టు వారివంశచరిత్రవల్ల తేలుతుంది. బహుశః గోపీనాథ వేంకటకవి తన రామాయణపీఠికలో యీబిరుదాన్ని వాడి వున్నాఁ డనిన్నీ దాన్నిబట్టే మేము ఆసంస్థానానికి వెళ్ళినప్పుడు చెప్పిన పద్యాలలో "కర్ణాటధారుణీంద్ర ! శ్రీరాజగోపాలకృష్ణయాచభూప బహదర్ మహారాజ !" అని వాడివుంటామనిన్నీ జ్ఞాపకం. యిక్కడ దీన్నెందుకు వ్రాశానంటే ? శ్రీపోతరాజుగారు "కాటుక కంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో హాటకగర్భురాణి ! విను" అని సరస్వతిని వోదార్చే పద్యంలో వాడిన "ఆఁకటికోసము తాళలేక కర్ణాటకిరాటకీచకుల కమ్మ నిజమ్ముగ నమ్మ భారతీ !" అని కర్ణాట రాజు లనే అర్థమిచ్చే "కర్ణాట కిరాటకీచకులు" అనేపదం "బాలరసాలసాల" అనేపద్యం సర్వజ్ఞ సింగ

భూపాలుఁడుగారికి సంబంధించేదే అని తెల్పుతుం దని తెల్పడానికే. సర్వజ్ఞ సింగభూపాలుఁడు గీర్వాణభాషలో పండితకవులు మెచ్చుకోఁదగిన మహాకవి యని బాహాటంగా ఆయనగ్రంథం ( సింగభూపాలీయం ) వల్లనే తెలుస్తుంది. అట్టివిద్వద్రాజును పోతరాజుగా రెందుకు యింతగా యీసడించారో ? వ్రాయవలసివస్తే యేవో ఆకాశసౌధాలు కట్టినట్టుం టుందేకాని యథార్థం వ్రాసినట్టు పరిణమించదు. వాడికీ వారికీ జరిగిన ప్రసంగాలు సరిగా మనకు తెలియవుగదా ! పోతరాజుగారికి రాజులను స్తుతించి తద్ద్వారా కుటుంబపోషణ చేసుకోవడమందు బొత్తిగా యిష్టం లేదన్నది సర్వజనులున్నూ విశ్వసించే అంశం. ఆయీసందర్భం వామన చరిత్రలో వున్న—

క. "వ్యాప్తిం జెందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచున్
దృప్తిం జెందనిమనుజుఁడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే ? "

అనేపద్యం మొదలైన కొన్ని పద్యాలవల్ల స్పష్టంగా గోచరిస్తుంది. సంస్కృతానికి అనువాదంగదా ! భాగవతం. అందులో పోతరాజుగారి స్వంతాభిప్రాయాన్ని అన్యాపదేశంగా మనం గ్రహించడము యేలాగ ? అని స్థూలదృష్టు లనుకుంటారు గాని సంస్కృతాంధ్రాలు రెండూ దగ్గఱ పెట్టుకుని పరిశీలిస్తే యీసంశయం క్షణంలో తేలుతుంది. చాలాచోట్ల పోతరాజుగారు స్వతంత్రించి పెంచి మూలానికి వన్నె తెస్తూ వచ్చారు. వినలేదూ ? "నేనే రామాయణాన్ని ఆంధ్రీకరిస్తే గ్రంథం బళ్ళని తోల వలసివస్తుంది " అనేవారఁట ! పోతరాజుగారు; యీమాట జగత్ప్రసిద్ధమే. భాగవతం మూలంకంటే కొంత పెరింగిందని అందఱూ యెఱిఁగిందే. అందులో వామనచరిత్రలో యెన్నో పద్యాలు పోతన్నగారి స్వకపోల కల్పన లని పరిశీలిస్తే స్పష్టపడుతుంది. మొత్తం యీమధ్య పత్రికలలో బయలుదేఱిన సిద్ధాంతాలు అపసిద్ధాంతాలనిన్నీ " బాలరసాలసాల " అనే

పద్యం పోతరాజుగారిదే అనిన్నీ నేనభిప్రాయపడతాను. కొద్దిమాత్రంతో మఱివకరి పుస్తకంలో కనపడితే ఆకవి భాగవతాన్నుంచి గ్రహించాఁడను కోవాలి. అందులోవున్న "పడుపుకూడు" సింగమనీఁడుగారి సానివల్ల పొందిన బహుమానానికి అంటఁగట్టి వాదించడానికి అంతగా ఆధారం కనపడదు. అట్టిసమ్మానం జరిగినట్లు పరంపరగా యెవ్వరున్నూ చెప్పు కోవడం లేదు. యేదో కవిత్వమంటూ చెప్పినప్పుడు సమ్మానం జరక్కుం డానే వుంటుందా? అనే వూహను పురస్కరించుకొని వ్రాసినవారు అలా వ్రాసివుంటారు. ఆవూహ "యిమ్మనుజేశ్వరాధముల కిచ్చి" అనేపద్యం వల్ల పూర్తిగా అపోహగా తేలుతుంది. యిఁక యేకవిగాని రాజులకు కృతియివ్వడం తప్పే అవుతుందా? అనే ప్రశ్ననుగూర్చి కొన్నిమాటలు వ్రాసి ప్రస్తుతానికి వస్తాను. నావుద్దేశంలో వాల్మీకిదగ్గఱనుంచి కవులం దఱూ యెవరోరాజుకు కృతి యిచ్చినట్టే గోచరిస్తుంది. భారతమంతా జనమేజయుఁడికి కృతి, భాగవతం పరీక్షిత్తుకు కృతి, యిఁక రామాయణం వుంది. అది రాముణ్ణి సంబోధించి చెప్పింది కాదు గాని ఆయనచరిత్రనే కథావస్తువుగా పెట్టుకొని రచించినదికదా! ఆశ్వాసాదియందు షష్ఠ్యంతాలు కూర్చి ఆశ్వాసాంతమందు మూఁడున్నూ పద్యాలు చెప్పడమేకదా కృతి యివ్వడ మంటే! యిదేయెక్కువో? యావత్తు గ్రంథమున్నూ యేరాజుచరిత్రనో పురస్కరించి చెప్పడమే యెక్కువో? విమర్శకులు పరిశీలించాలి. కాళి దాసు రఘువంశంలో 15 వ సర్గలో రాములవారిచేత వాల్మీకికి యావద్రాజ్య మున్నూ రామాయణరచనకు బహుమతీ చేయించినాఁడు. చూడండి - "ఊరీకృత్యాత్మనో దేహం రాజ్యమస్మై న్యవేదయత్" వ్రాస్తే చాలా వ్రాయాలి. వాల్మీక్యాదు లందఱున్నూ యెవరిని వుద్దేశించి లేక సంబో ధించి చెప్పివున్నారో కవిత్వాన్ని; ఆకవిత్వం వారికి కృతియిచ్చినట్టే తేలుతుంది. అయితే ఆ ఋషులు ఫలాపేక్షతో ఆ పనిని చేసివుండ రనిన్నీ యిటీవల కవులు ఫలాపేక్షతో చేసి వుండడంచేత యిది ఆక్షేపణీయం అవుతుందనిన్నీ అందుచేత వారినీ వీరినీ ఒక తరగతిలోకి చేర్చి మాటాడ

కూడదనిన్నీ అనవలసి వస్తుంది. అది యుక్తియుక్తమైనమాటే కనక శిరసావహించవలసిందే. కృతి యివ్వడమే కాదు; యే సుకృత కార్య మున్నూ కూడా ఫలాపేక్ష లేకుండా చేయడమే యుక్తమని శ్రీకృష్ణభగ వానులు గీతలో చెప్పివున్నారు. (సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్) యిది అప్రస్తుతం కనక యింతతో దీన్ని ఆఁపుతాను. కృతి యివ్వడం పోతన్నగారికి సుతరామున్నూ యిష్టంలేదు కనక ఆమహా మహుఁడు ఆ కాలంలో యెందఱో మండలాధీశ్వరులు కృతిస్వీకారానికి సిద్ధంగా వున్నప్పటికీ తన్ను నయానా భయానా బలవంత పెట్టినప్పటికీ లేశమున్నూ లొంగక "పంచమేఽహని షష్ఠేవా శాకం పచతి స్వే గృహే అనృణీ హ్యాపరప్రేష్యః" అనే వచనానుసారంగా కుటుంబపోషణ చేసు కుంటూ భగవదారాధనతో కాలాన్ని నెట్టినట్టు స్పష్టపడుతుంది. ఆ యీ సందర్భం కృత్యాదిని వున్న "శ్రీకైవల్యపదమ్ము చేరుటకునై చింతిం చెదన్" అనేపద్యంవల్లనే స్పష్టపడుతుంది. "కైవల్యపద" శబ్దానికి అర్థం సర్వశ్రేయస్సులనూ మించిన మోక్షమే అయినప్పటికీ ఆమోక్షం మనుష్యుడు జీవించివుండఁగా లభించేది (పోతరాజుగా రభిలషించేది జీవన్ముక్తి కాదు, చేరుటకు అనేపదం దానికి బాధకం) కాదు కనక ఆలాటికోరిక అమంగళంగా సామాన్యకవులే కాదు మహావేదాంతులైన శ్రీశంకరాచార్యాదులుకూడా భావించివున్నట్టు వారువారు వారివారి గ్రంథా దిని చేసిన మంగళములవల్ల స్పష్ట మవుతుంది. అట్టిస్థితిలో మనపోతరాజు "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని" అనే శిష్టసంప్రదా యాన్నికూడా గణింపక "కైవల్యపదమే" తనకు ముఖ్యంగా కావలసి నట్టు త్రికరణశుద్ధిగా నిర్భయంగా గ్రంథాదిని వాడివున్నాఁడు. దీన్నిబట్టి ప్రతిమనుష్యుఁడున్నూ మహాపండితుఁడు మొదలుకొని పరమమూర్ఖుడు వఱకు ఆశించే ఐహికానందాన్ని మనపోతరాజుగారు యెంతవరకూ గౌర వించారో విస్పష్టమే కావున విస్తరించేది లేదు. ఐహికానందమందు బొత్తిగా గౌరవం లేని పోతన్నగారికి రాజులతో పని యేముంటుందో?

విజ్ఞులు గుఱుతిస్తారు. యీ కృతులివ్వడంలో కొందఱు వక యుక్తి చేస్తారు. యెవరో సంపన్నులవద్ద ద్రవ్యాన్నైతే పరిగ్రహిస్తారు. దానికి ప్రతిఫలంగా బోలెఁడు పద్యాలతో గ్రంథాదిని వారి వంశాన్నిన్నీ వర్ణిస్తారు. యిఁక మానేదల్లా ఆశ్వాసాదియందున్నూ ఆశ్వాసాంతమందున్నూ ద్రవ్యప్రదాతలను మాని యేదేవుణ్ణో సంబోధిస్తారు. ఆ ద్రవ్యప్రదాత ఆలాగే చేయవలసిం దన్నట్టు పీఠికలో తేలుస్తారు. యివన్నీ వట్టి యుక్తులు. యెవరివద్ద ద్రవ్యస్వీకారం చేయడం జరిగిందో వారికి కృతి యిచ్చినట్టే లోకము భావిస్తుంది. యీ కుయుక్తులు యీకాలంలోనేగాని పూర్వకాలంలో వున్నట్టు లేదు. నరకృతి దూష్యమనే మాటకూడా పోతరాజుగారి ప్రవృత్తి వల్లనే బయలుదేఱింది. కవికర్ణరసాయన గ్రంథకర్త సంకుసాల మహాకవిన్నీ కూచిమంచి తిమ్మకవిన్నీ పోతరాజుగారి ప్రవృత్తిని బలపఱుస్తూ కొంత నిరసనభావాన్ని వారివారి గ్రంథాలలో కనపఱుస్తూ వచ్చారు.

"ప్రభు దురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు" లోనైన వాక్యాలు సుప్రసిద్ధాలే కనక స్పృశించి విడిచాను. పోతరాజుగారు కవులలో అగ్రస్థానం వహించడమే కాకుండా భక్తులలోకూడా అగ్రస్థానాన్ని వహిస్తారు. అయితే యీమహాకవిని నన్నయాదులతో పాటు ప్రయోగ విషయంలో కవిలోకం అనాదిగా గౌరవించినట్టు కనపడడం లేదు. ధారాశుద్ధి, నిర్దుష్టత, మాధుర్యము వగయిరా గుణాలనుబట్టి చూస్తే యీమహాకవి సర్వదా నన్నయ్యకు మించుతాఁడు గాని లొక్కాఁడు. ఆయన గురుశుశ్రూషా పూర్వకంగా శాస్త్రాభ్యాసం చేసి "అష్టభాషావాగనుశాసన" బిరుదాన్ని సంపాదించి తన కవిత్వంలో ఆ పాండిత్యానుభవాన్ని యథాయోగ్యంగా ప్రదర్శించాఁడు. మన పోతన్నగారో? "సహజపాండిత్య" బిరుదాంకితుఁడు, కేవల వరప్రసాది. అంటే యేకొంచెమో వాఙ్మయపరిచయం మాత్రం సంస్కృతాంధ్రాలలో గురుముఖతః బాల్యంలో కలిగించుకోకుండా యింతటివాఁడు కాఁజాలఁడు గాని వ్యాకరణాది శాస్త్రాలు

బట్టీ పెట్టి వల్లించి తద్ద్వారాగా పాండిత్యం సంపాదించినవాఁడు మాత్రం కాఁడేమో ?

ఉ. "స్వ_స్తి జగత్త్రయీభువన శాసనక_ర్తకు హంసమాత్రవి
ధ్వ_స్తనిలింపభ_ర్తకు నుదారపదవ్యవహ_ర్తకున్ మునిం
ప్రస్తుత మంగళాధ్వరవితానవిహ_ర్తకు నిర్జరీగళ
న్య_స్త సువర్ణసూత్ర పరిహ_ర్తకు దానవలోకభ_ర్తకున్."

యీలాటి సంస్కృతధారతో యెన్నోపద్యాలు భాగవతంలో వుంటాయికదా ! యిందుకు సామగ్రి యీయనకి యెక్కడనుండి వచ్చిందని సందేహం కలగడంలో ఆశ్చర్యం లేదు. దానికి హేతువు సంస్కృత భాగవతాన్ని అసకృదావృత్తిగా యీయన అదేపనిగా చదివి వుంటాఁడన్నదే. సర్వసాధారణంగా అందఱికీ తెలిసే సమాధానం యింకోటి. "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అనేదే. పూర్వజన్మసంస్కార మంటూ వప్పకపోతిమా, యెన్ని సంస్కృతభాగవత రామాయణాలు, యెన్ని భారతాలు యెన్నిమాట్లు కంఠోపాఠంగా వల్లించినా ఆమాదిరి ధార పట్టుపడదు. యీమాటకు అనుభవజ్ఞులైన ఆ_స్తికు లందఱూ వొప్పుకుంటారు. నా_స్తికుల విషయంలో మనంగాదుగదా, బ్రహ్మకూడా సమాధానపఱచలేఁడు. "బ్రహ్మాఽపి నరం న రంజయతి" చదివితేనేమి ? దానంతట అదే వ_స్తేనేమి ? పోతన్న సంస్కృతధారలో తిక్కన్న యెఱ్ఱన్నగార్లకు మించుతాఁడు, నన్నయ్యతో సరిగా తులతూఁగుతాఁడు, నన్నయ్యకు అప్రయత్నంగా వచ్చి పడే శబ్దాలంకారం యితనికి అంతగా పడ దని నే నను కుంటాను. యీయనపెట్టే అంత్యనియమం కొంచెం ప్రయత్నించి పెట్టేదే అని చెప్పక తప్పదు.

"మ. గొడుగో? జన్నిదమో? కమండలువొ? నాకున్ ముంజయో? దండమో?
వడుగే నెక్కడ భూము లెక్కడ ? కరుల్ వామాక్షు లశ్వమ్ము
లెక్కడ ? నిత్యోచితకర్మ మెక్కడ ? మదాకాంక్షామితంబైన సూఁ
డడుగుల్ మేరయె త్రోయ కిచ్చు టది బ్రహ్మాండమ్ము నాపాలికిన్."

యీమాదిరిగా విడివిడి పదాలతో యతిప్రాసలకుఁగా :- ఒగి - వెస - తగ - యిల - ఓలి మొదలైన పదాలసహాయాన్ని అపేక్షించకుండా రచన సాగించవలసివస్తే యే భారతకవులున్నూ పోతన్నగారికి — "దాసోఽహం" అనవలసి వస్తుందేమో ? అని నేననుకుంటాను. అన్నిటికీ ముఖ్యం రసంకదా ! ఆరసం యితఁడు పద్యం యెత్తుకొనేటప్పటి కల్లా వచ్చి పువ్వులకు పరిమళం అలుముకున్నట్టుగా అలుముకుంటుంది. తెలుఁగుభాష పుట్టినతరువాత యింత రసబంధురంగా కవిత్వం చెప్పే వ్యక్తులు చాలా మృగ్యం గానే పుట్టివుంటారనిన్నీ అందులో యితఁడు, "కనిష్ఠకాధిష్ఠితుఁ" డనిన్నీ పలువురు విశ్వసిస్తారు. కవిత్వమా ? నిర్దుష్ట మాయె, రసమా ? కుత్తుకబంటాయె, యిట్టికవిత్వాన్ని యేదేనా ప్రయోగ విషయంలో లక్ష్యంగా చూపిస్తే, అదేం కర్మమో ? "ఓహో ? భాగోతమా ?" అంటూ యీసడించడం అలవాటైపోయింది.

శుద్ధచ్ఛాందసులుగా వుండేవారు కొందఱెవరో ఆలా యీసడించడం చూచి తుదా మొదలూ తెలియని సామాన్యులుకూడా, "మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అనే వాక్యానుసారంగా అదేపాట పాడతారు. దీనిపైఖరి చూస్తే నేను బందరులో వుండే రోజుల్లో జరిగిన సంగీతసభాసందర్భాలు జ్ఞప్తికి వస్తూన్నాయి. వాటిని కొంచెం వుదాహరిస్తాను. బందరు వారికి (గాయకులకు) తూర్పుపాటకు అంటే యీసడింపు. అట్టిస్థితిలో లోకోత్తరమైన గాయకుఁడు ద్వివేది లక్ష్మణశాస్త్రిగారు వచ్చారు. ఆయన బాల్యంలో సుప్రసిద్ధులు శ్రీసుసర్ల దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారివద్ద బందరు ప్రాంతం కక్లేపల్లిగ్రామంలో శుశ్రూష చేసి తరవాత దక్షిణాదిని కొంత కృషిచేసిన మహాగాయకశిరోమణి. పైఁగా అన్నిటికీ ప్రధానం గాత్రధర్మం చాలా విలక్షణమైనది. విగ్రహంకూడా జనాకర్షకంగా వుంటుంది. యిన్ని మంచి లక్షణాలతో వున్న ఆయన పాటకచేరీ జరుగుతూవుంది. పరిజ్ఞానం కలవాళ్ళు విని ఆనందిస్తూవున్నారు. "మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః" అనే తరగతిలో వారేకదా ! ఆ యీవిద్యావిషయరసజ్ఞత్వంలో చాలామంది; వారు యెవరినో

తమవూరివారిని - యేలా వుంది పాట? అని అడగడమున్నూ వారు యేలా వుండంటే ఆలాగే విశ్వసించడమున్నూ ఆలాగే ప్రచారం చేయడమున్నూ సామాన్యంగా జరుగుతూ వుంటుంది. యెవరో ఆలాటిసంపన్నగృహస్థు చెవిలో "యేముంది? తూర్పుబాణీ" అని వూదడం జరిగింది. అదే జన సామాన్యంలో వ్యాపించిపోయింది. దాన్ని తిప్పడానికి బ్రహ్మాస్త్రో బ్రహ్మాం కావలసివచ్చింది. తూర్పున విజయనగరం వీణకు పెట్టిన భిక్ష, హరికథకు ప్రథమ పీఠం. యిట్టి సందర్భంలో యెవరో యీకళంకాన్ని తెచ్చిపెట్టారు. పోనీ దానికే వప్పుకుందాం. ఆ లక్ష్మణశాస్త్రిగారి జననం తూర్పునఁ గాని విద్యాభ్యాసమంతా యితరత్రనేకదా! "వామన ఇతి త్రివిక్రమ మభిదధతి దశావతారవిదః"

ప్రస్తుతం మన పోతరాజుగారిగతి కూడా ఆలాగే వచ్చింది. పోనీ యితర కవిత్వాలు కూడా భాగవతంలో చేరి వుండడంచేత యీ కళంకం వచ్చిందనుకుందామా? ఆ కవిత్వభాగాలేవో యేర్పాటుగానే వున్నాయి. ఆ భాగాలలోన్నుంచి యేదేనా ప్రయోగం చూపితే పోనీ ఆలా యీసడించినా కొంత సహించవచ్చు. భాగవతప్రయోగ మనేటప్పటి కల్లా యిఁక చెప్పేదేమిటి? "సహేంద్రతక్షకాయ స్వాహా" అయ్యో! అయ్యో! యిది యెంత అన్యాయం! అన్యాయ మనాలో? దీన్ని మూర్ఖతనాలో? యింకా యేమనాలో? నాకు లేశమూ బోధపడడమే లేదు. "లోకముమూయను మూఁకు డున్నదే?" యావత్కవులకూ యిదే దురభిప్రాయ మైనప్పుడు ఆసంఘశక్తిని అరికట్టడానికి యెవరిశక్య మవుతుంది? "సంఘే శక్తిః కలౌయుగే" పాపం! అక్కడికీ కూచిమంచి తిమ్మకవి సార్వభౌముడు సాహసించి తన యావచ్ఛక్తినీ ధారపోసి "లక్షణంబెందుఁ దప్పునా? దక్ష హరణ!" అనివాళ్ళవాళ్ళ అపోహలను తొలఁగించడానికి కొంతయత్నించి "సర్వలక్షణసారసంగ్రహమనే తన లక్షణగ్రంధంలో భాగవతాన్నుంచి లక్ష్యాలెత్తిచూపి భారతాదిమహాకవులతోపాటు గౌరవించాఁడు. అయితే మాత్రం సామాన్యకవిలోకానికి విశ్వాసం కలిగిందా? యేలా కల్గుతుంది?

"గతానుగతికో లోకోన లోకః పారమార్థికః." అశ్వినీదేవతలు వైద్యులు గనక వీరికి యజ్ఞంలో హవిర్భాగము పుచ్చుకొనే అధికారం లేదని యెప్పుడో వక తీర్మానం దేవలోకంవారు ప్యాసుచేసారు. ఆ తీర్మానాన్ని చ్యవనమహాముని కాఁబోలును తనశాయశక్తులా పాట్లఁబడి రద్దుపఱచి తన మామగారి యజ్ఞంలో హవిర్భాగం దొరికేటట్టు చేశాడు. ఆ చ్యవనస్థానాన్ని తిమ్మకవిగారైతే ఆక్రమించి చాలా ప్రయత్నించారుగాని యీపని జరిగి సుమారు నూఱు సంవత్సరాల కంటే కొంత యెక్కువకాలమే అయినా యిప్పటి కింకా లక్ష్యవిషయంలో పోతరాజు గారంటే, కవిలోకానికి ప్రామాణ్యబుద్ధి కలిగినట్టే లేదు. బాగా ఆలోచిస్తే యీ మహాపాతకానికల్లా ముఖ్యకారకుఁడు కాకునూరికవి. "సహజపాండిత్యుని సంస్మరించి" అంటూ భారతాది మహాకవులతోపాటు గౌరవించికూడా భాగవతాన్నుంచి యేవిషయానికిన్నీ వక లక్ష్యంకూడా చూపించకపోవడంచేత లోకానికి మఱింత అలుసైపోయింది. అప్పకవి వుదాహరించినకవుల గ్రంథాలలో పరిశీలిస్తే సామాన్యకవులు తప్పులనుకొనే తత్సమాకారసంధులు, క్త్వార్థకేకారసంధులు వగయిరా కుప్ప తెప్పలుగా వున్నాయి. ఆయీసంధులు దుష్టములా? కావా? అనేవిషయం అవకాశంవుంటే యీవ్యాసంలోనే ముందుముందు చర్చిస్తాను. కొంతవఱకు యీవిషయం యితరత్ర చర్చించే వున్నాను. ఇప్పుడు ప్రతివాదుల వాదాన్నే "తుష్యతు దుర్జన" న్యాయంచేత అంగీకరించి పైవాక్యం వ్రాశాను. అప్పకవి సామాన్యమైన శతకాలనుంచీ, చాటుధారలనుంచీ వకటేమిటి? నానాచెత్తనీ అంగీకరించి; భారతకవులనూ తదితరులనూ కూడా అతిక్రమిస్తే అతిక్రమిస్తాఁడేమో అమాంతంగా, అని చెప్పుకోఁదగ్గ పోతన్నగారి భాగవతాన్నుంచి ఆఖరికి పద్యయతికనేనా వొక లక్ష్యం చూపించకపోవడమనేది మహాపరాధంగా తిమ్మకవిగారికి తోఁచింది. ఆయన కొక్కరికేకాదు పరిశీలనగల ప్రతీ కవికిన్నీ యీ సంశయం కలుగుతుంది—బాగా ఆలోచిస్తే యిది అంత ఆశ్చర్యంగానూ కనపడదు. కొంచెం నామ రూపాలు కలవాఁడు యేదేనా వక తోవతొక్కితే తరవాత వాళ్ళందఱూ ఆ

తోవనే అనుసరిస్తూ వుంటారు. శ్రీగాంధిగారు పంచములను- "హరిజనులు" అంటూ అన్నారు, ప్రతి పత్రికలలోనున్నూ యిప్పు డదే ప్రచారంలో వుంది, దీనికీ దానికీ విలోమానులోమ భేదం మాత్రమే వుంటుంది. యీ లాగే యేవిషయమున్నూ అనుకుంటే సరిపోతుంది. నాకు చిన్నప్పటినుంచీ భాగవత కవిత్వమంటే యెక్కువప్రీతి. కాని ప్రధాన ఘట్టాలు తప్ప యావత్తున్నూ భాగవతం చదవలేదు. ఆత్మకూరు పండిత వివాదాల్లో భారతం మాత్రం ప్రతిపద్యమున్నూ చదివి గుర్తులు పెట్టాను. ఆ పండితులు నన్న య్యగారిని తప్ప అంగీకరించ మనడంచేత నన్నయ్యగారి కవిత్వం మఱీ మఱీ శ్రద్ధగా పరిశీలించాను. పోతన్నగారి కవిత్వమందు నాకెంత గణ్యత వున్నా ప్రతివాదులకు అది "కాలదోషప్పాయింటు" గా తోసివేయడానికి అవకాశం యిచ్చినట్లవుతుందని దాన్నుంచి లక్ష్యాలెత్తి యెప్పుడుగాని చూపడా నికి యీడెబ్బైయేళ్ళమధ్యా నేను వాదసందర్భాలలోప్రయత్నించనేలేదు. దేవీ భాగవతపీఠికలోకూడా- "భారత మాంధ్రసత్కవుల పాలిటివేదము"అంటూ గతానుగతికంగా భారతాన్నే యెత్తుకున్నానుగాని భాగవతాన్నిగూర్చి యెత్తు కోనేలేదు. యెత్తుకుంటేమాత్రం యేంలాభం? కవులెవ్వరున్నూ విశ్వసిం చరుకదా? యిన్నాళ్ళకి ప్రత్యక్షరశోధగా భాగవతాన్ని చదివి చూదామని బుద్ధిపుట్టింది. యిహపరసాధనంగదా అని పరీక్షిత్తుతో తుల్యావస్థ (ప్రాయో పవేశం) లోవున్న నేను చదివి చూచి మనస్సులో తోఁచిన అభిప్రాయాలు దాఁచుకోలేక ప్రకటిస్తున్నాను. తెలుఁగనేటప్పటికల్లా పెద్దచిక్కు, (తెలుఁ గు తెలుఁగని- అనే పాణిగృహీత చూ.) సంస్కృతానికి వున్నట్టు దీనికి సమగ్రమైన వ్యాకరణంలేదు. వున్న కొద్దిపాటి వ్యాకరణాలు కొంత వుపకారం చేయకపోలేదు. గాని వుపకారంకంటె అపకారాన్నే యెక్కువగా చేశాయని నాబుద్ధికి తోస్తుంది. చిన్నయ్యసూరి వ్యాకరణం వ్రాస్తూ తన కాలంనాటికి మహాప్రసిద్ధులుగావుండే శ్రీనాథకవినిగాని పిల్లలమఱ్ఱినిగాని తుదకు కవిబ్రహ్మ సోమయాజినిగాని నాచనసోమున్నిగాని భట్టుమూర్తిని గాని బాగా పరిశీలించనే లేదని అతనితీర్మానాలవల్ల స్పష్టపడుతుంది. దీన్నిగు

ఱించి అవకాశం వుంటే ముందుముందు చర్చిస్తాను. చిన్నయ్యసూరికి నిన్న మొన్న వ్యాఖ్యానంచేసిన కల్లూరివారు ప్రయోగ ద్రష్టృత్వంలో మూలకర్త కన్న మిన్నలని వారిపరిశీలికవల్ల గోచరిస్తుంది. వారుకూడా అక్కడక్కడ కొంతపొరఁపడ్డట్టు గోచరిస్తుంది. కాని ఆమాత్రం పొరపాటుకూడా లేకుండా వ్రాసేశక్తి సర్వజ్ఞుఁడైన జగదీశ్వరుఁడికుంటే వుంటుందేమోగాని మనుష్యవ్యక్తికి వుండదు. వుండనేవుండదు. వీరు కొన్ని చోట్ల మతిసాహసిస్తూ వచ్చారు. వీరిసాహసాన్ని వొకటి మచ్చుకు చూపి మతీతరువాయి అందుకుంటాను.

"మనస్కరించు" అనే ప్రయోగాన్ని యెత్తుకొని వీరు సంస్కృత వ్యాకరణానికి సంబంధించినచర్చ వ్రాసివ్రాసి తుదకు యీ ప్రయోగము లోకవ్యవహారంలో వున్నా (మహాకవి ప్రయోగారూఢం కామికనుక) అంగీకరించతగ్గది కాదన్నట్టుతేల్చివున్నారు. తిక్కన్నగారి భారతంలో యీ "మనస్కరించు" ప్రయోగింపఁబడి వుంది. అది వారు చూచే ఆసిద్ధాంతం చేసివుంటారేమో అనుకుంటే ఆ ఘట్టంలో యీ అంశాన్ని అంటే? చూచారన్న అంశాన్ని బోధించేమాట వక్కటీకూడా లేనేలేదు. కాఁబట్టి వారు ఆ ప్రయోగాన్ని చూడలేదనుకోక తప్పదు. "సముద్రమున కెవ్వఁడు పారము నిర్ణయించెడిన్?" భారతం మహాసముద్రం, చదివినకొద్దీ విశేషాలు బయలుదేఱుతూనే వుంటాయి. యింకోటి వీరు— "క్షమాపణ" అనడానికి బదులు 'క్షమార్పణ' అనియ్యేవే వారి వాదగ్రంథములో వ్యాసాలలో అసకృదావృత్తిగా వ్రాస్తూ వచ్చారు. యీపదము ఋషులకవిత్వముల లోనేకాక సంస్కృత మహాకవుల కవిత్వాలలోనేకాక మహాపండితుల నిఘంటువులలోకూడా యెక్కివుంది. నిర్దుష్టం-యిట్టి దీన్ని యెవరో "వింధ్య గ్రామ్యం" అన్నారు. యెవరో అంటే అందురుగాక! అది ప్రమాదం. అట్టి మహావిద్వాంసులు పరిశీలించవద్దా? అనే సందేహం కలుగుతుంది కాని, యెవరిశక్యం? మహాసముద్రం. వొక్కొక్క శబ్దానికి యీలా విచారణచేస్తూ గ్రంథాలు తిరగేస్తూ వుండవలసిందే. విచారణచేసినకొద్దీ

విశేషాలుబయలు దేఱుతూనే వుంటాయి. పైఁగా "క్షమాపణ" శబ్దానికి వచ్చే అర్థం క్షమార్పణ శబ్దానికి స్వరస్వతః రాదు కూడాను. భాగవతంలో "క్షమాపణ" పదమే పలుచోట్ల వున్నది. నేను చదివినపుస్తకం సుమారు డెభ్భైయేళ్లనాఁటిదికాని నిన్న నేఁటిది కాదు. యిటీవల యెవరైనా దిద్దితే దిద్దుతారేమో? వాచస్పత్యంచూస్తే క్షమాపణశబ్దం యేలా సాధువయిందీ తెలుస్తుంది. గాని అంత శ్రద్ధచేసి చూచేవారు లోకంలో అరుదుగా మాత్రమే వుంటారు. యితరులో? తప్పొప్పులు తెలియకుండానే గీట్లుపెట్టుకుపోతారు, వారికి లెక్కపెరగడమే కావలసింది. పరిశీలకుల అశ్రద్ధచేత యెన్నో సుశబ్దాలు అపశబ్దాలయిపోతూన్నాయి. విమర్శనలనే పేరుతో వ్రాసే వ్రాఁతలు కేవలమున్నూ వ్యక్తిద్వేషంతో బయలుదేఱేవి కావడంచేత ప్రాజ్ఞులు వాటియందు విశ్వాసం వుంచరుగాని లక్షణగ్రంథాలట్టివి కావుకదా! ఆ గ్రంథకర్తలలో యిప్పటికి నాకు బాగా నచ్చినవ్యక్తి శబ్దరత్నాకర గ్రంథకర్త. ఆయన శాయశక్తులా ప్రయత్నించి వొక నిఘంటువును నిర్మించివున్నాఁడు. యిటీవలివారికి అదే మార్గదర్శకం. అయితే ఆయన రచనకూడా కొందఱికి అపకారమే అయింది. యేమంటే? ఆయన నిఘంటువులో చేరని పదాలు అసలు ప్రపంచకములోనే లేవనుకొనే తెగవారికి తప్ప తదితరులకు ఆనిఘంటువు పరమోపకారకమే. సీతారామాచార్యులవారు అప్పకవిలాగ భాగవతాన్ని వెలిపెట్టినట్టు లేదు. ఎన్నో వుదాహరణాలు భాగవతాన్నుంచి ఆయన యిచ్చివున్నారు. చిన్నయ్యసూరి యేగ్రంథకర్తనిగాని పేరెత్తి వుదాహరణాలు యెత్తుకున్నట్టు లేదు. తనకు తోఁచినట్టుగా ఆయావిషయాలు వ్రాస్తూవచ్చాఁడు. శీతారామాచార్యులుగారు సూరిగారికంటె మఱికొంత లక్ష్య ప్రపంచాన్ని పైకితీసి చూపినారు. నేఁటి విమర్శకు లనేవారిలో కొందఱికి సూరిగారిసూత్రాలలో ముప్పాతిక మువ్వీసం తెలియవు. తెలిస్తే- 'కలియు' ధాతువు తప్పనిన్నీ 'కలయు' అని అకారమధ్యంగానే వుండాలనిన్నీ, అనడమంటూ వుంటుందా? కలియుధాతువు ఇకారమధ్యం కనుకనే సూరిగారు కలపము - అను

కృదన్తరూపాన్ని సాధించుకోవడానికి — "కలియునకత్వంబగు" అంటూ కృదంత పరిచ్ఛేదంలో వక సూత్రం ఖర్చుపెట్టవలసి వచ్చింది. యిటీవల కల్లూరిమహాశయుని పరిశీలనవలన ఇకారమధ్యమూ అవును, అకారమధ్యమూ అవును అని తేలింది. తెలుఁగు భాషకేకాదు, సంస్కృత భాషకుగూడా పరిశీలనవల్ల యీలాటి విశేషాలు తేలిన స్థలాలెన్నో కనపడతాయి.— మచ్చుకి వకటి చూపుతాను.— "పురతః" అసాధువన్నాడు పండితరాయలు. అంతలో వూరుకోక— "కాళిదాసభవభూత్యాది ప్రయోగాణా మభావాచ్చ" అనికూడా అన్నాడు. రసగంగాధరంలో శేఖరకారకుఁడు ఆ భాగాన్ని వ్యాఖ్యానిస్తూ ఆరూపాన్ని సమర్థించి శాస్త్రప్రక్రియ చూపించడమే కాకుండా కాళిదాసాదుల ప్రయోగాలుకూడా కనుపరిచాఁడు. పండితరాయలు తర్క వ్యాకరణాది శాస్త్రములలో మహాపండితుఁడు. మహాకవి. అట్టివానికే కేవలమున్నూ అసూయా పరవశత్వం అట్టి ప్రమాదాన్ని కలిగించింది. యిఁకలేశమున్నూ శాస్త్రవాసనగాని శాస్త్రజ్ఞుల పరిచయంగాని లేనివిమర్శకులను గూర్చి యేమిఁవ్రాయవలసివుంటుంది? శాంతం పాపం.

"నేరక కృతిచెప్పుటతన నేరమి నపకీర్తి జగతి నిల్పుటగాదే?"

కృతి అంటే కవితారచనమేకాదు. విమర్శనంకూడా అవుతుంది.— నేరకుండా చేసిన విమర్శనాలు అంతటితో ఆఁగక జన్మనంతనే అంధకారమయం చేస్తూవుంటాయి.

"క. కోపము హింసాధూపము
కోపముపాపముల కాదిగురువగుహింసా
ధూపము కోపముగావునఁ
గోపింపంగూడ దెరికొఱకేనినఘా"

అన్నాఁడు నరముని కాఁటోలు నారాయణ మునితోటి. అట్టి కోపం అప్పకవికి పోతన్నగారియందు వుండనుకోవడానికి వీలులేదు. పిరివ్వరున్నూ వొకే కాలంలోనున్నవారు కారుకదా! అలావున్నవారైతే పోతన్నగారి

కవిత్వం యింత రసవంతంగా వుండడమెందుకని అసూయ కలిగిందనుకోవ డానికి అవకాశం వుండేది. యిఁక యెందుకోసం అప్పకవి పోతన్నగారిని నిర సించవలసి వచ్చిందంటే తగిన హేతువులేదు. ఆతఁడేవో లక్షణవిషయంలో కొన్ని అభిప్రాయాలు పెట్టుకొన్నాఁడు. అవి సమంజసాలైనా కాకపోయి నా ఆ అభిప్రాయాలకు పోతన్నగారి రచన అనుకూలించలేదు. కాబట్టి నిరసించినాఁడనుకోవాలి.— రలలకు యతి పనికిరాదని అప్పకవి మతం. వసుచరిత్ర దానికోసం దిద్దవలసివచ్చింది. శ్రీనాధమహాకవి కవిత్వం కూడా దిద్దవలసివచ్చింది. అయితే అసలు అప్పకవి పాండిత్యం ఎంతటిదో కొంత పరిశీలిద్దాం.— "నవ్యపలాశ దణ్డంబుతోడ" అనేది బిందుపూర్వక డకారముగా భావించి యేదో యతికి వుదాహరణంగా చూపివున్నాఁడు. అప్పకవి "దణ్డ" శబ్దంలో బిందువుందని కౌముది సంధిపంచకమేనా చదివివుంటే— కాదు కాదు— చదివితేమాత్రం మనస్సుకు పట్టవద్దూ? మన స్సుకు పట్టివుంటే అనుకోవలసివుంటుందా? "..................మంచుకొండ కురాఁజెల్లునె? బుద్ధిజాడ్య జనితో। న్మాదుల్ గదా? శ్రోత్రియుల్" అనేదానిలో— "కొండ" యేలాటిదో యీ "దణ్డ" కూడా అలాటిదే అనుకొన్నాఁడుపాపం అప్పకవి. తెలుఁగు వ్రాఁతలలో యేమి అచ్చులో యేమి దణ్డ, కాణ్డ లోనైన తత్సమపదాలు, కొండ, బండ వగయిరాలవలె నే వ్రాస్తూవుంటారు. ఆ యీ వ్రాయడం సామాన్యులుమాత్రమేకాదు; మహా విద్వాంసులుగూడా గతానుగతికంగా వ్రాస్తూనే వుంటారు. తెలుఁగు పుస్త కాలలోమాత్రమేకాదు; సంస్కృతగ్రంథాలు తెలుఁగు లిపిలో వ్రాయఁబడ్డ వికూడా యీలాగే వుంటాయి. నాగర లిపితో అచ్చుపడ్డవి చూస్తే యీలో పం తెలుస్తుంది. యిది విషయాంతరం. అప్పకవి బిందువనుకొని వుదాహ రించిన వుదాహరణాలలో తత్సమోదాహరణాలన్నీ భ్రాంతిమూలకాలని తెలుసుకోవలసివుంటుంది.— యింతమాత్రంచేత కౌముది రానివాఁడుకాఁడు గాని భ్రాంతిపడ్డాఁడు. "నవ్యపలాశదణ్డంబు" అనేది నణలకు అభేదయతికీ వలసిన వుదాహరణం. యీలాటి లోపాలు అప్పకవీయంలో చాలాకనపడ

తాయి, కాని యిప్పటికి బయలుదేరిన ఛందోవిషయక గ్రంథాలలో అప్పకవీయమే మిన్న— రంగరాట్ఛందస్సు, అనంతుని ఛందస్సు పగయిరా లుదీనికి తీసికట్టే. యించుగాగమయతి భారతంలో పలుచోట్ల వున్నట్టు కల్లూరివారు లక్ష్యాలద్వారా ఋజువుచేశారు. సులక్షణసారంలో దాన్ని గ్రంథకర్త వుదాహరించి వున్నాడు. అట్టిదాన్ని అప్పకవి "తోసిరా" జన్నాఁడు, అని అతని ప్రవృత్తివల్ల గోచరిస్తుంది. ఇందులో స్వరం విఱుగడానికి యెంతో అవకాశంవుంది. అట్టిదాన్ని స్వరానికి యివ్వడానికిజంకిన అప్పకవి 'కంపె' విభక్తికి చూపాంతరంగావున్న "కన్న" అనేపదంలో యెంతవెదకినా ఆకారం విఱుగడానికి అవకాశం లేకపోయినప్పటికీ "నిన్నుఁ జెఱగొన్న హైహయుఁ కన్నన్ దోర్వీర్యమెక్కుడగు భార్గవు" అనే ప్రయోగాన్నిబట్టి స్వరానికి విశ్రిమాన్ని అంగీకరించాఁడు, (యీ "కన్న" కన్నరాము, అన్న అనేవారున్నట్టు కొన్ని పుస్తకాలవల్ల అనుమానం తగులుతూవుంది. ఆ వూహ నిరాధారం) యిది భారత ప్రయోగమేమో అంటే, కాదు— 'దణ్ణ' మొదలైన శబ్దాలలో అను స్వారం యేలా లేదో, కన్న అనేదానిలో స్వరమున్నా అలాగే లేదు.— లేకపోవుగాఁక యెవరో మహాకవి ప్రయోగించడంచేత దీన్ని— జ్ఞ కార కకారాలకు— "సోమయాజులు వాడుకతన" యతిని అంగీకరించినట్టె అంగీకరించాఁడంటే సంతోషమేకాని యిన్ని కల్పిత్తి యతులనూ ప్రాసలనూ యేకవులనో ఆధారంగా పెట్టుకొని లక్షణ సమ్మతాలుగా నిరూపించిన అప్పకవి భారతాన్నిగూడా యెఱుఁగనివారుంటే వుంటారేమోకాని భాగవతాన్ని యెఱుఁగనివారంటూ కవిలోకంలో వుండనే వుండరుగదా ? అట్టి కవిత్వాన్ని వెలివేయడం యెందుకో ? అని నాకు చిన్నప్పటినుండీ కడుపులో దుగ్ధగా వుంటూ వుంది. పోనీ నాప్రయోగాలేవేనా భాగవతాన్నుంచి ఉదాహరణాలిచ్చి సమర్థించుకోవలసివచ్చి తద్ద్వారా స్వార్థానికినా దీన్ని నేను వుపక్రమించానంటారా; యింతవఱకు నాప్రయోగాలేవి నాని భాగవతప్రయోగాలిచ్చి నేను సమర్థించుకోలేదని నా సిద్ధాంతాలవల్ల ప్రాజ్ఞులు తెలుసుకోవచ్చును. గనక విస్తరించను— నామీఁద యింతె త్తినవా తెప్పేవ

గాని లక్ష్య లక్షణజ్ఞానం యెంతకావాలో అంతకాదు కదా, నా పుణ్యంవల్ల అందులో యెన్నో వంతున్ను లేనివారే తటస్థించారు. అందుచేత నేనెప్పుడో చిన్నప్పుడుచేసిన పరిశ్రమవల్లనే వారువారు ప్రత్యాఖ్యాతులు కావలసి వచ్చింది. నేను "చిన్నిచిన్ని వ్యాకరణపుఁబొత్తముల్" చదివి ఆంధ్రంలో ప్రవేశాన్ని సంపాదించుకోలేదు, ప్రధానంగా భారతాన్నిబట్టి యేకొంచెమో ప్రవేశాన్ని సంపాదించుకున్నాను. తరవాత తెనాలిరామలింగాన్ని గురుపదంగా పెట్టుకొన్నాను, యీ సందర్భం

"చ. పరిణతశక్తులైన యలభారతపుం గవు లట్టులుండ ము
ష్కరుఁడనిపించుకొన్న కవిసామజ సింహము రామకృష్ణువా
గ్విరచనగూడఁజూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నిచిన్ని వ్యా
కరణపుఁబొత్తముల్ చదివి కయ్యముఁ బెంచకుఁడయ్య వాగ్విదుల్"

అనే పాణిగృహీతలో వున్న పద్యంవల్ల విజ్ఞులు గ్రహిస్తారు. నాకు సంస్కృతానికే కాని ఆంధ్రానికి గురువులు లేరు. మాముత్తాతగారి తాళపత్రగ్రంథాలు తిరగవేయడమే కొంత గురుత్వం చేసిందని అన్యత్ర వ్రాశాను. తెలుఁగుభాషకు వ్యాకరణాలు నామమాత్రాలనిన్నీ మహాకవి ప్రయోగాలే ముఖ్యాధారాలనిన్నీ మొదటినుంచీ నావాదం. "విలువగల కవుల లక్ష్యమ్ములె తా మీభారమెల్ల మోయఁగవలయున్" అని ఘోషిస్తూవున్నా కొందఱు నామీఁదికి వచ్చి తద్ద్వారా చిక్కుపడడం తప్పిందికాదు. డెబ్బదియేళ్ళ ముసలితనంలోకూడా "అత్తునకు సంధి బహుళము" "ఉత్తునకు సంధి నిత్యము" అంటూ వ్యాఖ్యానము చేయడమే తటస్థించిందికదా అని లజ్జిస్తూవుంటాను. "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే" అన్నారు శ్రీ శంకరులవారు. విద్యావిషయమే అయినా యీ సూత్రాల తాత్పర్యంకూడా యెవరికో యీవయస్సులో వ్యాఖ్యానించడం పరిహాసపాత్రమే. అకార సంధినిగూర్చి వ్రాస్తూ సూరిగారు "బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు" అని వ్రాసినారు. కాని తత్సమానికి చాలాచోట్ల సంధి వొప్పితీర

వలసినట్టు చాలా ప్రాచీన మహాకవుల ప్రయోగాలు నాలుకలు కోరియుతూ వున్నాయి. అవి సూరిగారు చూచినట్టు కనుపడదు. చూచేవుంటే ఆముక్త మాల్యదలో వున్న "గంగసుకాసె" అన్న దాన్నిమాత్రంయిచ్చి వూరు కోరు. పిల్లలమఱ్ఱివారి ప్రయోగాన్ని చూపి వ్రాయవలసిన మాటలు వ్రాస్తాను—

"క. అని చదివి లవుఁడు రాఘవ మనుజేశుని తల్లి వీరమాతఁట"

(జైమిని భారతము)

యీ మహాకవిని అప్పకవికూడా యీసడించలేదు. వీరమాత.|.అఁట అన్నచోట తత్సమమే కాకుండా స్త్రీవాచకంకూడా అయింది. ఆనాఁటికి చిన్నయ్యసూరి వ్యాకరణం లేదనుకొని ఆ కారణంచేత అలా ప్రయోగించాఁడని సమాధానం చెప్పుకోవాలో, లేక తత్సమాకార సంధికూడా వ్యాచిర్య-ముగా శ్రవణ సుఖానుసారం గ్రహించవలసి వుంటుందనే అభిప్రాయపడి వున్నాఁడని అనుకోవాలో పరిశీలించండి విజ్ఞులు. చిన్నయ్యసూరి ఆ ప్రయోగాన్ని బట్టిన్నీ యింకా భాగవతంలో వున్న "బ్రహ్మాంతవాని" అనే ప్రయోగాన్ని పట్టిన్నీ పరిశీలించి విచారించేవుంటే తన వ్యాకరణంలో యీ తత్సమాకారసంధినిగూర్చి యింకొకమాదిరిగా వ్రాయవలసి వుంటుందని చెప్పవలసి వుంటుందో, లేక ఆ వ్రాసినమాత్రం చాలునో విజ్ఞులు పరిశీలించాలి. తన రచన నాఁటికి యెందఱు ప్రాచీన మహాకవులు గతించారో వారివారి ప్రయోగాలు చూచుకొని తాను వ్యాకరణం రచించవలసి వుండఁగా అట్లు చేయకపోవడంచేత సామాన్యులు సూరిగారి వ్రాఁతనే పురస్కరించుకొని పృథగా వెక్కిరించడానికి అవకాశం కలుగుతూవుంది. "వెలయాల్వాడు" లయందు బహుళగ్రహణము చేతనేకదా సంధి లేకపోవడం నిత్యమనవలసి వచ్చింది? దానిక్కారణం— 'వెలాలు' అనే రూపం కర్ణకఠోరంగా వుండడమేనా, మఱివకటేమేనా వుందా? లేకేమి వుంది. లోకంలో సంధి చేసినరూపాన్ని వాడకపోవడం వకటి అంటారా?

అనండి, అవ్వపేరే ముసలమ్మ. వెల అనేది స్త్రీసమంగాని స్త్రీవాచకాదు లలో చేరదు. దీనికి నిషేధమైతే తగలదు గాని వికల్పత్వం తటస్థిస్తుందని ఆమాట వ్రాయవలసి వచ్చింది. తత్సమాకారాలలో యెన్నిచోట్లో నిత్యంగా సంధి చేస్తేనేకాని చెడిపోయేవి వున్నాయి. "అంకితముసేయు వీరభద్రయ్యపేర" "రామానుజయ్యగారు" యీలాటి ప్రయోగాలు నిత్యసంధిని అపేక్షించేవే. తత్సమానికి వికల్పంగానేనా సంధి వస్తుందా? రాదుగదా! అట్టి స్థితిలో నిత్యసంధి యెక్కడనుంచి వస్తుంది? వికల్పసంధి రాకపోయినా యేలాగో సమ్మతించి సంపాదిస్తామే అనుకోండి. అప్పుడు వీరభద్రయయ్య రామానుజయయ్య అంటూ పరమాసహ్యంగా వుండే పనికిమాలిన రూపాలు సిద్ధమవుతాయి. అందుచేత తత్సమాకారసంధిని కొన్నిచోట్ల నిత్యంగా వొప్పుకొని తీరాలి. సంజ్ఞావాచకాలనుగూర్చి యీచర్చ అక్కఱ లేదంటారేమో? వీరభద్ర, రామానుజ శబ్దములు సంజ్ఞలుగాని విశిష్ట మంతాకాదు. వాట్లలో అయ్య చేర్చనక్కఱలేదు. నామకరణసమయంలో అయ్య - రావు — శాస్త్రి — వగయిరాలు చేర్చరు. ప్రవరలోకూడా అభియుక్తులుచేర్చరు. ఈశ్వర శబ్దాన్ని చేర్చడంమాత్రమే కలదు. వైష్ణవులు ఈశ్వరపదాన్ని చేర్చరనుకుంటాను. బహుశః దానికి బదులు ఆచార్య పదమే వాడతారనుకోవాలి. అందుచేత ఆయా నామకరణాలకు అయ్య వగైరాలు యిటీవల చేర్చఁబడేవే. తత్సమాకారసంధివల్ల నిష్పన్నంకావల సినవే. వ్యవహారంలోవుంటే కవులు స్వీకరించినవే. "వ్యవహారతశ్చ" అని శబ్దబోధోపకరణాలలో నొక్కి వక్కాణించి వున్న వ్యవహారాన్ని అనఁగా శిష్టవ్యవహారాన్ని తోసిరాజంటే తోసిరాజుకాదు. అదికూడా పరిగ్రహించి తీరవలసిందే. యీ వ్యవహార పరిగ్రహణాన్నిగూర్చి విస్తరిస్తే వ్యాసం బళ్ళని తోలవలసివస్తుంది, క్షమించండి. వ్యాకరణంలో వాట్లని గూర్చి కొంత వ్రాసి అవకాశం చూపించవలసిందే! అప్పకవి పేర్లని నామాఖండయతులలో చేర్చాడు. సంధినిగూర్చిన జవాబుదారి చిన్నయ్య సూరికి అప్పకవి వ్రాఁతవల్ల తప్పుతుందా? తప్పదు. వ్రాస్తే చాలా

వ్రాయాలి. యిన్నిటికిన్నీ ప్రధానం శ్రవణసుఖం. దాన్ని గమనించ కుండా చెప్పే కవిత్వం కవిత్వమేకాదు. తి॥ వెం॥ కవులు "నిందా ? నెత్తి పై కెక్కు" అంటూ తత్సమాకారసంధి చేశారంటూ ఆక్షేపించేవారికి శబ్దతత్వం బొత్తుగా తెలియదనవలసి వచ్చినందుకు చింత కలుగుతూ వుంది. "నిందా ?" అనక "నిందయా" అని అంటే శ్రవణసుఖంగా వుంటుందా ? పద్యంలోనే అక్కఱలేదు. ఛందస్సుతో సంబంధంలేని వచనంలోనేనా తి॥ వెం॥ కవులు అలాగే వాడతారు. వారికి శ్రవణసుఖం తెలుసును. పైఁగా పూర్వమహాకవుల ప్రయోగాల విలువ తెలుసును. 'ఇంద్రాణి' అని వుందిగదా అని చంద్రాణికూడా వుంటుందనుకొనే మాదిరిది గాక అంతో యింతో సంప్రదాయసిద్ధమైన పాండిత్యంకూడా వుంది. తి॥ వెం॥ కవులకు. ఆ యీకారణాలచేత "నిందా ? నెత్తిపై కెక్కు" అని ప్రయోగించిరని సహృదయులు గుఱితిస్తారు.

యీ తత్సమసంధినిగూర్చి "బ్రహ్మాంతవాని" అని నే నిచ్చిన ప్రయోగం పోతరాజుగారిది కాదు. షష్ఠ స్కంధంలోది - సింగయకవీం ద్రునిది. శ్రవణసుఖాన్ని పట్టియ్యేవే సింగయ్య యీ ప్రయోగాన్ని చేసి నాఁడు. యీ సంధిని "బ్రహ్మయంతవాని" అని దిద్దితే ఛందోభంగం మాట అలా వుండఁగా శ్రవణసుఖం చెడుతుంది. పోతరాజుగారేమి, ఆ కాలపు మహాకవులు యితరులేమి శ్రవణసుఖం యెఱిఁగి కవిత్వం చెప్పడంచేతనే వారి కవిత్వాలు ఆకాశంమీఁద నక్షత్రాలలాగ శాశ్వతంగా వెలుఁగుతూ వున్నాయి. "లోకుల రచనకె యాకులుగా నుండునట్టి యదియో కవితల్" లోకాన్ని అనుసరించడం యేలాటిదో చూపుతాను—

క. "వీ రెవ్వరు ? శ్రీకృష్ణులు
గారా ! యెన్నఁడును వెన్న గానరఁటకదా !
చోరత్వం బించుకయును
నేరరఁట ! ధరిత్రి నిట్టినియతులు కలరే ? "

యీపద్యం రచించిన పోతరాజుగారికి వున్న లోకజ్ఞత్వం యెట్టిదో శుష్కతార్కికవాదులకు బోధించదు.

"శ్లో. కల్హారైః పరికల్పి తేవ లలితా మాలా కవే ర్భారతీ
శుష్కాణాం పరిపీడనం నసహతే శాస్త్రేషు ఖిన్నాత్మనామ్"

" బహువచనం యెందుకు ? కృష్ణుఁడు వొక్కఁడేకదా ? అదిన్నీ కాక గౌరవార్థక మంటే ? కొడుకును తల్లి గౌరవించడం యెందుకు ?" అంటూ తమలో తామే తుమ్మి " దీర్ఘాయుష్య " మనుకొనేమాదిరిని పూర్వోత్తర పక్షాలు చేసుకొనేవారికి లోకంలోనే పుట్టి లోకంలోనే సంచరిస్తూన్నప్పటికీ లోకజ్ఞత్వం కలుగనేలే దనుకోక తప్పదు. లోకజ్ఞత్వం అంత తేలికగా అలవడేదే అయితే నన్నయ్యగారు. " లోకజ్ఞ " అంటూ ప్రత్యేకించి వొక విశేషణాన్ని తనకు వేసుకొనివుండరు. యిదికూడా పూర్వపుణ్యంవల్ల లభించ తగ్గదే. ఆకారణంచేతనే ——

"........................................మహాకవితావివేచనా
భ్యాస మనంగ నంత పయి పైఁబడియున్నదె ? అద్దియున్ జను
ర్వాసనయేసుఁడీ ! అదియు వారలు వారలు చేయుభాగ్యమున్
జేసి లభించు నట్టిపరిశీలన గల్గినవారి కేము వే
యేసి నమస్కృతుల్ సలిపి యెంతయు భక్తి నుతింపకుందుమే. "

అని విన్నవించుకోవలసివచ్చింది. ఒకమహాకవి " అరసికాయ కవిత్వ నివేదనం, శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ " అని బ్రహ్మని ప్రార్థించాఁడు. రసజ్ఞత్వం యెంత వుండాలో అంతా వున్న పోతరాజుగారి కవిత్వాన్ని విమర్శించవలసివస్తే అస్మదాదుల లోకజ్ఞత్వం చాలదు. అయినా యిహపరసాధకం గదా అని ప్రాయోపవేశావస్థలో దీనికి పూనుకున్న నన్ను రసజ్ఞలోకం క్షమించాలి. పైపద్యానికి మార్గదర్శకుఁడు నన్నయ్యభట్టే.

"వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె" అనే పద్యాన్ని యెఱుఁగనివారుండరు. ఆయన యెత్తిన దొక రసంలో; పోతన్నగా రెత్తినది మరొక

రసంలో. ఇంతేభేదం. యిప్పటికి యీమాదిరి పద్యాలు నాకు గనపడ్డవి యీ రెండుమాత్రమే. "తత్తథాస్తామ్"

పోతన్నగారిని అప్పకవి వుదాహరించక పోవడానికి ఆయన కవిత్వంలో యితఁడు కనిపెట్టినదోషా లేమిటో కొంత పరిశీలించి చూద్దాం. అందులో వకటి అఖండయతి అనుకుందామా? దీన్ని భారతకవిత్వం అంగీకరించినట్లు "చెప్ప, వయ్య? పుణ్యసతీప్రభావంబునాకు" లోనయిన ప్రయోగాలవల్ల స్పష్టపడుతుంది. కాని అప్రయోగాలన్నీ యిటీవల యేచరణానికి ఆచరణమే వుండేటట్టు ముద్రించిన చిన్నసైజు పుస్తకాలలో అన్యథా దిద్దివేశారు. నేను చూచిన ప్రయోగం యిప్పటి ప్రతులలో "చెప్ప, వలయుఁ బుణ్యసతీప్రభావంబు" అని వుంటుంది. మాదిరికి వకటి చూపాను. వెనకటి పుస్తకాలకీ యిప్పటి పుస్తకాలకీ చాలా స్థలాలు మారిపోయినాయి. సంస్కృతంలోవుండే భావాన్ని అనుసరించి తిక్కన్నగారు "నమ్మమి మృత్యువు" అనేపద్యంలో "నమ్మినమ్మక" అని ప్రయోగిస్తే దాన్నికూడా తోఁచినట్లు దిద్ది మూలాభిప్రాయాన్ని అన్యథాకరించడానికి సమేతూ సంస్కర్తలు సంశయించారు కారు. భారతాన్ననుసరించి నాచన సోముఁడు లోనైనవారు తాదృశ ప్రయోగాలు తమతమ గ్రంథాలలో చేసుకొని వున్నారు. వారిగతి అధోగతి కావలసి వచ్చింది.

ఆయీ సందర్భం సుమారు ముప్పైయేళ్ళనాడు "దిద్దుబడయ్యె భారతము" అనేపద్యంద్వారా యేదోవ్యాసంలో నేను మొఱపెట్టుకొన్నట్టే జ్ఞాపకం. బహుశః అది యిటీవల మాసంపుటాలలో అచ్చుపడే వుంటుంది. యీలాదిద్ది పాడుచేయడమనండి, లేదా బాగుచేయడమే అనండి. యీపనిలో నేనుగూడా కొన్నాళ్ళ కిందట అనగా యిప్పటికి 45 యేళ్ళనాఁడు కొంత పనిచేసినవాఁడనే. మాముత్తాతగారి "వేంకటేశ్వర విలాసా"న్ని అప్పటి కాలంలో కొలఁదికాలం నడిచిన "రత్నాకర" మనే పరమాసపత్రికలో అచ్చువేయిస్తూ అఖండయతులన్నీ దిద్దిపాఱవేసి నాకుతోఁచిన పాఠాలు

సృష్టించాను. ఆపత్రిక ఆగ్రంథం పూర్తికాకుండానే ఆఁగిపోయింది. మఱి పదిపన్నెండేండ్లకు నేను బందరు వుపాధ్యాయుఁడుగా వెళ్ళి దాన్ని పూర్తిగా అచ్చుగుద్దిద్దా మనుకొని ఆకాగితాలేమాత్రమో ఆప్రెస్సులో వుంటే తీసి చదివి చూస్తినిగదా? అసలుకవిత్వానికిన్నీ, నాదిద్దుబాటు కున్నూ యెంతో వ్యత్యాసం కనిపించింది. అపుడు నాలో నేనే లజ్జించి మిగిలిన భాగంలో ఆలాదిద్దక పూర్తిచేసి పీఠికలో నాదిద్దుఁబాట్లవల్ల కలిగిన వైరూప్యాదులు తెల్పి మళ్ళా యధాశ్రుతపాఠాలుకూడా చూపించి నట్టు జ్ఞాపకం.

మాముత్తాతగారికి అప్పకవీయం దొరకలేదు. అనంతునిఛందం వగయిరా లక్షణగ్రంథాలు దొరికినట్టు ఆయన భాండాగారంవల్లనే తేలుతుంది. చిన్నసైజు తాటాకులు యేదెనిమిది మాత్రం "అప్పకవీయం లోని కొన్ని యతిప్రకరణాలు" అనే శీర్షికతో నున్నవి మాముత్తాతగారి గ్రంథాలలో దొరికిందని అన్యత్ర వ్రాసేవున్నాను. అప్పకవి "ఆఖండ యతి పొల్లుగునాదికవి ప్రణీతమై" అని వ్రాస్తూకూడా వాట్లలోకొన్ని తరగతులు యేర్పఱిచి పూర్వలాక్షణిక గ్రంథాలకు కొంత భిన్నంగా ప్రవర్తించాఁడు. యిటీవల సంస్కర్తలు అప్పకవి మతాన్నిపట్టి ఆయా గ్రంథాలు సంస్కరిస్తూ వచ్చారు. భాగవతాన్ని అప్పకవి స్పృశించక పోవడంచేత యిటీవలివారికి దాన్ని దిద్దవలసిన ప్రసక్తి కలుగనే లేదనుకోవాలి. అయినా పరిశీలిస్తే కొన్ని దిద్దుఁబాట్లు దొరకకపోవు "కాఁవలెన్" అనేప్రయోగాన్ని తిక్కన్నగారు వాడడమే కాకుండా అసలు నన్నయ్యగారున్నూ వాడినారు. తిక్కన్నగారిది ప్రాసలో వుండడంచేత దిద్దడానికి వీలిచ్చేది కాదు. దీన్ని మహాకవు లందఱున్నూ వాడుకొన్నారు. యీలా వుండఁగా వకరు "కాఁదగున్" అని దిద్దడానికి సాహసించారు దానితో ప్రాసచెడింది. యీప్రాసభంగాన్ని వారు గమనించలేదు.

చెప్పొచ్చే దేమిటంటే యీ దిద్దుబాట్లకు తలాతోకా వున్నట్లు లేదు. దీనిమూలాన యిటీవల కవులకు వృధాగా పరస్పర వాదోపవాదాలు పెరిఁగి

పోవడానికి అవకాశం పూర్తిగా కలిగింది. ఇన్ని యతులుండఁగా అఖండ యతి కూడా అందులో వకటిగా వుంటే మునిఁగిపోయిం దేమిటి ? యితర యతులకున్నంత శ్రవణసుఖం అఖండానికి లేదందామా ? అనండి. దాన్ని బట్టి మానుకొనేయెడల యెన్నోయతులు భాషలోనుంచి తొలఁగించవలసి వున్నాయి చూడండి - "ఎఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార ?" యీయతి యేదో బాదరాయణ సంబంధంగా సరిపెట్టుకోవలసిందే గాని శ్రవణసుఖాన్ని కలిగించేదేనా ? యీవిశ్రమం ఆముక్తమాల్యదలో వక పద్యంలో నాల్గుచోట్ల దొరుకు తుంది.

1. "హితులు భిషగ్గ్రహజ్ఞబుధ బృంద"
2. "హితులు ధనార్జనాది నృపకృత్య"
3. "హితులు దశాదశార్పిత సమృద్ధ"
4. "హితమును నట్లకా చతురవృత్తి"

ఆయీస్థలాలన్నీ యతియెందుకు పుట్టిందో ఆంధ్రభాషకు అప్పుడే శాన్ని నెఱవేర్చేవేనా ? యీఋకారానికి విశ్రమం కల్పించడంలో వ్యంజన సంబంధం యెంతమాత్రమున్నా పాటించక పోవడానికి మూలఁమృగ్యం. "ప్రయోగ స్తత్ర కారణమ్" అంటూ సమాధానం చెప్పుకోవాలి.

నన్నయ్యభట్టు "ఋత్విజుండని విచారించి పూజించితే" అని ప్రయోగించడంలో కొంత సందర్భం వుంది. ఋకారంలో రేఫ శ్రుతి మవుతూవుంటుంది. దాన్నిబట్టి "ఋటురషాణాం మూర్ధా" కనక ఆరెం డింటికీ స్థానైక్యాన్నిబట్టి అది కొంత యుక్తియుక్తంగా వుంటుంది. కాని ఋకారానికిన్నీ ఇకారానికిన్నీ చుట్టఱికం కల్పడంలో యేవిధమైన ఆధార మున్నా కనపడదు. ఇ-ఈ-ఎ-ఏ-లున్నూ, ఋకారమున్నూ చుట్టఱికా న్నేలాపొందాయో కదా ? ఉచ్చారణలోనేనా యీచుట్టఱికం స్ఫురిస్తుం దేమోనంటే అది అంతకంటే కనపడదు. లోకులలో సామాన్యులమాట అలావుంచి పండితులు చేసే వుచ్చారణాన్నిబట్టి పరిశీలించేయెడల ఋకారా

నికిన్నీ, ఉ-ఊ-ఒ-ఓ-లకున్నూ యతివుండేయెడల కొంత శ్రవణసుఖానికి అవకాశం ఉన్నట్టు నాకు తోస్తుంది. (స్థానైక్యం దానికెంతో దీనికిన్నీ అంతే) ఆకారణం చేతనే అనుకుంటాను తెలుఁగులో చక్కటి రసవంత మైన పదకవనాన్ని చెప్పిన క్షేత్రియ్యగారు - "అపరూపదర్శనం బాయెఁ గదా నేఁడు కృపగలదా ? మా మువ్వగోపాలబాల ?" అని సాహసించి ప్రయోగించివున్నాఁడు. పద్యకవులలోకన్న పదకవులలో రసానికి ఎక్కు వగా పాటుపడేవారున్నట్టు వారివారి రచనలు పరిశీలిస్తే గోచరిస్తుంది. త్యాగరాయలవారు "జగమేలే పరమాత్మ ? యెవరితో మొఱలిడుదు" "ఉపచారము చేసేవారున్నారని మఱవకు రామ" యింకా యెన్నో యీలాటి ప్రయోగాలు వాడివున్నారు. ఆయీచోట్ల చేసెడివారు - ఏలెడి పరమాత్మ, అంటేమాత్రం లయకు భంగంవుంటుందా ? (లేక వారికీ మాత్రం వ్యాకరణం రాదా ?) వుండకపోయినా గానానికి యెక్కువ సౌకర్యం వుండడంచేత కాఁబోలును అలాగే ప్రయోగించారు. యీమా దిరిగానే క్షేత్రియ్యగారు 'కృప' ఋకార సహితమని యెఱిఁగికూడా గోపాలపదంతో యతివుంచారు. చట్టన దీన్ని పదకవిత్వమని యీస డిస్తారు కొందఱు కవులు. శ్రీనాథుఁడంతటి లోకోత్తరుఁడు — "ముది విటులు విధవలంజలు, పదకవితలు మాఱుబాస బాపనివారల్" అంటూ పదకవులను యీసడించాఁడు.

> ఆ. "గురువు లఘువుచేసి కుదియించి కుదియించి
> లఘువు గురువుచేసి లాగిలాగి
> కవితచెప్పినట్టి కవిగులామునుబట్టి
> ముక్కుగోయవలయుఁ ద్రొక్కిపట్టి"

అన్నాడు వకకవి. యీసడిస్తే యీసడించారుగాక ! పదకవిత్వాన్ని చెప్పేవాళ్ళను ముక్కు గోయమన్నాఁడు వకపూర్వకవి. యీపద్యాన్ని నాకు కావ్యగురువులలో మొదటి గురుపాదులు శ్రీ కానుకర్తి భుజంగ రావుపంతులుగారు యేదో ప్రసక్తిలో చదవఁగా నేఁటికి 56 సంవత్సరాల

నాఁడు విని సంగ్రహించాను. యీపద్యం యెవరిదేనా అగునో, లేక మాగురుపాదులు శ్రీపంతులవారిదే అగునో? అనేసంగతి యిప్పుడేకాదు, యిదివఱలోనున్నూ నాకుతెలియదు. పర్యవసానం యేమిటంటే కపులలో యెంతో మృదుమధురంగా పదకవిత్వం చెప్పేవాళ్ళకు తగినస్థానం అనాదిగా లేకపోయిందనేదియ్యేవే. యతు లసలెందుకు పుట్టాయో? అప్పట్టే శాస్త్రి నెఱవేర్చినవాళ్ళు పదకవులే గాని పద్యకవులు కానేకారన్నందుకు యేకొంచెమో గతంలో వుదాహరించే వున్నాను. పనిపడితే యీవిషయానికి భారతంలో చాలాభాగం వుదాహరించవలసే వస్తుంది. నన్నయ్యగారు మాత్రం విస్తరించి దొరకరు; తక్కినవారిద్దఱూ విశేషించి దొరుకుపడతారు. దొరకరన్నందుకు మచ్చు చూపుతాను.

"హంసచేఁ దనవిని నంతకంబెను.... "

"వీరెవరయ్య! ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులై పట్టుపడన్. "

ఆయీనన్నయ్యగారి ధోరణిలో యతుల విషయం సహజాలంకారమనే అంశాన్ని మఱచి వెళ్ళినట్లు వుందదు. నేను స్థూలదృష్టిని యీమాట వ్రాస్తూన్నానుగాని దీనికోసమై యెప్పుడూ యీతాత్పర్యంతో పరిశీలించి వ్రాసే మాటమాత్రం కాదిది, సోమయాజిగారి ప్రయోగాలు కూడా కొంచెం యిస్తాను :

"వర్తిల్లుదు రమ్మహాత్ములు కరిష్టము "

"ఉద్యోతితమూర్తి కౌరవసులోద్వహుఁడు "

ఆయీ విషయానికి మళ్ళా ప్రత్యక్షరమూ చదవాలి. యేదో స్థూలదృష్టిని వుదాహరించాను, మళ్ళా చదివి వేటేవ్యాసం వ్రాస్తాను. శంభుదాసుఁడుగారివి కూడా కొంచెం చూపుతాను.

"కట్టుఁ డియ్యోడ ననిన నాక్షణమ వారు "

"వివిధపత్తనవన ద్వీపవర్షములతో "

(ఇవికూడా అంత వెదికి యిచ్చినవి కావు) ఆయీవిశ్రీమాలు శాస్త్రతః సమర్థనీయాలే అయినా తెలుఁగుభాషకు యతులు సహజాలంకారాలనేది సిద్ధాంతమైన మాటే అయితే ఆతాత్పర్యాన్ని యివి లేశమూ సమర్థించనేరవు "గుళ్ళోదేవుఁడికి అంగట్లో బెల్లం నైవేద్యం" అన్నమాదిరిగా వుండడానికి అభ్యంతరం లేదు. యీ యతుల విషయంలో యితరుల అభిప్రాయం యేలాటిదోగాని నా అభిప్రాయం మాత్రం "సహజాలంకారాలు" అనియ్యేవే. వీట్లకుకూడా మార్గదర్శకులు సంస్కృతకవులే. యెఱ్ఱఁగి నంతలో భాగవతంలో యివి కనపడతాయి.

"నఖలు గోపికానందనోభవా
నఖిల దేహినా మంతరాత్మదృక్
విఖన సార్థితో విశ్వగుప్తయే
సఖ ఉదేయివాన్ సాత్వతాంకురే"

వకటి మచ్చుచూపాను కాని యీ గోపికాగీతల ఘట్టమంతా యీలాగే వుంటుంది. అయితే దీన్ని యిటీవలికవులు శబ్దాలంకార భేదాలలో వొకదాన్నిగా తీసుకొన్నారుగాని, ఆంధ్రకవులమాదిరిని కంఠపాశంగా పెట్టుకోలేదు. కర్ణాటకకవులు యతిని మాత్రం మనతోపాటే నియతంగా పెట్టుకున్నారు. జైమిని భారతమనే పుస్తకాన్ని ఆత్మకూరులో యెవరో వినిపించఁగా నేను విన్నాను. యీనియతంగా యతినిగాక ప్రాసను పెట్టుకున్నారేమో అని నాకు యిప్పుడు సందేహం కలుగుతూవుంది. బాగా జ్ఞాపకం లేదు. మొత్తం అదో యిదో వకటిమాత్రమే వారికి నియతంగాని రెండుసియతాలు కావన్నది బాగా జ్ఞాపకం వున్నది. అఱవవానికికూడా యీనియమం (ప్రాస) వున్నట్టు నాకు తోస్తూవుంది. హిందూహైస్కూలు టీచరు కే. వే. శ్రీముత్తయ్యరుగారు నేఁటికి 48 సంవత్సరాలనాఁడు ఆస్కూలులో చేసిన అష్టావధానంలో మమ్మల్ని పరిశంసిస్తూ చెప్పి వ్యస్తాక్షరిగా యిచ్చిన అఱవ పద్యంవల్ల యీసంగతి తెలుస్తూవుంది.

"అట్టావధానిగళ్ శెయ్యు వల్లమైస్ద్రవై పరిహారంమ
తట్టామలే శిలర్ తత్తళిప్పార్ విల్లితన్ శరంబోల
ఎట్టవుహుండుఱ నెన్నె శ్టెట్టుం గివరై యొప్ప
ముట్టాదు సెయ్యవల్లా రిల్లైయేయింద మొయిణి లత్తే"

పైపద్యంలో యతులమాటేలావున్నా ప్రాసమాత్రం నియతంగా వున్నట్టు తేలుతూంది. సంస్కృతానికి యివి ఐచ్ఛికా లనిన్నీ తక్కిన ఆంధ్రాది ద్రావిడభాషలలో వకదానికి ఏకటిన్నీ మఱివకదానికి మఱివక టిన్నీ ఆంధ్రానికిమాత్రం రెండూనున్నూ నియతంగా యేర్పడ్డాయి. హిందీకి అంత్యప్రాస నియమితమని తోస్తుంది. తక్కిన భాషలమాట యేలా వున్నా తెలుఁగు భాషకుమాత్రం తుదకు అప్పకవి నాఁటికి చాలా పూర్వమే వీట్లస్థితి పెద్ద 'గండగత్తెర' వ్యాపారంలోకి దిగింది. శ్రిపణ సామ్యం పూర్తిగా వున్నప్పటికీ పనిపడితే యేకస్థానికత్వసామ్యం వున్న ప్పటికీ రేఫ, శకటరేఫలకు యతిప్రాసలలో బ్రహ్మాదికీ చండాలునికీ వున్నంత మాత్రమేనా చుట్టఱికం వుండవన్నంతపట్టు వచ్చింది. ఆనాటి మైత్రి చేకూఁడనే కారణంచేతే పోతరాజుగారిని పోతరాజుగారి భాగవతాన్ని అప్పకవి వెలిఁబెట్టి వుంటాఁడని అనుమానించి సూచిమంచి మహాకవి పోతరాజు అట్టి అకార్యం చేయలేదంటూ సమర్థించడానికి ఆరంభించాఁడు గాని "చేస్తేమునిఁగిపోయిందేమిటి?" అనడానికి సాహసించలేకపోయాఁడు. అయితే తిమ్మకవిగారి మాటాలావుండఁగా నాకు రఘువంశపు గురువు గారైన భుజంగరావుపంతులుగారికి 11 శ్లోకాలు మాత్రం శ్రీమద్భాగవతంలోవి చెప్పి తావన్మాత్రంచేత యావత్తు సంస్కృతభాషా ప్రపంచాన్నిన్నీ అన్వయింపఁజేసిన శ్రీ ఓగిరాల సోదర కవిద్వయంలో రంగయ్యగారో, జగన్నాథంగారో ద్విరేఫ దర్పణమనే అనుకొంటాను పకగ్రంథం దీన్ని గుఱించి వ్రాశారంటే ఆ యీభేదం యెంతగా అమల్లో వుండేదో వేఱే చెప్పనే అక్కఱ్లేదు. అయితే యేంలాభం? లక్షణం అమల్లో వుండడమే కాని లక్ష్యాలు పరిశీలిస్తే తుట్టతుదకు దీనికోసం తనశక్తినంతా ధారపోసిన

అప్పకవిగారే పప్పులో అడుగేయడమే కాకుండా అతఁడు యితరవిషయా నికి లక్ష్యాలుగా యేయేకవుల గ్రంథాలు లక్ష్యంగా తీసుకొంటూ వచ్చాడో, ఆకవులలో నూటికి తొంభై తొమ్మండుగురి కవిత్వాలలో ఈ మైత్రి కన పడడంచూచి మేము మా (పాణిగృహీత) లో " అభేదమీ యొకటికా ? తగకుండుటమేలు మేలు " అని వ్రాయవలవచ్చింది. మారోజులలో కూడా వకరు బేతపూడి భగవంతరావుగారు కాఁబోలును— చిన్నపుస్తకం వకటి దీన్నిగుఱించి వ్రాసివున్నట్టు జ్ఞాపకం. ఆ యీభేదం వ్రాఁతలో అర్థభేదాన్ని గమనించడానికి ఆవశ్యకమే కాని యతి ప్రాసమైత్రి విషయంలో పాటిం చనక్కఱలేదని నన్నయ్యతప్ప తక్కిన యావన్మహాకవుల ప్రవృత్తిన్నీ తెలుపుతూవుంది. అయితే ఆ యాకవుల హృదయం యిందుకు అంగీకరించే దికాదనిన్నీ, ప్రమాద వశంవల్ల వారికి ఆలాటి ప్రవృత్తి కలుగుతూ వచ్చిందనిన్నీ వక వాదం వుంది కాని యావన్మందీ చేస్తూన్నప్పుడు అది ప్రమాదమైనా సదాచారమే కావలసి వస్తుందని తుట్టతుదకు తేలక తప్పదు. యింకా "శతాంధాః కూపం ప్రవిశంతి" వాదం వుంటుంది. విస్తరభయం చేత విరమిస్తూన్నాను.

అప్పకవి అర్ధబిందు నిరర్ధబిందువులకు ప్రాసమైత్రి దీర్ఘాలమీఁదనే వొప్పుకున్నాఁడు. యీ అంశం అతని లక్షణ పద్యంలోవున్న "నిడుద లపై" అనే పద్యంవల్లనే కాక అతఁడిందుకోసం యిచ్చిన లక్ష్యాలవల్ల కూడా వ్యక్తం అవుతుంది. దీనికి జంకకుండా ప్రవర్తించిన కవిత్వమల్లా వొక్క నన్నయ్యభట్టుది మాత్రమే. తిక్కన్నగారు—

"క. బిగువెడలక నిలిచిపడు
న్నగములు వేతసచయమ్ము నమ్రంబై పె
ల్లగు మావేగము గదిసియె
సఁగుబూర్వస్థితిస బ్రదుకు సమకూరంగన్"

అన్న (శాంతిపర్వం, 3 ఆ.) పద్యంలో అతిక్రమించినట్టు యిప్ప టికి సుమారు యాభై యేళ్ళ నాఁడే మేము కనిపెట్టివున్నాము. అసలు

ఆరోజుల్లో మావిద్యార్థి వకఁడు యీలాటి ప్రాస నన్నయ్యగారిదానిలో వుందని చెప్పినట్టున్నా, అతనిమాటమీఁద పరిశీలించిచూస్తే అది కనపడి నట్టున్నా అప్పుడు అనుకోవడం తటస్థించింది. కాని యిటీవల కొన్నాళ్ళకు అవసరమై పరిశీలిస్తే తిక్కన్నగారి కవిత్వంలో దొరికింది. గాని యేంకారణమో నన్నయ్యగారి కవిత్వభాగంలో దొరికిందేకాదు. నన్నయ్యగారికి సర్వ విషయాలలోనున్నా (వొక్క సంస్కృత సమాసగ్రథనంలోతప్ప) తిక్కన్నగారు తీసిపోయేవారు కాకున్నా 15 పర్వాలు రచించిన వారవడం చేత యీలాటి వేవేనా కావలిస్తే యీయన దానిలో దొరుకుతాయి కాని ఆయనదానిలో దొరకవు. యాపత్త్రగ్రంథమూ వొక్క నన్నయ్యగారి చేతిమీఁదనే పూర్తిఅయేటట్టయితే యీలాటి విశేషాలకన్నిటికీ లక్ష్యము ఆయనగారి రచనే గుటికావలసి వచ్చేదేమో? యేలాగయితేయేమి రావ న్మాత్రంతో అంతరించడంచేత "పురుట్లోపోయిన ప్రబుద్ధుఁడు మాగుణ శాలి" అనే ప్రతిష్ఠ ఆయనగారికి దక్కింది. ఆ యీసందర్భాలన్నీ దాగా వాడి వాడపోసినవియ్యేవే. దేవీభాగవత పీఠికలో "ఎన్నిచో దోసముల్ పొసఁగు నన్నయ్యకన్నఁ దిక్కనకు నల్పుండౌనె తన్మాత్రతో" అని మేము వ్రాయవలసివచ్చింది. వ్రాసినవాక్యం యిద్దఱమైనా యిప్పటికింకా ప్రాణంతో వున్నవాణ్ణి నేను గనక నన్నునున్ను, చచ్చిస్వర్గంలో వున్న తిరుపతిశాస్త్రిగారి స్థానంలో తాదృశావస్థలోనే వున్న నన్నయ్య నున్నా (తిట్లుతినడానికి మాత్రమే అనుకోండి) అధిక్షేపించి వకరు - వకరేమిటి, యెన్ని ఆయనకు కంఠోపాఠంగా వున్నాయో అన్నితిట్లున్నా తిట్టి "నీవు యెంత దుర్మార్గుడవు తిక్కన్నకున్న పేరు తెగఁ దెగ్గించి నన్నయ్యకిస్తావా?" అంటూ పరాక్రమిస్తూ నాకేమో నన్నయ్యగారు చుట్టమైనట్టున్నా, తిక్కన్నగారు విరోధమైనట్టున్నా అపవదిస్తూ 116 పేజీల దెప్పిమైజుపుస్తకాన్ని (యితరులు ఆతిట్లు ప్రచురింపరని) సొంత ద్రవ్యంతోటే పాపం, అచ్చువేశారు. మహాకవులు యెవ్వరికీ వక మాదిరి చుట్టఱికం కలిగే వుంటారు. కాని వొకరికి వాయన్నా వొకరికి ఓడున్నా

కారని వేఁటే వ్రాయనక్కఱలేదు. "ఘనమతు లెల్లవారికి నకారణ బంధులు గారె సత్కవుల్" అన్నాఁడు సంకుసాల మహాకవి. యిట్టి స్థితిలో ఆయన తిక్కన్నగారి పక్షమవలంబించి నన్ను పై అర్థాల పాండిత్యంతో అవమానించడం— కాదు సమ్మానించడమే యెందుకు సంఘటించిందిరా అని ఆట్టే ఆలోచిస్తూ వుండఁగా నిన్న మొన్న (అభినవ తిక్కయజ్వ) అనే బిరుదం ఆయన సంపాదించుకోవడంవల్ల, సరే, భవిష్యత్కాలంలో తన్నామధారిత్వం రాఁబోతుంది గనక ( తన్నామగంధాన్నలకూబరంసా ) "తత్ స్థానాపన్న స్తద్ధర్మం లభతే" అనే న్యాయానికి అప్రివృత్తిః సరిపోయిందని తుట్టతుదకు సమన్వయించుకొని సంతుష్టిపొందవలసి వచ్చింది. ఆ యీవిషయం యితరత్రి విస్తరించి వుండడంచేత యిక్కడ స్పృశించి విడుస్తూవున్నాను. ఈయనేమో భారతమంతా పాఱఁజదివి దానిలో వుండే సంశయాలు లోకానికి లేకుండా చేశారని ఆ బిరుదాన్ని వారి గ్రామంలో వారు యిచ్చినట్టు పత్రికలలో చదివి వున్నాను. అట్టి వ్యక్తికి "బిగువు, నగము, ఎసఁగు, అనే పదాలతో కూడుకున్న కందపద్యం అర్ధానుస్వార ప్రాసకు సంబంధించింది శాంతిలో వుంది చూచుకోవలసిం" దని వ్రాస్తే అదినేను దబాయించినట్లుగా భావించి యీ మధ్య యేదో కొంత తొందరపాటు వ్రాఁత వ్రాసివున్నారు. భారతం చదివేవున్నా ఆయన యీ దృష్టితో చదివి వుండలేదనుకొని ఆ వ్రాఁతకున్నూ వూరుకొని "మీరేమల్లా శ్రిద్ధగా చూచుకోండి కనిపిస్తుందనిమాత్రం వ్రాసివున్నాను. పూర్వపు ప్రతులలో యిప్పుడున్నూ ఆ పద్యం ఆస్వరూపంతోనే వుందిగాని యిప్పటి ప్రతులలో పద్యమైతే మార్చఁబడలేదుగాని టిప్పణిలో ఎ, సగౌనుఁ బురాస్థితిన, అనే పాఠాంతర ప్రాయమైన అక్షరాలతో జేరివుంది. "ఎసగుఁ బూర్వస్థితిన" అనే పాఠంలోవున్న ప్రాసచిక్కు యిప్పుడు తప్పడానికి సంస్కర్తలు దిద్దిన దిద్దుఁబాటుగానే యిది కనపడుతుంది. యీలాటి వెన్నో యిటీవల మార్చఁబడ్డాయి మార్చినా చిక్కులేదుగాని మార్చకపూర్వం అప్రయోగాలు వరవడిగాఁ బెట్టుకొని ప్రవర్తించిన, కవి పరంపరగతి ఏమిరావలసి

వస్తుందో నాకు బోధించడంలేదు. కవిత్వం రసవంత మయిందయితే ఆయానీహారలేశాలవల్ల దానిని అధఃకరించే ప్రాజ్ఞులంటూ వుండరని అందఱూ యెఱిఁగిందే. అందులో ప్రధాన పదార్థం రసం లేని పద్ధతిని యెన్ని నియమాలు పెట్టుకొని యెంత విభూతి ధరించి యెన్నిస్నానాలు చేస్తూ వొంటికాలిబొట్టన వేఁళిమీఁద నిల్చుండి వ్రాసిన కవిత్వమేనా అదిబయ టికిరాదు. పద్యం చదువుకునే టప్పటికల్లా చల్లఁగాఁ చెవికి

"ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసులట్టె భ్రష్టులై
రెందఱు రాజులేఁగిరి మఱెందఱుయోగులు రోగులైరిగో
విందుని పాదపద్మములు పీడని భక్తి భజింపనేరకా
చందము నొందకీవు మనసా ః హరిపాదము లాశ్రయింపుమా !"

అన్న పద్యం మాదిరిని యెక్కడైతే పైనియమ నిష్ఠలు గాని, జపతపాలుగాని, తుదకు కులంగాని, యింకాయింకాపోతే జన్మంగాని యెవ్వరూ విచారించరు.

"క. గంధాళ్లి భూండలై యా
వంధీ ముంధీల డిమ్మి వహ్వారె మనటస్
జంధాల్ ఘుసుండులకు................"

అన్నమాదిరి కవిత్వమే అయితే అది పైని సూచించిన నియమ నిష్ఠలు శతగుణంగావున్న కవీశ్వరునిదే అయినా యెవ్వరూ ఆదరించనే ఆదరించరన్నది పరమ సిద్ధాంతంగదా: పద్యమందున్న జీవకవిత్వమే చదువరులకు వుపాదేయంగాని ఆ కవి బీదవాఁడా, జమీదారుడా, పొత్తర్లు పట్టేవాఁడా లేక ఓఁబాయి పట్టేవాఁడా అన్నవిషయాలనుగూర్చి చర్చించే సహృదయులంటూ వుఁటారని నేను లేశమున్నూ విశ్వసించను. పొట్ట కోసం యేదో దేవుళ్లాడుతాఁడు, 'పక్కదానంపట్టి కుటుంబం రక్షించుకొమ్మ న్నారుగా పెద్దలు' యేదో ప్రశక్తి తగిలి నిన్నమొన్న రచించి నేఁడో రేపో అచ్చుకు పంపఁబోతూ వున్న 'గోదేవి' అనే పద్యబంధంలో దీన్ని గూర్చి యీవిధంగా వుద్ఘాటించాను.

"ఉ. పొత్తరలెత్తనీ బికిరముల్ దిననీ కులమెల్లఁ బొల్లయై
రిత్తకురిత్తగా ధరఁ జరింపఁగనీ జనిపట్లనేదొ ? కిం
చిత్తగు పట్టనీ మెతక; జీవకవిత్వము చెప్పమేటికి
చెత్తకు లంకెయుం గలదె ? చెప్పఁడెమున్ బుచివెంకు ఛేనితో"

యీ బుచ్చివెంకెవరు? ఆఛేఁడెవరు,అంటేమళ్ళాతీగతీస్తే డొంకకదలు తుంది కాఁబోలును భగవంతుడా; ఛేఁడు శ్రీవాసిరెడ్డి వెంకటాద్రి నాయఁడుగారనే పేరుతో దిశలు తెల్లవాఱిన ధర్మప్రభువు. బుచ్చి వెంకు వేశ్యాకులజుఁడు, ఆఛేని సంస్థానస్థులైన బ్రాహ్మణకవులు యేదో సందర్భంలో ఆ కవికులాన్ని యెత్తుకొని (అటన్యంకు, అటదర్గంకు అనేస్థలంలో చమత్కరించడం అన్యత్ర 40 ఏళ్ళనాఁడు వ్రాసివున్నాము. అక్కడచూడండి) యేదో డెకాయించి వారి హృదయ దౌర్బల్యాన్ని ప్రకటించుకోఁబోఁగా అప్పుడాకవి.

"ఉ. పన్నిన సత్ప్ర బంధమున బాగును నోగును జూడకూరకే
మన్నన మాలి మాకొలము మాట దలంతురు చేమకూర వెం
కన్నకు లోపమేమి ? కులమా ? కవనానకు వేంకటాద్రి రా
జన్న, గణించి మీరలు దయామతిఁ జూచిననాకుఁజాలదే ?"

అంటూ ఆ కవులకు వాగ్బంధం కలిగించినట్టు శ్రీ జయంతి రామయ్య పంతులవారు సంపాదించి యిచ్చిన రికార్డువల్ల విజయ విలాస గ్రంధకర్త అదివఱలో (ఆర్వేల నియోగి కులజుఁడు) అనుకొని ముప్పయి యిద్దఱు నియోగుల జాబితాలో పఠించినది పొరఁబాటని తేల్చడం జరిగింది. దానికి తథ్యంగా విజయ విలాసపు గద్యలో (లక్ష్మణామాత్యపుత్ర) తంద్రికేగాని తనకు వేసుకోకపోవడం వగైరాలు వుపోద్బలకాలయి తుట్టతుదకు చేమకూర వెంకటకవి లక్ష్మణామాత్యుఁడు వుంచుకొన్న ధన్యురాలి పుత్రుఁడని తేలింది. అతని పీఠికలోవున్న కొన్నిమాటలు "అంజలి ఘటించి" వగైరాలనుబట్టి మేము కులం విషయంలో అనుమానించి యేని

యోగి మహాకవిన్నీ యిట్టిదైన్యపు ప్రసంగం యెక్కడా చేసినట్టు లేదు కాఁబట్టి యీకవి నియోగియగునా, కాదా అని కొంత సంశయాన్ని సూచించేటప్పటికి శ్రీమా (పోలవరపు) జమీందారుగారు విలాసార్థంగా "యేమండోయి! మాకవిని మీరు అన్యథాకరించి మాగౌరవానికి భంగం కలిగిస్తున్నారే" అంటూ చమత్కరిస్తూ వచ్చేవారు. తుట్టతుదకి మాఅను మానమే స్థిరపడి అమాత్యపుత్రత్వం మట్టుకు స్థిరపడినా అమిత్యత్వం లేక పోవడం తటస్థించింది. భవతు. యీ మెతక స్థిరీకరింపఁబడ్డ తర్వాని లతని కవిత్వానికేమేనా న్యూనత్వం కలిగిందని చెప్పేవారున్నారా ? వుంటేనో ? అట్టి చేదస్తులు కవితా విమర్శకుల పంక్తి భోజనానికి యిప్పుడేకాదు యెప్పుడేనా అర్హులవుతారా ? విషయం విషయాంతరంలోకి దేఁకి చాలా సేపయింది. భారతాంధ్రీకరణానికి అర్హత్వ సంపాదన కోసమై ఉభయ కవిమిత్రుఁడు యజ్ఞంచేయ వలసి వచ్చిందంటూ వక పుక్కిటిపురాణం వుంది. ఆ పద్ధతిని నన్నయ్యగారు యజ్ఞకర్త కాకుండానే దాన్ని ఆంధ్రీ కరించడానికి యేలా వుపక్రమించారోకదా ? అంటే జవాబు లేదుకదా; యీ కల్పన వుత్తమత్వ సంపాదనకైతే యింకోకల్పనవుంది. అది రసి కత్వ సంపాదన కుపకరిస్తుంది. జాంపోద్రెక్కి యింకా రాత్రిదాపతు తాంబూలాన్ని నములుతుంటూ కళ్లునులుపుకుంటూ

(శ్లో. అంగైరంగజసంగ రాలసతరైర్భావంగమై స్సంగత
శృంగారీ నవయోభిరంచతి సమం శృంగాట కోపాంతికమ్)

నిద్దురజోగుతో వస్తూవున్న తిక్కన్నగారికి శ్రీరాజరాజనరేంద్రుని (ఆయీకథలకు సమకాలీనత్వ విషమ కాలీనత్వాలతో సంబంధమే వుండదు కదా) చేతపంపఁబడ్డపద్యం "నిండు మనంబు నవ్య నవనీత సమానము" అనేదో, లేక "మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య" అనేదో చూసేటప్పటికి తిక్కన్నగారు నోటి ఉచ్ఛిష్టపు తమ్మితో ఆపద్యం వ్రాసిన తాటాకు ధాగానికి రంగువేసి పంపినారనిన్నీ దానిభావం నేను యింతకంటేకూడా కొంత మెఱుఁగునారవిత్వాన్ని రచించి

మెప్పిస్తానని అవగతమవుతూందనిన్నీ చెప్పే పుక్కిటిపురాణం వకటి
వుంది. దానివల్ల వచ్చే వుత్తమత్వంగాని, దీనివల్లవచ్చే అధమత్వంగాని
కవికి గౌరవా గౌరవాలు కలిగిస్తే కలిగిస్తాయేమోగాని కవిత్వానికి గౌరవా
గౌరవాలు కలిగిస్తాయనేమాట సర్వకల్ల. దారిద్ర్యా దారిద్ర్యాలుకూడా డిటో.
ఆ పద్ధతిని మన పోతరాజుగారి కవిత్వం గతేమికావాలి? "భిక్షుణా
కక్షినిక్షిప్తః కిమిక్షుర్నీరసో భవేత్"? మానసబోధ శతకాన్నుంచి లోగడ
యీ ఘట్టంలోనే వుదాహరించిన పద్యం రచించిందెవరు? భటరాజుగదా?
ఆయన యజ్ఞం చేశాఁడా, యాగం చేశాఁడా? యేమీ చేయలేదుగదా?
పూర్వజన్మ సుకృతంమంచిది. రసవత్తరమైన కవిత్వానికి నోఁచిపుట్టాఁడు.
బస్ యింతే కావలసింది. పోతన్నగారికంటె గర్భదరిద్రుడు (లోకదృష్ట్యా
నేసుమండీ? ఆయన దృష్ట్యా అయితే ఆయన మహాభాగ్యవంతుఁడే (మన
సిచ పరితృప్తే కోఽర్థవాన్, కోదరిద్రః) మఱివకఁడు లేఁడుగదా? అట్టి
గర్భదరిద్రుని కవిత్వంలో యెక్కడ యెత్తుకున్నా రసం (బంగారం అని
కూడా అనుకోండి) కుప్పతెప్పలుగా దొరుకుతుందే? నీళ్ళల్లో గేదెను
పెట్టి బేరాలెందుకు? యేదో వుదాహరించి మాట్లాడుదాం।

"తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నొడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁదలఁపఁడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు"

బంగారంవంటి యీ పద్యంలోకూడా వికట విమర్శకులకు శంకలు
వుండకపోవుసుమండీ? హరికీర్తినొడివేటప్పుడు నోరునొచ్చే యెడల వాఁడు
భక్తుఁడేలా అవుతాఁడంటూ శంకిస్తే శంకించవచ్చును. కాని ఆపదం
అక్కడ వుంటేనే అందం. ఆ అందం మహానుభావుఁడు పోతన్నగారికే
తెలుసును. (నహ్యస్మాదృశ శుష్కహృదయాణాం) దానికింతే సమా
ధానం. యేదో నోటికి వచ్చిందని (యెదుటవున్నవాడు పెళ్లికొడుకు)
అన్నట్టుదాహరించానుగాని యీపద్యం ఆయన కవిత్వంలో పేరు ప్రఖ్యాతి

గాంచిందనే తాత్పర్యంతో వుదాహరించిందనుకోవచ్చు "యెక్కడఁజూచి నంగళల యిక్కలు" అంటూ శృంగారరస సందర్భంలో ధూర్జటికవిరాఁ జోలును వొకపద్యం వ్రాసివున్నాఁడు. అదేవిధంగా మనపోతరాజుగారి కవిత్వం ప్రతిపద్య రసాస్పదం. అందుచేత పెదికి వుదాహరింప నక్కఱ లేదు. అయినప్పటికీ ప్రతికవిత్వంలోనున్నూ "తత్రాఽపిచ చతుర్థోఽంక స్తత్రశ్లోక చతుష్టయా" లు వుంటూనే వుంటాయి కనుక వామన చరిత్రలోవున్న

"శా. కారేరాజులు ? రాజ్యముల్ కలుగవే ? గర్వోన్నతిన్ బొందరే ?
వారేరీ ? సిరిమూటఁగట్టుకొని పోవంజాలిరే ? భూమిలోఁ
బేరైనంగలదే ? శిబిప్రముఖులున్ ప్రేమన్ యశఃకాములై
యీరే కోర్కులు ? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా ?

(యింకా యెన్నో పద్యాలున్నాయి. వ్యంగ్యమర్యాదచేత ఆరవి జీవిత రహస్యాలు కూడా తెలిపేవున్నాయి. విస్తరభీతిచే వుదాహరింప లేదు చూచుకోండి. భాగవతంలో)

వగైరా పద్యాలు మఱీ అగ్రస్థానానికే వస్తాయి. ఆ యీ కూప్పు సందర్భాన్ని పట్టిచూస్తే నన్నయ్యగారు గావి, తిక్కన్నగారు గావి మన పోతన్నగారికి యెంతదూరంలో వుండవలసినవారో కావలసి వస్తుంది. (రసపిపాసకుణ్ణి కనక యెప్పుడేనా నేను యేకవినిగూర్చేనా తలఁచుకొని ఆనందిస్తూ కాలక్షేపం చేసుకుంటూ, యెక్కడేనా కెంపుమాటలు పత్రికలో ప్రచురిస్తూవుంటే యిదేమో శాఖాభిమాన ప్రయుక్తమంటూ పకాయన "ఆఱునెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మను కొట్టేఁడంట" అన్న సామెతగా నామీఁదకి యుద్ధానికి లేచి దూషించడానికి మొదలుపెట్టడం యేమిధర్మమో కదా ? అయితే ఆయాకవులందఱూ మహామహులే; రస వత్కవిత్వం చెప్పినవారే. ఒక్కొక్కరిని గూర్చి వొక్కొక్క వ్యాసంలో ముచ్చటించుకోతగ్గవారే అనే విషయం అసకృదావృత్తిగా యితరత్రి

వ్రాసేవున్నాను. కనక యిక్కడ మళ్ళా వ్రాయనక్కఱ లేదు. సంస్కృత సమాసాలు కూర్చని కవులంటూ ఆంధ్రకవులలో (అచ్చతెనుఁగుకవులు తప్ప) లేనేలేరుకదా ?

(1) అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి....
(2) బహురత్నద్యుతి మేదురోదరదరీ భాగంబునం
నభోవాహినీ లహరీ.............................
(3) తలఁపంజొప్పడి యొప్పెనప్పుడు తదుద్యక్షేత్ర....

యీలా ప్రతికవిన్నీ కొన్నిచోట్ల తమకువుండుకొన్న సంస్కృత భాషానిష్ణాతృత్వాన్ని చూపడానికో అన్నట్టు కొన్నిపద్యాలు రచించడం వుండనేవుంది. వీరిని చూచియ్యేవే నేనున్నూ విడివిడిపదాలతో వ్రాసే కావ్యంలో శ్రవణానందంలో కూడా "జరిగెవివాహ మద్భుత రసప్రసరత్కల" వగైరా పద్యాలు కొన్ని అంతోయింతో అర్థంకూడా వున్నవి. వ్రాసివున్నాను. కాని "కొంటెలలోనఁ గొంటెయుంగావలె" అనివ్రాసికొనే వుండడంచేత లోకం యేమాత్రం కనిపెడుతుందో చూదామని. వకపద్యం :—

ఉ. "వేసవివచ్చె భాస్కర నవీనగవీన మితాఽమితాచ్ఛగు
చ్ఛాసవ వాసనై కవలనా కలనాఽకులనాయికానము
చ్ఛ్వాసన శాసనాధికృతి ఝంకృతి సంకుల షట్పదావళీ
భాసుర శుష్క పుష్పవిటపప్రకరప్రతిభా ప్రమోదమై"

అన్నదికాబోలును వ్రాసివున్నాను. యిందులో అర్థం వుందోలేదో నాకుయిప్పటికిన్నీ తెలియదు. అయితే యీరహస్యం తెలిసి ప్రతిపక్షులెవరేనా ప్రశ్నిస్తేనో ? ఆమాత్రం సాహసంవున్న ప్రతిపక్షులంటూ బయలుదేఱితే అర్థం దానిలో యెలాగోవకలాగు వచ్చితీరుతుందని నామొండి ధైర్యం. వూరికే పట్టుకొని శాపనార్థాలు పెట్టడానికె సాహసంవున్నవారేగాని ప్రతిపక్షులలో పలువురు పట్టుమని వకప్రశ్నకూడా ససారమయినది అడిగేవారు లేరు.

చెప్పొచ్చేదేమంటే? యీలాటి నిరర్థకపద్యాలు పోతరాజుగారు సంస్కృత జటిలపు కవిత్వభాగంలో కూడా చెప్పనేలేదు. ఆయనకి అంత్య నియమం వకటి చాలాయిష్టం. చరాన్ని వర్ణించవలసి వస్తుందనుకోండి దాన్ని చివరకు వచ్చేటట్టు పద్యంలో వుంచడమున్నూ, అక్కడనుండి యెక్కడలేని పదాలూ 'కరి' కారంతో చేరినవి తీసుకవచ్చి పూరించడ మున్నూ ఆయనకు యిష్టం. భాగవతంలో చాలాపద్యాలు యీదాపతులోవి వుంటాయి. ఆకూర్పు అలాగే వుంచి సంతోషపడితే తప్పు విడమర్చి ప్రతిపదార్థం చెప్పుకొని ఆనందించవలసివస్తే చాలాభాగం పొట్టుకింద జల్లించవలసి వచ్చేటట్టయితే

"..............................................గట్టలు వైరలోపలం
బోరవిడినట్టి శుష్కకుచ పొంకము బైటికిఁ బెట్టినట్టి రసం
బావహిలంగ నేర్చునె? మహాకవులార అనుగ్రహింపుఁడీ!"

అని రసపిపాసకులని ప్రార్థించవలసి వస్తుంది. యీవర్ణం ప్రతి యమకకవిత్వానికిన్నీ వున్నదే "ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్నవిద్యతే" అన్నవాక్యం జనరల్‌గా పుట్టిందిగాని యెవరో కొందరి కవిత్వాలని పురస్కరించుకొని పుట్టిందికాదు. కాని "పేడనీ బెల్లాన్నీ కలిపి గుచ్చెత్తినట్టుగా" యీవిషయంలోకూడా అందరినీ వకటేవిధంగా భావించడం మహాప్రమాదం. కాళిదాసు "శ్లో. ద్వైపాయన ప్రభృతి శాపా యుధ త్రిదివ సోపాన ధూళిచరణా" అంటూ కాశికమీఁద అష్టకాన్ని రచించాఁడు కదా అని నేను కాశీలో వున్నప్పుడు దాన్ని వరవడిగాఁ (యెందుకు? అక్షరాలకే; అర్థానికి కాదు.) పెట్టుకొని "శ్లో. నాశకజాద్య దితి జాశీ శిరఃకలిత మౌళిప్రభాంచితపదా" అంటూ ప్రారంభించి ముప్పు తిప్పలాపడి, మూఁడుచెఱువులనీళ్ళు తాగి నేనూ కాళిదాసునే అన్నంత సంతోషాన్ని పొందడం తటస్థించింది. సరే, యేదో ఆరంభాష్టకం కనక, యింకా కవిత్వంలోవుండే మంచిచెడ్డలూ, రసాసుభాలూ బొత్తిగా కానన్నా అంతగా తెలియవుకనక నాసంతోషం తత్కాలోచితంగా వుందనుకొన్నా.

యితరులు బాగా పెద్దవయస్సులోవున్న మహాపండితులే నాముఖతః ఆశ్లోకాలు విని "సాక్షాత్తూ కాళిదాసే వీఁ"డని అనుకోవడం నేను ప్రత్యక్షంగా విన్నదే. క్రమంగా కొంతకాలం గడిచి కొంత అనుభవం హెచ్చాక నాశ్లోకాలు నాకు బొత్తిగా నచ్చక ఆశ్లోకాలముందు "దివిటీకింద దీపాలుగా" కూడా కనపడకపోవడం దగ్గఱికి వచ్చింది. అప్పుడెవరేనా ఆయీ శ్లోకాలసందర్భంలో నన్ను అభినందిస్తూవుంటే నాకే లజ్జగావుండి వారిని వారిద్దామా అన్నంతవరకు వూహ పుట్టేదిగాని తీరా మనం వారిని వారిస్తే వారు దాన్ని వినయార్ధంగా చెప్పిన మాటగా భావించి మఱింత అభినందిస్తారుగాని యధార్ధకథనంగా భావించడమంటూ వుండదని నాలోనేను లజ్జిస్తూ "కిమన్నాస్తి" గా వూరుకొనేవాణ్ణి. స్వకీయంలో యీలాటి వెన్నో వున్నాయి. విస్తరభీతిచేత వకటి మచ్చుచూపి విరమిస్తున్నాను. క్రమంగా అనుభవం హెచ్చి "తెలియనివాఁడనై మెలఁగితిన్ గత మయ్యె నితాంత గర్వమున్" అన్నమాదిరికి రావడానికి బదులు కొంద ఱికి దీనికి వ్యతిరేకంగా అనుభవంలోకి రావడం కనపడుతూవుంది. తమ కవిత్వమేమో రసవిషయంలోఁగాని, యితరవిషయాలలోఁ గాని పూర్వ కవుల కవిత్వాన్ని మించేదే అయినా వ్యక్తిగతమైన శతృత్వాన్ని పురస్కరించుకొని దాన్ని అన్యధాగా అపలపించడం జరుగుతూ వుందనుకొనేవారు పలువురు కనపడతారు. నా అనుభవాన్ని బట్టి వ్యక్తిగతమైన ద్వేషం కవిత్వవిషయంలో బొత్తిగా ఆనందించడానికి అడ్డుతగలదనే అనుకొంటాను. మాయింటి ప్రక్కను వుండే గృహస్థులకున్నూ, మాకున్నూ, వ్యక్తిగతంగా వుండే ద్వేషాన్ని పురస్కరించుకొని సుమాఱు పవహారేండ్లనుంచి నిన్నమొన్నటివఱకున్నూ సంభాషణాదికంలేని స్థితిలో మా పాండవనాటకములు ఆయింటిలో చదువుతూ వుండడం తఱుచు నాచెవిని పడడంవల్ల నేనీరహస్యాన్ని కనిపెట్టఁగలిగాను. ఇదిన్నీ విష యాంతరమే. ప్రస్తుతం పోతరాజుగారి అంత్యనియమం మఱికొందఱు అనుసరించి యేకొంచెమో కృతార్థులు కాఁగలిగినా ఆయనరచనకన్న

చాలా వ్యర్థపదాలతో నిండివుండవలసి వస్తుందనిన్నీ, ఆయనదానికోసంకూడా నాంతరీయకతయా వ్యర్థపదాలు వడవలసి వడినప్పటికీ అందుగా ఆరచన నీరస మనిపించుకోదనేదే వక్తవ్యాంశం. ఒకపద్యం వుదాహరించి చూపుతాను.

"మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపిత భూమి చక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండ భాండచ్ఛటాం
తర నిర్వక్రముఁ బాలితాఖిల సుధాంధశ్చక్రమున్ జక్రమున్"

ఆ యీపద్యం యెంతో సంస్కృతపదజాలంతో నిండివున్నా రఘువంశంకూడా చదువుకోని కేవల తెలుఁగు వాఁడికికూడా సుబువుగా తాత్పర్యాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా తెలుఁసుకోఁదగ్గది యీ పద్యంలో శ్రీ విష్ణుమూర్తివారు మొసలిని చంపే నిమిత్తం చక్రాన్ని ప్రయోగించారన్నదేకదా; "చక్రః క్షిప్తః" అంటూ ఉద్ధితాకాంక్షపరంచేఁ గాని, ఉత్థాపితాకాంక్షపరంచేతఁగాని బయలుదేరే శంకలుకు సమాధానం రాసిపోతే చెడేదేమిటి ? యేమైనా ఆ యీఅంత్యానియమంవల్ల పిమ్మట్నుంచిలఁ గొంత వైరస్యం పొడకట్టడానికి అవకాశం లేకపోయిగాని దాన్నిమున్నెప్పుడు దాగా పరిశీలిస్తే ఒక మంచి గ్రామంగా వుండవలసివస్తుంది. అట్టి గ్రామంలో చాతుర్వర్ణ్యం మాత్రమేకాక యింకా తక్కినవాండ్లుకూడా వుండవలసి వస్తుందిగదా ? అట్టి స్థితిలో యిప్పటి భావకవులుమాత్రం విలక్షణమైన మార్గాన్ని అవలంబించి ప్రధానాంశాన్నిమాత్రం పురస్కరించుకొని కొన్నిమాటలు తోఁచినవేవో వ్రాసి విరమిస్తూవున్నారు. దాన్నిగూర్చి వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి. దానికోసం యీ వ్యాసం ఉద్దేశించఁబడలేదుగదా ? ఆ యీభావకవిత్వాన్ని అచ్చువేయడంలో పేజీ వక్కంటికి ఒక పద్యం చొప్పున కొంతయున్నూ కొన్నిపేజీలలో యేమీ లేకుండా "తురకమశీదు నాబ్రతుకు తోయ్యలి ? యేమని చెప్పఁగొంటిని ?" అన్నట్లు శుద్ధశూన్యంగా వుండేటట్టున్నూ ముద్రింపించి కొంతపుస్తకాన్ని పెంపు

జేయడమున్నూ చూస్తే సమర్థనీయంగా కనపడదు. ప్రధానాంశాన్ని పోషించేవి భావాను భావాదులుకూడా వుంటేనే బాగుంటుందని నేననుకొంటాను కాని “ లోకో భిన్నరుచిః ” కదా లోకంకోసం పుట్టిన కవిత్వాన్ని కూర్చి యెవరో లోకులు కొందఱు అభినందిస్తూ వుండఁబట్టే యువ కవులు ఆరీతి భావకవిత్వానికి అలవడుతూ వున్నారని నేను సరిపెట్టుకొంటాను. పోతరాజుగారి మార్గం దుర్గమం. శ్లేషలో తెలుఁగు కవులలో భట్టుమూర్తి ననుకరించడం యేలాటిదో? అంత్యనియమంలో పోతరాజుగారిని అనుకరించడమున్నూ అలాటిదే. యింతవఱకు జరిగిన రెండువిధాల అనుకరణాలుకూడా యెక్కడా జయప్రదమైనట్టు కనపడడంలేదు.

“ఉ. రాణ దలిర్ప మొక్కెద నరాళమరాళ వధూటికాగ్ర ఖం
ఖాణికిఁ గృష్ణవేణికి జగత్పరిమాణికి మోక్షమార్గని
శ్రేణికి దృగ్జితైణికిఁ గుశేశయపాణికిఁ బూజ్యసర్వ గీ
ర్వాణికి మంజువాణికిఁ బురాణికి వాణికి బ్రహ్మరాణికిన్”

ఇది మాముత్తాతగారిపద్యం. ఆయన కౌముదిసంపూర్తిగా చదువుకొన్నట్టు స్వదస్తూరీతో వ్రాసుకొన్న తాళపత్రగ్రంధంవల్ల విస్పష్టమవుతుంది గాని పోతరాజుగారిని అనుసరించి కష్టించి చెప్పిన యీపద్యంలోవున్న సమాసాంత ప్రత్యయాలు వగయిరా నాకు అంత సుసాధ్యాలుగా కనపడవు. కౌముది చదువుకొన్న కవులకే పోతరాజుగారి అంత్యనియమానుకరణం ముప్పుతెస్తూవుంటే యితరులు అనుకరించవలసివస్తే చెప్పేదేమటి? యీ అంత్యనియమాలువున్న పద్యాలలో యెక్కడేనా పోతరాజుగారు దొరుకడతారేమో అని నేను అనేక విధాల నాకు వుండుకొన్న అనుభవంతో పరిశీలించాను. కాని యేదో విధంగా సమర్థించే ప్రయోగమేకాని ఆయన చేయనేలేదు. ఆయనది సహజపాండిత్యమే అగునా? లేక గురుశుశ్రూషా పూర్వకమైన పాండిత్యమే అయివుండునా? అనిపిస్తుంది నాకు. అది పూర్వజన్మవాసన అనుకోవలసిందే కాని యావద్విషయమున్నూ గురుము

ఖతః అభ్యసించనలసివస్తే యెంతకాలమేనా చాలుతుందా? ఒక ప్రయోగం చూపి పోతన్నగారి పాండిత్యాన్ని నిర్ణయిస్తాను. దశమంలో యెన్నో చోట్ల ఏడేళ్ళలోపులో వుండే శ్రీకృష్ణుణ్ణి కుమార పదంతో వాడుతూ వుంటాఁడు. పోతన్న సంస్కృతంనిండా అలాగే ప్రయోగించఁబడి వుంది కనక యీయనకూడా అలాగే వాడివుంటాఁడనుకొంటే సరిపోతుందిగాని తగినంత లక్ష్యలక్షణజ్ఞానం దృఢమైనది. లేకపోతేనో? "అది ఆర్ష ప్రయోగం కావచ్చును. మనందాన్నిబట్టి ప్రయోగించుకొంటే మెచ్చరేమంటారో" అని మానుకోవచ్చునుగదా? దృఢమైనపాండిత్యం వుండడంచేత అట్టి వృథాశంక పెట్టుకోక (1) "మఱియు నాకుమార శేఖరుండు" (2) "ఓయమ్మ నీకొమారుఁడు" అని పరంపరగా ఆయుదేఁడ్లలోపులో వున్న కృష్ణుణ్ణిగూర్చి వాడుతూ వచ్చాఁడు. కాళిదాసో? అప్పుడు పుట్టిన శిశువు, కన్నులుతెఱవని నెత్తురుకందు అజుణ్ణి దూర్చి "కుమారకల్పం సుషువే కుమారం" అని రఘువంశంలో వాడివున్నాఁడు. యిలాంటిప్రయోగాలు లక్షోప లక్షలు యివ్వవచ్చును, యిప్పటికి కుమారశబ్దమునకు కొడుకు అనే అర్థం నిర్వివాదమని తేలుతూవుందా, యింకా సందేహించవలసిన ప్రసక్తి యేమేనా వుందా?

"న్యాయమైనసొమ్ము నట్టేటిలో పాఱవేసినా పోదు" అన్న సామెతగా దీన్ని యేపరిషత్తు వారితో విన్నవించినా అంగీకరిస్తారంటారా? మాఱుపలుకుతారా? కుమారశబ్దభవం (కొమరుడు) అని అవుతుందా? అయితే కుమారశబ్దాత్తు స్త్రీత్వవివక్షయందు ఙీకారప్రత్యయం వస్తుందా? వస్తే కుమారీ అవుతుందా? అయినతరువాత దాన్ని తద్భవంలోకి మారిస్తే "కొమిరె, అని అవుతుందాండీ? కుమారికి వున్న అర్థం కొమిరె" అనేదానికి జన్మతో సంక్రమించిన హక్కుగా వస్తుందా? అలాకావడం నిర్బంధం కనకనే కదా వసుచరిత్రలో "చ. కొమిరె మనోవికారమును" అని ప్రయోగించడమున్నూ వ్యాఖ్యాత "కూఁతురియొక్క మానసికవికార" మనే అర్థమిచ్చే అక్షరాలు వ్రాయడమున్నూ తటస్థించిం

చంటారా ? యిదేదీలేక వూరికే బొందనిఁబడి "శతాంధాః కూపం ప్రివిశంతి" గా వ్రాసివుంటారా ? వసుచరిత్రిలోవున్న "కొమిరె" కుమారీ భవమైనప్పటికీ యౌవనవంతురాలనే అర్థాన్నే యిస్తుంది కనక వ్యాఖ్యాత ఆలాటి అర్థాన్ని వ్రాయడం తప్పని యెవరేనా వాదిస్తే ఆంధ్రి భాషాపరిషత్తువారు గాని, నిఘంటుకార్యాలయంవారుగాని ఆమోదిస్తారా ? పైఁగా కుమారశబ్దాత్తూ ఈకారప్రిత్యయం చేసుకొన్న కుమారీశబ్దానికి కూఁతురు అనేదే నియతమైన అర్థంఅని వాదించేయెడల "కుమార" శబ్దానిక్కూఁడా యౌవనవంతుఁడనే అర్థమే రావాలిగా ? ఆపక్షంలో రఘు మహారాజుగారి భార్య యౌవనవంతుఁడైన కొడుకునే కన్నప్పుడుగాని కాళిదాసు "సుషువే కుమారం" అనకూడదుగదా ? అయితే కుమార శబ్దానికి యౌవనవంతుఁడనే అర్థం లేనేలేదా అంటారేమో శివశివ ! నేను ఆలా అనేవాణ్ణి కానే ? యౌవనవంతుఁడు అనే అర్థమున్నూ వుందికనకనే "పేరు వరూధుని యందుప్రి కుమార ! ఘృతాచీతిలోత్తమా" అని ప్రియోగించుకున్నారు పితామహుఁడుగారు. యెంత తెలివితక్కువ దేవతా భోగందయినా దేవభాషలోవున్న కుమార శబ్దానికి "యౌవనవంతుఁడు అనే అర్థం లేకపోతే - కొడుకు అనే అర్థంమాత్రిం వుండేటట్టయితే "ఓకొడకా ? అని తన్ను ప్రియురాలిగా అంగీకరించవలసిందని చేసు కొనే విజ్ఞాపనాప్రిసంగంలో ప్రియోగించుకొంటుందా ? లేదా ? ఆంధ్రి కవితాపితామహుఁడు ఆపెనోటినుండి ఆలాటి "తల్లికి మగఁడు వావి" దోషాన్ని కలిగించేమాటను పలికిస్తాఁడా ? అర్థద్వయంగాని, త్రయంగాని, చతుష్కంగాని, అంత కెక్కువగాని వుండే పదాలు ప్రకరణ వశాత్తున్నూ యెక్కడ యేఅర్థం అవసరమో అట్టిఅర్థాన్నే యిస్తాయి కాని అన్యార్థాన్ని యివ్వవన్నమాట కూడా 70 యేళ్ళ యీవయస్సులోకూడా యెఱుఁగనా ? పరిషత్తువారినిన్నీ, నిఘంటు సభ్యులనున్నూ అడగవలసిందని నాకు ఆజ్ఞ వచ్చింది కనక వారితోటి ఆయీమాదిరి ప్రిశ్నలు యేలాంటివిన్నీ సాంజలి బంధంగా మనవి చేసుకొంటూ వున్నాను. "పరిషద్దక్షిణాం గృహీత్వా"

శ్లో. సమస్త సంపత్సమవాప్తి హేతవ
స్సముత్థితాపత్కుల ధూమకేతవః,
అపార సంసార సముద్ర సేతవః
పునంతుమాం బ్రాహ్మణ పాదపాంసవః.

ఆ యీ శ్లోకార్థం అసభ్యులలో యెవరేనా నాకు యత్కించిత్తేనా శిష్యత్వమో ? ప్రశిష్యత్వమో వున్నవారుంటే వారికి తప్ప తక్కినవారికే వర్తించవలసిందని మనస్సులో పెట్టుకొని వుటంకించాను అట్టి సంబంధం వున్నవారుకూడా నా ప్రయోగం ప్రమాద మూలకమని నిరూపించవలసి వస్తే నిరూపించడానికి సంశయించవలసి వుండదు. లేశమున్నూ సంశయించవలసి వుండదని వేరే వ్రాయనక్కఱలేదు. "నతేనవృద్ధో భవతి యేనాస్య పలితం శిరః") బందరులో పరిషత్తులో యీలాటివి కాకపోయినా మతసంబంధమైన తగాయిదాలు పరిష్కరించడమంటూ వుండేది. దానికి యేమాత్రమో దక్షిణ దాఖలుచేయడం ( రు. 2—8—0 లు అని జ్ఞాపకం ) వుండేది. అలాటి నిబంధన వున్నట్టయితే మనియార్డరు చేసుకొంటాను. తెల్పవలసిందని ప్రార్థిస్తాను. యీ 'కొమిరె' పదాన్ని గూర్చేకాదు, (1) జ్ఞాపకం (2) వూహాపోహలు, (3) కొండొకచో, (4) బుక్కించెదన్, (5) ఇదేమాట, (6) జంతువులేగిరి, (7) పలరాకాకోక భీకారణా, (8) మనుగుడుపు. యెన్నని వుదాహరింతును ? మీరున్నూ చూచేవుంటారు. వేలు. అసలు నాకవిత్వంలో వుంటాయను కోండి తప్పులు, అందులో వందలు పరిగ్రహించి, పదులు ప్రకటింపఁబడి వుంటాయనుకొందాం. యితరత్ర నేను వ్రాసిన సమాధానాలు చాలా విస్తరించివున్నా అవిమీరు చూచివుంటారో లేదో నేను నమ్మకంగా చెప్ప లేను. ప్రస్తుతం "కొమిరె" ( దూఁతుడు అనునర్థమున తప్పా ఒప్పా అని విజ్ఞప్తి. పిమ్మట వుదాహరించిన సంఖ్యలలో యెందుకు దేన్ని తప్పనవలసి వచ్చిందో, మీకు అవగతమే అవుతుంది చూచేటప్పటికల్లా కాకపోతే అసలువారిని' అడగవచ్చును. యీభారం తుట్టతుదకు "పూరి

పిడుగు వీరిసెట్టి నెత్తిని పడింది" అన్నలోకోక్తిప్రకారం మీమీఁదప డింది. (6) "జంతువులేగిరి" అనేచోట "జంతువులేగెను" అనడానికి మీరు సమ్మతిస్తామంటే అలాగే శిరసావహించి సవరించుకొంటాను. అక్కడ ఆజంతుపదం ఆటవికులు అనే తాత్పర్యంతో వాడివున్నాను. కాని ఆటవికములైన వ్యాఘ్రాదులు అనే తాత్పర్యంతో నేను వాడివుండలేదు. అట్టిఅర్థం యితరులకున్నూ కాదు. పశుప్రాయులైన మనుష్యులు అనే అర్థం వాచ్యమయితే మహదర్థకక్రియ వాడక తప్పుతుందా ? "ఏగెను" అని సవరించినా ఛందోభంగంలేదు. ఆలోచించి సెలవిప్పింపవలసిఁదం టాను. (4) "బుక్కించెదన్" దీన్నినేను "కుక్కమొఱుఁగు" అనే అర్థంలో వాడుకొన్నాను. కవిత్వంలో "కుక్కమొఱుఁగు" యెందుకు వచ్చిందంటారేమో ? ఆకుక్కనునేనే అవసరమై అట్టి అవతారం యెత్త వలసి యెత్తి ఆధ్వనిచేశాను. జయంతిలోవున్న "దుఃఖించి బుక్కించె దన్" అన్నపద్యం చిత్తగిస్తే నాఅవతారానికి వున్న కారణం నిమిషంలో మీకు గోచరిస్తుంది. "బుక్కభషణే - భషణంశ్వరవః" అని చిన్నప్పుడు కౌముదిలో చదువుకొన్నాను. ధాతురత్నాకరంలో ఆరోజుల్లోనే "ఇత్యేదం మదవివశ స్తకన్నయం శ్వాయోగి ష్వప్యమాహ ! బలాద్ధి బుక్కతీశ" అని వాడివున్నాను. రావణాసురుఁడు మునులు వగయిరాలను అవమా నోక్తులు పలుకుతున్నాడని బ్రహ్మాదులు శ్రీమహావిష్ణువుతో విజ్ఞప్తి చేసుకొనే ఘట్టంలోది ఆశ్లోకం. ఆధాతురత్నాకరం యింకా అచ్చుకాలేదు. తప్పుగా మీకుతోస్తే సవరించుకొంటాను. ఆధాతువునే అవసరమై సంవృతి క్రియగా ప్రస్తుతం జయంతిలో వాడుకొన్నాను. అంతేనేకాని బుక్కు పుస్తకం అనే అర్థమందుఁగాని నైజాముదేశంలో వాడే మఱో అర్థంలోఁ గాని నేను వాడలేదు. "త్రీపతః కవేః ప్రష్టవ్యమ్" కనక యీలాగే మీరు నన్ను దేనికి దేనికి అడుగుతారో వాటివాటికి నాకువున్న ఆధారాలు మనవిచేసుకొంటాను. సమాధానాలు లేనివి తప్పులని ఒప్పుకోవడమే కాకుండా ఆ వొప్పుదలను వాకపత్రికలో కాకుండా అనేక పత్రికలలో

చేవ్రాలుతో ప్రకటించడమే కాకుండా ఫలానావారు నాకీ వుపకారం చేశారని వారివారి పేర్లు వుదాహరిస్తూ వారివారికి నాకృతజ్ఞతను వెల్లడించుకొంటాను. నాస్థితి చాలా అయోమయంగా వుంది. యిప్పటికే నేను ప్రపంచకంలో లోకులున్నూ, నేనున్నూ అనుకొన్న కాలంకంటె యెక్కువకాలం నిలవచేసినట్టు నన్ను ప్రత్యక్షంలో చూచినవారు అనుకొంటారు. అందుచేత నాయందు దయవుంచి నేనిందులో ప్రస్తుతం "సరాగ్రజు పెళ్ళిలో గుత్తాజు కొకపోఁచగా" చూపినమట్టుకేనా పరిశీలించి మీఁకుపోఁచిన మాటలు పత్రికాముఖాన్ని వ్యక్తంచేస్తే చూచి యేమేనా వ్రాయవలసి వుంటే యీలాగే పరుండియ్యేవే వ్రాస్తాను. లేదా శిరసావహించి ఆసంగతినేనా ప్రకటిస్తాను. పత్రికలో ప్రకటించడం యెందుకు, ప్రత్యుత్తరం ద్వారా తెలియఁజేస్తామంటారా? పరమసంతోషం. అలాగేనాసరే. నాటప్పుడు నాకున్నూ మీకున్నూ మాత్రమే తెలిసినట్టవుతుంది. కనక యింకా నేను నలుగురిలో తలయెత్తి తిరిగే రోజులంటూవస్తే (అవ్వకు జవ్వనం రావునా? ముసలయ్యకు బండ్లు వచ్చునా?) తిరుగుతాను. పూరికే యీలా వ్రాయవలసి వ్రాశానే కాని నేను దాఁచుకొంటేమాత్రం ఆయీపనివర్తం యేలాగో బయటపడక పోతుంది కనకనా? అందుచేత మీతాలూకు ప్రత్తరాన్ని నేనే పత్రికలలో ప్రచురిస్తానన్నదే చివరిమాట. తిరిగినన్నాళ్ళు తలయెత్తి తిరిగాను. యింకాఅదేపనా? పాకాయన నన్నుగూర్చి యీలా సలహాయిచ్చారు.

"గీ. పరువమనియెడి చండభాస్కరుఁడు మింట
నేఁగి తుది నపరాంబుధి నీఁడబడియె,
జరయనెడి కాఱుచీఁకటి పారనెనింక
జ్ఞానదీపికఁ గొని ఆత్మఁ గాంచుమయ్య"

యీ సలహాప్రకారంగానే యింట్లో నాలుగుమూళ్ళ పన్నెండు చతురపు గజాల గదిలోనున్నూ. అంతకంటెకూడా కొంత యెక్కువ పరిమాణంలోవుండే ఆగది వసారాలోనున్నూ తప్ప యెన్నఁడూ వీధియెుహామే

చూడని నన్ను దిక్కుమాలిన శబ్దాలూ, యేవో అర్థాలూ, (అర్థాశ్శబ్దచయా స్సదాహమహమిత్యగేస్ఫురం త్యన్వహం, స్వీకుర్యాం కమివత్యజామి కమివ) వచ్చి బాధిస్తూవుంటాయి. "భజగోవిందా" న్ని సాగనీయవు. అందుచేత యేవో రెండుమాటలు వ్రాస్తూవుంటాను. యేదో చాద స్తంగాను; దయచేసి ఆయీనాభారాన్ని మీరువహిస్తే నేను సుఖంగా "భజగోవింద"కాల క్షేపం చేసుకుంటానని నామనవి. యింతటి అసమర్థస్థితిలో వుండడంవల్ల మిమ్మల్ని పైవిధంగా కోరవలసి వచ్చిందిగాని లేకపోతే నాలుగడుగులు (రైలుప్రయాణానికన్నమాట) మీ సందర్శనానికి వచ్చి మీమీ అభిప్రాయం కనుక్కొని పోయేవాణ్ణి, యింక ఆలాటియోగం యీజన్మకు కలుగుతుం దనుకోవడం సర్వకల్ల కనక వ్రాంతమూలకంగా మీమీ తాత్పర్యం తెలుసు కోవలసివచ్చిందని వినయపూర్వకవిజ్ఞప్తి. (ఇతిప్రసక్తానుప్రసక్తస్యశివమ్.)

అథ ప్రకృత మనుసరామః శ్రీ పోతరాజుగారు పుత్రపరంగా వాడిన కుమారశబ్దపరంపరను యెవ్వరుగాని ఆక్షేపించడానికి అవకాశం లేదని నాకు తేలింది, యెవరేనా దీన్ని కాదంటే అప్పుడు చూచుకుందాం. మఱీన్నీ ఆయన అంత్యనియమంలో వుండే తత్సమ సమాసాలల్లో సంస్కృత వ్యాకరణరీత్యా యెంత విచారించినా సమర్థించడానికి వీలుగాని ప్రయోగాలు కనపడ వనిన్నీ తేలినట్లయింది. అయితే దశమంలోనే "నీవాఁడై తనువాఙ్మనోగతుల నిన్ సేవించు విన్నాణి" అన్నచోట స్థూల దృష్ట్యా "వాఙ్మనసగతులన్" అని వుండవలసి వస్తుందని వొక శంక తోస్తూ వుంది. పోతరాజుగారికి "అచతుర, విచతుర, వాఙ్మనసాక్షిభ్రువ" అనే పెద్దసూత్రంద్వారా వచ్చే నిపాతవిషయం తెలియదనుకుందామా? "సహజపాండిత్యుఁడు" కదా ఆయన: సరే; ఆపక్షంలో "నిర్మలమైవాఙ్మనసామితంబగు, పరబ్రహ్మంబునేఁ జెందెదన్" అన్న ప్రయోగాన్ని యేలా చేయగలుగుతాఁడు? కనక ఆయన సహజపాండిత్యం "లాకలూకాయ" పాండిత్యం కాదనిన్నీ, పాణినీయంకూడా దానిలో చేరిపోయిం దనిన్నీ అనుకోక తప్పదు. "తనువాఙ్మనోగతులు" అన్న ప్రయోగానికి

సమర్థనం యేలాగంటారా? వినండి: అసలులో "నచ శంకా సహోత్త రమ్" యెందుచేతంటే? అనిపాతన 'వాక్చ మనశ్చ' అని అరెండు శబ్దాలకుమాత్రమే సమాసం చేసినప్పుడు ప్రసక్త మౌతుందిగాని అంత కంటే అధికంగా పదంగాని, పదాలుగాని చేరినప్పుడు ప్రసక్తం గాదని భారతప్రయోగాలవల్లనే కాక శాస్త్రమర్యాదవల్లకూడా అవగత మవుతుంది. ప్రస్తుతం "తనుశ్చ, వాక్చ, మనశ్చ" అని విగ్రహం కనుక తనుపద మధికంగా వుందని విశేషజ్ఞులు తెలుసుకుంటారు. ఆయీవిశేషం తెలిసి వుండడంచేతనే "వాఙ్మనః కాయప్రవృత్తితానేక" అని తిక్కన్నగారు వాడి వున్నారు. యిక్కడ విగ్రహం "వాక్చ, మనశ్చ, కాయశ్చ" అనికదా చేసుకోవాలి! యిందాఁకా వెనక "తను శబ్దం చేరి సమాసాం తాన్ని రాకుండా చేసింది; యిప్పుడు చిట్టచివర చేరి 'కాయ' శబ్దం దాన్ని రాకుండా చేసింది. వ్యాకరణం చదువుతామే అనండి, చదివితే మాత్రం యీ వుపాయాలన్నీ గురుముఖతః తెలుసుకోఁబడతాయా? వొకప్పుడు చదివినవాళ్ళూ, చదవనివాళ్ళూ "అవ్వాగుడ్డుం వొకటే అయి నట్లు" కావలసి వస్తుంది. శ్రీచర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారిని శుశ్రూషించి "అఇఉణ్ మొదలుగాఁగ నాభాష్యపర్యంతమున్నూ" అధ్యయనంచేసి "బ్రహ్మ సద్గురువరు పాదసేవన మకుంఠిత సత్కృపమూను నిచ్చె వ్యాకరణము" అంటూ చాటించుకుంటూ సభలలో డీడిక్కులు కొట్టు కొంటూ కాలక్షేపం చేసిన మేము సుమారు 35 సంవత్సరాల ప్రాయంలో స్వయంగా ప్రూపుదిద్దుకొని అచ్చువేసిన దేవీభాగవతం చతుర్థస్కంధంలో యేలా పొరబడ్డామో చూడండి.

క, ప్రతిపదమునఁ దీర్ఘము వి
శ్రుతమగు వాఙ్మనసకాయశుద్ధులకు"

యిక్కడ 'కాయ' శబ్దం అధికంగా వుండడంచేత "వాఙ్మనస" అని కాఁగూడదు. యెవరేనా యీలాంటి స్థలంచూపి అడిగితే "అయ్యా! ప్రమాదంగా ప్రయోగించా" మని నిజాన్ని వప్పుకుంటూ కూడా "స్థితస్య

గతిశ్చింతనీయా" అన్న అభియుక్తోక్తిప్రకారం "వాక్చ మనశ్చ" అని ముందు రెంటికిన్నీ సమాసం చేసుకొని "వాఙ్మనస" అయిన పిమ్మట కాయ శబ్దంతో కలిపి యథాకథంచిత్తుగా సమాధానం చెప్పు కుంటామనే చెప్తానుగాని 'పిడివాదం' చేసేది లేదు. యెవరు ప్రశ్నించినా యీలాటిది వకరూ ప్రశ్నించరు; నిర్దుష్టమైన స్థలాలే ప్రశ్నిస్తారు: చూడండీ "కొండొకమందలించి" అన్నచోట అడుగుతారు; యిక్కడ యెందుకు చెప్పండీ అడగడం? 'కొండొక' అనేదానికి యిక్కడ అర్థం లేదంట! యెందుచేతలేదో? పరిశీలిద్దామూ? "కొండొక కొంచెము; మందలించి" అని అర్థం చెప్పుకోకూడదా? మఱివక అర్థం 'కొండొక' అన్నదానికివుంటే వుండనివ్వండి. అది మనల నేంబాధిస్తుంది? కొంచెము అనే అర్థం "కొండొక" అనేదానికివుందా అని ప్రశ్నిస్తారా? నిఘంటులో వుండే వుంటుంది. యద్వా నిఘంటులో లేదే అనుకుందాం "క. ద్యూత క్రీడకుఁ గొండొక, నేతున్" అన్న విరాటపర్వ ప్రయోగానికి "కొంచెము" అనే అర్థమేనా, యింకో అర్థమేదేనా వుందా? ఆపద్యంలోవున్న 'కొండొక' వ్యస్తమా? సమస్తమా? యీ ప్రయోగాలు భారతన్నిండా వున్నాయి. యేదో అదృష్టం బాగుండి ప్రయోగం సరిగావున్నది దొరికింది కనక సరిపోయింది. అన్నిటికీ ప్రయోగాలు దొరుకుతూనేవుంటాయా? పోత రాజుగారు "మానసించు" ప్రయోగాన్ని అసకృదావృత్తిగా వాడియున్నారు. ఆయనకు మార్గదర్శకుఁడు తిక్కన్నగారు. ఆయన ఉత్తరరామాయణంలో వాడివున్నారు. ఆయనకెవరు మార్గదర్శకు లంటే జవాబు సున్న. శ్రీనాథుఁడు "ఆసిధాత్వర్థ మనుగ్రహించఁ గదవే" అంటూ ప్రయోగించాఁడు. యింకో ప్రయోగాన్ని యీవిధంగా తెలుఁగు కవిత్వంలో చేసినవాణ్ణి చూపవలసిందంటేనో? సమాధానం వస్తుందా? నేను యీయన్ని బట్టియ్యే వెజయంతిలో "అరణ్యాసీరుదిర్ తుల్యమై" అని మఱికొంత సాహసం చూపుతూ ప్రయోగించాను. అన్నిటికీ ప్రయోగాలూ దొరకవు; అన్నిటికీ లేకాపోవు. అల్లంరాజు సుబ్రహ్మణ్యకవిగారు యేదో అపురూపమైన ఓష

ధిలాగ ఆముక్తమాల్యదలో వున్న "వేరువెల్లఁకి" అనేపదాన్ని జాగ్రత్త చేసి వుంచుకొని మాడభూషివారిని 'ఇఁక' అనేపదం ప్రాసలో పెట్టి కందం చెప్పవలసిందని అవధానంలో ప్రశ్నించారు. ఆయన తక్కినపదాలు నిరర్థబిందుకాలే పెట్టి పద్యాన్ని పూరించారు. సార్థబిందుకాలుగానే చెప్ప వలసిందని నేను కోరుతూ వున్నానన్నారు, అల్లంరాజువారు. దీన్నిగురించిన ప్రవాద యేలా వుందంటే "ఇఁకఁ బదినూ ల్లొసంగెదను నిందుకుఁ బద్య ము చెప్పనక్కపీ" అని యెవరో పండితుఁడైన రాజుగారు ప్రశ్నించి నట్టున్నూ, తక్కిన పదాలు మూఁడున్నూ హ్రస్వంమీఁద వున్నవి సంపా దించడం దుర్ఘటమనే హేతువుచేత "ఇఁకఁ బదివే లొసంగెదను నిందుకుఁ బద్యములేదు భూవరా !" అని సమాధానం చెప్పినట్టున్నూ వినికి. దీన్ని బట్టి ఆచార్లవారు నిరర్థబిందుకాలతోడనే పద్యం చెప్పివున్నారు. వారికి తిక్కన్నగారి "ఎసఁగు" పదఘటిత పద్యం ఆధారంగా వుందని లోఁగడ వ్రాసిన దానివల్ల విస్పష్టమే. సుబ్రహ్మణ్యకవిగారివద్ద ఆపోషధి 'వేరువె ల్లఁకి' వుంది కనక "క. ఇఁక విను నీయశమునకుఁ దఙలఁకి" అని ప్రారంభించి ద్వితీయచరణాంతమందు దాఁచి వుంచిన "వేరువెల్లఁకి గాని" అనే ఓషధిని అతికి పద్యం పూర్తిచేశారు. దీనివల్ల ఆచార్లవారి పాండిత్యంకంటె సుబ్రహ్మణ్యం కవిగారి పాండిత్యం యెక్కువదని యెవ రేనా అనుకుంటారా? ఆచార్లగారు చతుస్తంత్రనిష్ణాతులు, నిరంకుశకవులు, అపరపండితరాయలునుగదా ! చెప్పొచ్చేదేమిటంటే అన్నింటికీ ప్రయో గాలు దొరకాదొరకవనియ్యేవే ! ప్రస్తుతం దొరికింది సరే, "కృతా ర్థోఽహం." తిక్కన్నగారి పద్యంలో 'నేర్చు' ధాతువునకు ఉత్తమపురుష ప్రయోగం "నేతున్" అన్నది దొరికింది. అస్మదాదులకు దాన్ని మట్టుకు మాత్రమేనా ప్రయోగించుకోవడానికి యింకా అధికానికి అధికారం వుందా అని వకశంక. అది యేకవచనంలోవుంది. బహువచనంలో "నేతు ము" అని కావాలి. అదికూడా ఆయన యెక్కడేనా వాడితే సంతోషమే. వాడకపోతే గతేమిటి ? యిది యీలా వుంచండి. యింకోశంక "నేర్చు"

ధాతువుకు ఉత్తమపురుషలో తద్ధర్మైకవచనం "నేర్తున్" "నేతున్" అని రెండురూపాలు నిష్పన్నం అయినాయి. ఆలాటిదే "కూర్చు" ధాతువున్నూ. పేర్చు, ఆర్చు, మార్చు, తార్చు యీలాటి సజాతీయాలు చాలావున్నాయి కదా, వీటికన్నిటికీ క్రమంగా కూతున్, పేతున్, ఆతున్, మాతున్, తాతున్, అనేరూపాలు నేను చేస్తాను, వప్పుకుంటావా అంటూ చేసేవాడాన్ని యేమనవలసివుంటుంది? యిదే పిడివాదం. నిన్నమొన్న నే శ్రీకాశీ కృష్ణాచార్యులవారు "మాతృభాష" అనే పేరుతో వక పత్రికను ప్రారంభించారు. దానిలో "గురుశిష్య సంవాదం" అంటూ మతవిషయకమైన సందర్భాన్ని గూర్చి కొన్ని పుటలు ప్రచురించారు. సారాంశం యేం తేల్చారంటే, యేవిషయంగాని "అకటావికటం" గా ప్రసంగించేవారితో ప్రసంగించడంకంటె "వయం మౌనవ్రతాలంబినః" అని వూరుకోవడమే సుఖం! కొందఱికి సత్యా సత్యాలతో బొత్తిగా అగత్యం వుండదు. యేలాగో తమఱన్నమాట నిలుపుకోవడమే వారికి కావలసింది. మొట్టమొదట తొందరపడి అనాలోచితంగా ఆక్షేపణలు చేయకుండా జాగ్రత్తపడితే తప్ప ఆకోరిక నెఱవేఱడం దుర్ఘటం. అది అట్లుండనిద్దాం. పోతరాజుగారి "మానసించు" ప్రయోగాన్ని అనుసరించి మహానసశబ్దంమీద, "మహానసించు" చేస్తామంటే చేయండి "యెవరు వద్దంటారు?" అనేదే జవాబు. యిఁక వకదాన్నిగూర్చి మాట్లాడుకుందాం: సంజ్ఞావాచకాలు యేభాషలోవేనాసరే! సంస్కృతభాషతో సమసిస్తాయి

(1) తిరుమలేంద్రశ్రీమహారాయనిన్

(2) నాయఁడమాహ్వయు

(3) మందపాట్యన్వయు

(4) కవిగండరగండఁడు

ప్రాచీనులవీ నవీనులవీ యీలాటి ప్రయోగాలు కుప్పతెప్పలు. "బొబ్బిలి" అనేది వక గ్రామానికి సంజ్ఞ. అట్టి "బొబ్బిలి" "ఏత" శ్బదంతో సమాసాన్ని పొంద దనేవా రుంటారని నే ననుకోను. దాన్నిబట్టి

"ఏతన్నేయి, ఏతన్ముానె, ఏతచ్చేంబు, ఏతచ్చేఁదుడుత్రాడు" అనవచ్చునా అని ప్రశ్నించడాన్నిగూర్చి యేం వ్రాయాలో ప్రశ్నింపఁబడ్డవారికేగాని నాకు అధికారంలేదు. వారు నాకన్న వయస్సుచేతేకాదు విద్యాదులచేతఁ గూడ చాలా పెద్దలు. "నిమ్మకు నీరెత్తినట్లు" గా తూష్ణీంభావాన్ని వహించారు. వారికి పదివేల నమస్కారాలు. నాకుకూడా అట్టి తూష్ణీంభావాన్ని అనుగ్రహించవలసిందని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ మొట్టమొదట నడుస్తూవున్న "వాఙ్మనస" ప్రయోగందగ్గఱికి మళ్ళా సింహావలోకనం చేసి వ్రాయవలసినవిషయం కొంత వ్రాస్తాను. గతంలో చూపిన ప్రయోగ ద్వయాన్నీపట్టీ చూస్తే పోతరాజుగారికి ఆ ప్రయోగాన్నిగూర్చి బాగా తెలుసునని అందఱూ వప్పుకోక తప్పదు. యింకోచోట "తనువాఙ్మనముల్" అని వున్నప్రయోగంకూడా సమాహితమేకదా లోఁగడఁజూపిన చర్చచేత. వెనక వీటైనంతలో కవి శ్రవణసుఖాన్ని చూచుకొని ప్రయోగం చేయడం ఆవశ్యక మని వ్రాసివున్నాను. ఆలాగు చెప్పిన కవిత్వమే లోకానికి పండితపామర సాధారణ్యంగా రుచిస్తుం దనేమాటను కాదనేవా రుండరు. కాని ఆ నియమం వచనకవిత్వం చెప్పేవారికి సంపూర్ణంగా నెఱవేఱుతుందేమో కాని గణబద్ధమైన కవిత్వం చెప్పేవారికి అక్కడక్కడ కొంచెం కక్కూర్తి పడవలసి వస్తూ వుంటుంది.

"ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె" "కారాగృహ" మన్నంత శ్రవణసుఖం "కారయిల్లు" అంటే వుంటుందా? యీమాట "కారాకిల్లీ" లాగు కారంగానే వుంటుంది చెవికి. కారశబ్దము నానార్థకము. సంస్కృతం. సమాసం యింటిపదంతో కలిసి సమాసం రావడానికి వ్యాకర్తల సమ్మతి వుంది; వస్తుంది. వస్తేమాత్రం రుచిగా వుండొద్దూ? వుందా? లేదు. పోతన్నగారికంటే రుచి మనకు తెలుసునా? తెలియకపోవచ్చును గాని ఆక్షేపించడానికి అభ్యంతర మేముంటుంది? పోతన్నగారు ప్రస్తుతం పాచకస్థానాపన్నులు, మనం భోక్తలం. ఉప్పో

కారమో, హెచ్చో తగ్గో పడ్డదంటూ అనడానికి మనకు పూర్తిగా అధికారం వుంది. ఆయనకో? మన్నిమాత్రిం "నీవింతకన్న బాగా చెపుతావా?" అనే అధికారం లేదు. అందుకే పక కవి "ప్రిబంధము నా జలరాశి" అన్నాఁడు. యీలాటి నీహారలేశాలు కాళిదాసాదులలో వకటీ రెండూ కాదు చాలా చూపవచ్చును. పోతన్నగారు యేలాటి రసవత్కవో, తిక్కన్న గారున్నూ యించుమించు ఆలాటి రసవత్కవేగదా! "వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్" అని ప్రియోగించారుగదా? ఇది "క్వచిద్గకారోవః" అనేశాస్త్రిన్నిబట్టి యెంత సాధువని సరిపెట్టుకున్నప్పంటికీ ఆసూత్రంవల్ల నిష్పన్నాలయేటటువంటి మడుగు - మడువు, పండుగు - పండువు అన్న ప్రియోగాలవలె శ్రివణ సుఖంగా "అలిగెన్ - అలివెన్" అన్నది కనపడుతూవుందా? అంతదాఁకా యెందుకు? యీ భూతార్థకప్రిథమ పురుష ఆయన ప్రియోగించారా - తక్కినపురుషలలో మనం ప్రియోగించుకుందా మంటే! మళ్ళా పుస్తకాపేక్షే, మఱిన్నీ హ్రిస్వపూర్వకమైన గకారానికి వకారం చేస్తే పండువు వగైరా రూపాంతరం సిద్ధించి బాగా వున్నట్టు కనపడిందా? దీర్ఘపూర్వానికి చేసి చూదామా? యేలావుంటుందో? బాగు - బావు, లాగు (ప్రకారం) లావు, సాఁగు - సావు (అఱసున్న లేచిపోవలసికూడా వస్తుంది), రేఁగు - రేవు (అఱసున్న డిటో) యివి బాగా వున్నాయా? అయితే దీర్ఘపూర్వాలకెక్కడా బాగుండదందామా? అది వల్లకాదు. పోఁగు - పోఁవు (రాశిఅన్నమాట.) ఆ యీ వగైరాలు కొన్ని బాగానే వుంటాయి. యీ బాగోగులు తెలుసుకోవడం యేలాగ? "ప్రియోగస్తత్రి కారణమ్" కనక ప్రియోగద్వారాగా అనవలసి వస్తుంది. ఆప్రియోగానికి ఆధార మేమిటో? లోకవ్యవహారమే అనకతప్పదు. ఆపద్ధతిని యీ పోతరాజుగారి "కారయిల్లు" కుఁగాని తిక్కన్నగారి "అలివెన్" ప్రియోగానికిఁగాని లోకం శరణ్యమవుతుందా? కాదనేనా సహృదయమాత్రుఁడు చెప్పవలసిన జవాబు, మఱేమేనా వుందా?

యింక యీ విచారణాన్ని ఆఁపి మఱివకటి యెత్తుకుందాం. పోతన్న గారు సహజపాండిత్యులే అయినా పాణినీయ వ్యాకరణవేత్తలకు లేశమూ దొరకరని లోఁగడ వ్రాసివున్నాంగదా! యీవాక్యం సమర్థనీయమే అవుతుందా యెక్కడేనా వ్యభిచరిస్తుందా? కొంత విచారిద్దాం.

"....శాటికాకచా, కరషణముత్ నఖక్రియలు" యీ ప్రయోగం దశమంలో ఉత్తరభాగంలోది. రేఫప్రాసతో మొదలుపెట్టిన చంపకమాలలో వుంది. దిద్దడానికి వీలివ్వక సంస్కర్తలెవ్వరూ యిప్పటికీ మాఱు దక్కించుకున్నట్టు లేదు "కర్షణం, ధర్షణం, మర్షణం, ఘర్షణం యీ ప్రయోగాలన్నీ సర్వసామాన్యంగా అంటూ రేఫషకార[illegible] [illegible] గతి యెఱుఁగిందే. యీ స్వల్పవిషయంలో పోతరాజుగారికి [illegible] కల్పించడం యుక్తమని నాకు తోఁచదు. సమర్థించడానికి మార్గమున్నట్టు కనపడదు. కాని ముగ్ధబోధ అనే వ్యాకరణంలో యీ 'కరషణా'న్ని కాక 'సరషప' (ఆవగింజలు) శబ్దానికికూడా సమర్థనం వున్నట్టు గిడుగు వారు వారి "బాలకవిశరణ్యం" లో వ్రాసివున్నారు. [illegible] సామాన్యమైనది కాదు. దాన్నే నేను విశ్వసిస్తున్నాను. దీన్ని [illegible] కరం అసలు యెత్తుకోనే లేదు. యేదేనా సంస్కృతనిఘంటువులో వుంటే ఆయన వుపేక్షించేవారు కారని నేను దీనికోసం వాచస్పత్యం వగయిరాలు పరిశీలించ లేదు. వ్యాకరణాంతరంచేత సాధువు అనేమాటనే విశ్వసిస్తూన్నాను. అపాణినీయమన్నంతలో అది అపశబ్ద [illegible] "పునీత" శబ్దం* వకటి అపశబ్దం కావలసి వస్తుంది. "పునీతా [illegible]

* "శ్లో. పక్షీంద్రవాహన తపోజలసాధనీయ
సర్వేశ్వరోల్లసితవాహన లాల్యమాన?
కాపాలిరూపసముపేత పునీత దృష్టే
శ్రీవజ్రశృంగ వృషభాధిపతే నమస్తే."

(పాల్కురికి సోమనాథుఁడు)

పదై స్తవ" అని శ్రీమద్భాగవతంలో వుంది. ఆర్ష మనుకుందామా? వల్లకాదు. వ్యాఖ్యాత అలా వ్రాయలేదు. "పునీతా=పవిత్రీకృతా" అని అర్థం వ్రాసి వూరుకున్నాఁడు. అక్కడక్కడ ఆర్షమైనప్పుడు వ్రాయడం ఆచారం. శ. ర. ని. లో యీ పదాన్ని యెత్తుకుని "సం-వి". అని వ్రాసినాఁడు. యేదేనా కోశంలో చూచాఁడేమో? దీన్ని వ్రాసినప్పుడు కరషణ పదాన్నినీ వ్రాయవలసిందే కాని ఆయన వదలిన వింకా యెన్నో వున్నాయి "నహి సర్వ స్సర్వం విజానాతి" కదా! యివిరెండున్నూ వ్యాకరణాంతరంచేత సాధు కావలసినవే! వీటితో పాటుదే "కాలీన" అనేదిన్నీ. దీన్నిగూర్చి అన్యత్ర వ్రాసేవున్నాను. విద్యారణ్యం మొదలు కొని దండికృత దశకుమార చరిత్రదాఁకా యీపదప్రయోగం లేని గ్రంథాలే కనపడవు. దీనికోసం వాదించడం వృథాకంఠశోష అని వ్రాయనక్కఱలేదు. తార్కికులని గొంతుక పిసుకుతామని భయపెట్టినా కాలీన పదాన్ని ప్రయోగించడం మానరు. చాలా వ్యాకరణాలు పుట్టినతరవాత పాణినీయం వాట్లనన్నిటిని క్రోడీకరిస్తూ పుట్టింది. కాని యెక్కడేనా వొకపదానికి సంబంధించిన సమర్థనం దానివల్ల కాకపోయినంతమాత్రంచేత ఆయన సర్వజ్ఞుఁడు కాకపోతాఁడా? అయితే వార్తికకారుని సవరణ లెందుకు, భాష్యకారుని సర్వాధికారా లెందుకు? అందుచేత మహాకవి ప్రయోగాయాథాలుగా వున్న పైమూఁడుశబ్దాలున్నూ వ్యాకరణాంతరంచేత సమర్థనీయాలని ప్రాజ్ఞులు విశ్వసిస్తారని నానమ్మకం. యిందులో "పునీత" శబ్దం అసకృదావృత్తిగా ప్రయోగించుకొనే వున్నారు పూర్వపక్షకర్తలు. పోతన్నగారి కవితాభాగంలో లేదుగాని పునీతపదం ఉత్పన్నభాగాలు పూరించినవారి కవిత్వంలో భాగవతంలో అసకృదావృత్తిగా ప్రయోగింపఁబడివుంది, క్షమాపణశబ్ద ప్రయోగమున్నూ వుంది. దీన్నిగూర్చి లోఁగడ కొంచెం స్పృశించడం జరిగింది. యీలా యెంతో నిదానంగా అలోచించుకోవాలి గాని ప్రాచీనులనేకాదు నవీనులనేకాదు దుడుంగున ఆక్షేపిస్తే అవి దుడదుడ మానసికశల్యాలుగా మానసంతులను పరిణమించి నానామార్గాలకి లాగడానికి కారణమవుతుంది.

సరే! మతోప్రయోగాన్ని విచారిద్దాం. "మ.............అం, బర ప్రగ్వేణు విషాణ భూషణ" అంటూ మత్తేభంలో వుంది రేఫద్విత్వానికి పూర్వం వున్నది వైకల్పికగురుత్వాన్ని పొందడాన్ని గుర్తించికూడా సందేహించేవారంటూ వుంటారా అనుకోవద్దు. వుంటారా, యేమిటి? వున్నారు. వున్నారా అంటే వుండడమే కాదు - మృచ్ఛకటిక దగ్గరనుంచి ("దారిద్ర్యాద్ధ్రియమేతి హ్రీపరిగతః" చూ) మహాభారతం దగ్గరనుంచి దాక యేమిటి యెందరు మహాకవులను లక్ష్యముగా చూపినా "నేఁబట్టిన కుందేటికి మూఁడేకా" ళ్ళనేవారుకూడా వున్నారు. పరబాలకవి బయలుదేరినాఁడు. అతఁడు యెవరో యీ రేఫద్విత్వపూర్వలఘుత్వం ప్రయోగిస్తే రిమార్కు వ్రాస్తూ (ప్రతివారి వ్రాఁతమీఁదా యేవో నాలుగుమాటలు వ్రాయడం పద్ధతి పకటి బయలుదేరింది. దాన్ని చాలామంది అభినందిస్తున్నారు. నాకు మాత్రం అది నచ్చింది కాదు. తత్తథాస్తాం) ప్రయోగాలైతే వున్నాయి గాని వున్నా వైరళ్యంగా వున్నాయంటూ వ్రాసి "ప్రయోగించడం అంత మేలుకా"దని రాఁబోలును వ్రాశాఁడు. అతఁడింకా కాఁదగ్గవాఁడు. యెన్ని ప్రయోగాలు వుండాలో, యెందరుకవులు ప్రయోగిస్తే అప్రయోగానికి ప్రయోగార్హత కలుగుతుందో అని నేనాశ్చర్యపడ్డాను. యీ భాగవతంలోనే అసకృదావృత్తిగా వున్నాయి. పకటి యివ్వడమైందా? యింకోటి — "....ని,ష్కారణ ప్రేమతోడ నలకంసునిఁబోలు" యింకా చూపాలా? పిడివాద ప్రవీణులకు యెన్నిచూపినా సంతుష్టి (లోపల కలిగినా పైకి) కలగదు తత్తథాస్తాం.

ఇక్కడవ్రాయవలసిన విశేషాంశాలు కొన్ని వున్నాయి. యేమిటంటే? సమాసములోనున్నా, విడివిడిగానున్నాకూడా యీలఘుత్వాన్ని ఆమోదించవచ్చును గాని ఒకటేపదంలో మాత్రం దీన్ని (శత్రు. మిత్ర, కళత్ర ఇత్యాదు లన్నమాట) అంగీకరించినట్లు ఆయా ప్రయోగాల ధోరణివల్ల బోధించదు. అయితే మేము అలాకూడా వాడతామని ప్రతివాదులు వాదానికి వుపక్రమిస్తేనో? అలాటివి లేవు కనుకనున్నా. బొత్తిగా

శుశ్రితికటువుగా వుంటుంది కనుకనున్నూ వాడవద్దని చెప్పడమే కర్తవ్యం. అప్పటికీ వినకపోతేనో? మీచిత్తం కానివ్వండి అనడమే. "ప్రయోగ స్తత్రకారణమ్" అని అసకృదావృత్తిగా అహోబలపండితాది శాస్త్రలు మొదలుపెట్టడానికి కారణం తెలుసుకోవాలి. మళ్లా ప్రతిదానికీ "పిడుక్కూ బియ్యానికీ" అన్నట్టు ఆలా ప్రయోగమే వుండాలంటూ వాదించరాదు. దీని కెన్నికర్మాలున్నాయి? "శాస్త్రం బలవ దుచ్యతే" అంటూ దాన్ని గూర్చిన్నీ వ్రాయఁబడి వుంది. మీమాంసలో "శ్రుతిస్మృత్యో ర్విరోధే శ్రుతి ర్బలీయసీ" అన్న సందర్భం యేలాటిదో, ఈశాస్త్రప్రయోగాల బలాబలాల సందర్భమున్నూ ఆలాంటిదే. చాలాపఱకు "శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్" అన్నట్లే శాస్త్రప్రయోగా లుభయమున్నూ సామరస్యంగానే నడుస్తాయి. యెక్కడో వీటి రెండిటికిన్ని వాట్లకులాగే వైలక్షణ్యం (భేదభావం) కలుగుతుంది. అక్కడనే వ్యాఖ్యాతల తెలివితేటలు వుపయోగపడాలి. శ్లో. "ఏకాదశ్యా మహోరాత్రం కర్తవ్యం భోజనద్వయమ్" అన్నమాదిరి శ్లోకాలు అన్వయించినట్లే శాస్త్రసమన్వయమున్నూ ఒక్కొక్కచోట స్వరసత్వం అవగతం చేసుకోవలసి వచ్చింది. అలం మతివిస్తరేణ. చూడండి "అంతుం బొంతు" అనే ప్రయోగం వుందనుకోండి. దీని సాధుత్వానికి ప్రయోగం వుండాలా? అక్కఱలేదు. యెందుచేత? శాస్త్రమే వుంది కనక. కింతచ్ఛాస్త్రమ్? "లోకోక్తీనాం భవేద్యోగో యథావచ్ఛ్రితి రంజనమ్" అన్న అథర్వణకారిక. అహోబలుఁడు దీనికిచ్చిన వుదాహరణ "అయోలక్క ఇత్యాదయః" అనేకదా: "అయో + ఓలి + అక్క ఈ త్రితయసంపుటిలో మొదటిదానికి ఓకారసంధి కావాలి. రెండోదానికి ఇకారసంధి కావాలి. యీరెండిటిలో రెండోది యేలాగో సాధిస్తాంగాని మొదటిది సాధించేది యెలాగా? అందుచేతనే "యథావత్" అన్నాఁడు శాస్త్రకర్త. యిఁక పోతరాజు అసకృదావృత్తిగా వాడిన "సర్వము న్నతని దివ్యకళామయ మంచున్" అన్న నకారద్విత్వ ప్రయోగాలని గూర్చి విచారిద్దాం. యీ ప్రయోగానికి శాస్త్రం అనుకూలించకపోయినా

నన్నయ్యగారిప్రవృత్తి పూర్తిగా అంగీకరిస్తూ వుంది కనక పోతరాజుగారు ప్రయోగించుకున్నారు పాపం! "చెట్టెక్కించి నిచ్చెన తీసివేసినట్టు" ఆ ప్రయోగాన్ని దిద్దివేసి సంస్కర్తలుమాట దక్కించుకోవడంచేత ప్రతివారున్నూ పోతరాజుగారిని రిమార్కుచేస్తూ వున్నారు. ఆ ప్రయోగం "వృత్తి కిన్నరుదుగ" అనేది. దాని దిద్దుబాటు కొన్ని ప్రతులలో "వృత్తికై అరుదుగ" అనిన్నీ, కొన్నిటిలో "వృత్తి కిష్టరుదుగ" అనిన్నీ కనపడుతూవుంది. యిప్పటిప్రతులలో దీనిశిఖా కోసిన ప్రయోగం పోతేపోయింది. పోతరాజుగారిని తరింపఁజేయడానికి యిది అక్కడే లేదుగదా! "విలసత్కావ ఘనపల్లి యన్నిష్టసఖినూఁది యున్న" అనే ప్రయోగాన్ని కొందరు వ్యాకర్తలు "అన్ + ఇష్ట" అని విడఁదీయక "అన్న + ఇష్ట" అని విడఁదీసి నకార ద్విత్వం అక్కడ సంధిసంబంధం కానేరాదని సంతుష్టిపడ్డారు. దీన్ని గురించే విస్తరించి వ్రాయవలసివుంది. నన్నయ్యగారు అను ధాతువులో వుండే ఉకారానికి లోపంచేసి "అన్" అనేదాన్ని తెలుగుగా ప్రయోగిస్తూ వుంటారు. "గిరివ్రజమన్ పురంబు" వగయిరాలు శతశః సహస్రశః యిట్టివి వున్నాయి, చూచుకోండి. ఆ లోపంచేసిన రూపం క్త్వార్థరూపం గాని భూతార్థకరూపం కాదు. ఆయాస్థలాలలో కాలవిశేషద్యోతకమైన భూతార్థకరూపం "అన్న" అనేది ప్రయోగించవలసిన ఆవశ్యకత లేదు. వ్యావహారికంలో "సుబ్బయ్య అనేవాఁడు, వెంకయ్య అనేవాఁడు" అనే ప్రయోగాలు "అనువాఁడు" అనేదానికి గ్రామ్యాలుగాని అన్నవాఁడు అను కాలవిశేషద్యోతక ప్రయోగ గ్రామ్యాలు కావని విజ్ఞులు, సహృదయులు గుర్తిస్తారు: యింకా వివరిస్తాను, త్యాగయ్యగారి "జగమేలే పరమాత్మ" ప్రయోగాన్ని సవరించి పాడవలసివస్తే, "జగమేలెడి పరమాత్మ" అని దిద్దుతారుగాని 'జగమేలిన' అని దిద్దరు. అలా దిద్దితే పూర్వం ఏలినప్పటికీ యిటీవల యేలుట లేదనే అర్థం రావలసివస్తుంది. అందుచేత "అన్న + ఇష్టసఖి" అని విడదీయడం సహృదయసమ్మతం కాదు. ఆ ప్రకృతిని "అన్ + ఇష్ట" అని వుండఁగా నన్నయ్యగారు స్వీకరించరనడం 'వాదు'

అన్నదానికి విరుద్ధంగా, శ్రవణసుఖాన్ని అనుసరించి "అన్నిష్టసఖి" అని ప్రయోగించివున్నారన్నది వొప్పుకోక తప్పదు. "అన్ + ఇష్టసఖి" అన్న చోట "నాఽచి" అన్న నిషేధం వుండడంచేత ద్విత్వం చేయకూడదు కనక "చేసెన్ + అతఁడు చేసెనతఁడు" అన్నమాదిరిగా "అజ్భిన్నంపరేణ సంయోజ్యం" అనే మర్యాదనుబట్టి (అనుక్తమన్యతో గ్రాహ్యంకదా!) "ఇష్టసఖి" తో కలిపితే యేమవుతుందో పరిశీలించండి సహృదయులు? 'అనిష్టసఖి' అనే అనిష్టరూపమేనా ప్రసక్తమవుతుంది. అట్టి "అనిష్ట సఖి" అనే అనిష్టరూపం మీకు అనిష్టమా, యిష్టమా? అని నేనడుగుతాను శాస్త్రసమ్మతమే అయినా "అనిష్టసఖి" అనిష్టమే. అని "అనిష్టసఖి" నిష్టమైన అనిష్టశబ్దమే చెపుతూవుందేమో కూడా. యిది వుత్ప్రేక్షేనా? అప్రసిద్ధంగాక సుప్రసిద్ధం కావలసి వచ్చింది యిక్కడ. యిట్టికల్పన మా కాశీసహస్రంలో వొకశ్లోకంలో వుంది. అప్రస్తుతమే అయినా యేపరదేవ తోపాసన యీ విశేషాన్ని స్ఫురింపఁ జేసిందో ఆపరదేవతానేత్రవర్ణనకు సంబంధించిన ఆ శ్లోకాన్ని యిక్కడ వుదాహరించి మఱీ ప్రస్తుతం అందుకుంటా.

శ్లో. పద్మం నయోగ్యవస్తు స్యాదేవాత్మోప మిత్యవస్థాయామ్,
    ఇత్యేవ మద్రిజాతే! కంఠరవేణాంబ! వక్తి నేత్రింతే.

యీ శ్లోకంలో వున్న "నేత్రిం" అనేపదాన్ని "న + రఃత్రిం" అని విడదీసికొని. ఈఃం = లక్ష్మీం తాృయతే" అనే వ్యుత్పత్తిద్వారా ఈఃత్రిశబ్దానికి పద్మం అని అర్థం చెప్పుకొని "ఈఃత్రిం = పద్మం. న = (యోగ్యం) కాదు" అని సమన్వయించుకోవాలి. యిది తి. వెం. కవుల కవిత్వం "గొల్లలకూ గొడ్లకాపరులకూ అన్వయించే" తెగలోది కాదు కనక సమన్వయం చూపవలసి వచ్చింది. ప్రస్తుతం "అనిష్టసఖి" అనిష్ట సఖే అయింది కనక "అన్నిష్టసఖి" రూపమే ఆచార్యునికి యిష్టమనిన్నీ, ఆపద్ధతిని "తానొక కట్టుచేసి యదిదాఁ బెసునన్నయకొన్ని చోట్ల" అన్న తి. వెం. కవుల సిద్ధాంతం వొప్పక తీరదనిన్నీ అనుకోక తప్పదు. ప్రతి

శాస్త్రకర్తకున్నూ కొద్దో గొప్పో యిట్టి స్వవచనవ్యాఘాతాలు వుంటూనే వుంటాయని విజ్ఞు లెఱుఁగుదురు. అట్టిస్థలాలలో "ప్రౌఢోక్తిభాష్యం" అంటూ భాష్యకారోక్తుల విషయంలో వ్యాఖ్యాతలు వ్రాయడం ఆచారం. యిట్టి వ్యాఘాతాలను బట్టియ్యేవే పెద్దలు "అబ్బాయీ! మేం చెప్పినట్టు చేయండి గాని చేసినట్టు చేయకండి" అని "స్పెషల్" గా శాసిస్తూ వచ్చారు. "భ్రాంతేః పురుషధర్మత్వా త్క్వచిదాచి దస్మాభిరపి భ్రాన్తివశా దకార్యం కర్మకృతం స్యాత్, తన్న యుష్మాభి రనుసర్తవ్య మిత్యభి యుక్తోక్తిః" అయితే ప్రస్తుతం నన్నయ్యగారి ప్రయోగం అనఁగా "అన్నిష్ట సఖి" ప్రయోగం భ్రాంతిమూలకమా? కాదు. న్యాయంగా "అన్ + ఇష్టసఖి" అనేది కల్పితే "అన్నిష్టసఖి" అనేకావడం న్యాయసంగమం గాని "అనిష్టసఖి" అని కావడం న్యాయసంగమం కాదు; కానేకాదు. ఆ హేతువు చేత నన్నయ్యగారి దివ్యవాణి అలాగు (అన్నిష్టసఖి) గా ప్రసరించినది. అయితే "సూత్రనిషేధం గతేమవుతుంది? అంటే ఆయీ ఆపాదప్రయోగంవల్ల సూత్రప్రవృత్తికి అనిత్యత్వం జ్ఞాపిత మవుతుంది. దీన్ని వైయాకరణులు విశ్వసిస్తారు. ఆంధ్రవ్యాకరణానికి వ్యాఖ్య వ్రాస్తూ అహోబలుఁడు యిట్టి మర్యాదను యెన్నోచోట్ల అనుసరించి వున్నాఁడు- తిలకించండి. తుదకు ఆయీసంధి పాణినీయంలోవున్న "ఙమోహ్రస్వాదచి" అనే సంధి వంటిదిగా పరిణమిస్తుందని. సర్వం శివమ్. పోతరాజుగారు అనర్గళా వృత్తిగా వాడిన యీ నకారద్విత్వసంధి భారతకవులలో మొదటివాఁడైన నన్నయ్యగారికే సమ్మతమని ఫలితార్థం. కాని శ్రవణసుఖాన్ని అనుసరించి వాడుకోవలసి వుంటుంది నన్నయ్యగారి ప్రయోగం. "అన్నిష్టసఖి" శ్రవణ సుఖాన్ని అతిక్రమించడం లేదు. పైఁగా "అనిష్టసఖి" అని చదివేనే బగ్గంపాటు (ప్రస్తుతార్థమందేసుఁడీ) గా వుంటుంది కాఁబట్టి యీలాటి చోట్లనే యీసంధికి అభ్యనుజ్ఞ అన్న కల్పన యుక్తమేకాని ఆనియమం పద్యకవులకు యేకొంచెమో సాఁగినా తుట్టతుదవాఁరా సాఁగదని తిక్కన్న గారి "వినుము నరేంద్ర విప్రుఁ డలిపెన్" ప్రయోగం వ్యగ్గ్రలు వ్యాఖ్యా

నించఁబడ్డది కనక ఇక్కడ వ్యాఖ్యానించనక్కఱలేదు. నన్నయ్యగారి "వృత్తికిన్నరుదుగ" అనే ప్రయోగం యేమంత శ్రవణసుఖాన్ని కలిగిస్తూవుంది? పోతన్నగారి నకారద్విత్వప్రయోగా లన్నీ నన్నయ్యగారి "వృత్తికిన్నరుదుగ" ప్రయోగాలవంటివే కాని "అన్నిష్టసఖి" వంటివి కావని నేనున్నూ వప్పుకుంటాను. నన్నయ్యగారు కొలఁదిచోట్లనే వాడి వున్నారు; పోతన్నగారు పలుచోట్లవాడి వున్నారు: ఏతావానేవ భేదః, అవసరమైతే బ్రతికి బాగా వుంటే మళ్ళా వ్రాస్తాను. దీన్నిగుఱించి యిక్కడికే చాలా వ్రాసినట్టయింది. యిప్పుడు మఱివొక టందుకుంటాను.

యింత కష్టించి శాస్త్రమర్యాదనున్నూ, ప్రయోగమర్యాదనున్నూ బట్టి దైవముఖాన్ని చూచి నేను (యితరులమాట యేలాగైనా) మాశిష్యప్రశిష్యకోటికి తెలిసీతెలియనివారి శంకలవల్ల భ్రాంతి కలుగుతుందేమో అని కష్టించి వ్రాసే చర్చను సుళువుగా "పాడుకూఁతలు" అని అపవదించడమే కాకుండా వ్యక్తిగతంగా నన్ను — (1) కారులు ప్రేలుచుందునని యు (2) ద్రోహియనియు (3) పాపభాజి యనియు (4) (లోకులు) ఇట్టి వ్రాల్ తు-తు-తు తుతూ యందు రనియు (5) కింకవి.... వెంకన యనియు (6) దంభవాక్యోల్లాసంబు లనియు (7) ఏఁడొ వాపోయినాఁ (యేడిచినాఁ) డనియు (8) గర్వపడి కన్గానం డనియు (9) మొగమున్ వాఁయగ వేయుఁడీ! యనియు (10) సిగ్గు లేనివాఁ డనియు (11) బుడబుడక్కలబుడిగెయ్య యనియు (12) నాకో (వెం. శా. కన్నమాట) బేపిని (కుక్కని) బగుమానం చేసేరనియు (13) రాసు (రాజు)గారు మదురుగోడెక్కించి (గజారోహణోత్సవాని కొచ్చిన పాట్లివి) వూరేగించా రనియు (14) పొగ రెక్కినవాఁడనియు (15) పుచ్చుపద్దెములనియు (16) సిగ్గు లేదా అనియు (17) వీనికవిత్వ మెంత వెలిఁగిపోవుచుండునో యనియు (18) దంభాలరాయఁడనియు యింకా యేమేమో వషట్కారాలతో ఆశీర్వచించడమేకాకుండా అంతతో తృప్తిపడక (సిగ్గుపిగ్గు) యేమని వ్రాసుకొనేది? అయితే యేమి పెద్దల వాక్కులుగదా: (1) అస్పృశ్యానం (శ్లేష

వుందికాబోలును) (2) ఖరమూత్రం (యింపులో శ్లేషలేదేమో) అంటూ కూడా బహూకరించి, నాసమాధానములు యుక్తియుక్తములని (తెలుసో తెలియకో అనుసందాం) అభినందించినవారిని (1) సిగ్గుండయున్ లేక యొప్పికొని అనియు (2) చిరజీవి (శాకి-యోగాభ్యాసి బలియసీ) మై యనియుండు-ండు,ము,ండు (అసకృదావృత్తిగా యేకవచనంతో) అనియు. వాకపేమిటి, యేదోకలమాడి నట్లల్లా వ్రాసేస్తున్నారు. కాబట్టి నాసిద్ధాంతాలను అభినందించేవారు ముందుగా రాబోయే పరిణామాలను ఆలోచించుకొని మరీ అభినందించవలసిందనిన్నీ. తరువాత విచారిస్తే ప్రయోజనం లేదనిన్నీ, ఆక్షేపణ అనేవారు లేరనిన్నీ హెచ్చరిస్తున్నాను. నేనిది వ్రాయడం నాకుతెలిసిన సంగతులు నలుగురి వరవడిగాం బెట్టుకొని భాషాసేవ చేసేవారికి తెలిసీతెలియని సిద్ధాంతాలవల్ల బాధ కలక్కుండా వుండడానికే గాని మెప్పు సంపాదించడానికి కాదు. 70 యేళ్ళు వచ్చి యేదో మెప్పు సంపాదించి పొందవలసిన శ్రేయస్సుగాని. యిన్నాళ్ళు గాఢంగా యొవరివల్లనో తిని పొందవలసిన ఆగ్రహముస్సుగాని యేముంటుంది ?- శాంతం, పాపం.

ప్రకృతానికి వస్తాను. కోటరాజుగారు "మైన" అనే నాలంమైన అవ్యయాన్ని అసకృదావృత్తిగా కళగా వాడిస్తున్నారు. ఒకటిమాత్రం వుదాహరిస్తాను.

" క. ....................నం
దీధిర తాపజ్వాలనము
పైపడకుండేడి విధంబు భావింపంగదే ?"

'పై' అనేది సరియైనగా ఉచ్చరించేమే అయితే 'పై బడి' అనికాకతప్పదు. ఆపద్ధతిని పాఠ్యవ చెప్పుతుంది. యీయన మాత్రమే దీన్ని కళగా ప్రయోగించారేమో అనుకుంటే - కవికర్ణరసాయనంలో సంకుసాల మహాకవి "క. పైపడని చోట మనసిడు, । నానుష్ఠితునకన్న అంబుజం దయగలదే ?" అని ప్రయోగించి యున్నారు. ఆ యీ మహాకవుల

ప్రియోగాలను బట్టి చూ స్తే యిది దుర్రితాంతమూ అవును. కానూకాదు అని నిర్ణ యించవలసి వుంటుందని నాఅభిప్రాయము. తిక్కన్న సోమయాజిగారు "వే,గతగన్ ఒం, టిసనన్" అనిప్రయోగించిన ప్రయోగాల కేలాటి విలువ వుందో ఆలాటివిలువే పోతన్నగారి ప్రయోగాలకున్నూ యివ్వవలసి వుంటుం దని నేననుకొంటాను. యెవరో నన్ను వషట్కరిస్తారని నాకున్న అభిప్రా యాన్ని నేను దాఁచుకోఁజాలను. మఱిన్నీ "క. నీయల్లుఁడితఁడు భార్గవుఁ డయ్యా జారుండుగాఁడు" అంటూ నవమస్కంధంలో వకపాస ద్వితీయవ హిత యకారానికి ద్విత్వరహితయకారం పడ్డది. తక్కిన చరణాలలో (నెయ్యము)'తొయ్యలి' అని వుండడంచేత వకచరణంలో మాత్రమే 'నీయ ల్లుడు' అనేది విచార్యంగా స్థూలదృష్టులకు కనుపడుతుంది. కాని యీసంద ర్భము నన్నయభట్టారకునికి అంగీకారమే అని "క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టిన" అనేపద్యం నాల్గవచరణంలోవున్న ద్విత్వశూన్యమైన "మాం, ధాతృరఘుక్షితీశులు" అనే పదంవల్ల స్పష్టపడుతూవుంది. క్షత్రియ శబ్దంలో తకారద్విత్వం (ధేట్ పానే ఇత్యస్మా ద్ధాతో స్త్రచ్,) వుందని కాని శబ్దవ్యుత్పత్తి నెఱిఁగినవారెవరున్నూ చెప్పరు. భట్టారకుని విజ్ఞత్వం అసదృశంగదా ? అట్టి భట్టారకుని ఆశయం యీస్థలంలో యీలా కనవడు తుంది. ప్రాసలో సజాతీయాక్షర ద్విత్వం(శ్రవణసుఖం చెడకుండావుంటేనే) వివక్ష చేయనక్కఱలేదు. అని తెలిపినట్టయింది. అసలు సూత్రాలలో యతు లనుగూర్చి గాని ప్రాసలనుగూర్చి గాని విశేషాలేమీ చెప్పినట్టేలేదు. "అవ్యోవశిర్ద్వితీయోవర్ణః ప్రాసో౽త్ర" యింతమాత్రమే కదా వుంది ? తక్కిన యావత్తుకు ప్రయోగాలే ఆధారం. యీరహస్యం యీప్రయోగం వల్ల అవగతమవుతూవుంది. తకారద్విత్వానికి మాత్రమే అభ్యనుజ్ఞనిచ్చి నట్లు మనం భట్టారకాశయాన్ని తీసుకోరాదా అంటే. అది యుక్తమేకాని పోతన్నగారు భట్టారకాశయాన్ని సామాన్యంగా తీసుకొన్నట్టు గోచరిస్తూ ఉంది. యింకోచోటకూడా ఆస్కంధంలోనే యకారద్విత్వానికే యించుమించు యీలాంటిదేవుంది. అందుచేత "ఏకదేశపతితం" అనడానికిన్నీ అవకాశం

లేదు. అదిన్నీకాక "ఏకదేశపతిత" వాదం కంటే దుర్బలమైనదిన్నీ, అయుక్తికమైనదిన్నీనా కెక్కడా కనపడదు. దీర్ఘపూర్వానికి దీర్ఘపూర్వకమే ప్రాసవుండాలనికాక గురుపూర్వానికి గురుపూర్వకవర్ణమే ప్రాసగా వుండాలంటే యిక్కడే కాదు. సర్వత్ర నిర్బాధంగా నడుస్తుందను కుంటాను. ఈలక్షణమల్లా వక్క వుపజాతి వృత్తములో బాధిస్తుంది. ఆబాధ దీర్ఘపూర్వకముగా లక్షణాన్ని మార్చినా తప్పనిదే కనుక ఆశంక కవకాశంలేదు.

"ఈరెండు వృత్తమ్ములు నిండుఁగూడినన్
సరోజనేత్రా! వుపజాతి యయ్యెన్"

అనేకదా? వుపజాతిలక్షణం? సర్వలఘువులందుం చెప్పఁదలచిన వారికి "తుదిగురువు" యేలాతప్పదో. వుపజాతి విషయమున్నూ అలాంటిదే కనుక విస్తరించేదిలేదు.

యీప్రాసవిషయములో రేఫయుక్తమైన అక్షరానికి రేఫను "తోసిరా" జని ప్రాసపెట్టడానికి అప్పకవి శ్రీనాథ, నాచనసోమప్రభృతి మహాకవుల ప్రయోగాలు (శా. "నాలో మాల్కానలేదు.......... ఈత్రైలోక్యము" "తే. గీ. వార్త్రిపేత్రాంగనా ముఖశక్తులు") ఆధారంగా వుండడంచేత సమ్మతించివున్నాఁడు. (యింత విస్పష్టంగావున్న యీరేఫ విషయంలో నేఁటి వారు వివదిస్తారెందుకో గదా?) ఆశ్చర్యమాశ్చర్యం!!

ఆముక్తమాల్యదలో "తక్షణ" అని తకారసహితమైన క్షకారానికి తకారవిరహితమైన క్షకారాన్ని ప్రాసకో వాడడం కనఁబడుతుంది. ఆయీ సందర్భం విచారిస్తే ఉచ్చారణలో యిత్కించిత్సామ్యం లేకపోయినా ఆయీ అక్షరాలు ప్రాసను చెల్లుతాయనుకోవలసి వస్తూవుంది. దంత్య తాలవ్య చ - జ - లకు అన్యోన్య ప్రాసమైత్రిన్నీకూడా యీ అభిప్రాయాన్ని బలపరుస్తూవుంది. రేఫ శకటరేఫలకు (ధారరేలచుదే అనుకోండి) ప్రాస మైత్రిని (యెవరువద్దన్నానరే) అంగీకరించడంకూడా దీన్నే బలపరుస్తుంది.

భట్టారకుఁడు " కాదనకట్టిపాటి యపకారము " అని ప్రారంభించి రెండో చరణంలో " ఏకవిప్రసం, బోధనచేసి చేసె " అని ప్రయోగించడం కూడా ఉచ్చారణలో యత్నించిన్నూ న్యూనత ప్రాసవిషయంలో గణనీయం కాదనియ్యే పే. భట్టారకుని తాత్పర్యంగా స్ఫురిస్తుంది. కాబట్టి నేఁటి సంస్కర్తలు " ఏకవిప్రసం, చోదన " అని ప్రాసందిద్ది తదనుగుణంగా యతిస్థానంగూడా (అయ్యో? యిదేంసంస్కారమో? యిది భట్టారకుని మతం యావత్తూ తిప్పడమేకదా?)దిద్దడం కేవలమూ అనాలోచితప్పనికింద జమకట్టుకోవలసి వచ్చినదే. యీదిద్దుబాటేగాదు, అన్నిదిద్దుఁబాట్లున్నూ అలాగేవున్నాయి. ( కేవలం అజ్ఞానమూలమైన సంస్కారాన్నిబట్టి పరాక్రమించడం దురన్యాయం కాదా ? ) మఱొకవిషయం అందుకొంటాను.

" పంకజముఖి నీళ్ళాడను - సంకటపడ ఖలులమానసంబుల నెల్లన్ "

అనే దశమస్కంథ పద్యంలోవున్న " నీళ్ళాడను " అన్న ప్రయోగాన్ని పట్టి శంకలు చేసేవారు యేలా సమన్వయిస్తారోకదా ? వారిశంకలు చూస్తే ఆశ్చర్యకరంగా వుంటాయి. నీళ్ళున్నూ ఆడడమున్నూ కలిస్తే ప్రసవించడమనే అర్థం యేలావచ్చిందో ? మఱ్ఱి "నీళ్ళకునీళ్ళూ ప్రసాదానికి ప్రసాదమూ" అన్నట్టు "నీళ్ళనాడుచునున్నన్" అనే ఆదిపర్వస్థ భారత ప్రయోగానికి (ద్రోణుఁడు) స్నానంచెయ్యడం అర్థం యేలావచ్చిందంటే జవాబేమిటి ? (పసుపూసున్నం కల్పితే పారాణి అవడమేమిటో, విడివిడిగా వుంటే యథాస్థితంగానే వుండడమేమిటో ?) మఱ్ఱి భారతంలోనే మఱిపక చోటవున్న (శ. ర. ని చూ.) "నీళ్ళాడు" అనే దానికికూడా పట్టి స్నానం చేయడమే అర్థమేలావచ్చిఁది ? యీపదము నానార్థకమందామా ? సమస్త పదాలు విశేషించి నానార్థకాలుగా వుండడం అనుభవంలో లేదు. అరుదుగానే వుంటాయి. యిది శబ్దపల్లవాల్లో చేరుతుంది కనక సమాసం వంటిదే కదా ? (కతిపయతిజంతోత్తరపదం చూ.) యీలాంటిశంకలు చేసేవారున్నారు. వారికి యేదీ కుదురదు; ఒదిర్చేశక్తిన్నీ భగవంతుఁడియ్యలేదు. "నిద్రపోవు" ను గూర్చి భారతవిశేషాలలో వ్రాశాను. పోపుధాతు వకర్త

కమా, సకర్మకమా ? నిద్రాపదసమథి వ్యాహారమందు సకర్మకమయింది. యెందుకయిందో చెప్పవలసిందంటే, చెప్పేగురువులున్నారా ? ఆ ప్రశ్న యీశ్వరుణ్ణే అడగాలి. యీశ్వరేచ్ఛయేశక్తి; శక్తేయీశ్వరేచ్ఛ. వ్యుత్పత్తివాదశక్తివాదాల పేర్లేనా వినివున్నవారు యీలాటిశంకలు చేయరు. (1) భయపడు (2) కష్టపడు (3) సుఖపడులోనగుచోట్ల వున్నపడు ధాతువుకూడా సకర్మకమే కావలసి వచ్చింది. యెందుకంటే, యీశ్వరుణ్ణి అడగండి.

"చాలఁబదివేలువచ్చె నీసఖ్యమునను" యీ 'పదివే' లేమిటని శంకించడమా ? రాణ్మా, అప్పలా ? యివి దుశ్శంకలనుకున్నా ఆ శంకించే వారికి అవగతం గానిది ప్రతీదీ జాబితాలో చేర్చుకోవడమేనా ? అహో బలమతరీత్యా యిందులో "సఖ్యమునను" అనే చోట పరిశంకవుంది. పద్యాంతమందు ద్రుతం స్వత్వాన్ని పొందకూడదనికాఁబోలును, అన్నా డాయన. అంటే అన్నాఁడుకాక శ్రీనాథుఁడుగారి కాశీఖండము వగైరాలు దీనికోసంచూచాను. స్వత్వాన్ని పొందిన ప్రయోగాలు దొరికాయి. కనక ఆయన పరిశీలించలేదనుకోవాలి. అందుచేత ఆశంకకు అవకాశంలేదు. లేదా ? పరిశీలించివుండిన్నీ ఆవిధంగా వ్రాసివుంటే అది ఆయనగారి మతమనుకోవాలి. ఇంప్వంత ప్రయోగాలు (మందలింపు, ఆరగింపు వగైరాలు) నాకిష్టంలేదన్నాఁడు అధర్వణుడు. చాలామంది మహాకవులు వాడుకున్నారు. నాకు ఆ ప్రయోగాలు (యింప్వంతాలు) యెంతో యింపుగా కనపడతాయి. నేనున్నూ వాడుకున్నాను; మందలింపు పర్వం వగైరాలు చూడండి. అధర్వణకారిక వుదాహరిస్తాను.

"క్వచిదింప్వంత తాంకేచి మూచిరే నహి మే రుచిః"

యిందులోవున్న "కేచిత్" అనేపదాన్ని బట్టి అధర్వణాచార్యు కాలంనాఁటికి పూర్వమే యీ ప్రయోగం కొందఱు మహాకవులు వాడుతూ వచ్చినట్టున్నూ తనకుమాత్రం యిష్టంలేక అధర్వణుఁడు తన అయిష్టాన్ని

తెల్పినట్టున్నూ స్పష్టపడింది. దుష్టం అనడానికి అతని కాధారమేమీ లేక "నహిమేరుచిః" అని వూరుకున్నాడు. (భారతకవులున్నూ, మఱికొంద రున్నూ వాడలేదు.) వాడుకొనేవారు "మేరుచిః" అనిచెప్పి వాడుకొం టేనో అతని కభ్యంతరం లేదు. అందుకే పలువురు వాడుకున్నారు. "లోకోభిన్నరుచిః" సంస్కృతంలో యీలాటి "కేచిన్మతా" లెన్నో వున్నాయి. అవి వారికీ వారికీ వుండే మతభేదాలే కాని యితరులకు ఆమతా లన్నీ వుపాదేయాలే. "సర్వపథీనాః కవయః" యీ సందర్భాన్ని పట్టియ్యేవే జయంతిపీఠికలో "కేచిన్మతంచేత సాధువులుకూడా నాకువుపా దేయాలే" అని వ్రాసినట్టు జ్ఞాపకం. "అధర్వణాచార్లంతవారం మేము వ్యాకరణజ్ఞానంలో" అనే అభినివేశం కలవారు ఆప్రయోగాలు మాను కుంటే మానుకుందురుగాక. యితరులు యిష్టపడి వాడుకుంటే తప్పనడం యుక్తిసహంకాదు. పాలు, పెరుగు, మజ్జిగ, నేయి, వీట్లని బొత్తిగా యిష్టంలేక వర్జించినవారిని పలువురి నెఱుఁగుదును నేను. అంతమాత్రం చేత గోరసాన్ని సర్వులూ వర్జించి భుజించవలసిందేనా ?

"శ్లో. వినాగోరసం కోరసః పండితానాం
వినాగోరసం కోరసః కామినీనామ్
వినాగోరసం కోరసో భోజనానాం
వినాగోరసం కోరసో భూపతీనామ్."

అర్థంవ్రాస్తే పెరుఁగుతుంది గ్రంథం. భవతు. యిట్టినియమనిష్ఠలు సహేతుకంగా కాదు. అహేతుకంగానే, తెలిసికాదు. తెలియకే యేదో కార ణాంతరాన్ని పురస్కరించుకొని శాసించేవారి కవిత్వం రక్షరేకుద్వారా కాపాడఁబడవలసిందేనా, వేఱొక శరణ్యం వుందా ? పెద్దలుకాఁబట్టి యేదో శాసించారు. తప్పులంటూఅన్నారు. అది జ్ఞానకృతం గానివ్వండి, అజ్ఞాన కృతంగానివ్వండి. సమ్మతించడానికి అభ్యంతరం లేదు. యీవాక్యాన్ని చూడండి. "ఏనై పోయితి : ఏను=నేను, అయిపోయితి=కడతేరితి-అని అశ్లీలము" ఎంతమంచిహృదయంతో వ్రాసేమాటో యిది పరిశీలించండి,

సహృదయులారా? యేదో పిచ్చాపాటీగా నాకు తెలిసిన సంగతులు నేను యేకవిత్వాన్నిగూర్చి వ్రాసుకుంటూ కాలక్షేపం చేసుకుంటూ వార్ధక్యాన్ని వెళ్ళఁబుచ్చడం కొందఱికి యెంత యిబ్బందిగా వుందో పరిశీలించాలి సహృదయులు. యింతమాత్రంచేత నేను యీహోరాన్ని వదలిపెట్టి వారికి సంతోషాన్ని కలిగించఁగలిగితే తద్ద్వారాగానేనా నాజన్మకు కొంతధన్యత్వం కలిగినట్టవుతుందిగాని అశీతివత్సరపర్యంతమున్నూ వుండవలసి వస్తుందన్నాఁడు అమరవాది సిద్ధాంతి మారకశాస్త్రుల్లుగారు (మారకవిషయం బాగా చెప్పడంవల్ల యీయనకీ బిరుదు లోకం యిచ్చింది. నేతిబీరకాయ కాదు). అసలు "నేనైపోయితి" అనేవాక్యంలో ఆలాటి దురర్థంవుందా? లేదా? అనేది యిక్కడ విచార్యంకాదు; పెద్దల హృదయనైర్మల్యమే విచారణీయం. ధిగస్మజ్జీవితం, ఆర్యాణాం పరితాపకారకం: తత్తథాస్తాం.

పోతరాజుగారి క్త్వార్థకప్రయోగాలను కూర్చి విచారిద్దాం. "........ పిన్ననాఁటనుండేనియు మాధవున్ వినుతింపఁడు" "........ఎఱింగెఱింగి నావలువిడి" వీట్లల్లో క్త్వార్థకసంధి స్పష్టంగా కనుపడుతూవుంది. యిక్కడేకాదు మఱికొన్నిచోట్లనుకూడా పోతరాజుగారు యీసంధిని చేసి వున్నారు. ఈయనే కాదు పిల్లలమఱ్ఱివారు యెన్మిది చోట్లను చేసి వున్నారు. తిక్కన్నగారి "అందిచ్చు" ప్రయోగాన్ని అన్యథాగా యిటీవలివారు సమర్థించారు గాని లేకపోతే వారున్నూ యీసంధిచేసినవారే. పరమాచార్యులు నన్నయ్యభట్టుగారు కూడా చేసినవారే అని "ఇరువు.... ఎల్లపనులు నెఱిఁగించిపుడే" అన్నపాఠాన్ని "ఎఱిఁగించి తగన్" అని యెవరో మాటదక్కించుకోకపోతే మనం చెప్పుకోవచ్చును. అదీదం సూరకవిగారినాఁటికి యీదిద్దుఁబాటు జరుగలేదని అతని లక్షణగ్రంథంవల్ల గోచరిస్తూవుంది. శ్రీనాథుఁడికంటే పిల్లలమఱ్ఱి కొంచెం పెద్ద. శ్రీనాథ పోతరాజులు సమకాలీనులు. పిల్లలమఱ్ఱికూడా సమకాలీనుఁడే అనుకోవచ్చు. అప్పటికింకా యీ క్త్వార్థకసంధివిషయం (సూత్రం వున్నప్పటికీ)లో అస్తినాస్తి విచికిత్స పుట్టనేలేదు. అప్పటికేగాదు విజయవిలాసంనాఁటికి

గూడా అనుకోవచ్చును. కనకనే చేమకూర "ఇటుచూపటు నటుచూపిటు" వగైరాలు ప్రయోగించుకున్నాఁడు పాపం! ఆ యీ ప్రయోగాలల్లోనల్లా పూర్తిగా రూపుమాపఁబడింది నన్నయ్యగారిదే. మనరాజుగారి నాఁటికి ఆదిద్దడం జరగలేదు. అందుచేత పాపం ఆయనకేం తెలుస్తుంది? ప్రయోగించుకున్నాఁడు. క్త్వార్థకసంధిని వప్పుకొనేవాఁడు అప్పకవిన్నీగాఁడు కాని అతఁడు మఱివకదానికి వుదాహరించిన పద్యంలోవుంది చూడండి.

"దొంగవలె వచ్చియిచ్చట డొంగినావ
దేమయా? బావగారు! పెద్దామె కోప
గించినందులకా? బళా? మంచివాఁడ
వేమనందును ముసలాపెయే వివేకి?"

యిందులోవున్న పెద్దామె (పెద్ద + ఆమె) అకారసంధి అంటూ ఆక్షేపించేవా రిప్పుడున్నారు కదా? అప్పకవికి అలాటి సందేహం వుండి వుండదు. వివేకి వివేకినిగా వుండవలసింది గాని లోకసామాన్యంగా అలా ప్రయోగించబడింది ('సామాన్యే నపుంసకం' అని వకమార్గంవుంది యింకా మార్గాంతరమున్నూ వుంది) మార్గాంతరంచేత సాధింపఁబడితే సాధింపఁబడుతుందనుకొందాం — "ఏమి + అని + అందును" అన్న క్త్వార్థకసంధికి గతేమిటి? యిష్టంలేనివాఁడు "ఏమియందును ముసలామె" అని దిద్దరాదూ? దిద్దాలేదు. యిఁక అచ్చుపొరబాఁటు పాటపాడాలి. "పాపాలకల్లా భైరవుళ్ళు" వాళ్ళే చాలామందికి గతి. ఆలోచిస్తే "ఏమనందును ముసలామె" పాఠంలోవున్నంత సుఖం "ఏమియందును" లో లేదు. అందుచేత ఆ సంధిపొడకట్టక అట్టేపెట్టి వుండవచ్చుననుకున్నా అనుకోవచ్చును. బుద్ధిపూర్వకంగా నేను నాకవిత్వంలో యెక్కడా 65 వత్సరాల వయస్సుదాఁకా క్త్వార్థకానికి సంధి చేయనేలేదు. శ్రీజయపురంమహారాజావారి పద్యాలలోమాత్రం బుద్ధిపూర్వకంగా "ముంచెత్తినన్" అని కాఁబోలు 66-వ వత్సరంలో ప్రయోగించి, టిప్పణిలో పిల్లలమఱ్ఱి ప్రయోగమాలికను వుదాహరించాను, అయినా ఆక్షేపించేవారు మానలేదు.

భవతు. తెలియకుండా శ్రీపఠానందంలో "ఎవ్వరిగందురో? మఱియు ఎవ్వరువిందురో? యేమనందురో?" అని వ్రాసెను. దీన్నియిప్పుడు దిద్ది వున్నారో యేమో? దాన్నిచూచి వ్రాసే వ్రాంత యిదికాదు. నాజీవిత కాలంలోనే నాకవిత్వం (కవిత్వంమాత్రమే కాదు; నావంశచరిత్ర నాకథా పరిపూర్ణ [illegible] లోనైనవన్నీ కూడామూడుగా మార్చేస్తున్నారు కొందఱు. దీన్నిగూర్చి గోదేవిలో కొంచెం వ్రాశాను) నాఅనుమతిల్యాన్ని బట్టి యితరులు పూరించిద్దడంవల్ల నానారీతులా మారిపోయావుంది. కొన్నిచోట్ల అంటే, తత్తఱపడ్తాను.

"అనవలసింటిరా తెలుఁగవే?" వగైరా స్థలాలలోటప్పు యీ స్త్రార్థకసంధి చాలా సుఖంగావుండే స్థలాలుకొన్ని వున్నాయి. "[illegible]" సుఖంగావుండే స్థలమే. (యిది ఆడిసింవారు వ్రాసిన సమాధానప్పురం మేమో అంటే, అట్టిదిన్నిరాదు) యింకా దీన్నిసూర్చి వ్రాయాలి. వనరాల పేడు పదం వున్నప్పుడే దాని అందం కనపడుతుందిగాని అది లేకపోతే వాడుపోయిన అద్దంలాగవుంటుంది. అందుచేత కేవలం— అనందునో (అని..!. అందునో) బాగుండదు. ఆయాస్థూలసూక్ష్మతెలిఁగి దీన్నివాడుకో వచ్చును. యిప్పుడీ దిద్దినదిద్దుఁబాట్లవల్లఁగాని లేకపోతే దీనికి నన్నయాదుల సమ్మతి పూర్తిగావుంది. ఆపోలుండుకూడా కొంచెం మెత్తఁబడి సుముఖంగా కొన్నిమాటలు వ్రాసివున్నాఁడు. విస్తరభయంచేత ఆమాటలు వుదాహరించ లేదు. నేను బుద్ధిపూర్వకంగా చేసిందిన్నీ పరిహారాలు చెప్పిందిన్నీ వుదాహ రించే వున్నాను. యింకనేను చేయనిదాన్ని చేసినట్టు పొల్చి సమన్వయించిన దాన్ని కనపఱిచి మఱొకవిషయం అందుకుంటాను. "ఎఱుఁగుంటే నాస రింపన్" అని జయంతిలో మధ్యమపురుష బహువచనంగా ప్రయోగించు కొన్నాను. అచ్చువారుకూడా "ఎఱుఁగుంటే నాసరింప" అనే ముద్రించారు. ఆక్షేపకులో? దాన్ని "ఎఱిఁగుంటే నానరింప" అని దిద్ది ఎఱిఁగి..!..ఉంది ..!-ఏను" అని విడఁదీసి. వకటికాదు రెండు ప్రాప్తర్ల సంధులుంటూ ప్రద రించారు. చిత్తగించారా? నేను యెంతలోఁకువగావున్నానో ఆక్షేపకులకు?

దానితోపాటే "ఢిల్లీకి ఢిల్లివినన్ లేదొకొ ? దేశికుల్ వృథగదా ! వైంకన్న నున్ నవ్వుటల్" అన్న పద్యంలోవున్న "వైంకన్ననున్" అన్నది వెంకన్న నున్ (వైంకన్ + ననున్) అని విడఁదీసి చదుకోవలసిందని నేను పీఠికలో మొఱపెట్టుకొన్నప్పటికీ దాన్ని అనాదరించి, యతిపోయింది, "రక్షరేకు" కట్టుకోవలసిందని శాసించారు. యిదంతా నాలోఁకువేగాని ఆవలివారి ప్రమా దంకాదుగదా అని భావిస్తున్నాను. యెక్కడా యతీ పోకుండా ప్రాసాపో కుండా, కవిత్వంచెపుతానఁట ! కాని యేమీ అవసరంలేనిచోట్లకూడా ఆక్షే పి స్తేనేకాని సంఖ్యాపూర్తికాదనే తాత్పర్యంతో ఆక్షేపకులు యిన్నివిధాల పరిశ్రమచేస్తూన్నారని లోకానికి తెల్పడానికే నేను యీకాస్తా వ్రాయవలసి వచ్చింది. యింకో ప్రయోగాన్నికూర్చి వ్రాస్తాను.

"పెంపు దీపింపఁదన్నునుతింపుచుండు" యిక్కడనుతింపుచు అన్నది ప్రాసస్థానంలోవుంది. కొందఱు నుతించుచు తప్ప "నుతింపుచు" వుండదని వాదిస్తారు. దీన్నిగూర్చి సర్వలక్షణ సారసంగ్రహంలో చూడవలసిందని వదలి పెడతాను. నడుచు ధాతు ప్రేరణరూపము నడుపు అనేకాని(నడిపించు) వుండదనిన్నీ, నీకోసము, నీకోసరము యీరూపద్వయమో, లేక యీవత్తో లేదనిన్నీ సంఖ్యాపూరణానికి శంకించే వ్రాఁతలు పూర్తిగా వుపేక్షిస్తే తప్ప యీవ్యాసం తేలేటట్టులేదు. (నడిపించు)లు భారతంలో డెబ్బైపద కొండు, ఆక్షేపకుల రచనలో తొంభైపదకొండు, కోసము, కోసరములు అప్పకవీయములోనే కాక-శ-ర- నిఘంటులోకూడా కలవు. యిఁక "అంద చందములు" అనునది వ్యాకర్తలచే వుదాహరింపఁబడి మహాకవులచే ప్రయోగింపఁబడి వున్నప్పంటికీ దాన్ని మొదటకాదని ప్రమాదపడి ఆ ప్రమా దము సవరించుకోవడానికి గుజ్జుగాడిదలు అన్నది స్వకపోల కల్పితంచేసి యిదికూడా సాధువేనా అనే శంకనేర్చు ధాతు ఘట్టంలో గతార్థమే, అయినా మళ్ళా కొంచెం వ్రాస్తాను. నన్నయ్య భారతంలో కద్రూశబ్దానికి "కద్రువ" అని తత్సమరూపం వ్రాశాఁడు. దాన్నిబట్టి వ్యాకర్తలు దాని కోసం వక సూత్రాన్ని పెట్టుకొన్నారు. దానిమాదిరిని వధూశబ్దానికిగూడా

(వధువ) అని చేసుకుంటామంటే వచ్చేదేమిటి? అలాగే "అందచంద ములు" అనేదాన్ని బట్టి సత్తిగాడిచలు ప్రయోగించుకొంటే మా అభ్యంతరం లేదనే నాసమాధానం. యీలాటిదే రాముఁడు అనడానికి "రాముఁడు" అనేది ప్రయోగించి తద్వారా ప్రశ్నించడమున్ తప్పుమశబ్ద గలమైన ఉకారానికి (కోటలు కోట్లుతప్ప) యితరులు లోపంచేసి యెవరు ప్రయోగించారో చూపిగాని ఆ ప్రశ్న అడగడానికి అధికారమే లేదని విన్నవించవలసి వచ్చిందని చింతిస్తాను. (నేనెక్కడావాడినట్లు జ్ఞాపకం లేదు.) నటిపించును గూర్చి వ్రాస్తూ స్వవిషయం కొంత ప్రసక్తాను ప్రసక్తంగా క్షమిస్తేఁ దగిలి వ్రాశానేకాని యిది భాగవత ప్రయోగాలకి సంబంధించింది కాదు.

యెఁడుసూ కొఱిగాని ప్రశ్నలెత్తుకొంటే గ్రంథం మిక్కిలి పెరుఁగు తుంది. అందుచేత అలాటివి పంకింపఁబట్టివి దీనిలో కొంచెం పోయినా యిత రత్రి నేనా కొన్ని వున్నా వాట్లని వుపేక్షిస్తాను. "మనసు బాపుసనాదె క్రమక్రియంబునన్" యిది పెద్దమంచిదే. గోపికలనేమాట. సరియైన బుద్ధితో అన్వయించుకొంటే యిబ్బందిలేదుగాని లేకపోతే కొంచెం అశ్లీల మనడానికి అవకాశం లేకపోలేదు. సరిగా అన్వయించుకోని పద్ధతిని సర్వత్రి సుప్రసిద్ధమై ఆఁడవాళ్ళనోటమ్మటా, మొగవాళ్ళనోటమ్మటా, చిన్నల నోటమ్మటా, పెద్దలనోటమ్మటా, పండితులనోటమ్మటా, పామరులనోట మ్మటా నిరాఘాటంగా వాడఁబడిన, వాడఁబడుతున్న వాడఁబడఁబోవుచున్న "మనుగుడుపు" పదంకూడా అశ్లీలం అని జాబితా వ్రాయించేటట్టయితే యీ కాలంలో అశ్లీలం కానిదేది? "మనసింబాపు" అన్నచోట యేదో మన స్సులో పెట్టుకొని అబాపుధాతువులో అన్వయించుకోవడమా, లేకపోతే ఆ మరు శబ్దానికి అసలువున్న ముఖ్యార్థాన్ని చెప్పక లక్ష్యార్థాన్ని చెప్పడమూ చేస్తేతప్ప అశ్లీలంరాదు. మనుగుడుపులో అలాటి లక్ష్యార్థం చెప్పకుండా "మను, మన్ను (మృత్తికన్నమాట) కుడిపి" అనే ముఖ్యార్థాన్నే చెప్పితప్పుటభిప్రాయాన్ని కల్పించినందుకు సంతోషించవలసివుంది నాసి ఆపద్ధతిని ప్రతివాని కూతురిపెండ్లి అసంఖ్యాకముగా అక్కడ్తే "మనుగుడుపు

నిమిత్తం" తీసుకురావడం మానుకోవాలేమో ? ఈ శంకించేవారికి భూభుజులు (రాజులు) లో భుజపాలనాభ్యవహారయోః, అనే ధాతువు మాట తెలియదు. తెలిస్తే యీదోషం అక్కడమాత్రిం తగలదా ? అందుచేత పెళ్ళిళ్ళంటూ వుండి, అల్లుళ్ళంటూ వుండి, వాళ్ళని పెళ్ళిజరిగిన క్రొత్తలో లాంఛనంగా తీసుకురావడమంటూ వుండినన్నినాళ్ళు యీ "మను గుడుపు" పదం భాషలోనుంచి తొలఁగింపఁబడదు. కూఁతుళ్ళతోపాటు, అల్లుళ్ళతోపాటు యీపదం వుండేదే ! వాళ్ళకు మన్నెగుడపనివ్వండి, మట్టెగుడపనివ్వండి. వాళ్లు దాన్ని ఆమోదించేవాళ్లేనని సమాధానం ("మామయు నల్లుఁడే వెనుకమాటకు న త్తయుఁగోడలే" గదా ?) యిస్తూ యీబాజరబందీ తప్పదుగదా ? అది లేని కేవలంశుద్ధ "లింగిలింగడు" గృహస్థులుకూడా యీపదాన్ని వదలిపెట్టరని చెపుతూ ప్రతివాదుల అవయవార్థం సరియైనది కాకపోయినా "అభ్యుపగమ్య" వాదాన్ని పురస్కరించుకొని దానికే సమ్మతిస్తూ చమత్కరిస్తున్నాను.

"మను" అంటే మన్నుగదా : మంచిది ఆలాగే వప్పుకొని సమన్వయిద్దాం. అల్లుళ్ళకి అత్తవారు పెట్టే పిండివంటలలో మృద్వికారంగాని వేవేనా వుంటాయా ? వుండవు. కనుక "వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"అనే వుపనిషద్వాక్యాన్ననుసరించిన యీఅస్తవ్యస్తపు సుశంకను గూడా అంగీకరిస్తే వచ్చేచిక్కేమిటో ? ముఖ్యంగా నిఘంటుకార్యస్థానంవారిని ఆలోచించవలసిం దంటాను. వారు మనుగుడుపు పదందాఁకా యింకా నిఘంటు రచించి వుంచురేమో కాని ప్రచురించినట్లు లేదు. అందులో వారు యీపదానికి అవయవార్థమంటూ వ్రాసేయెడల యిదికూడా పరిగ్రహిస్తారనే నమ్మకంతో యింతగా వ్రాశాను. కొన్నిటికి అవయవార్థాలు వున్నట్టు కనపడడమే కాని చెప్పవలసిన ప్రసక్తి వుండదు. ప్రవీణాదిశబ్దాలు ఆలాటివే. ప్రస్తుత మనుగుడుపుకూడా ఆలాటిదేయేమో ? లేదా ? సంస్కృతంలోవుండే మనుశబ్దంకాక తెలుఁగులో వివాహమునకు నిమ్నజాతులలో వాడఁబడే (మనువు) అనేశబ్దంవుంది.

బహుళః 'మనుగుడుపు' తో వుండేవి యీదాపతే రావాలి. యిది సరి
యైనవూహే అయితే వివాహానికి సంబంధించిన దించని దాని పరినిష్ఠితార్థం
కావలసివస్తుంది. భవతు. యీలాటి వెన్ని అర్థాలు చెప్పినా పూర్వపక్ష
కర్త చెప్పే మన్ను (మట్టి) యెక్కడికి పోతుంది. అది ఆశ్రయించే
వుంటుందిగా, పూర్వపక్షమంటూ చేయడం చేతనే అయితే అది అర్థాన్ని
అనుకూలించేదిగాను, యెవరికి వ్యతిరేకించేదిగానున్నా వుండేటట్టు ఆలో
చించిచేస్తే దాన్నిగూర్చి కొంచెమేనా ఆలోచించవలసి వస్తుంది.

యీలాటివి (ఉభయతో భ్రష్టాలు) పూర్వపక్షాలన్నీరామా? సుప్రసిద్ధ
పండితగోష్ఠివల్ల కాని యిట్టి అజ్ఞానాలు పోవు. అందుకే పెద్ద పండిత
మండలి శుశ్రూష వుండాలన్నారు పెద్దలు. "వాదః పండిత
మండలీ పరిచయః" ఇక్కడ "పరిచయ" శబ్దానికి శుశ్రూషకాని
ఏ బజారులోనో వెడుతూవున్న పండితులను చూచి యేమాటలో పిచ్చా
పాటీ మాట్లాడుకోవడం కాదని వ్యాఖ్యానిస్తూ ఆయా మహామహుల పదానికి
నిఘంటు కార్యప్రవర్తకులలో శిరోమణులనదగ్గ శ్రీజయంతిపంతులుగారు,
వారిని నా సమన్వయ మెట్లున్నదని ప్రశ్నిస్తూ మరిపిన ప్రస్తుతంలోకి దిగుతూ
మళ్ళా దీన్నిగురించి రెండుమాటలు వ్రాస్తాను.

మనుగుడుపుపదం నిర్దుష్టమే అయినా దానిలో నుంచి మట్టిని
తీసుకురావడం వగయిరా ప్రయత్నానికి ఫలమేమిటి? "ప్రయోజన
మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే" కదా అంటే వినండి. లోకోత్తరమైన
పేరుప్రతిష్ఠలతో నిండివుండడమే కాక యెవరు యెన్నితిట్లు తిట్టినా మాటు
చెప్పడానికిగాని, అన్యథా ప్రయత్నానికిగాని లేశమున్నా నిరిగించు
కోని ఔదార్యం కల వారొకానొక వృద్ధమహాపురుషుడు స్వయముపార్జితమైన తమ
పాండిత్యానికి అనుకూలించలేదనే కారణంచేత అయినా దూషించడమే
దీనికి ఫలితం. దూషిస్తారు సరే. దూషణచేయకుండా మృదువుగా వ్రాయడం
అభ్యాసంలేక దూషిస్తారు. సరే? అందుకు చింతలేదు. యిదివరలో యెంతో
జాగ్రత్తగా వ్రాసినదానిలో నుంచి తమకు దూషణవుంది - మన్ను యీక

అన్నాఁడు అంటూ వ్రాయడానికి వెనుదియ్యరే, ఇదెక్కడిపాపం? దైవం అంటూ వకఁడు వున్నాఁడని వ్రాసే వ్రాఁతేనా అది? "ఆత్మవత్సర్వ భూతాని" అందుకు చేసిన ప్రయత్నం యింకా చాలావుంది. ఆభాగమంతా వుదాహరిస్తే చాలా వ్రాయాలి. దీనివల్ల ఆత్మకు యశస్సు వస్తుందని దూషకుల ఆశయమని వేఱే వ్రాయవలసి వుండదు. కాని అది వట్టిభ్రాంతి. భ్రాంతికాదనుకొనే పద్ధతిని మనకంటే బాగా తిట్టగలవాళ్ళుంటారు. "వారలన్ గట్టిగమెప్పి తిట్టుడనఁగాఁ దగదో తమకేటి కీర్తిమల్?" అని నాసలహా. యీలాటివే యశస్సు నిచ్చేయెడల నిష్కళంక యశోమూర్తులు లోకంలో అరుదుగా వుండవలసి రాదు; యెక్కడఁబడితే అక్కడే వుండి వుందురు. దీన్ని ఒకపద్యంతో గానం చేస్తాను.

మ. "యశమార్జించుట కోసమే సకలమీ యత్నంబు నిక్కంబుతా
దృశలీలాటి ప్రయత్నముల్ సలిపిన న్లెందేనియున్ విందుమే
పశువొక్కో. యశమన్నఁ. గట్టిగొని "పప్పప్పప్ప! చొచ్చో! యనన్
వశమై ముందడుగేయునే? భయమె? యవ్వామాక్షికిన్ దిట్లనన్."

విషయాంతర ముపక్రమిస్తూన్నాను. అక్కడక్కడ "అంధతమశ్ఛటల్" అని ప్రయోగం కనపడుతూవుంది. "అంధతమస" ప్రయోగమున్నూ వుంది. సమాసాంతవిధి అనిత్యమని అట్లుభయవిధంగా వాడినట్లూహింప వలసిందే గాని అజ్ఞతాకల్పన సముచితం గాదని నాఅభిప్రాయం. "అంధతమస" శబ్దానికి వ్యాకరణజ్ఞానంకూడా అక్కఱ లేదు. అమరంలోనే వుందికదా! ప్రథమస్కంధంలో వొకటి రెండుచోట్ల (1) భగవదీయాయత్త మఱీశ్వరా! (2) ధర్మజుండు భగవదీయమార్గంబు దెలిసి అనే ప్రయోగాలు కనపడుతూ వున్నాయి. యిందు మొదటిది పద్యగతం. రెండోది గద్యగతం. రెండున్నూ బుద్ధిపూర్వకాలే కాని అచ్చుపొరపాట్లు కాని, యితరుల వ్రాఁతకోఁతలవల్ల వచ్చినవి కాని కావనే నాతలఁపు. భవదీయ ప్రయోగాన్ని బట్టి యీప్రమాదం కలిగించేమో అని నావూహ. లేక దీనిక్కూడా సమర్థనమే వుందో విజ్ఞులు విచారింతురుగాక! దీనితో

పాటే రెండు యీఁయిచోట్ల వున్న "మదీయ" శబ్దప్రయోగమున్నూ యితరవిజ్ఞులకు వదలిపెడుతూన్నాను. ("మహాస్మదీయ" పదప్రయోగం వాడుకలో వుంది. అదిన్నీ యిట్టిదే) కాని అది యింత కష్టసాధ్యస్థితిలో లేదు. యేమంటారా? అస్మాకం అనే బహువచనం వివక్షితమైనప్పుడు "అస్మదీయ" ప్రయోగమే సాధువుగాని "మదీయ" సాధువుకాదు. యెందుచేత నంటే? "త్వమా - వేకవచనే" అని వుండడంచేత "మ" దేశం వచ్చి యేదో అయి యేదో అయి ఆరూపం యేర్పడుతుంది. అయితే బహుత్వ వివక్షయందు ప్రస్తుతం వాడడంచేత సంశయం పూర్తిగా అవకాశం వుంది. జాతివివక్షయా ప్రయుక్త మనుకుంటే దోషం సవరించుకుంటే సరి పోతుంది. యీలాటి మహాకవు లెవరేనా ప్రమాదపడ్డట్టు తోస్తే వ్యాఖ్యాతలు యీలాటి మార్గాలు తొక్కి సమర్థించడం వుంది. "ఇంద్రవరుణ" సూత్రం వ్యాఖ్యానిస్తూ భట్టోజీదీక్షితులు "కథం బ్రహ్మాణీతి" అని శంకించుకొని "బ్రహ్మాణ మానయతి" అంటూ వ్యుత్పత్తి చెప్పి ప్రవృత్తిని సమర్థించడం అంతా విజ్ఞు లెఱిఁగిందే. ఆమాత్రాన్నిగురించి అసలే తెలియనివారు ఇంద్రాణి - రుద్రాణి - భవాని లోనైన ప్రయోగాలున్నాయి కదా అని వారు "శర్వాణి" అని ప్రయోగిస్తున్నారు. అందుకే కవి కేవలమున్నూ లక్ష్యజ్ఞానంతో తృప్తిపడక వ్యాకరణజ్ఞానంకూడా సంపాదించవలసి వుంటుందని శాసించారు లాక్షణికులు. అందులో వ్యాకరణం ముఖ్యంగా తెలిసివుండా లని కాబోలును. "ఛందోవ్యాకరణాదివిత్" అని వ్యాకరణాన్ని ఛందస్సుతోపాటు పేరు ప్రత్యేకించి యెత్తుకొని యితరాలకు అధికబలంతో తేల్చారు. ఇంద్రశబ్దానికేకాని ఆ ఆనుగాగమసన్నియోగశిష్టమైన ఙీప్ప్రత్యయం ఇంద్రపర్యాయాలకు చేర్చకూరాదుగదా: వచ్చేయెడల "ఇంద్రాణి" వలెనే పాకశాసనాని, శునాసీరాణి, పురుహూతాని వగయిరా రూపాలు వుండవలసి వస్తుంది. భవతు.

యెవరెల్లా ప్రయోగించుకుంటే మునిఁగిపోయిం దేమిటిగాని ఆత్మప్రవృత్తి అలాటిదైనప్పుడు రహస్యజ్ఞులమీఁదికి దాడివెడలడంవల్ల యథార్థం లోకా

నికి తెల్పవలసి వస్తుంది. యింతే విజ్ఞులు చేయవలసిన విద్యాకృషి. లేక పోతే మధ్యరకంవారు చిక్కుపడడం తటస్థిస్తుంది. పోతరాజుగారు దిద్దరాని చోట్లనైతే ప్రయోగించ లేదుగాని "....భీష్మక. వరపుత్రి న్నుతచరిత్రి వారిజనేత్రిన్" అంటూ అంత్యనియమకవిత్వంలో నేత్రశబ్దాంత బహువ్రీహికి జీప్ప్రత్యయాన్ని చేర్చి వున్నారు. దీన్ని నేఁటిప్రతులలో "వర పుత్రి న్నుతచరిత్రి వారిజనేత్రన్" అని సవరించి ముద్రించారు. యథా లాభసంతుష్టితో తృప్తిపడితే యీ దిద్దుఁబాటు యుక్తంగా కనపడుతుంది గాని పోతరాజుగారి హృదయం ఆలా సంతుష్టిపడేది కాదని యితరత్రా వున్న ఆయనగారి అంత్యనియమప్పద్యాలవల్ల గోచరిస్తుంది. అయితే ఆపద్ధతిని "వారిజనేత్రిన్" అన్నదాన్ని సమర్థించడం యేలాగ? అంటే, వినండి: యిప్పటి పుస్తకాలల్లో కాదుగాని వెనకటి (వ్రాఁతవికావు, అచ్చువే) పుస్తకాలనిండా శ్రీనాథుఁడి నైషధం వగయిరా పుస్తకాలలో యీ "నేత్రి" ప్రయోగం బహువ్రీహిలో కనపడుతూనే వుంది. ఒకప్పుడు దీన్నిగుఱించినచర్చ శ్రీ బులుసు పాపయ్యశాస్త్రుల్లుగారి మనుమరాలి పెండ్లిలో దంగేరుగ్రామంలో తగిలింది. అప్పుడు గోదావరీమండలంలో వున్న యావత్పండితులూ వున్నసభలో అపరగౌతములని ప్రసిద్ధి చెందిన శ్రీ శ్రీపాద రామశాస్త్రుల్లుగారు వాకరిపక్షాన్ని తాము పూనుకొని "నేతృశబ్దాన్నుంచి 'ఋన్నేభ్యోజీప్పు' చేసి", "స్వావయవీభూత నేత్రద్వారాగా నేతృత్వాన్ని సమర్థిస్తా" మంటూ వాకఅపూర్వమైన తోవ తొక్కివున్నారు. మార్లాండుపాటి చతుష్కం వగైరా దిగ్గజాలందఱూ ఆసభలో వుండినప్పటికీ ఆ మహావిద్వాంసునియం దుండే గౌరవంచేత ఆత్రోవను ఆక్షేపించడం జరగలేదు గాని నిజానికి అది సహృదయాహ్లాదకం కాదని వేఱే వ్రాయ నక్కఱ లేదు. (పూరికే చమత్కారంగా వారు అత్రోవ తొక్కినారేకాని నిలుస్తుందనే తాత్పర్యం వారికిన్నీ వుండదు.) అయితే గత్యంతర మేమిటి? అంటే, లేదనేదే సరియైన సమాధానం. కాని "అసంయోగోపధాత్" అని సూత్రకారులు పూర్తిగా సంయోగోపధాలకు నున్న చుడితే వార్తిక

కారులు "అంగగాత్రకంఠ" శబ్దాలకు మూఁడింటికి టీకను వుంచేటట్టు చేశారు, ప్రయోగసంరక్షణార్థం. యిక్కడ యింకా యేదో కొంత కాశికా వృత్తిలో చాలాకాలంకిందట చదివినట్టు జ్ఞాపకం. దానివల్ల యీనేత్రి శబ్దాంత బహువ్రీహికి యేకేచిన్మతం చేతనేనా యేమైనా వుపకారం జరుగు తుందేమో? కాని యిప్పుడు కాశిక నావద్ద లేదు. కనక పండిత లోకానికి దానిచర్చ వదిలిపెడుతున్నాను.

"పణినాపల్య, పణినసూను" అనే శ్రీనాథ పెద్దన్నల ప్రయోగాలు తప్పనుకొనేవారికికాదు "అవి వొప్పులే" అని సమాధానం చెప్పేవాళ్ళు వున్నారని విజ్ఞలోకం యెఱిఁగిన సంగతే కనక విస్తరించేదిలేదు. "ఇంత గొడవెందుకు "నేత్రి" ప్రయోగం తప్పే అనరాదా" అంటే, "వావస్తు వాఁడు కరణం" అన్నట్టు యేదో కొంచెంపడి చెప్పుంటే అలా అని యిటీవల చిక్కుపడుతూన్నవారి చిక్కేమనకీ వస్తుందేమో అనే సందేహం చేతనే యీ తటపటాయింపు గాని లేకపోతే క్షణంలో ఆ [illegible]మాట అనవే పద్యం, దాని [illegible], లోకోత్తరమైన మహాకవి వచనాన్ని [illegible]ంచడం పూరికేపోతుందా అని భయం. తత్తథాస్తాం.

యింక "పట్టి వధించితివి అఁడుఁబడుచుని కోపల్" అనేచోట మధ్యమపురుషేకారానికి ప్రకృతిభావాన్ని సమర్థించడం యేలాగ అనేది వుంది. "పట్టి వధించి తివి ఆఁడుబఁడుచు" అనే పోతరాజుగారి పాఠమే మో అనుకుంటే, మఱికొన్ని చోట్లకూడా యీ ప్రయోగాలు [illegible] వున్నాయి. ఆకారణంచేతనే నేఁటి సంస్కర్తలుకూడా దీని [illegible] వున్న దున్నట్టే వుంచినట్టనుమానించ వలసి వస్తూవుంది. కనక యిది గ్రంథకర్తదే; సందేహం లేదు. కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడు, మఱికొందఱు మహాకవుల ప్రయోగాలు కూడా వుదాహరించి మధ్యమ పురుషేకార సంధికూడా ప్రథమపురుషేకార సంధిలాగ వైకల్పికమే అని సిద్ధాంతీకరించడం జరిగింది. దాన్నిబట్టి మేము "హరిణీగృహీతలో" వొక చోట బుద్ధిపూర్వకంగా ప్రయోగించుకున్నాం కూడాను. (మావావిగ్రంథా

లలో వుంటుంది యీ విషయం కొంత విపులంగా, కావలసినవారు వాట్లలో చూచుకోండి.) పాపం! అప్పకవికి ప్రథమపురుషేకారానికి వికల్పసంధి అనడానికే వొప్పుదలలేదు. శ్రీనాథుని "కూర్చుండిరి యొండొరుల్" అనే ప్రయోగాన్ని యెత్తుకొని "పరపురుషక్రియలఁ బ్రకృతిభావముకలదే?" అంటూ ఆక్షేపించి వున్నాఁడు. దాన్ని చూచి మేము మా "పాణిగృహీత" పీఠికలో

శా. "శ్రీనాథాదులలేని లోపములు వర్ణించెన్ రలాభేదసం
ధానంబుం దెఁగద్రెంచె దిద్ది యది గన్నన్ శాబ్దికుల్ నవ్వరే?
తానేయేయవి లేవనెన్ దనకు నంతర్వాణులౌ సత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు వీలియ్యెడన్"

అని వ్రాయవలసి వచ్చింది. యీ పద్యంలోవున్న "తనకు నంత ర్వాణుల్" అన్న వాక్యానికి అర్థం తాను పండితులుగా నంగీకరించిన నన్నయ్య తిక్కనాది మహాకవులు అని కాని తనకన్న పెద్దపండితులు అని కాదని తెలివిడి.

యింక అక్కడక్కడవున్న "మహదంతరం" వగైరా కర్మధారయసమాసాలలో వున్న మహచ్ఛబ్దాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. తక్కినది మా "మహదైశ్వర్యాభివృద్ధి" వ్యాసానికి బరాతం చెపుతాను. ఈ మహచ్ఛబ్దానికి తిక్కన్నగారుకూడా వొకచోట ఆకారాదేశం చేయలేదు. దిద్దితే గణభంగం కలుగుతుంది. నన్నెచోడ మహాకవి అసకృదావృత్తిగా ఆకారాదేశం చేయకుండానే వాడివున్నాఁడు. అయీకవులెవ్వరున్నూ "మహచ్చిత్రం కృతం" అని సంస్కృతంలో వుంటే దాన్ని ఆంధ్రీకరిస్తూ "మహచ్చిత్రము చేయఁబడ్డది" అని "మక్కికిమక్కి" గా అనువదించే తెగలోవాడుకారు. కనక వైయాకరణశిరోమణులు కొంత పరిశ్రమ చేస్తే యేదేనా గత్యంతరం కలుగుతుందేమో అని నాఆశ. కొన్ని గ్రంథాలు పరిశీలిస్తే యేదో ఆధారం దొరుకుతుందని నమ్మకం వుండడానికి కొము దిలో యీ "ఆన్మహత స్సమానాధికరణ" సూత్రింకిర్రిందవున్న అక్షరాలు

కొంత అనుమానాన్నైతే కలిగిస్తున్నాయిగాని ఆ గ్రంథాలు పరిశీలించ డానికి తగినంత ఓపికలో నేనిప్పుడులేను. అనారణంచేత "మహాత్ము విధినా థారోపితః మారోపితః" అని పక నమస్కారంచేసి విరమిస్తూ మరొకటి ప్రస్తావిస్తాను.

"నాపలుకు లాకర్ణింపు కర్ణంబులన్" యీలాటివి మరికొన్ని ప్రయోగాలున్నా యనుకోండి. సహృదయులు శంకించరుగాని చదివరులు వకరుమాత్రం "ఆకర్ణించడం కర్ణాలతోకాక ముక్కుతో, లేక కళ్ళతో చేస్తారా" అంటూ వుపక్రమిస్తారు. యిదేమో మెక్కువవైశిష్ట్యాల అని వారి ఆశయం. శాంతం పాపం ! అట్టివారికి పకనమస్కారం చెప్ప కర్తవ్యం లేదు. వారు వ్రపంచాతీతులు. మరికొన్ని ప్రయోగాలు "కొయుకకంటిపురు" పగయురాలు "కాటుక కంటికి కాక తుంటికి పెట్టుకుంటారా" అంటూ శంకచేయడం ఆరుగుతుంది. థపతు. యీలాటివి కాదుగాని "కడుపున నేడపడియైన గర్భం డాయెన్" అన్నచోట "కడుపులో మళ్ళా గర్భం (కడుపు) రావడ మేమిటంటూ సంఘ్యాపూరణానికి శంకిస్తే శంకించ వచ్చును. సమాధానం — "గర్భోపనిషదితే....సుతే" అని స్మృతి వుంది కనక సుతుఁడు ప్రవేశించెను. అని చెప్పవలసిందని మార్పించడమే. అయితే ఆయెన్ అంటే ప్రవేశించెను అనే అర్థం యేలా వస్తుందంటూ మళ్ళా శంక తగులుతుందికాబోలును ! లోకంలో 'కడుపు ఆయింది' అనే వాక్యాన్ని బట్టి సమన్వయించుకోవలసిందని అనుసరించడమే శరణ్యం. లోకంలో పుట్టి, లోకంలో పెరిగి లోకమర్యాదలను అతిక్రమించడానికి యెవరికీ శక్యం కాదుగదా! కాని వేళ అతిక్రమించి కవిత్వాన్ని నడిపిస్తేనో? అది యీ లోకానికి మట్టుకు పనికిరాదని ఖండితంగా చెప్పవచ్చును. లోకాంతరస్థులకోసం రచించామంటే, 'కానివ్వండి ఆచాగుంటే' అని సమ్మతించడమే కర్తవ్యం. యీస్థలంలో కొంచెం అశ్లీలం కనుపిస్తూవుంది "గర్భం (కడుపు) అవడమేమిటి ?" అంటేనో ? వినండి ఉంటకన్నా బహిరంగంగా వుంది. "....కడుపు దిగెనంమఁ దౌపులువలఁగఁ బిగిఁగ"

అన్నవాక్యం. యివి దశమస్కంధంలో వకచే ఘట్టంలోవి. నవమంలో "........జారు శశిఁ బొంది కటా! కడుపేలతెచ్చికొంటి" అంటూ వుంది. యివన్నీ లోకంవల్ల సమర్థించుకోతగ్గవే. కడుపుతెచ్చుకోవడమేమిటి అని శంకిస్తేగతేమిటి? కడుపు యెరవుతెచ్చుకోవడం కాదు, అంతకు ముందు వున్నరీతిగా కాక యెత్తుగావుండే స్థితి యేలా వచ్చిందన్నమాట. లేదా? ఇక్కడకూడా కడుపుఅంటే గర్భస్థశిశువే అనుకోండి. అయితే గర్భశబ్దానికి నిఘంటుద్వారా గర్భస్థమైన శిశువు అనే అర్థం వుందిగాని "కడుపు"శబ్దానికి లేదే అంటే దానిపర్యాయం గనక దీనికిన్నీ లక్షితలక్షణచేత ఆలాటి అర్థం వస్తుందని సమాధానం. లక్షితలక్షణంటే యేమిటి అని ప్రశ్నిస్తేనో? అందుకే శాస్త్రజ్ఞులశుశ్రూష వుండాలి అని చెప్పి వొక్క నమస్కారం చేయడమేతప్ప గత్యంతరంలేదు. యీకడుపుపదందగ్గిఱమాటకేం గాని "హీనుఁ బొంది యోని హింసింపఁగానేల" అన్నచోట అశ్లీలం పూర్తిగా వుంది. ఐతే పోతరాజుగారు వెఱ్ఱివాడా? యీమాత్రమూ తెలియకుండానే యింత మహాగ్రంథాన్ని ఆంధ్రీకరించి నన్నయ్య తిక్కనాది మహాకవుల కంటేకూడా అగ్రస్థానాన్ని అలంకరిస్తూ వున్నాడా? అతఁడు మహావిద్వత్క విసార్వభౌముఁడు గాని "అల్లాటప్పా" తెగకవులలోవాఁడు కాఁడే! అంతవాఁడయి వుండికూడా "విబుధజనులవల్ల విన్నంత కన్నంత" అన్నాఁడు కాని స్వతంత్రించి వ్రాశాననలేదే? పాపం! అయితే యీబూతుఁ గూఁత లేమిటి అంటే, వినండి, యీ అశ్లీలాలకు కూడా కొన్నిచోట్ల ప్రయోగార్హత వుందని "ప్రి-వీ" కౌన్సిలుతీర్పులున్నాయి. ఆ తీర్పులు మన పోతరాజుగా రెఱుఁగుదురు. యీ విషయం "శృంఖలాతృణీకరణం" లో చాలాకాలంనాఁడు వుదాహరించి విస్తరించి వ్రాసివున్నాం. ఇక్కడ కొంచెం వుదాహరిస్తాను, "శాంత విదూషకాద్యుక్తౌ నదోషః" అని కావ్యానుశాసన సూత్రం. ఇక్కడ శాంతురాలైన అనఁగా కారణాంతరం చేత పురూరవునియందు విరక్తురాలయిన ఊర్వశినోటినుండి గ్రంథకర్త ఆ వాక్యాన్ని పలికించివున్నాఁడు. విస్తర మన్యత్ర చూడండి. మహాప్రభో!

యింక యీలాటిశంకలు చేసి బాధింపకండి నాయనలారా! శ్రద్ధవేసి మీరుచదువుకుంటే మీరు వకరిని శ్రమ పెట్టనక్కఱలేకుండును. ఆ పని చేయకపోవడంచేత మీకు పోతరాజుగారి కవిత్వమేనా సరే, మా తాతరాజు (చెళ్లపిళ్లనరసకవి)గారి కవిత్వమేనా సరే శంకించడమున్నూ, అంకించడమున్నూ, బొంకించడమున్నూ, పంకించడమున్నూ తటస్థిస్తూ వుంది. (యీ అశ్లీలాలనిగూర్చి అంతో యింతో ప్రతిలాక్షణికగ్రంథంలోనూ చర్చ కనపడుతుంది. అందులో కొంచెటిచర్చ మరీ అస్పష్టంగా వుంటుంది. వారిమార్గం అనుసరణీయమే అయేయెడల తుదకు సంధ్యావందనంకూడా మానుకోవాలి. "కేశవ" అనేటప్పటికల్లా అశ్లీలమే. పోనీ శివ అంటేనో! అదిన్నీ డిటో. బతుకంతా డిటో. మహారాష్ట్రము మాట్లాడకుందాం) భవతు.

పూరికేనే అన్నారా "కోపేస్తికవితా తత్త్వమ్" అని అభియుక్తులు! యేదో "చవిటాడిబాగోతం" అన్నట్టు వ్రాసుకుపోతున్నారేగాని యీమహానుభావుని ధారనుగూర్చి చర్చించినట్టేలేదు. భారతభాగవతరామాయణాలంటూ లోకంలో అందఱూ వాడుతూ వుంటారు. శాస్త్రప్రకారం భారతానికి పూర్వనిపాతప్రాప్తి రానివ్వండి గాని అదిక్కడేదంపోతే భాగవత శబ్దానికే పూర్వనిపాతవుండవలసి వస్తుందంటాను నేను. గజేంద్రమోక్షమో, భీష్మస్తవమో, గోపికాగీతలో యేదో ఒకటయినా తెల్లవారిగట్ల పారాయణ చేయని ఆంధ్రులు తనేలేరని (అక్షరాస్యులలో) వాదిస్తాను తెలుగువాడను. క్రమంగా భక్తి నానాటికీతగ్గి కృశిస్తూవున్న యీరోజులలోకూడా యీ పారాయణ పూర్తిగా తగ్గలేదు. శ్రీ భాగవతానికితప్ప యీమహాభాగ్యం మఱియింక యే మహాకవి కవిత్వానికీలేదు. భక్తి అని వచ్చేటప్పటికి పోతన్నగారికి నడిచినట్లుగా యేకవికిన్నీ కవిత్వం నడవదు. నడవనే నడవదు. దానికి పోతన్నకు పోతన్నేసాటి. "రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ" అనన్వయాలంకారశైలికంటూ యీమాదిరి కవిత్వం వుదాహరించవలసివస్తే యావత్తూ భాగవతమున్నూ (పోతన్నగారి రచనాభాగం) వుదాహరించవలసివస్తుందేమో? అందుచేత ఆపనికి పూనితే

వ్యాసం తుదనెగ్గదని ఉపేక్షిస్తాను. ఇఁకనల్లా "ఇచ్ఛయింతుమె? తుచ్ఛవృత్తికి నిందుమాకు" అనీ ప్రాసస్థానంలోవున్న అష్టమస్కంధస్థ ప్రయోగాన్ని కూర్చి కొంచెం వ్రాస్తాను. వికృతిలో 'ఇచ్ఛగించు' అని వాడడం కలదు. ప్రస్తుతరూపం 'ఇష ఇచ్ఛాయాం' అన్న ధాతువునుండి పుట్టిన కృదంత రూపం ఇచ్ఛాశబ్దాన్నుంచి పుట్టి కరుణించు, మరణించు వగయిరాలవంటి ప్రయోగం అంతేకాని స్పృశించు, కృశించు వగైరాలవలె సంవృతిరూపం కాదు. ఉపకృతి రూపమన్నమాట. ఇంచుగాగమపరత్వంలో తత్సమాకారానికి నిత్యసంధి తత్సూత్రగత బహుళగ్రహణంచేతఁ గాని అపదాదిస్వరసూత్రం చేతఁ గాని చెప్పితీరవలసిందేకాని తత్సమ సంబోధనాంతమ్ములకు సంధి లేదనడానికిన్నీ వీలులేదు. వికల్పసంధి అనడానికిన్నీ లేదు. వికల్పసంధి పక్షంలో - కరుణించు కరుణయించు, మరణించు మరణయించు ఇత్యాది రూపద్వయాలు ప్రారంభమవుతాయి. ప్రస్తుతంమాత్రం యే సంధిన్నీ లేకుండా ప్రకృతి భావంచెప్పి యడాగమం వచ్చిందని చెప్పితీరాలి. వికల్ప సంధిని చెప్పితే "ఇచ్ఛించు" అనికూడా వకరూపం ప్రాప్తిస్తుంది. అదనంగా నిత్యసంధి చెప్పితే అసలు కావలసిన మొదటిరూపానికే, అనఁగా "ఇచ్ఛయించు" అనే దానికే మోసం వస్తుంది. శ—ర—ని—లో "ఇచ్ఛ" అనే రూపాన్నే యెత్తుకున్నాఁడుగాని యీ ధాతువును యెత్తుకోనేలేదు. కరుణ, మరణశబ్దాలను యెత్తుకొని పూరుకున్నాఁడా? లేదు. ధాతురూపాన్ని కూడా యెత్తుకున్నాఁడు. దిద్దడానికి ప్రాసస్థానంగదా? యిఁకనల్లా "భాగవతప్రయోగమా?" అని ఈసడించి తోసివేయడమే కర్తవ్యం. భారతాదులకు చాలా యిటీవల పుట్టినవ్యాకరణాలకు సాధ్యంకాలేదనే హేతువుచేత మహాకవి ప్రయోగాలు అధోగతికి పోవలసిందేనా? శాంతం పాపం! సంస్కృతపండితులు శిష్యులకు కావ్యాలు పాఠం చెప్పడంలో అనాదిగా యీ "ఇచ్ఛయించు" నే వాడతారుగాని దీని వికృతిరూపాన్ని "ఇచ్ఛగించు" ను వాడరు. అసలు ప్రకృతి రూపమే లేకపోతే వికృతి రూపం యెక్కడినుంచి వస్తుందనేది వక "నిరుత్తరః పూర్వః పక్షః" కదా?

యీలాటివన్నీ గమనించియ్యేవే మేము "తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" కాఁబట్టి మిణుకుమిణుకు మని యింట్లో వున్న ఆ చేవత్తి దీపంతో యేం తంటాలు పడతారు కనక (విదితభవనేషుపల్లవినా ముపనిషదర్థ మఃఖాభలేనిబద్ధమ్) భారతాది ప్రయోగాలనుబట్టి కవులు ప్రవర్తించవలసి వుంటుందని చెప్పి ఆ మాదిరిగానే ప్రవర్తించడం తటస్థించింది. ఒక్క భారతాన్నే పడితేకూడా ఆంధ్రకవుల సంసారం నెఱవేఱదు. శ్రీనాథ, పిల్లలమఱ్ఱి, తెనాలి వగయిరా మహాకవులనందఱిని పట్టి కవిత్వాన్ని నడుపుకోవాలి. భారతంనాఁటికి లేనిరూపాలెన్నో యిటీవల భాషలోకివచ్చి ప్రవేశించాయి. భారతంనాఁటికి సర్వనామ శబ్దంచేసి స్త్రీని వాడవలసివస్తే "అది" అనేన్నీ పురుషుణ్ణి వాడవలసివస్తే 'వాఁడు' అనేన్నీ మాత్రమే వున్నట్టుతేలుతుంది. సంస్కృతంలో సః అంటే వీఁడున్నూ అవుతాఁడు, ఆయన నౌవరున్నూ అవుతాడు, ఆ మనవేత్రివారు అవుతుంది. అన్నే తెలుఁగులోనున్నూ యించుమించు యిటీవల యెప్పటినుంచి ప్రారంభమయిందో చెప్పలేంగాని స్త్రీవిషయంలో కొంచెం గౌరవ వివక్షయందు ఆమె, ఆపె, ఆకె అంటూ మూడురూపాలువచ్చి ప్రవేశించాయి; యెక్కడ నుంచివచ్చాయో ? ఆయీరూపాలకు బహువచనం చెప్పవలసివస్తే మెఱవు తెచ్చుకోవలసిందేగాని ఆమెలు, వగయిరా రూపాలు కనబడవు. అన్నే గౌరవ వివక్షయందు పురుషులకు వాడుచున్న అతఁడు, ఆతఁడు ఇతఁడు ఈతఁడు ఎతఁడు ఏతఁడు రూపాలకున్నూ "వారు" వగయిరా రూపాలు బదులడిగి తెచ్చుకోవలసిందే. నిత్యైక వచనాలేమో అంటేకావు. భారతకాలంనాఁటికి లేవు కనకనున్నూ కవిరాక్షసుఁడు నియమంచేసి (ఆదిని శబ్దశాసనమహాకవి చూ,) వున్నాఁడు. కనకనున్నూ యిటీవల చేరిన అతఁడు ఇతఁడు వగైరా రూపాలు పరిగ్రహించేది లేదంటారా ? అనండి : మనవాళ్లంటారు మిమ్మల్ని ? యితరులను వారించకండి. అంతేనుమ్మల్ని కోరేది. కొందఱు రైలెక్కనివాళ్ళే ( బలుసు పాపయ్యశాస్త్రుల్లుగారు వగైరాలు ) వున్నారు. బ్రాహ్మణుల్లోనేకాదు. సదాచార సంపత్తిగల బ్రాహ్మణేతరు

లలో కూడా (శ్రీవేంకటగిరిరాజావారి అల్లుఁడు శ్రీచెలికాని గోపాల రావుగారు రైలెక్కడం సకృత్తుగా వుండేది కాని ఆకాలం యావత్తు పూట కూడా మింగకుండా జాగ్రత్తగా కాలక్షేపం చేసి రైలుదిగినతరవాత స్నానాదికృత్యాలు నెఱవేర్చుకొని మళ్ళా ప్రకృతిస్థులయేవారని నేను స్వయంగానే యెఱుఁగుదును) ఆయీనియమాలు వుండేవి. 'వఱకు' అనే శబ్దం నేనెఱిఁగినంతలో సమీరకుమారవిజయంలో మొట్టమొదట పుష్పగిరి తిమ్మన్న ప్రయోగించినట్టు కనపడుతుంది; భారతాదులలో కనపడ్డట్టు లేదు. అంతమాత్రంచేత దాన్ని యిటీవలి కవులు నిషేధించవలసిందేనా? భారతాదులలో సంస్కృతావ్యయాలలో 'వృథా' అనేది దీర్ఘాంతంగా నున్నూ, హ్రస్వాంతంగానున్నూ వాడబడి వుంది. పదకవుల కవిత్వంలో 'వినా' అన్నది కూడా దీర్ఘాంతంగానే వచ్చి ప్రవేశించింది. భారత ప్రయోగానుసారంగా దీన్ని సంస్కరిస్తే "వృథా - వృథ -" అన్నట్టుగా "వినా - విన" అనే హ్రస్వాంతంకూడా వుండవలసి వస్తుంది. హ్రస్వాంతం అప్రసిద్ధమని వ్రాయనక్కఱలేదు. "నిను వినాగ మఱి దిక్కెవ్వ రున్నారు?" అని త్యాగరాయలో, శ్యామాశాస్త్రులవారో వాడుకొన్నారు. భాగవతంకంటేకూడా అలాగ్గా యీ ప్రయోగాన్ని నిరాకరించడాని కశ్యం తరం లేదు, శబ్దతత్త్వం యెఱగని విమర్శకులకు, పోనీ, అట్టినియమంతో కవిత్వాన్ని సాఁగిస్తున్నారేమో అంటే "దశధా, అన్యధా, శతధా, సహా స్రధా" అనేవన్నీ వాడుకొంటారు. ఇవన్నీ నన్నయ్యగారి "వృథా" ప్రయోగాన్నిబట్టి బ్రతుకవలసినవేకదా? రూపద్వయం మాత్రం వీట్లకు హృదయంగమంగా కనపడదు. 'వినా' వంటివి యివి. "సర్వత్ర" అనేది బహుశః కృష్ణరాయలు కాఁబోలు "సర్వత్ర నిలింప భామినులు" అని చూచినట్టు జ్ఞాపకం. నేను దాన్నిబట్టి "అన్యత్రకు" అని వాడినాను. దానికి కువర్ణకం యేలా వచ్చిందని కాఁబోలును జాబితాలో చేర్చఁబడింది. అధికరణార్థకములైన (యీ "అందు" "యింను" లోనైనవి కళలు గానే చిరకాలం వుండి యిటీవల దుష్టప్రకృతికాలల్లో చేరినట్లు ప్రబల

నిదర్శనాలు కనపడతాయి. అందు, ఇందు, ఎందు అనే అవ్యయాలకు నువర్ణకం యేలా చేరిందో దీనికిన్నీ అలాగే అంటే సరిపోదా? 'ఇహ' అనేది అవ్యయమేకదా? దీనికి మువర్ణక మేలా చేరిందో? "ఇహమ్మున బరమున్ మేలగు" అని యెట్టున్న యీ ప్రయోగాన్నిబట్టి విహ శబ్దానికి మువర్ణకం చేరుతుందని వ్రాసినట్టే యెవరేనా యెక్కడేనా వ్రాస్తే వ్రాశారేమో? యింతేనా యీతెలుఁగు గతి? బొత్తిగా అజ్ఞానులు వాడు కునే 'రట్టు' రమ్మ అనే అర్థంలో పడిపన్నెండేండ్లనుండి మాప్రాంతంలో కొందఱు వాడేవి) మాదిరివికపులు వాడితే అవి శిష్టప్రయోగాధారం కాదేమో కాని 'వినా' వంటివీ, 'సర్వత్రి' వంటివీ కూడా కావును కుంటే యేలాగ? భవతు! స్వయంగా మానుకుందురుగాక! యితరుల కవి యిష్టమయి ప్రయోగిస్తే అమతానుమ్మతిని మట్టుకు చూపిస్తే చూపించ డానికి లోకం సమ్మతిస్తుందేమో కాని యీమిషమీఁద శాపనార్థాలు(తిట్టడం వొకానొక సంతోషం కొందఱికి. అంతేనేకాని దానివల్ల వచ్చే అపయశస్సు యెట్టిదో బొత్తిగా ఆ ప్రకృతులకు తట్టనే తట్టదు. పైఁగా తిట్టనిదే తిట్టినాఁడని అపవదించడం, దీనికి యెంత ఆత్మవంచన చేయాలోకదా? దైవానికి తెలియాలి; నాస్కారం) పెట్టడానికి సమ్మతిస్తుందా? యీశాపనార్థాలు తిన్నాఁ డన్నందుకు ఆధారం కనపడడం లేదుగాని యేవో తెలిసీ తెలియని ఆక్షేపణలు మట్టుకు భవభూతికూడా అనుభవించినట్టు అతని శ్లోకం సాక్ష్యమిస్తుంది—

శ్లో. సర్వథా వ్యవహర్తవ్యం - కుతోహ్యవచనీయతా,
యథాస్త్రీణాం తథావాచాం - సాధుత్వే దుర్జనోజనః.

అతిదుర్జన ఇతివక్తవ్యమ్" అనే అక్షరాలవల్ల పైసంగతి స్పష్టమవుతుంది. మేము కవిత్వంలో వెళ్ళే మార్గాన్ని విస్పష్టంగా—

ఉ. "కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి దేశభా
షాలలితాంగి మాఱుటది యెక్కడి సమ్మతమౌట సన్యదే

శ్యాలును నాంధ్రిభాషఁ గలవౌటను నొచితిఁ బట్టి మేముక
బ్బాలను వాడుచుందుమిది పండితు లేగతి నొప్పకుందురో! "

అంటూ యేవో తోఁచినమాటలు వ్రాయడమే కాకుండా "చించి వేయుఁ దేమంచియు లేనిచో" అనికూడా ప్రార్థించివున్నాం కదా? యింకా యెందుకు మమ్మల్ని కదిపి దూషించి వోపికలేనిరోజుల్లో పని కల్పించడమంటాను నేను! భవతు. దీనివల్లకూడా లోకానికి కొంత వుపకారంవుందికదా? అందుచేత యిదిన్నీ అభినందనీయమే అనుకొందాం.

ప్రస్తుతం పోతరాజుగారి "ఇచ్ఛయించు" ప్రయోగంమీఁద మఱికొంత నడిచింది. యీప్రయోగాన్ని యిదివఱకు చర్చించినవారున్నట్టు లేదు. నాకుతోఁచిన విప్రతిపత్తులను నేనుచూపాను. ప్రచురింపఁబడ్డ వ్యాకరణాలలో నేనుచూచినంతలో వుపపత్తి లేనట్టు కనిపించింది. అయితే మొదటినుంచిన్నీ నేను యీవ్యాకరణాలమీఁద బైండ్రై కవనాన్ని సాఁగించుకోవడంలేదు. లక్ష్యప్రపంచాన్నే ఆధారంగా పెట్టుకున్నాను. నమ్మితారో లేదోగాని శబ్దరత్నాకరం కూడా నేను యిటీవల చూడడం ప్రారంభించానుగాని ఆత్మకూరి వాదోపవాదాలనాఁటికి ఆ నిఘంటువంటూ వకటున్నదని కూడా నేను యెఱఁగనే యెఱఁగను. అంతా భారతమే నాకు ఆధారం. ఆరోజుల్లోవ్రాసిన పీఠిక కనకనే దేవీభాగవతప్పీఠిక అంతా భారతకవులకు సంబంధించే వుంటుంది. యెవరో అమాయిక (గుం॥డి) బ్రాహ్మఁడు దాన్నిగూర్చికూడా కొంత నిరసనంగా పేలవమ్మాటలు ప్రయోగిస్తూ యేమేమో అనుచిత ప్రసంగం చేసివున్నాఁడు. అది అన్యత్రి విస్తరించి వుండడంచేత స్పృశించి విడుస్తున్నాను, యిఁక భాగవతాన్నుంచి వొక్కొక్కటి యీలా యెత్తుకొని వ్రాయక యేవో కొన్నిప్రయోగాలు సామాన్యజ్ఞానసంపన్నులు శంకించేవి వరుసగా జూపి యీవ్యాసాన్ని ముగిస్తాను. (1) మేల్పట్టున్నాకగుడమ్మ (2) చాలపెద్దమ్మ (3) ఆంధ్రకవితాగౌరవ జనమనోహరి నన్నయసూరిం గైవారంబుచేసి, హరిహర చరణారవిందవందనాభిలాషిఁ దిక్కమనీషిన్ భూషించి (4) రాజముఖ్యుఁడొక్కరుండు

నాకస్నుఁగవకు నెదురఁగానఁబడియె (5) ముష్టసానికె (6) ఈశ్వర సేవాకాముఁడు (7) పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్ (8) వసుదేవదేవకులకు (9) తపోధన్యాగ్రణిన్ ధీమణిన్ (10) కమలలోచను కథలందెవ్వాఁడు రతిసేయు (11) పాలనోద్భవనాశముల్ (12) చరణోరుభుజముఖ శ్రవణాక్షి నాసాశిరములు (13) మహాత్ముల్ విష్ణునంశాంశజుల్ (14) యుర్గ ఘోషంచితమైన యాహరి యుదారమహోన్నత కర్మముల్ (15) ఏచరిత్రంబు వలననే రోగంబుజనించె నాచరిత్రం బారోగంబును మానుపనేరదు (16) బాదరాయణుఁడు దాఁగల్పించె (17) మంజువాచాలత జూపుచుం జిగురజాలము దువ్వుచు (18) నేఁడు వానిశిరమున్ ఖండించి నేఁదెత్తు (19) ఊడ్చి ద్రొప్పె (20) బలయమునఁ బంపనుక్రియ (21) వేదనాతురులకు (22) అన్నలార! పడితి రాపత్పరంపరలు (23) విబుధముఖ్య! నాకువిస్తరింపు (24) మన్నారా? ద్వారకలో (25) చెలికాఁడ రమ్మని చీరినన్నారవేళ (26) కందమూలములఁ [illegible] (27) పాషండులైన విప్రనికాయము (28) హరి....మఱచియుఁ జేయనొల్లరు (29) దేహబంధంబులఁ దెలుఁగుపలెను (30) పంకేరుహాక్షున్ శ్రియః పతిన్ (31) సొలసిన కోర్కెదీర్చుటకు (32) బదరీవనమ్మునకుసుఁ బొమ్మని (33) విష్ణుని పుల్లసరోజపత్రనేత్రుని ఘనమాయనెప్పుడు (34) అట్టిటివ్యాపతారంబు లవతరించు నఖుఁడు (35) తద్దినంబున (36) పుత్రివిశకంబు గలిగిరి (37) ప్రియతముఁడైన సుతునకును నిట్లనియెన్ (38) తమః పటల పరీవృత ప్రపంచము (39) పరంజ్యోతియందు (40) దేవహూతిట్లను (41) ప్రకటమూర్తి రుచిప్రజాపతికినిచ్చె (42) ముల్లోకంబులు విస్తృతంబులయ్యె (43) నోరిమాటకుఁ దనకేమి గోచరమో (44) బల పరాక్రమంబుల కొలఁది (45) నవరాత్రంబుల కావమాలు (46) వినుత గుణశీల! మాటలు వేయునేల (47) గర్భముదాల్చి కుమారుఁగాంచెన్ (48) ఇందుకుసీవున్ (49) వినుఁడీ! సభికులు (50) స్వాగతమయ్యె? సత్కృపాకలితులార! (51) అసహ్యతేజుండు (52) నిజాత్మ జనాత్మ

జులయందునిలిపి (53) అలవడనే సతీమణి (54) పడతి నేనుసీక్వాడక సీక్వాడ నొల్లదు (55) తాత్పర్య చిత్తంబునన్ (56) అన్నిటికుపరియై (57) కవిపట్టపురాజు (58) పలికె మంజులముగాను (59) కన్యయ ముమ్మడమ్మకున్ (60) అదియచేతురు (61) చేయు త్రివిధకర్మలఁ జేయు జీవతతికి (62) అప్పరసఁ గుమారికనిత్తున్ (63) వన్నెల్ పెట్టుక వింత బాగులతజిన్ (64) వేదండ తండమ్ముతోడన్ దండెత్తెన్ (65) శ్రీవత్స కౌస్తుభ చిహ్నవాని (66) యీహత్యం బాపఁగలవారము (67) సౌకర్యాంగముదాల్చి.... వైకుంఠుండు (68) వాహినీ సందోహములును వీచుల రత్నములు (69) కమలాక్షు నర్చించు కరములు కరములు (70) కళలనడపించు (71) చిన్నఁబోయి ఖిన్నుండై (72) భేదించుచోఁ గుద్దాలములభంగి (73) దుర్జయుని దైత్య (74) మనుజులదనుజుల వేల్పుల జననంబులు (75) దిశలేని నాబోఁటి పశువుల (76) మ్రింగె డిదిం గరళమనియు (77) ఆకన్నులు నాచన్నులు (78) అప్పుడయ్యాది లక్ష్మియు (79) ఊరకుండిరిగాని (80) విరోచననందనుండగు బలి (81) గసిబిసియై (82) చావఁబొడిచె దానవునిని (83) వదురునందను లతనికి (84) ఏమికొఱకై (85) ఏపున దివిభువియు నావలీవలసేయన్ (86) చనవలెనొండెన్ (87) అక్కాచెల్లెండ్రియ్యన్ (88) కరుణాలోక సుధాఝరిన్ (89) పురుడు ప్రివర్తించి రెలమిన్ (90) ఆశాపాశము.... గాసింబొందిరి (91) నీమదోసిలి వచ్చిచొచ్చి (92) నిదురదెప్పిరి (93) బెబ్బులి మందాపుఁబట్టె (94) ముగుదమఱచి (95) ముసలితాపసిఁబట్టి (96) విభుఁడొక్కెడ బారణమునేయ నుద్యోగింపన్ (97) భర్తుఁడెందుఁ జనినఁ బరతెంతు వెనువెంట, గోవువెంటఁ దగులు కోడెభంగి (98) కడు పునకు లేక యేడ్చుచుండన్ (99) కాంతకేఁబదఁట (100) జమదగ్ని సామంబు పాడువాఁడు (101) మీయటువంటిసాధువులు (102) నిక్కిన భుజాంబులవాఁడు (103) ఏము వాల్మీకిపౌత్రులము (104) రాజు రావ కూఁతు రతిచేయనగుఁగాక (105) బ్రితికెడి తీపియును విషయపఞ

స్పృహయున్ (106) నీవారాన్నంబు గుడుఁదునేఁడు నరేంద్రా? (107) సార్వభౌముండు వానికి సంభవుండు (108) వేల్పులం బరయుటల్ మోఘంబులే? (109) అనఘాఢ్య ముత్తపగునీకున్ (110) పెలపెలఁ బాలుంగన్ (111) నాఁటికొక్కదైవములేదే? (112) మనయశోవ చిన్ని మగవానిఁ గనెనఁట! శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ శ్రీ. శ్రీ.

చాలును ఇదేవిధంగా గీట్లుపెట్టపలసివస్తే యీభాగవతమేకాదు, భారతమున్నూ పెట్టవచ్చును. ప్రతిచోటా యేదో శంక తీయవచ్చును. అని తెల్పడానికే నేనీ స్థలాలు వుదాహరించానుగాని ఇవి అన్నీగాని యిందులో కొన్నిగాని దోషజుష్టాలని లోకానికి తెల్పడానికి కాదు.

నేనుదాహరించిన స్థలాలలో స్థూలదృష్టులకున్నూ సూక్ష్మదృష్టులకున్నూ కొన్నిచోట్లబొత్తిగా శంక వున్నట్టే అనుమానంతట్టదు. అప్పుడువాదు కేవల మున్నూనన్ను పరప్రతారకుణ్ణిగా భావించడానికి అవకాశం కలిగింతుంది కనక అట్టి స్థలంవకటి రంగానికెక్కించి అక్కడవున్న శంకను నిరూపిస్తాను.

(3) "ఆంధ్రకవి....నన్నయసూరి....తిక్కనమనీషి భాషించి" యిక్కడ శంకేమిటంటే? నన్నయ్య మూఁడుపర్వాలుమాత్రమే భారతాన్ని అనువదించినవాఁడుకదా? అట్టినన్నయ్య "ఆంధ్రకవితాగౌరవజన మనో హారి" అనఁగా, తెలుఁగు కవిత్వమునందలి గౌరవంచేత జనులయొక్క మనస్సును ఆకర్షించినవాఁడై, పదిహేను పర్వములు రసబంధురంగా తెనిఁగించిన తిక్క మనీషి పూరితే "హరిహరచరణారవింద వందనాభి లాషి" మాత్రమే అయినాఁడా పాపం! తిక్కన్నగారికి వేసిన విశేష ణంలో యెంత కంచుకాగడాలు పెట్టివెతికినా కవిత్వానికి గౌరవాన్ని సూచించే వకహల్లుగాని, అచ్చుగాని కనపడదే? యిది యెంతదోహ మనుకోవాలి? నేను "నన్నయభట్టాది కవిజనంబులు" అని పురాణాంధ్రీ కర్తలలో మొట్టమొదటివాణ్ణిగా పేర్కొన్నందుకే గుంటూరు డి॥ విమ ర్శకులకు అభినవ తిక్కయజ్వగారి కెంతో కోపంవచ్చి జోరులూ

మాకులూ నన్నేగాక నన్నయ్యనుకూడా పడఁదిట్టిపోశారుగదా? వారికీ అక్షరాలు కనపడితే పోతన్నను యెంతగా తిట్టిపోసి దుమ్మెత్తి పోయవలసి వస్తుందో? ఆయనకున్నూ, తాదృశులే అనఁదగిన మఱికొందరు విమర్శకాగ్రిణులకున్నూ అవగతం చేయడమే కాకుండా నేఁటి విమర్శకులతత్త్వం ప్రాజ్ఞలోకానికే కాక పత్రికా ప్రవర్తకులకుకూడా అవగతం చేయడానికే నేను ఆ యీఅంకెలతో కొంత జాబితా తయారుజేశాను కాని సహృదయులకు ఆ యా చోట్ల లేశమున్నూ "నచ శంకాన చోత్తర"మే అని వేఱుగా నొడువ నక్కఱ వుండదు. పైఁగా యీ పోతన్నగారు "ఒనరన్నన్నయ తిక్కనాదికవులీ యుర్విన్ బురాణావళుల్ తెనుఁగుంజేసియు" అంటూ కూడా వ్రాశాఁడని మాగుం॥డి॥ విమర్శకుఁడుగారికి వొక వ్యాసంలో పడమఱిచి మనవిచేసుకొని వున్నాను, యీ పైని ఆ విమర్శకుఁడుగారు పోతన్నను యేంచేస్తారో, లేక యిప్పుడేనా పశ్చాత్తాపపడి యెన్నఁడుగాని యిట్టి తలఁకు దగని వ్యాపారంలోకి దిగేది లేదని పత్రికాముఖంగా ప్రకటిస్తారో చూడవలసివుంది. ప్రాజ్ఞులారా! యిట్టి యకారణనిందకులు నేఁడు భారతసంశయ విచ్ఛేదకులున్నూ తిరుపతి వేంకటకవి గ్రంథ విమర్శకులున్నూ, భవతు. అంతలో వచ్చిన దోషమేమిగాని ఆ యీఅస్తవ్యస్తపు రచనం బురస్కరించుకొని "అభినవతిక్కయజ్వ" బిరుదంతో వీరిని గ్రామంవారు గౌరవించడం! కాఁబోలును. అంతవాణ్ణే అని వారుసంతోషించి పెద్దకుండలకు యెసళ్ళుపెట్టడంచూచితిరా? లోకస్థితియెట్లున్నదో! వకాయన అభినందిస్తూ మాగ్రంథవిమర్శనాన్నిచూచి నేనే మెచ్చుకొన్నట్టు వుటంకిస్తూ యేమేమో వ్రాసివున్నారు. అట్టివారికి దానికి తమకువుండుకున్న ఆధారాన్ని చూపవలసిందంటూ వ్రాసివున్నాను. మఱోకాగితం విన్నచూస్తిని గదా? దానిలోగూడా ఆమాదిరిమాటలే కనపడ్డాయి,

"చ. తిరుపతి వేంకటేశ్వరకృతి ప్రకరంబు విమర్శ వేంకటే
శ్వర కవియే కడు న్వినుతి సల్పి సలక్షణమంచుఁబల్కె"

నేనుఆ బ్రాహ్మణ్ణి "కా స్తయతిప్రాసలకూర్పు వాసంచికదా ? దీన్ని మిషగాఁబెట్టికొని తిట్టినవ్యక్తిని సన్మానిస్తా" మని నేద్వోషు సిద్ధంచేసుకొని ఆహ్వానిస్తే ఆ ఆహ్వానానికి స్థూలదృష్టులు మఱివకరాగు అభిప్రాయ బడుతూ వున్నారు కాఁబోలును. (శ్లేషవ్యం వకరిపిహాము. ఆపూర్వో సభ్యు లిచ్చింది. అందుచేత యెవరినని అడిగేది ? ఆ సుప్పులకు తేట తెలుఁగు మాటలతో వున్న నావ్యాసం కూడా అర్థంకాలేదు కాఁబోలు.) యేవ్యాసంలో నా ఆహ్వానం (సమ్మానించడానికి) వుందో ఆవ్యాసంలోనే "అయ్యా ! మీవిమర్శనం యెందుకూ పనికిరాని స్థితిలో వుంది తిట్లుతప్ప మీకేమీ తెలిసినట్టు మీ విమర్శనంవల్ల గోచరించదు. అయినా మీరు నాకు కృతియిచ్చుటచే మిమ్ము సమ్మానించఁ దలఁచినాను."

అనే అర్థమిచ్చే వాక్యాలు బోలెఁడున్నాయి కదా ? వున్నా వారు వాట్లని గమనించలేదను కోవాలా ? భవతు. పసుపరుల వైఖరి అలా వుంది. విమర్శకులకు యింకలోఁకువగా నేమి ? వారిచిత్తమే చిత్తం. ఆసమ్మానసభకు అధ్యక్షులుగా వచ్చిన పండితులు బహుజాగ్రత్తగా ప్రవర్తించినారని వారివాగ్వైఖరిని బట్టి నేను గుఱుతించినాను వారికి నానమో వాకశతం సమర్పిస్తున్నాను. సరే, ప్రకృతమనుసరామః.

శంకలేనేలేదనుకొన్న స్థలంలో శంక చూపించడం జరిగిందా ? జుదే మోస్తరుగా ప్రతిచోట ఏదో పుట్టించఁదలఁచే జాబితా తయారుచేశానని దీనితో మీరు విశ్వసిస్తారు. దీనివల్ల ఫలితం యేమిటంటే ? పలువురు లోకంలో యిట్టివారున్నారని లోకానికి తెల్పడంకంటే యింకే ఫలితంకావాలి. యీ యిచ్చిన జాబితాలో లోఁగడ ప్రత్యేకించి ప్రత్యేకించి శృంగారాభిహి కయా ఆక్షేపణాంశాలు చూపిన వాట్లసజాతీయాలు లేవు. వీట్లకన్నిటికీ అదేమాదిరిని ప్రత్యేకించి ప్రత్యేకించి శంకాసమాధానాలు వ్రాయవలసివస్తే యెంతగ్రంథం పెరుఁగుతుందో యిందులో పేర్కొన సక్కఱలేదు. నేను చూపిన జాబితా యింకా యెంత పెరుఁగుతుందో ! అంతటితో సమాప్తమవు తుందా ? యిట్టి పిచ్చిశంకలుచేసి పోతన్నగారు మహాకవి కాఁడని సమ

ర్ధించాలనే కోరిక నాకుఁగాని, మఱివకఱికిఁగాని కలిగితే అది నెఱవేఱు తుందా? అది వృథాప్రయాసమవుతుందో? ప్రాజ్ఞులు విచారింతురుగాక: (పర ప్రత్యయనేయ బుద్ధులకు యేంతెలుస్తుంది ? మనవాఁడు చాలా పెద్దజాబితా తయారుచేశాఁడు;పట్టండి బ్రహ్మరథమనడమే వారి పని.) నిఘంటు కార్య స్థానానికి లోఁగడ వక దరఖాస్తు పెట్టివున్నాను. అది నాస్వవిషయంగాని, పోతన్నగారికి సంబంధించింది కాదు. అందులో "తమకున్ జ్ఞాపకముండకుం డదు" అనేపద్యంలోవున్న "జ్ఞాపక" పదం విశేషణం గనక అక్కడ సమన్వయించదు అనేవారికి నేనుగాని, మీరుగాని యేసమాధానమేనా వ్రాస్తే బోధపడుతుందా ? "అబోధోపహతా శ్చాన్యే" అవుతుందో? పరిశీలించండి.

జ్ఞాపకం అన్నది. జ్ఞాధాతువుయొక్క ణిజంతరూపంగదా ? కర్త్రర్థ కంగాని భావార్థకంకాదు. ప్రేరణంలోదిగాని స్వార్థకంగాదు. విశేషణ విశేష్యోభయార్థకంగాని,అనఁగా,విశిష్టవాచకంగాని కేవలవిశేషణార్థంకాదు: యథా. (స్మారకం) లోకంలో "వానికిజ్వరంవచ్చింది. బొత్తిగా స్మారకం లేదు అంటారా ? లేదా ? అక్కడ స్మారక పదానికిస్మరింపఁజేసెడి (తెలివి) అనేనాఅర్థం (బొత్తిగావాళ్ళేతెలియదని తాత్పర్యార్థం) వేఱొకటి యేదేనా వుందా ? అట్టి అర్థం చెప్పినప్పుడు విశిష్టవాచకమేనా ? అదికాదా ? యిక్కడ "జ్ఞాపకం" అంటే ? జ్ఞప్తిని కల్గించెడి గుర్తు అనేఅర్థమేనా కాదా? అయితే విశిష్టవాచకమేనా ? అట్టి సందర్భంలో సమన్వయించకపోవడానికి కారణమేమంటారు. శాస్త్రజ్ఞశుశ్రూషాభావమేనా ? మఱివకటి వుందంటారా? లోకవాడుకలో నున్నంతమాత్రంచేత ఆ యీపదాలన్నీ గ్రామ్యాలవుతా యంటారా ? ఆపద్ధతిని పండితులు "అభ్యవహారం" వగయిరాలు యెన్నో పదాలువాడుతూ వుంటారుగదా ? వాట్లగతేమిటి ? భారతాదులలో (ఇష్టము —ప్రియము —హితము)లోనైన విశిష్టవాచకాలు వాడఁబడి వున్నాయిగదా ? అని ఆక్షేపకులకు సమన్వయిస్తాయా ? విశేష్యమేదేనా ప్రయుక్తమైవుంటే ఆ యీవిశిష్టవాచకాలు విశేషణార్థమాత్ర బోధకాలుగా వుండిపోతాయిగాని విశేష్యంలేకుండావుంటే ఉభయార్థ ప్రతిపాదకాలుగా వుఁటూ వుంటాయి.

శాస్త్రజన్యజ్ఞానం అందఱికీ వుండవనుకోండి. మేఘసందేశంలో "పరిణత
గజప్రేక్షణీయం" అన్నస్థలంలో శిష్యులకు తెలిసినా తెలియకపోయినా "విశిష్ట
వాచకానాం పదానాం" అంటూ గురువులు చెపుతూనేవుంటారా లేదా? గురు
వులు ఘటాదిపదాలు గజాదివస్తు సాన్నిధ్యమందు కేవలమున్నూ సముదాయ
మాత్రబోధకాలు కావడమున్నూ, అదికానప్పుడు ఉభయార్థబోధకాలుగా
వుండడమున్నూ వుందంటూ వెనక శ్రీ పేరి కాశీనాథశాస్త్రుల్లుగారికిన్నీ
మాకున్నూ వాదోపవాదాలు పడ్డప్పుడు వ్రాసి "విల్లోకస్త్రత్తనకేంద్ర మద్గుణ
ఘటా" అనే మహిషశతకా ప్రయోగం యిస్తే ఆయన శాస్త్రజ్ఞుఁడు కనక
కిమన్నాస్తిగా సమ్మతించడం జరిగింది. పద్మిస్వర్గాన్ని పున్నవారినిగూర్చి
యేమీ వ్రాయకూడదుగాని ఆయన మహావైయాకరణి అయినప్పటికీకూడా
"ఉదారపద వ్యుత్పత్తి" కూడా పరిశీలించక 'మందలోదాక్షిణ్యపరాంగులు'
అన్నచోట "యతిభ్రష్ట" మైనదంటూ మాయెమిష్టు పట్టాభిషేకంలో
(యిదేమి ఆశ్చర్యమో పట్టాభిషేకమని పేరుపెట్టి వ్రాసినదాని కింకొక
మెవరో దాడివెడలి పరాక్రమించఁబోయి పరాభూతులు కావడమే చిట్టి
మ్రూవుఁడి.) ఆక్షేపించడమున్నూ. దానికి యతిభ్రష్టంకాలేదు; వేసరవారి
మతిభ్రష్టమైనదని (హైలాపడ్డను వయస్సులకనక) మొదట్లోనే
జవాబిస్తూ మనుచరిత్రలోనుంచి

"క. పేరువహూధిని యందుఱ్ఱు హ
మార! ప్పుతాచీ తిలోత్తమాహరిణీహే
మారంభా శశిరేఖలు
దారగుణాఢ్యలు మదీయలగు ప్రాణలుఁబుల్"

అని వుదాహరిస్తూ అప్పకవీయంలో ఫలానా పుటచూడా చిత్తగించ
వలసిందని వ్రాయడం పగయిరాలు మీలో కొందఱు చిన్నవయస్సువారవడం
చేత ఆ కాలంనాఁటికి (శోభకృత్సంవత్సరం అది) పుట్టివున్నారో, లేదో కాని
నాకన్నమా సుమారు పదియేళ్ళు పెద్దలు(కృతవన్యాపతిత్వద్వారా) మా అల్లుళ్లి
శ్రీజయంతి పంతులుగారు (మహారాజ్యాలయోపాధ్యాయులు) పూర్తిగా యెఱిఁగి

వుంటారు. ఆపుత్తముఁడు అంతతో తృప్తిపడడమే కాకుండా ఆయనగారి పూర్వశాకుంతలంలోవున్న తప్పులన్నీచూపి పత్రికటి స్తే కిమన్నాస్తిగా వూరుకొని వొకప్పుడు హఠాత్తుగా చామర్లకోట స్టేషనులో కలుసుకోవడం జరిగేటప్పటికి నేను ఆ యీవిరోధాన్ని మనస్సులో పెట్టుకొని "యెడముఖం పెడముఖం" గా వున్నప్పటికీ ఆయన యేలాగో నన్నుగుర్తించి "వెంకట శాస్త్రుల్లుబాబూ!" అంటూ దగ్గిఱికివచ్చి కౌఁగిలించుకొని యెంతో ప్రీతిగా "యేదోకాలదోషంచేత ఆలావచ్చిందంటూ" గతంలో జరిగిన (తూలుమాట లవిమర్శనాన్నిగూర్చి అన్నమాట) సందర్భాన్ని జ్ఞప్తికితెస్తూ మాట్లాడ్డడం మొదలుపెట్టేటప్పటికి నాకు "సగంచచ్చినట్లయి" "అన్నా: యింతమంచి బ్రాహ్మఁడంటూవుంటాఁడా? యీయన యేదో తొందరపడ్డప్పటికీ సర్వ విధాలా పెద్దవాడు మనకంటె. అట్టి మహనీయుణ్ణి మనంకూడా తూలనాడ డం తప్పుగదా?" అనుకొని నాలోనేనే విచారింపవలసివచ్చింది. యీయన తండ్రి శ్రీ పేరి వేంకటశాస్త్రుల్లుగారు మాప్రధానగురువులు బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారికి గురువులవడంచేత తద్వారాగా యీయన మాకు గురువు వంటివారు, రైలుస్టేషనువద్ద మేమూ మేమూ కలసికొన్నప్పుడు చి॥ వోలేటి వెంకటరామశాస్త్రిగూడా నాదగ్గఱనే వున్నాఁడు. అతఁడు యీవిషయం అవ సరమైతే జ్ఞాపకంవుంటే చెప్పకపోఁడు అని నానమ్మకం. అతఁడూ మీరూ పిఠాపురంలో వుండేవారే అడిగిచూడండి (శాంతం! పాపం!)

(షరా) ఈవిధంగా నేను పోతన్నగారి వ్యాసంలో వారంరోజుల నాఁడే వ్రాసి స్పేసులువేసి బుక్కుపోష్టు కట్టడానికి (7-12-39 సం॥ తేదీని) 4½ గంటలవేళ సిద్ధంచేస్తూ వుండఁగా శ్రీసోమిన కామేశ్వరరావు (అడ్వ కేటు) గారున్నూ, చి॥ మాపెద్దబ్బాయి స్యాలకుఁడు అల్లంరాజు వెంకట రావు (అడ్వకేటు)న్నూ నన్ను చూడడానికి రాజమండ్రినుంచి వచ్చారు. వెంకటరావు, "వెంకటరామశాస్త్రిగారు స్వర్గస్థులైనారు, విన్నారా! పాపం!" అని అడగడంతోటట్టే (మతిచాంచల్యం కలిగించని వారం రోజులనాఁడు యెవరో చెప్పఁగా విని అది చికిత్సవల్ల తిన్నఁబడుతుందను

కొన్నాను) "అన్నా కలాషష్టికి లోపుననే - 56 వత్సరాల ప్రాంతంలోనే బాగా వృద్ధకాయుఁడుగా వుండి ఉద్గ్రంథరచనచేస్తూ కొంతకాలంనుంచి ఆంధ్రి (యీపత్రికను స్వయంగా రాయగాని భార్య మేనల్లుఁడు ద్వారా నన్ను వ్యాసాలుకూడా యీమధ్యనే అడిగింపాఁడుపాపం!) అనే పత్రికను సాఁగిస్తూవున్న శిష్యుణ్ణి దైవం హఠాత్తుగా అంతరింపఁజేశాఁడే! అని పరిపరివిధాల విచారిస్తూ నేను సాక్షిగా వేసుకొన్నంయితేనా భగవంతుఁడు ప్రస్తుతగండాన్ని దాటించ లేకపోయినాఁడు కదా అని దుఃఖింపవలసిన వాడనయితిని. ఇతనికిన్ని నాకున్నూ శైష్యోపాధ్యాయిక బాంధవ్యమే కాదు, ఉగ్గులుబాంధవ్యంకూడా వున్నది. ఇతని పితామహుఁడున్నూ, మాతండ్రిగారున్నూ సాక్షాత్తుగా పినతల్లి పెదతల్లి బిడ్డలు. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి. పేటూరి ప్రభాకరశాస్త్రి లోనైనవాళ్ళకోటిలోవాఁడు యితఁడు కూడ నాకట్టివాఁడే. అప్పుడు యితఁడు నన్ను అవసరాన్నిబట్టి ద్వేషించి నట్టు పైకి కనపడినా అంతరంగరీత్యా ద్వేషించినవాఁడు కాఁడు. ఆ యీ సందర్భం నేనక్కడక్కడ గ్రంథంలో సూచిస్తూనే వున్నట్టు పరిశీలిస్తే గోచరిస్తుంది. ఇటీవల, అనఁగా తనసహాధ్యాయి స్వర్గతుఁడైనపిమ్మట యెప్పుఁడూ నన్ను వల్లెత్తుమాట యితఁడన్నట్టులేదు; యెక్కడా వ్రాసి నట్టున్నూ లేదు. యీసందర్భం నేను ఆప్తులు పలువురితో అప్పుడప్పుడు ప్రశంసిస్తూ వచ్చినదేకాని నేఁడు విచారావస్థలో చెప్పేదికాదు. నన్ను కొందఱు ద్వేషించినవారు, యితణ్ణి సహాయంకోరి నట్టున్నూ నిరాకరించి నట్టున్నూ కూడా వినివున్నాను. ఇతనిస్వభావం అట్టిదే. యిదిన్నికాక యితనికి స్త్రీసంతానం హెచ్చు. ఒకపిల్లని మాచిరంజీవులలో పెద్దవాని కిచ్చుటకై యితనికి తాత్పర్యం వున్నట్టు యితనికి సాక్షాత్తూ పెద్దతల్లి కుమారుఁడు (శ్రీ ఆకొండి రామమూర్తిగారు (దేవీభాగవతంలో నవమ స్కంధం ఆంధ్రీకరించిన కవిద్వయంలో వకరు) స్వయంగా నాతోసుమారు పదియేళ్ళకు పూర్వమే చెప్పినారు. ఆయన యిప్పటికి సజీవులు కొంత పెద్దలేకాని నాకన్న చిన్నలే) ఆయన యితనిహృదయం తెలియకుండానే

కల్పించి చెప్తారని నేననుకోలేదు. కాని జరగడంమాత్రం జరగలేదు. యెందుకు జరగలేదో (కారణాలు చాలావుంటాయి) ఆ రామమూర్తి గారే చెపుతారేమో! నేను అయిష్టాన్ని లేశమూ సూచించలేదు. యిట్టి యోగ్యుఁడు యింకను అధమం రెండు దశలేనా వుండి భాషాసేవచేసి కొన్నిబిరుదులు (కళాప్రపూర్ణ వగయిరాలు) పొందతగ్గవాఁడు. నేఁడు యేకవ్వులకున్నూ లేని మహదాశ్రియం కలవాఁడు. హఠాత్తుగా స్వర్గతుఁడై నాకు తీరని మనోవ్యధను కలిగించినాఁడు. ఆంధ్రీపత్రికకు యీదుఃఖ మున్నూ, లోటున్నూ తీరదుకదా అని రెండవవిచారం. యిట్లు పలు విధాల విచారిస్తూ ("మరణాంతాని వైరాణి") యన్నట్టుకాక "అబ్బాయీ? భగవత్సాక్షిగా చిరకాలంనాఁడే నీయెడల దయార్ద్రిమైన హృదయంగల వాడను సుమీ నేను" అని యితనికిఁ దెలియుటకై అప్రియత్నముగా దొరలిన అశ్రుతర్పణం :—

శా. "అన్నా! వేంకటరామశాస్త్రి! సుఖివై యాయుర్బలంబున్న 'సం
పన్నుండీతఁడు సత్కవీశ్వరుఁడు మావాఁ' డంచు మాబోంట్లు ని
న్నెన్నన్ గబ్బము లెన్నిచేతువొ గదా? యేలోపమున్ లేని నీ
చెన్నున్ జూడఁగలేక ధాతయిటు చేసెన్ గన్నుగుట్టెన్ గదే!"

క. వయసేఁబది యాఱిటి కె
చ్చయియుండదు త్రిదశకాలమైశ్వర్యముఁద
ద్దయుననుభవించి త్రిదశా
లయమేఁగితె? లేవెనీకిలన్ దత్సుఖముల్.

షరా: 26 వత్సరాల వయస్సులో పిఠాపుర సంస్థాన ప్రవేశం.

ఉ. ఇచ్చునె యింతకెక్కుడుగ నింద్రుఁడు నీకుఁబిఠాపురీ విభుం
డిచ్చినదాని కిబ్బడిగ నీఁగలఁ డేమియతండు? నేనుని
న్నచ్చటఁ జూచినప్డు గతమంతయు జెప్పెదు "మోసమైయిటుల్
వచ్చితి" నంచు నెంతపొరపాటొనరించితి పెట్టిశిష్యుఁడా?

తే. నీవుసహపాఠియేకాదు నాదుసుసహా
పాఠియిర్వురచ్చట లేనిభాషతెలుఁగు
వ్యాపకము చేయుచుండు రవ్వారికేవు
తోడుపడి నాదునేమంబుగూడఁ జెపుమ!

తే. కొన్నిపనులుండుటంజేసి కొంతకాల
మాఁగుటావశ్యకంబయి యాఁగినాఁడ
నాయె నా కార్యములు తరువాయి స్వల్ప
మనియు మనవాండ్రితోఁ జెప్పుమయ్య! నీవు

శా. నన్నున్నీవు త్యజించి యేఁగినను నీ నాణెంపు శుశ్రూష నా
హృన్నీరేజమునందుఁ బాయదుసుమీ! హేత్వంతరమ్మొండి యే
తెన్నో త్రొక్కితిగాక, మెచ్చఁదగు సంతేవాసి, పేరుండి, నీ
వన్నా! పోవుట యెంత హానిపడియో ఆత్మన్ విచారించితే?

తే. ఆఁగుట వశమ్ముకాక నీవేఁగినాఁడ
వేఁగుట వశమ్ము లేక నేనాఁగినాఁడ
దైవతంత్రమ్ము లోకవృత్తు దైవమునకె
వశముగావన్న నింకెవ్వరికి వశము?

మ. పితృభక్తిన్ గల రెందఱేనియు నిసుం బేర్కొందు నవ్వారిలోఁ
గృతకృత్యుండవు, పటంచు నేనెఱుఁగుదున్ గ్లేశంబు లక్షింప కే
గతి నీవందుఁ జరించితో? యెఱుఁగు నీగ్రామంబు, నీకిచ్చుచ
ద్గతి నాసేవయె, లేదుసందియము; స్వర్గంబేఁగి భోగింపుమా!

యీపద్యాలతోకూడా అశ్రుతర్పణాన్ని విడుస్తూ యింక విధిలేక యెట్లో లోఁగడ నే వ్రాసిన యీవ్యాసమును మరల తరవాయి నందు కొనుచున్నాను.

ప్రకృతం యేమిటంటే? అంత హెచ్చుగా వాదోపవాదాలు చేసు కున్న శ్రీ కాశీనాథశాస్త్రుల్లుగారున్నూ నేనున్నూ క్షణంలో మిత్రులమైనా

మనియ్యేవే. యిప్పుడు నాపై పగసాధిస్తూ వున్నవారితో మైత్రి సంపా దించుకుందా మని త్రికరణశుద్ధిగా యెంతో ప్రయత్నించాను. పలువురు పెద్దలయెదుట సాష్టాంగంపడ్డాను. కృతకృత్యుణ్ణి కాలేకపోయాను. "నీవు దొంగవు" అనిపించుకున్నాను. యేలాగో నన్ను సాధిద్దామనే పట్టుదల. మార్గాంతరాలు నాకు చేతఁగావు గాని వాదోపవాదాలలో యితరులకు ప్రయోజనం వుండదు. నేను అంతో యింతో గురుశుశ్రూష చేసి శాస్త్రా భ్యాసం చేసినవాణ్ణిగదా! యేలా లొంగుతాను? మీరే చెప్పండి నాయన లారా! యిఁకనల్లా తప్పుకాకపోయినా తప్పని వొప్పుకోవాలి. సరే మీరే మవుతారు? యింకా శ్రీ కాశినాథశాస్త్రుల్లుగారి సౌహార్దప్రశంస కొంత మిగిలేవుంది. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని" అనడం చేత వ్యాసోపరమణంలో అటువంటి నిష్కల్మషహృదయుణ్ణి స్మరించడం కూడా కొంత ప్రస్తుతం కాకపోదు. (ఆయీ యితిహాసాన్ని వుదాహరించ డాన్ని కొందఱు ఆత్మోత్కర్షకోసమని అపవదిస్తారు కాఁబోలును. అయితే మాత్రం యేమిచేయను? అవసర మయిందికదా!) కాఁబట్టి చేదస్తంగా వున్ననూ విస్తరిస్తాను. వేసవిలో 1912వ సంవత్సరంలో శ్రీ వేంకటగిరి మహారాజావారు చెన్నపట్టణంలో శృంగారగ్రంథనిషేధాన్ని అరికట్టడానికి సమకూర్చిన పండితపరిషత్తులో మళ్ళా శ్రీ కాశినాథశాస్త్రుల్లుగారి సమా వేశం తటస్థించింది. అప్పుడు పలువురు వారివారి శక్త్యనుసారం వ్యాసాలు వ్రాసుకు వచ్చారు. మేమున్నూ వ్రాసుకు వెళ్ళాము. వొకరివ్యాసాలు వొకరికి వినిపించుకొన్న తరవాతనే సభలో వినిపించడం జరిగింది. బసలో అన్యోన్యవ్యాసాలు వినిపించుకొనే సందర్భంలో కాశినాథశాస్త్రుల్లు గారు నావద్దకువచ్చి "వెంకటశాస్త్రుల్లుబాబూ! (యీ సంబోధన తూర్పు వారికి పరిపాటి) నావ్యాసం నీవు ప్రత్యక్షరమున్నూ వినాలి. 'శంఖుని పోస్తేకాని తీర్థంకాదు' అంటూ నన్ను గౌరవించడం అప్పుడేకాదు యిప్ప టికీ నాకు పరమాశ్చర్యంగానే కనపడుతుంది. నేనున్నూ లజ్జపడుతూ నావల్ల మీకు కావలసిన సవరణలంటూ వుండవని మనవి చేసుకుంటాను.

ఇది స్వభావోక్తి. అలా అయినప్పటికీ వినవలసిందంటారా? "దేవ ఆజ్ఞకు బద్ధుణ్ణి" అంటూ మనవిచేసి వినడం జరిగింది. ఆయీ యితిహాసం వల్ల ఆ మహాపురుషుని అంతఃకరణ శుద్ధిన్నీ — "విప్రులయందు దయయుఁ దృణహుతాశనమ్ము దీర్ఘమగునె" అనే నన్నయ్యగారి పద్యానికి ప్రథమోదాహరణంగా వుండే "బోళా" తనమే గ్రహించవచ్చును. నన్నేమో ఆయన ఎందుకూ కొఱగాకుండా పరాభవించినట్టు వ్రాస్తారు ప్రస్తుత మహాత్ములు. మాకూ మాకూ వచ్చినవాదం కవితాసంబంధం కనక గాని కేవలమూ శాస్త్రగ్రంథాలలోనే అయితే నన్ను ఆ గ్రంథపంక్తులు అన్వయించడంలో వాదంవస్తే ఆయన పరాభవించడంలో ఆశ్చర్య మేముంటుంది? (అయితే ఆయనమాత్రం కవీశ్వరుఁడు కాఁడా అంటూ శంకిస్తారేమో? ఆశంకకు నేను జవాబు చెప్పలేను. భావార్థాన్ని వ్రాస్తున్నాను. మీచిత్తం. తరవాత) కాశీనాథశాస్త్రుల్లుగారేమి మ॥ మ॥ ద్వాయులు రాయఁడు శాస్త్రుల్లుగారేమి ప్రత్యేకించి శాస్త్రాలు కృషిచేసి నాగోజీ దీక్షితాదులవలె శాస్త్రాలమీఁద వ్యాఖ్యానాలు చేసే తెగలో గణింపఁదగిన దిగ్గజాలు. మేమో? చదివిన శాస్త్రంలోనే వుండి వారివలెనే కృషిచేస్తే మాట యేలాటివాళ్ళల్లో జమకట్టఁబడేవాళ్ళమో మనవి చేయఁజాలను గాని పుట్టుకతోనే వెంటాడించిన కవిత్వం "నమః ప్రామాణ్య వాదాయ మత్కవిత్వాపహారిణే" అన్నమాదిరిని ఆవ్యాసంగం వెనక్కి పెట్టి పొట్ట కోసమే అనండి, లేక ప్రఖ్యాతికే అనండి లేదా, వ్యసనమే అనండి చేయడంవల్ల 24 గంటలలో యేనాల్గుగంటలో తప్ప కవిత్వంలోనే మునిఁగి తేలడంవల్ల "శాస్త్రేషు భగ్నాః కవయో భవంతి"గా పరిణమించవలసి వచ్చింది. యీ శ్లోకపాదానికి నేను చెప్పే సమన్వయం "కవయః శాస్త్రేషు భగ్నాః" భవంతి అని కాని "శాస్త్రేషు భగ్నాయే (విద్యంతే) తే కవయో భవంతి" అనికాదు. ఈవాక్యప్రకారం మొదల శాస్త్రం చదవడానికి ప్రారంభించి "సందుఁగొట్టిన" వారందరూ కవులు కావలసి వస్తుంది. అది సర్వానుభవవిరుద్ధంకదా! ఇత్యలమతివిస్తరేణ.

సర్వదా కవిత్వంలోనే కృషిచేసి శాస్త్రభగ్నత్వాన్ని సంపాదించు కొన్న మమ్మను దానిలోనే పఠనపాఠాలు జరుపుతూ వ్యాఖ్యానాలు వ్రాస్తూ శాస్త్రార్థాలు చేస్తూ ప్రసిద్ధిచెఁదిన శ్రీ కాశీనాధశాస్త్రుల్లుగారు గాని, వేఱొకరుగాని పేలఁగొడతారన్నందుకు సర్వులూ అంగీకరిస్తారు, కాని మాకున్నూ మాకున్నూ అట్టి ప్రసక్తి యెన్నఁడున్నూ సంఘటించలేదు భగవంతుఁడు. కవిత్వవిషయంలోనే లక్ష్య లక్షణాలతో సంబంధించిన చర్చ సమకూర్చాడు - కొంత చర్చ జరిగింది - యేదో అయింది. అది గ్రంథరూపంగా అచ్చుపడే వుంది. యిప్పుడుకూడా ఆరికార్డు నావద్ద జాగ్రత్తలో వుంది. అయితే శ్రీ విజయనగరం మహారాజావారి సభలో శ్రీ శాస్త్రుల్లుగారికిన్నీ మాకున్నూ వ్యాకరణశాస్త్రంలో వాదం వచ్చినట్టున్నూ మమ్మల్ని ఆయన వోడఁబుచ్చినట్టున్నూ ఆక్షేపకులు వ్రాసినట్టు జ్ఞాపకం. "సుధ్యుపాస్యః" అనే స్థలంలో శాస్త్రార్థం శ్రీమహారాజావారి ఆజ్ఞానుసారంగా (శ్రీఆనందగజపతి తర్క-వ్యాకరణాలలో వాదించుకొంటే విని గెల్పు వోటులు నిర్ణయించేశక్తి వున్న విద్వన్మహారాజు) కొంతవఱకు జరిగింది. యింకా జరిగితే ఆయన మమ్మల్ని నెట్టేవారేమోకాని వొకటి రెండు మూఁడు పర్లిటీలలో శ్రీమహారాజావారు సెలవిచ్చారు కదా "వారి కవిత్వం విన్నాము. వారు కేవలకవులో విద్వత్కవులో తెలుసుకోవడానికి దీన్ని కూడా కొంచెం అడగమన్నాం అడిగారు చాలును." అని ఆఁపుచేసి మళ్ళా వారు స్వయంగా "శ్వపుచ్ఛ మవనామితమ్" అన్నచోట 'శేఫపుచ్ఛ లాంగూలేషు శునః' అని అలుక్కు యెందుకు రాలేదు? (దీన్నిబట్టి మహారాజావారి శాస్త్రపరివేశం విజ్ఞులు గుఱితించె దరు గాక) అని ప్రశ్నించారు. అది సంజ్ఞావిషయక మేమో? గ్రంథం చూచికాని నిర్ధారించి మనవి చేయడానికి తగ్గంత జ్ఞాపకం లేదన్నాము. దానితో శ్రీవారు 'బస్!' అని సెలవిచ్చి ఆఁపుచేసి సభకూఁడా ఆఁపి చెన్నపురి ప్రయాణానికి రైలుకు దయచేశారు. ఆసభలో హేమాహేమీలు (1) పేరి వేంకటశాస్త్రుల్లుగారు, (2) కొల్లూరి కామశాస్త్రులు

గారు మొదలైన చాలామంది పండిత ప్రకాండులున్నా, (1) రామావతారంగారు, (2) లింగం లక్ష్మీజీరావు పంతులుగారు, (3) గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు లోనైన లౌకికవిద్వాంసులున్నా వున్నారు గాని ఆయా విషయానికి వీరి నెవ్వరినీ సాక్ష్యంగా చూపుదా మనుకొన్నప్పటికీ ప్రయోజనం లేదు. వీరందఱూ ఇప్పటికే కాదు యిప్పటికి చాలా కాలంనాఁటికే శ్రీ మహారాజావారితోపాటు కీర్తిశేషులే (నాకన్నముందటి వాఁడు పోలేటిశిష్యుని సాక్ష్యమే తుదకు ఫలించలేదు కదా ! యీ మహా పెద్దలు నిల్చివుంటారా ? ) ఆలాటి సభలో మేమా ప్రసంగం నిలపడం ఒట స్టించడంచేత నిజం మనవిచేస్తాను. నాకు స్వర్గలోకమందు అంతగా అభిలాషలేదని ఖండితంగా వ్రాయఁ గలుగుతున్నాను. నాటకచర్యలో "రాజనిస నాఁడే మంత్రిరాట్ప్రసంగ" అనేపద్యంలో సూచిప్రాయంగా నా ఆనందాన్ని వెల్లడించాను. ఏదో కౌపీనధారణం మొదలుకొని యీ విధంగా మహాపండితుల పరిచయంతో కాలక్షేపం జరుగుతూవుంది నా జన్మానికి.

యిక్కడ ఒక్కమాట మఱచాను. శ్రీ॥ మ॥ మ॥ పాధ్యాయుల రాయఁడుశాస్త్రుల్లుగారు (రాయడుశాస్త్రుల్లుగారు అప్పటికే మహావిద్వాంసులు. కాని యింకా విద్యార్థిత్వాన్ని వదులుకోలేదు ; దివాన్‌జీగారివద్దనే కాని రాజావద్ద ప్రవేశం లేదు.) ఆ మహాసభలోనైతే లేరుగాని లేకపోయినా యిటీవల ఆయా సందర్భాలు విని వుండకపోరు కాఁబట్టి నేను వ్రాసిన ఆయీ చరిత్రలో నేమైనా కల్పిత ముందేమో సంశయం వుంటే శ్రీవారిని భోగట్టా చేస్తే తెలుస్తుంది. అంతో యింతో శ్రీశాస్త్రుల్లుగారికిన్నీ మాకున్నూ ( పశ్యాపశ్యానపశ్యతః ) వాదోపవాదాలు జరిగివున్నాయి. (రాయఁడు శాస్త్రుల్లుగారికీ మాకూ వాదోపవాదా లంటే ప్రస్తుతం ఫిన్లాండు రష్యాల యుద్ధంవంటి దనుకోండి) అంతతో అవి సమసిపోయినాయి. ఆమధ్య శ్రీరాయఁడుశాస్త్రుల్లుగారు శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగపీఠానికి సమ్మానార్థం మదార్సు దయచేసినప్పుడు యేదో ప్రసంగిస్తూ మమ్మల్ని

గూర్చి ముచ్చటించిన మాటలు త్రిలింగపత్రికలో చదివినట్టు జ్ఞాపకం. ఆమాటలు శ్రీవారి మహౌదార్యాన్ని పూర్తిగా వెల్లడిస్తూన్నాయి. అప్పుడే కాదు మఱివకప్పుడుకూడా రాయఁడుశాస్త్రుల్లుగారు - "లక్ష్యవిషయంలో వాళ్ళకు వాళ్ళే దీటు" అని ప్రసగించినట్టు విన్నాను. ఆయీప్రస్తుత వాదంలో వున్న శబ్దసాధుత్వాన్ని గుఱించి వారిని ప్రార్థిద్దామని అనుకున్నానుగాని అంతట్లో దైవం ఆశాస్త్రుల్లుగారికి తరంగాని దుఃఖాన్ని తెచ్చిపెట్టడంచేత హతాశుణ్ణి కావలసి వచ్చింది.

మీ నిఘంటుసభాధ్యక్షులు సామాన్యులు కారు. ఆయన జీవితాన్ని ఉద్యోగిగాఁ గడపినట్టే యెవ్వరూ భావించరు, వృగ్గుఁబాలసుంచిన్నీ ఆయనకు కవిత్వంతోటిన్నీ, కవీశ్వరులతోటిన్నీ విస్తారం పరిచయం. పండితులతోపాటు శిష్యులకు పఠనపాఠాలు చెప్పే శక్తిలేదుగాని ఆంధ్రకవిత్వానికి అవసరమున్నంత సంస్కృత పాండిత్యానుభవానికి యీనాఁటి సుప్రసిద్ధ కవులలో చాలామందికన్న ఆయన హెచ్చుతారు గాని తగ్గరు. నేను వుత్తరించినశంకలు బొత్తిగా "లోయరుక్లాసు" లోవిగాని హెచ్చుతరగతివి కావు. ఇట్టిసందర్భంలో ఆయన్ని నేను నా సమాధానాలగూర్చి పద్యపూర్వకంగా ప్రశ్నించాను, ప్రార్థించానుకూడాను. అదే 'జయంతి' అంటే. భగవంతుఁడు ఆయనకు తోఁపించిన సందర్భాలు వ్రాస్తూ కొంచెం మొగమాటపడే అనుకుంటాను ప్రతివాదులకు కూడా మూఁడుచోట్లు అనుకూలించేమాటలు వ్రాసి వున్నారు. అందులో వకటి - 'శోభనపదం' గర్భాధానపరంగా వాడడం అంత యుక్తం కాదన్నది. అర్ధానికి శిష్టలోకాధారమే కాక గ్రాంథికాధారంకూడా బోలెఁడు వున్నప్పటికీ నేను కోరుకున్నప్పుడు తీర్పుకు బద్ధుణ్ణి కావడమే యుక్తంగాని ప్రతిచెప్పడం భావ్యం కాదని కిక్కురుమనకుండా వూరుకున్నాను.

(కిక్కురుమనే అంటే ? పండితలోకం కాదుగాని పామరలోకం దూషిస్తుంది.) అంతతో యీచిక్కు నమసిపోతుందని నేను విశ్వసించి సంతోషించాను. ఆలాక్కాక "యినుమునుబట్టి అగ్గికి సమ్మెటదెబ్బలు"

అన్నట్టు (శ్రీల్గుబెండుతీర్పుచూ.) అయిన్నికూడా "నత్వాం తృణం మన్యే తృణాయ వా"గా వషట్కరిస్తూ (సంహాదశ్రీశతాయ స్వాహా) వ్రాత బయలుదేరింది. అంతతోటిన్నీ తృప్తిరాక మహా ఉన్మాదంతో అగౌరవ సీయుణ్ణి —ఘు-ఘు-ఘు-ఘు-ఘు-ఘు-గా వషట్కరిస్తూ. యీగౌరవ సీయుణ్ణిగాని యెవ్వరున్నూ యేకాలమందున్నూ వషట్కరించనిపోకడతో వక వ్రాత బయలుదేరింది. దానిలోనే వకవాక్యం: "నీకు తెలియకపోతే సినిఘంటుకార్యస్థానం పండితులని అడిగి తెలుసుకోవలసింది. వారు నీకు బోధిస్తారు" అనే అర్థమిచ్చేవాక్యం ప్రస్తుతం యిమ్మన్ని నేను అభ్యర్థించవ డానికి వీలుఘాత మయినది. బుద్ధిపూర్వకంగానో, ప్రమాదంగానో వ్రాసింది. పంతులవారు దీనికోసం వారిని అడుగుతారా, చేస్తారా? వారు, ఆయా విద్యయందు యెంత అనుభవాన్ని సంపాదించుకున్నా వారికి యెదటివారివిన్నీ పరివారంలో వున్నతిప్పల అనుభవాన్నిబట్టియ్యేవే వారిపరిస్థితివుంటుంది. అనగా, యేవో భగవంతుడు తోచించినట్టు చెప్పడం ఆ పట్టాన్ని పూరుకోవడం అంతేనేగాని దానికి సంబంధించినవారు గాని, యితరులుగాని యేమేమో అపవదిస్తూవుంటే ఆ అపవాదాలకు జవాబు చెప్పడం అనుచితం అని వారికి పూర్తిగా తెలుసును. అందుచేత వారిని యెంతమందుగా మాలనాడినప్పటికీ వారు కిమన్నాస్తిగా వూరుకున్నారు. యిటీవల వెలువడ్డ పుస్తకం వారు చూచారో లేదో? అసలుదీని పుట్టుకను గూర్చికూడా వారు వినలేదేమో? నాకు బాగా తెలియదు. పంతులవారికీ నాకూ యేనాడిలోవున ప్రత్యుత్తరాలు జరిగినట్టులేదు. "దీన్నిచూచారా తమరు" అని వారికి నేను వ్రాయడానికి భయపడ్డాను. 80 యేళ్ళ వార్ధక్యంలోవున్న సుకుమారిని. రుగ్ణుణ్ణి నేనై యింతలోకిదింపి దీనిమూలాన్ని వషట్కారాలకు గురిచేసి యింకా సిగ్గులేక యేమొగం పెట్టుకొని 'చూచారా' అంటూ ప్రశ్నించేది అనుకొని నాలోనేనే అణగించి వూరుకున్నాను. యీ పోతరాజు వ్యాసం చాలాభాగంవ్రాసి మూడుమాసాలకు కొంచెం యెక్కువకాలమే అయింది, పూర్తిచేసి పత్రికకుపంపి మాసం కావచ్చింది. అంతట్లో

పంతులగారిని —ఁడు—ఁడు—ఁడు—ఁడు వగయిరాలతో వషట్కరించిన పుస్తకం బయటపడింది. అందులో వారు (జయంతివారు) మిమ్మల్ని అడిగి తెలుసుకోవలసినట్టు వున్నా అది నానిమిత్తార్థమైనదే కనక నేనే అడిగితే మాత్రం తప్పేమిటి అని దీనిలో "సరాజు పెళ్లిలో గుఱ్ఱాజుకొకపోఁచ" గా నాల్గుమాటలు వ్రాసి ప్రార్థించాను. యేకొద్దిపాటిశంకలకో నాసమాధానం వుంది గాని దీనిలో తక్కినవాటికి లేదుకదా ! వున్నంతమట్టుకు సమాధానాలలోవున్న లోపాలు తెలపండి. వారి జాబితాలో ససారమని తమకు తోఁచిన శంకలేవేనా వున్నట్టు మీకు తోస్తే శృంగగ్రాహికయా వాట్లని యెత్తుకొని "వీట్లకు నీజవా బేమిటి ?" అంటూ నన్ను తాము అడగండి. తోఁచిన వుపపత్తి చెపుతాను. లేదా, అది ప్రమాద పతితమే అనికాని, తప్పే అనికాని వొప్పుకొని సవరించుకుంటాను, ఆయీ అపశబ్దా లనేవి కొన్ని వుటంకిస్తూ వ్నాను : విర్ఘురి-ఏనిని, కవిసింహ బిరుదు - ఏతద్బొబ్బిలి- కవిప్రశంస - ఉదార(స్వరయతికి) ఉ. స్త్రీలను గూడ(ఇందులో అశ్లీలాన్ని) గ్రంథారంభం 'చేసెన్ దీనిని' అనే పద్యంతోటా, లేక 'సిరియును సంపదయును' అనే కందంతోటా ! కంజముఖీ కబరీభరోత్కరానందదము శిశిరర్తువు కాదా ? బృందావనం తీర్థమా, లేక క్షేత్రమ నాలా, రెండూ అనవచ్చునా ? మహస్తరణులు (మహః = తేజస్సుచేత తరణులు సూర్యులు) అన్నచోట మహాస్తరణులు అని అచ్చులోవుంటే, అచ్చు పొరపాటా, అది నాప్రమాదమేనా ? వసంతఋతువులో వెన్నెల మాట తలపెట్టనే కూడదా ? కూడని పక్షంలో, వసుచరిత్రలో యెన్నోపుటలు దానికోసం నిండి వున్నాయిగదా, వాట్ల గతేమిటి?నేనల్లా—" పరిలసచ్చంద్రద్యుతుల్ యామినుల్ " " వసంతవిభూతిన్ వెలయించె " అని మాత్రమే అన్నాను. యేవేవో ఆవసంతఋతువుకు శోభను కలిగించాయంటూ సంగ్రహంగా వ్రాసుకుపోతూ యీమాటకూడా ఆపద్యంలో యిమిడ్చాను. చంద్రద్యుతులుగల యామినులు వసంతఋతు శోభను హెచ్చించా యన్నాను. గాని వసంతర్తువు వెన్నెల శోభను హెచ్చించింది అనలేదు కూడాను. యీలాటి ప్రశ్నలే ఆర్థికాలు కొన్ని,

శాబ్దికాలు కొన్నివందలకొలఁది వున్నాయి. యింకా-ఘనసి. ఘనసము. (ఘనశబ్దము స్త్రీలింగమైనచో ఘనిణి రావలెనఁట : అట్లైనా ?) యెన్నని వుదాహరించేది ?

"సత్కవీంద్రప్రస్తుత మౌను మాఘము పదంపడి మాసము వచ్చె" యిక్కడపదంపడి మాఘము. మాసము వచ్చె అనేవుద్దేశంలో నేను ప్రయోగించాను. (పాఠక్రమా దర్థక్రమో బలీయాన్) ఆక్షేపకులో ? "మాఘము పదంపడి మాసము (ఫాల్గునమాసము)" అని అర్థం చేసుకున్నారు. దానిమీదవచ్చే విప్రతిపత్తులు చూపడానికి ప్రారంభించారు. ఇది సమంజసమేనా ? అది వ్యస్తంగాని సమస్తంకాదు నావుద్దేశంలో. మాఘముపదంపడి సమాసంచేసికొన్నారు. సరే. అది భ్రాంతిమూలకమేనా అనుకోవచ్చును. మళ్ళా వేటొకచో "జీవితపుంబిమ్మట" అనేదానికి జీవితానంతరము అనే అర్థం రాదంటారు. యింకాయెన్నో వున్నాయి. యెవరికేనా ప్రమాదాలు రావచ్చు. అందులో నాబోఁటివానికి హెచ్చుగా రావచ్చు ప్రమాదాలు. ఇవి ఆలాటివేనా ? "తనయుల సనయుల మనుమల ఘనముల మునిమనుమల సైతము ముదమలర" అని వర్ణించాలని యేమో (అసలు నాకు యమకం మంటే యిష్టమే వుండదు.) యమకాని కని. ఘనములన్ (ఘనా -|- మా = లక్ష్మీః, యేషాం తే, ఘనమాః తత్వముం : ఘనములు) అనే అర్థమని బుద్ధిపూర్వకంగానే ప్రయోగించాను. యిది క్లిష్టమంటే వొప్పుకుంటాను. దీన్ని యిటీవల కల్పించి చెప్పేదంటూ అపవదిస్తారేమో. దానమ్మాటటుంచు కాలితే "మనుమలన్" అనే మహదర్థకానికి 'మనులు' అనక "ఘనములు" అని అమహదర్థకవిశేషణం వేసేటంతటి (తెల్వితక్కువవాఁడనే అని సిద్ధాంతీకరించండి) తెల్వితక్కువవాఁడు వెం॥ శా॥ అని బుకాయింపు చేయఁగానవాని కేమైనా అర్థం వుందా ? అలమతి విస్తరేణ. నాప్రమాదమున్నా వొక్కటిరో "తనసేనన్నడిపించి ఘాసు కౌమరున్ దద్వైరిబలంబమ్మునుండి, సమేషమ్మున దెచ్చి యిచ్చుటయుఁ దద్ధీరత్వమున్." అన్నచోట విశ్రమము పోయింది. ఇది విమర్శకులు తెల్పినందుకు నేను కృతజ్ఞుఁడను. ఇట్టివాటి యిటీవల

కూడా కాకపోవడంచేత దిద్దకుండానే వీ. పీ. లు రవాణా చేసుకొంటూ వున్నాను. యింకోచోట కందంలో గణంతప్పింది. అది నామేనల్లుఁడు సుబ్బారాయశాస్త్రి తెల్పితే ఆపద్యం దిద్ది వీ. పీ. లు పంపుతూన్నాను. విమర్శకులకు దిద్దినది దొరికింది కాఁబోలును. అందుచేత అది జాబితాలో యెక్కలేదు. "గుల్ఫములనెమరు" కూడా నా అజ్ఞానప్రయుక్తమేకాని అది అభూతోపమగా (ప్రాచీనమతంలో)నో, ఉత్ప్రేక్షగానో (నవీనమతంలో) సమర్థింపఁబడు తుందని వ్రాశాను. యుక్తంగావుంటే చూడండి, లేదా లేదనండి. యేమేనా నేను అది ప్రమాదపడ్డ స్థలమే అని స్పష్టంగా వ్రాశాను. భవతు.

యేవో తప్పులు నిరూపించారు. మంచిదే. కృతికర్తయందు కోపం వుంది గనుక నన్నుతిట్టారు. వొప్పుదలే. కృతిఁ బొందిన శ్రీ బొబ్బిలిరాజు గారిని యేదో మిషగాఁ బుచ్చుకొని దూషించడం యెందుకు ? శ్రీజయంతి వారిని దూషించడం యెందుకు ? ఆ యీరెండిటిలో రెండవది యిప్పటి గ్రంథంలో వుంటుంది. పరిశీలించండీ ! యిది వైదికమా, లౌకికమా, పాండిత్యమా, కవిత్వమా, ఔదార్యమా, యేమిటో నిర్ణయించండి ప్రాజ్ఞులారా ! మీయందు వారికి నమ్మకంకలిగి వారు మీపేరు నిరూపించ డంచేత నేను ధన్యుణ్ణయినానని సంతోషిస్తూ మీమీఁదనే యీభారం పెడుతూ న్నాను. యిదివఱలో నేనువిమర్శకులను "అయ్యా: మీశంకలు సమంజసాలే అనియేమనీషినిగాని, అంతదాఁకా అక్కఱలేదు మనిషినిగాని వేలుమడిచి కనపఱచవలసింది" అఁటూ విన్నప మంపుకొన్నాను. నా అదృష్టంబాగుంది కనక మనీషులమీఁదనే ఆభారం వుంచి వున్నారు. యింకేంకావాలి ?

భవతు. ప్రధానమైన పోతరాజుగారి కవిత్వ విమర్శలోన్నుంచి యీతరాజు (వెం॥ శా॥) గారి కవిత్వం గొడవలోకివచ్చి చాలా సేపయింది. ప్రధానమైన మాటలు నాల్గువ్రాసి ముగిస్తాను. యిప్పుడు కొందఱు అంగీక రించని ప్రయోగాలు పోతరాజుగారినాఁటికి నిర్దుష్టాలనే కారణంచేతనో, లేక అప్పుడుకూడా కొందఱు దుష్టాలని వాదించేవారున్నప్పటికీ ఆపక్షంలో

వారు పోతరాజుగారు రాకపోవడంచేతనో, యింకా యేమేమి కారణాల (మనకు తెలియనివి) చేతనో పోతరాజుగారు వాడివున్నారే అందాం. అలా వాడిన యితరకవులను గౌరవించి పోతరాజుగారిని బహిష్కరించిన అప్పకవిగారి ప్రవృత్తి నాకు సమర్థనీయంగా కనపడలేదు. యెన్నాళ్ళనుంచో నేను జన్మకర్మశబ్దాలు ముపర్ణవిరహితంగాకూడా వక రూపం (జన్మ-కర్మ) వుంటే బాగుండునని అనుకొనేవాణ్ణి. యెందుకంటారా ? "వాడిజన్మ తరించింది. వాఁడు కర్మచేస్తున్నాఁడు" అనే వాక్యాలలో 'జన్మము, కర్మ ము,' అనడంకంటె ముపర్ణవిరహితప్రయోగమే యింపుగా వుంటుంది. కొన్నిచోట్ల ముపర్ణంతో వాడితే అనుకొన్న అర్థంరాదు కూడాను. "వాఁడు పితృకర్మ చేస్తున్నాడు" యీస్థలంలో కర్మము అంటే సరియైన అర్థంరాదు; రానేరాదు. యిక్కడేకాదు యేదేనా ధాతువు పుచ్చుకొని "దీనిలో కర్త యెవరు ? కర్మయెవరు?" అనేసందర్భంలోకూడా "కర్మమెవరు?" అంటే, అసహ్యంగానే వుంటుంది. జన్మశబ్దానికి యిన్నిచోట్ల ఇట్టి అసామంజస్యం వున్నట్టులేదు గాని అసలు లేకపోలేదు. యిప్పుడు యువకవులు చిన్నయ్యసూరిగారికి భయపడక ముపర్ణవిరహితమైన ప్రయోగాలు జన్మకర్మ శబ్దములకు యథేచ్ఛంగా వారివారి కవిత్వాలలో ప్రయోగాలు చేస్తూనేవున్నారు. నే నెక్కడా యిప్పటికి చేసినట్టు లేదుగాని చేసినవారిని మనఃపూర్వకంగా అభినందిస్తూ చిన్నయ్యసూరిగారి సూత్రంలో వైకల్పిక విశేషణం తగల్చ వలసిందని పండితులకు సిఫార్సుచేస్తున్నాను. పనిపడితే దీన్నిగూర్చి యింకా విస్తరించి వ్రాస్తాను. తెందుపండితులయేండ్లకు పూర్వం ముపర్ణవిరహితప్రయోగాలు కవులు ప్రయోగించినట్టు యిప్పటికినాకు విశేషించి ప్రయోగాలు దొరకలేదు. గాని యిటీవలివారు ప్రయోగిస్తూనే వచ్చారు. భాగవతంలోనల్లా నాకు వొక్కటిమాత్రమే దొరికింది. కాని అది పోతరాజుగారిది కాదు. వారివారి కవిత్వభాగ నిర్ణయాన్నిగూర్చి మీరు యిందులో పొత్తిగా వ్రాయనేలేదేమి అని కొందరు శంకిస్తారేమో ? నేను దేన్నిగురించి మాత్రం విశేషించి వ్రాశాను. యేకొంచెమో వ్రాయడమే అయింది.

వ్రాస్తే యెంతేనా వ్రాయాలి. పోతన్నగారినిగూర్చి కొంచెమేనా వ్రాసి నట్టయింది గాని తక్కిన సింగనామాత్యుఁడు లోనైనవారినిగూర్చి వొక్క మాటకూడా వ్రాయనేలేదు. వారుకూడా మంచి కవులే. పోతన్నగారు రచించినా ఆభాగాలు అంతకన్న మిన్నాగా వుండేవికావు. లోకంచేసుకున్న అదృష్టం మంచిదికావడంచేతనే అనుకుంటాను, రసవత్తరమైన భాగాలు ఉత్సన్నం కావడం తటస్థించలేదు ద్వితీయస్కంధంలో కొంత అయినాక "యిక్కడనుండి మఱివకరి కవిత్వం" అనేఅర్థమిచ్చే శీర్షిక పెట్టఁబడి వుంది. ఈసంగతి ఎంతవఱకు సత్యమో చూదామని బాగా నిఘాగానే పరిశీలించాను. సీసపద్యాలవల్ల ఆసంగతి వెంటనే పట్టిచ్చింది. "కమనీయ భూమిభాగములు లేకున్నవే? పడియుండుటకు దూదిపఱుపులేల?" అనే పద్యం పోతన్నగారిది. యీయన యెక్కడో తప్ప నన్నయ్యగారి నియమం తోటే, అనఁగా యతితోనైతే యతితోటే, ప్రాసతోనైతే ప్రాసతోటే సీసాన్ని తుదముట్టిస్తాఁడు. యెక్కడో గాని ప్రాసయతులతో సీసాన్ని సాఁగించినట్టు కనపడదు. యిది నేను బాగా పరిశీలించి అవగతం చేసు కొని వ్రాసేదే. వెలిగందల నారయ్యగారికవిత్వం ప్రారంభమయినది సీసపద్యంతోటే. దానిలో మొదటిచరణం యీ నియమాన్ని కాపాడింది.

(1) పశుయజ్ఞవాటయూపస్తంభపాత్రమ్ము
ద్ఘటశరావ వసంతకాలమ్ములును,

యీచరణంవల్ల పైసంగతి విస్పష్టమవుతుంది. అన్నీయతులే.

(2) "స్నేహహౌషధీ బహు శోహచాతుర్హోత్రి
మతనామధేయ సన్మంత్రిములును"

యీ ద్వితీయచరణంలో మొదటిదళం ప్రాసయతితోటిన్నీ, రెండో దళం వర్గయతితోటిన్నీ అస్మదాదులతోపాటే పూరించఁబడింది. యీ విష యానికి తిక్కన్నగారే బాహాటంగా మార్గదర్శకులు. నన్నయ్యగారు అంతో యింతో అభ్యనుజ్ఞమాత్రం యివ్వక పోలేదుగాని తరవాత "సూచీ

ప్రివేశే ముసల ప్రవేశః" అయింది. ఆయీ నా వ్రాఁతవల్ల నన్నయ్యగారి కేమో న్యూనత కల్పిత మౌతూవున్నట్టున్నూ, తామేమో ఆయన్ని కాపాడుతూ (బూతులుతిట్టి)న్నట్టున్నూ గుం॥ డి॥ విమర్శకులు వ్రాశారు. అది అన్యత్రి త్రిలింగలో చూడండి.

ప్రస్తుతం పోతన్నగారి కవిత్వ మేది, యితరుల కవిత్వమేది ? ఆవిభేదం యితరు లేలా నిర్ణయించినా నీ వేలా నిర్ణయించా వనేదాన్ని గూర్చినది. యింక వొక్క కందపద్యమున్నూ ఉత్పలమాలానున్నూ అయినతోడనే నారయగారి సీసం ఆరంభ మవుతుం దనఁగా యీ రెండు పద్యాలకూ పూర్వమందు పోతన్నగారి సీసంపకటి వుంది. దాన్ని యీ పత్తున్నూ వుదాహరిస్తాను.

సీ. నర సురాసురపితృ నాగకుంజరమృగ
గంధర్వ యక్ష రాక్షస మహీజ
సిద్ధవిద్యాధర జీమూత చారణ
గ్రిహతారకాప్సరోగణ విహంగ
భూతతటిద్వస్తు పుంజంబులును నీవు
ముక్కంటియును మహామునులు నేను
సలిలనభస్థల చరములు మొదలైన
వివిధజీవులతోడి విశ్వమెల్ల

ఆ. వె. విష్ణుమయమ పుత్ర ! వేయేల ? బ్రహ్మాండ
మతని జానలోన నణఁగి యుండు
బుద్ధి నెఱుఁగరాదు భూతభవద్భవ్య
లోక మెల్ల విష్ణులోన యుండు.

యీపద్యం యెత్తుగీతిసహా యతితోటే ముగింపఁబడింది. సీసగీతులుమాత్రిమే కాదు యితరత్రి వుండే స్వతంత్రగీతపద్యాలు కూడా యెక్కడోతప్ప పోతరాజుగారు నన్నయ్యగారితో పాటుగానే నడిపిస్తారు.

దీనిలో వొకవిధమైన అందం వుంది. కాని వివదించేవారిని సంతుష్టి పఱచడం కష్టం. అంటే ? ఆ అందం యెట్టిదో బోధించవలసిందంటే బోధించ లేమన్నమాట. అది ఆత్మైకవేద్యం. దీనికే కాదు, చాలా విష యాలకు పోతన్నగారు నన్నయ్యగారే. వొక్క సంస్కృత సమాసగ్రథన నైపుణ్యాన్ని మాత్రం నన్నయ్యగారికి "సర్వదుంబాలాయీనాం" గా నేను వదిలుపెట్టి మాట్లాడతాను. దీనికి తినవలసిన తిట్లు యిదివఱకే తినడ మయింది కనక యింక తినవలసిన తిట్లు లేనందున మఱి భయంతీరి దీన్ని వ్రాయఁగలిగాను. యింక "పోతన్నగారి" నామధేయాన్నిగూర్చి కొంచెం వ్రాసి విరమిస్తాను వ్యాసం. గద్యలో పోతరాజుగారు వ్రాసి కొన్న "పోతనామాత్య" అనేది పోతు + అన్న = పోతన్న, పోత + అన్న = పోతన్న అని రెండువిధాలాకూడా కుదురుతుంది. కాని సింగన్న కవిరాజుపదం చేర్చి "పోతరాజుఁ గవిపట్టపురాజు" అన్నదానిలో పోత శబ్దమే కనపడుతూవుంది వ్రాఁతలో. వ్యావహారికంలో పోతురాజులున్నూ కొందఱు కనపడతారు. అమ్మవారి గుళ్ళల్లో వక కఱ్ఱబొమ్మ పోతురాజు పేరింటిది మావైపున కనపడుతుంది. యీపేరు ఆబొమ్మకు సంబంధించిన అధిష్ఠానదేవతదే అయితే - పోతురాజు అనుకోవాలి గాని యెవ్వరుగాని యీగ్రంథకర్తను ఆపేరితో వ్యవహరించినట్టు కనపడదు. కాఁబట్టి సింగ నామాత్యుని "పోతరాజు" పదమే అంగీకరించాలి. ఆపద్ధతిని అందులో వున్న 'పోత' శబ్దము "పోతః పాకోఽర్భకోడింభః" అన్న అమర కోశంలో బాపతు శిశువాచకమో, యేమో చెప్పఁజాలం. ఈపేరు యిప్పటి కంటేకూడా పూర్వకాలంలో యెక్కువ వ్యాపకంలో వున్నట్టే కాక రాజాధి రాజులుకూడా ధరించేదిగా కనపడుతూ ఉంది.

(1) లేటవరపు పోతరాజు లేఁడా ?

(2) హయ మదిసీత పోత వసుధాధిపుఁడు

లోనైనవి పైదానికి వుదాహరణాలు అనపోతవరం వగయిరా గ్రామనామాలుకూడా వారివారి పేళ్ళతో వెలిశాయి. సర్వాత్మనా అకారాంత

శబ్దంగానే దీన్ని అంగీకరించడం యుక్తంగా తోస్తుంది. అర్థంమాట దేవుఁడెఱుఁగును. ఆ యీనామధేయాలకు అర్థనిర్ణయాలు చేయవలసి వస్తే గాని, గ్రామనామాలకు వ్యుత్పత్తులు చెప్పవలసివస్తేగాని యెవరూ బయట పడలేరు. మనుష్యులపేళ్లలో ఆడపేర్లేగాక అమహదర్థకాలు వగైరా మొగవాళ్లకెందఱికో (ముఖ్యంగా వెలమవారిలో) కనపడతాయి; సూరమ్మ గారు, నాయఁడమ్మగారు (ఇది కమ్మవారిది), వెంకటరత్నం, నరసింహం, నారాయణం, యిత్యాదులు. కొన్ని బహువచనంలో వుంటాయి. శ్రీరాములు, నరసింహులు. కొన్ని నీచార్థమందు యీబహువచనంలో వాడఁబడుతూ వుంటాయి. సుబ్బులు, వెంకులు వగయిరాలు. ఆఁడవాళ్లల్లో కొన్ని నీచార్థ మందు యీపేళ్లు మనభాషలో వ్రాసుకోవడానికి అవకాశంలేని అక్షరంతో వుంటాయి. వెంకావ, పుల్లావ యిత్యాదులు. ఇందులో తుట్టతుదివర్ణం వకారమూ కాదు, మకారమూకాదు. రెండిటికీ మధ్యగా వుచ్చరించే వొతా నొకవర్ణం. వెంకమ్మ, పుల్లమ్మ అనేవాళ్లే దాసీలై యీపేరు సంపాదించు కున్నారు. అచ్చాలు, బుచ్చాలు వగైరా బహువచనప్రయోగాలు అంతకంటె నికృష్టమైన అంట్లు వగయిరా తోమేపని చేసేవాళ్లనుగూర్చి వాడేవి వున్నాయి. అమ్మపదానికి జీప్పుచేసి మాప్రాంతాలలో నిమ్నజాతుల స్త్రీలను అమ్మి అని వాడడం కలదు. సంస్కృతభాషామర్యాద ననుసరించి వెంకి, బుచ్చి అన్నట్టే స్త్రీలనుగూర్చి అలా వాడుతూన్నారు సరే. మొగవాళ్లకు కూడా ఆజీప్పు వుపయోగించి అబ్బి అని వాడడంకూడా వుంది. స్త్రీలకు అమహన్నామాలు - వెంకటాచలం, గరుడాచలం, సింహాచలం, వగయిరా తఱుచు పూర్వం వేశ్యలలో వుండేవి. కారణం, యెవరికిఁ బడితే వారికి అవసరమైతే భార్యాస్థానాన్ని పూరించతగ్గ రిజర్వ్‌శాఖ కనుక అమ్మపేరు లేకుండా పిలవడానికి అలా యేర్పఱచు కొన్నట్టు తోస్తుంది. పడమట యీమాదిరిగా వుండవు పిల్లపేళ్లు: సుబ్బాసాని, ఎల్లాసాని, పుల్లాసాని యీమాదిరిగా వుంటాయి యిందులో రెండక్షరాలపేళ్లకే దీర్ఘంవస్తుందని కొందఱు వైయాకరణు లనుకుంటూ వున్నారు గాని మూఁడక్షరాలపేళ్లకు

కూడా దీర్ఘాన్ని చేయడం గద్వాలా ప్రాంతంలో నేను వినివున్నాను. "వెంకటాసాని" వగైరాలు వుదాహరణాలు. వ్రాస్తేయింకా వ్రాయాలి. యీ ప్రాంతాల్లో సానిజాతి వేఱు, భోగంజాతి వేఱున్నూ. సానిజాతిలో మాత్రమే సానిపదంతో పేరుకు సంబంధంగాని భోగంజాతిలో అచల పదంతోడే తఱుచు చుట్టఱికం. "సూరాచలం" వగయిరాలు ఉదాహరణం. యిందులోవున్న దీర్ఘం సూర + అచల కల్పితే వచ్చినట్టు భావించరాదు. చలపదంవల్లనే వచ్చినట్టు భావించాలి.

ప్రస్తుతం పోతరాజుగారి నామధేయ విచారణలో యిదంతా కదిలింది. పోతరాజుగారు కవిపట్టపురాజుగారుగాని, తరాజుగారుగాని, రాజుగారుగాని కారు. ప్రాయోపవేశావస్థలో వున్న నాకు ఆమహామహుణ్ణి గూర్చినచర్చ శ్రేయోభివర్ధకమై " అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలముచ్యతే " కనక యీవ్యాసం వ్రాస్తూవున్న రోజుల్లోనే తలవనితలంపుగా " గోదేవి " అనే వక పుణ్యప్రబంధం గోహత్యానివారణాన్ని గుఱించినది 8 వందలపద్యాలు కలది వ్రాయడం తటస్థించినది. యెంతసేపూ వకపుణ్యం యింకోపుణ్యానికిన్నీ, వకపాపం మఱోపాపానికిన్నీ " ప్రేరకా " లవుతూ వుంటాయని విజ్ఞులు చెపుతూ వుంటారు. దానికిది తార్కాణంగా నేను భావిస్తున్నాను. " కవిపట్టపురాజు " శబ్దం సాధించవలసివస్తే కొంత గ్రంథం పెరుగుతుంది " పుణ్యమ ? పూరుషార్ధమ ? బుభుక్షువు చేసిన బ్రాహ్మణార్థమా ? " అన్నారు తెలుఁగునాడులో యేదో సందర్భంలో దాసువారు. నా కింకా కేవలం " భజగోవిందంతో " కాలక్షేపం జరక్కపోవడానికి ప్రతిపక్షులశంకలు కారణ మని లోకు లెఱిఁగినదే " అధీత మధ్యాపిత మార్జితం యశః " యద్వా " అపయశః " యింకెందుకీ చిత్తక్షోభ ? " నహి నహి రక్షతి డుకృఞ్కరణే " అనేవారి సదుపదేశం శిరసావహించతగ్గదే (సమానా స్స్వర్యాతా స్సపది సుహృదో జీవితసమాః, శనై ర్వ్యష్ట్యుత్థానమ్). కాని నాకువున్న చిక్కు మనవి చేస్తాను : నమ్మితే నమ్మండి, లేదా, నేనేం చేస్తాను ? యేదేనా సుప్రయోగాన్ని ఎవరేనా

(నాదేనాసరే, యితరులదైనా సరే) అప్రియోగంగా అపలపించేటప్పటికి నాదేమో పడిపోయినట్టు యేదో అనిర్వాచ్యమైన ఆందోళన నాతలలో, లేదా హృదయంలో బయలుదేఱడం నాకు సహజమైపోయింది. యిది నాకు నిన్నా నేఁడూ సంభవించింది కాదు. "యేపిచ్చి పడితే అదే పిచ్చి" అనే లోకోక్తికి వుదాహరణంగా వుండే నేను ఆర్జించుకొన్నాను కాద్దో, గొప్పో అక్షరాలుకూడాను. యీమాట జాతకచర్యలో—

"క. క్షణమున్ వృథ సేయక ల
క్షణసంగతులుం బురాణగాథలు దగ వీ
క్షణ మాచరించు "క్షణశః
కణశశ్చైవ" యని చెప్పఁగా వింటిమకా!"

అని నాచిన్ననాఁటి పత్రికృతిని గూర్చి వ్రాసికొని వున్నాను. అందుచేత యెప్పుడూ (పరుండికూడా) యేదో వ్రాయడమే అలవాటయిపోయింది. యిది వ్యాధికి వుపోద్బలక మని నాక్షేమాన్ని కోరే వైద్యులు నాకు యెంత చెప్పినా యిది లేకుండా నాకు రోజు గడవడంలేదు. 6 పందలుపై చిల్లర 'సౌభాగ్యకామేశ్వరి' యీప్రాయోపవేశంలో వ్రాసిందే. యింతకు పూర్వం కాస్తవీలుగా వున్నప్పుడు సంస్కృతంలో 425 శ్లోకాలు 'క్షమాపణ' సుమారు 500 పద్యాలు "జయంతి." యివన్నీ యీ అవస్థలోవే. అయితే భగవత్సంబంధమైనవి వ్రాస్తే అది యిహపరసాధనం కనక యుక్తమే. వాదోపవాదాలకు సంబంధించిన "అత్తునరు సంధి బహు''శాలు మానుకోరాదా, అంటారేమో! అంటారే మిటి. యెందఱో అనే వున్నారు. నేను ప్రయత్నమూ చేశాను, విరమించడానికి. అపట్లాన్ని యేమయిందంటే; శంకలూ సమాధానాలూ నెత్తెక్కి తొక్కినట్టయి నిద్దరపట్టడం మానేసింది. అక్కడికీ బిగఁబట్టుకొని కళ్లు మూసుకుని పరుండి చూచాను. అప్పుడేమయిందంటే? మఱింత ఆందోళనయొక్కపై తలతిప్పు మిటిమిటి (అసలు నాకున్న ప్రధానవ్యాధి తలత్రిప్పే) మంచం సహితంగా పైకి లేవఁగొట్టుకు పోతూవున్నట్టయింది. అప్పుడు - దుఃఖం వచ్చినవాఁడు -

లేక నవ్వు వచ్చినవాఁడు, తుమ్ము వచ్చినవాఁడు వాట్లను ఆఁపుకోవడం యెంతహానికరమో, నాకు యిదిన్నీ అట్టిదే కాఁబోలు ననిపించి పెన్సిలు చేత పుచ్చుకొని గిలకడానికి ప్రారంభిస్తే అదిక్కు చాలాభాగం తగ్గింది. (దీన్ని యెవరోకాని నమ్మరు. ప్రత్యక్షంగా నా అవస్థ చూచినవారు నమ్ముతారు). అయినా నా అనుభవాన్ని జయంతిలో—

శా. "రాగాలాపనవోలెఁ బల్లవిగతిన్ రాగిల్లు నీకై తన
న్నేఁ గోరన్, ననుఁ దానె కోరుఁబయిఁగా నీగోష్ఠి నున్నప్పు డే
భోగమ్మున్ మఱి నిద్ర గిద్ర యశనంబుం దోఁపఁగా నీదు పై
నీగన్ వ్రాలఁగ నీదు నాయనుభవంబే నీకు వ్రాక్రుచ్చితిన్.

మ. కవినై నీకు వచింప నావచనమున్ గాదాడ వంచున్ వృథా
అవమానించి తిరస్కరింప వని నా యాంతర్యముం జెప్పితిన్
నవ్వఁబా టౌ నిది యొడ్లతో ననినచో నాగుట్టు నాభార్య తాఁ
గవితావ్యాపృతిపట్టులం దెటిఁగెడిం గావ్యజ్ఞ కా కుండియున్"

అయీపద్యాలతోఁ జెప్పివున్నాను. ఉపాస్య దేవతను గూర్చి యీలా ప్రార్థించి వున్నానుకూడాను, సౌభాగ్యకామేశ్వరిలో.

మ. "కవనమ్మున్ రచియించుచున్ సుఖముగాఁ గాలమ్ము వోనెట్టెన
త్కవి వెంకన్న యటన్న మేల్మియశమున్ గల్పింపు మోయమ్మ ! యె
క్కువకోర్కుల్ నినుఁ గోరి పీడగొలుపన్ గోరంత ఆయు స్సెటో
మిగిలెన్ దానికి నింత మిక్కుటసుమీ ! మేలెంచి కామేశ్వరీ !"

వీలైనంతలో భగవత్కాలక్షేపంతోనే జీవయాత్ర నడుస్తూవుంది కాని మధ్యమధ్య సుప్రయోగాలూ, అప్రయోగాలూ అనే గోల తప్పింది కాదు. నన్నుతిట్టేవారు యెప్పుడూ వుంటూనే వచ్చారు. ఇప్పుడు క్రొత్తగా యేర్పడింది కాదు నాకీ పీడ. అలవాటవడంచేతనో (నస్యంలాగ) యేమో? నాకు అతిట్లు శరీరానికి పడతాయి. శ్రీభాగవతుల హరిశాస్త్రుల్లుగారన్నారఁట ! యెవరో "ఫలానావారు మిమ్మల్ని తిట్టి పైఁగా యేమీరాదు వట్టి శుంఠ అన్నారండీ" అని చెప్పేటప్పటికి, "నాయనా ! యింత ప్రపంచకం

వుండఁగా యిందఱు మనుష్యులు వుండఁగా, నన్నే తిట్టడానికిన్నీ నాకో యేమీరాదనడానికిన్నీ బాగా పరిశీలించి అర్థంచేసుకొంటే యేదో నాకు వచ్చునన్నట్టే తేలుతుందోయీ!" అన్నట్టు యెవరో చెప్పఁగా వినడమే కాదు, వొకపద్యంలో యెక్కించి గీరతంలో ముద్రింపించినట్టుకూడా జ్ఞాపకం. తిట్లుతిట్టినట్టు తెలిసినకొద్దీ నాకు కోపంరాదు. వమ్మంది నమ్మక పొండి. "నమ్మిన నమ్మకున్న నదినావశమా" అన్నారు దాసుమహాకవులు. యిఁక యేంవస్తుందంటే విచారం అంటే దుఃఖం (నన్ను తిట్టినందుకుగాదు) వస్తుంది, అయ్యో? వృధా పరిశ్రమచేస్తున్నారే? లోకం యేమనుకుంటుందో? వీరు బొత్తిగా గుర్తించలేక వృధాగా నామూలాన్ని చెడిపోతున్నారే? అని విచారించి ఆదుఃఖాన్ని నవ్వుగా మార్చుకొని ఆనందిస్తుంటాను. నాకల్లా కోపంరావడం యెప్పుడంటారా? అబద్ధాలు విన్నప్పుడు. అవినాకు సంబంధించినవే కానక్కఱలేదు, శబ్దాలకేనాసరే, అర్థాలకేనాసరే. ఆపట్లాన్ని, వరుందే అనుకోండి, పెన్సిలు చేతపడతాను; గిలకడం మొదలుపెడతాను. సత్యాన్ని తేల్చడానికి ప్రయత్నిస్తాను. కృతార్థుణ్ణవుతూవున్నానో లేదో లోకానికి తెలియాలి. భగవంతుఁడికి తెలియాలి. నాజీవితం యీలాగే వెళ్ళాలని నిన్నమొన్ననే గోదేవిలో వక పద్యంలో వ్రాశాను.

ఆ. వె. "ఎట్టితిట్లకేని యేసహింతును గాని,
అనృతమాడువారి నాగ్రహింఁతు,
నిటులె బ్రిదికినాఁడ నిందాఁక నాకు శే
షమ్ముగూడ నిట్లె జరుగుఁగాక"

యిది విషయాంతరం. కవిత్వం చెప్పుకొనేవారు కొందఱు కొన్ని ప్రయోగాలు ప్రేమిస్తారు. మఱికొందఱు మఱికొన్ని ప్రేమిస్తారు. అంత మాత్రంలో వొకరికి మఱివొకరు ద్వేష్యులవుతారా? వారివారి యిష్టమనుకోవాలి. దాసు శ్రీరాములుగారు తమ దేవీభాగవత పీఠికలో నాకు "ఫలానా ఫలానా యతులు ప్రాసలు వగైరాలు" యిష్టం అని చెప్పి వారిగ్రంథంలో

వాటివాటిని వాడుకున్నారు. యిష్టంవున్నవారు వారిని అనుకరిస్తారు, లేని వారు మానుకుంటారు. అంతేనేకాని అంతమాత్రించేత యింకోకవికి ఆయన ద్వేష్యులవుతారా? కారు, కాకూడదుకూడాను. మాముత్తాతగారికి ఆదొండకాయల కూరంటే చాలాయిష్టమఁట! దానిమీఁద వకపద్యం కూడా చెప్పివున్నారు.

మ. "తవణింతు న్నుతిదైవత ప్రమద దార్ఢ్యన్మోహినీనిరభ్ర
చ్చ్యవమానామృత శీకరాభనవ బీజప్రాంత రౌపమ్య స
ద్భవనాజాండకు షడ్రసప్లుతసముద్య త్స్వాదు మత్షండకు
న్నవితుంగోద్భవకాండకున్ సరసమోహాఖండ కాదొండకున్"

యీపద్యాన్నెందు కుదాహరించానంటే? యీపద్యం మఱి యెవరిదో అని మా ప్రభాకరశాస్త్రి కాఁబోలును దేనిలోనో వ్రాశాఁడు. మన పితృపితామహార్జితం అన్యాక్రాంతమైపోతూ వుందిగదా అని యథార్థాన్ని లోకానికి తెల్పి ఆ ఆస్తిని స్వాధీన పఱుచుకోవడానికే. దీనిలో పోతన్నగారి "జమో హ్రస్వా దచి" సంధి, నకారద్వితసంధి పోతరాజుగారితో పాటు మాతాతరాజుగారికి కూడా ఆదొండకాయ కూరతోపాటు యిష్టమని తెల్పడానికి కూడాను. పోతరాజుగారివంటి కవులు లోఁగడ బయలుదేఱలేదు. నేఁడులేరు. ముందేమో చెప్పలేము. ఆయనపద్యాలెన్నో లోకోక్తులకింద వాడుకుంటారు. 1. ఊరకరారు మహాత్ములు. 2. నాఁటికొక్క దైవములేఁడే? 3. చాలుఁ బదివేలువచ్చె, లోకంలో వున్నవే పోతరాజుగారు స్వీకరించారేమో? కానివ్వండి, దీనికికూడా వివాదమెందుకు? నాకు ఆలాతోఁచలేదు "భాగవతము తెలిసి పలుకంగ శక్యమే? శూలికైనఁ దమ్మిచూలికైన"

శ్రీ పోతరాజుగారినిగూర్చి యేవో తోఁచినమాటలు వ్రాదామని చాలారోజులనుంచి అనుకోవడమేగాని జరిగిందికాదు. తుదకు జరగడమైతే తటస్థించింది గాని యింకా రాయవలసిన విశేషాలు యెన్నో దిగడిపోయాయి. అదిన్నిగాక శ్రీపోతరాజుగారికి పరమభక్తులు. (అంతేకాదు,

వాకరు శిష్యులుకూడాను) శ్రీ వెలిగందల నారయకవీంద్రుణ్ణిగూర్చిగాని, షష్ఠస్కంధం మాత్రం పూరించిన సింగయ కవీంద్రుణ్ణికూర్చిగాని వాక్క వాక్యంకూడా వ్రాయడానికి అవకాశం కలిగిందికాదు. రెండాశ్వాసముల పరిమితి కల్గిన పంచమస్కంధాన్ని బొప్పనామాత్య పుత్రుడు గంగనా మాత్య కవిని గూర్చిన్నీ వ్రాయలేదు.

ద్వితీయస్కంధం కొంతమాత్రం అసలు పోతన్నగారి కవనం వున్నట్టున్నూ, శేషించింది లోపించినట్టున్నూ మధ్యభాగంలో పెట్టిన "ఇక్కడనుంచి వెలిగందల నారయగారి కవిత్వము" అనే శీర్షికవల్ల స్పష్టపడుచున్నవి. గాని ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధాంతగద్యములు "పోతనామాత్య ప్రణీత" అనియ్యేవే వుండడంచేత నారయ్యగారు పూరించిన్నీ, గతంలో అరణ్య పర్వశేషాన్ని పూరించిన యెఱ్ఱన్న కవీం ద్రుఁడు గద్యలో నన్నయ్యపేరే వుంచినట్టు యీయనకూడా చేసినట్టు గోచరిస్తుంది. పోతన్నగారి కవిత్వం కాదనడానికి తగ్గగుర్తులుకూడా కొన్ని పరిశీలకులకు గోచరిస్తాయి. సీసపద్యరచననుబట్టి తెలుసుకోఁదగ్గ సందర్భం లోఁగడ యీవ్యాసంచివర సూచించే వున్నాను. ఉత్సన్నభాగాన్ని పూరిం చినవారిలో యెక్కువగా రచించినవారు నారయ్యగారు. కాని కొంతభాగం తాను రచించిన్నీ పోతరాజుగారికి దానం చేస్తూ వచ్చారు. దానికూడా యేదో కారణం వుంటుంది. బహుశః ఆదత్తంచేసిన భాగాలలో పోతరాజు గారి రచన యేమాత్రమో అక్కడక్కడ శేషించి వుండడంచేత అది ఆలా చేయవలసి వచ్చిందనిన్నీ, బొత్తిగా వుత్సన్నమై పునఃపాకానికి వుపక్రమింపవలసి వచ్చిన ఏకాదశ, ద్వాదశ స్కంధాలలోమాత్రమే తనపేరు పెట్టుకొన్నాఁడనిన్నీ మనం వూహించుకోవచ్చును. 70 వత్సరాల నాఁడు, అచ్చయిన పుస్తకంలో లేదుగాని యిప్పటి అచ్చుపుస్తకాలలో దశమస్కంధం ఉత్తరఖండంలో కొంచెం కథ జరిగినతర్వాత శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవితో విరసోక్తులాడే ఘట్టంలో "సాళ్వజరాసంధ చైద్యాది రాజులు చెలఁగి నన్వీక్షించి మలయుచుండ" అనేసీసం ( 235 పది. )

నాలుగోచరణం మొదలుకొని వున్న కవిత్వం "వెలిగందల నారయగారి దని వ్రాఁతప్రతులలో వ్రాయఁబడియున్నది" అని టిప్పణిగా వ్రాసి యున్నారు. యిది యిప్పటివారి స్వకపోల కల్పితం కాదు; కర్ణాకర్ణికగా కవులు పరంపరగా చెప్పుకొనుచున్నదే: దీనిని పూర్తిగా విశ్వసించ వచ్చును. దానికి తథ్యంగా లోఁగడ నేను వివరించిన సీసపు నియమ భంగం వెంటనే కాదుగాని రెండోసీసందగ్గిఱనుంచే కనపడుతుంది. ఆసీస సంఖ్య 241. దానిమొదలు "కవిసంభ్రమంబునం దనువునం దనువుగా నల్లనఁ జందనం బలఁది యలఁది" అనేది. పోతన్నగారి కవిత్వంలో యెక్కడోగాని (నన్నయ్యగారి కవిత్వంలోవలెనే) కేవలయతి, ప్రాస యతులకు సాంకర్యం గల సీసాలుండవు. పరిశీలించి చూడండి ఆఘట్టం లోనే 235 వ. సీసానికి పూర్వమందువున్న మూఁడునాల్గుసీసాలున్నూ, యింకా అన్యత్రవున్న సీసాలున్నూ. నారయ్యగారు పూరించడానికి ఆరం భించిన తరవాత వకసీసం — "కాటుక నెఱియంగఁ గన్నీరు వఱదలై" అన్నదిమాత్రం ఆనియమంతోనే నడిచింది. అయితే యీవుత్తరభాగం తుట్టతుద గద్య శ్రీపోతన్నగారి పేరుతోనే వుండడంవల్ల "కాటుక నెఱి యంగ" పద్యం వుత్సన్నంకాకుండా నిలిచివున్నదవడంచేత నారయ్యగారి రచన కానేకాదేమో? ఆయీ నిర్ణయాన్ని చేయవలసివస్తే చాలాకష్టం. క్రియలోమాటదశమం వుత్తరభాగాల వుత్సన్నభాగాలలోదేగాని పూర్తిగా వుత్సన్నం కాలే దనడానికి గద్యవల్లనే సాక్ష్యం కనపడుతుంది. లోఁగడ వుదాహరించిన "కచాకరషణముల్" అనే ప్రాసస్థానప్రయోగం (వ్యాకర ణాంతరంచేత సాధువు కావలసి వస్తుందనుకొన్నది) మననారయ్యగారిదేమో? యిదేకాదు - "లోకపా, వనులై లోకములం బునీతములుగా వర్తింపుచున్" అన్న పునీతపదఘటితమైన పద్యంకూడా (పునీతపదం సంస్కృత భాగ వతంలో అష్టమస్కంధంలో కనపడింది. పోతరాజుగారు ఆస్కంధంలో దాన్ని అనువాదంలో ఛాందసమనుకొని కాఁబోలు వాడుకోలేదు. అందు చేత ఆయన యిక్కడమాత్రం వాడివుంటారా అని ఆకాశసౌధపుటూహ)

నారయ్యగారిదేయేమో ? తృతీయస్కంధంలో యించుమించు సమీపంలోనే వున్న మూఁడు "పునీత" ప్రయోగాలున్నూ నారయ్యగారివే యేమో అని నేను అనుమానిస్తూన్నాను. ఉత్తరభాగం దశమంలోవున్న నారయ్యగారి కవిత్వం పోతన్నగారి కవిత్వంతో "శేషదసమాప్తౌ కల్పద్దేశ్య దేశీయరః" అనేసూత్రాన్ని జ్ఞప్తికి తెస్తూవుందని నాకు తోఁచింది.

చ. "అలిగి మురాంతకుండు గులిశాభశరంబుల నూత్నరత్నకుం
డలములతో శిరంబులు, రణన్మణినూపురరాజితోఁ బదం
బులు, కటకాంగుళీయక విభూషణ చాపశరాళితోడఁ జే
తులు నిలఁ గూలఁగా విజయదోహలియై నుసుమాడె వెండియున్"

చూచారా ? ధార యేలా నడుస్తూవుందో ? "యతియుం బ్రాసయుఁ గూర్చుమాత్ర కవియే" అన్న ఆక్షేపణకు యీయన గురిగాఁడనే నేననుకుంటాను. పోతన్నగారికి శిష్యుణ్ణని గద్యలో స్పష్టంగా వ్రాసుకొనేవున్నాఁడు కనుక ఆయన పద్యపోకళ్ళు, అంటే అనుసరణలు కొన్ని కనపడతాయి.

చ. "హరి భజియించు హస్తములు హస్తము, లచ్యుతుఁ గోరి మ్రొక్కుత
చ్ఛిరము శిరమ్ము, చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త, మిందిరా
వరుఁగను దృష్టిదృష్టి, మురవైరి నుతించిన వాణివాణి, అ
క్షరు కథలాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్."

కుచేలోపాఖ్యాన ఘట్టంలోవున్న యీపద్యం సప్తమస్కంధంలోవున్న
"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ"

అనేపద్యానికి పుత్రికయేకదా ? భవతు. యీలాటి పోలికలుచూపి గ్రంథచోరత్వాన్ని నిరూపించవలసివస్తే మొదటిదొంగ కాళిదాసుగారే కావలసి వస్తుంది గనక ఆమార్గాన్ని నేను కలంనడిపేది లేదని చాలాచోట్ల విస్తరించి వున్నాను. "హృదయగతిన్ బురాతన కవీశ్వరులేఁగని వీధిలేదు" అనే కవికర్ణరసాయన పద్యాన్ని చూచుకోండి పోతన్న

గారిని అనుసరించి చెప్పిన పద్యంలోకూడా ఆయనకన్న కొంతకష్టము నారయ్యగారి కవిత్వంలో కనపడుతుంది. సీసంలో ఆయీభావం చెప్పడం కన్న వృత్తంలో చెప్పడం కష్టం. దీన్ని కవితామర్మవేదులు గుర్తించే వుంటారు కనక గ్రంథం పెంచేదిలేదు. యింతెందుకు, యీపద్యం గూడా పోతన్నగారిదే అనరాదా అంటే, అనడానికేంగాని అక్కడవెళ్ళిన భావాన్నే మళ్ళా ఆగ్రంథంలోనే పోతన్నగారు మరోఘట్టంలో వెళ్ళడానికి ఆయనకేమేనా భావాలు కొదవవున్న దరిద్రుఁడు కనకనా? ఆగర్భమహాకవిగదా? సహజపాండిత్యుఁడు గదా? "కవనార్థం బుదయించినవాఁడు" గదా?

"ఆ. వె. పుట్టినేర్చికొనెనొ? పుట్టకనేర్చెనో?
చిట్టి బుద్ధులిట్టి పొట్టివడుగు
పొట్టనున్నవెల్ల బూమెలు ననినవ్వి
యెలమి ధరణి దానమిచ్చెనపుడు"

అన్న పద్యార్థానికి మొదటివుదాహరణం పోతన్నగారనిన్నీ రెండో వుదాహరణం వామనమూర్తిఅనిన్నీ నిర్వచిస్తే కాదనేవారెక్కడేనా వుంటారా? యీ పద్యంలో అంతర్లీనమై పోతన్నగారి కవితాప్రౌఢి వుందని నాఆశయం అందుచేత యీపద్యం భంగ్యంతరంచేత చెప్పివుంటారని నేననేదిలేదు. యిది నారయమహాకవీంద్రునిదే! బహుశః యీభాగంలో యీకల్పన సంస్కృతంలో వుందో, లేదో, చూడలేదు. వున్నా తెలుఁగులో యిముడ్చడం కష్టంగాని సంస్కృతంలో యిముడ్చడం కష్టం గాదు. యింకోపద్యంకూడా చూపి విషయాంతరాన్ని వుపక్రమిస్తాను.

"సీ. నీరదాగమ మేఘనిర్యత్పయః పాన
చాతకంబేఁగునే చౌటిపడెకు"

అనే సీసపాదకడకూడా గురువు (పోతన్న)గారి కవిత్వాన్ని జ్ఞప్తికిఁ దెచ్చేదే:

"సీ. మందారమకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబు పోవునే................."

అన్న సీసంరాని యాంధ్రుఁడున్నాఁడా ? యీపద్యమేకాదు.—

"సీ. కమనీయభూమి భాగములు లేకున్నవే ?
పడియుండుటకు దూదిపఱుపులేల"

అన్న ద్వితీయ స్కంధపద్యమున్నూ డిటో. యింకా యెన్నో పద్యాలు పోతరాజుగారివి చాలామందికి కంఠోపాఠం. అది ఆయన అదృష్టం అంటాను. లోఁగడ చంపకమాలలో "దృష్టి, దృష్టి" అని యిప్పటి అచ్చు వున్నది. ప్రాచీనపు అచ్చులో "దృష్టు దృష్టు"అని బహువచనంగా వున్నది. అపద్యంలోనేకాక అప్రాంతంలోనే యింకో సీసగీతిలో "కలువు మిడిసిపాట్లు నిప్పులుగ్రక్కు దృష్ట్లు" అనివున్నది. దీనివిబట్టి చూస్తే తత్సమపద ఘటితమైన ఉకారానికి వైకల్పికలోపం 'కోటి' శబ్ద బహువచనానికేకాక "టి" అనేది అంతమందుగల మఱికొన్నింటికికూడా అప్పటి పండితకవుల సమ్మతివున్నట్లు నాకుతోస్తూవుంది. యిప్పటి అచ్చులో యీ భాగవతపు "దృష్టు" ప్రయోగం సంస్కర్తలు దిద్దివున్నారు. గాని భారత, శల్య. ౨ ఆ. లోవున్న "అనిమిషుల దృష్టు మిఱుమిట్లు గొనఁగ భుజగపతియు" అన్నది మాత్రం దిద్దలేదు. యిదికూడా దిద్దితే దిద్దఁబడేదే. సంస్కర్తలలోకూడా మతభేదం వుందనుకోవాలి. యీలాటి దిద్దుఁబాట్లు అంతగా బాధించవుగాని కొన్ని బొత్తిగా బాధిస్తాయి. యిదిచూడండీ—

"సం, ధాంత భూరిభుజా విజృంభణుఁడై మహీజముఁబూన్చి" అని పాఁతఅచ్చులో మత్తకోకిలలో వక చరణంలోవుంది. అర్థం అవనివ్వండి, కాకపోనివ్వండి. యతిపోయినట్టులేదు "సంధాంత" అన్నది సంస్కృతపదము కాకపోలేదు. అర్థంతరవాత ఆలోచించుకొందాం, దాన్ని దిద్దినదిద్దుఁబాఁటులో యతిపోయింది. "దు,ర్దాంతభూరిభుజావిజృంభణుఁడై" అని దిద్దుఁబాటుచేసారు. దిద్దినవారికి "దుర్దాంత" శబ్దవ్యుత్పత్తి తెలిసినట్టు తోఁచదు. దుర్ద + అంత అని విఱుగుతుందనుకొన్నారువారు, పాపం; దుర్ అనే వుపసర్గ పూర్వమందు వున్న 'దమ' ధాతువుకం పె క్త ప్రత్యయం

వచ్చి ఫువధకు దీర్ఘంవచ్చి అయింది. ఆ 'దుర్దాంత' శబ్దం యిాలాంటి కర్మాలు తెలియడానికే తెలుఁగు కవులకు సంస్కృతవ్యాకరణ ప్రవేశం అవసరంగాని "రాచపాఱుని జన్మంబు గాచినాఁడు" అనే మాదిరిని అచ్చ తెలుఁగులో కవిత్వం చెప్పుకొంటే సంస్కృతవ్యాకరణం యెందుకు? ఆచరణం యెంతముద్దుగా ముచ్చటగా అందంగా చందంగా వుందో వేఱే చెప్పనక్కఱలేదు. యిట్టి జ్ఞానలవదుర్విదగ్ధుల దిద్దుఁబాట్లను పుచ్చుకొని పూర్వపాఠాలను వదలుకోవడం యెంతశోచ్యమో ఆలోచించండి. "విద్వత్కవి" అనిపించుకోవాలని కోరికవుంటే యీవ్యాకరణప్రవేశమే కాదు; యింకా యెన్నో సంప్రదాయాలు అంతో యింతో తెలియవలసి వస్తుంది—

మఱో ప్రయోగాన్నికూర్చి మాట్లాడుకుందాం. "పరిపాల నిపుణులై భాసిల్లుచున్నారు" అని వొక సీసచరణంలో వుంది. పరిపాలన అని సవరిస్తే గణభంగం. "పణనం పణః; భణనం భణః" అన్నట్టు "పాలనం పాలః" అని భావార్థకరూపం యెవ్వరూ వాడినట్టు యిప్పటికి నాకుతెలియదు. (భూపాలః, భూపాలకః అనే రూపాలు కర్త్రర్థకాలే ప్రసిద్ధాలు) సంస్కర్తలు "పరిపాలన చణులై" అని సవరిస్తే సుళువుగా తేలిపోయేది. కాని "మన కెందుకీరొష్టు" అనుకున్నారో యేమో - అలాగే వుంచారు. మఱి వొకటి: తెలుగు మాటేవకటి "కతన" అనడానికి "కత" అనిమాత్రమే పడ్డది. దాన్నినీన్ని అలాగే వుంచేశారు. అక్కడ ఆ "కత" అన్నది కథా శబ్దభవ మనుకుందామంటే అంతవీలుగాలేదు. దీనికేంగాని దుర్దాంతశబ్దంలో స్వరం విఱుగుతుందనుకోవడంవల్ల సంస్కర్తల పాణినీయ ప్రవేశం స్పష్టంగా తేలుతూవుంది. 'ప్రమాదోధీమతామపి.' ఉత్తరభాగంలో సంస్కర్తల యీ దిద్దుఁబాటు తప్ప కడమవి చాలాభాగం అభినందనీయాలుగానే వున్నాయి. ఆ స్థలాల్లో గణభంగాలు సంస్కారద్వారా నివర్తించాయి. చాలామంది మహాకవులే కంద, సీస, గీత- ముఖ్యంగా యీ పద్యాలలో క్వాచిత్కంగా గణభంగంగా నడిపిస్తూవుంటారు. ధూర్జటికవిత్వంలోనూ,

యేనుఁగు లక్ష్మణకవిగారి కవిత్వంలోనుకూడా నేను యీప్రమాదాన్ని చూచాను. అయీ పద్యత్రియమున్నూ నియతగణం గలది కాకపోవడం చేతనున్నూ పదకవిత్వం నడిచినట్టు యత్నించి గ్గణభేదం వున్నప్పటికీ యెవరో సూక్ష్మదృక్కులకు తప్ప ఆ భంగం గోచరించదు. యిటీవల కాదుగాని శ్రవణానంద, పాండవవిజయ రచనాకాలంనాఁటికి మాకు యీ భంగం గోచరించక పొరఁబడడం సకృత్తుగా వుండేది. మొదటి ముద్రణంలో శ్రవణానందంలో వక సీసగీతి చరణం. "ధనముచెడు యశము చెడు దేహమునకు లేని." అని వుంటుంది. దీన్ని రెండవ ముద్రణంలో కనిపెట్టి "ధనము చెడుఁగీర్తి చెడుదేహమునకు లేని"

అని సవరించుకున్నాము. గణప్రస్తారంచేసి చూచుకుంటే మొదటి పాఠంలో వక అక్షరం "హ" అనేది అధికంగా పడినట్లు తేలుతుంది. యీలాగే కందంలో పాండవవిజయం (మొట్టమొదటిదాని)లో "పెళచు లాడనీవె నీకుఁబెద్దవె? చెపుమా !" అనేపాఠం వుంటుంది. ఆ పుస్తకాలు యిప్పుడెక్కడా లేవుగాని యిప్పటి పుస్తకాలల్లోకూడా ఆ పద్యం వుంది. అయితే విజయంలోలేదు. ఉద్యోగంలో రాయబార ఘట్టంలో వుంటుంది. పాఠం సవరించాము. "పెళచులనఁగ నీవె నీకుఁ బెద్దవె చెపుమా !" మొదటి పాఠంలో "పెళచులా" అని నగం వుండవలసి వస్తుంది. (సవరణ అంటే యీలాటి స్వల్పాలకేగాని గ్రంథం గ్రంథం యావత్తూ సవరించవలసివస్తే అది యెవరి సవరణకు లొంగుతుందో విజ్ఞులు విచారించాలి.) అది కందంలో వుండదుకదా ! లోకంలో 'కందం చెప్పినవాఁడు కవీ, పందిని పొడిచినవాఁడు బంటూ' అనే సామెత వుంది. దానికి తాత్పర్యం కవిత్వం చెప్పడంలో కందం అంతకష్టమని కాదు; దానిలక్షణం శిష్యులకు బోధపడేటట్టు చెయ్యడం కష్టమనే తెలుసుకోవాలి. సహజమైన ధారగల కవికి "పద్యం పద్యస్యలక్షణమ్" గానే వెళ్ళిపోతాయి. పద్యాలు వందలూ, వేలూ. లక్షలూకూడా. గణాలు ప్రస్తరిస్తూ కవిత్వం చెప్పేవారంటూ మునుపూలేరు, నేడూలేరు. కాని పైని వుదాహరించినవాట్ల మాదిరి చరణా

లలో కొంచెం నిఘా పెట్టిచూచుకోవడం మంచిదని నన్ను ప్రమాణీక రించుకొనే వారికి అనుభవపూర్వకమైన నాసలహా. దీన్ని బలపఱిచేదే యిక్కడ యింకోటి వుదాహరిస్తాను.

"వివిధవీ తిపత్రికృతి వినయాదు లనువెల్ల" ఇది వక సీసచరణంలో పూర్వదళం. వివిధవీ - తిప్రకృతి అని ప్రస్తరించడానికి మొదలెడితే మొదటి నగం, రెండోది భలం. ("నగణముపై లఘు వున్నన్ నలమగు" అన్నట్టే భగణముపై లఘువు వుంది కనక) భగణమ్మాత్రం (ఇంద్రగణం కనక) సీసంలో పడుతుందిగాని భలం యేలా పడుతుంది? పడదు. అందుచేత సీసచరణం తప్పినట్టయింది. కాని గ్రంథకర్తకు గోచరిస్తే క్షణంలో దిద్దుకోవచ్చును. కాని గోచరించదు. (అలా గోచరించడం బ్రహ్మజ్ఞాన మంతజ్ఞానం యెవరికి వుంటుందో వారికే తప్ప సంఘటించదు ఛందస్సులో: సంగీతంలో శ్రుతిలయ సూక్ష్మజ్ఞానంకూడా యిట్టిదే. అందఱూ కవులే. అందఱూ గాయకులే) అసలు సవరించు కోకుండానే సమర్థించేమార్గం బహు మహాకవి సమ్మతమైనది. శతం స హ స్రం ప్రయోగాలు వున్నది వుందిగాని అది ఆ గ్రంథకర్తకు కారణాంతరంచేత అంతరంగంలో సమ్మతమైనా పైకి సమ్మతించేటట్టయితే ఆత్మవాదానికి భంగం వస్తుంది. అందుచేత ప్రమాదమని వొప్పుకోవలసిందే గాని గత్యంతరాభావః. ఆ పరిశుద్ధమైన మార్గంలోఁగడ "దం డ కాం, బరస్రగ్వేణు విషాణ" అన్నచోట వివరించిందే. అప్పుడు "తిపత్రికృతి" అన్న పదంలోవుండే మొదటి అక్షరం "తి" అనేది గురువుకాక లఘువే కావచ్చును కనక ఆపద్ధతిని అది నలమనే చతురక్షర గణమే అవుతుంది గాని కందానికి బొత్తిగా చుట్టఱికంలేవి "భలం" కాదని ఛందోరహస్య జ్ఞులు తెలుసుకుంటారని కొంత విస్తరించాను. ప్రతివిద్యలోనున్నూ యీలాటి రహస్యాలు వుంటాయి. యివి తెలియకపోతే వచ్చే పుట్టిములక లేదుగాని తెలియడంలో కొంత విశేషం లేకపోలేదు.

"అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతా
మాపాతాళ నిమగ్న పీవరతను ర్జానాతి మంథాచలః"

యీలాటి ఛందోరహస్యాలు మఱికొన్ని వృత్తాలలో కూడా తెలుసుకోవలసిన వుంటాయి. యివి బాగా అవధానాలు చేసి పాట్లుఁబడ్డవాళ్ళకే గాని సర్వేసర్వత్ర గోచరించవు. (భారతకవులు తొక్కని కొన్నితోవలు పోతరాజుగారు తొక్కివున్నారు. విస్తరభీతిచే కొంచెమే వ్రాయటంచేత యెన్నో దిగడినవి: యద్విలాసము మరీచ్యామ తెలుంగరు....యన్మాయన మరాసురాదులు....వగైరా (అష్టమస్కంధం)చూడండి) ప్రస్తుతంనారయ్యగారి కవిత్వంలో యిప్పటి సంస్కర్తల దిద్దుఁబాట్లనుగూర్చి వ్రాస్తూ కొంత శాఖాచంక్రమణంగా కలం నడిచింది. కొన్నిచోట్లు దిద్దవలసినవి గత్యంతరం కనపడక కాఁబోలు దిద్దనే లేదు.

చ. "..............సాం, బమకర రేతనాత్మజ శ్వఫల్క
తనూభవతత్సహోదర ప్రముఖ యదూత్తముల్"

యీ పెద్దసమాసంలో "శ్వఫల్క" శబ్దంవుంది. "శ్వ" అనేదానికి పూర్వమందువున్న "జ" గురువు కాక తప్పదు. దానితో గణభంగం కల్గితీరుతుంది. ఇది కవికృతమే కాని లేఖక ప్రమాదాదుల లోనిది కాదు. దిద్దవలసింది గాని దిద్దేదేమిటని వుపేక్షించారు సంస్కర్తలు. రేఫవిశిష్టానికి పూర్వమందున్న వర్ణానికి వైకల్పిక లఘుత్వానికి మహాకవుల అభ్యనుజ్ఞ వుందిగాని దీనికి ఋషికవిత్వాలల్లో తప్ప యితరమహాకవుల ప్రయోగాలు కనపడవు. దిద్దుదామంటే "శ్వఫల్క" అనేది యాదవులలో వొకనికి పేరు. వాఁడి కొడుకనే అర్థంలో వాఁడబడిందాయె, దాన్నిదిద్దడం యేలాగ? యీలాటివి పోతరాజుగారి కవితాభాగంలో దొరకవు; భారతాది మహాకవులు సమ్మతించిన రేఫద్విత్వపూర్వక వైకల్పిక లఘుత్వాలు మాత్రమే దొరుకుతాయి. వీట్లనుబట్టి దశమంలో వుత్తరంభాగం (మధ్య మధ్య యేకొన్నిపద్యాలో, చరణాలో, వాక్యాలో తప్ప) చాలావఱకు వెలి

గందల వారిదే; సంశయం లేదు. అయితే ద్వితీయస్కంధ కవిత్వంకంటే చాలా నిశితంగా మాత్రిం వుంటుంది.

యిఁక నారయ్యగారి కవిత్వంలో అనవసరంగా దిద్దిన దిద్దుబాఁట్లు కొన్ని కనపడతాయి. (1) వృథాకరింపక యిచ్చు (2) చిహ్నలెల్ల విడిచి చేరి కొల్చి" యిందు మొదటిదాన్ని "వృథ సేయక యిచ్చు" అనిన్నీ, రెండోదాన్ని "చిన్నెలెల్ల విడిచి" అనిన్నీ సంస్కరించినారు. కారణం మృగ్యం. మొట్టమొదటిది చక్కని ప్రౌఢప్రియోగం. దాన్ని చెడఁగొట్టి నట్టయింది. రెండోదో? వీరరసం చెడింది. దిద్దడంచేత; యెందుకు దిద్దవలసి వచ్చిందంటే? చిహ్నములు అని ణువర్ణకం వుంటేనే కాని వ్యాకరణం బాధిస్తుం దని దిద్దవలసి వచ్చింది. వ్యాకరణానికి యీమాత్రం తెలుసును. దాన్ని వుపయోగ పఱుచుకోవడం తెలియక మనమే "వుక్కిరి బిక్కి"రై కొన్ని ప్రియోగాల సొగసు చెడఁగొడుతూ వుంటాము. లోకంలో ణువర్ణవిరహితంగా వాడుకొంటే శ్రుతిపేయంగా వుండే చిహ్న, మధ్య, లోనైనవి ణువర్ణవిరహితంగా కూడా వాడుకో వచ్చుననియ్యేవే వాకగణాన్ని యేర్పఱచింది వ్యాకరణం. యిఁక మన లోపమే గాని దానిలోపం లేదుకదా! (యితరత్రి "చిహ్న" అనే ప్రియోగం దిద్దనిదిన్నీ వుంది – ద్వితీయంలోనో, తృతీయంలోనో) యీలాటివి కొన్ని యిప్పటివారే దిద్దివున్నారో, పూర్వులే దిద్దివున్నారో కాని యెవరు దిద్దినా అనవసరమే అని నే ననుకుంటాను. కొన్ని కష్టసాధ్యాలు దిద్దకుండానూ వుంచారు. అట్టివి స్వల్పంగా చూపుతాను—

"చెలువంబు నెఱి దప్పి చిన్నఁబోవుచు నున్న వదనారవిందఁబు" యిందులో వున్న "చిన్నఁబోవు" అనేపదంలో అఱసున్న యేలా వచ్చింది? అది యేదో నకారం చెడికదా రావలె? ఆపద్ధతిని దాని మొదటి రూపం 'చిన్నన్' అని వుండాలి అనేశంక వారి కప్పటికి కలక్క పోయి నందుకు సంతోషించాలి. మూఁడో నాలుగో అంగుళాలలో యిమిడిన తెలుఁగువ్యాకరణానికి "చిన్నఁబోవులో" అఱసున్న యేలా వచ్చిందో?

"పదునాల్గు కోటులేనా మఱియున్" అనేచోట కోటులు, ఏ, ఆ అని వున్నప్పుడు దుత్వమేలా చేరిందో చెప్పడానికిక్కూడా సామర్థ్యం వుందని యెవ రనుకుంటారు? సర్వసమగ్రి మనుకొని పది పద్యాలుగేళ్లు చదువుకో వలసిన వ్యాకరణశాస్త్రంగదా పాణినీయం! దానికే యే "పృషోద" రాదుల్లోనో పెడితేనే కానిన్నీ, ప్రకృతిప్రత్యయాలు రెండున్నూ కల్పించు కుంటేనేకానిన్నీ కుదరనివి యెన్నో రూపాలు వున్నట్టు ఆయా గ్రంథ కర్తల ప్రవృత్తివలన అవగత మవుతుందే? "మహాగజాః పలాయంతే మశకానాంతు కాగతిః?"

సరే! యిక్కడ దిద్దితే యేమని దిద్దాలో ఆలోచిద్దాం. "చిన్న పోయి" అనిగాని, "చిన్నపోయి" అనిగాని దిద్దాలి. చిన్నపుచ్చుకొని అని అర్థం చెప్పాలికదా! పోపుధాతువుకు పుచ్చుకొని అనేఅర్థం యెక్కడి నుంచి కొనితెస్తారు? తెచ్చేమే అనుకోండి - చిన్న అంటే యేమిటి? అది విశేషణమా, విశేష్యమా? విశేషణంగదా! చిన్నవస్తువును స్వీక రించి అనే అర్థం వస్తుందిగాని అప్పుడుమాత్రం అభిలషితార్థం వస్తుందా? అందుచేత అసకృదావృత్తిగా వున్న యీ "చిన్నఁబోవు" ప్రయోగాన్ని దిద్దక "లోకోక్తీనాం భవే ద్యోగో యథావచ్చ్యుతిరంజనమ్" అని సమాధానపడ్డట్టు నాకు తోఁచింది. అయితే యిది "లోకోక్తి" అవుతుందా అని పరశంక రావచ్చును. కాని లోకోక్తి కాకపోయినా తత్తుల్యమే అని సమాధానం వ్రాస్తే చాలా వ్రాయాలి.

అసమగ్రంగా వున్న యీ వ్యాకరణం యెంత అపకారకమో అవుతూ వుందని నేను యెన్నాళ్ళనుంచో మొఱపెడుతూనే వున్నాను, వినేవిక్కా కనపడదు.

"నా కితఁడు లక్ష్యమా?" అని ప్రయోగిస్తే "లక్ష్యమా" యేమిటి, లక్ష్యుఁడా అని వుండాలి, "గురు వెవరు" అని ప్రయోగిస్తే "గురువు" ఏకవచనంగదా, "ఎవరు" బహువచనం అంటూ శంకించ డమేకదా! ఆపట్లాన్ని భారతం తిరగేస్తే "చుట్ట మెవ్వ రతనికిన్"

అని దొరికింది కనుక గాని లేకపోతే గతేమిటి? (ఆ యీ భారతప్రయోగం దొరకిన తరవాత ఆక్షేపకులకు సలహాయిచ్చిన పెద్దలిద్దఱున్నూ మెల్లిగా తప్పుకొని భారతంలో వున్నప్పుడు యింకా సందేహమేమిటి అనడానికి వుపక్రమించారు)

లోకవ్యవహారానుసారంగానే మహాకవు లందఱున్నూ దేశభాషా కవిత్వాలు నడిపించుకొన్నారనేది వకటే పెద్దవ్యాకరణం. "నీళ్లాడు" ప్రయోగం దగ్గిఱ దీన్నిగూర్చికొంత వ్రాశాను. అందుచేత యింతతో దీన్ని ఆఁపుతాను. లక్ష్యమా అన్నచోట లక్ష్యుఁడా అంటే శాస్త్రంమాట దేవుఁడెఱుఁగును గాని చెవికి యెంత కఠోరంగా వుంటుందో చూడండి.

శా." వ్యాపారమ్ములు లేవు మాకు వినఁగా నాసక్తియున్ మెండు నీ
వా? పాండిత్యముగల్గు పుణ్యుఁడ వగణ్యంబైన మాపుణ్యారే
ఖాపారీణత లభ్య మైతివి............................ "

యిక్కడ "లభ్యుఁడైతివి" అనాలి అని శంకించినవారున్నూ వున్నారు. ఆపాతరమణీయంగా కనపడుతుంది శంక. సమాధానంచెప్పడానికి సంస్కృతపాండిత్యం పని చేస్తుందా, లేక తెలుఁగుపాండిత్యం పనిచేస్తుందా? పైప్రయోగం మాసొంతం అనుకోండి. శరపరంపరగా యిట్టి ప్రయోగాలు కవిత్రియం చేసి వున్నారు. దీనికి సమాధానానికి యేశాస్త్రమూ అక్కఱలేదు. "లభ్యమైతివి" అన్న పదద్వయాన్ని కల్పితే వచ్చే అర్థం 'లభించితివి' అనేకదా! అప్పుడు దానిలో నీవు అనేదాన్ని తీసుకువెళ్ళి అన్వయిస్తే (నీవు లభించితివి అని) చక్కఁగా కుదురుతుంది. ఇంకో మాదిరిది భారతాన్నుంచే వుదాహరిస్తాను- "నమ్మనేర నయ్యెద" యిది నన్నయ్యగారిదే. రెండు క్రియాపదాలెందుకంటే జవాబేమిటి? నమ్మనేరను అంటే అభిలషితార్థం రావడం లేదా? 'సిద్ధిర్లోకాద్ధృశ్యా' ఇంతే జవాబు. యింకోటి సొగసైన ప్రయోగం చూపుతాను: "వనజాక్షి నేఁగన్కవై జయంతికనైనఁ గదిసి యాడుదుఁగదా కంఠసీమ." యిది మన నారయ్యగారిదే. నాలుగు చరణాలల్లోనూవుంది యీ"కనుక"ప్రయోగం. హేత్వర్థకమైన యీ"కనుక"

శబ్దానికి యిక్కడ సమన్వయం సుఖ సుఖాల కుదురుతుందా? తరచుగా తరచుగా కుదరకనే పోతుందా? (శ-ర-నిఘంటులో వాక్యాలంకారమని వూరుకున్నాడు. సహృదయ యాగ్నేసరుడయిన ఆగ్రింథకర్తపు నానమో వాకశతము. అనన్విత మందురు సామాన్యులైతే) యింకోటి యీయనదే చూపుతాను— "నీరముతోడ బంపె జమునీటికిఁగాఁపురము" యముని పట్టణానికి కాఁపురం (లోకవ్యవహారం మఱచిపోండి శాస్త్రరీత్యామాత్రమే) పంపడం యేమిటి అని ప్రశ్నించండి. జవాబు యేమిపస్తుంది, నాతో చెప్పండి చూస్తాను. దీన్ని యీలావుంచండి "ఆమణి శతధన్వుఁ డపహరించుట నిక్కమెవ్వరిచే దాఁపనిచ్చినాఁడొ:" యిందులోవున్న "చేన్" అన్నది తృతీయావిభక్తి ప్రత్యయంగాని హస్తవాచకమైన చేయిశబ్దంకాదు. అదే అయితే ఔపవిభక్తికవికారరూపం వుండితీరాలి. యీతృతీయాంతానికి సమన్వయం యెక్కడ-అక్కడ వివక్షితార్థం యేమిటీ——ఎవరిచేత దాఁపించియున్నాఁడో అనికదా! యింకా పిండితార్థం తీస్తే "దాఁచపలసిందని యెవరి కిచ్చాఁడో?" అని తేల్తుంది. అప్పుడు షష్ఠివుండాలికాని తృతీయవుండదు. యివన్నీచూచి కవిత్వం చెపితే అడుగుతారూ సొగసు: "అహో! స్వామిరూప మడగనా?" అన్నమాదిరిగా వుంటుంది. (శంకించేవారే నా యివన్నీ చూచే చెపుతూ వున్నారా? లేదు) భవభూతి యేమన్నాఁడు?

శ్లో. "లౌకికానాం హి సాధూనా । మర్థం వాగను వర్తతే,
ఋషీణాం పునరాద్యానాం । వాచమర్థోఽనుధావతి."

వాళ్లుమహాకవులు. "నా నృషిః కురుతే కావ్యమ్" అయావాక్యాలకు యెంతో చక్కని అర్థం వుంటుంది. అది వినీ వినడంతోటట్టే స్ఫురిస్తూనే వుంటుంది, మనం "చిన్నచిన్న వ్యాకరణపుఁ బొత్తముల్ సదివి" "లక్కికి లిక్కి, లిక్కికి లక్కి" అంటూ కూర్చుంటే అది రసాభాసయిపోతుంది. శ్రీనాథుఁడంత వాఁడు——"గౌడడిండిమభట్టు కంచుఢక్కాను"

మహాసభలో వాదంలో వోడించి పసులఁగొట్టించినవాఁడు నాఁటికాలంలో రాజమహేంద్రప్పండితుల శంకలకు జవాబు చెప్పలేకే

"విద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్ ధర్మాసనం బుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావ మనుచున్ దర్కింతురు"

అన్నాఁడా? (ఆ శంకలు అంత అర్ధాన్నపు శంక అన్నమాట) యింక మరోమాదిరి శంకలు చేసేచోట్లు చూపుతాను: "మగవారిఁ జూచి తా మరుగు కేగెడి యింతి" అని వుత్తరభాగంలోనేవుంది. దీన్ని "మరుగు చేరెడు" అని దిద్దివున్నారు, నగాగమ సంపాదనకోసం; "మరుగు" వుభయపాఠాలలోనూ వుంది. యీ మరుగు పదం మన వ్యవహారంలో జుగుప్సారూపకమైన అశ్లీలాన్ని కలిగిస్తుంది. యెందుచేత కలిగిస్తుంది, అసలు ఆపదంలో వుందా ఆదోషం? అబ్బే! లేదు. యింకోదాన్ని బాగుచేయడానికని యీ పదాన్ని పెద్దలు ఆ సందర్భంలో వాడడానికి మొదలుపెట్టేటప్పటికి వారనుకున్నపని జరుగలేదుగాని యెన్నోపదాలు చెడడం తటస్థించింది. 'చెంబుపట్టుకొని' వగైరాలు చూచుకోండి. కాని వొక్కొక్క నాడులో వొక్కొక్క విధంగావుంది యీవ్యవహారం. అది కనిపెట్టడం కష్టం. నారయ్యగారి వైపున యిట్టి వ్యవహారం వుందో లేదో? ఆఖరికి కాళిదాసుగారి "బాహ్యోద్యానాన్ని" "చెఱిచి చండాలంబు చేసే" బుద్ధిమదగ్రేసరులుకూడా వున్నారు. ఆమధ్య వొకాయన వొక పుస్తకం లక్షణానికంటూ వ్రాస్తూ యీధోరణే దానిలో వుపక్రమించారు. యేదో కొంతలో శాంతించారు, అవురోమఋషిగాదు. అది వారితప్పని మాత్రం కేవలమూ అనడానికి వీల్లేదు. లక్షణ నిర్మాతలు కొందఱు మఱీ చాదస్తంగా పోయివున్నమాట సత్యం. వారికాలంలో ఆభాగాలు వినిపించినప్పుడు వారిని యెదుర్కొని అడిగినవా రున్నారో లేదో అని నాకు సంశయం తోస్తుంది. వారి అభిప్రాయాన్నిపడితే కవితమాటకేమి. ఆఖరికి, -కృష్ణా! రామా! గోవిందా! అనే అర్థంయిచ్చే పరమపవిత్రమైన శబ్దాలలోకూడా యెన్నో కేశవాదులు భాషలోన్నుంచి తొలఁగించ వలసి వస్తుందని అన్యత్రా వ్రాశాను. యీ

వ్యాసంలోనూ కొంచెం గొప్ప వ్రాశానని జ్ఞాపకం. ఆ లక్షణనిర్మాత యెంతటి విజ్ఞుడైనా లోకమహాకవిన్నీ ఆదరించని లక్షణం నిర్మించి యేం ప్రయోజన మనే ప్రశ్నకు జవాబు కనపడదు. అందుచేత ఆఁపుతాను దీన్ని. మఱీ కుశ్శంకలు చేసేవారికి వినోదార్థమో అన్నట్టు నారయకవీంద్రుఁడు కొన్ని ప్రయోగాలుచేసి వున్నాఁడు—"తన్నైన నిచ్చున్" అన్నాఁడు కుచేలో పాఖ్యానఘట్టంలో శ్రీకృష్ణమూర్తిని సేవిస్తే యితరలాభాలు కలక్కపో యినా తుట్టతుదకు "తన్నులేనా లాభిస్తాయి" అనే అర్థం చెప్పుకోవ డానికి యిది వుపకరిస్తుందనుకుంటాను. యీలాటి అపార్థాలుకూడా తీసే వారుంటారా అనుకోవచ్చు వున్నారు. కనకనే వ్రాశాను. యీలాటివి వెదికే పక్షంలో యింకా చూపించ వచ్చునుగాని ప్రాజ్ఞులు నవ్వుతారని వుపేక్షిం చాను. యీ చూపడం నారయ్యగారి కవిత్వంలో మాత్రమే కాదు. పోతన్న గారిదాన్లోనూ చూపవచ్చును. యీత్రోవను కలందదిపేవా రెవరేనావుంటే, వారు కవులుకూడా అయేపక్షంలో వారి కవిత్వమంతా యీలాటిశంకలకు గుఱిచేసి చూపించడానికి తగ్గంత ప్రయోజకత్వాన్ని భగవంతుఁడిచ్చాఁడు, కాని ప్రాజ్ఞలోకం యేమనుకుంటుందో అనే భయమే బాధిస్తూవుంది. ఆ మధ్య లోకవ్యాసంలో కాళిదాసుగారి కవిత్వంలో కొన్ని యీలాటివి చూపినట్టు జ్ఞాపకం. ఆ చూపడానికి ప్రయోజనం కలిగినట్టు మాత్రం లేదు.

"బలుఁడంగాను మురాసురాంతకుఁడగాఁ బ్రిద్యుమ్నుఁడంగాను" యీవాక్యములలో మధ్యవాక్యంలోవున్న "గాను" అనేదానిలో చివరవున్న ద్రుతం లోపించడానికి శాస్త్రంవున్నా యిది కొంచెం శంకించే వారికి అవ కాశం మాత్రం కలిగిస్తుంది. ప్రయోగమివ్వవలసివస్తే చాలాకాలం వెద కాలి. కాని నిర్దుష్టం. 1. నాకౌకసార్థ మొనర్చి 2. కంకణ కేయూర 3. సదయామతి —యీ మూఁడుచోట్లను శంకకవకాశం వుంది. కాని సమర్థ నీయాలే. నాకౌకశ్శబ్దము సకారాంతంకదా? దానికి అర్థశబ్దం పరంగావుంటే "నాకౌకోర్థం" అని కావాలి. అనిశంక — సమాధానమో? తస్మాత్తూ సంబంధార్థమందో, లేక స్వార్థమందో? అప్రత్యయాన్ని చేసుకున్నప్ప

టికీ వచ్చేవైరూప్యం ఆదియందుండదు; అంతమలందు అణ్ణుచేరి అకారాంతమై అప్పుడు అకారాంతమౌతుంది. అర్థశబ్దం కల్పితే ప్రస్తుత రూపం సిద్ధిస్తుంది. "స్థితస్య గతిశ్చింతనీయా" యింక రెండోది. ద్వంద్వం చేసుకొని అర్మ ఆదిత్వాత్తూ అణ్ణు చేసుకుంటే అవి కలవాఁడు అనే అర్థంవస్తుంది. "ఆనందో బ్రహ్మ" వగైరా స్థలాలలో ద్వైతులు దీని ద్వారాగానే తద్వృత్తను సమర్ధిస్తారు. యింక మూఁడోది: దయాశబ్దమతి శబ్దాలకు ముందుగా మధ్యమపదలోప సమాసం చెప్పుకుని అనంతరం సహాశబ్దంతో బహువ్రీహి చేసుకొంటే "వచశంకానచోత్తరం"గా కుదిరిపోతుంది. దయామతి కరుణామతి వగైరాలు తఱచు భారతాదుల దగ్గిర నుంచీ వాడేవేగాని మన నారయ్యగారి నాఁడే పుట్టినవికావు. "ప్రకటయోధవ్రాతసాహంకృతుల్" యిక్కడ "సాహంకృతుల్" అన్నది విశేషణమే అయినా ప్రకరణాన్నిబట్టి అహంకారముతోకూడుకున్న (సింహనాదములు) అనే అర్థం వస్తుంది. యిట్టి విశిష్టవాచకాలు కవిత్రియసమ్మతాలని లోగడ వివరింపబడ్డదే 1. నిర్వాణమూర్తైన 2. పిశాచపతైన 3. దేవహూతిట్లను- యీలాటి తత్సమేకారసంధులు పూర్వం భారతంలో వుండేవేమోకాని యిప్పుడు భారతంలో కనపడవు. అహోబలుఁడు వప్పుకొన్నాఁడు; వుదాహరణాలుకూడా యిచ్చాఁడు — తత్సమాకారసంధి — 1. బ్రహ్మంతవాని 2. సంపదేటికి, అనేవాటికి వున్నంతగాని, విజేఁగెజేఁగి, అటుఁజూపిటు వగైరా క్త్వార్థకేకారసంధి ఘటిత రూపాలకు వున్నంతగాని శ్రవణసుఖం కనపడకపోయినా అహోబలపండితుఁడు (చాదస్తుఁడు) వొప్పుకోవడమే కాకుండా, శ్రవణసుఖానికి బాగాపాటుపడేవాఁడు రామరాజభూషణుఁడు; "ఇంకఁబల్లవపుటార్చిడఁగరాదు" అని (యిప్పటి కెవ్వరూ దీన్నిదిద్దలేదు) దిద్దరానిచోట ప్రయోగించి వున్నాఁడు అందుచేత వాట్లనిగూర్చి చర్చించడం అనవసరం. ఇతఁడు "మురిపము" అనేదానికి యతిస్థానంలో మురిపెము అని ప్రయోగించడంచేత శ-ర-ని. లో రూపద్వయాన్ని వొప్పుకొని, సజాతీయశబ్దం 'తిరిపము' అనేదానికి దిద్దరానిచోట ప్రయోగం దొరకక

కాఁబోలు రూపద్వయాన్ని వ్రాయలేదు. యిది 'నేర్తున్' అనేదానికి 'నేతున్' అనే రూపాంతరం వంటిదికాదు. కనుక దీనికన్నా యెత్వ ఘటిత రూపం చెప్పుకోవచ్చునని నే నభిప్రాయపడతాను.

పోతన్నగారి శిష్యుఁడు నారయ్యగారి కవిత్వాన్నిగూర్చికూడా కొన్ని వాక్యాలు వ్రాసినట్టయింది. షష్ఠస్కంధాన్ని అనువదించిన సింగయ కవీంద్రుణ్ణి గూర్చి యేదో తత్సమాకార సంధి ప్రయోగమాత్రం చూపి కొంచెం వ్రాశాను. ఆయనకవిత్వంకూడా సాఫుగావుండేదేగాని అల్లాటప్పా తరగతిలోది కాదు. వ్యాసారంభంలో "ఎమ్మెలుచెప్పనేల" అనే పద్యంవల్లనే ఆయనకవిత్వం ఔపకవిత్వమని కవితామర్మజ్ఞులు గుర్తిస్తారు. ప్రాచీనంగా అచ్చుపడ్డదేగాని యిప్పటి అచ్చుప్రతి నాది ఆయనకవిత్వ భాగం వున్నది సమయానికి లభించిందికాదు. యేవో కొన్నిచోట్ల దిద్ది వుంటారు సంస్కర్తలు. వాట్లనుగూర్చి వేఱే వ్రాయవలసి వుండదు. వ్రాసినదానివల్లనే అది గతార్థం కావచ్చును.

పోతన్నగారు నైజాం మండలంవాఁడా? కడప మండలంవాఁడా అంటూ కొంతకాలంకిందట వాదోపవాదాలు జరిగివున్నాయి. దానికి కొంత ఆధారం (నైజాంమండలంవాఁడే అనుటకు) సింగనకవీంద్రుని షష్ఠస్కంధంలో కనపడుతూ వుంది;

"వృషలియందనురాగ వృద్ధి బిడ్డలఁగని
కులము గోదావరి గూలఁద్రోసి"

అనేపద్యాన్నిబట్టి చూస్తే సింగన్నగారు గోదావరీతీరానికి సంబంధించిన మండలంవాఁడుగా తోస్తుంది. గోదావరి చాలాభాగం నైజాం మండలంలో ప్రవహించింది. మూలంలో యీ ఘట్టంలో గోదావరీ ప్రసంగంగాని, గంగా ప్రసంగంగాని లేదు. గోదావరీ తీరస్థులు యీలో కోస్తినీ వాడడం వుంది. అందుచేత సింగయ్య గోదావరివాఁడేనని చెప్పి కొనేయెడల యీయనకు పోతన్నగారితో శిష్యత్వ సంబంధం కాకపోయినా

యేదో బాంధవ్యం వుండితీరుతుంది. రైలువగయిరా సదుపాయాలు లేని ఆరోజుల్లో నైజాంమండలంలో వుండే సింగయ్యగారికిన్నీ కడపమండ లంలో వుండే పోతరాజుగారికిన్నీ చుట్టరికం కల్పడం కంటె వుభయు లున్నూ వకటే మండలంవారయి వుంటారన్నది యుక్తిసహంగా వుంటుంది కనక పోతరాజుగారు నైజాంమండలంవారే అన్నవారి వాదంలో నేను యేకీభవిస్తున్నాను.

యింక బొప్పనామాత్య పుత్రుఁడు గంగనార్య కవిని గూర్చి రెండు మాటలు వ్రాస్తాను. ఉత్పన్నభాగాలు పూరించిన వారిలో యీయన కవిత్వం చాలా తక్కువ అని వేఱే చెప్పనక్కఱలేదు. యీయనకూడా ధారాశుద్ధి కలవాఁడు. నారయ్యగారికి తప్ప తక్కిన పూరకులు యిద్దఱి కిన్నీ పోతన్నగారితో యేలాటి సంబంధం వుందో గ్రంథాన్నిబట్టి తేలదు. ఆయన గ్రంథాన్ని పూరించడాన్ని బట్టే యేదో చుట్టరికం వుంటుందని వూహించడం యుక్తిసహం కాదుగదా? ఆపద్ధతిని నన్నయ్యగారికిన్నీ తిక్కన్నగారికిన్నీ సంబంధం కల్పవలసి వస్తుంది. వకకవికిన్నీ వేఱొక కవికిన్నీ సంబంధం కల్పవలసి వస్తే అన్నిటికన్న ప్రధానమయినది కవిత్వమే అనుకుంటే యేచిక్కున్నూ వుండదు. యీయనధారను తెలుసు కోవడానికి వొకటి వుదాహరిస్తాను.

ఉ. "అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుకలేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
నచ్యుతభావముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోఁడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్."

అంతగా వెదికివెదికి వుదాహరించలేదు. సంఖ్యాపూరణాన్ని ప్రధా నంగా పెట్టుకొని విమర్శించే తెగవారికి దీనిలో "యెంతయున్" అనే పదము రెండుమాట్లెందుకు రావాలి అనేది వకశంక కాకపోదు. భారతా న్నుంచి దీన్ని తీసి సమర్థించడానికి యెన్నో వుదాహరణలు చూపవ

చ్చును. అన్యత్ర యెప్పుడో చూపే వున్నాను. "శకటాలునెత్తికొని" అన్న నన్నయ్యగారి పద్యం చూచుకోండి కావలిస్తే. అలాటివి శంకలూ కావు, యీలాటివి సమాధానాలున్నూ కావని ప్రాజ్ఞులైన సహృదయు లెఱింగే వుంటారు. మూఁడోచరణంలో "అచ్యుతభావముఁ చి" అనేది ప్రాసలో బడింది. చకారద్విత్వానికేమి, పాణినీయంవల్ల సాధించవచ్చును-యకారాధిక్యం సమర్థించఁ బడుతుందా అంటే, లోఁగడ దీన్నిగూర్చి వ్రాయడం జరిగింది. చాలామంచి మహాకవులు "శషవైషమ్య మవి వక్షితం" గా ప్రాసవిషయంలో ప్రయోగిస్తూన్నారని ఋజువు చేయడ మైనది. యిక్కడ మళ్ళా చర్వితచర్వణం లెందుకు? ద్విత్వప్రాస స్థలాల్లో ఉచ్చారణలో విశేష వైషమ్యం లేనిపద్ధతిని ప్రాసమైత్రి చెల్లుతుం దని మహాకవుల పోకడలు సాక్ష్యమిస్తూవున్నాయి. ఆమహాకవులయందు గౌరవంవున్నవారు వారిమార్గాన్ని అనుసరిస్తారు. లేనివారు మానుకొం టారు. దీనికి నన్నయ్యగారు కూడా వ్యతిరేకించేవారుఁగారు. (లోఁగడచూ.) నన్నయ్యగారు వ్యతిరేక క్త్వార్థకమైన (లేక) అనేదాన్ని దిద్దుబాటులేనిచోట ముద్రితప్రకృతికంగా "లేకను" అని జరత్కారు చరిత్రలో వాడివున్నారు. ఆహేతువుచేతనే అనుకొంటాను. ప్రాచీనతాళపత్ర గ్రంథాలలో నేమి, అచ్చుప్రతులలోనేమి సర్వత్రా వ్యతిరేక క్త్వార్థక రూపాలు దృష్టాంతాలుగా కనపడుతున్నాయి. వందలూ వేలుగా వుండడంచేత వుదాహరించలేదు. దాన్ని సముచ్చయంగా కొందఱు సమర్థించారు, అలాగే యెఱ్ఱన్నగారు "కుంభపీఠము పగుల్చి" అని హరివంశంలో యతిస్థానంలో ప్రయో గించడంచేత చిన్నయ్యసూరి స్వయంగా పూర్వపుదిద్ది ప్రచురించిన నీతి చంద్రిక దగ్గఱనుంచీ ఎఱుఁగించి, తెలుఁగించి, వినుపించి వగైరా ఉకార ఘటిత రూపాలతో నిండివున్నాయి లోఁగడ పుస్తకాలు. యిటీవల అన్నీ దిద్దఁబడ్డాయి. ఆయతిస్థానంమాత్రం అలాగేవుంది. ఈ దిద్దుఁబాట్లన్నీ ప్రమాదా లనడానికిన్నీ వల్లకాదు, పూర్వపాఠాలన్నీ ప్రమాదాల నడానికిన్నీ వల్లకాదు. విమర్శకులు పరిశీలించి యుక్తాయుక్తనిర్ణయం

చేసుకోవలసివుంటుంది. దానికి తగినంత పిండివుండాలి. అదిలేనివారు వృథాగా వాదోపవాదాలు పెంచుకొని తద్ద్వారా వ్యక్తిని అవమానించేదాఁకా నిద్దరపట్టక మనోవ్యాకులత్వానికి గుఱికావడం శోచనీయం కాకపోదు. వకరు యేప్రయోగాన్ని ఆధారంగా పెట్టుకొనో యేదో ప్రయోగించుకొంటారు. వేఱొకరికి ఆ ఆధారం నచ్చక అది సమంజసం కాదంటే రెండోవారు సమంజసమే అంటారనుకోండి: యింతమాత్రంలో వచ్చిన పుట్టిములకేముంది? దీనివల్ల యెవరికిఁగాని వచ్చే అవమానం కనపడదే?

"మహాఋషీనాం మతయశ్చభిన్నాః" యిది నేఁడే వచ్చిందా. అనాదిగావుంది. నేను యేకవుల ప్రయోగాలను గూర్చి తోఁచిన సమర్థనం వ్రాస్తూవున్నానో ఆకవులు నాకు చుట్టాలుకారు. వారిప్రయోగాలద్వారాగా నాప్రయోగాలు సమర్థించుకోవలసినవిలేవు. యింకెందుకంటేఁ యీ తెలుఁగు నానాసాంకర్యాలతో చేరిందవడంచేత—

తే. "కేవల గ్రామ్యపదముల నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
కలవు లేవని పెనఁగ శక్యమ్మె? భార
తాదులను లేని పదములు నవనిఁగలవె?"

అని బోధించడానికే. ఆ యీ సమర్థనాన్ని ఆమోదించడానికి యిష్టంలేనివారు కొందఱుంటారుకదా! "షష్టమహోర" వగైరా యెవరివో ప్రయోగాలున్నాయి కొన్ని. అవిసమర్థించినప్పుడు కదా ఆలోచించవలసి వుంటుందంటూ ప్రశ్నిస్తారు. ఆలాటిప్రయోగాలు నాకు సాధ్యంగావనే మనవిచేస్తాను. "ఇంద్రాణి" వుందిగదా అని 'శక్రాణి' అంటే నే సమర్థించఁగలనా? 'ఓష్ఠ' శబ్దాన్ని 'ఓష్ట' శబ్దంగామార్చి వ్రాసిన స్థలంలో ప్రయోగిస్తే సమర్థించడం నావల్లవుతుందా? 'పరభృత' శబ్దాన్ని 'పరభృత్తు' గా హలంతం చేసి వాడితే నేను సమర్థించఁగలనా? సమర్థించలేననే నా ప్రత్యుత్తరం. యింకా యీలాటివి యెన్నో వున్నాయి నేను

సమర్థించలేనివి. గ్రంథవిస్తరభీతిచే వాటినన్నిటినీ వుదాహరించలేదు.
గాని ఆ యీ శబ్దాలునాకు సాధించరానట్టు తోఁచినంతలోనే తప్పులను
కాని జాబితాలో యెక్కించి ఆక్షేపించడానికి మాత్రం నాకు సాహసం
చాలదు. యేమో? యెవరికేనా యిందులో అన్నికాకపోతే కొన్నేనా
సాధ్యమవుతాయేమో? మనం తొందరెందుకు పడాలి అని పస్తాయించ
డమే నాకు అలవాటు. అందుకే నేనెప్పుడుగాని యెవరికవిత్వాన్నిగాని
విమర్శించి ప్రచురించడ మంటూ వుండదు. యౌవనావస్థలో కాఁటోలును
మా కవిత్వాన్ని నిర్నిమిత్తంగా, అనుచితంగా విమర్శించి ఆయన ముందుగా
మా మీఁదకి వస్తే దానికి జవాబు వ్రాసి వూరుకోక, ఆయనవ్రాసిన,
"పూర్వశాకుంతల" మనేనాటకాన్ని నిరుత్తరంగా విమర్శించి ప్రచు
రించడం జరిగింది. అప్పటి మట్టుకు అది అవసరంగా కనపడ్డప్పటికీ
యిటీవల మనది మనం సమర్థించుకోవడం వఱకే ఆవశ్యకంగాని ఆవలి
వారి లోపాలు బయటపెట్టడం అంత ఆవశ్యకం గాదనే నాకు తోఁచేది.
యిటీవల వాదోపవాదాలలో ప్రత్యేకించి యెదటవాళ్ళని విమర్శించినట్టయితే
లేదుగాని ప్రసక్తానుప్రసక్తంగా ఆవలివారు తప్పులను క్వచిత్తుగా
చూపడం (గ్రామం గచ్ఛన్ తృణంస్పృశతి) గా కూడా చూపడం
జరగలేదని వ్రాయఁడాలను. ఇదిన్నీ అనవసరమే. యేమంటారా? ప్రతి
వాదులు అసమర్థులయినంత మాత్రంలో నిజంగా తనరచన దోషభూ
యిష్టమే అయితే వారి అసమర్థత్వంవల్ల తనరచన లేశమున్నూ సమర్థింపఁ
బడదని నాదృఢవిశ్వాసము. కవికిన్నీ పాచకుఁడికిన్నీ నేను వుపమానాన్ని
అంగీకరించేవాణ్ణి. నీ వంటలో లోపంవుందని తినేవాళ్ళన్నటప్పుడు. — నీవు
వండినవంటకూడా దుష్టమే అంటే యేంప్రయోజనం? ఆవలివాఁడు
పాచకత్వంలో ప్రవేశం బొత్తిగా లేనివాఁడుకూడా కావచ్చునుకదా?
కొంత ప్రవేశం వున్నవాఁడైనా అతని పాకాన్ని దుష్టమని నిరూపించి
నంతలో తనపాకంలో వున్న లోటుపాట్లు సవరణ కావుగదా? అందుచేత
ఆక్షేపకుణ్ణి ఆక్షేపించి ప్రయోజనం లేదు. తనకిప్పుడేంతోస్తూ వుందంటే?

యెవరేనాసరే తనరచనను ఆక్షేపిస్తే ఆక్షేపిస్తారుగాక "కిమన్నాస్తి" గా వూరుకొంటే లోకమే దానితత్త్వాన్ని తేలుస్తుందని తోస్తూవుంది. కాని యేదో వక మిషను పురస్కరించుకొని తన అనుభవాన్ని వెల్లడించడం వల్ల జిజ్ఞాసువులకు కొంత వుపకారం వుంటుందనికూడా పెద్దలంగీకరిస్తారు. "స్పర్ధయా వర్ధతే విద్యా" అన్నది నిన్నా నేఁడూ పుట్టిందిగాదు. అందు చేత అదిన్నీ మన్నించతగ్గదే. కాని కేవలం వృద్ధాప్యంలో యింకా విద్యాభివృద్ధి చేసుకొని పొందే ప్రయోజనమేమిటి? కనకనే యీ మిష మీఁద సంస్కృతాంధ్ర భాగవతాలు చదవడం పెట్టుకోవచ్చునుగదా అని భాగవత ప్రయోగాలనుగూర్చి వ్రాయడానికి వుపక్రమించాను. తోఁచిన వేవో నాల్గుమాటలు వ్రాశాను. బాగుంటే స్వీకరిస్తారు శుశ్రూషువులు లేదా? తోసిరాజంటారు. యీ కారణంచేత భాగవత కాలక్షేపం జరిగింది గదా అని నేను సంతోషిస్తూన్నాను.

అంతో యింతో వుత్సన్నభాగపూరకులైన సింగన మొదలైనవారిని గూర్చికూడా వ్రాసినట్టయింది. కాని యీ వ్రాయడం దశమస్కంధం వఱకే చూచి వ్రాసింది కాని యేకాదశ ద్వాదశస్కంధా లింకా మిగిలే వున్నాయి. యేకాదశంలో రేఫప్రాస యెత్తుకొని — "హర్షాశ్రుపులకితుం డయి" అని మూఁడో చరణంలో రేఫషకార ద్విత్వంతో పూరించినది వకకందం వుంది. అచ్చుపొరఁబా టని దిద్దేయెడల "హరషాశ్రు" అని దిద్దవలసి వస్తుంది. అప్పుడు లోఁగడ చూపిన "కచా, కరషణముల్" అనేశబ్దంమాదిరిని వ్యాకరణాంతరందాఁకా అనుధావన చేయవలసి వస్తుంది. యిప్పటిప్రతిలో యేచిక్కూ లేకుండా "భరితాశ్రుపులకితుండై" అని దిద్ది వేశారు. అశ్రుశబ్దానికే 'హర్షాశ్రువులు' అనే అర్థం '**పులకిత**' శబ్దంవల్ల వస్తుంది కనక బాగానే వుంది.

మఱి రెండుచోట్ల నిరుపాధిక నణ ప్రాసలు కనపడతాయి. (1) "చాణూర ముష్టిక ధేనుప్రలంబక" (2) "శ్రీనాయక—వి, న్నాణంబు"

యివి కవి సమ్మతించి ప్రయోగించుకున్నవే. దుర్ణయశబ్దంలో ణకారం లేదని యిటీవల తేలింది కనక బుద్ధిపూర్వకం కాకపోయినా ఆప క్షాన్ని బట్టిచూస్తే భట్టారకుఁడుకూడా నిరుపాధిక ణణప్రాసకు సమ్మతించి నట్టవుతుంది. (దుర్నయమున శకుని కర్ణ దుశ్శాసనుల్) అనే వుండవలసి వస్తుంది. తిక్కన శ్రీనాథ పెద్దనలు కూడా యీలాగే దిద్దుకున్నట్టవు తుంది. అప్పుడు నారయ్యగారున్నూ సమర్థింపఁబడతారు. కాని నన్నయ్య గారినాఁటికి 'దుర్ణయ' శబ్దంలో ణత్వం నిష్టష్టమే అని అన్యత్ర వ్రాసి నది మఱవ వద్దని హెచ్చరిస్తాను.

యింకొకచోట యిప్పటివారు సంస్కరించని అయోమయపు యతి వున్న పద్యం వుంది: "ఊహింప — వి, దేహాని యజ్ఞాంతమందు నేతెం చినచో." యిది కవికి అఖండయతి సమ్మత మనుకొన్నంతట్లోకూడా సమర్థింపఁబడదు. వర్గయతి పంచమవర్ణ పర్యంతమూ అంగీకరిస్తేగాని కుదరదు. యిదివఱలో నారయ్య ఆలా సమ్మతించిన ప్రయోగాలు దొరక లేదు. అందుచేత యిది ప్రమాదపతిత మనుకొని సవరించడం యుక్తం. యెవరి ప్రమాదం అనే విచారణతో మనకు పనిలేదు. యెవరిదేనా సరే. "వి, దేహుమఖాంతమున నరుగుదెంచినచోఁ దా గేహము." అనినచో సరిపోవును. యిట్టివి భారతాదులలో లేఖక ప్రమాదాదు లెన్నో వుండి యుండును; యెందఱో దిద్దివుందురు. ఆయా సందర్భం పాణిగృహీతలో— "పూర్వపున్ గ్రంథముల్ మతిమన్మఖ్యులు దిద్దకే కలిగె బ్రామాణ్యంబు" అని వ్రాసివున్నాము. యివి గ్రంథకర్త పాండిత్యలోపప్రయుక్తాలు కావు, భ్రాంతిప్రయుక్తాలని వేఱే వ్రాయనక్కఱలేదు.

యీ యేకాదశస్కంధంలో "సర్వలఘుసీసం" వకటి వుంది. చరణం వక్కంటికి తొమ్మిది నలాలు వున్నాయి. తొమ్మిది నాల్గులు ముప్పైయాఱు లఘువులు గనుక అప్పకవిగారి "షమష ట్త్రింశ ల్లఘువులు" అన్న లక్షణానికి సరిగానే వున్నది. యెందుచేతో సంస్కర్తలు సమన్వ యంగా లేదని ఫుట్నోట్సులో వ్రాసి వున్నారు. వారు మఱివక విధమైన

లక్షణ మేదేనా చూచి ఆలా వ్రాసివుందురేమో? దీనికోసం అప్పకవీయం చూస్తూవుండఁగా ప్రాసవిషయంలో వొకవిశేషం కనపడింది-వుదాహరిస్తాను:

"తురగవల్గనములు రెంటితోడ విజయమంగళంబు,
ధూర్తకంసతూలదహన తుహినహీరసదృశకీర్తి"

దీన్నిబట్టి ద్విత్వవర్ణాలలో యీషద్వైషమ్యం అప్పకవికి ప్రాసవిషయంలో సమ్మత మని తేలుతూవుంది. సంస్కర్తల వుట్టునోట్సు చూపుతాను:

" ఈ సీసపద్యము పెద్దపాదములలోఁ బ్రతిపాదమునందును దొమ్మిది నలములు గలిగి లక్షణ సమన్వయములు గాక యున్నవి. తేట గీతియు నట్లేయున్నది. వ్రాఁతప్రతులయం దట్లే యుండుటంబట్టి దిద్ద వీలు పడదయ్యెను" అని వ్రాసియున్నారు. అప్పకవీయాన్ని పట్టి చూస్తే వీరివ్రాఁత ప్రమాదంగా తోస్తుంది. వీరు "ఇంద్రగణము లాఱు నిన గణమ్ములు రెండు" అనే సామాన్యసీసలక్షణాన్ని బట్టి ప్రస్తరించి ఆమా టలు వ్రాసి వుందురేమో? గీతం బొత్తిగా సందేహించేరీతిలో లేదు. అందుచేత సంస్కర్తల వ్రాఁత కర్థం కనపడడం లేదు. విచక్షణు లాలో చింతురుగాక. యిక యీస్కంధంలో కొందఱుమాత్రమే శంకించే శబ్దాలు చూపుతాను :

(1) మనుజుం డూహాపోహ లెఱుంగక (2) వారల హితంబు గావించి (3) హాస్యంబు సేయుచు (4) అసహ్యాపడి (5) దారలయందు (6) ముదిమిచే రోగము లుదయింప కడమున్న (7) జంతువు వేఱొక్క జంతువుగనె (8) వలవదు (9) విరుపమ నయవంతా!

ఆయీస్థలాలలో యేమాత్రమూ శంకించవలసి లేకున్నా కొందఱు శంకించేవా రుండడంచేత వీట్లని వుదాహరించాను. ఇందులో 1-2 నెంబర్లు గలవాట్లను లోఁగడ విచారించే వున్నాను. 3 వ నెంబరు 'జ్ఞాపక' శబ్ద విచారణవల్ల గతార్థ మవుతుంది. సమన్వయించుకొనే నేర్పు లేనివారికి తప్ప తదితరుల కివి యేవీ ప్రష్టవ్యాలు కావు. తుట్టతుది సంబోధనం

మాత్రం భారతేతరులలో కనపడుతుంది గాని భారతకవులలో కనపడదు. చాలామంది కవులు బాహాటంగా వాడుకోవడం కలదు. వారంతా కవులే అవుతారా అంటేమాత్రం జవాబుచెప్పడం కష్టం. (శతకకవులలో యెంతో మంది శిరసావహించ తగ్గవారున్నట్టు అప్పకవి ప్రవృత్తివల్లనే గోచరిస్తుందికదా!) ఆపద్ధతిని యెవరూ కవులు కాకపోవలసి వస్తుంది. యీస్కంధంలో భక్తికి ఆటపట్టుగా వున్న పద్యాన్ని వొకదాన్ని వుదాహరించి ద్వాదశస్కంధం విమర్శిస్తాను :

చ. "నగుమొగమున్ సుమధ్యమును నల్లనిమేనును లచ్చి కాటప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండల కర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁగాతఁ గను మూసినయప్పుడు విచ్చినప్పుడున్."

యీ పద్యంలోకూడా దుశ్శంక కవకాశం లేకపోలేదు. 'కుండల కర్ణములు' అన్నచోట, చెవులకు కుండపిడతలు తగిలించుకున్నాఁడా శ్రీకృష్ణభగవానుఁడు అని ఆక్షేపించవచ్చును. సహృదయులు అట్టిశంకల కామోదించరుగదా!

యిఁక 12వ స్కంధంలో వొకచంపకమాల "స్మృతియును" అని తకారప్రాసతో ఆరంభమై 'అ - వదలను' అని దకార ప్రాసతో ముగింపయింది. సంస్కర్తలు దీన్నిగురించి యేమీ ఫుట్నోట్సుగా వ్రాసినట్టు లేదు. ద, ధ లకూ థధలకూ ప్రాసమైత్రి వుందిగాని ప్రథమ తృతీయాలకు వున్నట్టు లేదు. యిది భ్రాంతిమూలకంగా కనపడుతుంది. దీన్ని పాండిత్యలోపంకింద జమకట్టేవారుంటారని నేను అనుకోను. సంస్కర్తలు సంస్కరించకపోవడంకూడా భ్రాంతిప్రయుక్తమే. నావద్ద వున్న ప్రాచీన ప్రతిలో యీభాగం ఉత్పన్నమయింది. అందుచేత దానిలో యేలావుందో చూదామంటే వీలిచ్చింది కాదు. పైస్థలం చట్టన దిద్దడానికిన్నీ స్ఫురించలేదు. యింకొకటి ప్రాసమాత్రమేకాకుండా యతికూడా పూర్తిగా పోయిన పద్యం ఆప్రాంతంలోనే వుంది :

క. "ధారుణి పారాశర్యున
కార్యులు పైలుఁడు సుమంతుజైమినిమునులున్"

దీన్ని యీలా దిద్దవచ్చును :

క. "ధారుణి వ్యాసునకు సదా
చారులు పైలుఁడుసుమంతు జైమినిమునులున్"

తుట్టతుది భాగమవడంచేత సంస్కర్తలు కొంత అశ్రద్ధగా వ్రాఁపు దిద్దడంలో యివి పొడకట్టలేదనుకోవాలి. యీలాటి లోపాలు ప్రతివాని కవిత్వంలోనున్నూ లేఖక ప్రమాదాలవల్ల దొర్లుతూ వుంటాయి; కవిజీవిత కాలంలో కవిప్రమాదంవల్లా దొర్లవచ్చు. వీట్లని ప్రాజ్ఞులు పరిగణింపరు. యిట్టివి దిద్దడం యుక్తమే. కవి సమ్మతించి ప్రయోగించుకున్న — (1) నమ్మీనమ్మక (2) మనుజులవిప్రుండు మొదలైనవి దిద్దడంవల్ల చాలా అపాయం వుంది. వలవదు అనేప్రయోగంకూడా యిప్పుడు కొందఱు తప్పని సంఖ్యాపూరణం చేస్తున్నారు. భాగవతంలోనేకాక యితరత్రకూడా ఇది అసకృదావృత్తిగా కనపడుతుంది. "కృష్ణరాయ" అన్నది తెలుఁగే కాక సంస్కృతంకూడా కనపడుతుంది. కృష్ణకర్ణామృత తృతీయసర్గ తుట్టతుదిని చూస్తే కనపడుతుంది. గుప్తార్థ ప్రకాశికలో దీన్ని సంస్కృత మనడం సాహస మని వ్రాశారు. కర్ణామృతశ్లోకం దిద్దడానికి వీలులేని అంత్య ప్రాసనియమంతో చేరివుంది. యీలా పరిశీలించినకొద్దీ విశేషాలు గోచరిస్తూనే వుంటాయి. దుడుంగున తొందరపడి సంఖ్యను పూరించేవారు తుదకు విచారించవలసి వస్తుంది. అది యెన్నివిధాల ప్రయత్నించినా సవరణ కావడమంటూ వుండదు. పరిశీలన వుండడం మంచిది. ప్రస్తుతం దీనికి స్వస్తి చెపుతాను.

"జయంతి తేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తియేషాం యశఃకాయే జరామరణజం భయమ్"

---

# బహుజనపల్లి వారు

( ది 8—5—1940 సం॥ర ఆంధ్రపత్రిక నుండి )

ఈయింటి పేరింటి శ్రీయుతులు సీతారామాచార్యుల వారి సంస్కృతాంధ్రపాండిత్య మసదృశమని శబ్దరత్నాకరమనే నిఘంటువలన గోచరిస్తుంది. యీయన యీనిఘంటువ్రాయడానికి మార్గంచూపినవారు చిన్నయ్యసూరిగారున్నూ బ్రౌన్ దొరగారున్నూ అని రత్నాకర పీఠికలోవున్న— 1. చిన్నయ్యసూరిగారు జీవితులై యుండినకాలంబున అకారాది తెనుగు నిఘంటువొకటి ప్రారంభించి నడపుచుండిరి. 2. బ్రౌణ్యా నిఘంటువులో నుండి యిట్టిశబ్దములు యిందుచేర్చబడినవి. అనే వాక్యద్వయంవల్ల స్పష్టపడుతుంది. ఆచార్యులవారు వ్రాసినచొప్పున పూర్వకాలంలో పద్యాల్లోనే నిఘంటువు లుండేవిగాని వచనాలల్లో వుండే ఆచారంలేదు. యీఆచారం సంస్కృతమునుంచి వచ్చిందే. సంస్కృతంలో వివిధనిఘంటువున్నట్లు పండితులంతా యెఱిగిందే, సుప్రసిద్దసాహిత్య పరులకు ఆ పది నిఘంట్లున్నూ కంఠోపాఠంగా వుండడమున్నూ వుండేది. మేము బ్రహ్మయ్యశాస్త్రిల్లుగారివద్ద పాణినీయం అభ్యసించే కాలంలో భీమవరంతాలూకా పుండి గ్రామంలో "శేషాద్రిశాస్త్రుల్లుగారు" అనే సుప్రసిద్ధసాహిత్యవేత్తలు వుండేవారు. వీరి యింటిపేరు సమయానికి జ్ఞాపకం వచ్చిందిగాదు. వీరు అప్పటికేవృద్ధులు. మా గురువుగారు వీరిని చాలా గౌరవించేవారు. యింత మహాపండితులయిన గురువుగారు సాహిత్యమాత్రప్పండితుణ్ణి యింతగా గౌరవిస్తారెందుకో అనుకునేవాళ్ళం మేము. అప్పుడు మా బుద్ధిలో శాస్త్రజ్ఞులే పండితులుగాని తదితరులుకారనే పకపిచ్చివూహా వుండేది. ఆ వూహకు కారణంలేక పోలేదు. శాస్త్రజ్ఞులు సాహిత్యపరులైనవారిని (యెవరో విజ్ఞులుతప్ప ) సర్వేసర్వత్ర "సాహిత్యగాళ్లు" అని, యీసడింపుగా వ్యవహరించడం వుండేది. ఆ యీ యీసడింపు సామాన్యసాహిత్యపరులకు మాత్రమేకాదు. ద్వివేది సోమనాథశాస్త్రులవారి వంటి జగదేక సాహిత్య

విద్వాంసులకు కూడా వుండేదని వినికిడి. శ్రీ బులుసుపాపయ్యశాస్త్రిల వారు మాత్రం సోమనాథశాస్త్రిలవారిని మిక్కిలిగా గౌరవించేవారనిన్నీ వినడం. సోమనాథశాస్త్రిల్లుగారంటే తర్కవేదాంతాది శాస్త్రమిశితమైన సాహిత్యంలో పరిపూర్ణులు. సహితానాం భావ స్సాహిత్యం" అన్న వ్యుత్పత్తికి లక్ష్యభూతమైన సాహిత్యం కలవారే. నిజమైన పండితులుగాని యేదో వొక్కొక్క శాస్త్రంలో మాత్రం పదో పన్నెండో యేళ్ళు కృషిచేసి దానిలో విజ్ఞత్వం సంపాదించి – "ఏకవిద్యా సురక్షితా" అనుకొనేవారున్నా పండితులే అనిపించుకున్నప్పటికీ అట్టి పండితులు కారనే చెప్పవలసి వస్తుంది. శాస్త్రజ్ఞులలో అట్టివారు పరవస్తు రంగాచార్లవారు, మొదలైన వారు. బులుసు పాపయ్యశాస్త్రిల్లుగారు మొదలైన మఱికొందఱు వేద శ్రౌతములలో సమగ్రపాండిత్యం వుండి వేదార్థాన్ని మహాపండితసభలలో నిరాఘాటంగా చెప్పేవా రుండేవారు. కొవ్వూరి గోపాలశాస్త్రుల్లుగారి వగయిరా షడ్దర్శనీవేత్తలకు వేదశ్రౌత ప్రవేశం లేదు. ఒక్క వ్యాకరణమే తప్ప. అందులోనున్నా ప్రక్రియాభాగమే తప్ప యితరంతోటి మాకు జోక్యమే లేదని దానిలో సమగ్రపాండిత్యంతో మునిత్రయాన్నికూడా లక్షించనంతటి పండితులు చిలుకూరి (మార్కొండపాటి) చతుష్టయం వుండేవారు, వీరివంశంలో యెన్నితరాలనుంచో యీపాణినీయం యెడబాయకుండా సంధ్యావందనంతోపాటు వస్తూవుందన్న విషయం జగత్ప్రసిద్ధం. యీకాలంలోకూడా వీరివంశంలో యీవ్యాకరణం నిలిచేవుంది.

విషయం విషయాంతరంలోకి ప్రవేశించింది. పూర్వం సుప్రసిద్ధ సాహిత్యపరులనేవారికి దశవిధ నిఘంటులు (అమర, విశ్వ, విశ్వప్రకాశిక, కేశవ, హలాయుధ, శబ్దార్ణవ లోనైనవి.) కంఠోపాఠంగా వుండేవి. ఆలావుండడానిక్కారణం అవి ఛందోబద్ధాలుగా వుండడమే. వేదంలో వాక్యగ్రంథం, ఛందోబద్ధంగా వుండకపోయినా, ఛందోబద్ధంగా వున్న దానితోపాటుగా దాన్నిన్నీ బట్టీపెట్టి వల్లిస్తూనే వున్నారు. అలాగే యిటీవల బయలుదేఱిన గద్యాత్మకాలైన నిఘంట్లుకూడా వల్లిస్తూన్నట్టు కనపడదు.

అది సాధ్యమయే పనికాదు. మా గురువులకు గురువులు శ్రీ రాజారామ శాస్త్రుల్లు (మహారాష్ట్రులు) గారు నిఘంట్లన్నింటిలోనూ అమరమే గణనీయ మని శ్లాఘించేవారఁట. అమరంమీఁద పుట్టిన వ్యాఖ్యానాలు చాలావున్నాయి. వ్యాఖ్యానాలలో అక్కడక్కడా "ఇతిక్షీరస్వామీ" అని వుదాహరింపఁబడే క్షీరస్వామి, అందులో వకవ్యాఖ్యాత. ఆయా వ్యాఖ్యానాలలో యేవొక్క వ్యాఖ్యానంతో టయినా అమరాన్ని చదువుకుంటే వేఱే పాణినీయం చదువు కోనక్కఱ వుండనే వుండదు. ఆ నిఘంటురచనకు అష్టాధ్యాయీ సూత్ర ములే మార్గదర్శకంగా వుంటాయి. ఒక్కతిఙంతభాగం మాత్రం వేఱే చదువుకోవలసి వస్తుంది. సరే!

ప్రస్తుతం మనకు కావలసింది, సంస్కృతంలోనే కాదు, తెలుఁగు లోనేకాదు. గ్రద్యాత్మక నిఘంట్లు మునుపు లేవనిన్నీ చిన్నయ్యసూరిగారు తత్ప్రయత్నంచేసి, చాలావరకు రచించినా, అవి ముద్రితం కాలేవనిన్నీ, పండితసహాయంతో బ్రౌనుదొరగారు రచించిన నిఘంటువు మాత్రం మన శబ్దరత్నాకరానికి పూర్వం వుండేదనిన్నీ, అముద్రితమైన చిన్నయ్యసూరి గారి అకారాది నిఘంటువున్నూ, ముద్రితమైన బ్రౌన్యమున్నూ, మన సీతారామాచార్యులవారికి కొంత చేయూత యిచ్చివున్నాయనిన్నీ మనం తెలుసుకోవాలి. యింతేకాదు — "వైయాకరణ శ్రీనివాసాచార్యుల వారు తాము ప్రాణపదముగా సంగ్రహించి యుంచుకొని యుండిన యపూర్వగ్రంథ ప్రయోగసార సంగ్రహములైన కొన్ని సంచికలను లోకోపకారార్థము నాచేతి కొసంగిరి" అనే వాక్యంవల్ల వేయొకమహా విద్వాంసుఁడు "నారాయణభట్టు వాఙ్మయధురంధరుఁడు" అన్నట్టు ఆచా ర్యులవారికి తోడ్పడ్డట్టయింది. అందుకే శ్రీ ఆచార్లవారు కృతజ్ఞతను వెల్లడించియున్నారని వేఱే వ్రాయనక్కఱలేదు. ఆయా సహాయా లెన్ని వున్నా యీ నిఘంటునిర్మాణం సుఖసుఖాల తేలిందా! యేలా తేలుతుంది? యిది కవితారచనవంటిది కాదు. కవికి కవితారచనలో చాలవఱకు స్వాతంత్ర్యం వుంటుంది. భారతాద్యాంధ్రీకరణం కొంత పరాధీన స్థితిలోనే

వుంటుంది గాని అదేనా నిఘంటు రచనవంటిది కాదు. యీరచన పక్షిత్వ క్షరమున్నా పరాధీనంలో వుండి వ్రాయడానికే దగ్గదే. వ్యాకరణాది శాస్త్రాల మీఁద వ్యాఖ్యానాలు వ్రాయడం కూడా నిఘంటుకర్త పరిశ్రమలో యెన్నోవంతున్నా కావు. సర్వసంసిద్ధం చేసిపెట్టిన తర్వాత ఆనిఘంటు చూచుకోవడం చాలా తేలికగా కనపడుతుంది గాని దానినిర్మాణం యెంత కఠినమో? అనుభవైకవేద్యం. అట్టి నిఘంటువును యిరవైయయిదు సంవత్సరాలకాలం కృషిచేసి లోకానికి అందిచ్చిన ఆచార్లగారు వంద్యులు- మా చిన్నతనంనాఁటికే యిది ముద్రితమైవున్నా పల్లెటూరివాళ్ళకు అంతగా అందుబాటులో వుండకపోవడంచేత యీ నిఘంటంటూ వకటి వుందని తెలియకపోవడంచేత యేవేనా సంశయాలు కలిగితే భారతాదులు తిరగేసి కష్టించి ఆయా సంశయాలు తీర్చుకోవలసి వచ్చేది. యిటీవల యెప్పుడో తప్ప అట్టి పరిశ్రమ తగలడంలేదు. యిటీవల కొన్ని నిఘంట్లు బయలు దేఱినాయి కాని, ఆనిఘంట్లు దీన్ని కాపీచేసి - "అమృతాంజనానికి" అమృతప్రభాంజనం అన్నట్టుగా పేర్లుపెట్టినట్టుగానే కనపడతాయి. యిప్పుడు తయారవుతూవున్న - శ్రీసూర్యారాయ నిఘంటువుక్కూడా విశేషసాహాయ్యం దీనివల్ల కలిగేవుంటుంది. కాని ఆనిఘంటు ఈ శబ్దరత్నాకరమనే అష్టాధ్యాయీ సూత్రాలకు "భాష్యభూతా భవంతు మే" అన్న మాఘమహాకవి వాక్యానికి లక్ష్యంగా వుంటుందని అనుకుంటాను — శ్రీ - సూ - రా - నిఘంటు నేనింకా చూడలేదు. శబ్దరత్నాకర నిఘంటు పీఠికలో ఆచార్ల వారు నన్నయాద్యాంధ్ర కవీశ్వరుల కవనపాక నిర్ణయాలు వగైరా చేసి యిటీవల విపులంగా శ్రీ వీరేశలింగం పంతులవారు వ్రాసిన కవిజీవితాలకు కూడా మార్గదర్శకులైనారంటే వొప్పనివారుండరు. శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసిన కవిజీవితాలు కం. వీ. పంతులవారి కవిజీవితాలకన్న కొంత ప్రాచీనమే కాని పంతులవారి రచనాధోరణి ఆచార్లవారినే అనుసరించి వుంటుంది. "కవిత్రియంవారి రచనకన్ననూ నాచనసోముని రచన ప్రౌఢంగా వుంటుంది." ఈ మొదలైనభావాలు చాలాభాగం ఆచార్ల

వారివేగాని పంతులవారి స్వంతాలుకావు — "ఆంధ్రశబ్దచింతామణి" నన్నయ కృతమే అని ఆచార్లగారు నమ్మివున్నారు. పంతులవారు నన్నయ కృతం కాదనుకున్నారు. ఆముక్తమాల్యద అప్పకవి అల్లసాని పెద్దనగారి కవిత్వమని వ్రాసింది సరియైన వూహకాదన్నది ఆచార్లవారే గ్రహించి పీఠికలో సూచించారు. స్త్రీవర్ణనాసందర్భాన్ని పూర్వమహాకవులందఱున్నూ అనాలోచితంగా తల్లిదగ్గఱనుంచిన్నీ, పాదాదికేశపర్యంతమున్నూ వర్ణిస్తూ రావడం అభినందనీయం కాదన్నవిషయంకూడా ఆచార్లవారిదేగాని పంతుల వారి స్వంతం కాదు. ఆచార్లవారు పీఠికలో వ్రాసిన విషయాలు, పరిశీలిస్తే యీయన సంస్కృతాంధ్రాలలో యెంత విద్వాంసులో అంతుతెలుసుకోవడం చాలా దుర్ఘటం. వీరి నివాసగ్రామం యేదో ఆపీఠికవల్ల తెలియదు. యింటిపేరుకూడా యితరత్రవిని వ్రాసితినేకాని బ. అనే పొడి అక్షరం తప్ప నేను చూచిన పుస్తకంలో సమగ్రంగా కనపడదు. బహుశః నెల్లూరుజిల్లాగాని చిత్తూరుజిల్లాగాని ఆచార్లవారి నివాసస్థానమై వుంటుందనిన్నీ ఉపాధ్యాయత్వరీత్యా చెన్నపురిలో చాలాకాలం గడిపివుంటారనిన్నీ వూహింపవలసి వుంటుంది - పీఠికలో వకపదం - "బుద్ధిశాలురు" అనేది వ్యాకరణవిరుద్ధంగా వున్నది కనపడుతుంది - అది చాలామందిని పొరపెడుతూవున్నరూపమే. ఆచార్లవారు "బుద్ధిశాలులు" అనే వ్రాసివుంటారు. దాన్ని 1912 వ. సం॥లో జరిగిన ముద్రణంలో సంస్కర్తలు తప్పనుకొని "శాలురు" అని దిద్దివుంటారన్న వూహ సత్యదూరంకాదు. యింకోచోట "శుచిర్భూతమై" అని పీఠికోపరమణ వాక్యంలో వకపదం వుంది. యిదికూడా "శుచిభూత" అని ఆచార్లవారు వ్రాసివుంటే యిటీవలి సంస్కర్తలు సంస్కారంలో మార్చివుంటారనుకోవడానికి నామనస్సు వొప్పుకోవడంలేదు. సంస్కృతపండితులు తఱుచుగా సంస్కృతసంధి వగైరా మర్యాదలతోడనే గాక విభక్తి సందర్భాలలోకూడా కొన్నిపదాలు తెలుఁగులో వుంచి మాటాడుతూ వుండడం సర్వానుభవసిద్ధం. అవ్యవహారానికి సంబంధించిందే - "శిరాసావహించు" అనేది. ఇది మహాకవి

ప్రియుక్తమై తెలుఁగులో వాకవిధమైన అలుక్కాగా పరిణమించింది. ప్రథమస్పర్గ వగైరాలున్నూ, తద్వారా వగయిరాలున్నూ యింకా గ్రాంధి కాలుగా చేరలేదు. అనేకమార్లు అల్పదండు వగయిరాలుకూడా సంస్కృత పండితులవే. శతధా. సహస్రధా, అన్యత్ర, సర్వత్ర, వగయిరాలు యిప్పటి వారు అపండితవ్యవహారాన్ని ఆధారంగాచేసుకొనియ్యేవే ప్రియోగించు కొంటూవున్నారు. నన్నయ్యగారల్లా వొక్క "వృథా" అనే అవ్యయానికే హ్రస్వంచేసిన్నీ చేయకయున్నూ ద్వివిధంగా అభ్యనుజ్ఞ యిచ్చివున్నారు.

దాన్నిబట్టి మఱికొన్నిటిని యిప్పటివారు పరిగ్రిహించారు. భాగవతంలో—"ఉపరి" అనే అవ్యయాన్ని ప్రియోగించారు. కాని దాన్ని యీ నిఘంటులో వుదాహరించలేదు. అట్టివింకా చాలావున్నాయి. అంతమాత్రించేత అవి గ్రాంధిక భాషలో లేవనుకొని యితరులను ఆక్షే పించి తద్వారాగా అపజయం పొందవలసించని ఆచార్లవారి తాత్పర్యం కాదు. తాముపరిశీలించినట్లే యితరులు పరిశీలించి లక్ష్యసామగ్రి సంపా దించుకోవలసిందనియ్యేవే ఆచార్లవారి తాత్పర్యం. అన్నీకావుగాని కొన్ని యీ నిఘంటులో చూపినవాట్లకు సరూపాలుకూడా పరిగ్రహణయోగ్యాలే అని కూడా పరిశీలకులకు గోచరిస్తుంది. "మురిపము, మురిపెము" యీరెం డున్నూ ఆచార్లవారు వుదాహరించారు. "తిరిపము" ప్రియోగంకూడా యిచ్చారు."తిరిపెము"అన్నది దాని సజాతీయరూపమే అయినా "తిరిపెము" అనేయెకారఘటిత రూపం ప్రయోగంలో (దిద్దరాని చోటన్నమాట) దొరక్క పోవడంచేత కాఁబోలును. ఆచార్లవారు మొదటిదాన్నిమాత్రమే యిచ్చి వూరు కున్నారు. అంతమాత్రించేత యెత్వ ఘటిత రూపం లేదనుకోకూడదు— ప్రియోగం దొరక్క పోతేనో ? దొరక్క పోయినా సరే, ప్రియోగించు కోవచ్చు. అన్నింటికీ యీమాటవర్తించదు— కదుర్ప— నేతు (నేర్చు ధాతురూపం) వగయిరాలనిబట్టి యితరాలు సజాతీయాలు సృష్టించకూడదు. యెందుచేత అంటే; జవాబులేకపోలేదుగాని చాలావ్రాయాలి. అందుచేత విరమిస్తూన్నాను. — అన్యత్రివ్రాసేవున్నాను కూడాను.

ప్రస్తుతం "శుచిర్భూత" శబ్దం ఆచార్లవారిదే గాని యిటీవలి సంస్కర్తల సవరింపు బాపతుకాదని నా నిశ్చితాభిప్రాయం. "వఱకు" అనే రూపం సమీరకుమారవిజయంలో పుష్పగిరి తిమ్మన్నగారు "దాకన్" అనే అర్థమందు వాడినదివుంది. యీ నిఘంటులో ఆప్రయోగం వుదాహరించనేలేదు. తారాశశాంక విజయంలో వున్న "క" — యీవఱదను కనువిడుమిం, కీవరదర్పమ్ము" అనే పద్యం వుదాహరించి "దాక దనుక శబ్దములతోఁ జేరియుఁ బ్రయోగింపఁ బడియున్నది." అని వ్రాయఁబడి వుంది. "చేరియు" అనేమాటవల్ల చేరకయు బ్రియోగించుకోవచ్చుననే స్వారస్యమైతే తేలుతూవుందిగాని అప్పుడు కేవలమూ "వఱ" అనికాక కువర్ణకం చేర్చియ్యేవే ప్రయోగించుకోవలసి వుంటుందన్న సందర్భం లోకంవల్ల తెలుసుకోవాలి. లోకంలో యీ "వఱ" అనే అవధ్యర్థ కానికి "కు" అనేదిన్నీ "లో" (ఊవఱలో అనేది చూ) అనేదిన్నీ రెండు మాత్రమే ప్రత్యయాలు చేరుతూవున్నాయి. దీన్నిబట్టి యిది అవ్యయమను కోవడానికి వీలుకనపడదు. అందుకే దీన్ని దే-వి, అని వ్రాశారుగాని ఆచార్లగారు అవ్యయమని వ్రాయలేదు. యెన్నోశబ్దాలున్నూ, క్రియాపదాలున్నూ కొన్ని విభక్తులు మాత్రమే వున్నవి కనపడతాయి అటు — అట్లు—అట్లన్— (ఊతుది రూపం భారతేతర కవులు మాత్రమేవాడినది) ప్రథమైకవచన బహువచనాలున్నూ తృతీయార్థక ద్వితీయా విభక్తిరూపము మాత్రమే కనపడుతుంది. దీనికి యిదేమాదిరిగా "యిటు — ఎటు" అనేవిన్నీ చూచుకోండి, అటుల్—ఇటుల్ - ఎటుల్ అని ద్వితీయైకవచనం వంటి రూపాలు (క॥—"అటుజూపిటు నిటు జూపటు వగైరాలున్నూ) కనపడతాయిగాని ఆస్థలాలలో సముచ్చయార్థక నుపర్ణకంగా సమన్వయించుకోవచ్చును. ఆచార్లవారు పైమూఁడున్నూ అవ్యయాలనే వ్రాశారు. అవ్యయమైతే వచనంకూడా భేదించ కూడదే. ( వచనేషుచసర్వేషుయన్న వ్యేతి) యీశంక కవకాశం లేకుండా బహువచన ప్రాయమైన రూపాన్ని వేఱుగా యెత్తుకొని దాన్ని పృథగవ్యయం అన్నట్టు వ్రాశారు. యీ పద్ధ

తిని భారతేతర కవులు వాడిన అట్లన్ - ఇట్లన్ - ఎట్లన్ అనేవి కుదురవు. ఆకారణంచేత అవ్యయమనుకోకపోవడమే వీలనుకుంటాను. లోకంవాక్క బ్రాహ్మణజాతితోనే వుందను కోవడం యెట్టిదో, ఆంధ్రభాషవాక్క భార తంతోచే వుందనుకోవడమున్నూ అట్టిదే. జాతులలో బ్రాహ్మణుడికి అగ్రి స్థానం యిచ్చినట్టే కావ్యాలలో భారతానికి అగ్రిస్థానం యివ్వండిగాని తది తరకవులకు అవకాశంలేకుండా నిఘంట్లుగాని, వ్యాకరణాలుగాని నిర్మించ డం నిరుపయోగంకదా ? అన్నివిభక్తులున్నూ వుండక కొన్ని విభక్తులు మాత్రిమేవుండి శబ్దాలుకొన్ని వున్నాయని లోఁగడ వ్రాసివున్నాను. దానికి యివిన్నీ వుదాహరణాలు కావచ్చును. మఱికొన్ని కావలిస్తే " అందు, ఇందు, ఎందు చూచుకోండి. లోఁగడ చూపిన శబ్దాలకంటే వీట్లకు చాలా విభక్తులు కనపడతాయి. ద్వితీయావిభక్తి వుండీవుండనట్టుగా కనపడు తుంది (" అందునను గూర్చి " అన్నది చూ) " కూర్చి " లేకుండా మాత్రిం ద్వితీయలో ప్రియోగం వుండదు, ఆలాగే సప్తమీ విభక్తిలో " అందు " అనేదానితో ప్రియోగం వుండదు. " అట - ఇట - ఎట అనే వాట్లకు కూడా కొన్ని విభక్తులలోనే ప్రియోగం కనపడుతుంది. వ్రాస్తే చాలావ్రియాలి. దిక్ప్రదర్శనంచేసి విరమిస్తూన్నాను. శ-ర-ని, లో "అందు" అనే అధికరణార్థకావ్యయాన్ని దుత్రితప్రికృతికంగా వ్రాసినారు. అదియుక్తమే. శతశస్సహస్రశశ్చమహాకవి ప్రియోగాలు యిట్లే వున్నాయి. కాని భారతంలో వెనకటి అచ్చులుచూచినా వ్రాఁతప్రతులుచూచినా "అందు వోయె , యెందువోయె " అంటూ యాత్రికానికి కళాత్వద్యోతక ప్రియో గం అసకృదావృత్తికంగా కనపడుతుంది. అదేమైనా చెవికి కఠోరంగా వుం దేమో అంటే, ఆలా లేదు. శ్రివణపేయంగానేవుంది. దీనికేకాదు, " అట, ఇట, ఎట లకుకూడా యీలాగే కనపడతాయి, ప్రియోగాలు అయితే ఆయాప్రయోగాలు దిద్దశక్యం గానిచోట్ల లేకపోఁబట్టి సర్వేసర్వత్రి ద్రుత ప్రకృతికాలుగా దిద్దివేశారు. వీట్లతోపాటే " ఏని " అనేఅవ్యయం అసకృ దావృత్తికంగా కళగా ప్రితివారి కవిత్వంలోనూ ప్రాచీన నవీన విచక్షణతో

పనిలేకుండా అచ్చులోనూ వ్రాఁతలోనూ అప్పుడేకాదు యిప్పుడుకూడా కన పడుతుంది. ఆచార్యులవారు 'ద్రుతాంతముగా గ్రహింపకూడదు' అని కూడావ్రాసియున్నారు. అది పైసందర్భానికి చాలా అనుకూలమేగాని ద్రుతాంతంగాకూడా ఆయా మహాకవుల ప్రయోగాలున్నూ కనపడతాయి, అవి అనగా కళాత్వద్యోతకాలు. దిద్దితే దిద్దవచ్చునేమోకాని —

[1] క. ననుఁ దగియెడు నతిథింగా, మనంబునఁ
దలంచి నీవు మన్నించెదవే, నిని

[2] క. తనకైకాదే మదినెల్లను గోరుటవిను
ము తాఁబ్రశయ మొందినయే. నిని వారని

[3] చ. జనకుఁడు——.........తేఱనే, నిని బటుశోక వేగమున''

ఆయాకర్ణ, శల్య, సౌప్తిక. పర్వాలలో ప్రాసస్థానంలో వున్న దేలాగదిద్ద డం. తిక్కన్నగారికి యీ ''యేనిని'' ప్రయోగం ''ఎసక మెసక'' ప్రయో గంలాగే చాలా యిష్టం. అందుచేత యెన్నిచోట్లో ప్రయోగించారు. ద్రుతాంతంకాని పద్ధతిని యీ ప్రయోగాలు కుదిరేటట్టు తోఁచదు. యిదివరకు వ్యాకరణంలో వాకటిశబ్దానికి ద్రుతప్రకృతికత్వ కళాత్వములు వుభయమూ వున్నట్టు వ్రాసియుండలేదు. లోఁగడ జూపిన " అందు " వగైరాలు యెలాగో దిద్దితే ద్రుతాంతాలుగా తేలిపోయాయి. దీన్నిగూర్చి యేం చేయాలో తోఁచడంలేదు. నన్నయ్యగారి ప్రయోగాలు బాధించేవి వున్నట్టు లేదు. నన్నయ్యగారివి లేనంత మాత్రంచేత తక్కిన భారత కవిద్వయం అల్లాటప్పాగా పోవలసిందేనా ? ప్రాజ్ఞులు విచారింతురుగాక (తెనుఁగున కున్న వ్యాకరణ దీపము చిన్నది) సరే! అన్నివిభక్తులు లేక కొన్నివిభక్తు లుమాత్రమే వున్న శబ్దాలు సుబంతాలుకొన్ని చూపడం జరిగింది. తిజం తాలుకూడా దిఙ్మాత్రం చూపుతాను — (1) " వాఁడునాకు అంకడు (2) అంకినమట్టుకు పట్టుకుపోయిరి. (3) ఎవరికంకినది వారుతీసుకున్నారు " అంటూ యీ ''అంకు'' ధాతువువ్యతిరేకార్థక, భూతార్థకాదులు కొన్నిఁటిలో మాత్రం కనపడుతుంది. కవులు వాడలేదు గనక గ్రామ్యమందామా ?

గ్రామ్యానికి లక్షణం కవులు వాడకపోవడమని కాదుగదా! లక్షణ విరుద్ధత్వం గ్రామ్యత్వం. అట్టివైరుధ్యం దీనియందేమి వుంది? సర్వలకారములయందున్నూ ప్రయోగం, లోకంలో, లేకపోవడమే అందామా? ఆపక్షంలో యెన్నోధాతువులు భాషనుండి తొలఁగింపఁబడతాయి. "ఒల్లమి" అనేదాన్ని వలచు ధాతువుయొక్క వ్యతిరేకభావార్థకముగా ఆచార్యులుగారు వ్రాశారు. అంతమాత్రమేకాక "ఒల్లడు, ఒల్లవు, ఒల్లను" అనే వ్యతిరేకార్థక రూపాలున్నూ నిర్దుష్టాలు శ్రుతమవుతూ వున్నాయికాని— ఒల్లుచున్నాఁడు వగయిరా వర్తమానార్థకరూపాలుశ్రుతమవుతూ వున్నట్టు లేదు. (అంటే శిష్టులవాడుకలోలేవన్నమాట) మొత్తం దీన్ని యేయితర ధాతువుకో అంట గట్టడం కంటే స్వతంత్రధాతువుగానే అంగీకరించడం యుక్తమనిన్నీ, కొన్ని లకారాలలో మాత్రమే ప్రయోగించతగిన దన్నట్టు లోకవ్యవహారంవల్ల గోచరిస్తుందనిన్నీ తెలుసుకోవలసి వుంటుంది.

అంకుధాతు ప్రసక్తిలో యీ "ఒల్లమి" అనేది తగిలింది. దీన్ని గూర్చి "ఒల్లబాటు" వగయిరా శబ్దపల్లవాలు వుదాహరించారు ఆచార్లుగారు. అంకు ధాతువునుగూర్చి యీ అర్థంకాని మరోఅర్థంగాని వున్నట్టువ్రాయనే లేదు. గ్రామదేవత అనే అర్థం వ్రాసి విశేష్యంగా వుదాహరించారు. "అంకపొంకములు, అంకాపొంకములు" అంటూ వుదాహరించి "అవి దేశ్యాలు" అని వ్రాసినారు. దేశ్యం "అంకము" అనే రూపం వుండవలసి వస్తే "సర్వం ధాతుజమాహ" అన్నారు కనక ఆరూపాన్ని పుట్టించే ధాతువేదో వుండాలి. ఆధాతువుకు ఆశబ్దాలకువున్న అర్థం లేకపోయినా అసలు ధాతువంటూ వుంటే "స్థితస్యగతిశ్చింతనీయా" అని వుండనేవుంది కనక "ధాతూనామనేకార్థత్వాత్" అనే అభియుక్తోక్తిని తోడుచేసుకుంటే ఆయాఅర్థాలున్నూ కుదురుతాయి. యీ విధానమంతా సంస్కృతంలో వ్యాకరణంలో పెద్దలు చూపిందేకాని కొత్తపోకడకాదు. అహోబలపండితాదులు చాలాచోట్ల ఆయీవిధానాన్ని తెలుఁగులో "అనుక్తమన్యతోగ్రాహ్యమ్" అనిచెప్పి అనుసరిస్తూనే వచ్చారు. కనక కేవల స్వకపోల కల్పితం కానే

కాదు. కనక అంకుధాతువంటూ వకటి వుందని నేనులోకాన్ని పట్టి వూహి స్తూన్నాను. యుక్తియుక్తంగా వుంటే గ్రహించండి. లేదా ? నిరాకరిం చండి. నేను యీలావూహించుకొనియ్యేవే జయంతిలో "వెంకన్నంకఁడం చేరికిన్" అని వ్యతిరేకార్థక ప్రథమ పురుషైకవచనంలో ప్రయోగించి వున్నాను. అంకడు, లొంగడు ("స్వాధీనంకాడు" అనియీావవర్థము) వ్యవహారంలో వుండిన శుద్ధప్రయోగం వొకవేళ గ్రంథాలలోవుండనేవుండ దనుకుందాం. అంతమాత్రంచేతఅదిగ్రామ్యమనుకోవడం మహాప్రమాదం. యే శబ్దానికేనా అపభ్రంశరూపంగా వ్యవహారంలో వుంటే అది గ్రామ్య మవుతుంది. దీన్ని "కరెన్సీ" తో పోల్చి జయంతిలో కొంత చర్చించి వుండడంచేత యిక్కడ స్పృశించి విడుస్తూవున్నాను.

ఆచార్లవారి నిఘంటు పరమోపకారంచేసిందని పలుచోట్ల వ్రాసే వున్నాను. కాని ఆవుపకారం కొందఱికి మాత్రమే. కొందఱికో ? కొంత అపకారమేచేసింది. యేమంటారా ? యీ నిఘంటులో లేని పదం కర్మం చాలక (వ్యవహారికంగావుండి) యేరవేనా ప్రయోగిస్తే అదిలేదంటూ వివ దించి గీట్లుపెట్టడం కొందఱికి అలవాటు. "కళంకము" అన్నపదం యీ నిఘంటులో వుంది. "కళంకు" అనేదో ? లేదు. ఆముక్తమాల్యద వగయిరా పుస్తకాలలోమాత్రం ప్రయోగింపబడేవుంది. పైఁగా వ్యవహా రంలోనూవుంది. వుంటేమాత్రం యేమి ? ఆ పుస్తకాల్లో వుంటే నిఘం టులో వ్రాయనే వ్రాస్తురనుకొని "కళంకు" అనేది లేదనుకొని, ఆక్షేపిం చడమున్నూ, సుమారు నలభైయేళ్ళనాఁడు జరిగినట్టు మా సారస్వత విమ ర్శనాలు చదివితే తెలుస్తుంది. పంచాంగాలలో 27 నక్షత్రాలు మాత్రమే వుంటాయి. ఆకాశంమీఁద 27 కోట్లైనావుంటాయిగదా. నక్షత్రాలు పంచాం గాలలో లేవన్నంత మాత్రంచేత ప్రత్యక్షప్రమాణోప లబ్ధాలు ఆ నక్షత్రాలు లేవనుకోవలసిందేనా—యింకొకటి. యీ నిఘంటు పరిశీలనగా చూడడం చేతకాక కొందరు వృథాగా భ్రమప్రమాదాలకు గుఱి అవుతూ వున్నారు. "కామిరె" అనేపదానికి దీనిలో "యౌవనముగలస్త్రీ" అని అర్థం వ్రాసి

"కొమిరెలు లేరెసీకు బదికోటులు" అని ఉత్తరరామాయణ ప్రయోగాన్ని యిచ్చి వూరుకొన్నాఁడు కవి. వొకఅర్థమున్నట్టువ్రాయనేలేదు కాని; వైకృతపదం అనే గురుతు— పై అన్నది లేకపోలేదు. దాన్నిబట్టి యేమాత్రం పరిశీలించే వూహాపోహలువున్నా యిది దేని వికృతి అని ప్రశ్నించుకుంటే కుమారీ శబ్దానికని తేలుతుందా, తేలదా ? కుమారీ శబ్దం కుమార శబ్దాన్ని బట్టి యేర్పడ్డదేనా, కాదా ? ఆశబ్దానికి కొడుకు అనే అర్థం వున్నట్టు యీ నిఘంటులోనే వుందాయె. యింతదాఁకా యెందుకు, లోకంలోలేదా ? ) పైఁగా కుమారీ శబ్దానికి కూఁతురు అనే అర్థం మొదటవ్రాసి తరవాతనే కదా ? మఱికొన్ని అర్థాలు వ్రాశారు ఆచార్లవారు. పైఁగా 'కొమిరె' అన్నచోట యేదో పువ్వుమాదిరి గుర్తుకూడా వుంచినారు. ఆగుర్తుకు అర్థం దీని ప్రకృతి రూపం కుమారి శబ్దం దగ్గిఱ వ్రాసిన అర్థాలుకూడా చూచుకోవలసిందని సూచించడమే కాక అన్యం అవుతుందా ? అన్యమే అయేయెడల పరిశీలనా నైపుణ్యంలేక ఆక్షేపించి తరవాత లేనిపోని మనఃపరితాపాన్ని పొందవలసిందనేదే అవుననుకోవాలి కాఁబోలును! ఆ గుర్తును గూర్చి పీఠికలో ఆచార్లవారు" ఇది ప్రకృతి శబ్దార్థకముకంటె భిన్నమగు నర్థమును దెల్పునది " అని వ్యాఖ్యానం చేసినారు. ప్రకృతికివున్న అర్థాలు కాక వికృతిలో కొన్ని అర్థాలు కొ్రత్తగారావడం కలదు. యీ సందర్భం విజ్ఞానశబ్దభవమైన విన్నాణ శబ్దానికి సొగసు అనే అర్థం (శా. శ్రీవిన్నాణపు గబ్బిగుబ్బల వగైరా చూ.) అబాపతే దరిశెన శబ్దానికి కానుక అనే అర్థం కూడా పైమాదిరిదే. ఆలాటి అర్థాన్ని తెలపడానికి ఆగుర్తు ఆచార్లవా రేర్పఱచుకున్నారు. అయితే ఆలాటి అధికార్థంవల్ల అసలు ప్రకృతి శబ్దానికి వున్న అర్థం "కొత్తనీరువచ్చి పాతనీరును కొట్టుకుపోయిం" దన్నట్టు తుడిచి పెట్టుకు పోవలసిందేనా ? మళ్లా ఆచార్లవారు " దరిసించు " అనే తద్భవ క్రియకు "చూచు" అనే ప్రకృత్యర్థాన్ని వ్రాసే వున్నారే —

భవతు క్షణకాలం కొత్తఅర్థం పాత అర్థాన్ని కొట్టివేస్తుందనే వొప్పుకుందాం. ఆ పద్ధతిని కొమిరె శబ్దానికి కూఁతురు అనే అర్థం లేనట్టే "కొమరుఁడు" అనే వికృతి శబ్దానికి కొడుకు అనే అర్థమున్నూ లేకే పోవాలి కదా? అప్పుడు "మరుడా, జలజేక్షణు కొమరుఁడా?" యిత్యాది స్థలాల్లో "విష్ణుమూర్తి కొడుకా?" అనికాక "విష్ణుపుత్రాలూకు యౌవనవంతుఁడా" అని అర్థం చెప్పుకొని ఆనందించమంటారు రాఁబోలుకు. యింత అజ్ఞతతో విమర్శనమేకాదు. యేదిన్నీ చేస్తే మాటదక్కఁదు. లింగముగుంట తిమ్మకన్నగారు కవిత్వాన్నిగూర్చి ప్రశంసిస్తూ "విద్యల లోపల నుత్తమవిద్య కవిత్వమ్ము" అని చెప్పి తుట్టతుదకు "అది తెలియుట లోకమెల్ల నరయుటకాదే!" అని సిద్ధాంతీకరించాఁడు. ఆయన కాలంలో కవులయందు అలాటి సర్వజ్ఞత్వం ఆయనకు గోచరించ బట్టే అలా వ్రాశాఁడని నేనున్నూ పూర్తిగా విశ్వసిస్తానుగాని యిప్పటి నాఅనుభవం దానికి కేవలమూ విరుద్ధంగా గోచరించడంవల్ల "అది తెలియుట యతులు గణములల్లుటయె చుఁడీ" అని దాన్నిమార్చి వుదాహరిస్తున్నాను.

వూహాపోహలు కలిగి చూచుకొనేవారికి ఆచార్లగారి నిఘంటువు తెలుఁగుమాత్రానికే కాదు. కొంతవఱకు సంస్కృతానిక్కూడా వుపకరిస్తుంది, నిస్సందేహం. యెన్నో సంస్కృత నిఘంటువులుకూడా పరిశీలించియ్యేవే ఆచార్లవారు దీని నిర్మాణాన్ని సాగించి వున్నారన్నందుకు యెన్నోపదాలు సాక్ష్యమిస్తాయి. అయితే శ్రీనాథ, పిల్లలమఱ్ఱిమహాకవి వగయిరా మహాకవులున్నూ, మఱికొందరు సంస్కృతమహాకవులున్నూ వాడినట్టిన్నీ, శాస్త్రతస్సిద్ధ మనడానికి ఆటంకం లేనట్టిన్నీ, "నిర్ఝరి" అనే శబ్దాన్ని వుదాహరించకపోవడమేమీ అనే శంక స్థూలదృష్టులకు కలగడంలో ఆశ్చర్యం వుండదు. యిన్నిచోట్ల ప్రయోగింపబడి వుండడమే కాదు, "ప్రవాహో నిర్ఝరో ఝరః" అన్న అమరవ్యాఖ్యలో (తెలుఁగు మాటలతో వ్రాసిన దానిలోనే) ఝరీ అని పాఠాంతరంకూడా చూపబడింది. యిట్టిది ఆచార్లగారు వుదాహరించనే లేదు. అయితే ఝరీ శబ్దాన్నిమాత్రం

వుదాహరించారు. ఝురశబ్దాన్ని వుదాహరించి, ఇది యీకారాంత స్త్రీలింగం కూడా వుంటుందని వ్యాఖ్యానించారు. ఆసందర్భాలవల్ల నిర్ఝరీశబ్దంకూడా వుందని అవగతం అవుతుందా, కాదా అన్నది విచారిద్దాం. "ఝరి" అనే దాన్ని వుదాహరించడంవల్ల "నిర్" అనే వుపసర్గమాత్రమే భేదంకనక యేమాత్రం వ్యాకరణ సంప్రదాయం తెలిసివున్నా ప్రయోగాలు శరపరంపరగా కూడా కనడుతూ వున్నాయి కనక "నిర్ఝరి" శబ్దంకూడా వుంటుందని తెలుసుకొనేవారికి ఆచార్లగారి రచన లేశమున్నూ ఆక్షేపణీయంకాదు. ఆమాత్రముకూడా వ్యాకరణ సంప్రదాయం తెలియనివారికి ఆచార్లగారి నిఘంటువే కాదు — సర్వమూ ఆక్షేపణీయమే.

దైవపురుషకారాలు రెండున్నూ ప్రతికార్యసిద్ధికీ ఆధారంగావుంటూ వుంటాయి. దైవసహాయంలేని పురుషయత్నంగాని, పురుషప్రయత్నం లేని దైవసాహాయంగాని యేకార్యాన్నీ సాధించలేవని సర్వసమ్మతమైన సిద్ధాంతం. ప్రస్తుతం యేదేనా సందేహం కలిగితే దాన్ని తీర్చుకోవడానికి నిఘంటువనేది దైవసహాయం వంటిది. దాన్ని చూచుకొనే విచక్షణత్వం పురుష ప్రయత్నం వంటిది. దీన్ని బట్టి చూచుకొంటే సకలమూ తేలిపోతుంది. దైవం నోట్లో అన్నంముద్ద పెడతాఁడే అనండి, అది నమలడంమట్టుకేనా మనకు చేతకావాలా? నమలాలి, మింగాలి, మళ్ళా నోరు చాపాలి. మనకృత్యం మనం నెఱవేర్చుకోక నిఘంటువులో లోపంవుందనుకుంటే యేలాగ? దైవం "తావాత (నోటిలో) నన్నుమిడుగా, నీవేమ్రింగంగజేయునే?" అన్నాఁడు దేవీభాగవతంలో — ప్రస్తుతం ఆచార్లవారు నిర్ఝరీశబ్దం వ్రాయకపోవడంచేత ఆశబ్దం భాషాప్రపంచకంలో లేదనుకోవడం మనపొరబాటేకాని నిఘంటుకర్త లోపంకాదన్నది పైవ్రాఁతకంతటికీ సారాంశం. యింకొకటి "ఝరి" శబ్దం వుదాహరించి "సెలయేఱు" అనిమాత్రం అర్థంవ్రాసి ప్రయోగం యివ్వకుండానే ఆచార్లవారు వుపరమించారు. దీన్నిబట్టి యీ శబ్దానికి ప్రయోగం దొరకలేదు కాఁబోలును అని, అనుమానప్రమాణాన్ని మనం వుపయోగించుకొని

పూర్వపక్షసిద్ధాంతాలకు వుపక్రమించకూడదు. ప్రయోగాలు మనం వెతుక్కోవాలి — "అటజనికాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ" అనే మనుచరిత్ర ప్రయోగాన్నైనా చూచుకొనే వోపిక మనకు వుండాలా ? అక్కరలేదా ? పోనీ మనుచరిత్ర అక్కరలేదు. యీ ఝరీశబ్దానికి అబ్బో ! యెన్నో తెలుఁగు పుస్తకాలున్నూ, సంస్కృతపుస్తకాలున్నూ దొరుకుతాయి. ఆ యీ శబ్దాన్నిగుఱించి శంకించడం బాగా పరిశీలిస్తే రామశబ్దాన్నిగూర్చి శంకించడంవంటిదిగా తోస్తుంది. యెటిఁగో యెఱక్కో పకమాట శంకిస్తే "భ్రాంతేః పురుషధర్మత్వాత్" అని సరిపెట్టుకోవచ్చు. అసకృదావృత్తిగా "పిష్టపేషణం" గా శంకించడం చూస్తే లోకమంతా గుడ్డిదని విశ్వాసం తప్ప యింకోయుక్తి కనపడదు. ఆయీవిషయం నాకు ఆశ్చర్యం కలిగించి యింతగా వ్రాయడం.

నిఘంట్లు అనేవి లోకంలో వున్న శబ్దాలను తెల్పడానికి పుట్టివుంటాయి కాని యెక్కడాలేని శబ్దాలను సృష్టించడానికి పుట్టవన్నసంగతి జగద్విదితమే కనక నిఘంటులో వుదాహరించిన యేపదాన్ని గూర్చికాని ప్రయోగవిషయంలో సంశయ పడవలసి వుండదు. కొన్ని పచ్చిబూతులు కూడా నిఘంటువులలో వుదాహరింప బడతాయి. వాట్లకు లోకంలో శిష్ట వ్యవహారంగాని, మహాకవుల గ్రంథాలలో ప్రయోగంగాని దొరకాలంటే దొరకదు. యేకూచిమంచి జగ్గకవిగారో ప్రయోగించినా అంతమాత్రంచేత సర్వేసర్వత్ర గ్రంథాలలో వాట్లవుపయోగం వుందనుకోవడానికి వల్లగాదు. కాని ధర్మశాస్త్రాలల్లోనూ వైద్యశాస్త్రంలోనూ వాట్ల అవసరం వస్తూవుంటుంది కాని అక్కడ తత్సమపదాలు వుంటాయికాని నిమ్నజాతులు వాడుకొనే అచ్చతెలుఁగు పచ్చిబూతులు వుండవు. వుండకపోయినా బ్రౌనుదొరగారు ఆ పచ్చిబూతు పదాలుకూడా నిఘంటువులో వుదాహరించివున్నట్టు జ్ఞాపకం. నేను ఆనిఘంటువును చూచి యాభైయేళ్ళు కావచ్చింది. యిటీవల ముద్రణంలో — (బహుశః సవరించరు) నేమేనా అట్టివి తొలగించి ముద్రించారేమో ? క్వాచిత్కంగా అన్నింటికీ కాకపోయినా అందులో కొన్నింటికి

కవుల రచనలలో ప్రయోగం కూడా నిషేధించవలసి వుండదని కావ్యాను శాసనం వగైరా లక్షణగ్రంథాలలో అభ్యనుజ్ఞ వున్నట్లు సోదాహరణంగా సుమారు నలభై యేళ్ళనాఁడు ఖండనమండనాదులలో వివరించే వున్నాను. గనక యిక్కడ స్పృశించి విడుస్తూ వున్నాను.

మైధునము వగయిరా అర్థాన్నే యిచ్చే అచ్చతెలుఁగు పదాలు బౌ్రణ్యంలోనే కాని దీనిలో వుదాహరించలేదు. తత్సమపదాలు కొంత గోప్యంగా వుండేవి - భగ మొదలైనవి వుదాహరించి వూరుకున్నాఁడు. బౌ్రణ్యంలోనేనా యెందుకు వుదాహరించవలసి వచ్చిందంటే? యూరపు ఖండవాసులుకొత్తగా యీదేశానికి పారిపాలకులుగా వచ్చినరోజుల్లో కొన్ని కేసులు విచారించడంలో ఆయా విచారణాధికారులకు వాట్లఅర్థం తెలియడం కూడా అవసరమే అవడంచేత వాట్లనికూడా వుదాహరించినట్లు తోస్తూంది. దానికి తథ్యంగా యిప్పుడు కోర్టులలో యేదేనా నిఘంటుతో అవసరం పడితే బౌ్రణ్యానికి యిచ్చినంత ప్రామాణ్యాన్ని శబ్దరత్నాకరం వగయిరా నిఘంటువుల కివ్వకపోవడం అందఱూ కాకపోయినా చాలామంది యెఱిఁగిన విషయమే.

యిక చిరకాలాన్నుంచి పండితులు సంశయిస్తూవున్న "యోచన - యోచించు" అనేవాట్లనుగూర్చి కొంచెం వ్రాస్తాను. ఆచార్లవారేమో పైరెండింటినీ వుదాహరిస్తూ "ఆలోచన - ఆలోచించు" అనేఅర్థాలువ్రాసి యివి సంస్కృతమనే అభిప్రాయమిచ్చే "సం" అని వ్రాసివున్నారు. యివి, యేసంస్కృతపు మాటలకు అపభ్రంశాలని పండితులు అనుకొంటూ వున్నారో అట్టి "యోజన - యోజించు" అనేపదాలు వీటివెంటనే వుదాహరించి యీ అర్థాన్ని వ్రాయక "కూర్పు" అనే అర్థాన్ని వ్రాసివున్నారు. పండితులు శిష్యుల్ని "అబ్బాయీ; నేటిపాఠం బాగాయోజించుకున్నావా?" అనడమున్నూ వుంది. యీరెండింటిలో ధాతుపాఠంలోవున్న "యుజ సమాధౌ" అనే యుజధాతువువల్ల "యోజన - యోజించు" అనేరూపాలే సమంజసాలవుతాయిగాని చకారఘటితాలకు ఆధారం కనపడదు. ఆకారణం

చేతనే సుమారు 50 సంవత్సరాలకు పూర్వం యీశబ్దాలనిగూర్చి "రాజ
యోగి" అనే ఆనాటి పత్రికలో శ్రీమాడభూషివారి భరతాభ్యుదయంలో
దిద్దరానిచోటవున్న "యోచన" అనేదాన్నిగూర్చి శ్రీమదల్లంరాజు సుబ్ర
హ్మణ్యకవిగారు శంకించడం తటస్థించింది. అప్పుడు గ్రంధకర్త వేంకటా
చార్యులవారిచ్చిన ప్రయోగం "యోచనా? కమలలోచనా?" అన్న
త్యాగరాయలవారిదిమాత్రమే అప్పటికే యీనిఘంటువు ప్రచారంలో వుండ
డంచేత దీన్నికూడా వుదాహరించారు. త్యాగరాయలవారి ప్రయోగం దిద్ద
రాని స్థలంలో వున్నదే అయినా పద్యకవులు పదకవులను అంతగా ప్రమా
ణీకరించకపోవడంచేత తోసిరాజనడం తటస్థించింది. నిఘంటువులో
ప్రయోగం యివ్వక పోవడంచేత ఆచార్లవారి వాదానికి తగినంత బలం
చిక్కిందికాదు. మళ్ళా కొన్నివత్సరాలకి యీశబ్ద ప్రసక్తి మాపాండ
వాశ్వమేధ విమర్శనలో తగిలింది. దానిస్వరూపాన్ని వివరిస్తాను. ఆక్షేప
కులు నిఘంటులో యోజనశబ్దం వున్నప్పటికీ దానికి అర్థం "ఆలోచన"
అనివ్రాయక కూర్పు, అని వ్రాసివుండడంచేత, "ఆలోచన" అనే
అర్థంలో "యోచన" ప్రయోగించాలి గాని "యోజన" అని ప్రయో
గించకూడదు — అని ఆక్షేపణ వచ్చింది. అప్పుడు మేము మాప్రయోగానికి
ధాతువు ఆధారంవుందికనక మాదే సాధువనిన్నీ, మీరేది (యోచన) మంచి
దనుకుంటూ వున్నారో, దానికి తగిన ఆధారం లేకపోవడంచేత అది
నిఘంటులోవున్నా దుష్టమేఅనిన్నీ సమాధానంచెప్పి నిరసించడం కలిగింది.
యుజధాతువువలెనే "యుచ" ధాతువు (అర్థాంతరమందేనా) వుంటేతప్ప
"యోచన" అనే ల్యుడంతం పుట్టదు. (సర్వం ధాతుజమాహ అని మహా
భాష్యం) అప్పుడు యుజధాతువునుండి "యోగః" అని వేఱొకరూపం
పుట్టినట్టే "యోకః" అని దీనివల్లనుంచి పుట్టవలసి వస్తుంది. అంతేకాదు—
"యుగ్య — యోగ్య" మొదలైన రూపాలవలెనే "యుక్య — యోక్య"
లోనైన రూపాలుకూడా పుట్టవలసి వస్తుంది. "యుజ" ధాతువుతాలూకు
రూపాలకే మహాకవుల గ్రంధాలలో ప్రయోగాలు కనపడతాయి గాని యుచ

మీఁద పుడతాయి అనుకొనే (యోచనతప్పు) 'యోక' వగయిరాలకు ప్రయోగాలు యెంతవెదకినా లేవు. ముందున్నూ వుండవు. ఒక్క "యోచన" అనేదానికిన్నీ దానితోపాటు తాటితో దబ్బనంగా వుండే "యోచించు" అనేదానికిన్నీ ఆధునికులలో (యింతగాని కొంతగాని పరిశీలన లేనివారిలో) ప్రయోగాలు కనపడతాయి. అయితే ఆలోచన అనే అర్థం "యోజించు, యోజన" అనే పదాలకు వస్తుందా అంటూ స్థూలదృష్టులకు శంక కలుగుతుందేమో? వినండి. శ-ర-ని-లో వ్రాసిన "కూర్పు" అనేదాని వల్లనే ఆలాంటి అర్థం సుగమంగా తీసుకోవచ్చును. "నీపాఠం యోజించుకున్నావా?" అంటే, కర్త కర్మ క్రియలున్నూ, విశేష్య విశేషణ భావమున్నూ దేనికీ దేనికీ బాగా అతుకుందో బాగాచూచుకొని కూర్చున్నావా? అని సమన్వయమవుతుంది. అలాటి వూహతోటే పండితులు యోజన పదాన్ని వాడుతూ వున్నారు. సంస్కృతపండితులకు తెలుఁగు వాడడంలో అంత నియమనిష్ఠలు వుండవు కనక అదేఅర్థంలో "యోచన-యోచించుట" న్నూ కొందఱు వాడుతూనే వున్నారు. ఈ రెండింటిలో నిగ్గుతేలిస్తే సరళఘటిత రూపం నిలుస్తుంది. పరుషఘటితరూపం పొల్లుగా యెగిరిపోతుంది. అట్టి నిస్సారమైన రూపాన్ని ఆచార్యుల వారివంటి విజ్ఞులు వుదాహరించడమే కాకుండా సంస్కృతమని కూడా వ్రాశారు. దీన్ని గుఱించి యెప్పుడో వాచస్పత్యంలో చూచినట్టున్నాను. యిప్పుడు జ్ఞాపకం లేదు. "క్షమాపణ" శబ్దాన్నిగూర్చి చూస్తే మామోలు ధాతుపాఠంలో "క్షమాప" అనే ధాతువుమీఁద దాన్ని నిష్పాదించి బోలెఁడు వుదాహరణాలు వగయిరాలుకూడా చూపించడం కనపడింది. దీనిక్కూడా అనిఘంటులో ఆలాటిసందర్భం వుంటుందేమో అని అనుమానించవలసివున్నా ఆపద్ధతిని "యోక" వగయిరా రూపాలు వుండవలసి వుంటుంది అనే ఆపత్తికి తగ్గజవాబు లేకపోవడంచేత వాచస్పత్యం కూడా చూడవలసి వుండదనే నేననుకుంటాను, అయితే ఆచార్లవారు యేమీ చూడకుండానే నిరాధారంగానే "సం" అని వ్రాసివుంటారా అన్నది విచార్యం కాక

పోదు. నాకు ఆయా గ్రంథసామగ్రి కొంత యిక్కడవున్నా మఱికొంత అన్యత్రగాని లభించదు. అందుచేత నా శక్తికి మించిన దీన్ని "మహాత్మ విధినాభారోఽయ మారోపితః" అన్న శ్రీహర్షుని అన్న (గోవింద పండితుఁడనే జ్ఞాపకం) వలె విజ్ఞలోకానికి వదలిపెడుతున్నాను. ఆచార్ల వారు యీనిఘంటులోనే కాక శ్రీనృసింహదేవర వెంకటశాస్త్రుల్లుగారు రచించిన "విచిత్రరామాయణం" మీఁద అభిప్రాయమిస్తూ కూడా యీ ప్రయోగాన్ని వాడివున్నారు. "మాట సులభము, చేత కష్టముగదా! యోచింపుఁడు" వారికి దీనియందు యెంతనమ్మకమూ లేకపోతే వాడి వుంటారా అన్నది ఆలోచించాలి కాని అల్లాటప్పాగా త్రోసివేయవగ్గది కాదు. వున్నారుగదా విద్వాంసులు. వారు విచారించి యేదో సిద్ధాంతీక రించకపోతారా అని దీన్ని వదలి మఱోటి ప్రస్తావిస్తూన్నాను.

నామట్టుకు యిది "తల్లకిందు ప్రయోగం" వలెనే ఆచార్లవారు వుదాహరించారని తోస్తుంది. "ఆరగింపు" ఆయీపదాన్ని వుదాహరిస్తూ బ్రాకెట్టులో "ఇంపువంతము పూర్వకవి సమ్మతము కాదు" అని ఆచార్యులు వ్రాసివున్నారు. యిక్కడ పూర్వకవి శబ్దము సాంకేతికంగాని ప్రాచీన కవులందఱికిన్నీ వాచకంగా కాదని తెలుసుకోవాలి. యీయన ఆదికవులు, మధ్యకవులు, అంత్యకవులు, ఆధునిక కవులు, అంటూ పీఠికలో తనకాలం నాటికి పూర్వమందున్న కవులను నాల్గుతెగలుగా విభజించినట్లు తేలుతుంది. అందులో ప్రస్తుతమందున్న "పూర్వకవిశబ్దము" భారతకవులనే వుద్దే శముతో ప్రయుక్తమయిందని వూహించాలి. ఆలాగగాక ప్రాచీనకవులంద ఱినీ వుద్దేశించి వాడినదే అయితే "క్వచిదిప్వంతతాంకేచిమాచిరే సహిమే రుచిః" అన్న అధర్వణోక్తికి సమన్వయం చక్కగా పొదరదు. భారత కవులందఱూ అధర్వణాచార్యులకు పూర్వులు కారు. అయితే గియితే అధర్వణాచార్యులకు యేకొంచెమేనా పూర్వుఁడు నన్నయ్యగారే కావాలి, ఆయన ఇంప్వంతం యెంతయింపుగా వున్నా యెక్కడా వాడినట్టులేదు. యిక కారికలోవున్న "కేచిదూచిరే" అనేపదానికి నన్నయ్యకూ అధర్వ

ణాచార్యులకూ (యిద్దఱూ సమకాలీనులే కనక) యేకొంచెమో పూర్వులో, లేక సమకాలికులో కొందఱు యీ యింప్వంత ప్రియోగాలు వాడుకోవచ్చు నని అన్నట్టున్నూ, అవి వ్యాకరణంచేత విరుద్ధమనడానికి తగిన ఆధార మేమీ లేకపోవడంచేత అట్టిబాధను చూపించలేక అధర్వణుఁడు తనకు మాత్రిం యిష్టంలేదని "నహిమేరుచిః" అని తెల్పినట్టున్నూ తేలుతుంది. ఆయనకెందుకు యిష్టంలేకపోయిందో యెంతో యింపుగావుండే యింప్వంత ప్రియోగమని నేను చాలాకాలాన్నుంచి అనుకుంటూ వుంటాను. నాకు తగినంత హేతువు కనపడింది కాదు. అందుచేత "జిహ్వాకోరుచీ, పుత్తైకో గుణం" కదా అనుకున్నాను. దీన్నే కాళిదాసు కొంచెంమార్చి "భిన్న రుచిర్హి లోకః" అన్నాఁడు రఘువంశంలో, యీ యింప్వంత ప్రియో గాలు వెగటుగా వుంటాయేమో విజ్ఞులు పరిశీలించడానికి కవిరాజ మనో రంజన మనే నామాంతరంగల పురూరవశ్చరిత్ర పంచమాశ్వాసాన్నుంచి వకపద్యం వుదాహరిస్తాను.

చ. "పిలుపులయింపు ముద్దుగొనుపెంపు (1) చనుంగవ యుబ్బరింపు, చె
క్కులల (2)చెమరింపు, మైకులుకు గుంపువదల్పని (3) కౌగిలింపు, గ
న్నుల (4) యదలింపు, కీలుజడ నొంపుదలంపున వేడ్కనింపు, నీ
కలయికసొంపు నే మఱవగాగలనా? కలనైనగోమలీ"

యీపద్యంలో అధర్వణాచార్యులుగారి "నహిమే రుచిః" అనే దానికి గుఱియైన ప్రియోగాలు నాలుగు సరసకవితాగ్రేసరుఁడు అబ్బనా మాత్యుఁడు రసపిపాసువు కనక ప్రియోగించుకున్నాఁడు, యితడు చాలా నవీనుఁడే. రసవంతాలు కవిత్వాలు తెలుఁగులో మనుచరిత్ర, విజయవిలాసం మొదలైనవి లేకపోలేదుగాని యితనికవిత్వం మఱీమఱీ ప్రితిపద్య రసా స్వదంగా వుంటుందని నేను చిన్నప్పటినుంచీ అనుకోవడం. నేను కాట వరంలో కొంచెం జ్వరపడి ఆహేతువుచేత అప్పటి నివాసగ్రామం యానా నికి ప్రయాణంకట్టి ప్రధమ మకాం రాజమండ్రిలో క్రొత్తగా వీరేశలింగం పంతులవారు అచ్చువేసిన యీ పుస్తకాన్నిన్నీ, వారి నిర్వచన నిరోష్ఠ్య

నైషథాన్నిన్నీ, వక చదరంగపు భరణీనిన్నీ కొనుక్కొని యిల్లు ప్రవేశిం చాను, అప్పటికి నాజ్ఞానం సంస్కృతంలోనూ, తెలుఁగులోనూ కూడా వోనమాలతరగతికి యెంతో మించివుండదు. అట్టిస్థితిలో యీపుస్తకంలో యెన్నోపద్యాలు నాకు కంఠోపాఠమయినాయి. అప్పటికి శృంగారరసమే కాదు, నాకు యేరసస్వరూపమూ కూడా లేశమూ తెలియదు. తెలియదగ్గ వయస్సున్నూ కాదు. సుమారు 15 ఏండ్ల దాదాపు. ఆయీ పద్యాలు యిప్పటికిన్నీ అస్థివిటట్టే ఆలాగే నిల్చిపోయాయి.

చ. కొడుకులు గల్గుదాక నొకకొన్నిదినమ్ములు చింత, నందనుల్
వాడమిన నాయువున్ బలము బుద్ధియు విద్యయు జాలగల్గగా
నుడుగని చింత, కల్గి తను నొలిభజింపనిచింత, తండ్రికె
ప్పుడు గడుజింతసేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే?

ఆయీపద్యం యీ అబ్బయామాత్యుఁడిదే, నేనెప్పుడేనా యేసభలో నేనా, నాల్గుమాటలు మాట్లాడవలసిన ప్రసక్తంటూ కలిగితే యీపద్యం దొర్లుతుందన్నమాటే, యీపద్యమేకాదు, శ్రీదాసువారి "లేపరు లెండు లెండనిన.........సదస్యసంభావనవేళ జూడవలె" అన్నపద్యంకూడా నాకు యిలవేల్పు పద్యాలలోదే. యీ అబ్బనామాత్యుఁడి యెత్తుబళ్ళు చాలా రసవంతంగా వుంటాయి. వాట్లను చూపవలసి వస్తే వేతే వ్యాసం వ్రాయాలిగాని "సట్టాజుపెళ్ళిలో గుట్టాజు కొకపోచ" వ్రాఁత పనికిరాదు.

"వలపించుటేకాని వలచిదక్కవుకదా?
కుసుమబాణునికైన గోమలాంగి!"

అని పూర్వశితో చెలికత్తెలు మాట్లాడే సీసపద్యార్థం బాగావిచారిస్తే దానికి వెలపెట్టవలసి వస్తే "సకలంబగు రత్నగర్భ చాలునె తూపన్" అన్న పద్యచరణం జ్ఞాపకం వస్తుంది. అందులోనూ ఆపద్యంలోదే "విన యమ్మలే కాని చనవువేడవుకదా? దేవేంద్రునైన నిందీవరాక్షి!" అనే చరణం మఱీ రసాస్పదం. యీ కవికృతమైన అనిరుద్ధచరిత్రనే మన

ఆచార్యులవారు వుదాహరించి యీపుస్తకం వుదాహరించకపోవడంచేత వారికి యీపుస్తకం దొరకలేదనుకోవాలి. యీఅబ్బనామాత్యుఁడు కవికర్ణ రసాయనాన్ని వరవడిగా పెట్టుకొని యీపుస్తకాన్ని ప్రారంభించినట్లు కవిరాజ మనోరంజనమనే నామధేయంవల్లనే కాక కొన్నివిషయముల వర్ణనలఁబట్టి కూడా స్పష్టంగా తేల్తుంది. నివృత్తి శృంగారాన్ని గూర్చిన పద్యాలు మాత్రం రసాయనంలో వున్నంత ప్రౌఢంగా వుండక కొంత పేలవంగా వున్నాయి. అదివకటి వదలిపెడితే యితని కవిత్వం సంకుసాల మహాకవి కవిత్వాన్ని యెన్నోరెట్లు దాటిపోతుంది. ఆంధ్రానికి యేయితర గురుత్వమూ లేని నాకు బాల్యంలో యక్షగానాలూ, నాటకాలున్నూ, తోలు బొమ్మలాటల పద్యాలున్నూ కొంత గురుత్వం చేసినట్లు యెప్పుడో వ్రాసే వున్నాను. కొంచెం జ్ఞానం అతిశయించే రోజుల్లో యీకవిరాజ మనోరం జనం వకటిన్నీ, సారంగ తమ్మయ్యగారి వైజయంతీ విలాసమున్నూ, యేకొంచెమో ఒడయనంబి విలాసమున్నూ, పోనుపోను పాండురంగ మహాత్మ్యమున్నూ గురుత్వం చేశాయి. అందుచేతే యితరుల పోలిక లేశమున్నూ లేకుండా కొత్తతోవను కవిత్వం నడిపించుకోవాలనుకొని మొదలుపెట్టి రచించిన శ్రవణానందంలో అంతోయింతో ఆ యీ పుస్త కాలలోవున్న పోలికలు విశేషపరిశీలకులకు కొన్ని గోచరిస్తాయి. ఒడయ నంబివిలాసం యిప్పుడు ఎక్కడా దొరుకుతున్నట్టు లేదు. దానిలోదల్లా నాకు నచ్చిన పద్యచరణం వొక్కటిమాత్రమే.

" సీతోడి సీరంగి నిన్ననే సానియై
గడియించె నీలాల కమ్మజోడు "

అనే చరణం నాకు పంచాక్షరిలా వుండేది. తక్కినపద్యం నాకు అప్పుడూరాదు, యిప్పుడూరాదు. యీ చరణచ్ఛాయగానే—

" చిన్నదా పెద్దదా చెప్పునీకన్న మా
ణిక్యము వేవేల్గణించిపోసె "

అన్నపద్యం శ్రీవణానందంలో నడిచింది. ఇది విషయాంతరం. అబ్బయామాత్యునివంటి రసపక్కవికి యెంతో యింపుగావుండి వాకశ్చే పద్యంలో నాల్గుసార్లు ప్రయోగించుకున్న "ఇంపన్వంతప్రయోగం" యీసడిస్తూ "నహిమేరుచిః" అన్నాఁడు అథర్వణాచార్యులు. దీన్నిబట్టి చూస్తే వ్యాకర్తలలో యెక్కడోతప్ప రసపిపాసాలాలసత్వం వుండ దనిన్నీ, పరిశీలించగా, పరిశీలించగా తుట్టతుదకు వారిపై ఖరి "త్రిదోష హరం తిప్పతీగె" లాగు పరిణమిస్తుం దనిన్నీ నేను అనుకుంటాను. నన్నయ్యభట్టు పూర్వజన్మ సుకృతం మంచిది కనక ఆయన "విపుల శబ్దశాసనుఁ" డై కూడా రసపక్కవితా దురంధరుఁడే అయినాఁడు, తక్కిన భారతకవులు వ్యాకర్తలు కారు కనుక ఆయీదోషాన్ని అనుమానించవల సిన ప్రసక్తి కలగనేలేదు. అప్పకవి యెంతో చక్కగా కూర్చేవాడే అయినా అతనిపేరుమీఁద లక్షణగ్రంథం తప్ప ప్రబంధమేదీ బయలు దేఱనేలేదు. యీలాగే పరిశీలిస్తే లాక్షణికులందఱూ కవుల పంక్తిలో న్నుంచి ఆవలికి వొత్తిగిలతారేమో అనుకుంటాను. అథర్వణాచార్యుల భారతంలోన్నుంచి లక్షణకర్తలు వారివారి పుస్తకాలలో వుదాహరించు కున్న యేరెండుమూఁడు పద్యాలో తప్ప అథర్వణాచార్లగారి కవిత్వం చవిచూచేభాగ్యం నాకేరాదు యెవరికిన్నీ లేదుగదా ? ఒకవేళ వుండేయెడల "తమపాకంబు స్వహస్తపాకగతి శుద్ధంబైన గానిందు" అన్నమాదిరిని వుంటుందేమో అని ఆయన "యింపై" నిర్దుష్టమై కనపడుతూ వుండ డమే కాక తనకాలపువారు కొందఱు వాడుకుంటూ వున్న "ఆరగింపు, మేళగింపు, పొసగింపు, మందలింపు" వగైరా ప్రయోగాలపట్ల "నహిమే రుచిః" అనిచేసిన ద్రోహాన్నిబట్టి అనుమానించవలసి వస్తూంది. నాకు తోచినది యింకోమాట వ్రాస్తాను. అథర్వణాచార్యులు కవికూడా అయినా ప్రాధాన్యేనా వ్యాఖ్యాత కనక లోఁగడ వ్రాసిన చొప్పున ఆయనకు రస వివశత్వం అంతగా వుండదు. పెద్దిభొట్లుగారు వ్యాఖ్యానారంభంలో వ్రాసిన "శరదిందు వికాస మందహాసాం" వగయిరా శ్లోకాల ధారనుబట్టి చూస్తే

ఆయన చక్కని కవి అని యెవ్వరేనా వొప్పుకుంటారుగదా ? అట్టిమహా కవిపేర చక్కనిప్రబంధమేదేనా వెలువడిందా ? ఆయనకు వ్యాఖ్యానాల మూలాన్నే పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. యెవరిదాఁకానో యెందుకు ? ప్రస్తుతం యీవ్యాసం యెవరినిగుఱించి వ్రాయ ప్రారంభించామో ఆయీ ఆచార్లవారు కవితారచనా నిష్ణాతులు కాకుండానే వుంటారా ? వుండరు. అయినప్పటికీ వీరిపేరుమీఁద వకపద్యమేనా వున్నట్టు యెవరేనా చెప్పుకోగా విన్నామా ? ( చిన్నయ్యసూరిగారున్నూ డిటో ) వొక్కరికి అనేక ప్రజ్ఞ లున్నప్పంటికీ అందులో యేదో వకదానివల్లనే నామరూపాలు కలుగుతాయ న్నది సర్వానుభవ సిద్ధం. యిది ప్రసక్తాను ప్రసక్తం.

ప్రస్తుతం యిట్టింత ప్రయోగాలను అధర్వణాచార్యులు రుచిహీన ములని వ్రాయడం ఆ పదాలయందు వుండే సొగసును కనిపెట్టకపోవడమే అని నేననుకుంటాను. (వాట్లయందు గ్రామ్యత్వారోపంచేయడానికి కారణం కనపడదు.) నన్నయ్యగారు వాడలేదంటారా ? ఆయన వాడినవేకాని తదిత రకవులు వాడకూడదంటూ కవిరాక్షసుఁడు శాసించినమాట వాస్తవమే. ఆ పక్షంలో తిక్కన్న, శంభుదాసులు వాడినవెన్నో నన్నయ్యగారు వాడనివి వున్నాయి. వాట్లగతియేమిటి ? యెవరువాడినాసరే, యెవరువాడకపోయినా సరే "ఆరగింపు" వగయిరా పదాలలోవున్న దుష్టత్వం యేమిటి అనేది మనకు విచార్యం. సొంపు, కంపు, జంపు మొదలైన రూపాలు అవ్యుత్ప న్నాలనుకోవాలిగాని సొంచు, కంచు, జంచు అనే ధాతువులులేవు కనక ఆ ధాతువులనుండి చువర్ణము పువర్ణంగా మాఱిన దంపు, మంపు, ఇంపు వగైరాల వంటివికావు. కాకపోయినా వాట్లకు ప్రయోగార్హత కలగడానికి హేతువు లోకవ్యవహారమేకదా ? కాదు వాట్లని కవులుకూడా వాడడ మంటారా ? అనండి ఆ పద్ధతిని వీట్లనికూడా కొందరు వాడినట్లు "కేచి దూచిరే" అనే వాక్యంద్వారా అధర్వణుఁడు వొప్పుకున్నట్లు కనపడుతూనే వుందికదా ! యిక యీరోజుల్లో దీన్ని ఆక్షేపించేవారి ప్రవృత్తి యెట్టిదో విచారిద్దాం. వీరు ఆ ప్రాంతంలో వాడుకలో వున్నాయి, యీ ప్రాంతంలో

వాడుకలో వున్నాయంటూ టిప్పణిలో వ్రాసుకుంటూ యెన్నో లోకవాడు
కలలో ఆ యాప్రదేశాలలోమాత్రమే వున్నవిన్నీ కవుల గ్రంథాలలో గాని
యిప్పటికి బయలుదేరిన నిఘంటువులలోగాని లేనివిన్నీ శరపరంపరగా
వాడుకుంటూ ఆక్షేపణకు వుపక్రమిస్తారే? దీనికర్థమేమేనావుందా? దీనికర్థం-
" అర్థమనర్థం భావయ నిత్యమ్ " అనుకోవడమే—

యిప్పటికే యింత్వంత ప్రయోగాన్నికూర్చి చాలా వ్రాసినట్టయింది,
కనక మఱివకదాన్ని కంగాని కవతరింపజేస్తాను——

"కంగారు" అనే పదానికి యుద్ధం అని అర్థంవ్రాసి పద్యాత్మకమైన
తెలుఁగు నిఘంటులో సీసపద్య చరణాన్ని వుదాహరించారు ఆచార్లగారు.
లోకవాడుకలో యీపదానికి యుద్ధమనేఅర్థం మాప్రాంతంలో సుతరామూ
వున్నట్టులేదు.

'నామనస్సు చాలా కంగారుగా వుంది' అని సర్వేసర్వత్ర అనడం
కలదు. యిక్కడ యుద్ధం అనే అర్థం చెప్పేటట్టయితే పొసగదు, లాక్షణి
కంగా సమన్వయించుకోవలసి వస్తుంది.——సరియైన అర్థం పరిపరివిధాలుగా
వుందిగాని నిలకడగాలేదు అన్నదే. "వాఁడు కంగారుపడ్డాడు" అనడం
కలదు. అప్పుడు సంభ్రమార్థకంగా కనపడుతుంది. యీ నిఘంటులో
యీ అర్థాన్ని వ్రాయలేదని యెఱుఁగికూడా లోకవాడుకను యివి అక్క
జాలవనే తాత్పర్యంతో పాండవ ప్రవాసంలో——

' ..................................లేనిమనమ్ము నిట్టుకం
గారొనరించునట్టి పనికాయిటకున్ రథమెక్కి వచ్చుటల్ '

అని "చెడగొట్టుట" అనే అర్థంలో మేము ప్రయోగించుకున్నాము.
లోకవాడుక వొక్కలాగున్నూ, నిఘంటులోమ టొలాగున్నూ వున్న పదాలు
చాలా వున్నాయి. మావైపున సర్వత్రా "పునస్సంధానము" అనే పదానికి
గర్భాధానమనే అర్థం శిష్టవ్యవహారంలోవుంది. అందుచేత తోసివేయదగ్గది
కాదు. అట్టిపదానికి (వైదికసంకేతితార్థమే అనుకుందాం యిదికూడా)

విచ్ఛిన్నమైన అగ్నిని పునః (తిరిగీ) సంధానంచేయుట అనే అర్థం వ్రాసి వూరుకున్నారుఆచార్లవారు. ఆచార్లవారు గోదావరిజిల్లా ప్రాంతంవారు కారు. వారివైపున గర్భాధానానికి వాడేపదం "ప్రయోజనం" అనేది. దీన్ని గురించి విపులంగా వొక వ్యాసమే రెండేళ్ళనాఁడు వ్రాసివుండడంచేత యిక్కడ స్పృశించివిడుస్తున్నాను. పునస్సంధాన పదానికి గర్భాధానార్థకత్వం యేలావచ్చిందంటే ? వివాహంలో పెట్టిన అగ్నిహోత్రాలు శేషహోమంతో అంతరించడమేకాని మళ్ళా "యావజ్జీవం హోష్యామి" గా అగ్నిహోత్రం చేసుకునేవారు యెక్కడోకాని లేకపోవడంచేత గర్భాధానం నాఁడు మళ్ళా అగ్ని పునస్సంధానం చేయవలసివచ్చి వైదికులు కొంత గోప్యంగాకూడా వుంటుందని లాక్షణికంగా పునస్సంధానపదంతో గర్భాధానాన్ని వ్యవహరిస్తూవచ్చారు. అది నానాటికి కేవల యౌగికంగాక యోగరూఢాల్లోచేరి పోయింది మాప్రాంతంలో; కేవలయౌగికార్థాన్నే పుచ్చుకొనే యెడల యీఅగ్ని పునస్సంధానం జీవత్పితృకులుకాని పెళ్ళికొడుకులు సమంత్రకంగా తల్లికో, తండ్రికో, లేక యిరువురకో ఆబ్దికం పెట్టేటప్పుడుకూడా ఆవశ్యకం కావడంచేత ఆబ్దికార్థంకూడా వుండవలసివస్తుంది. అందుచేత రూఢపదం కూడా చేర్చవలసి వచ్చిందని తెలుసుకోండి. యెంతశ్రద్ధగా చేసిందేనా పెళ్ళి శ్రాద్ధపదంచేత వ్యవహరింపబడదు. యెంత అశ్రద్ధగాచేసినప్పటికీ అంత్యకర్మ మాత్రమే ఆపదంతో వ్యవహరింపబడుతుంది.

వ్యవహార బలీయస్త్వంవున్న "శోభన" పదానికి గార్భాధానకత్వం వ్రాయలేదు సరిగదా శుభార్థకత్వంకూడా వ్రాయనేలేదు ఆచార్లవారు. పంచాగాలల్లోవుండే యోగార్థకత్వం మాత్రం వ్రాశారు. యీశోభన పదానికి గర్భాధానార్థకత్వఁ కృష్ణకు తూర్పుగావున్న యావత్తు జిల్లాలలోనున్నూ సుప్రసిద్ధం. నేను గ్రాంధిక ప్రయోగాన్ని చూడలేదుగాని శ్రీగిడుగువారు గ్రాఁధిక ప్రయోగంకూడా వుందని రూఢిగా చెప్పి వున్నారు. గ్రాంధికప్రయోగం లేదే అనుకుందాం. అంతమాత్రంచేత ఆపదంగాని, ఆపదానికివున్న అర్థంగాని లేకుండా పోవలసిందేనా ? వొక విశేషం

మాత్రం యిక్కడ మనం తెలుసుకోవాలి. యేమిటంటే ? లోఁగడ ఉదాహ రించిన పునస్సంధానపదంగాని, యీ శోభనపదంగాని సంస్కృతాలే అయినా నానాదేశాలలో చదువుకోతగిన సంస్కృతకవిత్వంలో వీట్లని వాడ వలసిపుండదు. వీట్లకి గర్భాధానార్థకత్వం తెలుఁగుదేశంలో మాత్రమే (యేసంధి దేశాల్లోనో లేకపోతే లేకపోనివ్వండి) చదువుకొనే గ్రంథాల్లో నిరాక్షేపణగా వుపయోగించుకోవచ్చును. "కంగుల్ దీరిన పైఠిణీరయిక" అనే విజయవిలాస పద్యానికి సంబంధించిన యితిహాసం పలువురు విజ్ఞులు యెటిఁగేపుంటారని గ్రంథవిస్తరభీతిచేత వుదాహరించలేదు. నిఘంటులోలేని వ్యవహారపదాలు చాలావున్నాయి.

"కళింగ" — యీపదానికి "లాకులు" (కాలవలకు అక్కడక్కడ కట్టేవి) అనే అర్థం నిఘంటులోలేదు. బహువచనంతో ఆ లాకులను "కళింగలు" అని నాచిన్నతనంలో వ్యవహరించడం నేనుబాగా యెఱుఁగు దును. యిప్పుడు ఆ పదంతో వ్యవహరించడం చాలావఱకు తగ్గింది. "లాకులు" అని బహువచనంతోటిన్నీ "లాకు" అని యేకవచనంతోటిన్నీ వాడడమే తఱుచు కనపడుతుంది.

"తందనము" — వెఱ్ఱిమొఱ్ఱిపాట మొదలగు వికారచేష్ట అని అర్థం వ్రాసి నేటివారు ప్రయోగించుచున్నారు. యీ అర్థం ఆచార్లవారు వ్రాయ లేదు. వ్రాయకపోతేమాత్రం లోకంలో వున్నదిపోతుందా ? అందుచేత నేను అలా ప్రయోగించినవారిని ఆక్షేపించను.

"బెంగవ్యథ" ఇట్లు గోదావరీ మండలమున వ్యవహరింతురు. అని ఫుట్టునోట్సులో వ్రాసి ప్రయోగించుచున్నారు. నిఘంటులో "విరహవ్యథ" అని అర్థం వ్రాయబడివుంది. ఆ అర్థం చెపితే ప్రస్తుతం పనికిరాదు. గోదావరీ మండలమున కేవల వ్యధార్థకంగా వాడుతూన్నమాట అబద్ధం కాదు. ఆచార్లవారు గోదావరీ మండలంవారుకారు గనక గ్రాంధిక ప్రయోగాన్నిబట్టి వ్రాసే అర్థంవ్రాసి వ్యావహారికార్థం వ్రాయలేదు. యింకొకటి యీలాటిదే చూపుతాను.—

"అబద్ధము" యీపదానికి 'అనర్థకము' అని అర్థంవ్రాసి వూరుకున్నారు. యిది సంస్కృతపదంగాని వ్యవహారంలోవున్న తెలుఁగుపదం కాదు. అంతవఱకు ఆచార్లవారు తెల్పేవున్నారు. సుప్రసిద్ధమనే కారణంచేత కాఁబోలును ప్రయోగంచూపలేదు. ఆచార్లవారి గ్రామప్రాంతంలో దీనికి "అనర్థకం" అనే అర్థం వుందేమోకాని మాప్రాంతంలో 'అబద్ధ' మంటే అసత్యం (బొంకు) అనే అర్థంలోనే దీన్ని ఆబాలగోపాలంగా వాడుతూ వుంటారు. "అబద్ధాలకోరు" వగయిరా పదాలు యెఱుంగని వారేలేరు. గ్రాంధికంగానో, నైఘంటికంగానో ఆచార్లవారు వ్రాసిన అర్థం వుందనుకోవాలి కాని, ఆలాటి అర్థంలో, మాప్రాంతంలో దీన్ని పండితులుగాని, పామరులుగాని వాడుతూన్నట్లులేదు.

"శ్లో. యాదృశం పుస్తకం దృష్ట్వాతాదృశం లిఖితంమయా
అబద్ధంవా సుబద్ధంవా మమదోషో నవిద్యతే"

అంటూ తఱుచుగా తాళపత్రి గ్రంథాలు నకలువ్రాసుకొన్నవారు ఇతిశ్రీగా వ్రాయడం అయినతరవాత వ్రాయడం ఆచారంగా వుంది. యీ శ్లోకం నాచిన్ననాటికి హతశేషంగా మిగిలివున్న మా పిన్నముత్తాతగారి పుస్తక సామగ్రిలో కొన్నింటిలో వుండఁగా చూచాను. ఆపుస్తకాలలో చాలావఱకు మాముత్తాతగారి స్వహస్తలిఖితాలే కాని కొన్నియితరులు ఆయనకు వ్రాసిపెట్టినవికూడా వున్నాయి. మాయింటి పొరుగునవున్న కరణాలు — అవసరాలవారు వ్రాసిపెట్టిన వాల్మీకి రామాయణం యింతవఱకు చెక్కుచెదరకుండా నేను కాపాడడమే కాకుండా నవరాత్రాలలో పూజకూడా చేస్తూవుంటాను. పై శ్లోకం చాలాకాలాన్నుంచిపుస్తకాలు వ్రాసుకొనేవారు "మక్కికిమక్కిగా వ్రాశాంగాని ఇందులో మా స్వంతం లేశమూలే" దని చెప్పడానికి వ్రాసుకునేదిగా తోస్తుఁది. ఇందులోవున్న అబద్ధ పదానికి యేమాత్రమూ లోక వ్యవహారం సమీపంలో వుఁటుందిగాని ఆచార్లవారి (అనర్థం) అర్థం చాలా దూరంలో వుఁటుంది, అయితే (అనర్థకం) అనే పదానికి ఆపత్తు వగయిరాలు మఱికొన్నికూడా వుండడంచేత ఆ అర్థాలలో

యే అర్థాన్ని మనస్సులో పెట్టుకొని వ్రాసివుంటారో కూడా కొంతవిచారించ వలం అవసరం కాకపోదు. ఆచార్యులవారేమో "అనర్థక" పదానికి "పరస్పరాన్వయములేనిది" అని వ్రాసివున్నారు. యీ అర్థానికీ, లోక వ్యవహారంలోవున్న అసత్యమనే అర్థానికీ సరిపెట్టవలసివస్తే యెంతో శ్రమపడవలసి వస్తుంది. లోకంలోవున్న వ్యవహారానికి ఆయీశబ్దవ్యుత్పత్తి (బద్ధంకానిది) కూడా సమన్వయిస్తూవున్నప్పటికీ ఆచార్లగారు దీన్ని ఉపేక్షించడానిక్కారణం వారిదేశంలో యీ అర్థమందు దీన్ని వాడకపోవడమేకాక అసత్య పర్యాయాలలో, అమరకారుఁడు దీన్ని వాడకపోవడంకూడా అనుకోవాలి. నిఘంటులో చేరని పర్యాయపదాలు లోకంలో చాలా కనపడతాయి కాని ఆ పదాలు సుప్రసిద్ధమైన అమరంలో లేనంత మాత్రంచేత యెక్కడా లేవనుకోవడానికి వల్లకాదు. అగ్నిహోత్రశబ్దము తదుద్దిష్టమయిన కర్మ పరంగానే కాని అగ్ని పర్యాయంగా లేదని నేను చాలాకాలం అనుకొనే వాణ్ణి. కారణం అమరంలో అగ్నిపర్యాయాల్లో లేకపోవడమే. ఆ యీకారణాన్నిబట్టే కాళీ సహస్రంలో "పదాగ్నిహోత్రః కథమస్య పాత్రమ్" అని లోకవాడుకనుబట్టి మొట్టమొదట అగ్నిపరంగా వాడి, తరవాత సంశయం కల్గి "సమీతిహోత్రః కథమస్యపాత్రమ్" అని మార్చడం తటస్థించింది. కాని నేటికి మూడేళ్ళనాఁడు వొక విద్వాంసుఁడు అగ్నిపరంగాకూడా వాడవచ్చునని చెప్పి మహాకవి ప్రయోగాన్ని చూపడం జరిగింది. యిది మహాసముద్రం. దీన్ని అల్పజ్ఞులు తరించినట్లు ధైర్యంగా మాట్లాడుతారు కాని విశేషజ్ఞులు యెక్కడ యేమివుందో అనే సంశయంచేత 'ఇదమిత్థం'గా తెగించి చెప్పడానికి భయపడుతూ వుంటారు. అందుచేతే అనుకుంటాను గొప్పగొప్ప వ్యాఖ్యాతలు యెక్కడేనా తప్పని తోఁచినప్పుడు దానిని "దుష్టం" అని ఖండించి వ్రాయక "చింత్యం" అని వూరుకుంటారు. తుదకు "చింత్య" పదానికి అర్థం దుష్టమనేదిగా పరిణమించింది. యెందుచేతంటే? 'చింత్య' మన్న విద్వాంసులు లోకోత్తరులవడంచేత. అలాటి పదాలేవిన్నీ తిరిగి వుద్ధరించపడ్డట్టు లేకపోవడమే తటస్థిస్తూవచ్చింది.

యిక మఱివకపదాన్నిగూర్చి వ్రాస్తాను. "అమ్మాయి" అన్న పదాన్ని వుదాహరించి "పడుచు బాలిక" అని అర్థము వ్రాశారు. అమ్మి అనే పదాన్ని యెత్తికొని అమ్మాయి అని అర్థం వ్రాశారు. దీనివల్ల యీ రెండుపదాలున్నూ పర్యాయపదా లయినట్టు తేలింది కాని యిక్కడ కొంత వ్రాయవలసినది కనపడుతుంది. నిమ్నజాతి స్త్రీలనుగూర్చి గోదావరీ మండలంచుట్టుపట్ల "అమ్మి" అనే పదాన్ని వాడడం ప్రాచుర్యంగా వుంది. వాత్సల్యద్యోతకంగా పడుచు బాలికలను గూర్చికూడా యీ అమ్మి పదాన్ని వాడడమున్నూ వుంది. పడమటికి వెళ్ళినకొద్దీ నిమ్నజాతుల స్త్రీలనుగూర్చికూడా "అమ్మ" అనే పదాన్నే బాహాటంగా వాడతారు. అమ్మి పదమంటూ నిమ్నజాతుల కొఱకు వొక పదం అవతరించి వుందన్నమాట వారు బొత్తిగా యెఱగరు. యింకోవిశేషం. నిమ్నజాతుల పేరుకు అమ్మపదాన్ని తగిలించక మాప్రాంతంలో అమ్మి పదాన్నే తగిల్చి "చిన్నమ్మి" అంటూ క్వాచిత్కంగా వాడడం కలదు. పోనీ "చిన్నమ్మ" అనే అనరాదా అంటే - యీ యికారాంతానికిన్నీ, దానికిన్నీ బోలెడు గౌరవభేదం వుంది. చిన్ని అనడంకంటె చిన్నమ్మి అనేది యేచిన్న మెత్తో, అడ్డిగెత్తో మాత్రమే గౌరవాన్ని కలిగిస్తుంది. అంతేకాని అమ్మ పదాన్ని వాడడానికీ, దీనికీ చాలా గౌరవభేదం వుంటుంది. "అమ్మ" స్త్రీవాచకం - "అమ్మి" న్నీ స్త్రీవాచకమే. 'అమ్మ' పదంమీఁద "గారు" పదం చేరుస్తే "అమ్మగారు" అని గౌరవవార్ధకంగా పరిణమిస్తుంది. ఆ "అమ్మ" పదానికే వెనకాల "ఆ" చేర్చి, "ఆయమ్మ"గా చేసి దానిని నామధేయానికి చివర సంధిస్తే "వెంకాయమ్మ, సుబ్బాయమ్మ" వగైరాలుగా మారి ఇఁకా కొన్ని డిగ్రీల గౌరవాన్ని హెచ్చుచేస్తుంది. ఆ అమ్మ పదానికే "గారు" కు బదులుగా "వారు" అనేది చేరుస్తేనో? "దేవత" అర్థమౌతుంది మనుష్యులకన్న దేవతలు గౌరవనీయులు కనక ఈ పదాన్ని యెవరినేనా పెద్దగా గౌరవించే తాత్పర్యంతో వాడితిమా? ఆలాటి గౌరవం కలిగించదు సరికదా? పైఁగా అందవికారమైన "ఆడుది"

అనే అర్థం వస్తుంది. ఈతెలుఁగు ఇన్ని స్థూలసూక్ష్మలతో వ్యవహరించడం ఈ గోదావరీ మండలప్రాంతంలోనే కాని, అన్యత్ర లేదని నా అనుభవానికి గోచరిస్తుంది.

ఆచార్లవారు, అమ్మి, అమ్మాయి అనే పదాలు యెత్తుకు వూరుకున్నారు. ఆలాటి అర్థాన్నేయిచ్చే అబ్బి, అబ్బాయి పదాల జోలికి పోనే లేదు. లింగభేదం తప్ప అక్కడ వ్రాసిన సందర్భాలలో చాలామట్టుకు ఇక్కడనూ వున్నాయి. యీ రెండుపదాలున్నూ క్వాచిత్కంగా పర్యాయపదాలు కావడమున్నూ (వాత్సల్యార్థకంలో) కనపడుతుంది. నిఘంటులో "అబ్బ" అనే పదాన్ని యెత్తుకున్నారు. ఆపదానికి యిత్వంచేస్తే "అబ్బి" అనిన్నీ, ఆయి చేరిస్తే "అబ్బాయి" అనిన్నీ అవుతాయనుకోవడం సుకరమేకాని అసలుపుట్టుక ఆలాటిది కాదని తోస్తుంది. యీవ్యుత్పత్తి చెప్పడం రెండోపదం దగ్గితే మిక్కిలీ విరోధిస్తుంది. 'ఆయి' పదం స్త్రీవాచకంగాని పురుషవాచకం గాదు. "సీతాయి, గంగాయి" వగయిరాలు సుప్రసిద్ధాలు చూచుకోండి. అందుచేత పురుషవాచకానికి దాన్ని ముడిపెట్టడం కేవలం అనుచితంగదా ? ఆకారణంచేత యీ వ్యుత్పత్తి "అమ్మాయి" పదానికి మాత్రమే చెప్పుకొని "అబ్బాయి" పదానికి మఱోత్రోవ చూచుకుందాం. భ్రాతృవాచకమైన భాయిపదం (అన్యదేశ్యం) వల్ల కొన్నిమార్పులుచేసి దీన్ని నిష్పాదించుకోవచ్చు నని నేననుకుంటాను. సంస్కృత శబ్దాల వ్యుత్పత్తులే యేకొన్నో (100 కి 10 మాత్రం) హృదయంగమంగా వుంటాయి. తక్కినవి యేదోమాదిరిగా కనపడతాయి, నానా గోత్రాలు కలిసి. "తండ్రి మధ్వాచారి తనయుఁ డారాధ్యుండు తల్లి రామానుజ మతస్థురాలు" అన్నమాదిరిని వుండే తెలుఁగుభాషకు వ్యుత్పత్తులు ఆలోచించవలసివస్తే చెప్పేదేమిటి ? అట్లని అన్నీ బాగుండవని చెప్పరాదు. యేకొన్నో మిక్కిలీ హృదయంగమంగా కనపడతాయి.

"అల్లుఁడు" జామాత్రర్థకమైన యీ తెలుఁగు పదానికి చెప్పే వ్యుత్పత్తి యెంతో బాగా వుండడమే కాకుండా (తీగ అల్లునట్లు చుట్టటి

కాన్ని అల్లేవాఁడు ) ఆలాటి వ్యుత్పత్తిని మనస్సులో పెట్టుకొనే ఆపదాన్ని పెద్దలు ఆదిలో వాడివుంటారేమో యని అనిపిస్తుంది. అబ్బిపదాన్ని నిఘంటులో లేకపోయినా శ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రుల్లుగారు వారి అనర్ఘ రాఘవ నాటకంలో వాడివున్నారు. అది గ్రామ్య మనుకొనేవారు కొందఱున్నారు గాని నేను దాన్ని గ్రామ్యమనేదిలేదు. అంటే చిక్కువస్తుందని యెఱుఁగుదును. "మతొక్కపద మగ్రామ్యంబు చూపన్ వలెన్" గదా, యేదీ ? అట్టిపదం ! అదిన్నీకాక ప్రస్తుత పదంలో గ్రామ్య లక్షణాలేమున్నాయి. గ్రామంలో వసించేవారు వాడినంతలో గ్రామ్యమవుతుందా ? దీన్నిగూర్చి యితరత్రి విస్తరించడంచేత యిక్కడ స్పృశించి విడుస్తూ వున్నాను. సజాతీయ పదాన్ని స్త్రీవాచకాన్ని శ-ర-ని-లో వుదాహరించడం చేత దీన్నికూడా వుదాహరించినట్లే మనం అనుకోవచ్చునని నా ఆశయం.

యీలాటి వింకా యెన్నోవున్నాయి. నిఘంటు సమన్వయం చేసుకోవడంకూడా కొంత సాంప్రదాయాలతో చేరివుంటుందని నా తాత్పర్యం. ఆలాటి సాంప్రదాయాలు తెలియకపోతేనే "పుంసివా కొమ్మెక్క......... .........ఇత్యపులు కూయగా" అన్నపద్యానికి వుదాహరణం కావలసిరావడం. అబ్బి పదం పురుషవాచకంగానున్నూ, అమ్మిపదం స్త్రీవాచకంగానున్నూ సామాన్యులను వుద్దేశించి తెలుఁగుదేశంలో చాలాచోట్ల వాడుతూ వున్నారు. అబ్బిపదానికి అన్న పదాన్ని చేర్చి కొంత గౌరవంగాని ప్రేమగాని సూచితమయేటట్టు వాడడమున్నూ కలదు. వట్టి వాడడమే కాకుండా ఆమాట తుదకు సంజ్ఞగా పరిణమించి యావజ్జీవితమున్నూ ఆవ్యక్తి ఆపదంతోనే పిలవ బడడమున్నూ వుంది. యీ అన్న పదాన్ని స్త్రీవాచకమైన "అమ్మి" పదానికి చేర్చి వాడడానికి అర్థమేమేనా వుందా ? "అమ్మన్న" అనేపేళ్ళు పురుషులలో క్వాచిత్కంగా లేకపోలేదుగాని అంతకన్న స్త్రీలలోనే విశేషించి వున్నాయి, దీనికి అవయవార్థాన్ని చెప్పవలసి వస్తే (అమ్మయొక్క అన్న మేనమామ) బొత్తిగా కుదరదుకదా ? లోకవ్యవహారానికి అర్థమేమిటి; గిర్థమేమిటి అని వుపేక్షిద్దామంటే భాషకు

మూలం వ్యావహారికమే కదా? నన్నయ్యభట్టు లోకవ్యవహారానికి యెంతో గౌరవం యిచ్చివున్నాఁడు - "లోకోనన్యాదృశశ్చ నిత్యశ్చ" అట్టిలోక వ్యవహారపు మాటలలో నాగరికుల మాటలను ఛందోబద్ధంచేస్తే పద్య కవిత్వమయింది. గణబద్ధం కాకుండా వ్రాస్తే గద్యకవిత్వ మయింది. బాహాటంగా లోకంలో వాడుతూవున్న వ్యాకరణవిరుద్ధాలుగాని పదాలను గూర్చి "కలవులేవని" పెనగడం అజ్ఞతా స్ఫోరకం —

యిక మంగళార్థం శోభనాక్షతవాచకమైన "పచ్చబాలు" అనే దాన్నిగూర్చి నాల్గుమాటలువ్రాసి దీన్ని ప్రస్తుతం ముగిస్తాను. శ-ర-ని-లో ఈపదం విడదీసిన వైఖరి చూస్తే అఉసున్నగాని, సరళాదేశంగాని ఆపదంలో వుండడానికి హేతువు కనపడదు. పచ్చ -|- పాలు అని విడదీయక మనం పచ్చని -|- ప్రాలు అని విడదీసుకుంటేనో? అప్పుడు పైశంక నివర్తిస్తుంది. గాని నిఘంటువులో వుదాహరించిన "పచ్చచేమంతి" అనే రూపం కుదురదు. దాన్నికూడా దిద్ది పరిదర్శిద్దామంటే, లోకంలో "పచ్చ జేమంతి" అని వ్యవహరించడం పడదు. అందుచేతనే నిఘంటుకర్త "పచ్చని" అనే పదాన్ని చూపక "పచ్చ" అన్నంతవఱకే చూపి, అఉసున్న సరళాదేశాలు సమాససంబంధమైన వికారాలుగా సరిపెట్టుకున్నట్టు తోస్తుంది. కొంచెం దీనిచుట్టరికం వుండికనక "పొరబాటు" శబ్దాన్నిగూర్చి విచారిద్దాం.

దీన్ని పొరపాటు అనిమాత్రమే వ్రాయకున్నాఁడు. వ్యవహారంలో యీశబ్దం "పొరబాటు" అనే ఉచ్చరితమవుతుంది. వ్యుత్పత్తి చెప్పవలసివస్తే, పొరయందు బడుట అని సప్తమ్యంతంలో చెప్పడమే యుక్తంగా కనపడుతుంది. లోకంలో నూటికి 75 పదాలు లాక్షణికాలే అని విజ్ఞులెఱుఁగుదురు. అఉసున్నయూ, సరళాదేశమున్నూ లోఁగడ చూపిన "పచ్చబాలు" శబ్దంవలెనే సమాసవికారాలు అనుకుంటే సరిపోతుంది. యిది నిఘంటు కారులు చూపిన మార్గమేకాని కొత్తదిన్నీ కాదు. యెందుకింతకష్టం! పరుషాక్షరయుక్తంగా "పొరపాటు" అనుకోరాదా అంటే,

జవాబులేదు. లోకవ్యవహారానుసారంగానే వీలయినంతవఱకు కవిత్వం నడిపించుకోవడమే యెక్కువ హృదయంగమంగా వుంటుందనడమే వొక జవాబు. ప్రసిస్థానంలో ప్రయోగం దొరికేయెడల పూర్వపక్షులు కిక్కురుమనకుండా వూరుకుంటారుగాని దానికోసం చాలా ప్రయత్నించాలి. వైఘంటికులు ప్రయత్నంచేసేవుంటారు. చేస్తేదొరకలేదేమో?

యీ శబ్దం మాటకేమి? యిటీవల పూర్వగ్రంథాలు ముద్రించడంలో యెన్నెన్ని శబ్దాల విషయంలో యెంతెంతమార్పు జరిగిందో వ్రాయవలసి వస్తే యెంతేనా వ్రాయాలి. ఆ మార్పు సయుక్తికమా? అయుక్తికమా? అనే సందర్భం యెఱుఁగనివారే యిప్పుడు వ్యర్థపుశంకలుచేస్తూ వుంటారు. దేశభాష తెలుఁగుమాటకేంగాని, దేవభాషగావున్న సంస్కృతంలోకూడా యెంతో ఆలోచిస్తేనేకాని బోధపడనివి యెన్నో శబ్దాలున్నాయి. "మహేశ్వర" శబ్దాన్నిగూర్చి కొంచెంవ్రాసి వ్యాసం ఆపుతాను. "మహేశ్వ రేవా మహతా మధీశ్వరే" అన్నారు అప్పయ్యదీక్షితులవారు. దీన్నిబట్టి "మహతాం విష్ణ్వాదీనాం ఈశ్వరః మహేశ్వరః" అని వ్యధికరణ సమాసం చెప్పుకోవలసివస్తుంది. ఆపక్షంలో సామానాధికారణ్యా భావాత్తూతకారానికి "ఆన్మహతః" అనేసూత్రంచేత అకారా దేశంరాదు. గనక "మహదీశ్వరః" కావలసివస్తుంది. "మహాంశ్చాసౌ ఈశ్వరశ్చ" అని కర్మధారయ చెప్పి కొంటే యీబాధలేదుగాని దీక్షితులవారికి అజ్ఞతను కల్పించవలసివస్తుంది. దీక్షితులవారి తాత్పర్యాన్నిబట్టిచూస్తే మహేశ్వరపదానికే కాకుండా సజాతీయం "మహాదేవ" పదానిక్కూడా షష్ఠీతత్పురుషయే యిష్టమని కనపడుతుంది. ఆపక్షంలో "మహద్దేవః" కావలసివస్తుంది. "విశ్వేశ్వరాయ మహాదేవాయ" అని శ్రుతమవుతూవుంది వేదంలో. నేను దీన్నిగూర్చి యీలా అభిప్రాయపడతాను. యేలాగంటే — అసలర్థమేమో వైయధికరణ్యాన్ని బోధించేదే అయినా "గొప్పఈశ్వరుఁడు, గొప్పదేవుఁడు" అని సామానాధికరణ్యార్థంలోనే విగ్రహాన్ని చెప్పుకొని తకారానికి అకారాదేశాన్ని సంపాదించుకోవలసి వుంటుందేమో అని. (యిది స్థితస్యగతిశ్చింత

సీయా) యీలాటి శబ్దాలు మఱికొన్ని కనబడతాయి. "మహోపాధ్యాయః" అనేదానికికూడా విగ్రహం చెప్పుకోవడంలో "మహాంశ్చాసౌఉపాధ్యాయశ్చ" అని సమానాధికరణంగానే చెప్పుకొని తాత్పర్యార్థం "గొప్పవాళ్ళకు, అనగా పెద్దపెద్ద పండితులకు ఉపాధ్యాయత్వం చేసేవాఁడు" అని చెప్పుకోవలసి వస్తుందనుకుంటాను. యిది కుదిరితే మహామహోపాధ్యాయ పదంకూడా వెంటనే కుదురుతుంది. యేలాగంటే మహాంశ్చాసౌ మహోపాధ్యాయః మహామహోపాధ్యాయః (గొప్పవాడైన మహామహోపాధ్యాయుఁడు) అనే అర్థంలో విశేషమేమిటంటే — రెండు మహచ్ఛబ్దాలున్నాయి కనక మహత్త్వాన్ని మఱింత వివరిస్తాయనుకోవాలి. యీ రెండు పదాలున్నూ చిరకాలంనాటివేకాని, నిన్నా నేడూ పుట్టినవికావు. లేదా? మహామహోపాధ్యాయ శబ్దానికి యింకోమార్గంకూడా కనపడుతుంది. యేదంటే— మహాస్ మహ (తేజః) యేషాంతే మహామహాః, అనగా గొప్పదైన (విద్యారూప) తేజస్సుకలవారు, గొప్ప పండితులని యావదర్థము. (మహాశబ్దము తేజోవాచకం ఆకారాంత పుంలింగంకూడావుంది. "ఏష్టి" నిఘంటులో చూచినజ్ఞాపకం.) అట్టి గొప్ప పండితులకు ఉపాధ్యాయుఁడు అని చెప్పుకుంటే సరిపోతుంది.

లోకంలో పండితులువాడే శబ్దాలేవిన్నీ అపశబ్దాలుకావు. వాట్లని కొందఱు చటుక్కున ఆక్షేపిస్తూ వుంటారు. వొకాయన మంచి విమర్శకుఁడై యుండికూడా "ప్రథమ" శబ్దాన్నిగూర్చి సుమారు 18 సంవత్సరాలనాఁడు శంకించడమున్నూ, జవాబు చెప్పడమున్నూ జరిగింది. ఆయన మళ్ళా ఆశబ్దాన్నిగుఱించిన్నీ, అదనంగా "బుక్కించెదస్" అనే "జయంతి" లోవున్న సంస్కృతి ధాతుప్రయోగాన్ని గుఱించిన్నీ ప్రశ్నిస్తూ యీమధ్యనే వక కాగ్టువ్రాసి వున్నారు. దానికి జవాబు వ్రాస్తూ ప్రథమ శబ్దాన్నిగూర్చి "ప్రథప్రఖ్యానే" అనేధాతువునుండి ప్రథమ శబ్దం నిష్పన్నమైనట్టు అమర వ్యాఖ్యానంలో వుందనిన్నీ ప్రకృష్టః ప్రథమః (ప్రథమః అవుతుంది కనక నదళంకానవకాశం అనిన్నీ వివరించాను. కాని యింకా ఆయన తృప్తిప

చలేదు. దీనికి ప్రయోగం యివ్వవలసిందంటారు. ప్రయోగంకూడా చూచిన జ్ఞాపకంవుందిగాని యేగ్రంథంలో చూచానో యిపుడు గుర్తులేదు. ప్రథమ శబ్దం సుప్రసిద్ధమేకదా? దానికి "ప్ర" అనేదానితో సమాసంకదా? (ప్రాదయోగతాద్యర్థే) అనే వార్తికం కలదుగదా? "మొట్టమొదట" అనే అర్థంలో పండితులు దీన్ని, అనగా ప్రప్రథమ శబ్దాన్ని వాడతారుకదా? దీనికివేఱే ప్రయోగం యెందుకువుండాలో ఆలోచించవలసిందంటానునేను. పైఁగా యీయన మంచిప్రాజ్ఞులై వుండికూడా యింకోమాట బొత్తిగా అసంగతమయినది వ్రాశారు. అదిచూచి నేను "అన్నా! యీయనకు బొత్తిగా వ్యాకరణ సంప్రదాయం తెలియదుగదా?" అని కించపడ్డాను. ఆమాట పండితుల పరిశీలనకై యిక్కడ చూపుతాను. ప్రథమశబ్దము తద్ధితముగ గ్రహించుటయా, కృదంతముగ గ్రహించుటయా, అని వాక ప్రశ్న వేశారు. ధాతువునుండి పుట్టేశబ్దాలేవిగాని తద్ధితాంతములు కావన్నది యేమాత్రం వ్యాకరణ ప్రవేశమున్నా (అంతదాఁకా అక్కఱలేదు, సంప్రదాయజ్ఞుల శుశ్రూషవున్నా చాలును) తెలియవలసిందేకాని చక్కనిశైలిలో వ్యాసాలువ్రాస్తూ పండితులతో డీడిక్కలు కొట్టుకునే యీ యనకు యీస్వల్ప విషయంలో అజ్ఞత్వాన్ని కల్పించడం యేలాగరా అని నేను కళవళపడుతూ ఆభారం పండితులమీఁద వుంచుతూ వున్నాను.

పితామహుఁడు ప్రపితామహుఁడు అనే ప్రయోగం యెఱిఁగిన వారికి ప్రప్రథమ శబ్దాన్నిగుఱించి సంశయింపవలసి వుండదని నేను అనుకుంటాను. అయినా దీన్నిగుఱించి పండితులను నేను పృచ్ఛిస్తున్నాను. యీవిషయంలో నాసమాధానం సమంజసమా, కాదా అని నిర్మొగమాటంగా జవాబు యిస్తారని ఆశిస్తాను —

"బుక్కించెదన్" అన్నదాన్నిగూర్చి "బుక్కభషణే భషణంశ్వ (కుక్క) రతః" అని ధాతువనిన్నీ, దానిసంవృతిరూపం "బుక్కించు" అనిన్నీ జవాబుయిచ్చినాను. దీనికిన్నీ ఆయన తృప్తిపడ్డట్టులేదు. ప్రయోగం కావాలంటారు. "ఱసిధాత్వర్థ మనుగ్రహింప గదవే" అన్న శ్రీనాథ

ప్రయోగానికి ప్రయోగాంతరం చూపవలసిందంటే, చూపగలమా? నన్నయ్యగారి - "పర్వతశిఖరంబెత్తి విగుర్వింపుము" అన్నదానికంటె "బుక్కించు" అప్రసిద్ధమా?

ఆయా సందర్భాలు బొత్తిగా యెఱుఁగకుండా శంకించేవారు కొందఱున్నారు. వారిశంకలే అయితే యింత గౌరవించవలసి వుండదు. యీ యన ఆతరగతిలోవారు కారు. కనక యింతగా విచారించవలసి వచ్చింది. పైఁగా యితరపండితులను అడగవలసి వచ్చింది కూడాను. పలువురు జిజ్ఞాసువులకు వుపకరించే విషయం కనక విజ్ఞులు వుపేక్షింపగూడదని నావిజ్ఞప్తి. యిక మఱోవిషయం అందుకుంటాను—.

మనకందఱికీ నన్నయ్యగారు ఆదికవిన్నీ, మార్గదర్శకుఁడున్నూ కనక ఆయన ప్రయోగాలకు తత్పూర్వకాలీనమైన ప్రయోగం వుందా అనే ప్రశ్న వేయడానికి మనకు అవకాశం లేదనుకుందాం. ఆయనతో సమకాలీనులు నారాయణభట్టు వగైరాలు శంకించడానికి అవకాశంవుంటుందా, వుండదా? వుంటే ఆయనకూడా ప్రయోగం చూపవలసినవాఁడేనా? - 'విధాతృ' శబ్దానికి "విధాత" అనే రూపమేకాక 'విధాతృఁడు' అనేరూపంకూడా వున్నట్లు ఆయన ప్రయోగం - "విధాతృనకైనను నేరబోలునే" అనేదానివల్ల గోచరిస్తుంది. వెనకటి సంస్కర్తలకు అంత మాత్రం సాహసం లేకపోయింది గాని వుండేటట్టయితే "విధాతకునైనను నేరబోలునే" అని దిద్దేసేస్తే అంతటితో తేలిపోయేదే! సంస్కృతభాష మనకు జన్మతోపాటు వచ్చేది కాదు. యింగ్లీషువగయిరాలవలెనే అభ్యసించినవారికే వస్తుంది. ఆభాషలో కవిత్వం చెప్పేవాళ్ళకి జన్మతోపాటు వచ్చే తెలుఁగులో చెప్పేవాళ్ళ కున్నంత చిక్కులేదు. వీరికి యెంతజాగ్రత్తగా రచన నడిపించినా వ్యావహారికాలు దొరలక మానవు. నన్నయ్యగారి "విధాతృఁడు" యీలాటిదే అనుకుంటాను. ఆయన ఆదికవి కనక దాన్ని అందఱూ మన్నించారు. నర్సారావుపేట ప్రాంతంలో భర్తృశబ్దానికి "భర్త" అనే తత్సమరూపం కాక "భర్తారుఁడు" అనేరూపంకూడా

వ్యావహారికంలో బాహాటంగా వుంది. కొందఱు కవులు (సామాన్యులు) వారివారి రచనలలో ప్రయోగించుకున్నారు కూడాను. పోనీ, గ్రామ్య మందామా? గ్రామ్యమున్నూ కాదు. గుణవర్గణంలో చేర్చుకుంటే సాధు వవుతుంది.

యీ వృధా చర్చకు అంతూ పొంతూ కనపడదు. యీకాలంలోనే వుందేమో యీచర్చ అనుకుంటే, పూర్వకాలమందున్నూ వున్నట్టు కొన్ని యితిహాసాలు కనపడతాయి. "వెలగకు వెల్గ యంచు" వగయిరాలు చూచుకోండి. అప్పటి కాలంలో లోకులకు దీనియందు యింత విస్సా కారం లేదు. పండిత వాదాలలో రాజులుకూడా పాల్గొనేవారు. యెవరి వాదం యుక్తమో యెవరివాదం అయుక్తమో తేల్చిగాని విడిచేవారు కారు. అలాగే కాకపోతే "గౌడడిండిమభట్టు కంచుడక్క" పగలగొట్టడం యెందుకు తటస్థిస్తుంది? శ్రీహర్షుని మేనమామ పాదుకలు శ్రీహర్షుని తండ్రి దేవతార్చన పీఠంలోవుంచి పూజించడం యెందుకు వస్తుంది? అప్పటి పండితులు తమకు వోడువచ్చినప్పుడు దాన్ని అంగీకరించి దానికి యేర్పడ్డ అవమానాన్ని బుద్ధిపూర్వకంగా అనుభవించడమే కాని యేదో విధంగా బూకరించి, "క్రిందబడ్డా మీఁదివాఁడనే" అని పరాక్రమించడం వుండేది కాదని యెన్నో యితిహాసాలవల్ల గోచరిస్తుంది. (అలాటివా రున్నూ వున్నా లోకం సాగనిచ్చేది కాదు) దీనికేకాదు, ఆకాలంలో యేదేనా తప్పుచేసి మనుష్యుఁడు స్వయంగా తనదోషాన్ని తాను పరిషత్తుకు విన్నవించుకోవడం వుండేదన్నట్టు కొన్ని ఆధారాలు కనపడతాయి. కాని ఆకాలంలోనేనా అందఱూ అట్టియోగ్యులుగానే వున్నారని తలచకూడదు. పండితులుమాత్రం తమతప్పు అందఱూ స్వయంగానే వొప్పుకొనేవారని చెప్పడానికి వీలుపడదు. కాని రాజులు స్వదేశీయులే కనక మతవిషయక చర్చలతోపాటుగా యీ చర్చలకుకూడా ప్రాధాన్యమిచ్చి నిగ్గుతేల్చేవారని తోస్తుంది. యిప్పు డెంతప్రార్థించినా రాజులు వీట్లలో జోక్యం కలిగించు కోరు. కలిగించుకోవలసివస్తే వీట్లలో పరిజ్ఞానం వున్న తీర్పరులను నియ

మించవలసి వస్తుంది. యితరార్థం నియమితులయినవారు వీట్ల మంచి చెడ్డలు నిర్ణయించడానికి సమర్థులుకారు. "ఆంధ్రభాషా పరిషత్తు" ప్రస్తుత విషయాన్ని ఆమోదించి కొంత పనిచేస్తే బాగా వుండునుగాని ఆపరిషత్తున్నూ కలిగించుకోవడం లేదు. అందుచేత యెవరికి తోచినట్టు వారు (ఆత్మను వంచించి) వ్రాసి మావాదమే న్యాయమనడం తటస్థిస్తూ వుంది. దీనివల్ల సామాన్యులకు చిక్కు కలుగుతుంది. సామాన్యులు "పర ప్రత్యయనేయ బుద్ధులు" కదా? యెవరో ప్రసిద్ధులు చెప్పినమాటల యందు విశ్వాస ముంచుకొని రచన సాగించుకోవలసినవారు. అట్టి ప్రసిద్ధ కవులకు సత్య తత్పరత్వం వుండాలి. అందుకనే అనుకుంటాను, నన్నయ్య భట్టు - "తనకుల బ్రాహ్మణు" అన్న పద్యగీతిలో "నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు" అని వాక్రుచ్చి యున్నాఁడు. కవి అయినవాడికి ప్రాకృతజనులతోపాటుగా స్వార్థ నిర్వహణార్థం అబద్ధాలాఁడేవాఁడుగా వుంటే అట్టి వానివల్ల లోకానికి చాలా నష్టం కలుగుతుంది సుమా అని తెల్పడానికే ఆవిశేషణం వుపయోగించినట్టు కనపడుతుంది. "మత్యమరాధి పాచార్యత్వం" (బుద్ధి బృహస్పతిత్వం) యెంత ఆవశ్యకమో, కవికి నిత్య సత్యవచనత్వంకూడా అంత ఆవశ్యకమే. దీన్ని మనస్సులో పెట్టు కొనియ్యేవే నేను జయంతిలో—

శా. సంగీతానకు నెట్టిదో శ్రుతిలయ జ్ఞానంబు, సత్యంబుము
ఖ్యాంగంబౌ గవనానకట్టులె, అసత్యం బూతగానూని యె
బ్బంగిన్ బద్యము లెన్నిగట్టిన యతి ప్రాసమ్ములున్ ఛందమున్
మ్రింగుంగాని జనాదరంబు నవియేమిన్ మ్రింగలే వెమ్మెయిన్.

అని వ్రాసినాను. అయితే కవితాలూకు ఉల్లేఖాలన్నీ యథార్థాలే అవుతాయా? మనకవిత్వాల మాటాలావుంచుదాం, వ్యాసవాల్మీకాదుల కవిత్వాలలోనే అనుకుందాం, యెన్నో అభూతకల్పనలు కనపడతాయిగదా? యివన్నీ సత్యాలేనా అని స్థూలదృష్టులు శంకిస్తారేమో? అవుల్లేఖాలలో కూడా కొంత సత్యం వుంటుంది. తక్కినభాగం ఆలంకారికం. అసలు కవి

పుద్దేశంకూడా అదంతా సత్యమని విశ్వసించవలసిందని కాదు. క్షీరనీరాలు విడదీసే హంసలాగ విజ్ఞులు ఆ యీ విషయాలు విడదీసి శిష్యులకు బోధిస్తూ వుంటారు. దీన్నిబట్టి కవి అసత్యవచనుఁడు కాడు. నన్నయ్యగారి విశేషణాన్ని (నిత్యసత్యవచను) యీ వుల్లేఖాలు భంగించవు. భంగించేవి వేఱు. వాట్లని వుదాహరించవలసివస్తే గ్రంథం పెరుగుతుంది. అదిన్నీ కాక ఆ సందర్భాలు లోకులందఱూ యెఱిఁగినవే, "నిత్యసత్యవచను" లైన కవుల వాక్కులయందు భగవంతుఁడు తాండవ మాడుచుండును. వారు బుద్ధిపూర్వకంగానే కాదు యాదృచ్ఛికంగా ప్రయోగించిన ప్రయోగం కూడా వొకప్పుడు అమృతమయంగానున్నూ, వేఱొకప్పుడు విషమయంగానున్నూ ఆయా ప్రయోగాలయందువుండే అక్షరాల అర్థాన్ని బట్టి పరిణమిస్తూ వుంటుందన్నందుకు ఎన్నో నిదర్శనాలు కనపడతాయి. పూర్వుల రచనయందువున్న నిదర్శనాలు అందఱూ యెఱిఁగినవే. నవీనుల రచనలలో వున్న నిదర్శనాలు యిక్కడ ప్రసక్తి కలిగింది కనక చూపవలసి వున్నప్పటికీ యెందుకు చూపడం? అలా చూపడం మొదలెడితే స్వంతాలుకూడా కొన్ని చూపవలసి వస్తుంది. దాన్ని కొందఱు హర్షించినా కొందఱు అన్యథాగా భావిస్తారని ఆజోలికి పోలేదు. మొత్తం శాపానుగ్రహదక్షులైన కవులందఱూ "నిత్యసత్యవచనులే" అని నానమ్మకం. బుద్ధిపూర్వకం కాకపోయినా నన్నయ్యగారు కృత్యారంభంలో "భారత భారతీసముద్రము దరియంగ నీదనువిధాతృన కైనను నేరబోలునే!" అన్నవాక్యము నన్నయ్యగారి "నిత్యసత్యవచన" త్వాన్ని వేయినోళ్ళ సమర్థిస్తూవుంది. యేదో అర్థశూన్యంగా పదచ్ఛేదం చేసి అంబరపూరిత శబ్దాన్ని "పరపూరిత శబ్దం" గా మార్చి తద్ద్వారా భారత రచనకు పరపూరితత్వం తటస్థించిందని పరంపరగా వాడుకవున్నమాట సర్వవిదితమే. నాకు యీ "పరపూరిత" త్వానికి కృత్యాదినివున్న సంశయగ్రస్త వాక్యమే (విధాతృనకైనను నేరబోలునే) భవిష్యద్విషయాన్ని బోధిస్తూ వుందేమో అని తోచి కొన్నిమాసాలనాఁడు "నన్నయ్యభట్టు" అనే వ్యాసంలో యీవిషయం

వుటంకించాను. యిది సరియైనదికాదంటూ వొకాయన ఖండిస్తూ యేమేమో వ్రాశారు. ఆ వ్రాఁతసుకూడా చదువరులు కొందఱు చూచేవుంటారు. యిక్కడ వాదంతో ప్రసక్తి లేశమూ కనపడదు. యివన్నీ వూహలు వొకరికి వొకలాగుతోస్తే యింకొకరికి యింకోలాగు తోచవచ్చు. అందు చేత వీట్లకు ఖండన మండనాదులతో పనివుండదని నేననుకుంటాను. యితరవిషయంలో మతభేదాలువున్నా మహాకవులు 'నిత్యసత్య వచను'లుగా వుంటారన్నందుకు మతభేదం వుండదనుకుంటాను. కవులకేకాదు, నిత్య సత్య వచనత్వం అందరికీ అవసరమే. అది వారివారి జన్మాంతర సుకృతంవల్లగాని లభించదు. భగవంతుఁడు సత్యస్వరూపుఁడని చెప్పన క్కఱలేదు. యేదో ప్రసక్తిలో యీసత్యప్రసక్తి వచ్చింది. అసలు విషయం శ్రీ బహుజనపల్లివారి నిఘంటువుకు సంబంధించినది. ఆచార్లవారి పరిశ్ర మాన్ని అభినందించని కవులెక్కడగాని వుండరు, ఆపరిశ్రమ యింతా అంతా అని నిర్ణయించి చెప్పడానికి శక్యంకాదు. ప్రస్తుతం యెన్నో సంవత్సరాల నుంచి, యెందఱో పండితులున్నూ, యెంతోద్రవ్యమున్నూ కలిసినప్పటికీ, యెన్నోగ్రంథాధారాలు వున్నప్పటికీ తేలని నిఘంటుపరిశ్రమను యెఱిఁగిన వారికి ఆచార్లవారి పరిశ్రమ యెంతటిదో గోచరిస్తుందిగాని తదితరులకు గోచరించదు. దీన్ని గుఱించి యిప్పుడువ్రాసినది చాలదు. చాలా వ్రాయాలి. ఓపికవుంటే మఱోమాటు వ్రాయడానికి ప్రయత్నిస్తాను. కాఁబట్టి చదువ రులు దీన్ని సశేషంగానే భావిస్తారని విశ్వసిస్తాను.



## యోచనసాధువా? యోజనసాధువా?

(ది 20—5—1940 సం॥ర త్రిలిఙ్గ నుండి)

అనే విచారం చిరకాలానికి మళ్ళా యిప్పుడు తగిలింది. సుప్రసిద్ధులు మాడభూషివారున్నూ, అల్లంరాజువారున్నూ సుమారు 50 యేళ్ళ క్రితం

దీన్ని (యోచనా శబ్దాన్ని) గుఱించి వివాదపడ్డారు. శబ్దరత్నాకరం ప్రమాణంగా ఆచార్లవారు చూపారు. సుబ్రహ్మణ్యకవిగారు అంగీకరించారుకారు. బహుశః త్యాగరాయలవారి- "యోచనా? కమలలోచనా?" అన్నదికూడా వెంకటాచార్యులవారు చూపినట్లే జ్ఞాపకం గాని సుబ్రహ్మణ్యకవిగారు పదకవిత్వమని చెప్పి తిరస్కరించారని తోస్తుంది. యీ గొడవ ఆనాటి తెలుగుపత్రిక "రాజయోగి" అనే దానిలో పడేది. దాన్ని చదవడంమట్టుకేగాని వారివారి వాదాలలో మంచిచెడ్డలు నిర్ణయించుకునే యోగ్యత నాకప్పటికి అంతగా లేదు. యిటీవల కాస్త జ్ఞానం కలిగాక ఆచార్లవారి ప్రయోగం చకారమధ్యం - 'యోచన' అనేది శబ్దరత్నాకరంలో సంస్కృత పదంగా వుదాహరించినప్పటికీ దానికి – 'యుచ' అనే ధాతువొకటి వుండవలసివస్తుం దనిన్నీ ఆలాటి ధాతువు వున్నట్టు శాస్త్రంవల్లగాని ప్రామాణిక ప్రయోగాలవల్లగాని గోచరించడం లేదనిన్నీ, ఆలోచన శబ్దంలో చకారం వుందికదా? అని ––

"కుంభకర్ణే భకారోఽస్తి....రాభణో నతు రావణః" అన్నట్టుగా 'యోజన' పదాన్ని 'యోచన'గా సామాన్యులు వాడి వుందురనిన్నీ ఆలోచనార్థంలో కూడా జకారమధ్యమే (యోజన అనేదే) సాధువుగాని చకారమధ్యం (యోచన) సాధువు కాదనిన్నీ శబ్దరత్నాకర ప్రయోగం ప్రమాదమూలకం కావచ్చు (ప్రమాదో ధీమతామపి, అపి రేవకారార్థకః) ననిన్నీ నిర్ణయించుకొని మేము సర్వత్రా జకారమధ్యంగానే వాడుచూ వచ్చితిమి. అశ్వమేధంలో వున్న ఆయీ జకారమధ్య ప్రయోగం "యోజించి" అనేది శతఘ్ని ఆక్షేపించింది. రామాభ్యుదయంలో ప్రాసస్థానంలో వున్న అయ్యలరాజు రామభద్రమహాకవి ప్రయోగాన్ని చూపి శతఘ్నిని మందలించింది మా పాశుపతం. (అంతతో ఆ వాదం "భాషామంజరీ సమాప్తా" అయింది) అంతే కాకుండా "శబ్దరత్నాకరం యిప్పట్ల పొరబడినది" అనికూడా వ్రాశాను. దానికి కారణం లేకపోలేదు. "యుచ" ధాతువంటూ వొకటి వుండడమే వస్తే దాని తిఙంతరూపాలున్నూ కృదంతరూపాలున్నూ బోలెడు

సంస్కృత భాషాప్రపంచంలో వుండవలసి వస్తుంది. ఆ రూపాలేవీ శ్రుతం కావడంలేదు. అవన్నీ "యుజ" ధాతువువల్లనే సంస్కృత భాషావేత్తలు నిర్వహించుకుంటూ వున్నట్టు కనపడుతూ వుంది. ఇకనల్లా వ్యావహారికంలో మాత్రం యోచన — యోచించుట, శ్రుతమవుతూ వున్నాయి. యింత మాత్రంచేత యివి సాధువులు కావడం తటస్థింప దనిన్నీ యీకారణంచేతనే సుబ్రహ్మణ్యకవిగారు (ఆధునికకాలపు పెద్దన్న) శంకించడం తటస్థించిం దనిన్నీ మాకు పూర్తిగా తోచింది. నిరంకుశచర్యులున్నూ అభినవపండితరాయలున్నూ సర్వతంత్ర స్వతంత్రులున్నూ అయిన శ్రీ ఆచార్లవారు సమేతూ శ-ర-కంబె యెక్కువ ఆధారం చూపినట్టు లేదుకూడాను. ఆధారం వుంటే వారు చూపకుండా వుండేవారు కారు. "యుజ" ధాతువేకాని "యుచ" ధాతువు ధాతుపాఠంలో లేదాయె. ఆయీ ధాతువు వుండవలసిన ఆవశ్యకత్వ మున్నూ కనపడడం లేదాయె. దీనివల్ల కలిగే ప్రయోజనం "యుజ" ధాతువువల్లనే కలుగుతూ వుందాయె. పైగా యీ 'యోచన' కోసం "యుచ" ధాతువును వొప్పేయెడల 'లోచృ' ధాతువునుండి 'లోకః' వగైరాలు పుట్టినట్లే 'యుచ' ధాతుకృదంతరూపాలు 'యోకః' వగైరాలు పుట్టవలసి వస్తుందాయె. "యోక్త్రం" వగయిరాలకు "యుజ" ధాతువే పనికివస్తుందాయె. అందుచేత సంస్కృతభాషకు దీనితోటి అవసర మేముంటుంది - 'యోచయతి' అనే తిఙంతరూపం కూడా సంస్కృభాషలో వున్నట్టులేదు. యెక్కడేనా అలాటిరూపం కనపడడమంటూ వస్తే విచక్షణులు దాన్ని జకార మధ్యంగా దిద్దివేస్తారు. నాగరలిపిలో దీన్ని గుఱించి పరిశీలనగా నేను చదివి చూడలేదుగాని దానిలోకూడా యిదివుండదని పూర్వోక్తకారణాలచేత స్ఫురిస్తూ వుంది. తెలుగులో ప్రసిద్ధస్థానంలో ప్రామాణికులు జకారమధ్యంగానే ప్రయోగించి వున్నారు. ఆ యీసందర్భాలనుబట్టి చకారఘటిత ప్రయోగం వ్యావహారికంగానే తప్ప గ్రాంథికంగా వుండదనే నిశ్చయమైతే నాకు కలిగింది గాని కలిగినానేను చేదస్తుణ్ణి కావడంచేత అంతమాత్రంతో దీన్ని వదలిపెట్టలేదు. శ-ర-నిఘంటులో సంస్కృతమని వ్రాయడానికి

యేదేనా ఆధారం వుంటుందేమో? అని కనపడ్డ వైయాకరణు లందఱినీ యేమో? "ముఖే ముఖే సరస్వతీ" అన్నారుగదా పెద్దలు అని ప్రశ్నిస్తానే వున్నాను. వూరుకోలేదు. యెవ్వరూ యింతవఱకు యీ ధాతువు వుందనికాని వుండకపోతే భాషకు చిక్కు వస్తుందని కాని చెప్పినవారు కనపడలేదు. అయినప్పటికీ నేనింకా దీన్ని "భజగోవింద" స్మరణతోపాటు స్మరిస్తానే వున్నానన్నందుకు సుమారు నాలుగుమాసాల పాంతాన్ని వ్రాసిన "బహుజనపల్లి" అనే వ్యాసంలో దీన్నిగూర్చి కొంత వుండడమే తార్కాణం. యిది యోచనాశబ్దానికి సంబంధించిన గత చరిత్ర. యిది యీలావుండగా శ్రీ కుప్పా ఆంజనేయశాస్త్రుల్లుగారు యేదో విషయాన్ని పురస్కరించుకొని కొన్ని పద్యాలు వ్రాసి వాట్లని ఆంధ్రి అనే మాసపత్రికకు పంపారు. సంపాదకులు వాట్లని ముద్రించారు. ప్రకటించారు. ఆయనకి ప్రతివారి రచనమీదా యేవో తోచిన రిమార్కు మాటలు వ్రాయడం ఆచారం. ఆఖరికి మంచో? చెడ్డో? అర్థమున్నమాటో? లేనిమాటో? అవసరమైనదో? కానిదో? యేదో వొక వాక్యమేనా వ్రాస్తేనేకాని ఆయనమనస్సుకు సంతుష్టి వుండదు. ఆయీ ఆచారనిర్వహణంలో ఆంజనేయశాస్త్రుల్లుగారి- మన్నించి యోజింపుఁడీ" అనే జకారమధ్య ప్రయోగం "చకారమధ్యంగా సవరిస్తేనే గాని కవికి అభిలషితమైన అర్థంరా" దంటూ వ్యక్తీకరించారు. యీసంపాదకుడు శతఘ్నిని మందలించిన పాశుపతం చూడలేదనుకోవడానికి అవకాశం కనపడడం లేదు. ఆశతఘ్నికర్తలలో నొకడు కీ॥ శే॥ వెంకటరామశాస్త్రి దీని సమర్థనాన్ని యీసంపాదకునకు జీవిత కాలంలో వుపదేశించాడేమో? అనుకుంటే అదీ పొసగడంలేదు. అట్టి సమర్థనమే అతనికి యిటీవల పొడకట్టివుంటే యేపత్రికలోనో యిదివఱకే ప్రచురించేవాడు. బాగా ఆలోచిస్తే యిది ఆంధ్రీసంపాదకునికి స్వతహాగా తోచినదే అయివుంటుంది కాని అన్యం కాదు. వుపేక్షిద్దామంటే పూజ్యులతాలూకు నిర్దుష్టమైన రచనను తెలిసీ తెలియని జ్ఞానంతో నాకు సంబంధించిన బంధువు అవమానిస్తూ వుంటే అతని శ్రేయస్సునుకోరే నేను వూరుకోవడం యుక్తం

కాదని తోచి సంగ్రహంగా ఆయీ శబ్దానికి సంబంధించిన చర్చను ప్రకటి స్తూన్నాను. యెక్కడెక్కడ "యోచన" అని అనవలసి వస్తుందో? "యోచించు" అని అనవలసివస్తుందో? అక్కడక్కడల్లా "యోజన" అనిన్నీ, "యోజించు" అనిన్నీ అనడమే యుక్తమని తాత్పర్యం. 'యుచ' ధాతుసత్తను సమర్థించే వఱకున్నూ యీ నాసిద్ధాంతం ఖండింపబడదు కనుక ఆంజనేయశాస్త్రుల్లుగారి జకారమధ్య ప్రయోగం నిర్దుష్టమే అని నేనభిప్రా యపడుతూన్నాను. గత్వాగత్వా చకారమధ్య ప్రయోగంకూడా నిర్దుష్టమే అని తేలినప్పటికీ ఆంజనేయశాస్త్రుల్లుగారి జకారప్రయోగం సవరించనక్కఱ లేదు. దాన్ని సవరించుకోవలసిన దనడం ప్రమాదమే. మఱిన్నీ "బ్రాహ్మణ బ్రాహ్మణేతర" అన్న సమాసంలో వున్న రేఫద్విత్వ పూర్వక వర్ణలఘు త్వాన్నిగూర్చి ఆక్షేపించిన అక్షరాలుకూడా ఆమోదించతగ్గవి కావు. ఆంజ నేయశాస్త్రుల్లుగారికి భారతకవులేకాక అంతకు చాలాకాలంనాటి శూద్రమహా కవిలోనయిన కవి శిరోమణులు కూడా ఆధారం కనక "కవిత్రయేతరులు క్వాచిత్కంగా" అంటూ చేసిన రిమార్కుకు లేశమున్నూ అర్థమే కనప డడం లేదు.

"అర్థ మనర్థం భావయ నిత్యం....భజగోవిందమ్" ఆయీ రేఫ ద్విత్వపూర్వక లఘుత్వమును ఆక్షేపించే రిమార్కులో "కొందఱేలనో" అనేది శుద్ధతప్పు. ఏల దుత ప్రకృతికము కాదు. "నాకేలింత (ఏల + ఇంత) సేగిం బడన్" అనే తిక్కన్నగారి ప్రయోగమే కాక మఱియుంగల మహా కవుల ప్రయోగాలు చూచుకోదగు. మఱిన్ని 'ఉదాహరించు' అనడానికిబదులు 'ఉదహరించు' అని హ్రస్వం చేసి ప్రయోగించడం కూడా డిటోవంటిదే దాని శరీరం 'ఉద్ + ఆ + హృ' అనికదా? ఆ అనే ఉపసర్గాన్ని తీసివేసే పద్ధతిని 'ఉద్ధరించు' అని కావలసి వస్తుంది. ఇవి అంత గోప్యమైన విష యాలుకావు. ఇట్టి స్వల్పవిషయాలలో పొరబడే వ్యక్తి ఆంజనేయశాస్త్రుల వారివంటి వారికి వంకలు దిద్దడం—అందులోనూ అవసరం లేనిదే పాఠం దిద్దడం సహ్యమైనది కాదని నా తాత్పర్యం. ఈ ఆంధ్రిలో యిట్టివింకను

అనభిజ్ఞతా ప్రయుక్తాలు చాలా కలవు. అవన్నీ చూపడానికి నాకు వోపికలేదు. పూజ్యపూజావ్యతిక్రమం సహ్యం కాదని తెల్పడానికి యింతమాత్రం చాలును. యిట్టివి యీ ఆంధ్రిలోనే కాదు 'ఆంధ్రభాషాపరిషత్పత్రికలో' చిత్రకవి పెద్దనార్యుడు—'ప్రాపున' అని యెత్తుకొని స్వరానికి యతి పెట్టి వున్నాడనిన్నీ అది ప్రమాదమనిన్నీ మఱివొకరు వ్రాసి వున్నారు. "ప్రాపు" సంస్కృతములో వుండే ప్రాపకశబ్దమునుంచి పుట్టిన తద్భవం అంతమందుకొంత లోపించింది కాని అసలు 'ప్ర+ఆప్' అనే ధాతూప సర్గల కూడికలో యేమీ చెక్కు చెదరలేదు. ఆకారణంచేత దాన్ని ఆక్షే పించడం అవిచారమూలకమని నా తాత్పర్యం. ప్రాపులో పుట్టింటి హక్కు వుందన్నమాట యింకా యీ చిత్రకవి పెద్దనార్యునికి సంబం ధించిన నిర్హేతుకాక్షేపణలు పరిషత్పత్రికలో మఱికొన్ని వున్నాయి. విస్తర భీతిచే వాటినిగూర్చి వ్రాయలేదు. ఆంధ్రపత్రికలో ఆకొండి రామ మూర్తిగారు "నాయభిప్రాయము" అని వ్రాసిన చారిత్రకవిషయంలో కొన్ని ప్రమాదములు వున్నాయి. అందులో వకటి ముఖ్యమైనది. అది యేదంటే? "వెంకటరామకృష్ణకవులలో వెంకటరామశాస్త్రి మాత్రమే వెంకటశాస్త్రిగారి శిష్యుడు గాని రామకృష్ణశాస్త్రి వెంకటశాస్త్రిగారివద్ద వొక్క అక్షరమున్నూ చదువనే లేదు అన్నది వాస్తవం" అనేది. అయితే యీమాట వారు తెలియక పొరబడి వ్రాసింది కాని తెలిసి లోకాన్ని వంచించే దురూహతో వ్రాసింది కాదు. వేంకటరామశాస్త్రి చదివినదానిలో యెన్నోవంతున్నూ రామకృష్ణశాస్త్రి వెంకటశాస్త్రిగారియొద్ద చదువలేదు అని వ్రాస్తే బాగుండేది. రామకృష్ణశాస్త్రితండ్రి రామచంద్రశాస్త్రుల్లుగారు వెంకటశాస్త్రివద్దకు కొడుకును తీసికొనివచ్చి శిష్యుడుగా వప్పజెప్పినారు. భారవిలో యేకొన్ని శ్లోకాలో (బాగా జ్ఞాపకం లేదు) చదివినపిమ్మట స్వగ్రామం వెళ్ళి మళ్ళా వచ్చినట్టు లేదు. ఆయీ శుశ్రూష కొన్నిదిన ములు మాత్రమే జరిగింది కనక రామమూర్తిగారికి తెలియకపోవుటచే వా రట్లు వ్రాసి వుందురు. అయినా వారు వ్రాసినది యెవరో వ్రాసిన

అబద్ధాన్ని (వెంకటరామశాస్త్రి వెంకటశాస్త్రిగారియొద్ద నొక్క యక్కర మైనను చదువలేదు అనే ఘోరపు వ్రాతను) పూర్తిగా ఖండించుటకు తోడ్పడుతూ వుంది. వారి వ్రాఁతకు ప్రధానఫలితం అదేకదా? యింకొక వాక్యం రామమూర్తిగారు ఆషామాషీగా చూచీచూడకుండా వ్రాసిందికూడా వుంది. అది శతఘ్నికిన్నీ పాశుపతానికిన్నీ సంబంధించినది కాని ఆయీ రెండు వాదగ్రంథాలున్నూ రామమూర్తిగారు శ్రద్ధగా చదివి వుండరని ఆయనతో చాలా పరిచయం వున్న నేను నిశ్చయించుకున్నాను. కనక ఆ వాక్యం ఉదాహరించి చర్చించ వలసి వుండదు. ప్రధానవిషయంలో రామమూర్తి గారు బాంధవ్యాదులను గణింపక తమపినతల్లికుమారుని శుశ్రూషను తప్పిసీలుగా కాకున్నను దరహంమీద వొప్పుకొన్నట్లయింది. యిందుకు వారిని అభినందిస్తూన్నాను. ప్రస్తుతాసత్యపువ్రాతను కలికాల ప్రయుక్త మనుకొని వింజరపుర బ్రాహ్మణమహాజనులు గీరతంలో వున్న సాక్షిలీస్టును తెల్పే-

"ఇంజరం బొకసాక్షి యేనాము దా సాక్షి

పల్లిపాలెమ్మ తా నెల్ల సాక్షి."

అనే పద్యంలో తమరు మొట్టమొదటనే పేర్కొఁబడడాన్ని గుర్తించి తమ కర్తవ్యాన్ని నెఱవేర్చుకొన్నందుకు వారిని మనఃపూర్వకంగా రామమూర్తిగారితోపాటు అభినందిస్తూన్నాను. ఆయీ గురుత్వశిష్యత్వాల సత్యాసత్యాలు తేల్చుకోవడంవల్ల వచ్చే ఫలితం లేశమున్నూ లేకపోయినా యెవరో? యెందుకో? అసత్య ప్రచారానికి వుపక్రమిస్తే దాన్ని యథేచ్ఛంగా సాగనిచ్చేయెడల లోకంలో సత్యవాదులకు నిలవడానికి చోశే వుండక పోవలసివస్తుందిగదా? అందుచేత చేతనైనంతలో అసత్య ప్రచారాన్ని అడ్డడం సుజనులకు ఆవశ్యకం. సత్యం తెల్పడంవల్ల అశ్వమేధాది మహాక్రతువులవల్ల వచ్చే ఫలితం వస్తుందని భారతం చెపుతూవుఁది ("వెలయంగ నశ్వమేధంబులు." అనుపద్యం చూ.) నన్నుగూర్చి లోకం యేలా చెప్పుకుంటూ వుఁదో? తెలియదుగాని నా వుద్దేశంమాత్రం "బ్రిదుకఁగావలెసత్యవచనుఁడన్ పేరితో బ్రిదికినబ్రిదు కెంతపాటిదైన" (తక్కి-

నవి నాజీవితచరిత్రి ఇటీవలిచర్యలో చూ.) అనియ్యేవే, తనకు అవమానాన్ని ఆపాదించేదేనా సరే అది సత్యమే అయితే కిక్కురుమనకుండా వొప్పుకోవడమే యుక్తమనిన్నీ గౌరవాపాదక మయినదేనా సరే అసత్య మయితే దాని తత్త్వాన్ని తెల్పడమే యుక్తమనిన్నీ నే ననుకుంటాను. వృథాగా యెవరేనా అపవదిస్తే దాన్ని వుపేక్షించ కూడదని సీతామహాదేవి అగ్నికుండప్రవేశం సాక్షమిస్తూవుంది—

ఉ. "నిప్పున దూఁకి లోకజననీమణి సీత స్వవృత్త మీజగం
బొప్పఁగ నప్పు డూరడిలె నూరక యేరికిరాదు కీర్తి ఆ
యొప్పులకుప్ప తక్క మఱియొక్క పతివ్రత చెల్లపిల్ల వెం
కప్పకు నచ్చ దిందలియథార్థము లోక మెఱుంగుఁగావుతన్."

(యిటీవలిచర్య)

ఉ. "సీతయు లేదు రావణునిచెల్లెలు లే దలరాముఁ డబ్ధిలో
సేతువు గట్టలే దతనిచే దివిజారులు చావ లేదు సా
కేతపురంబు లే దచటఁ గేకయపుత్రియు లేదు సర్వము
న్నాతన సృష్టియే యన జనుల్ విని నవ్వుదు రేమొగమ్ముననన్."

(ఇటీవలిచర్య.)

కాలదోషము వలన పైమాదిరి వ్రాతలు బయలుదేఱుచున్నప్పటికీ వెంటనే యథార్థమును వివరించేవారుండడం కొంత లోకకళ్యాణానికి హేతువు కనక సత్యనిర్ధారణానికి తోడ్పడేవారిని అభినందించడం ఆవశ్యకం. ఇది విషయాంతరం. 'యోచన-యోజన' శబ్దాలనుగూర్చి నాజీవితకాలంలో నడిచిన యావత్తుచరిత్రినూ తూ—చా తప్పకుండా సూత్రప్రాయంగా యీ వ్యాసంలో వ్రాశాను. సారం, "యోచన, యోచించుట," గ్రామ్యాలుగాని గ్రాంథికాలు కావనిన్నీ, ఇవి సంస్కృతములో నుంచి రావలసినవి కనక తెలుగు వ్యాకరణంవల్లగాని తెలుగు నిఘంటువల్లగాని సాధిద్దామంటే శక్యం కాదనిన్నీ - "సర్వం ధాతుజమాహ" కనక వీట్లకు

మూలవిరాట్టు ధాతువునుగూర్చి ప్రయత్నించవలసి వుంటుందనిన్నీ నేను నా శాయశక్తులా ప్రయత్నించి చూచానుగాని నాకు వీట్లసాధుత్వానికి ఆధారం కనపడలేదనిన్నీ యిట్టిదాన్ని నమ్ముకొని నిక్షేపంవంటి శ్రీ ఆంజనేయశాస్త్రుల్లుగారి "యోజింపుఁడీ" అనే జకారఘటిత ప్రయోగాన్ని సవరించుకో మనడం ప్రమాద మూలకమనియ్యేవే. శబ్దరత్నాకరంలోవున్న చకారఘటితరూపం గత్వాగత్వా సాధువైనప్పటికీకూడా ఆంజనేయశాస్త్రుల్లుగారి ప్రయోగం సవరించ నక్కఱలేదని ఆ శాస్త్రుల్లుగారికి విన్నవించుకుంటూన్నాను. చిరంజీవి మా సత్యనారాయణశాస్త్రికి "వృథాగా యిట్టి రిమార్కులు పెద్దలనుగూర్చి చేయడం యికనేనా విరమించవలసిందని (లోగడ ఉత్తరంద్వారా తెల్పినమాటే అయినా) సలహా యిచ్చుచున్నాను. నీవుద్దేశం అట్టిదవునో? కాదో? గాని నీవానర్చు రిమార్కులవల్ల నీవు వారికంటె బ్రహ్మాండనాయకుణ్ణి అని లోకానికి తెల్పడానికి యీలాటి రిమార్కులు వ్రాస్తూన్నట్టు లోకులు అభిప్రాయపడుతున్నారు. నేను అసకృదావృత్తిగావినే యీ సలహా యిస్తున్నాను". "గచ్ఛ తాత యథాసుఖమ్" స్వస్తి.

---

# అర్జునుడు

(ది 3-7-1940 సం॥ర ఆంధ్రవీక్లీనుండి)

ఈతణ్ణిగుఱించి భారతంలో వ్యాసులవారు అనేక ఘట్టాలలో చక్కగావివరించి యున్నారు. కవిత్రయంవారేమి, తదితరులేమి, అనువదించడంలో వ్యాసులవారి అభిప్రాయాలకే ప్రాధాన్యం యిచ్చి ప్రవర్తించారు. తిక్కన్నగారేమో యీ పాత్రకు యేదో కొంత స్వకపోల కల్పితాన్నిచేర్చి వన్నెపెట్టివున్నారని యిప్పటి విమర్శకులు కొందఱు వ్రాస్తూ వున్నారు. మఱికొందఱు నన్నయ్యగారి ద్రౌపది, తిక్కన్నగారి ద్రౌపది అంటూ భేదం

కల్పించినట్టే యీవిషయంలోకూడా విడదీసి వ్రాసేవారుంటే వుంటారేమో? నామట్టుకు అనువాదకులందఱూ ప్రధానాంశాలకు మాత్ర కానుసారులేకాని స్వకపోల కల్పకులుకారనియ్యేవే తాత్పర్యం—

యితనిజీవితం యెంతపరిశీలించినా వొడుదుడుకులు లేకుండా యిహ పరవిరుద్ధం కాకుండా నడిచినట్లు కనపడుతుంది. కర్ణునికన్న యితడు బాహుబలంలోగాని, యితరవిషయాల్లోగాని అధికుడు కాకపోయినా దైవ బలంవల్ల అతణ్ణి యితడు జయించగలిగాడు. తల్లినిబట్టి యిద్దరున్నూ కౌంతేయులేకదా; తండ్రినిబట్టి వకరు సూర్యతేజస్సు, రెండవవారు యింద్ర తేజస్సు అందుచేత వీరిలో వీరికి తారతమ్యం వుండవలసిన ప్రసక్తి లేదు. సహజకవచ కుండలాలు వగైరా కొన్ని కర్ణునికే ఆధిక్యాన్ని ఆపాదిస్తాయి. వయిగా యింద్రతేజస్సును మించుతుంది సూర్యతేజస్సు. "అన్నిటికిం బదివేలరెట్లు నీయూతగదా గదాధరా"? అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి సర్వాత్మనా ప్రాపకంగా వుండి యెంతటి దుర్ఘట కార్యాన్నైనా నెఱవేర్పిస్తూ వచ్చాడు. యితని శీలాన్ని పరిశీలించవలసివస్తే తీరా సర్వసంసిద్ధమైన తర్వాత "గురూన్హి హత్వాహి మహానుభావాన్" అనే ఘట్టం వక్కటే తేలును. ద్రోణవధ ఘట్టంలో భీముడు చాలా అనుచితంగా ప్రవర్తించాడు. కాని యితడు అనుము మినుము లేదన్నట్టుగా నిర్విణ్ణుడై స్తబ్ధుడుగా వుండిపోయినాడు. భగవద్గీతలలో స్వామిగురువధకు గూడా శంకించ నక్కఱలేదన్నంతవరకు విశ్వరూపాధ్యాయంలో వారు వారంతా అంతకు ముందే హతమయి వున్నట్టు చూపి వున్నా, అబద్ధమాడి వధించడం అప కీర్తికరంగదా అని, పాపం, అర్జునిడికి చాలా దుఃఖంగావుంది. ధర్మరాజుకి దుఃఖంగావున్నా తప్పనిసరిఅయి అబద్ధమాడివున్నాడు. అర్జునుడు, అను మోదకులలోనికి చేరినట్టయింది. "చత్వారస్సమ భాగినః" కనక యితడు యెంతతప్పించుకొన్నా యితనికికూడా ఆపాపంలో అంతో యింతో భాగం తప్పదు. కొందఱు "గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః" అనే దాన్ని (యీవాక్యం భారతంలోదే ధృష్టద్యుమ్నుడన్నట్టు జ్ఞాపకం) వుదాహరించి

యీవిషయం సమర్థించడానికి ప్రయత్నిస్తారుగాని భారతంలో యీఘట్టంలో యీ శ్లోకాన్ని చూచినట్టు జ్ఞాపకంలేదు. భీష్ముడు పరశురాముణ్ణి జయించే ఘట్టంలోదనికూడా జ్ఞాపకం "ఆతతాయి నమాయాంతమ్" అనేది వకటి వుంది. అది ద్రోణాచార్యులవారి శిరస్సు తెగగొట్టిన ధృష్టద్యుమ్నుణ్ణి అర్జునుడు మందలించే ఘట్టంలో ధృష్టద్యుమ్నుడు చెప్పేజవాబుకు సంబంధించిందని జ్ఞాపకం——

వ్యాసులవారు ఆ యీఘట్టాలు యెంతో సందర్భ శుద్ధిగా చిత్రించి వున్నారుగాని అల్లాటప్పాగా వకరికి దొరుకదేటట్టు చిత్రించలేదు. యెదటి పక్షంలో చిరకాలాన్నుంచి వుండడంచేత ద్రోణాచార్యులు ఆపక్షం తరపున యుద్ధానికి వచ్చారేకాని పైనిచెప్పిన శ్లోకాలలో వుండే అవలక్షణాలేవిన్నీ కనబరచలేదు. అన్నాళ్ళు యుద్ధంచేసినప్పంటికీ వొక్క అస్త్రాన్నికూడా వాడినట్లులేదు. సామాన్యపు వూచలతోనే నేటి కోయదొరలు వేటాడినట్లు ప్రతిపక్షుల బలాన్ని వేటాడినట్లు కనపడుతుంది. అశ్వత్థామ తొందర మనిషి. నారాయణాస్త్రం వగయిరాలు వాడుతూ వచ్చాడు. శత్రుపక్షీయుడనేది వక్కటితప్ప ద్రోణునియందు యితర దుర్దోషా లేవిన్నీ మందుకేనా కనబడవు. ధీరోదాత్త నాయకుడైన అర్జునుడు నిర్దోషిన్నీ గురువున్నూ అయిన ద్రోణుణ్ణి కపటమార్గం అవలంబించి వధించడాన్కి చేసే దురాలోచనలో యేలాపాలుగొంటాడు పాపం? తటస్థుడుగా వుండిపోయాడు. ఆలావున్నా అంతో యింతో అపకీర్తి అర్జునుడికూడా సంఘటించింది. అపకీర్తి అంటే "కామవరపుజీడి" వంటిది. దానికి కొందఱు ప్రాజ్ఞులు సంశయింపరుగాని చాలామంది సంశయిస్తారు. అపకీర్తి కరమైన కార్యాలు చాలావున్నాయి, వాట్లనన్నిటినీ యేకరు పెట్టవలసివస్తే చాలా పెరుగుతుంది.

"మద్యంచ వారవనితాచ ఋతే తరశ్చ
నశ్యంచ చౌర్యమపి చైకకులే బభూవుః"

అని వక సందర్భంలో యేకరుపెట్టి ఉత్తరార్థంలో ఆయీ విషయాలలో ప్రథమ ప్రవేశమే కష్టంగా వుంటుంది. అది కాస్తా జరిగిన

తర్వాత ఆ పరివేశం సర్వతో ముఖంగా పరివర్తింప జేస్తుందని వ్రాసి ఉన్నాను. ఉత్తరార్థం సమయాన్కి జ్ఞప్తికిరాక భావం వ్రాసి చూపాను. ఇందు "ఋతే తరశ్చ" అనేది అబద్ధమాడడాన్ని కొంచెం ఆరంభిస్తే అది ప్రతీ విషయంలోను ఆమనిషిని అబద్ధమాడిస్తూనే వుంటుందన్నందుకు పనికి వస్తుంది. యీ విషయంలో పెద్దపెద్ద మండలాధిపులు కూడా స్వార్థం కోసం మర్యాద నతిక్రమించడమే కనపడుతుంది. అందుకేకాబోలును— "రాజ్యాంతే నరకం ధ్రువమ్" అని అభియుక్తులు వక్కాణించి వున్నారు. అసత్యానికి వెనుదీయని పురుషుడు యేపాపానికిన్నీ వెనుదీయడనే చెప్ప వలసి వస్తుంది. అలంకారాలన్నింటికీ వుపమాలంకారమే వునాదిగా వుంటుంది. అలాగే అసత్యం అన్ని పాపాలకీ పునాది అంటే వప్పుకోని వారుండరు. వ్యభిచారం తప్పెందుకయిందంటే అందులో అంతర్లాపిగా అసత్యం వుంది కనకనే "ధర్మేచ, అర్థేచ, కామేచ ఏషానాఽతి చరితవ్యా" అని పురోహితుడు పెళ్లికొడుకుచేత పిమ్మట అనిపించే వాక్యానికి పునాది వేస్తాడు. తరవాత పెండ్లికూతురు శిరస్సుమీద వుంచినచేయి అలా వుండగానే "నాతిచరామి" అంటూ ప్రమాణికం చేస్తాడు. పెళ్లికొడుకు యీలా ప్రమాణికంచేసి దీన్ని అతిక్రమించడం పేరే వ్యభిచారం అంటారు. దీన్ని మేము లక్షణాపరిణయంలో యీలా చమత్కరించాం,

"ఉ. నాతిచరామి యన్న వచనార్థ మెఱుంగునొ లేదొ అమ్మరా
 రాతి పఠించి యచ్చెలిశిరమ్మున హస్తము పెట్టె బిట్టుపే్రి
 మాతిశయమ్మునన్ గురువరానుమతిన్ బదియారు వేలపై
 చేతులదక్కు కాంతల ద్యజింప దలంచెనొ లక్షణార్థమై"

వేదములు అపౌరుషేయములే అయినా భగవత్ప్రణీతములే అన్నట్టు చాలాచోట్ల తెలుతుంది. అవి భగవంతుణ్ణి నిర్బంధింపజాలవు, భగవంతుడు "కర్తుమకర్తు మన్యథాకర్తుం సమర్థుడు" అతని పరివర్తన మనకు కొన్ని యెడల ననుసరణీయమే అయినను కొన్ని సందర్భాలలోకాదు. దీన్ని

గుఱించి యింత మాత్రమే వ్రాస్తేచాలదు. అవకాశం కలిగితే వోపిక వుంటే మఱివకప్పుడు ముచ్చటించుకొందాం.

అర్జునుడు అసత్యానికి బొత్తిగా వొడఁబడేవాడు కాదన్నది మనకు ప్రస్తుతం, అర్జునుడేకాడు నలుగురిలో తలెత్తుకుని జీవిద్దామనే యేపురుషుడు గాని, యేస్త్రీగాని, అసత్యమంటే దూరంగానే వుండాలనుకొంటారు. కాని కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనబడే అంతశ్శత్రువర్గం ఆరిటిలో నున్నూ తుట్టతుదనువున్న మాత్సర్యం (పట్టుదల) అనేది కాటికికాళ్ళు చాచుకొన్న స్థితిలోకూడా కొందఱిని వదలక పట్టుకొని పీడిస్తుంది. స్వకార్యాన్ని సాధించేటందుకోసం యీ మాత్సర్యం కొన్ని అకార్యాలు చేయిస్తుంది. ఆ అకార్యాలలో అబద్ధమాడించడంకూడా చేరుతుంది. ధర్మరాజుయేదో మహాకార్యం సాధించవలసి వచ్చింది. దానికి ద్రోణాచార్యులు అడ్డం తగిలారు. ఆయన్ని వధించవలసివస్తే అసత్య మాడడంతప్ప గత్యంతరం లేకపోయింది. అయినప్పటికీ అబద్ధమాడడానికి చొరవచేయ లేకపోయాడు. అట్టి సందర్భంలో సర్వ ధర్మ స్వరూపుడైన భగవంతుడు ప్రోత్సహించి ఆ కాస్తా పలికించాడు. యీపని వార్ధక్యంలో చేసిందికాదు ధర్మరాజు. వార్ధక్యంలోవున్న భీష్మ ద్రోణులు ముక్కుకు సూటిగా ప్రవర్తించి భౌతిక శరీరాన్ని యుద్ధరంగంలో త్యజించి అక్షితమైన కీర్తి శరీరాన్ని సంపాదించుకొన్నారు. పండితులకూ కవులకూ ధర్మరాజుకన్నా భీష్మ ద్రోణులే అనుసరణీయులు. అట్టి స్థితిలో అకించిత్కరమైన స్వల్ప విషయాలకుకూడా పండితులు అసత్య వాదములకు దిగకూడదు. (విశేష విషయాలు కొన్ని వున్నాయి. అవి అన్యత్రచూడదగు) తద్ద్వారా తమ ప్రతిపక్షులను జయించగలిగినా అది కీర్తి శరీరాన్ని కళంకితం చేసేదికావడంచేత అభినందనీయంగా వుండదు.

క్షత్రియులలో క్వాచిత్కంగా సాత్త్వికులు లేకపోలేరుగాని వారికది మాత్రం ప్రధానగుణంకాదు. అదే విధంగా బ్రాహ్మలలో రాజసులున్నా వుంటారుగాని వారికి సత్త్వం ప్రధానం. యెంత పరిశీలించినా సత్త్వగుణానికి

వున్న మంచి యితర గుణాలలో వున్నట్టులేదు. "యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చయః" అని గీతలో చెప్పబడ్డ లక్షణము సాత్త్వికులకే ఘటిస్తుందిగాని యితరులకు జన్మశతానికిగూడా సంఘటించదు. తమోగుణాన్ని గురించి వ్రాయనక్కరేలేదు. అంత పాపిష్ఠిగుణమంటూలేనేలేదు. దానితో చేరితే ప్రతీదీ చండాలమై పోతుంది. చూడండి. భక్తి మంచిదికాదని యెవరూ అనరుగదా? అట్టి మంచి వస్తువుగూడా తమోగుణంతో చేరితే యెందుకూ పనికిరాక అధోగతికి కారణంగా పరిణమిస్తుంది. రావణ కుంభకర్ణాదులభక్తి తామసంకావడంచేతనే కదా? వాళ్ళకే కాక అదిలోకానిక్కూడా అనర్ధకారణంగా పరిణమించింది. అయితే అసలు తమోగుణం అంటూ వుండకుండానే దేహయాత్ర నడుపుకోవడానికి శక్యమవుతుందా అని కొందఱు ప్రశ్నిస్తారేమో? వాతపిత్తశ్లేష్మాలవలెనే సత్త్వరజస్తమోగుణాలున్నూ ప్రతివ్యక్తినీ అంటి వుంటాయి. యెవరు సత్త్వగుణానికి ప్రాధాన్యంయిచ్చి వర్తిస్తారో వారిని సాత్త్వికులంటారు. అలాగే తక్కిన రజస్తమో గుణాలకున్నూ చూచుకోవాలి. విష్ణువు త్రిమూర్తులలో సాత్త్వికుడవడంచేతనే ఆయన భక్తులుగూడా సాత్త్వికులే అవుతారు. శివుడు తామసుడని గ్రంధాలే వప్పుకొంటాయి. అందుచేత ఆయన్ని పూజించే భక్తులలో అందఱూ కాకపోయినా చాలామంది తామసులుగానే వుంటారు ధ్రువుడు మొదలైన వారినిన్నీ రావణుడు మొదలైనవాళ్ళనిన్నీ క్రమంగా పైనివుదాహరించిన రెండు సందర్భాలకూ వుదాహరణంగా చూచుకోవాలి. అసలు తమోగుణ ప్రకృతికలవారికి అది యెప్పుడూ బాధిస్తూనే వుంటుంది. రాముడు శ్రీమన్నారాయణమూర్తి అవతారమే అనిన్నీ సీత సాక్షాత్తూ మహాలక్ష్మీ స్వరూపమే అనిన్నీ రావణాసురుడు వప్పుకొంటూ కూడా తమోగుణ ప్రధానుడవడంచేతనే సర్వసంసిద్ధమైన సమయంలో తనకు నీతిచెప్పిన మండోదరికి తన మాత్సర్యాన్ని ప్రకటిస్తూ జవాబిచ్చివున్నాడు.

చ. ఎఱిగి యెఱింగి మున్నతడె యెగ్గొనరించినదానికై కదా
 చెఱగొని వచ్చితిన్ బిదప సీత వృధాకధ లింకనేల? చె

చ్చెఱబ్రిదుకింత తీయనె ? ఖరాదుల చావునకేమి గానినీ
మఱదలి బన్నమేపగిది మానిని యీగుదు సంధి చేసినన్.

రావణుడు పండితుడుకాడని యెవరేని చెప్పగలరా ? భక్తుడుకాడన గలరా ? అయితేనేమి ? రాముడు తనకు మహోపకారం చేయడంవల్ల మనస్సు అంత్యకాలమందుకూడా మాత్సర్యానికి వశమై మంచిత్రోవకు రానివ్వించిదికాదనుకోవాలి. అతడు తన సోదరిని అవమానించడానికి తగినంత హేతువుందికాని లేకపోలేదు. యీసంగతి రావణుడు తెలియనివాడు కాడు. అయితేనేమి ? నేను యింత గొప్పవాణ్ణికదా ? నాసోదరి తప్పుపనులు చేస్తేమాత్రం మానవమాత్రుడు అవమానిస్తాడా అనే మాత్సర్యం అతణ్ణి పట్టుకుపీడించి తుట్టతుదకేంచేయాలో దాన్ని చేసికాని మిరమించలేదు——

సాక్షాద్భగవద్విషయంలోకూడా యీమాత్సర్యం వదలనప్పుడు యితరుల విషయంలో చెప్పేదేమిటి ? అందుచేత అరిషడ్వర్గం అంతాదుష్టమే అయినా తుట్టతుదనువున్న మాత్సర్యం తుట్టతుదకాలంలోగూడ వదలనిదవడంచేత మఱీ చెడ్డదనుకోవాలి. దీన్ని జయించిన పురుషులు లేనేలేరంటారు కాని నామట్టుకు అర్జునుడు యీమాత్సర్యాన్ని జయించిన మహాపురుషుడుగా కనబడతాడు. యెంతో అపకారం చేసిన దుర్యోధనాదులు యుద్ధానికి తయారై వచ్చి సర్వ సంసిద్ధంగా నిలిచి వున్నప్పుడు "భైక్ష్యమపేహలోకే" అంటూ వెనుతీయడానికి మొదలెట్టిన పురుషుడికి మాత్సర్యమంటూ వుందని యెవరనుకుంటారు ? అనేకులు మహాశూరులు ప్రపంచకంలో వున్నప్పటికీ యితనికి వచ్చిన పేరు ప్రతిష్ఠలు యితరులకు రాలేదు. "పార్థఏవ ధనుర్ధరః"

"వేయునేటికి నల పాండవేయుబోలు
వీరుడికలేడు ప్రతి రఘు వీరుడొకడు"

అన్యాయమంటే అర్జునుడెప్పుడూ వెనుదీయడమే కనపడుతుంది. భూరిశ్రవస్సు చేయితెగ్గొట్టడం విషయమై అర్జునుడెంతో తటపటాయించాడు.

తప్పని విధికావడంచేత తుదకి చేయడమైతే చేశాడుగాని అప్పుడు భూరి శ్రివస్సు తన్ను నిందించిన సందర్భంలో యెంతో కుంగిపోయి మాట్లా డాడు. కాని ధైర్యంగా మాట్లాడలేకపోయాడు. యించుమించు తన తప్పిదాన్ని తాను స్వయంగా వొప్పుకొన్నట్టే ఆఘట్టం పరిశీలిస్తే తేలుతుంది. నిజమైన శూరుల లక్షణం అలాగేవుంటుంది. అంతేకాని తప్పుచేసి కూడా దాన్నే సమర్థించడానికి శూరు లెన్నడూ ప్రయత్నించినట్టు కనపడదు.

కర్ణవధ విషయంలో అర్జునుడు కొంత శూరధర్మ దూరంగా ప్రవర్తించినట్టు కనపడుతుందిగాని బాగా ఆలోచిస్తే ఆవిషయం సమన్వయమౌతుంది. అతని రథచక్రం కుంగుటకేదో శాపం కారణంగదా? అది యెంత అవకాశమిచ్చి నిరీక్షించినప్పటికీ కుంగుతూనే వుంటుంది. ఆపద్ధతిని కర్ణవధ జరగడానికి వీలే లేకపోవలసి వస్తుంది. అందుచేత యీవిషయంఆక్షేపణీయం కాదనుకొంటాను. (కొందరు చదరంగ మాడుతూ యెత్తులేనప్పుడు 'ఆలోచిస్తున్నానువుండు' అంటూ అనడంకలదు. అది యెప్పటికీ తేలదు.)

ప ర స్ప ర జయార్థులుగావుండి పోరాడుతూవున్నప్పుడు గూడా అర్జునుడు ద్రోణాచార్యులయెడల యెంత గౌరవ మర్యాదలు చూపాలో అంతవఱకున్నూ చూపుతూనే వుండేవాడు. భీముడు మాత్రం కొంచెం అన్యథాగా ప్రవర్తించేవాడు. అందుచేతనే అర్జునునికంటె యెన్నిరెట్లో బాహుబలంలో అధికుడైనా భీముడికి అర్జునుడికి వచ్చినంత యశస్సు రాలేదు. అర్జునుని కన్నాగూడా కర్ణుడు కొన్ని గుణాలలో పూర్తిగా హెచ్చు. సత్యవాక్య తత్పరత్వంలో కర్ణుణ్ణి వేలెట్టి చూపడానికి అవకాశమేలేదు. కుంతికిచ్చినవరాన్ని అతడు పాలించికదా ధర్మరాజాదులు నలుగురున్నూ చేజిక్కినా వదలిపెట్టవలసివచ్చింది. దుర్యోధనుడియందు అతనికివున్న అభిమానానికి అంతూ పొంతూ లేదుగదా? అట్టి సందర్భంలో యేఅకార్యాన్నైనా సరే చేసి అతనికి జయాన్ని సంపాదించవలసివుంది. అట్టివిషయంలో న్యాయంగా వచ్చిన జయాన్నే పరిత్యజించాడు. యెందుచేత ? తల్లికిచ్చిన వాగ్దానం దాటినట్టవుతుందనియ్యేవే.——

"జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక!
మాటతిరుగలేరు మానధనులు"

యితడు మొట్టమొదటినుంచీ ప్రభు సమాదరంచేత పైకి రావడం తటస్థించడంవల్ల మహారాజ కుటుంబానికి చెందినవాడే అయినా ప్రభుభక్తి పారీణుడనే ప్రతిష్ఠకే అధికారి కావలసి వచ్చింది. లేకపోతే అర్జునుఁడితణ్ణి జయించినప్పంటికీ గుణగణాలలో యితనికి మించినవాడనే పేరు మాత్రం రావడానికి అవకాశం లేనేలేకపోయేది. యిప్పుడు దూరదర్శుల దృష్టిలో గుణగణనా సందర్భంలో కర్ణుడికే అగ్రస్థానం వస్తుందికాని స్థూలదృష్టులు సర్వానికీ అర్జునుడే అగ్రగణ్యుడని చెపుతూ వుంటారు. ఒక రేమిటి, కుంతీ సంతానం ముగ్గురున్నూ కాదు. నలుగురున్నూ, మాద్రిసంతానం యిద్దఱున్నూ, వెరశి ఆఱుగురున్నూ గుణాలలో వొకరికొకరు తీసిపోయే వారు కానేకారు. భీముడు కొంచెం తొందరమనిషి. ధర్మరాజు చాలా శాంతుడు. కర్ణుఁడుకూడా శాంతుడే. కాని అతడవలంబించిన పక్షము దురాలోచనా భూయిష్ఠ మవడంచేత అతణ్ణి "దుష్టచతుష్టయం" లో చేర్చి మాట్లాడుతారు పౌరాణికులు, నకులసహదేవులుకూడా చాలా వారపారలెఱి గినవారే, వీరందఱికన్నా అర్జునుడు చాలా దూరాలోచన కలవాడుగా కన పడుతాడు. దానికి ముఖ్యంగా యుద్ధారంభంలో అతనికి కలిగిన వైమన స్యాన్నే మనం తీసుకోవచ్చును. కాని యింతటి దూరదర్శి, వివేకి, శాంతుడు ధర్మరాజుమీద కత్తిదూసి దూకబోవడం ఆశ్చర్యాన్ని కలి గిస్తుంది. ధర్మరాజు తన ధనుస్సు కృష్ణమూర్తి చేతికిమ్మనడం వ్యాజంగా భారతంలోవుంది. వుండనివ్వండి గాని దాన్ని సమర్థించడానికి అది చాలదనే నేననుకొంటాను.

దీనివల్ల యెంతటి మహానుభావులైనప్పటికీ వొకప్పుడు తమోగుణం వ్యతిరేకించి అకార్యకరణానికి పురికొల్పుతూ వుంటుందనుకోవలసి వస్తుంది. ఆయీ విషయాలలో అనేకులు అనేక విధాలుగా అభిప్రాయ పడుతూ వుంటారు. అందుచేత యిదే సిద్ధాంతమని మాత్రం అనడానికి వీలులేదు.

"ప్రమాణానా మనే కత్వేఽపి ప్రమేయస్యైకత్వాత్" అన్న వాక్యానుసారం భారత పాత్రలలో మంచిచెడ్డలు పరిశీలించేవారిలో వూహాపోహాలు భిన్న భిన్నంగా వుంటూ వుంటాయి. దుర్యోధనుడుకూడా పాండవుల విషయంలో తప్ప యితర విషయాలలో దుర్మార్గుడుగా వర్తించినట్టు భారతంలో యెక్కడా కనపడదు. ఆకారణంచేతనే అనుకొంటాను. భారవి మహాకవి అతని రాజ్యపాలనా విషయాన్ని చాలా అనుకూలంగా వర్ణించి వున్నాడు. "....రిపౌ సుతేఽపివా నిహన్తి దండేన స ధర్మవిప్లవమ్"

ఇత్యాదివాక్యాలు పైసందర్భాన్ని బోధిస్తాయి. చిల్లరమనుష్యుల విషయం గ్రహింఛాలదాకా రాదు. శారదా బిల్లునాలుకలు కోస్తూవున్న ప్పటికీ యెందఱోదాన్ని లక్ష్య పెట్టక బాల్యవివాహాలు చేస్తూనే వున్నారు. వాళ్ళమీద యెవరూ కేసుపెట్టినట్టేలేదు. చూడండీ కాస్త నామరూపాలు కలవాఁడెవడేనా బాల్యవివాహం చేస్తే యేమవుతుందోను? అలాగే యోగ్యాయోగ్య విచారం అనేది కాస్త నామరూపాలుకల చరిత్ర పురుషులకేకాని తదితరులకు, అనఁగా "తాటియాకుల చెడుచెత్తముక్కలకు" అనే తరగతిలో వాళ్ళకు యెన్నడూ సంబంధించదు. అట్టి చరిత్ర పురుషులక్కూడా యావజ్జీవితమున్నూ పరీక్షా కాలంగా వుండదు. ఏవో వకటి రెండు ఘట్టాలుమాత్రమే పరీక్షా కాలాలుగా తటస్థిస్తాయి. ఆఘట్టాలలోనే వారివారి పేరుప్రతిష్ఠలకు భంగం కాకుండా వాళ్ళు ప్రయత్నించవలసి వుంటుంది. అలా ప్రవర్తించడం చేతనే బలిచక్రవర్తి వగయిరాలపేరు వుపమాన స్థానంలో శాశ్వతంగా నిలిచిపోయింది. తన రాజ్యానికి భంగంవస్తూ వుందిగదా అని శుక్రాచార్యులమాటవిని బలి అసత్యానికి ఆలాయపడేటట్టయితే బలిపేరు పదదయిపోయేది. రాజ్యమేనా నిలిచేదేమో అంటే, అది అంతకుమునుపే పోయేది. సర్వసమర్థుడు భగవఁతుడు పట్టుపట్టినప్పుడు యింకో మార్గంచేత రాజ్యాన్ని అపహరిస్తాడు. యీమార్గమే కావాలా యేమిటి? చరిత్ర పురుషులకు బలి మంచిమార్గం చూపించాడు. కాని ఆమార్గాన్ని అనుసరించే వ్యక్తులు చాలా మృగ్యంగా వుంటారు. అరిషడ్వర్గం అపమార్గంలోకి

దింపుతూవుంటే సరియైన మార్గాన్ని నిలవడం యెవరికోగాని శక్యంగాదు. అందులో మాత్సర్యాన్నిగుఱించి కొంత వ్రాశాను. కాని అన్నీ ఆలాటివే. లోభగుణంకూడా దాన్ని తీసిపోయేదిగాదు.

"ఇడుఁ మనుధర్మశాస్త్రకథ లిన్నియు మిధ్యలుకూడు మాత్రమున్
గుడుచుట దుర్వ్యయంబుకొడుకుంబగవాఁడడుగంగఁ జూచుచో"

అంటూ యీ లోభగుణాన్ని కవికర్ణరసాయనంలో వర్ణించి వున్నాడు. లోభమనేది తనసొమ్మును తాను కాపాడుకోవడంతో తృప్తి పడితే అంతనింద్యం కాదనుకోవచ్చునుగాని అంతతో అది శాంతించదు. ఇతరుల ధనధాన్యాదులు తనవిగా చేసుకోవడానిక్కూడా లోభం ప్రోద్బలం చేస్తుంది. ఆయీ గుణాలను గూర్చి యెంతవ్రాసినా తేలదు. ప్రపంచకంలో వీట్లవల్లనే రాజులు యెన్నో డిపార్టుమెంటులు యేర్పాటుచేసి లోకసంరక్షణ చేయవలసివచ్చిందిగాని, ఆ డిపార్టుమెంటులో నియమింపబడే వ్యక్తులు కూడా ఆయీ అరిషడ్వర్గానికి లోఁబడే వారవడంచేత తుదకు అదిన్నీ చేయతగ్గంత వుపకారం చేయలేకపోతూవుంది.

యీలాటి ప్రపంచకంలో నిషధయోగ్యుడెవడేనా వుంటే వాడు మానమర్యాదలు కాపాడు కోవడానికి వుపాయమేమిటి అనే ప్రశ్నకు జవాబు చెప్పడం చాలకష్టం. కాని వాఁడి.యోగ్యతను భంగించేవాళ్లు లోకంలో యెందఱువున్నా; ఔదాసీన్యమనే గుణం వాడి దగ్గఱవుంటే ఆ యోగ్యతకు నలితొలీ యెన్నటికీ కలగదు.

అర్జునుఁడు ఔదాసీన్యాన్ని అవలంబించే కీర్తిపరుఁడై యిప్పటికీ వెలుఁగుతూవున్నాఁడా అంటే,యీవిషయం రాజసులకుగాదు. సాత్త్వికులకు మాత్రమే. అర్జునుఁడు జాత్యారజోగుణ ప్రధానుఁడు కాకతప్పదు. అట్టి వాఁడికి సర్వవిధాలా యేదో ప్రవృత్తితోటే అవసరం గలుగుతూ వుంటుంది. కాని ముక్కుమూసుకొని వుదాసీనుఁడుగా వుండడం అసంభవం. యిట్టి

చిక్కు అనుల్లంఘనీయమైనది వున్నప్పటికీ ఆప్రవృత్తిలో న్యాయమార్గావలంబిగా ప్రవర్తించి పేరు తెచ్చుకొన్నాఁడనుకోవాలి.

వ్రాస్తే చాలా వ్రాయాలి. యిప్పటికి యింతటితో దీనికి స్వస్తి చెపుతాను. మొత్తం యేమాత్రం ప్రాజ్ఞతవున్నా ఆ మనిషి "ఈవేళన్ మృతియేని రేపటికిరెండు" అనే అభియుక్తోక్తిని మనస్సులో పెట్టుకొని అనృతానికి భయపడి వర్తించడం యుక్తమనేదే అర్జున చరిత్రవల్ల గోచరించే పర్యవసానం. స్వస్తి.

---

# ఆంధ్రీకరణవిధానం

( ది 16—10—1940 ఆంధ్ర వీక్లీ నుండి )

దీన్నిగూర్చి ప్రాచీనకవులలో యెవరోతప్ప యెఱుఁగనివారు లేనేలేరు. యీ కాలంలోనో? యెఱిఁగినవారు లేనేలేరనుకోవడానికి చాలా ఆధారాలు కనపడతాయి. యేదో తనంతటతానుగా యేసంస్కృత గ్రంథాన్నో, లేక మఱి యేయితరగ్రంథాన్నో ఆంధ్రంలోకో మఱి యేయితర భాషలోకో తర్జుమా చేసుకునే కవికి అంత చిక్కులేదుగాని ఆ గ్రంథం యేరాజుకో కృతిగా రచించేదే అయితే "దేవుఁడిపెళ్లికి అంతా పెద్దలే" అన్నట్టు ఆ సంస్థానానికి సంబంధించిన ప్రతి అక్షరాస్యుఁడికీ సమాధానం చెప్పవలసి వస్తుంది. యీసందర్భంలో మేము చాలా కష్టాలే అనుభవించాం. యిప్పటికీ అవి అంతరించనేలేదు.

విషయమేమో మహావిషయం. పృచ్ఛకులలో పలువురు దీన్నిగూర్చి బొత్తిగా తెలియనివారుగా వుంటారు. యేదో "బరువైతోఁచు కుటుంబ రక్షణకు" సంపాదనార్థం వెళ్లినకవి వారివారి నందఱినీ మంచిచేసుకుంటే గాని కృతార్థుఁడుకావడం దుర్ఘటం, యితరులమాటలాగైనా అక్కడవుండే

కవిపండితులనేనా సమాధానపరచాలా, వద్దా? అయితే కవితారసజ్ఞత్వంలో కవులకన్నా, పండితులకన్నా యితరులలోనే మృదుహృదయులు వుంటారు. నామధారి బ్రాహ్మణులన్నట్టుగా వుండే కవినామధారులకు యేరసమూ గోచరింపదు. (యీమాట అఘోరప్రమాణంచేసికూడా చెప్పవచ్చును.) సరికదా, పోనీ, అట్టివారు యేదో గంభీరంగా వింటూ వూరుకుంటారా! ఊహూ! వూరుకుంటే తమగొప్పదనానికి లోపం వస్తుందని శంకలకు ఆరంభిస్తారు. ఆ శంకలేలావుంటాయో మాదిరికి వకటికి చూపుతాను —

క. "కృష్ణాగోదాంతర్వ
ర్ధిష్ణు మహీవలయనిలయురిపుజన విలయున్
వైష్ణవ పదసేవారో
చిష్ణుమతిన్ సోమభూపచిర సుకృతతతిన్"

యీపద్యం ఆంధ్రీకరణంకాదు. స్వతంత్రమే. ఆంధ్రీకరిస్తూవున్న శ్రీనివాస విలాసమనే పుస్తకానికి సంబంధించిన పీఠికలోనిది. యీపద్యం విని వొక పండితుఁడు శంకిస్తాఁడుగదా ?—

ఆ శంకసౌడభ్యాన్ని చూడండీ! రాజుగారి రాజ్యం కొంత కృష్ణానదీ లోనున్నూ మఱికొంత గోదావరీనదిలోనున్నూ కలిసిపోవలసి వస్తుందఁట! చూచారా! ఆపండితుఁడిగారి సహృదయత్వం, యేలా వెలుగుతూవుందో! ఆలాటివారిని మందలించడంలో నాకు మంచిచొరవే వుందిగాని, మందలిస్తే రాజుగారి మనస్సుకు నొప్పిగా వుంటుందేమో? అకారణంచేత ఆ పనికి పూనుకోక మెల్లిగా సమాధాన పరచడానికే ప్రారంభించి "అయ్యా! తమ శంకకు యీ స్థలంలో అవకాశంలేదు. "వర్ధిష్ణు" అనే విశేషణంవల్ల రాజుగారి రాజ్యానికి ఆనదిలోనూ, యీనదిలోనూ కొన్ని లంకలుపెరిగియున్నామ్ జాస్తీ అవుతుందనే మంచిఅర్థమే స్ఫురిస్తుందనేటప్పటికి, ఆయన కొంత మంచివాఁడవడంచేత అంతతో ఆగి "స్వామీ, యేదో శిష్యులం, మతో లాగనుకోకండి" అంటూ వినయంగా మాట్లాడడానికి మొదలుపెట్టడం

జరిగింది. దానిమీఁద వూరుకోక నేనన్నానుగదా ? అయ్యా ! శిష్యులే కానక్కఱలేదు. గురువులలోకూడా యీలాటి శంకలు చేసేవారు క్వాచిత్కంగా వుంటారుగాని బొత్తిగా వుండకపోరు. గ్రంథకర్త యెవరేది అడిగినా తోఁచిన సమాధానం చెప్పవలసిందేగాని శిష్యులనీ, గురువులనీ భేదంతో ఆవశ్యకత్వా నావశ్యకత్వాలు కల్పించుకోవడానికి అవకాశం వుండదని జవాబుచెప్పి. "శిష్యులలోఅనేకులు సహృదయులున్నూ వుంటారు గురువులలో అనేకులు విహృదయులూ వుంటారు. మీయంతటమీరు లేని శిష్యత్వాన్ని కల్పించుకున్నారు గనక నేను దాన్ని పురస్కరించుకొని యీవుపదేశాన్ని మీకుఅందిస్తూ వున్నాను. శిష్యులు రాజసభలలో శుశ్రూష చేసివిద్యాభివృద్ధి చేసుకోవడం అప్రసిద్ధం కనక తాము మేమున్న బసలోకి దయచేసి మీమీసందేహాలు తీర్చుకుంటే బాగుంటుందేమో !" అన్నాను. రాజుగారు నవ్వి వూరుకున్నారు. ఆ కవిపండితుఁడున్నూ అంతతో శాంతించాఁడు.

అలాటి సభలలో నడచిన యీలాటిశంకలనుగూర్చి వ్రాయవలసివస్తే వ్యాసం త్వరలో తెమలదు. యెన్నోవున్నాయి. ఆయీచొప్పదంటు శంకలకు సంబంధించినదే "కేవలవైదికుల్ మఱియు" అనే కొండవీఁటి చేంతాఁడు, దాన్ని నానారాజ సందర్శనంలో చూసుకోండి.

అప్పుడేమిటి యిప్పుడేమిటి, అలాటి బుద్ధిమదగ్రగణ్యులు వుంటూనే వుంటారు. "తేభ్యోమహద్భ్యోనమః"

వాకాయన "శ్రీగోవింద పదారవింద" అని నేను పద్యం చెపితే శంకించారుకదా ! "ఓహో ! శ్రీ గోవిందా అయిపోతుంది. (అనగా నశించిపోతుందన్నమాట)"అంటూ దురర్థంతీశారు. దాన్నివిని వకాయన'యేమండీ! యీలాటిశంకలు చేయవచ్చునా ! అని ప్రశ్నించాఁడు. దానిమీఁద వారించి నేనన్నానుగదా ! "అయ్యా ! యిది యిప్పుడేపుట్టలేదు, పూర్వమూ వుండేది. వసుచరిత్రలో "శ్రీభూపుత్రి వివాహవేళ"అనే మంగళపద్యం చదువుతూ

వుండగా తెనాలిరామలింగం తన అఱచేతిలో కొంత వెలిబూడిద పోసుకొని శ్రీ—భూ "అని గట్టిగా వూదేప్పటికి ఆబూడిద యెగిరిపోయిందనిన్నీ దానిమీఁద రాజుగారిని వుద్దేశించి అయ్యా ! మీసంపత్తు (శ్రీశబ్దవాచ్యం) యిదేమాదిరిని "భూస్వాహా" అవుతుంది. తరవాత తమచిత్తం అన్నాఁడనిన్నీ యింకాయేమో జరిగిందనిన్నీ చెప్పుకోవడంవుంది. రామలింగమున్నూ రామరాజభూషణుఁడున్నూ సమకాలీనులు కారనేపద్ధతిని యిది సర్వాబద్ధంగా కొట్టివేయవలసి వస్తుంది. ఆలా అనుకోవడం యెందుకు ! యెన్నో కథలు పరంపరగా, రామలింగానికిన్నీ రామరాజభూషణుఁడికిన్నీ సంబంధించినవి కర్ణతాడితంగా వినఁబడుతున్నాయి. వాట్లలో యింతకన్నా కాలవ్యత్యాసంగల కథ వొకటి కనపడుతుంది. ఆకథ యీ పద్యానికి సంబంధించినది.

"ఆ. వె. అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగ విభుని పదగుంఫనమ్మును
కాకమానురాయ నీకతగుర ?"

ఈపద్యం రామలింగం భట్టుమూర్తిమీఁద చెప్పినట్టున్నూ దానితో భట్టుమూర్తి వుబ్బి తబ్బిబ్బై గతదినమందు శ్రీకృష్ణరాయలవారు తనకు బహుమతీగా యిచ్చిన ముత్యాలహారాన్నో రత్నాలహారాన్నో తనమెడ నుంచి తీసి రామలింగఁడి మెడలో వేసినట్టున్నూ, తరవాత రామలింగం ఆ హారాన్ని ధరించి సభలోకి వచ్చేటప్పటికి రాజాగారు చూచి మనం భట్టుమూర్తికి బహుమానంగా యిచ్చిన హారం యితనికేలా వచ్చిందని సంశయించి రామలింగాన్ని "యిదినీకేలా వచ్చిం" దని ప్రశ్నించారనిన్నీ, రామలింగం నేను పద్యంచెప్పి సంపాదించుకున్నానని జవాబు చెప్పేటప్పటికి "యేదీఆపద్యం" అని రాయలవారు ప్రశ్నించేటప్పటికి పద్యం చదివి, అర్థం చెప్పడఁలో నాలుగోచరణంలోవున్న సంబోధన "కాకమానురాయ" అనే దానికి కాక + మాను + రాయ, అని మూడు పదాలుగా విడదీసి పైని చెప్పిన గుణాలు నీకవిత్వమందు లేశమున్నూ

లేవుగాని నీకల్లా చేతనైనది వ్రాక్కమాను'' (స్తంభం) రాయడంమాత్రమే చేత నవుతుందిగాని యింకేమిన్నీ చేతగాదని అర్థం చెప్పేటప్పటికి రాయలు "మానురాయడ మేమిటి" అని ప్రశ్నించాఁడనిన్నీ ప్రశ్నిస్తే "మహాప్రభూ? " యితనివీపుమీఁద తామర వుండడంచేత యీ కచ్చేరీస్తంభాన్ని పెట్టి తఱుచుగా యీతఁడు రాసుకుంటూ వుండడం దేవరవారు చూడలేదనుకుంటాను.'' అని జవాబు చెప్పేటప్పటికి అందఱూ నవ్వుకున్నారనిన్నీ, అంతరార్థాన్ని గుఱుతించకుండా మోసపడ్డందుకు భట్టుమూర్తి సిగ్గుపడ్డాఁడనిన్నీ వకగాథ చెప్పుకుంటారు. (ఉదారాశయుఁడైన రాయల సభలో యిట్టి నీచపు ప్రసంగం జరగడం అసంభవం) యీపద్యం కాకమానుమూర్తి కవి విరచితమైన పాంచాలీ పరిణయంలోదిగాని, రామలింగంగాని, పేఱొకరుగాని, భట్టుమూర్తిమీఁదగాని, మఱివొకరి మీఁదగాని చెప్పింది గాదు. కాకమానురాయడనేపేరు భట్టుమూర్తికి సమన్వయించడం పొసగదు. మూర్తిపదసామ్యాన్ని పురస్కరించుకొని యెవరో "బోడితలకీ మోకాలికీ" ముడిపెట్టినట్టు స్పష్టమౌతూ వుంది. పాంచాలీపరిణయకర్తకూ రామలింగానికీ అంతా యింతా కాదు కాలవ్యత్యాసం చాలావుంది.

వక్తవ్యాంశం, యీలాటి తెలివితక్కువ శంకలు చేసేవాళ్లు ఆకాలంలోనేకాదు యేకాలంలోనూ వుంటారు కాని — '' ఒకనికవిత్వమందెనయు నొప్పులు దప్పులు '' అని గర్జించి నెగ్గించుకొన్న మహాబుద్ధిశాలి రామలింగానికి దీన్ని అంటగట్టడం కేవలం అవిచారమూలక మనేదియ్యేదే. '' భూ '' అనే అక్షరం నోటినిండా పలికితేనే వెలిబూడిద యెగరనక్కఱ లేదు. శ్రీఅనే అక్షరాన్ని నోటినిండా వుచ్చరించినా అఱచేతిలోవున్న బూడిద యెగిరిపోతుంది.

(శ్రీలో వుండే శవర్ణం శ్వాస ప్రయత్నవత్తు) ఆపద్ధతిని సర్వకవులు న్నూ గ్రంథాదిని నిశ్శంకగా వాడుకుంటూవున్న శ్రీకారానికి ప్రచారమే లేకపోవలసి వస్తుందని భట్టుమూర్తి జవాబుచెప్పి రామలింగానికి వాగ్బంధం చేయకుండా వుంటాఁడని చెప్పడానికి యెవఁడికేనా సాహసం

వుంటుందా ? కనక కాలవ్యత్యాసాన్ని పట్టి చూచినా యీ కథలలో ప్రధాన పాత్రగా రామలింగం వుండడానికి నామనస్సు వొప్పుకోవడం లేదు. అసలు కథ మాత్రం అబద్ధమై వుండదన్నంత మట్టుకూ నేనూ విశ్వసస్తాను. యేసామాన్యుఁడో యిటీవలి కాలంలో యీ వెఱ్ఱిమొఱ్ఱి ప్రసంగం చేసివుంటే వుంటాడు. ఆవ్యక్తి వ్యక్తిత్వం యెంతలో వుంటుందంటే— ఒకవేశ్య సభలో చక్కఁగా గానంచేసే టప్పటికి విని, వొకానొక లఘుహృదయుఁడు - లేదా వెకిలి, "భగవంతుఁడు దీనికి పీకిచ్చాఁడు" అంటూ తన స్వల్పగుణాన్ని బయటపెట్టుకునే టప్పటికి ఆపె మళ్ళా నోరెత్తకుండా జవాబు చెప్పినట్టున్నూ, అంతతో కుక్కఁనపేనులాఁగ వూరుకున్నట్టున్నూ లోకంలో చెప్పుకోవడం అందఱూ యెఱిఁగిందేకనక యిక్కఁడ ఆప్రసంగం కొంతమోటుగా వుంటుందని వుదాహరించక స్పృశించి విడిచాను. "అనుక్తమన్యతో గ్రాహ్యం"

యీలాటి పుక్కఁటి పురాణాలు నాకుతెలిసినవి చాలా వున్నాయి. వాట్లనన్నిటినీ యెత్తుకు వ్రాయడమంటూ వస్తే ప్రధానాంశం తేలదు. మొత్తం సారమేమిటంటే — యీలాటి వెఱ్ఱిమొఱ్ఱి శంకలు చేసేవారికి తప్పకుండా అవమానం ఘటించితీరుతుందనియ్యేవే. కాని వొకవిశేషం మాత్రం గమనించవలసి వుంటుంది. అవమానాన్ని వారు గణించక దులపరించుకుని మామూలుపంథాగానే ప్రవర్తించడం సర్వత్రా కాకపోయినా క్వాచిత్కఁంగా అనుభూతమే కనక విస్తరించేది లేదు.

యిటీవల కవులలో యీలాటి వెఱ్ఱిమొఱ్ఱి శంకలు చేయడానికి పిండిప్రోలి లక్ష్మణకవిగారిని మొనగాఁడుగా చెప్పుకుంటారు. ఆయన కొన్ని సందర్భాలలో శిష్టు కృష్ణమూర్తిగారివల్ల అవమానపడ్డట్టున్నూ వినికి వుంది. అడిదం సూరకవి యీలాటి సందర్భంలోనే రేకపల్లె సోమకవిచేత అవమానం పొందినట్టు వింటాము. ఆ యీ విషయం ప్రసిద్ధమే కనక స్పృశించి విడిచాను.

భవతు. ఆంధ్రానువాదాన్నిగూర్చి పెట్టుకున్న వ్యాసంలో యీ అవాంతరాలకి యింతకన్న చోటివ్వడానికి అవకాశం లేదు. కాఁబట్టి ప్రధానాన్ని అందుకుంటాను. యింకో కుశ్శంక కూడా యీలాటిదే చూపి మఱీ అందుకుంటాను ప్రధానాంశాన్ని. వొకపద్యంలో

"......................సుధర్మామధ్యమందున్ జయం
తకుమారున్ దొడఁదాల్చి యొప్పు దివిషన్నాధుండు నా సంతతా
ధికబాభాసి సభాంతరాళ విలసత్సింహాసనాసీనుఁడై."

అని రాజుగారు కొమారుణ్ణి తొడమీఁద కూర్చుండఁబెట్టుకొని కొలువు తీర్చిన సందర్భాన్నిగూర్చి వుల్లేఖించేటప్పటికి సంస్థానపండితులలో ప్రధానపండితుడైతే యేమీ శంకించలేదుగాని ఆయనతండ్రిగారు చాలా వృద్ధులు (ఈయనకూడా పండితులే కాని కొడుకంత పండితులు మాత్రం కారు) కుయుక్తి చేస్తేనే కాని వీళ్ళరోగం కుదరదని ఆలోచించి రాజుగారిని సంబోధించి "మహాప్రభూ! యీవేళ వచ్చి యేదో ప్రాప్త మున్నంతా గుంజుకొని రేపు దులపరించుకొని 'యేఋదాఁటితే తెప్ప' సామెతగా! పోయేవాళ్ళ కేమి, యేలాగేనా చెపుతారు. సతతమూ మీక్షేమాన్ని కోరుతూ, మీద్రవ్యం తినదలఁచినవాళ్ళం యీపద్యంలోవున్న మహాదోషాన్ని యీసభలో మీ సన్నిధానంలో యేలా మనవి చేసేది? వేదపురుషుఁడు యేమన్నాఁడో చిత్తగించారా - 'నాఽశ్లీలం కీర్తయేత్' అన్నాఁడు. అందుచేత యీపద్యాన్ని గ్రంథంలోన్నుంచి తక్షణం తీయించి వేయించా" లంటూ వుపన్యసించడానికి వుపక్రమించేటప్పటికి నాకు పరమాశ్చర్యం కలిగింది. ఆయన యెత్తిన యెత్తు చాలా దురూహమైనది. యేదోశబ్దాన్నీ, అర్థాన్నీ గుఱించే అయితే గ్రంథాధారం చూపి సమర్థించుకోవచ్చునేమో కాని యిదేమిటి, సంస్థానాధీశ్వరుఁడు గచ్చగొట్టే దురర్థం యీపద్యంలో వుందని సహస్రమాసజీవి చెపుతూ వుంటే దాన్ని కాదని సమర్థించడం యేలాగ? దిక్కుమాలిన అసూయ పుట్టకేపోవాలిగాని అది పుట్టడమంటూ వస్తే సహస్రమాసాలూ గిహస్రమాసాలూ దానివల్ల పుట్టే

ఆయీ వికారాలను వారింపఁ గలుగుతాయా ? "ఏసుఖంబు సహస్రిమాను జీవికిఁ గల్గునన్నృత ప్రచారియే యయ్యేనేని" భవతు. సుఖం కలక్క- పోతేమాత్రం అలవాటుపడ్డ మనిషి అనృతప్రచారానికి జంకడమంటూ వుంటుందా ? అది సర్వకల్ల. ఆ సభలో చెప్పరాదనే మిషమీఁద ఆయన చెప్పకపోవడంచేత ఆయనముఖతః ఆదురర్థాన్ని మేము వినకపోయి నప్పటికీ దానిస్వరూపం యీలా వుంటుంది కాఁబోలు నని వూహించు కున్నాం. యేలాటిదంటే - "యీలోకంలో సుఖంగా జీవించివున్న రాజు నిన్నీ, కొడుకునిన్నీ జీవితానంతరం వెళ్ళవలసిన స్వర్గంలో వున్న దేవేం ద్రుఁడుతోటీ, అతనికొడుకు జయంతుఁడితోటీ పోల్చడంకంటే రాజుగారికి హాని కల్గించే దేముంటుంది ?" అని ఆపాదించఁబోతాఁడని తెలుసుకోఁ గలిగాం. వెఱ్ఱివాఁడు గాని ఆబ్రాహ్మఁడు, యింతమాత్రంచేత రాజుగారు పరిశీలించకుండా దీనివల్ల హానికలుగుతుం దని విశ్వసిస్తారా ? ఆ పద్ధతిని వసు మను చరిత్రాదులలో వుండే బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులతో పోల్చిన పోలికలవల్ల ఆ యా రాజుల కేలాటి హాని కలిగిం దని పూర్వకాలచరిత్ర పరిశీలించుకోకుండానే వుంటారా ? అయితే రాజులలో అంతటి పరిశీలన గల్గినవారు అరుదుగా వుంటారనే మాటమాత్రం యథార్థం. అందుచేత వారివద్ద వుండే పండితులు కొన్ని చిత్రవిచిత్రాలు స్వార్థనిర్వహణార్థం చేస్తూవుంటారు.

మాకాలంలో అనుభూత మయిన వొక శుద్ధ వైదికచిత్రం యిక్కడ చూపుతాను. నిషధయోగ్యుఁడైన వక జమీందారుగారు దేవీనవరాత్రి పూజకు సంకల్పించుకొన్నారు. వారి యెస్టేటుకు సంబంధించిన వూళ్ళోనే వక పండితుఁడు - సాహిత్య ప్రవేశం స్వల్పంగాని, శ్రౌత స్మార్తాలలో చాలా ఘట్టివాఁడు - వుంటే ఆయన్ని ఆహ్వానించి ఆయనవల్ల దాని అను క్రమణిక యావత్తున్నూ తెలుసుకోవడంలో "మధుమాంసాదులున్నూ, స్త్రీసంబంధమున్నూ వదలిపెట్టవలసి వుంటుం" దని చెపుతూ "తుట్టతుది సందర్భం బొత్తిగా లేకుండావుండడం మహాభోగులయిన తమవంటివారికి

కష్టసాధ్య మవుతుందేమో? అపక్షంలో జనానా అయితే దోషంగాని రాజదాసీ దేవదాసీలయితే అంత దోషం లే" దని చెప్పడం జరిగింది. (యీ చెప్పడంలో యెంత పరిశీలించినా స్వార్థనిర్వహణమున్నూ గోచరించదు). యేవో కొన్నిరోజులు పూజాపురస్కారాలు జరిగినతరువాత సంపాదనార్థంగా మేము ఆ సంస్థానానికి అదే క్రొత్తగా వెళ్ళడం తటస్థించింది. అప్పుడు ఆ ఛాందసుఁడు సప్రియత్నంగా మాదగ్గిఱకి వచ్చి "అయ్యా: నేను జమీందారుగారితో తెలిసో తెలియకో యీలా మనవి చేసివున్నాను ఫలానా విషయంలోను. బహుశః యీ ప్రసక్తి తమతో వారు ముచ్చటించరుగాని ముచ్చటిస్తేమాత్రం నామర్యాద కాపాడవలసిందని మిమ్మల్ని అభ్యర్థిస్తాను" అంటూ భయపడుతూ భయపడుతూ చెప్పడానికి మొదలుపెట్టేటప్పటికి మాకు చాలాఆశ్చర్యం కలిగింది. ఆబ్రాహ్మఁడు చేసిన పని చెడుపని కనక ఆయన ఆలా భయపడవలసి వచ్చిందిగాని ఆ జమీందారు ఆ విషయంలో మమ్మల్ని అడగాలేదు నుడగా లేదు.

చెప్పొచ్చే దేమిటంటే - సంస్థానాలలో సర్వత్రా కాకపోయినా అక్కడక్కడ యీలాటి కుహకులు వుండి యితరత్రనుండి వచ్చిన పండితులకు పీడ కలిగించడం కలదు. క్రొత్తగా వెళ్ళినవాళ్ళు ఆ గంపచిక్కులోన్నుంచి యివతలికి వచ్చేటప్పటికీ బ్రహ్మాండా బ్రహ్మంగా పరిణమిస్తుంది. యేమంటారా? యెగఁదీస్తే బ్రహ్మహత్య. దిగఁ దీస్తే గోహత్యగానూ వుంటాయి కొన్ని. తత్తథాస్తామ్.

చూడండీ, ఆబ్రాహ్మఁడు విద్వాంసుఁడు కాఁడనుకుందామా? విద్వాంసుఁడేకదా! వయస్సుచేత చిన్నవాఁ డనుకుందామా? సహస్రమాసాలున్నూ అతిక్రమించా యాయె. అతిక్రమించనే లేదనుకుందాం. యింకా యేకొంచెమో తరవాయి వుంటేమాత్రం ఆత్మవంచనకు లోనై దోషం లేని పద్యంలో దోషం వుందని బుద్ధిపూర్వకంగా అపలపించడం కంటె యింకో నరకహేతు వేముంటుంది? అప్పు డాచిక్కు యేలా తప్పతుందిరా, భగవంతుడా అని మేము చాలా తహతహ పడవలసి

వచ్చిందిగాని రాజుగారు స్వయంగా ప్రాజ్ఞులవడంచేత యేచిక్కూ లేకుండా తేలిపోయింది. యేదోవిధంగా శతృవిజయాన్నే అభిలషించేవారి చేష్టలు యింకా యెన్నో మాకు అనుభవంలో వున్నవి వున్నాయి. వాట్లని గూర్చి మతొకప్పుడు, వోపికవుంటే, ప్రస్తావించుకుందాం.

ఆంధ్రీకరణాన్నిగూర్చే యిక మాట్లాడుకుందాం - ఒకశ్లోకంలో నాలుగోచరణంలో "దిశతు సజ్జయార్య శ్శియమ్" అనివున్నది. "సజ్జయార్యవరుఁడు సిరుల దయచేసి మమ్ము రక్షించుఁగాక" అని దాన్ని మేము తెలిఁగించాము. మూలానికి ముక్కకిముక్కగా అర్థం చెప్పవలసివస్తే "సజ్జయార్యః=సజ్జయాచార్యుఁడు (ఈయన గ్రంథకర్త అయిన శ్రీ వసుదుర్గం కృష్ణమాచార్యకవివరేణ్యునకుఁ బరమ పూజ్యుఁడున్నూ, బంధుసముద్రుఁడున్నూ అని యెఱుఁగఁ దగు), శ్రియమ్=సంపదను, దిశతు = ఇచ్చుఁగాక." 'ఎవరికి' అని అకాంక్షించుకొని తన్ను మాలినధర్మం వుండదుగనక 'తనకు' అనే అర్థం యిచ్చే పదం సంస్కృతంలో అధ్యాహృత మవుతుంది. యీక మేము తెలిఁగించిన దానిలో "శ్రియమ్" అనే యేకవచనానికి "సిరులు" అని బహువచనం పడడమున్నూ, "రక్షించుఁగాక" అనేది మూలంలో లేకుండానే పడడమున్నూ మిడిమిడిజ్ఞానులకు శంకల కవకాశాన్ని కలిగిస్తాయి కాని వారికి ముందుగానే అట్టి అవకాశం లేకుండా పీఠికలో ఆంధ్రీకరణమంటే యేమిటో, పూర్వులు యీవిషయంలో యేలా ప్రవర్తించారో తెల్పుడు చేయడంచేత వా రేమీ శంకించకుండానే వూరుకున్నారు. ముందటికాళ్ళకు బందాలుగా వ్రాసిన పద్యాలు చాలా వున్నాయి. వాట్లలోనుంచి యిక్కడ యేకొంచెమో యెత్తి చూపుతాను. తక్కినవి శ్రీనివాసవిలాస పీఠికలో చదువుకోండి.

(తెలిఁగించడమంటే మూలంలోవున్న ప్రతీపదానికీ తెలుగుపదం వచ్చేటట్టు చేయడమే అనుకోవడంకంటే అవ్యక్తత వేరేవుండదు. ఒక్కొక్క భాషకు ఒక్కొక్కరకమైన మర్యాద లుంటాయి. తూచాలు

తప్పక తెనిగించడం పెట్టుకొంటే ఈ భాషామర్యాదలు మంటగలిసి పోతాయి. విమర్శకుఁడు విషయం మనస్సులో పెట్టుకుని విమర్శన సాగించవలెను. ఇందుకు గట్టిపాండిత్యమే కాకుండా సరసమైన హృదయం కూడా వుండవలెను.)

ఉ. "ఒక్కెడ జక్కనౌపదము నొక్కట జేర్చిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్నఁదున్నయటు లుంచి రచించిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్నదాన సగముంచిన మేలగుఁ దెల్గొనర్చుచో
మక్కికిమక్కి యన్నటులు మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగున్ ?"

యిందులో మొదటిచరణంలో వున్న అంశం యేమిటి ? యేదో పదం సంస్కృతంలో లేకపోయినా స్వతంత్రించి ప్రకృతానికి అనుకూలించేదైతే అనువాదకుఁడు చేర్చుకోవడానికి యేవిధమైన అభ్యంతరం లేదనియ్యేవే. దానికి వుదాహరణం "రక్షించుగాక" అనే ఆశీరర్థక క్రియాపదమే అని తెలుసుకోండి — యిక రెండోచరణంలోవున్న "ఉన్న దున్నయటు లుంచి రచించిన ముచ్చటౌ" అనేదానికి వుదాహరణం చూపుతాను—

తే. మృదుళమగుగాక కఠినమై యొసఁగుగాక ?
సరసమగు పద్యము ముదంబొసంగు మదికి
రసికుడగువాని కొక యధరంబె మోద
మిడునె, కుచయుగమది మోద మిడకయున్నె"

యీపద్య మేశ్లోకమున కనువాదమో ? దాన్నికూడా చూపితేనే కాని దానికి ట్రాన్స్లేషనో కాదో తెలుసుకోవడానికి వీలు చిక్కదు. శ్లోకం యిదుగో—

శ్లో. "మృదుళంవా కఠినంవా
సరసంచే త్పద్య మాదధాతిముదమ్
రసికస్యా ధరదళమివ
కుచయుగ మపికిం నమోద మావహతి"

సహృదయులైన విమర్శకులు యీ శ్లోకానికి ఆపద్యం సరియైన అనువాదమని నిర్వివాదంగా వొప్పుకుంటారు. అన్యులో, మూలశ్లోకంలో లేనిదే "మదికిన్" అని అనువాదంలో యెందుకు వుండాలనిన్నీ మూలంలో వున్న "చేత్" అనేదానికి అనువాదంలో ప్రతిపదం యేంపడ్డదనిన్నీ శంకించడానికి మొదలుపెడతారు. అట్టివారు యేవో యతిప్రాసలు కూర్చడం మట్టుకు చేతనైనవారే అయినా అంతమాత్రమే కాదు - అనగా కేవల కవులుమాత్రమే కాదు విద్వత్కవులే అయినా, లేదా మహావిద్వత్కవులే అయినా వారిని వ్యక్తిగతంగా లోకం ఆదరిస్తే ఆదరిస్తుందేమో గాని కవితారసజ్ఞులనే హేతువుతోవారిని ఆదరించదు. విద్వత్తలేనివారిమాట ఆలావుంచుదాం. విద్వత్తవుండిన్నీ అట్టివారు లోకాదరణకు పాత్రులు కారన్నమాటకు లోకం అంగీకరిస్తుందా అంటే యీమాట నాస్వకపోల కల్పితమనుకున్నారా ? యీశ్లోకార్థం అవగతంచేసుకుని మరీమాట్లాడండి-

శ్లో. యత్సారస్వతవైభవం గురుకృపా పీయూషపాకోద్భవం
తల్లభ్యం కవినైవనైవహఠతః పాఠప్రతిష్ఠాజుషా
కాసారే దివసం వసన్నపి పయఃపూరం పరంపంకిలం
కుర్వాణః కమలాకరస్య లభతే కిం సౌరభం సైరిభః.

యీ శ్లోకరచననుఁబట్టి కవి యెంతవాఁడో విజ్ఞులు గుఱుతిస్తారు. యితఁడు "నాన్‌బ్రామిన్" కవి, దేవబ్రాహ్మణు లనఁబడే దేవాంగ కులస్థుడని - అనాదిగాఁ జెప్పికొనుచున్నారు. యితఁడు కవితాసారస్యము గుఱుతింపజాలని "ఘటత్వా త్పటత్వా" తెగలో జమకాదగ్గ వ్యాఖ్యాతలను పద్మసరస్సులో మునిఁగితేలుతూ వుండిన్నీ అందలి తామరపువ్వుల పరిమళాన్ని యేమాత్రమున్నూ ఆస్వాదింపనేరని సైరిభా (దున్నపోతు) లుగా పరిగణించాఁడు. అబ్బా ! మహానుభావులైన విద్వాంసులను ఎవరో దేవాంగి యింతమాటంటాఁడా ! అని నాకున్నూ యిబ్బందిగానే వుంది. వుంటేమాత్రం యేమిచేయగలను ? విద్వాంసులనే ఆకువిందుఁడు యింత మాటన్నాడే. యిక అవిద్వాంసులైతే అతఁడేలా గౌరవిస్తాఁడో ?

యీసందర్భం తెలుసుకోవడానికి అవకాశం లేదు. అది మహాకవి భోజ మహారాజుగారి ప్రభుత్వకాలం. ఆకాలంలో అవిద్వాంసులుకూడా విద్యా వేషం వేసుకొని విద్వాంసులను అవమానించడానికి తగ్గ కాలం కాదుగనక అవిద్వద్బాధ ఆకువిందునికి తగలనే లేదనుకుని అతనికి తగిలిన బాధకే అతని శ్లోకార్థాన్ని సమన్వయించుకోవడం యుక్తంగా వుంటుందను కుంటాను. విద్వత్తవేఱు, కవితా రసజ్ఞత వేఱు అని చెప్పనక్కఱలేదు. శ్రీనాథుఁడిగారి "విద్వాంసుల్ రాజమహేంద్రి పట్టణమునన్" అనే పద్యాన్నిబట్టి చూస్తే అప్పటికింకా అవిద్వాంసులపీడ విద్వత్కవులకు రాజమహేంద్రివర ప్రాంతంలో సోకలేదనే తేలుతుంది. ప్రబోధలో వున్న యీశ్లోకం కాళిదాసుదని చెపుతారు——

"కల్వారైః పరికల్పితే వ లలితామాలా కవేర్భారతీ
శుష్కాణాం పరిపీడనం నసహతే శాస్త్రేషు ఖిన్నాత్మనామ్
శృంగారైకరసే మనోభవరణే సీమంతినీ నిర్దయీ
ప్రఖ్యాతేతికథం సహేత వికృతం శార్దూల విక్రీడితమ్"

కాళిదాసునాఁటికి విద్వత్కవులకు అవిద్వత్కవులవల్ల పీడలేదని చెప్పవలసే వుండదు. కాళిదాసు భోజునినాఁటి వాఁడే అయితే ఆకువిందుఁ డున్నూ అప్పటివాఁడే కనక యిద్దఱున్నూ వకరోజుల్లో వుండేవారే. అప్పుడు విమర్శనాలు చేసినట్టు గ్రంథదృష్టాంతాలు కనపడమేలేదు. పండితరాయలకున్నూ, అప్పయ్యదీక్షితులకున్నూ వుండే మనస్పర్థలనుఁబట్టి దీక్షితులవారి చిత్రమీమాంసను ఖండిస్తూ పండితరాయలు విమర్శనా వ్యాజంతో కొంత దూషించి వున్నాఁడు. అలాటి ద్వేషాన్నిఁబట్టే భట్టోజీ దీక్షితుల మనోరమా వ్యాఖ్యానాన్నిన్నీ ఖండిస్తూ మనోరమా కుచమర్దన మనే పేరుతో వొక విమర్శన గ్రంథం రచించాఁడు, పండితరాయలు. ఆఖండన యుక్తమో, కాదో గాని దానికి పెట్టినపేరువల్ల పండితరాయల కడుపుమంట పూర్తిగా బయలు పడుతూవుంది. ఇతణ్ణి భట్టోజీ బహిష్క రించడమే విరోధకారణం అని చెపుతారు. సభలలో ముఖాముఖీని వాదించు

కోవడాలేగాని ఆకాలంలో వ్రాసి ప్రచురించడానికి యిప్పటిలాగ పత్రికలు మొదలైన సౌకర్యాలు లేకపోవడంచేత విమర్శనాలు లభ్యం కావడంలేదు. యెవరికేనా యెవరిమీఁదేనా కోపంవుండి యేదో విమర్శపేరు పెట్టి వ్రాస్తే మాత్రం అది యితరులు వ్యాప్తిలోకి తేవలసివస్తే ఆరోజుల్లో యెంత కష్టం. అందుచేత ఆబాపతు రికార్డు యిప్పుడు మనకు దొరకదు. అంత మాత్రంచేత అప్పుడు యిప్పటి లాగు దుర్విమర్శకులు లేనేలేరనుకోవడం పొసగదు. పత్రికలున్న యీరోజుల్లోకూడా యేపత్రికోతప్ప వ్యక్తిదూషకుల వ్యాసాలు ప్రచురించక పోవడం అనుభూతంగా కనపడుతూనేవుంది.

యేదో మధ్య అవాంతరంగా వచ్చిపడి ప్రధానాంశం మఱుగు పడింది. విద్వాంసులై వుండిన్నీ కవితారసజ్ఞత్వం లేక వృథాగా రసాభాసుగా వివదించేవారిని గూర్చి "భూసురవర్యులారా!" అనియెత్తుకొని గద్వాల శతావధాన సభలో కొంత చర్చించి వున్నాము. అందులో తుట్టతుది మాటలు వుదాహరించి ప్రధానాంశం అందుకుంటాను —

"భాసురరీతి నొక్కఁడు ప్రబంధము చేసిన దద్రసంబు నెం
తోసరసమ్ముగా గొనుబుధుల్ పచరించిన పుణ్యమన్యమే
వేసరి కొందఱన్న బదివేలు పఠించినగాని కబ్బముల్
చేసినగాని సత్కవులు సెప్పినపద్యములన్ రసంబు పే
రానగ్రహింపలేక తమయజ్ఞత బైటికి బెట్టుచాడ్పునన్
దోసములేని పద్యముల దోసము లున్నవటంచు బల్కుచున్,
దోసములున్న పద్యముల దోసములేదని సంతసింపుచున్
హాసము చేసినంత సరియౌనె! మహాకవితా వివేచనా
భ్యాసమనంగ నంత పయిపైఁ బడియున్నదె; అద్దియున్ జను
ర్వాసనయేసుడీ! అదియు వారలు వారలు సేయుభాగ్యమున్
జేసిలభించునట్టి పరిశీలన గల్గిన వారికేము వే
యేసి నమస్కృతుల్ సలిపి యెంతయు భక్తి నుతింపకుందుమే?"

(నానారాజ సందర్శనం)

కవితారచనకంటే విమర్శించి నిగ్గుతేల్చడానికి చాలా పాండిత్యమే కాకుండా మంచి సరసమైన హృదయంకూడా వుండాలి. అందుచేత కవి కంటేకూడా విమర్శకుఁడే అగ్రగణ్యుఁడనవలసివచ్చినా ఆలా అనేది లేదుగాని, విమర్శకులు యీమర్యాద యెఱిఁగి మఱీ ప్రవర్తిస్తే బాగుంటుందని అంటాను. ఉభయశక్తులూ కలవాళ్లు యేకాలంలోనూకూడా మృగ్యులే అనుకుంటాను. యింకొకటి యెంతనిశితమైన పాండిత్యం వున్న విమర్శకుఁడైనా సరే యెక్కడో వకచోట గోతులోగూలి అపహాస్యాస్పదుఁడు కాకతప్పదని పండితరాయలు అప్పయ్య దీక్షితుల వారి "పురతః" అనే శబ్దాన్ని ఆక్షేపించి పొందిన పరాభవాన్నిఁ బట్టి మనం తెలుసుకోవచ్చును. అట్టి "కోఽన్యస్తిధన్యోమదన్యః" అన్న రాయలకే ఆగతి అనివార్యమైనప్పుడు అస్మదాదుల విషయం చెప్పనక్కఱలేదు. అందులో దురుద్దేశంతో వెక్కిరింపుల కుపక్రమించే వారి పరాభవానికి అంతూ పొంతూ వుండనేవుండదు. అందుచేత యెవరినిగాని విమర్శించడానికి పెట్టుకోవడం అభిమానశాలికి మంచిది కాదని నా తాత్పర్యం.

యిక ఆపద్యంలో మూఁడోచరణంలో వున్న "ఉన్నదాన సగముంచిన మేలగు" అన్నదానికి వుదాహరణం చూపుతాను. యిదివఱకిచ్చిన ఉదాహరణాలు అంతగా శంకించతగ్గవి కావు. యెందుచేతనంటే, యేదో క్రొత్తపదం యేవకటో సందర్భానుసారంగా చేర్చుకోవడాన్నిఁ బట్టి కదా మొదట వుదాహరించింది. రెండోదో వున్నదున్నట్టుగా తెలిగించడానికి చూపడమే ఆయె. యిందుకు యితరుల దిచ్చినా వొకటే, మా దిచ్చినా వకటే, యిప్పు డిచ్చేదో? ఉన్నదానిలో సగానికి లోపం చెప్పికూడా కవిలోకాన్ని మెప్పించడం జరగాలి. అందుచేత గొడ్డలిపెట్టు మాదిరి కవి రచనాన్ని వుదాహరిస్తాను.

"చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనమ్ములు మాకు బూవుబోడి"

శ్రీనాథుఁడు నైషధం తెలిగిస్తూ సంస్కృతంకన్నా మిన్నాగావుండే మార్గాన్ని తొక్కివున్నాఁడు. యీ సీసంలో ఒక్కొక్క వుపజాతి వృత్త తాత్పర్యాన్ని వొక్కొక్క చరణంలో యిముడుస్తూ వచ్చాఁడు. అన్ని శ్లోకాలూ వుదాహరిస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. వొక్కటి మాత్రమే వుదాహరిస్తాను. ఆకారణంచేత

" స్వర్గాపగా హేమమృణాళినీ నాం
నాళామృణాళాగ్ర భుజో భజామః "

అనే పూర్వార్ధాన్ని మాత్రమే సీసచరణంలో అనువదించి, తక్కిన ఉత్తరార్ధం వదలి పెట్టికూడా రసజ్ఞులకు నమస్కారార్హుఁడైనాఁడు. అక్కడ చా, ఇక్కడ తూ, యింకొక స్థలంలో హి, వదలి పెట్టినాఁడు శ్రీనాథుఁ డని వెక్కిరించేవాళ్లు లేకపోతారనుకొని వుంటాఁడా శ్రీనాథుఁడు. అతని రోజుల్లోనే యెవరో (పిల్లలమఱ్ఱి వీరభద్రుఁడని జనశ్రుతి వుందిగాని అట్టి మహాకవి యిట్టి అనుచిత ప్రసంగం చేస్తాడంటే నామనస్సు అంగీకరించడం లేదు.) "గమి కర్మీకృత నైకనీ వృతః" అన్నచోట యేలాగు తెనిగించావని అడిగినట్టున్నూ శ్రీనాథుఁడు " గమి కర్మీకృతనైకనీ వృతుఁడనై " అని తెనిగించానని సమాధానం చెప్పినట్టున్నూ, దాని మీఁద ఆయన యీసడించినట్టున్నూ కొందరు చెప్పఁకుంటారు. (యీచెప్పుకొనే వాళ్లందరూ శ్రీనాథుఁడు చేతకాక పాడుచేశాఁడనుకొనే తెగలోవారే) యీ యితిహాసం నిజమైతే కావచ్చునుగాని ఆయీసడించిన వ్యక్తికి సహృదయత్వమంటూ లేశమున్నూ లేదనిచెప్పడానికి సంశయింపవలసి వుండదు. అంతకంటె దాన్ని అనుకూలంగా తెలిఁగించేవాఁడు యేకాలంలోనూ వుండఁడు.

తెలిఁగించడమంటే, సంస్కృతంలోవున్న ప్రతిపదానికిన్నీ తెలుఁగు పదం వచ్చేటట్టు చేయడమే అనుకోవడంకంటే అవ్యక్తత వుంటుందా? సంస్కృతభాషామర్యాదలు సంస్కృతభాషవి, తెలుఁగుమర్యాదలు తెలుఁ

గువి. ఆమర్యాదలకు భంగం లేకుండా ఆకవి రచిస్తే యీమర్యాదలకు భంగంలేకుండా యీకవిరచన నడవాలి. ఉభయానికీ వొకటే మాదిరి మర్యాదలున్నా కొన్ని వుంటాయి. వీట్లని ప్రత్యేకించివ్యాఖ్యానించవలసివస్తే చాలా వ్రాయాలి. ఆఘట్టంలోన్నుంచే శ్రీనివాసవిలాసపీఠికలో సూత్రప్రాయంగావున్న వొకపద్యాన్ని వుదాహరిస్తాను—

చ. "తెనుఁగున( గొన్నిసంగతులు తియ్యనలై యలరారు సంస్కృత
మ్మున మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలు గట్టఁజాలు నం
దును మఱి యిందునున్ సొబగుతోఁ దులఁదూఁగును గొన్నిసంగతుల్
పనిఁగొని చెప్పనేల ? యిది పండితవేద్యము కాక యుండునే ?"

అయీ విషయం బాగా తెలిసినవారు భారత కవులు. వారికి తెలుసున్న సంగతి తెలిసినవారు శ్రీనాధాదులు. వారి రచనలకు వంకలు పెట్టువారేతరగతిలోకి చేరతారో వివరించవలసి వుండదు ( తే కే న జానీమహే ). ఆంధ్రీకరణమంటే, తూచాలుతప్పకుండా పద్యంలో యిముడ్చడమే అవుతుందా ? కాదు. సంస్కృతంలో అది జీవకవిత్వమైతే తెలుఁగులో యిది కూడా జీవకవిత్వం అనిపించుకోవాలి. ఆలా అనిపించుకుంటేనే ఆ కవిత్వం వాఙ్మయంలో కొంతకాలమేనా నిలుస్తుంది. మఱోమాదిరిగా వుండేదే అయితే కవిజీవితకాలంలోనే అంతరిస్తుంది. అచ్చుయంత్రాలు లేని పూర్వకాలంలో పుట్టిన కవిత్వాలల్లో అన్నీ కాకపోయినా కొన్నేనా చిరస్థాయులు కావడానికి కారణం జీవం కలిగి వుండడమే. యెవరు కవిత్వం చెప్పినా పంచాశద్వర్ణాలల్లోనేకదా ! కొన్ని ఆహ్లాదకరాలుగా వుండడ మేమిటో, కొన్ని నీరసాలుగా వుండడ మేమిటో అనిపిస్తుంది. కాని పంచభూతమయమైనవేకదా శరీరాలన్నీ, వాటిలో కొన్ని మోహజనకాలుగా వుండడమేమి, కొన్ని రోఁతగా వుండడమేమి అని ప్రశ్నించుకుంటే ఆ శంక తొలఁగుతుంది. అనువాద కవిత్వమేనా స్వతంత్రకవిత్వంలాగే కనపడతాయి భారత భాగవత రామాయణాలు.

"కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్....రక్తౌఘని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్."

"గొడుగో, జన్నిదమో, కమండలువొ, నాకు న్ముంజియో,....మూ
డడుగుల్ మేరయె త్రోయ కిచ్చు టది బ్రహ్మాండమ్ము నాపాలికిన్."

చ. "ఎఱిఁగి యెఱింగి ము న్నతఁడె యెగ్గొనరించినదానికై కదా!
చెఱ గొనివచ్చితిన్ బిదప సీత, వృథాకథ లింక నేల? క్ర
చ్చఱ బ్రిదు కింత తీయనె? ఖరాదులచావున కేమిగాని నీ
మఱఁదలిబన్న మేపగిది మానిని యీఁగుదు సంధిఁ జేసినన్."

ఆ యీ పద్యాలశైలిలో వున్న భారతాదులేమి, మఱికొన్ని రచన లేమి తూ — చాలు వెదకి; మెల్లిగా భమిడిపత్తి విడఁదీసి పింజచేసి వొడికిన జంద్యాల తరగతిలోకి చేరేవే అవుతాయా? గ్రంథకర్త రోజూ మూఁడుపీసెలు విభూతి ధరించడం వగయిరా నియమనిష్ఠలు కవిత్వాని కెంత ప్రయోజనాన్ని కలిగిస్తాయో, అనువాదంలో మూలంలో వున్న చమత్కృతిహి సహితంగా పరిగ్రహించడమున్నూ అంతే. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" యేలాగు చెపితే రసంగా వుంటుందో కవికి తెలుస్తుందా? తెలియదు. యేదో గుడ్డెద్దు జొన్నచేను సామెతగా రచన సాఁగిస్తాడు. అంతే వాఁడివంతు. లోకాదరంతో వాఁడికంతగా సంబంధం లేదు. ప్రతివాఁడికీ తనకు మంచి సంతానం కలగాలనే కుతూహలం వుంటుంది. ఫలితం మాత్రం దైవాధీనం. కవిహృదయానికి స్వీయరచన యావత్తూ బాగానే వున్నట్టు తోఁచడం సహజం. "కాకిబిడ్డ కాకికి ముద్దు" గదా! ఆ విషయంలో లోకులు కవిని పరిహసించడం యుక్తం కాదు. యెఱక్కపోతే చెప్పలేము గాని యెఱిఁగివున్నట్టయితే సుప్రసిద్ధు లాంధ్రీకరించిన గ్రంథాన్ని పునఃపాకంగా ఆంధ్రీకరించడానికి వుపక్రమించడం సాహస మనిపించుకుంటుంది, యెన్ని వన్నె చిన్నెలు పెట్టి అనువదించినా దానిలో పేరురావడం కష్టం. కాని యిట్టి సాహసప్పని చేసి కంకంటి పాపరాజుగారు కృతార్థు లైనారు. కవిబ్రహ్మ రచించిన వుత్తరరామాయ

ణంకంటే కూడా పాపరాజుగారి వుత్తరరామాయణానికే యెక్కువ ప్రచారం వుంది. విప్రనారాయణచరిత్రలు రెండు కనపడతాయి. అందులో వొకదానిపేరు వైజయంతీవిలాసం. ఇద్దఱి కవిత్వమూకూడా జీవకవిత్వమే. అయితేమాత్రం ప్రయోజన మేమి? 'వైజయంతి' కవిత్వమ్ముందు 'విప్రనారాయణ' కవిత్వం జంకిపోతూ వుంది. దీన్నిబట్టి చూస్తే, కవిత్వ సారస్యానికి ప్రయోజనం యతిప్రాసాదులు గాని, యితర పాండిత్యాదులు గాని, కవిత్వపుజిగిబిగిగాని, కథావస్తువుగాని కాదనిన్నీ, "పుణ్యైర్యశో లభ్యతే" అనే సూక్తిమాత్రమే శరణ్య మనిన్నీ తోస్తుంది. వాల్మీకి రామాయణాన్ని మొదటివారికంటె యెక్కువ శ్రద్ధగా తెలిఁగించినవా రున్నూ వున్నారు. అయినా మొదటివారి అనువాదానికె ప్రచారం విస్తరించి కనపడుతుంది. అనువాదానికి పురాణగ్రంథాలు అనుకూలిస్తాయి గాని కావ్యనాటకాదులు అంతగా అనుకూలించవు. దీన్నిగూర్చి శ్రీనివాస విలాసపీఠికలో విస్తరించాము —

ఉ. "కావ్యముగాని నాటకముగాని మఱొక్కటిగాని తెల్గునన్
శ్రావ్యముగా నెసంగదు పురాణము తెల్గొనరించినన్ గడున్
శ్రావ్యతగాంచి యొప్పెసఁగి సంస్కృతముం గని గేలిసేయు నీ
కావ్యము శబ్దముఖ్య మటుగానఁ దెలుం గొనరింప శక్యమే?"

పైపద్యంవల్ల తి. వెం. కవులు స్వబుద్ధిచేత కావ్యనాటకాలు తెలిఁగించడానికి పూనుకోరనిన్నీ, యెవరో కోరితే తప్పనిసరియై ఆపనిచేస్తారనిన్నీ విస్పష్టమే గనక విస్తరించేది లేదు.

యీపద్యంలో వున్న "శబ్దముఖ్యము" అన్నదాన్ని కొంచెం వివరిస్తాను. సజ్జయాచార్యులుగారిని స్తుతించిన సీసగీతిని కొంచెం మొట్టమొదట యెత్తుకొని యేదో విషయం చర్చించాను. ఆపద్యం దేనికి తెలుఁగో ఆమూలశ్లోకాన్ని యిక్కడ వుదాహరించి ఆంధ్రీకరణాన్ని చూపుతాను:

"శరద్రవికరాంబుజస్ఫుటమధూళిసేవ్యైర్వియ
త్పనీపతదనీచ నిర్ఝరధునీవినీతిప్రదైః
వచోభి రవనౌ జయా నభజతేతి యస్యాఽనఘాః
భిధైవ కథయత్యయం దిశతు సజ్జయార్య శ్రియమ్."

దీని ముఖ్యతాత్పర్యం — సజ్జయాచార్యులవారి వాగ్ధోరణి పద్మము నందు వుండే మకరందంవంటి మాధుర్యం కలదనిన్నీ, ఆకాశగంగవంటి నిర్మలత్వం కలదనిన్నీ, అట్టి వాగ్ధాటితో ఆయన జయములను పొంది తనపేరులోవున్న అర్థాన్ని (సన్ + జయోయస్య సః) సార్థకపఱచి నార నిన్నీ తేలుతుంది. దీన్ని తెలుఁగుమాటలతో అనువదిస్తే సంస్కృత పండితులు ఆశబ్దాలంకారాలు రాలేదని పెదవి విఱుస్తారు. కాఁబట్టి సంస్కృత సమాసాలు వచ్చేటట్టే తెలిఁగించాలి. అప్పుడు అదే వృత్తంలో యెత్తవలసివస్తే యతిప్రాసల చిక్కువున్న తెలుఁగులో తుదనెగ్గడం కష్టం. చంపకమాలో, వుత్పలమాలో పెట్టి యిమిడిస్తే కుదురుతుం దేమో కాని మమ్మి భగవంతుఁడు సీసపద్యంలో చెప్పి వ్యాఖ్యానించ మన్నాఁడు. దాన్ని వుదాహరిస్తాను —

సీ. "శరదర్క కరవికస్వరవారిరుహాకన
 న్మధుఝరీమాధురీమానితములు
 అంబరాఽపతదంబు డంబరారంభభృ
 ద్దేవధునీవినీతిప్రదములు"

యిక్కడికి సంస్కృతశ్లోకంలో సగభాగం అయింది. యిఁక మిగి లిన సగాన్నీ యెంత విపులం చేసి అనువదించినా గీతం మింగుతుంది. ఆపక్షంలో సీసపద్యంలో తరవాయి వున్నా రెండుచరణాలకూ ఆహారం కనపడదు. అవి శుష్కోపవాసం చేయవలసివస్తుంది. చూడండీ యీపూ రణం బాగుందేమోను —

"షడ్దర్శనీసారసౌరభోదారచా
తుర్య ధైర్యస్థైర్య దోహదములు
ప్రతివదావదవాదపక్కి కారంభ ని
ర్వాపణప్రక్రియాభావుకములు"

అసలు గీర్వాణకవి సజ్జయాచార్యులుగారి వాగ్ధోరణికి రెండు విశేష ణాలు మాత్రమే వుపయోగించాఁడు. అనువాదకులు మఱికొన్ని విశేష ణాలు చేరిస్తే మునిఁగిపోయిం దేమిటి? అనువాదకుఁడికి ఆమాత్రం స్వాతంత్ర్యం లేదా?" అధికం తు ప్రవిష్టం న తద్ధానిః" అను శాస్త్రజ్ఞసం ప్రదాయం యెఱిఁగినవారు గనక ఆసంస్థానపండితులు యీ ఆధిక్యాన్ని ఆక్షే పించలేదు; ఆమోదించారు. నేఁటివారి విమర్శనాల ధోరణి యీఆధిక్యాన్ని సమ్మతించ దని యితరత్ర వ్రాసే కొందఱి వ్రాఁతలవల్ల స్పష్టపడుచున్నది. తెలుఁగులోకి యేలా మాఱిస్తే, అనఁగా, విపులీకరణం చేయడానికిన్నీ కుంచించడానికిన్నీ అనువాదకుఁడికి అధికారం వుంది గనక ఆయావిధంగా మార్చి కవి రసానికి పాటుపడాలి. అంతేకాని చిన్నశ్లోకంలో వున్న విష యానికి పెద్దపద్యం ఖర్చు పెట్టకూడదని అనుకుంటే ప్రయోజనం లేదు. అనువాదకులు యీరహస్యం యెఱిఁగి వుండాలి. కీ. శే. శ్రీ వ-సు-రాయ కవిగారి మేఘసందేశంలోవున్న "పలుచనిమైదీఁగ" అనే సీసంచూడండి. అసలు కవికి యతిప్రాసలపీడ తప్ప, గణాలకూర్పు నేర్పుతప్ప రసమంటే యేమిటో తెలియక పోతే దేన్ని యేపద్యంలో, యేవిధంగా అనువదిం చాలో యేలా స్ఫురిస్తుంది? చూడండీ, వంటబ్రాహ్మఁడికి రుచీ చవీ తెలుసుకొనే రసజ్ఞ (నాలుక) లేనిపద్ధతిని ఆస్వాదించేవాళ్ళని వానిపాకం తృప్తిపఱచడం సంభవిస్తుం దని యెవరు చెప్పఁగల్గుతారు? అయితే అను వాదకుఁడు యివన్నీ ఆలోచించే ప్రతిపద్యాన్నీ వ్రాసి వుంటాఁడా అంటా రేమో? రసజ్ఞుఁడైన యే అనువాదకుడున్నూ యివన్నీ ఆలోచించఁడు. భావాన్ని మనస్సులో పెట్టుకొని ఆవేశంతో తన్మయుఁడై వ్రాసుకు

పోతాఁడు, "తత్సృష్ట్వా తదేవానుప్రవిశత్" అన్నట్టు ఆ రచనలో వాని రసస్వరూపమైన జీవకళ ప్రవేశిస్తుంది. అది చదువుకుంటూ వుంటే

"పావనాకార గోదావరీదేవి! నీ
వెఱఁగింపుమమ్మ రాజేంద్రుతోడ (రామాయణము చూ.)

అన్నమాదిరిని—

చ. "జలధివిలోలవీచి విలసత్కలకాంచిసమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణ క్రమకరాబ్జము నెత్తి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితో"
(భార — ఆదిపర్వము)

అన్నరీతినిన్నీ—

"తిలకంబు దిద్ది "దిద్దితిఁ జూడు" మనురమా
సుదతిచెక్కులనీడఁ జూచువాని" (కంకంటి ఉ. రా.)

అన్నవైఖరినిన్నీ చదువరులకు చదివినకొద్దీ చదువుకోవాలనే కోరిక కను కల్గిస్తుంది. ఆయీకవులు మూలంలో వున్న చమత్కృతిహీనమైన శబ్దాలు వదిలిపెట్టే అనువదించారో, లేక వాట్ల అర్థాన్నికూడా కూడఁదీసికొనియ్యేవే అనువదించారో, ఆగోడు యెవరి క్కావాలి? యింకోమాట వ్రాయడం మఱిచాను. యెంతో తేలికపాకంలో వున్న రఘువంశంగాని, కుమార సంభవంగాని యింతవఱకు తెలిఁగించి పేరు తెచ్చుకొన్న కవులు లేకపోవడానికి హేతువు విచారణీయం. శ్రీనాథుఁడే మాట దక్కించుకుంటే బాగుండే దనుకోవాలి. భవతు.

ప్రస్తుతంగా యెత్తుకొన్న శ్రీనివాస విలాసపు సీసపద్యవిషయం కొంతతరువాయివుంది. అనువదించే కవికి విపులీకరించడానికి అధికారం వున్నదని వ్రాశాను. దానికి నన్నయ్యగారి "జలధివిలోల" అనే పద్యం (నేను సంస్కృత భారతం దగ్గిఱ పెట్టుకొని పరిశీలించ లేదు గాని

యిందులో నన్నయ్యగారి స్వంతం వుండకపోదని తలఁచి వ్రాశాను )
మొదలైనవి వుదాహరణంగా చూచుకోవచ్చును. యిఁక ఆసీసం తాలూకు
గీతాన్ని వుదాహరిస్తాను –

" ఐనవా చాభరమ్ముల నఖిలపండి
తుల జయించిన యట్టి యతుల యశుండు
సార్థకాభిఖ్యఁ దగుసజ్జయార్యవరుఁడు
సిరుల దయచేసి మమ్ము రక్షించుఁగాక."

యిఁక గీతంలో వొకపెద్ద శంకవుంది. మూలంలో 'అవనౌ'
అని వొకపదం వుంది. యింత పెద్దపద్యం సీసం పెట్టికూడా 'అవనౌ'
అనే పదానికి 'ఇల' అని రెండు లఘువుల ప్రతి పదం కనపర్చినట్టే
లేదే అన్నది. యిది ఆపాత రమణీయమైన శంకేకాని కొంచెం విచారిస్తే
పరమశుష్క-హృదయుఁడు చేసే శంకగా తేలుతుంది. అనువాదంలో లేక
పోవడం అలావుంచుదాం. యీపదం మూలంలోమాత్రం యెందుకుం
డాలో, పరిశీలించండి. సజ్జయాచార్యులుగారు పండితులను జయించినది
భూలోకంలోకాక మఱేలోకంలోనో అనుకోవలసివస్తుందా ? అందుకే
అయితే ఆపదం ఆవశ్యకమే అనుకోవచ్చు. " సంభవ వ్యభిచారాభ్యాం
స్యా ద్విశేషణ మర్థవత్ " అనేశాసనం సూత్రార్థ విచారణకే గాని కావ్యార్థ
విచారణపట్ల సహృదయు లుపయోగించరు. ఆపదానికి సంస్కృతంలోనే
సార్థక్యం లేనప్పుడు అనువాదంలో వదిలేస్తే వచ్చినలోప మేమిటి ? యింత
విచారణతో పనిలేకుండా కొందఱు చట్టనమూలంలో వున్న పదాన్ని వదిలే
శారు, యిదేమి అనువాదమని యీసడిస్తారు. యింతేకాదు సంస్కృతాన్ని
తెలిఁగిస్తూదానిలో వున్నవాట్లకంటే దీర్ఘసమాసాలు వాడడ మెందుకూ
అంటారు. వారిని శ్రీనాధుని – "వితతనవద్వయ" వగైరా చూచుకోవలసిం
దనాలి.

యిఁక మొదటివారి కేం జవాబు చెప్పేది ? అడిగేవాఁడికి చెప్పే
వాఁడు లోఁకువగదా ! ఆయీవిషయం మొట్టమొదటే ఆలోచించి

శ్రీనివాసవిలాస పీఠికలో చాలా చర్చించి మఱీ అనువాదానికి వుపక్రమించాం. దేన్నిగాని అనువదించడానికి పూనుకొన్న కవి యెంతసేపూ భావాన్నిబట్టి పోవలసిందేగాని మూలంలో వుండే పదాలనిబట్టి పోఁగూడదన్నది యీ వ్యాసంవల్ల తేలే పరమార్థం. (విభక్తులని పట్టికూడా పోఁగూడదు) ఒకశ్లోకంలో పార్వతీ పరమేశ్వరుల సంభాషణాన్ని గూర్చి కవి వాదోపవాదంగా కొంత ప్రస్తావించాఁడు - అశ్లోకంలో "ధన్యా కేయం స్థితా తే శిరసి" అని పార్వతీదేవి తనభర్తను ప్రశ్నించింది. దాన్ని అనువదించిన కవి "తలపయి నున్న దెవ్వతెయొ ?" అని అనువదించాఁడు, దీన్ని వొకరు ఆక్షేపించారు. మూలంలో 'నీయొక్క' అనే అర్థం యిచ్చే, 'తే' అనే పదం వున్నది, అనువాదంలో వట్టి 'తలపై' అని మాత్రమే వున్నదంటూ యింకా యేమేమో వ్రాసి వున్నారు. పార్వతి పరమేశ్వరుణ్ణిగూర్చి ప్రశ్నించడంలో "నీతలపై" అని తెలిఁగించక పోతే ఆతలకాయ సాంబమూర్తిది కాక యెవరి తలకాయో అవుతుం దని శంకించడం యేలాటిదోకదా ! "ఉరముననున్న కుంకుమ మదుజ్జ్వల రోషకషాయ" అనే నరసభూపాలీయపద్యంలో 'నీ' అని వున్నదా ? యిట్టి ఆక్షేపకులకు సమాధానం వ్రాయువానిని సహృదయులు మన్నింప రని తెలిసికోక తప్పదు. అనువదించినకవి కీర్తిశేషుఁడు కాకపోతే బాగుండేది. దైవ మనివార్యం కదా !

దీనిలోదే యింకో ఆక్షేపణకూడా చూపి వ్యాసాన్ని విరమిస్తాను. మూలంలో — "శాఠ్య మవ్యా ద్విభో ర్వః." దీనికి "మక్కికిమక్కి" తెలుఁగుచేస్తే "విభునియొక్క శాఠ్యము మిమ్ము రక్షించుఁగాక" అని చేయవలసి వచ్చును. అనువాదకుఁడు "శఠాత్ముఁడు మిమ్ముఁ బ్రోచుతన్" అని అనువదించాఁడు, ఆలా తెలిఁగించడం బాగు లేదనిన్నీ, "జగదాఢ్యుని శాఠము మిమ్ముఁ బ్రోచుతన్" అని తెలిగిస్తే బాగుంటుందనిన్నీ సవరణ వుపపాదించారు. మూలంలో 'శాఠ్యం' అనేదానికే రక్షణకర్తృత్వం వుంది కనక అనువాదంలోకూడా అట్లే వుండాలనే కాని

ఫలితార్థం ఆశరత్వానికి ఆశ్రియమైన శివునికే సంఘటిస్తుందని కూడా తెలుసుకోఁదగ్గ వ్యక్తికూడా భగవంతుఁ డివ్వకపోతే చేయవలసిం దేమిటి ? అసలు మూలంలో వున్న 'శార్వం అవ్యాత్' అని మూక వుమ్మడిగా సమన్వయించుకొని శార్వానికి అవన (రక్షణ) శక్తి వుంటుందా అని శంక రాఁగా దానిమీఁద అర్థాత్తు తాదృశశార్వాశ్రయుఁడైన శివునికే అది సమన్వయిస్తుం దని సమాధానం చెప్పితీరాలి.

యింతమాత్రింకూడా తెలియనివారు తగుదుమంటూ విమర్శనలకు ఆరంభించే యీకాలం చాలా అభినందనీయం కాకపోదు. తగిన సాహిత్యం లేనివారు కవులయి కవిత్వం చెప్పడాని కభ్యంతరం లేదని నేను పలుచోట్ల వ్రాసే వున్నాను. యిక్కడ యింకోమాట వ్రాస్తాను. చతుర్వేదాలున్నా, వాట్ల అంగాలున్నా, చతుష్షష్టి కళలున్నా వచ్చి కవిత్వం చెప్పేవారి కవిత్వం యెందుకూ కొఱగాకనూ పోవచ్చును, ఓనమాలుకూడా చదువుకోకుండానే సహజధారతో కవిత్వం చెప్పినవారి కవిత్వం లోకాదరణ పాత్రిమున్నూ కావచ్చును. వేదశాస్త్రాభ్యాసం వాఙ్మాధుర్యాన్ని తెచ్చి పెట్టదు. కొన్నిసంప్రిదాయాలు తెలుసుకోవడానికి అది వుపకరిస్తుంది. మాధుర్యం సహజం. "నాచిన్ననాఁట నోనామాలనైన నాచార్యులయొద్ద నేఁ జదువలేదు" — యీవాక్యం పరమ భక్తురాలు తరిగొండ వెంకమ్మ గారిది. ఆపె అసత్యంగా వ్రాసుకోదుగదా ! ఆమెకవిత్వం యెంతో లలితంగా వుంటుందని సహృదయులు అంగీకరిస్తారు. పెద్ద పాండిత్యం వున్న వారి కవిత్వమో ? — "భోజనం దేహి రాజేంద్ర" మాదిరిగానే తఱుచు వుండడం అనుభూతం. (తమపాకంబు స్వహస్తపాకగతి) అయితే యిఁక వారి పాండిత్య మెందుకు పనికి వస్తుందంటే — వ్యాఖ్యానాలు వ్రాయడానికి మాత్రిమే పనికివస్తుంది. క్వాచిత్కంగా తత్తుల్యంగానే వుండే కారికా శ్లోకరచనకుకూడా పనికి వస్తుంది. మొత్తం వ్యాఖ్యానరచనకే పనికి వస్తుందన్నమాట. కాని యిక్కడ యింకోమాట వ్రాయాలి. యెంత పాండిత్యంవున్నా సహృదయత్వమంటూ యేస్వల్పమేనా వుండకపోతే

ఆ వ్యాఖ్యానం కూడా "శతాత్ముఁడు మిమ్ముఁ బోషించుతన్" అనే వాక్యాన్ని విమర్శించినట్లే వుంటుంది. యిది "అబ్రవీ" త్పాండిత్య ప్రయుక్త విమర్శనశైలి. పెద్దపాండిత్యం వుండికూడా యింతకన్నా అధ్వాన్నంగా వ్యాఖ్యానించేవారున్నూ వుంటారు. కువిందుఁడు యిట్టివారిని గూర్చియ్యేవే "కిం సౌరభం సైరిభః" అని వాకుృచ్చి యున్నాఁడు. అతణ్ణి సహృదయు లెల్లరూ ఆమోదిస్తారు. అంతేకాదు నమస్కరిస్తారు కూడాను. పరమానందయ్యగారి శిష్యులకథలలో వొకకథవుంది. అందులో వొక పండితుఁడు తన్ను 'శుద్ధవెఱ్ఱిముండాకొడుకుగా' సమర్థించుకోవ డానికి కొంత పరిశ్రమ చేస్తాఁడు. అది ఆయన బావమఱఁది యిచ్చిన సర్టిఫికెట్టుగా చెప్పుకుంటాఁడు. యీకథ పలువు రెఱిఁగిందే కనక స్పృశించి విడిచాను.

యతిప్రాసలు కూర్చినంతమాత్రంచేత, గణాలు పోగుచేసినంత మాత్రంచేత ప్రయోజనం లేదని చాలామంది కవులు గానివారుకూడా తెలుసుకొన్నవారు వున్నారు. పద్యమే వ్రాయనక్కఱలేదు, వ్యాకరణ యుక్తంగానే వ్రాయ నక్కఱలేదు, ఒక్కొక్కరి వ్రాఁతలో వొకానొక విధమైన జీవకళ వుంటుంది. దీనికి వుదాహరణం అందఱూ యెఱిఁగిందే వొక్కటి వుదాహరిస్తాను. కృష్ణాపత్రికా సంపాదకులు ముట్నూరి కృష్ణా రావుగారు పండితులైతే కాకపోలేదుగాని అయినప్పంటికీ లోకంలో పండి తులతోపాటు శిష్యులకు పఠనపాఠాలు చెప్పే పండితులు కారు. కవనం చెప్పడం చేత నౌతుందో కాదోగాని యెప్పుడూ ఒక కందపద్యంకూడా చెప్పినట్లులేదు. సంపాదకీయవ్యాసం ఆయన వ్రాస్తే, వుంటుందికదా, చెప్పేదేమిటి, ఆలంకారికులు చెప్పే వ్యంగ్యం వగయిరాలకు ఆయన సంపాదకీయ వ్యాసాలలో యెన్నో వుదాహరణంగా వుంటాయి. యేది కవిత్వమో, యేది కవిత్వం కాదో విమర్శించే నైపుణ్యం ఆయనకి వుంది గాని యెప్పుడోకాని ఆయన ఆయాప్రసక్తి పెట్టుకోరు. తత్తథాస్తామ్.

ఒక్కొక్కని వాక్కునందు వొక్కొక్క విధమైన సొగసు వుంటుంది. ఒక్కొక్కని గాత్రమందు వొక్కొక్క విధమైన మాధుర్యం వుంటుంది. అది యితరులు అభ్యసిద్దామంటే పట్టుపడేది కాదు. ఒక్కొక్కని వాగ్ధోరణి కోకిలగానంమాదిరిగా వుంటుంది. వొక్కొక్కరిదో కాకారావంవలె వుంటుం దన్నాఁడు కవికర్ణ రసాయనకవి.

క. "కాకేమి తన్నుఁ దిట్టెనె ?
కోకిల తన్నేమి ధనము కోకొమ్మనెనే ?
లోకము పగఁ యగు బరుసని
వాకునఁ జుట్ట మగుమధురవాక్యముకలిమిన్."

అందఱివీ మాటలే, కొందఱిమాటలందు లోకానికి ప్రీతి వుండడ మేమిటో, కొందఱిమాటలందు ద్వేషం వుండడమేమిటో, యెవరికి శక్య మవుతుంది నిర్వచించడానికి ? కొందఱు అనువదించినదేనా స్వతంత్రరచ నని మఱిపిస్తుంది. కొందఱిది స్వతంత్రరచనే అయినా లంకణాలబోటు మాదిరిగా నడుస్తుంది. దీనికి హేతువు చెప్పడం కష్టం. యేవరో తెలిసీ తెలియని ఆక్షేపణలు చేస్తారని అనువాదకులు జంకి "మక్కికి మక్కి" మార్గం అవలంబించకూడదు. "చవై తుహి" లోనైనవే కాదు, మఱి కొన్నికూడా అవసరమైతే వదలుకోవచ్చును, మూలంలో లేనివి చేర్చు కోనూ వచ్చును. యీమాట మా స్వంతం గాదు. నన్నయాదుల రచనల నుండి తేలే సారాంశమే యిది. "నిక్కమియ్యది ప్రమాణంబుల్ తదు ద్గ్రంథముల్ "

వ్రాస్తే యింకా చాలా వ్రాయాలి. యిప్పటికి ఆఁపుతాను. ఆఁపుతూ మురారికవికృతమైన వొక గంపతిరుగుడు శ్లోకానికి నాకావ్యగురువులలో తుట్టతుదివారు కీ. శే. మధునాపంతుల సూరయ్యసూరిగారి ఆజ్ఞానుసారం తెలిఁ గింపఁబడ్డదాన్నిమాత్రం యిక్కడ వుదాహరిస్తాను. అప్పటికే శ్రీఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులవారు ఆనాటకాన్ని తెలిఁగించారు. ఆతెలుఁగుకీ మాతెలుఁ గికీ వుండే భేదాన్ని కనిపెట్టడానికే వారు నాకు అవిధంగా ఆజ్ఞాపించారు.

వ. "ఒకరొక రుంద్రు వీరవరు లొక్కరి కొక్కరు తీసిపోరు, భూ
మికి యశ మబ్బె రావణుని మెచ్చున నం చనుకొందుమేని వా
లికి నతఁ డింత జంకె లవలేశము లొక్కట డించి కన్ను లుం
టకుఁ గని వీను లుంటకు వినందగు నల్పుల మేమి చెప్పఁగన్."

దీనికి మూలశ్లోకము —

శ్లో. "ఏకై కే నివసంతి తే భుజభృతః కస్మై నిగృహ్ణీమహే
వీరక్షేత్ర మియం పున ర్వసుమతీ పౌల స్త్య మాబిభ్రతీ
వాలీ త్వాహ్వాయమాన మేన మపియ చ్చక్రే కృతే చక్షుషీ
పశ్యామ శ్శ్రవసీ కృతేచ శృణుమ స్త ద్వక్తు మల్పే వయమ్."

యింతకు మించి యేనాటకంలోది గాని వొకపద్యంగాని, వచనం గాని నే నాంధ్రీకరించకుండా వున్నప్పటికీ ఆంధ్రీకరించిన కవులలో నాకున్నూ స్థానం లేకపోలేదు. దీని నే "పుణ్యై ర్యశో లభ్యతే" అంటారు. నాటకాంధ్రీకరణం తి. శా. గారికిన్ని యిష్టం లేదు. కాని ఆయనికి శ్రీ పోలవరపు జమీందారుగారి యిష్టానుసారం వర్తించవలసిన ఆవశ్యకత కలిగింది. అందుచేత యెప్పుడో యథాలాభంగా హేలగా (అదేనా క్రొత్త పల్లి సూర్యారావుగారు సరస్వతీ పత్రికకు మేటరు త్వరలో కావా లని జ్ఞాపకం చేయఁగా చేయఁగా) వ్రాసేవాఁడు. అందులో యెక్కడేనా యతో, ప్రాసో తప్పితే శిష్యుఁడు సూర్యారావుగారే సవరించేవారు. యింత విస్పష్టంగా కాకపోయినా యీ విషయం నేఁటికి సుమారు యిరవై యేళ్ళనాఁడు వ్రాసిన "దివాకరాస్తమయం" లో వివరించే వున్నాను. యిటీవల షష్టిపూర్తిముద్రణం నాఁటికి నేను మతీ అధ్వాన్నస్థితిలో వున్నాను. అందుచేత "క శ్శ్రేథయే దత్రాశుద్ధ మహో మహత్సు విధినా భారోఽయ మారోపితః" అన్న శ్రీహర్షుని అన్నగారివాక్యం స్మరించుకోవలసి వచ్చింది. మా తి. శా. వలె నాటకము లాంధ్రీకరించువా రుండరనే నానమ్మిక. అది సర్వథా స్వతంత్రరచనగానే కన్పడును. దానిమీఁద దాడివెడలేవారు

ఆరచనవలె నేమాత్రమును రచించు శక్తి కలవారు కారు. నిజముగా నట్టి శక్తికలవారే అయితే ఆనాటకాలలో దేనినేనా 'పునఃపాకం' లోకి దింపి యశమార్జించుట పురుషకారముగా నుంటుందని విజ్ఞప్తి.

తి. శా. కీ. శే. డే కాకపోతే యిచ్చే జవా బింతశాంతముగా నుండ దని లోక మెఱిఁగిందే. నా జవాబేనా యీలా లంకణాలబోటు మాదిరిగా వుండడాని క్కారణం లోకం యెఱిఁగిందే. "మాం ద్వేష్టి యోగురు రిహ ప్రతిపక్షవృత్తి శ్శుశ్రూషిత స్సతు మయా శిశునా కదాచిత్, తన్మా మతిప్రతిరుణద్ధి -" తి. శా. కో? యిట్టి ప్రతిబంధకం లేశమున్నూ లేదు కదా? "సన్న్యాసివృత్తి మవలంబ్య భవత్పదాబ్జ రేణూత్కరం గణయతో మమ దైవయోగాత్, ఈర్ష్యాళుదేశిక నిరర్థకవాదఖేదః ప్రాప్తోఽభవత్" అని విచారించు నాసమాధాన మంతకన్న కఱకుగా నెట్లుండును? స్వస్తి.

---

# మా మా ర చ నా వి భా గ ం

( ది 20-11-1940 సం॥ర ఆంధ్రవీక్లీనుండి )

మా మా రచనా విభాగాన్నిగూర్చి వ్రాయవలసిన ఆవశ్యకత్వాం సుమారు యిరవైయేళ్ళ నాఁడు కొంచెం కలిగింది. తిరుపతిశాస్త్రి జీవిత చరిత్ర "దివాకరాస్తమయం"లో సంగ్రహంగా వ్రాసి వున్నాను. దాన్ని చూచో చూడకో వాకరు యీవిధముగా సంశయించుచున్నారు. యేలాగంటే? "ఇరువురుం జేసినట్లుగానే యున్నది. ఎవరు చేసినారో, లేక యెవ రేభాగ ములు చేసినారో తెలియుట దుర్లభ మగుటం జేసియు" అంటూ వ్రాఁతకు దిగినారు. ఆయీఘట్టంలోనే వీ రొకవాక్యం యీగంపచిక్కు విడమరిచి తెలిసికోవడానికి తమకు ఆధారంగా వుండేదికూడా వ్రాసికొనివున్నారు. దాన్నికూడా చూపుతాను. "అందు మొదటికవి కాలధర్మమునందె. అతఁడే పండితుఁ డనియు, నిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పఁగలవాఁడనియు...."

యీ వాక్యమువల్ల తి. వెం. కవుల కవిత్వంలో యెవరి కవిత్వ మేదో తెలుసుకోవడానికి యెంతో చక్కని ఆధారం కనపడుతూ వున్నప్పంటికీ "ఎవ రేభాగములు చేసినారో తెలియుట దుర్లభము" అని వ్రాయుట కర్థ మేముండును ? తమ యేర్పాటుప్రకారం పాండిత్య స్ఫోరకంగా వుండేది ఒకరి దనిన్నీ, తక్కినది వేఱొకరి దనిన్నీ తెలుసుకుంటే సరిపోతుందిగదా? యింక దీన్నిగూర్చి చర్చ యెందుకోకదా ! యీలాగ విమర్శించడానికి తగినంత పిండివున్న వా్రఁతయితె విమర్శించడం యుక్తం. యీ వా్రఁత యే స్తనంధయుఁడు విమర్శించడానికి పూనుకున్నా యేమాత్రమున్నూ నిల్చేది కాదని అబాలగోపాలమూ యెఱిఁగిందే కనక అజోలి పెట్టుకొనేది లేదు. అదిన్నీ కాక పండితకవిత్వమేదో, అపండిత కవిత్వమేదో విడదీయ వలసివస్తే పాండిత్యం వుండవలసివస్తుంది. శకా్రణి (ఇందు్రనిభార్య), పరభృత్ (కోకిల) యిట్టి ప్రయోగములు ప్రయోగించుకొనే కవికిన్నీ పాండిత్యానికిన్నీ చుట్టఱికం వుంటుందని యే ప్రాజ్ఞులనుకుంటారు? శక్రస్య భార్యా శకా్రణీ అనుకోవడం యేలాటిదంటే 'శచీంద్రాణీ' అని అమరంలో వుందిగదా, 'ఇంద్రాణీ' అంటే 'ఇంద్రస్య భార్యా' అనేకదా అర్థం; ఇందు్రఁడన్నా శకు్రఁడన్నా సమానార్థకాలేగదా, ఆపద్ధతిని శక్రాణీపదం ఇంద్రాణీపదానికి పర్యాయపదం యెందుకు కాదు అనుకొనేగదా 'శకా్రణి' అని ప్రయోగించుకోవడం ? అంతేనేకాని ఇంద్రపదానికి మాత్రమే "ఇంద్రవరుణ భవశర్వ" అనే సూత్రంవల్ల వచ్చే ఆనుగాగమమున్నూ, జీష్పున్నూ రావడానికి ఆస్కారం వుందిగాని ఇంద్రపర్యాయాలకు ఆలాటి ఆస్కారం లేదనికూడా తెలిసికోలేని విమర్శకత్వం యెంతపాటిది ? ఆయీ విమర్శకత్వం "కుంభకర్ణేభకారోఽస్తి భకారోఽస్తివిభీషణే, - రాభణో నతు రావణ" వంటిదేనా, కాదా ? తత్తథాఽస్తామ్.

ఇట్టి విమర్శకులకు పండితకవులు అపండితకవులు కావడంలో ఆశ్చర్యం వుంటుందా ? యిది శాస్త్రవిషయం. 'అనభ్యాసే విషంశాస్త్రమ్' అన్నమాటకు అర్థం బాగా తెలిసిందికదా యిప్పటికి. అయితే కవులందఱూ

శాస్త్రజ్ఞులుగానే వుంటారా అంటారేమో ? అబ్బే ! అది అసంభవం. వుండరుగాని యేదో తోఁచినంతలో, తెలిసినంతలో "పుంసివాకామ్మెక్కి-యిత్యపులు గూఁయగా కోనంగుఁ దేయఁగా, అప్యేకదంతుండు ఆడఁ దొడఁగె" అన్న మాదిరిని రచన సాఁగించుకోవడంతో తృప్తిపడతారు, యితరులమీఁదకు దాడివెడలరు. వెడలితేనో, అది తమ లోఁతుపాతులను పూర్తిగా వెల్లడించుకోవడానికి కారణమవుతుంది కదా అని వారివారికి పూర్తిగా తెలుసును. ఇఁక రెండోది: 'పరభృత్' అనేదాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తాను. కోకిలకు 'పరభృత' అనేపేరు వున్నది. పర = ఇతర (కాకి) పక్షిచేత, భృత = పోషింపఁబడేది కనక ఆ పేరు యోగరూఢం (పంకజాది శబ్దాలవలె) గా వుంటుంది. "వనప్రియః పరభృతః కోకిలః" అని అమరము. "భృతః" అన్నది కర్మణి క్తప్రత్యయాంతం "పరభృత్" అన్నదో ? కర్తరిక్విప్ప్రత్యయాంతరూపం. అవయవార్థం దీనికి పరులను పోషించేది అని వస్తుందిగాని పరులచే పోషింపఁబడేది అని రాదు. యీమాత్రానికి శాస్త్రాధ్యయనంకూడా అక్కఱలేదు. సంప్రదాయసిద్ధమైన సాహిత్యం వున్నాచాలును. ఆ యీప్రయోగాలు వాడుకొనే కవులకు పండితకవులెవరో తెలుసుకోవడం సాధ్యపడుతుందని యెవరనుకుంటారు ? శక్తి సామర్థ్యాలు యింతమాత్రంలో ఉన్నా కొందఱికి పాండిత్యం వున్నట్టు ప్రకటించుకోవాలని ఆశ బోలెఁడు. ఆకాశమంత ఆకలీ, సూది బెజ్జమంత నోరూ అయితే యెలా ? లోకం తత్త్వాన్ని గుఱితించదా ? యింకా యీలాటివి యెత్తిచూపవలసివస్తే చాలా గ్రంథం పెరుఁగుతుంది. ఆపని యిప్పుడేకాదు, యెప్పుడూ పెట్టుకొనేది లేదు.

అందఱికీ కవులకు పాండిత్యమే వుంటుందా ! వుండకపోతే వారు రచన మానుకోవలసిందేనా ? ఆలాగ నేనెప్పుడూ అనేది లేదు. రచన సాఁగించుకొని యెవరికేనా శబ్దశాస్త్రజ్ఞులకు లక్ష్యలక్షణజ్ఞాతలకు చూపి దిద్దించుకుంటే యీకళంకం లేకుండామాత్రం వుంటుందని సలహాయిస్తాను. యింతమాత్రపు విజ్ఞానంతో తి. వెం. కవుల జోలికి వెళ్లవద్దనికూడా

చెప్తాను. యిది విషయాంతరం. మా తిరుపతిశాస్త్రి జీవించివున్న రోజులలో 1903 సం. వఱకున్నూ రచించిన రచనలలో యెవరిభాగం యెక్కువవున్నా, యెవరిది తక్కువ వున్నా యిందులో వొకరిది రెండోవారికి అసలే తెలియని రచనంటూలేదు. ధాతురత్నాకరము, కాశీసహస్రము, శుకరంభాసంవాదము, శ్రవణానందము, దేవీభాగవతము, లక్షణాపరిణయము, బుద్ధచరిత్రము, రసికానందము, నానా రాజ సందర్శనము (పూర్వభాగము), శ్రీనివాసవిలాసము— యీరచనలలో యిద్దఱికీ సంబంధం పూర్తిగా కాకపోయినా చాలా భాగం వున్నట్టే చదువరులు తెలుసుకోవాలి. యీవిషయం తెల్పడానికి బీజం నాటినవారి వుద్దేశం యెట్టిదైనా దీన్ని తెలుసుకుందామనే కుతూహలం కలవారు చాలామంది వుంటారని తోఁచి విస్తరిస్తున్నాను. బందరులో నాటక కంపెనీల కోరికనుబట్టి శాకుంతలం వగయిరా కొన్ని వచన నాటకాలున్నూ, వాసుదేవమననం (సంస్కృతం) తెలిఁగించడం వగయిరాలున్నూ మావద్ద మాతృకలు వుంచుకోకపోవడంచేత ప్రకటించలేకపోయాము. మేము బందరు అవధానార్థం వెళ్లేనాఁటికి కంపెనీ నాటకాలన్నీ వచనాత్మకాలుగానే వుండేవి. వాట్లని ప్రదర్శించడంలో అఖండులు (ఇవటూరి నాగభూషణంగారు, వెంకటరత్నంనాయఁడుగారు వగైరా) వుండేవారు. వీరెవరికీ సంగీతం రాదు. సరికదా పద్యం చదవడంకూడా రాదు, రాకపోతే యేమి? నాగభూషణంగారు హరిశ్చంద్రుడు వెం. ర. నాయఁడుగారు విశ్వామిత్రుడు బ్రహ్మయ్యనాయఁడుగారు బఫూన్ యింకా పేర్కోఁదగ్గ వ్యక్తులు చాలా మంది వున్నారు. మాదిరెడ్డి గంగారావునాయఁడుగారు వీరబాహువు (అచ్చంగా అవతరించినట్టే వుండేది యీయన భూమిక). వేఱే వొకప్పుడు ఆయీ కీ. శే. లనుగూర్చి ముచ్చటించుకుందాం. ఆయీ కంపెనీలకు వ్రాసియిచ్చిన బాపతు మారచనలో వొక్క శుకరంభాసంవాదశ్లోకాలు తప్ప తక్కినవన్నీ అంతరించినట్టే. అవన్నీ వుండేయెడల వొక సంపుటానికి తక్కువ వుండవు.

1903 వ సం. ఫిబ్రవరిలో నేను బందరు హైస్కూలుకు తెలుఁగు పండితుఁడుగా హఠాత్తుగా, తలవనితలంపుగా వెళ్లి అక్కడ 1916 వ సం.

జానువరకూ సుమారు పదమూఁడేండ్లు వున్నాను. నాకన్న సుమారు రెండు సంవత్సరాలకు పూర్వమే మా తిరుపతిశాస్త్రి కాకినాడలో శ్రీపోలవరపు జమీన్ దారుగారివద్ద ప్రవేశించాఁడు. అతఁడు కాకినాడలో ప్రవేశించిన కొలఁది మాసాలలోనే నాకు మారకం చేయడానికి తగ్గంత జబ్బు చేసింది. ఆజబ్బులో నేను అయిదాఱుమాసాలు (తింటూ తిరుగుతూనే) పడి వున్నాను. ఆ స్థితిలో నేను మళ్ళా బ్రతికి బట్టకట్టుకొనేరీతికి వస్తానని యెవ్వరూ అనుకొనేలేదు. నాకుమాత్రం మొదటినుంచీ జాతకవుపిచ్చి వుండడంచేత మళ్ళా పైకి వచ్చితీరతాననే నమ్మకం వుండేది. ఆయీవిషయం అంతా యెఱిఁగినవారు ఆకొండి రామమూర్తిగారు (అప్పుడు నాకు వైద్యం చేసి బ్రతికించినవారు) మాత్రం యిప్పుడు సజీవులుగా వున్నారు. ఆమధ్య యెవరో కీ. శే. ఓలేటి వేంకటరామశాస్త్రికీ నాకూ వుండే శైష్యోపాధ్యాయి కనుగూర్చి పనిలేనిపాటుగా ఘోరమైన అసత్యాన్ని వ్రాసి ప్రకటిస్తే సత్యాన్ని తెలిపి మృదువుగా మందలించినవారీ రామమూర్తిగారే. వీరు ఓలేటి వేంకటరామశాస్త్రికి సాక్షాత్తూ పెద్దతల్లి కొమాళ్ళు. వైద్యం నిమిత్తం నేను వీరి వూరు ఐలండుపోలవరం వెళ్ళివున్నరోజుల్లో ఐలండు కవిపంచకం (ఆకుండి రామమూర్తి, నిశ్శంకుల కృష్ణమూర్తి, నెమలూరి వెంకటశాస్త్రి, లంక మృత్యంజయకవి, రంగాచార్యులు) తో జరిగిన సత్కాలక్షేపం యిప్పుడు తలుచుకుంటే అది రోగమే కాదనిన్నీ, ఆలాటిరోగం యెంతో అదృష్టం వుంటేనేకాని లభించదనిన్నీ తోస్తుంది. యిందులో లంకకవి విశ్వబ్రాహ్మణుఁడు. యితనికవిత్వం వసుచరిత్రపాకంలో వుంటుంది. "శ్రీవీరలింగాంఘ్రి సేవానుగతకళా గౌరవాంచితబాణకవిసుతుండ" అనే వొక సీసచరణం యితనిది నాకు జ్ఞప్తిలోవుంది. యీకవి తండ్రి బాణకవి. పూర్వం కాదంబరీకర్త బాణకవికి 'కవిత్వం చెప్పే కొడుకున్నట్టే యిక్కడునూ తటస్థించింది. యిందులో నెమలూరికవిమాత్రం నాశిష్య వర్గానికంతకూ మొట్టమొదటి తరగతిలోనివాఁడు. అనఁగా వోలేటి "బ్యాచి" కన్నా పూర్వపు బ్యాచిలోవాఁడన్నమాట. యితఁడిప్పుడు నైజాం యిలాకా వనపర్తిసంస్థానంలో ఆస్థానకవిగా వున్నాఁడు.

"సీ. వనప_ర్తిసంస్థానమునఁ గవీశ్వరుఁడయి
పేరు గై_కొను నెమలూరికన్న"

అని (యిటీవలిచర్య) నేనక్కడ వైద్యానికి వెళ్ళి వున్నప్పుడే వైద్యులు రామమూర్తిగారి కవిత్వమందు నాకు వుండే గౌరవానికి స్ఫోరకంగా యీరూపేణా ఆయనపేరు శాశ్వతం చేయఁదలఁచి అప్పటికి రచించడం తరవాయిగావున్న దేవీభాగవతనవమస్కంధాన్ని అనువదించవలసిందని రామమూర్తిగారికి యిచ్చివున్నాను. ఆయన "ఏక స్స్వాదు నభుంజీత" అని వుంది కనక తన సహాధ్యాయి నిశ్శంకుల కృష్ణమూర్తిగారికి దానిలో భాగం కల్పించారు. యీరీతిగా వారుకూడా 'రామకృష్ణకవులు'గా తేలి జంటకవులుగా లోకానికి పరిచితులైనట్టయింది. యీవిధంగా యిద్దఱు సమర్థులు కలిసికూడా, యెన్నో యేళ్ళు అవకాశం వున్నా, యిద్దఱున్నూ ఒకరిని మించిన రాజసం వొకరు వున్నవారవడంచేత అందులో యే కొంచెమో తరవాయి పెట్టినారు. నేను బందరులో వున్న కాలంలో దేవీభాగవతం ఆఱుస్కంధాలుమాత్రం బ్రహ్మశ్రీ బ్రహ్మం మీఁద ముద్రించడం జరిగింది. అంతట్లో 1916 లో స్వగ్రామానికి చేరుకున్నాను. ఆ పిమ్మట అచ్చుపని ఆఁగింది. తి. శా. కొడుకున్నూ, తంగిరాల జగన్నాథశాస్త్రిన్నీ సప్తమస్కంధం యేలాగో తప్పులతడకగా ముద్రించారు. అష్టమస్కంధం ముద్రణ తరవాయిలో వుండడంచేత నవమస్కంధప్రసక్తి రానేలేదు. క్రమంగా అశ్రద్ధచేత దేవీభాగవత ముద్రణ నిలిచిపోయింది. ఆ నిల్చిపోవడం వక పుష్కరానికి తక్కువ వుండదు. అంతట్లో నాకు షష్టిపూర్తి తలపెట్టింది బందరు. అప్పటికి నాస్థితి 'కిందెట్టు మీఁదెట్టు' వైఖరిలో వుంది. స్కూలుశిష్యుఁడు వేంకటేశ్వరరావుకే యావదధికారమూ యిచ్చాను. అతఁడే ముద్రించాఁడు యిటీవలనేనా ఆయీ ముద్రణంబాపతు సంపుటాలు చదివి చూడడాని కవకాశం చిక్కనేలేదు. అట్టెందెన్ను యీ లోకంలోనే వున్నా వ్యాపకం యావత్తూ పరానికే సంబంధించిన దవడమే దీని క్కారణం. యిది దేవీ

భాగవత ముద్రణ చరిత్ర. యిట్టి స్థితిలో నవమస్కంధంవారు యేలా తెలిఁగించారో నేను పరిశీలించడం యేలా తటస్థిస్తుంది ? దానిలో యేమాత్రమో తరవాయికూడా వుంటే దాన్ని తి. శా. కొడుకు అవధాని పూరించాఁడు.

విషయం విషయాంతరంలోకి దూఁకింది. ముఖ్యంగా వ్రాయవలసింది తి. వెం. కవుల రచనావిభాగంకదా ! అది పతాకాస్థానంగా పెట్టుకున్నప్పటికీ ప్రకరీప్రకారం. అంటే రామాయణగాథలో సుగ్రీవాదుల గాథలలాగ, ఇతరాలు చేరుతూవుంటాయి. అందులోనున్నా నావ్రాఁత కొంత చాదస్తంగా వుంటుందని నాకే తెలుసును. తెలిసీకూడా ఆచేదస్తాన్ని వదులుకోలేకపోవడ మేమంటే ? యిది సహజ మవడంచేత వదలుకోవడానికి వీలు చిక్కడం లేదు. "దుస్త్యజా హి ప్రకృతి." అన్నారు అభియుక్తులు. కొందఱికి బుద్ధిపూర్వకంగా అబద్ధాలు వ్రాయడం ప్రకృతి. దానివల్ల పరలోకంలో వచ్చే హాని ఆలా వుండఁగా (యీబాధ పరలోకమే లే దనుకుంటే పోతుందిగదా !) యిహలోకంలో యెంత రావాలో అంతా వచ్చినట్టు యెఱిఁగిన్నీ వారు దాన్ని వదులుకోవడం లే దన్నందుకు యెన్నో వుదాహరణాలు కనపడతాయి. యేంలాభం ? మళ్ళా మామోలు పాటే. మతు లెన్నిచెప్పినా....ఆమాదిరిగానే నాచేదస్తపువ్రాఁత వుంటుంది.

ఆవైద్యంలో నేను వున్నరోజుల్లో సరస్వతీపత్రికలో ప్రకటనకోసం రాజశేఖరకవికృతమైన బాలరామాయణనాటకాన్ని ఆంధ్రీకరిస్తూ మా తిరుపతిశాస్త్రి ప్రస్తావనలో "తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి రెండు, భాషలలోఁ దత్కృపం గవియయ్యె" అని పద్యం యెత్తుకొని మఱికొన్ని సంగతులు కృతజ్ఞతాస్ఫోరకాలు వ్రాసి "తిరుపతిశాస్త్రి తెలుంగుచేసె" అని పద్యాన్ని యేకకర్తృకంగానే ముగించాఁడు. మాలో యెవ రేది రచించినా వుభయులమూ రచించినట్టే ప్రచురింపవలసియుండఁగా ఆ యేర్పాటుకు భిన్నంగా అతఁడు తనపేరు వకటే ప్రచురించడం తప్పిదమే అయినా అప్పటికి నాస్థితి కంఠగతప్రాణావస్థలో వుండడంచేత నావల్లనతఁడు పొందిన ఉపకారాన్ని కృతజ్ఞతా స్ఫోరకంగా

కన్నీటిధారతో వుద్ఘాటిస్తూ ఆ పద్యాన్ని ఆరీతిగా ముగించాఁడే కాని అది దురుద్దేశం కాదని చదువరులు తెలుసుకుందురుగాక. పిమ్మట నేను జీవించడం తటస్థించింది. కనక లోఁగడ రచించిన బాలరామాయణం మాదిరిగా తన వొకచేతిమీఁదనే తుదముట్టించిన ముద్రారాక్షస, మృచ్ఛకటి కాదులైన అనువాదములలోనే కాక బాలరామాయణ నాటక గద్యలోకూడా మా యేర్పాటుప్రకారం యథాపూర్వంగా నాపేరుకూడా కల్పుతూనేవచ్చాఁడు (ప్రథమాంక ముద్రణ పూర్తినాఁటికి నా బ్రదుకు స్థిరపడిం దన్నమాట) నా ప్రత్యేక రచనలలో ఆతనిజీవితకాలమం దాలా వుండఁగా జీవితానంతరం కూడా సంఘటించడం లోకులందఱూ యెఱిఁగిందే కనక విస్తరించ నక్కఱ లేదు. అతణ్ణి సంబోధిస్తూ నేను వ్రాసిన గీరత ప్రథమభాగ గద్యలోకూడా తిరుపతి వేంకటీయ మనియే వ్రాసియున్నాను. దాని సమన్వయ మేలాగ అనే ప్రశ్న వస్తుం దనిన్నీ యెఱుఁగుదును (పెప్పెప్పే మెమ్మెమ్మే అనవలసిరాదు.) మధ్యమపదలోపం చెప్పి యథాకథంచిత్తుగా సమన్వయించుకుంటే సమన్వయ మౌతుం దనుకున్నాను (తిరుపతి సహాధ్యాయీ వేంకటః తిరుపతి వేంకటః). అతని జీవితకాలంలో నే వ్రాసిన మొట్టమొదటి కామేశ్వరిలో "సహాధ్యాయింగా నల తిర్పతిన్ సలిపి" అని వొక పద్యంలో వుంటుంది. తర్వాత అతని జీవితానంతరం రచించిన ఆరోగ్యకామేశ్వరిలో "కాలం బింకను దీరకే మునుపు స్వర్గం బేఁగె మత్ప్రాణముం, బోలంజాలిన వాఁడు తిర్పతి" అని వుంటుంది. మళ్ళా గద్యలో తిరుపతి వేంకటీయం అనే వుంటుంది, వుంటేమాత్రం సమన్వయించుకో లేకపోతారా?

మాకంటే పూర్వులలో యేవకరో జంటకవు లంటూ లేకపోలేదుగాని వారికి మామాదిరిగా పేర్లు కలిసినట్టులేదు. ఒకరిపేరు మల్లయ్య, వేఱొకరిపేరో: సింగయ్య. యీపేర్ల కెంత కలయిక వుందో కవిత్వానికీ అంతే వుందో, లేక అంతకంటె యెక్కువ కలయికే వుందో విమర్శించి చూస్తేనేగాని తెలియదు. మాకంటె చాలా పెద్దలున్నూ, మాకాలంలోనే

వున్నవారున్నూ దేవులపల్లి సోదరులు వొకరు. వీరిలో పెద్దవారు సుబ్బారాయశాస్త్రుల్లుగారు; రెండవవారు వేంకటకృష్ణశాస్త్రుల్లుగారు (వీరి వాడుక పేరు తమ్మన్నశాస్త్రిల్లుగారు). వీరిపేళ్ళకూ కలయిక లేదు. రచన ప్రత్యేకంగానే కాని కలిసిచేసినట్టున్నూ లేదు. మా తరవాత యేకొంచెమో పేళ్ళ కలయిక కల జంటకవులు వేంకటరామకృష్ణకవులే. యీజంటలో మొదటివాఁడు వేంకటరామశాస్త్రి; రెండవవాఁడు రామకృష్ణశాస్త్రి. వున్నదున్నట్లు కల్పితే వేంకటరామ రామకృష్ణులు అని కావలసి వస్తుంది. అది పొడుగ్గా వుంటుందని కొంతభాగం తగ్గించుకొని (నామైకదేశ న్యాయంచేత) వేంకటరామకృష్ణులుగా పరిణమించారు. దీన్నిగుఱించి 'విగ్రహారాధన' లో కొంతవ్యాఖ్యానించినట్లు జ్ఞాపకం. (గీరత ప్రథమభాగంలో కూడా --
"తిరుపతి వేంకటేశ్వరుల పేరులఁబట్టి తమపేరు లొనగూర్పఁ దలఁపవలయు" చూ). మాపేరులు కలియడానికి యేవిధమైన వ్యాఖ్యానమున్నూ అవసరం లేకపోయింది. దానికి దైవికకారణం యేదో వుంటుంది. యీకలయికను గూర్చి సంతోషించని సహృదయు లెక్కఁడా కనపడు లేదు. చెప్పొచ్చేదేమి టంటే ? లోకమంతా సంతోషించిన యీసమావేశాన్ని (యెవరో వకరు దీనికిన్నీ అసూయపడేవారు లేకపోరుకాని అది గణనీయమవుతుందా ? కాదు) యెందుకు తప్పించాలని నేను అతని జీవితానంతరం రచించిన గ్రంథాలలోకూడా అతనిపేరు కల్పుతూనే వున్నాను. సర్వధా మొదటినుంచీ నన్నే అనుకరించే శిష్యుఁడు ఓలేటి వేంకటరామశాస్త్రికూడా నా ఆచారాన్నే అవలంబించి రామకృష్ణశాస్త్రి అనంతరం రచించిన బృహత్కథానువాదం లోనైనవాట్లలో అతని పేరు కూడా చేరుస్తూనే వచ్చాడు. దీనికి నేను అతణ్ణి మిక్కిలిగా అభినందిస్తాను. యీజంట మామాదిరి "అడవి యుసిరికాయా, అలసముద్రపు టుప్పున్నూ" కాదు; మేనత్త మేనమామ బిడ్డలు. మేమో ? "ఇర్వురం దతఁడు దావెల్నాటివాఁ డితఁ డారామద్రామిడశాఖవాఁడు." మాలో మాకు సహాధ్యాయిత్వం ప్రధానమున్నూ, గురుశిష్యభావం అప్రధానమూ

అని పలుపు రెటిఁగిందే. యీసందర్భం వెం. రా. కృ. లకున్నూ వుంది ("పన్నుగ నాకు సత్కవనపద్ధతి చెప్పిన బావ" గీరతం చూ.) వారిద్దఱిలో వొకరు సమర్ధులనిన్నీ, వొక రసమర్థు లనిన్నీ చెప్పుకొనే (ప్రాజ్ఞులు కాదు) వారు కొందఱున్నారు కాని వయోభేదంతప్ప యితరభేదం వాళ్ళలో లేదు. వేంకటరామశాస్త్రి కృష్ణశాస్త్రికన్న సుమారు నాలుగయిదేళ్ళైనా పెద్ద కావచ్చును. మాలో మా కంతవయోభేదం లేదు. ఆజంటలో రెండో కవి (రామకృష్ణశాస్త్రి) మా జీవితకాలంలోనే మాలో మాకు పొరపొచ్చెములు కల్పించే వూహతో "వేంకటేశ్వరుని యాదరణమ్మునఁజేసి కాక తిరుపతిమార్గ మిట్టిదని తెల్పు వచింప నెవం డెఱింగెడిన్" అంటూ తిరపతి శాస్త్రిని అధఃకరించి వ్రాయడం అందఱూ యెఱిఁగిందే. అవ్రాఁత యుక్తమైనా కాకపోయినా అది మాయిద్దఱిజీవితకాలంలోదీ కనక దానివల్ల మాలో మాకు పొరపొచ్చెములు పుట్టి "త్వం శుంఠా త్వం శుంఠా" లోకి దిగితే వ్రాసిన శత్రువు తద్ద్వారా కొంత సంతోషించడానికేనా అవకాశం వుంది. ("తన్నామ గంధా న్నలకూబరం సా" చూ.) యిప్పు డీమాదిరి కుకల్పనకు, అనఁగా దానికి తలక్రిందు కల్పనకు దిగి సాయపడే ప్రబుద్ధుల కేమి లాభం కలుగుతుందో గోచరించడం లేదు. ఆట్టే ఆలోచిస్తే కడుపులో పుట్టిన మంట (అసూయ) యేదో విధంగా చల్లార్చుకోవాలి కనక దానికి యేవుపాయమున్నూ సిద్ధించక లేదా కనపడక ఈవిధంగా పాటుపడవలసివచ్చిం దని తోస్తూవుంది. భవతు. యీవిధంగానేనా వానికి శాంతి కల్గితే అదిన్నీ కొంత అభినందనీయమేను.

వక్తవ్యాంశం : మాకలయిక యేలాటి శుభముహూర్తమందు ప్రారంభ మయిందో, అది యెంద ఱెన్నివిధాల యత్నించినా జీవితకాలంలోనే కాదు, వొకరు స్వర్గతులైన దరిమిలాను కూడా ఆలాగే నిల్చి వుంది. తత్తథాస్తామ్.

సంస్కృత నాటకానువాదం యావత్తున్నూ అతనిదే అని లోఁగడ వ్రాసే వున్నాను (దానిక్కారణం నాకు అట్టిఅనువాదం బొత్తిగా యిష్టం

లేకపోవడమే. (దీన్నిగుఱించి శ్రీనివాసవిలాసపీఠికలో వున్న "కావ్యము గాని" అనేపద్యాలు చూడదగు.) ఆయీకారణం చేతనే అతని జీవితానంతరం వొకసారి మ. రా. రా. శ్రీమోతే నారాయణరావుగారు యేలూరులో మా మృచ్ఛకటిక ప్రదర్శనానికి నన్ను ఆహ్వానించి నాయెదుట ప్రదర్శించి ఆసభలో నన్ను నూటపదార్లిచ్చి సమ్మానిస్తే దానిలో సగం నేను అతని కొడుకులకు పంపించి వున్నాను. ఆనాటకంలో వొక్క అక్షరంకూడా నాది లేదాయె. "ఒక్కరు రచియించి రేనియును గాఁదగుఁ దిర్పతి వేంకటీయమై" అనే మా యేర్పాటును బట్టి నాపేరుకూడా దానిలో వుండఁబట్టి అసలు రహస్యం యెఱుఁగని నారాయణరావుగారు నన్ను సమ్మానిస్తే మాత్రం దాన్ని నే నేలా యావత్తూ పుచ్చుకొనేది? నిజం ఆయనకి తెలిస్తే వుంటే తి. శా. కొడుకులనుపిల్చి ఆసమ్మానం చేసేవారేమో? అయితే అలాచేస్తే లోకం వప్పుకుంటుందా? ఆ స్థానాన్ని ఆక్రమించడానికి తి. శా. కొడుకుల కేమిఅధికారం, వెం. శా. కొడుకుల కేమి అధికారం?

"మా యుభయులలోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక" ఇంతదాఁకా యెందుకు? నేను (తి. శా. జీవితకాలంలోనే) వేఱే సంబంధాన్ని పురస్కరించుకొని వేఱొకరితో నెల్లూరు తిక్కన్నగారి జయంతి సందర్భంలో వెళ్ళవలసి వెళ్ళడమున్నూ జరిగింది. అప్పుడు నన్ను కొంతమంది యీయన యీయనతో జతగా వచ్చాఁ డేమిటని వెగటుగా, లేదా విడ్డూరంగా అనుకోవడమున్నూ జరిగింది. అడిగినవారిని సమాధాన పఱచడానికి యెంతో సోదె వెళ్ళఁబోసుకు రావలసి వచ్చేది. యెవరితోటో కలిసి వెడితేనే ఆక్షేపణీయంగా లోకానికి కనపడేది గాని ఏకాకిగా వెడితే యెవరూ అంతగా ప్రశ్నించేవారు కారు. గువ్వపిట్ట మఱొకపిట్టతో (స్వజాతితోనే. పూర్వపుది కాక వేఱొకదానితో అన్నమాట) జతకట్టదని చెప్పుకుంటారు. మాజంటకూడా లోకానికి అట్టి దవడంచేత జీవితకాలంలోనే కాదు, తి. శా. జీవితానంతరం కూడా నేను మఱివకరితో కలిసి కవిత్వం చెప్పినా, ఫోటోతీయించుకున్నా లోకానికి యెబ్బెట్టుగానే తోఁచేది.

అతనిజీవితకాలంలో జరిగిన ముచ్చట వ్రాసే వున్నాను. జీవితానంతరం బందరులో వొకరితో (సుప్రసిద్ధులతోనే) కలిసి వొకసభలో పదో, పన్నెండో పద్యాలు చెజివక చరణంగా చెప్పడం జరిగింది. ఆసమయంలో జంటగా ఫోటోకూడా తీయఁబడింది. ఆఫోటోచూచి కొందఱు "మీరు యిటీవల వీరితో కలిసి సభలు చేస్తున్నారా?" అంటూ యెంతో విడ్డూరంగా అడగడానికి మొదలు పెట్టారు. యేమో, యెందుకు ఆలాగు కలిసి చెప్పఁగూడదో వారినే అడగండి.

చెప్పొచ్చే దేమంటే? లోకానికి మాజంటయందు యేదో వొక విధమైన ఆదరం కలిగింది. దానిక్కారణం ఆ లోకులకే తెలుస్తుంది కనక నేను వివరించవలసి ఉండదు. ఆ ఆదరం నేను నాతలమీఁదనుంచి యెగిరిపోయే గురువులవారితో జోడీగా యేర్పడ్డా కలగదు.

ఇది యీలోకంలోసంగతి. పరలోకంలో కూడా దీనిసంగతి యీలాగే వుంటుం దనడానికి నాకు అనుభూతమైనది వొకటి నాయందు గౌరవం కలవాళ్ళ నిమిత్తం మాత్రమే వ్రాస్తూవున్నాను. 1903వ సం. జనవరిలో నేను నూజివీటి సంస్థానానికి వార్షికనిమిత్త్యార్థమై వెళ్ళి వున్నప్పుడు వొకనాఁటి బ్రాహ్మముహూర్తమందు వొకస్వప్నం వచ్చింది. ఆస్వప్నాన్ని గూర్చి కొలఁది కాలంనాఁడు సౌభాగ్యకామేశ్వరీ స్తవంలో యీవిధంగా వ్రాసుకున్నాను. ఆపద్యాలే ప్రసక్తి కలగడంచేత వుదాహరిస్తాను.—

శా. "బంద ర్కారణ మస్మదీయమగు సంపత్ప్రాప్తికిన్ దత్పురం
బందున్ వాస మొనర్ప నేఁగుటకు మున్నంబా! భవద్దర్శనా
నందం బబ్బఁగఁ జేసె స్వప్న, మది వర్ణ్యం బెప్డు నేనట్టి యా
నందంబుం గని యుండ నిక్కముసుమా! నాతల్లి! కామేశ్వరీ!

శా. మోకాల్బంటిగఁ బూలుఁ గుంకుమయు నేమో పోవ్రుగా నుండె నీ
యాకారంబు విరాట్స్వరూపముగ భూమ్యాకాశముల్ నిండెన
న్నాకారించి(పిల్చి)"మతేఁడివాఁ"డనిసహాధ్యాయిన్ గుఱింజేసి నీ
వాకాంక్షించితి జ్ఞప్తి నున్నదియె యీయంశంబు కామేశ్వరీ.

యింకా యీఘట్టంలో మఱికొన్ని పద్యాలు వున్నాయి. ప్రస్తుతాంశానికి యివి చాలును. పారలౌకికంలోకూడా మాయిద్దఱి సంబంధమున్నా సమ్మత మన్నందుకు జగజ్జనని (స్వప్నంలోనే అనుకోండి, కొందఱు ప్రత్యక్షంగా జాగ్రిదవస్థలోనే అమ్మవారితో మాట్లాడినట్టు ప్రకటించేవారున్నారు. నాకు అట్టి భాగ్య మిప్పటికి లేదు) చేసిన "మఱేఁడివాఁడు?" అనేప్రశ్న సూచక మని నా వెఱ్ఱినమ్మకము. ఆ యీ వ్రాఁతకంతకూ ఫలితం తి, వెం. కవులకు వుండే మైత్రి అసూయాపరుల భేదోపాయాలకు జీవితకాలంలోనే కాదు, తదనంతరమందే కాదు లోఁబడేది గాదనియ్యేవే.

రచననుగూర్చి — "ఇరువురు గూడి యే రచన యెప్పుడుఁ జేయుదురు" అనేపద్యంలో జాతకచర్యలో వివరించి వున్నాను. నేను బందరు ప్రవేశించడానికి రెండు వత్సరాలకు పూర్వమే మామాకూడికకు కొంచెంగా అంతరాయకారణం యేర్పడ్డది. నేను జీవితసంశయపు జబ్బునుండి బయటికి వచ్చి అప్పుడు బాధిస్తూవున్న వేయిరూపాయీల ఋణాన్ని తీర్చే నిమిత్తం (యీ ఋణబాధనుగూర్చి - ఋణబాధల్ వ్రణబాధ లండ్రు అనే పద్యం కామేశ్వరిలో వుంటుంది) తూర్పుదేశప్రయాణం పెట్టుకొని తాత్కాలికవాసం వింజరాన్నుంచి బయలుదేఱి మొదటిమకాం కాకినాడకువచ్చి తి. శా. ని రమ్మని మామోలుగా పిలిచాను. జమీన్‌దారుగారునెలవిస్తురో? యివ్వరో? యితఁడు వారిని అడక్కుండానే యీలా జవాబిచ్చాఁడు —
"నేను సభనాఁటికి వస్తాను నీవు సర్వ సంసిద్ధం చేసి తంతి నివ్వవలసింది" అనేటప్పటికి నాకు కొంచెం భారంగా తోఁచి మనస్సులో అనుకున్నాను. యేమనంటే? "సరే! నేను అసహాయంగా సభ నిర్వహించలేకపోతే ఆలాగే తంతి నిచ్చి నిన్ను సభవేళకు రప్పించుకుంటాను లే" యీలా అనుకొని శిష్యుణ్ణి సహాయానికి మా పినతండ్రికొడుకు చిన వేంకటశాస్త్రిని వెంటఁబెట్టుకొని ప్రయాణం సాఁగించి, అనకాపల్లె మొదలుకొని మందసా వఱకున్నూ అవధానాలు చేశాను—

చ. "తిరుపతి వేంకటేశకవి ధీరులలో నొకరుండ వేంకటే
శ్వరుఁ డనువాఁడ ని న్నొకటిఁ బ్రార్థన సేయుచు నున్నవాఁడ నీ
కరుణ శతావధానకృతి కారణమై తగునేని నేఁడు మా
తిరుపతిశాస్త్రి రానివెలితిన్ సవరింపుము దేవి ! మ్రొక్కెదన్."

యీపద్యంవల్ల ఆప్రయాణం యావత్తూ నేను వొక్కణ్ణే చేసినట్టు విస్పష్టమే. దానిక్కారణం సభసమకూర్చడందాఁకా యావత్తుశ్రమా పడి ఆసమయానికి అతణ్ణి రప్పించి ( అమర్చినదానిలో అత్తగారు వేలెట్టిందన్నట్టు ) చెఱిసగమున్నూ పంచిపెట్టడానికి నాకు లేశమూ యిష్టం లేక పోయింది - అతఁడైతే " మీకు యెంతతోస్తే అంతే పంచిపెట్టండి " అనికూడా అన్నాఁడుగాని నేను నీకు చెఱిసగం పంచిపెట్టేవాణ్ణేకాని పైసా కూడా తగ్గించేవాణ్ణికాను. ఆలా పంచిపెట్టడానికి యీ " తంతివార్త ప్రణాళిక పనికిరా " దని ఖండితంగా చెప్పేశాను. ఆప్రయాణంలో సుమారు మూఁడు మాసాలల్లో రెండువేల దాదాపు రొక్కమూ, వొక అఱసంచీ వెలగల శాలువలూ పట్టుబట్టలు వగైరాలున్నూ నాకు లభించాయి, ఋణం తీర్చివేశాను — మిగిలింది ఖర్చుపెట్టుకుంటూ స్వగృహంలో స్వతంత్రంగా- " స్వయం రాజా స్వయమ్మంత్రీ " గా కాలక్షేపం చేస్తూన్నాను. మళ్ళా నాయేర్పాటు ప్రకారం అయితే యెప్పుడు బయలుదేఱతానంటే, వేయి రూపాయీలు ఋణ మయేదాఁకా బయలుదేఱేది లేదు. అంతకు మించిన ఋణం చేయఁదగ్గ తాహతు నాకు లేదని నాలో నేననుకొనేవాణ్ణి. తి.శా.కి, నె 1 కి రు 20—0—0 రూపాయీలు తప్ప యితరలాభం లేశమూ లేక పోవడంచేత మళ్ళా సంచారం చేదా మని కుతూహలం వుంది గాని పరాధీనంలో వుండడంచేత వీలిచ్చింది కాదు. తంతి యిచ్చేపద్ధతికి నేను అంగీకరిస్తే జీతానికి జీతమూ దీని కిదికూడా లభించేదిగాని అందుకు నేను బొత్తిగా అంగీకరించక పోవడంచేత వీలుపడిందికాదు, నాకు పూర్వం పది సభలుచేస్తే వచ్చినంతలాభం ఇప్పుడు అయిదుసభలకే లభించడంచేత చాలా విశ్రాంతికూడా చిక్కింది. మే మిద్దఱమూ

యీరీతిని సుమారు ఆఱు సంవత్సరాలు విడివడి వున్నాం. అంతకాలం వేఱువేఱుగా వున్నప్పటికీ తరవాత మళ్లా కలిసే సంచారం చేయడంచేత యీసంగతి యెవరో అత్యాప్తులుతప్ప యితరులు యెఱుఁగరు. ఆరోజుల్లోనే నూజివీటి సంపూర్ణ శతావధానం, ఆ సంస్థానంలో నాకు మాత్రిమే నూట పదార్లు వార్షికం పుట్టడానిక్కారణం మా యీ యెడఁబాటే. ఆసంస్థానానికి వెళ్ళేటప్పుడు ప్రిస్తుతం కీ. శే. వోలేటి వేంకటరామశాస్త్రి మూకపంచాశతి చదువుతూవున్నాఁడు. సాక్షిపద్యంలో ఉన్న "నూజివీడ్రామచంద్రిండు సాక్షి" అన్న రామచంద్రిఁడు శ్రీరామచంద్రాప్పారావుగారే. వారు అవధానం చూచి "యిది యీకాలంలో చేస్తే తగినసత్కారం చేయఁదగ్గ జమీన్‌దార్లు లేరు కనక యిఁక మీరు దీన్ని యెక్కడా చేయకుండా వుండవలసింది. మా సంస్థానంలో స్థాయిగావుంటే మాకు చాలా సంతోషం" అని నాచేత ఆలాగే అని కూడా అనిపించారు. నూజివీటి సమ్మానంకూడా జరిగాక, తి. శా. యింకోపద్ధతిగా రాజీకి వచ్చాఁడు - అది యేలాటిదంటే? తనకు జమీన్‌దారుగారు నెల 1కి యిచ్చేజీతం రు 20-0-0 లలో సగంవంతు రు 10-0-0 లున్నూ యేనెల కానెల నాకు పంపేటట్టున్నూ నేను సంచారార్థం వెళ్ళి చేసే సభలకు తంతియిచ్చి సభాసమయమందు వున్నందుకు చెఱిసగం పంచిపెట్టేటట్టున్నూ చేయవలసిందన్నాఁడు. దీనికి వొప్పుకుంటే వొకచిక్కు కనపడింది. యింట్లో కూర్చోపెట్టి నెల 1కి రు 10-0-0 రూపాయీలు పంపిస్తూవున్న, తి. శా. గారు నన్ను సంచారార్థం వెళ్ళ వలసిందని తొందరపెట్టకుండా వుండడ మంటూ వుంటుందా ? ఆలా తొందర పెట్టేయెడల యేసంస్థానంలోనూ వుండక నేను స్వతంత్రింగా వున్నలాభ మేం కలుగుతుందినాకు ? - అర్థాత్తూ " అర్థస్య పురుషోదాసః " కనక, పోలవరపు జమీన్‌దారుగారికి తి. శా. దాసుఁడైతే తి. శా. కి, నేను దాసుణ్ణి కావలసి వస్తుందిగదా ! అనియైతే యేమి, యేదూరపు సంస్థానాల (మైసూరు వగయిరాలు) కేనా వెళ్ళినప్పుడు తి. శా. జమీన్‌దారుగారు దూరమనే హేతువుచేత సెల వివ్వనిపక్షంలో అసలే రాకపోతే నూజార్లూ

వేయార్లూమాటాలావుండఁగా శాలువులూ కంఠాభరణాలు వగయిరాలు వాక్కారికే యిస్తారుగాని స్వగృహంలో వున్నవారి కివ్వడం అసంభవంగదా! ఆపద్ధతిని వాట్లపంపకం యేలాగా ? అని సంశయం వచ్చి తుదకు అదీ కుదిరిందికాదు. కుదరకపోయినా "యెడముఖం పెడముఖం" అన్నట్టు మాత్రం మేము వుండలేదు - రచన వేఱువేఱుగా చేస్తూవున్నా మా యేర్పాటు ప్రకారం యిద్దఱిపేర్లూ కల్పుతూనే వుండేవాళ్ళం. అవధానానికి అతఁడు రాకపోవడంవల్ల ద్రవ్యం పంచిపెట్టడం లేదుగాని పేరు తిరుపతి వేంకటీయమే. యింకా వ్రాస్తే చాలా వ్రాయాలి. యితరసభలమాట యేలా వున్నా సంస్థాన సభలకేనా తంతి యివ్వవలసిందన్నాఁడు అతఁడు. అదీ కుదిరేది గాదు కనక నేను వెళ్ళినట్టే నీవీలునుబట్టి నీవున్నూ సంస్థానాలకు యెందుకు వెళ్ళఁగూడదన్నాను నేను. దాని మీఁద అతఁడు నా కిచ్చిన నిష్కపటపుజవాబు నేనిక్కడ వ్రాయడం బాగుండదు. అతని పరిశుద్ధ హృదయాన్ని తెల్పే ఉత్తరాలుకూడా నావద్ద వున్నవి గాని యెవరో అసూయపరవశులై యేవో కడుపుమంట మాటలు వ్రాస్తే దానిమీఁద కొండని ద్రవ్వి యెలకని పట్టేటట్టు వ్రాస్తే వ్రాఁతలో వాట్లనికూడా ప్రకటించడానికి నామనస్సు అంగీకరించింది కాదు. ఆ వ్రాసే కడుపుమంటవారు యీ ద్వారాగా నా ప్రకృతిని దోషజుష్టం చేయడానికే పాపపుమార్గంలో కలాన్ని నడుపుతూ వున్నారేమో ? ఆపద్ధతిని వారికుతూహలాన్ని నెఱవేర్చడానికి నేనుకూడా తోడ్పడ్డట్టవుతుంది గదా ! ప్రకృత మనుసరామః. యీలాగు మూఁడేళ్ళకాలం విడివిడిగానే కాలం జరిగింది. ఆ మూడేళ్ళలోనే గద్వాలరాజుగారి బావమఱిది శ్రీ తాడికొండ రామారెడ్డిగారికి లోఁగడనే కృతిగా రచించిన "లక్షణాపరిణయపు" బహుమానానికి ముందు నేనే వెళ్ళి సర్వసంసిద్ధం చేసి పిలిపించడమే జరిగింది. అంతట్లో నాకు బందరు హైస్కూలులో ప్రవేశించడం అనివార్యమయింది. దాన్నిబట్టి యిద్దఱమూకూడా పరాధీనులమే కావలసివచ్చింది. బందరు ప్రవేశించిన సుమారు మూఁడేళ్ళలో మళ్ళా మేమిద్దఱమూ కలిసి శతావ

ధానం చేయడానికి తగ్గ సంఘటన దానంతట అదే ప్రాప్తించింది. (ఆ మూఁడూ యీమూఁడూ కల్పితే వెరశి ఆరేళ్లు వ్యష్టిగా వున్నట్టయింది) దాన్ని వివరిస్తాను. నూజివీటి సంస్థానానికి వైష్ణవమతగురువులు శ్రీయుతులు వానమామలజియ్యంగారు దయచేశారు. వారికిన్నీ, శ్రీ రామచంద్రాప్పా రావుగారికిన్నీ అత్యంతమైత్రి యేర్పడ్డది. వారిప్రసంగంలో అప్పారావుగారు నన్నుఁగూర్చి యెక్కువగా ప్రశంసించడంవల్ల స్వామిగారు నన్ను వొకసారి చూడవలెననే కుతూహలం కనపఱిచారు. అప్పుడు రాజావారు నాకు టెలిగ్రాపు యిచ్చారు. ఆ రోజున తి. శా. కూడా (కాకతాళీయంగా) బందరులోనే వున్నాఁడు కాని యిఁక కాస్త సేపటికి తంతి వస్తుందనఁగా పడవకి వెళ్ళివున్నాఁడు. అప్పటికింకా బెజవాడనుంచి బందరుకు రైలునడ వటం లేదు. యేలాగో నేనుమాత్రమే నూజివీడు వెళ్ళి యిఁక ఇద్దఱమూ కలవడానికి ఉండే అభ్యంతరం తీరడంచేత అనఁగా యిద్దఱమున్నూ పరా ధీనులమే అవడంచేత యెప్పఁడోగాని అవధానసభలకు వెళ్ళవలసిన ప్రసక్తి కలగనే కలగదుగనక, తి.శా.నిగూడా పిలిపించవలసిందని అప్పారావుగారిని హెచ్చరించేటప్పటికి శ్రీవారు సంతోషపూర్వకంగా తంతి నిప్పించి రప్పిం చారు. యథాపూర్వకంగా శ్రీవానమామలస్వామి సన్నిధిని జరిగిన శతావ ధానంలో మళ్ళా కలుసుకున్నాము. యావజ్జీవమున్నూ యిఁక మళ్ళా విడి వడకుండానే గుంటూరిసీమ వగయిరాలలో జరిగిన అవధానాలు జరుగుతూ వచ్చాయి. ఆయీ అంశాలు శతావధానసారం కొంత పరిశీలకతా బుద్ధితో చదివేవారికి విస్పష్టమే అవుతాయి. కాని అంతటి పరిశీలకత్వం కష్టసాధ్య మని కొంత వ్యాఖ్యానించవలసి వచ్చింది. వొకటిమాత్రంవుంది. నేను ఆ ప్రాణాపాయపుజబ్బులో అంతరించి నా అనంతరం తి. శా, నిల్చి వుండడ మేవస్తే తరవాతరచనలలో నాపేరు చేర్చడంమాట సర్వాబద్ధమని 'తిరుపతిశాస్త్రి తెలుంగుచేసె' అనేది తెలుపుతుంది. నేను ప్రాణాపాయ కరమైన జబ్బులో వున్నప్పుడు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు డిప్యూ టీకలెక్టరుగా నరసారావుపేఁటలో వున్నప్పుడు ఆ వూరువారి కోరికమీఁద

మమ్మల్ని ఆహ్వానించారు. అప్పుడు 'వెం. శా. చాలా జబ్బులో వున్నాఁడు. కాఁబట్టి యేలా వచ్చేది ?' అని తి. శా. జవాబిచ్చాఁడు. దానిమీఁద మీరు వొక్కరేనా సరే తప్పక వచ్చితీరాలని తంతినిచ్చారు. విధిలేక యిష్టం లేకపోయినా తి. శా. వెళ్ళి వొక్కఁడే అవధానం చేశాఁడు, సమ్మానించారు. యిది యెప్పుడు జరిగినసభ అంటే, మేమింకా విడివడక పూర్వం, తి. శా. కాకినాడలో ప్రవేశించిన కొత్తలో జరిగింది. అందుచేత నేను అనారోగ్యంగా వుండి వెళ్ళకపోయినా చెఱిసగం నాకు పంచిపెట్ట వలసిన ఆవశ్యకత్వంవుంది. కాని అతఁడు అలా చేయలేదు. అది కొంత మాలో మాకు తాత్కాలికంగానే అనుకోండి, మనోమలికలకు కారణం కాక తప్పిందికాదు.

"మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయనమోనమః" అనడం అందఱూ యెఱిఁగిందే ఈ నరసరావుపేఁట పంపకాన్ని గూర్చి వ్రాస్తే చాలా వ్రాయాలి, అవసరమైనంతే వ్రాశాను. కొంచెం మనోమలిక కలిగినా కవితారచనా విషయంలో పేరులు కల్పుకోవడం మానలేదు. వానమామలావధానంతో ఆ కాస్త మనోమలికాకూడా తీరిపోయింది. ప్రత్యేకరచనారంభం నేను బందరు ప్రవేశించడానికి కొంతపూర్వంనుంచే సంభవించింది. సరస్వతీపత్రి కంటూ వొకటి లేకపోతే తి. శా. ప్రత్యేకరచన వుండకే పోవలసి వచ్చేది. అతనికి కవితావ్యాపకంకంటే ఆటపాటలతో కాలక్షేపం చేయడమే యెక్కువ యిష్టం. నెలనెలకూ సరస్వతికి కొంత నైవేద్యానికి కొంత మేటరు సిద్ధంచేయవలసి వచ్చేది. దానికోసం బాలరామాయణ, ముద్రారాక్షస, మృచ్ఛకటికలేకాదు, విక్రమాంకదేవచరిత్ర, చంద్రప్రభ చరిత్రలుకూడా ఆంధ్రీకరించాఁడు. హర్షచరిత్రలో కొంతభాగంకూడా అతఁడే ఆంధ్రీకరించాఁడు గాని అది సరస్వతికోసంగాదు, శ్రీ చెలికాని లచ్చారావుగారు ప్రచురించే పత్రిక కోసం (పత్రికపేరు జ్ఞాపకంరాలేదు) దీని తెలిగింపునాఁటికి పోలవరపు జమీన్‌దారుగారు స్వర్గస్థులవడంచేత సరస్వతీ పత్రిక ఆగిపోవడమేకాదు, తి. శా. గారుకూడా యితరాశ్రయం

వెతుక్కోవలసి వచ్చింది. ఆ లోటు తీర్చినవారు శ్రీ లచ్చారావుగారే. లచ్చారావుగారి నివాసగ్రామానికి మకాం మార్చాలనుకుంటూ వుండఁగా తి. శా. కి, నూతేండ్లునిండడం తటస్థించి కాకినాడనుంచే స్వర్గపురియాత్ర చేయవలసి వచ్చింది. అప్పటికి ప్రథమాంకం మాత్రమే రచించి పత్రికలో ప్రచురించిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకాన్ని, అతని జీవితానంతరం లచ్చారావుగారి కోరిక ననుసరించి యథాలాభంగా నేను పూరించి యిచ్చాను. (నేను స్వతంత్రంగా నాకుతోఁచినదానిమీఁదే కవిత్వం చెప్పగలనుగాని యెవరో వ్రాయవలసిందంటే వ్రాసే శక్తికలవాణ్ణికాను. అయినప్పటికీ శ్రీ లచ్చారావుగారిమాట తీసివేయలేక పూరించి యిచ్చాను) యింకా సువర్ణ పాత్రికం అంటూ వకటి (ప్రకరణం) ప్రారంభించి సరస్వతిలో రెండంకాలదాఁకా ప్రచురించాఁడు. దాని పేరునుబట్టి అది విప్రనారాయణ చరిత్రకు సంబంధించినదని విస్పష్టమే. ప్రకరణమన్నప్పుడు పది అంకాలు వుండవలసి వస్తుంది. రెండంకాలు అయ్యేసరికి యించుమించు యావత్తు కథాకూడా వచ్చేసింది. తక్కిన యెనిమిదంకాలకీ మేటరెక్కడనుంచి వస్తుంది? అందుచేత అది అంతతోనే ఆఁగిపోయింది. అది ఆరంభించిన తరవాత పుష్కరకాలంకంటే గూడా అధికకాలమే అతఁడు జీవించి వున్నాఁడు. వున్నప్పటికీ మొట్టమొదట పర్యవసానం ఆలోచించకుండా మొదలు పెట్టడంచేత ఆనాటకం "యావత్తైలంతావిద్వ్యాఖ్యా" గా ఆఁగి పోవలసి వచ్చింది. "పరిణతిరవధార్యా" అనే భర్తృహరి వాక్యం ప్రతివిషయానికీ ఆవశ్యకమే అనుకోండి. అందులో కవిత్వానికి-తత్రాఽపీ నాటకానికి మరీ ఆవశ్యకమంటాను నేను. ఆ రెండంకాలు చాలా బాగానే వుంటాయి. షష్టిపూర్తి ముద్రణంలో అది చేర్చలేదు. అసంపూర్తి స్థితి లోనే వున్న వ్యసన విజయాన్ని మాత్రం చేర్చారు. వ్యసనవిజయానికి కథావస్తువు జూదగాండ్రు. అదికూడా రెండంకాల లోపులోనే ఆఁగి పోయింది. దానికిన్నీ కారణం కథావస్తు శూన్యత్వమే. దాని రచనారంభా నికి దరిమిలానుకూడా అతఁడు చాలాకాలం జీవించే వున్నాఁడు. మేటరు

లేక ఆపినట్టు అతఁడే చెప్పేవాఁడు. చెట్టుకాచిన కాయలన్నీ పళ్లుకానట్టే కవి మొదలెట్టిన కబ్బాలన్నీ పరిపూర్ణ స్థితికి రావు. పరిపూర్ణస్థితికి వచ్చిన వాట్లలోకూడా యేవకటి రెండో లోకానికి ప్రీతిపాత్రా లవుతాయి. "తత్రాఽపిచ చతుర్థోంక స్తత్ర శ్లోకచతుష్టయమ్" అన్నసూక్తివల్ల యీసారాంశం అవగతం అవుతుంది. రచించే కవికిమాత్రం యేది లోకానికి యెక్కువ ప్రీతిపాత్ర మవుతుందో రచనాకాలంలో గోచరించదు. ఆ యీ విశేషం కాళిదాసుగారి - "ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానమ్" అనే వాక్యంవల్ల తెలియ వస్తుంది.

మాకవిత్వం బోలేఁడు వున్నా - శ్రీవణానందానికే లోకప్రచారం హెచ్చు. యథాలాభంగా గిలికిందేగాని అది యింతపేరు సంపాదించు కుంటుందని మాకు లేశమూ తెలియనే తెలియదు. "గ్రంథరూపంగా దీన్ని చిత్రించ వద్దుగాక వ" ద్దంటూ నేను నిషేధిస్తూండఁగా దాన్ని లక్షింపక, అంతకు మునుపే నానోటినుండి అవశ్యంగా దొర్లిన ధనమూ పోవును అనే పద్యాలు (చోరపంచాశత్తులో వున్న అద్యాఽపి తాం శ్లోకాలవలె వున్నాయి) యివి వృథాగా పోతాయి అంటూ రచన కారంభించి, యెచ్చరాయితనంగా యేకొన్నిపద్యాలో నాయికా నాయకుల వర్ణనంమాత్రం రచించి, మళ్ళా దానికేసి చూడక వుపేక్షించాఁడు. ( ఆరంభశూరాః ఖలు దాక్షిణాత్యాః ) తరవాత దానంతట అదే పూర్తిఅయి, కొంతకాలం మూలఁబడి వుండి, అటుతరవాత పైకి వచ్చి సహృదయులచేత—

క. ఒకశ్రీవణానందమ్మున
నొకపద్యమునందుఁ గలుగు నొకపాదమునం
దొకయక్కరమున కిచ్చిన
సకలంబగు రత్నగర్భ చాలునె తూఁపన్.

అన్నంత పొగడికను పొందింది. దీన్ని యీసడించినవారల్లా నాకు వొక్కరే కనపడ్డారు. దానివల్ల దానిగౌరవ మేమీ తగ్గలేదుగాని....

అంతే జరిగింది. "అసూయానామ గుణేషు దోషావిష్కరణం" అనిలక్షణం. పాణిగృహీత దీనికంటే బాగుంటుం దనే వుద్దేశం మాకు వుండేది గాని, దానికి లోకంమాత్రం మాతో యేకీభవించింది కాదు. లోకాన్ని తోసి రాజ ' ని పేరులేనికవిత్వానికి పేరు తేవడానికి ప్రయత్నించడంకంటే వెఱ్ఱి తన మంటూ వుంటుందా ? అట్టివెఱ్ఱి మాకు లేదు.

కవిః కరోతికావ్యాని లాలయత్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి, మరు ద్వహతి సౌరభమ్.

అనే అభియుక్తోక్తివల్లకూడా రసారసవిచారం లోకాధీనమనే తేలుతుంది. వ్యక్తిగతంగా కవియందు ద్వేషం వున్నప్పటికీ, యేకవి కవిత్వాన్ని శత్రువర్గంకూడా ప్రేమిస్తూవుంటుందో ఆకవి సర్వథాధన్యుఁడు. అన్యుఁడో, కాఁడు. కొందఱు ద్వేషంలేనిరోజుల్లో తెగపొగిడి, ద్వేషం వచ్చినతరువాత నాలుకమడతమాటల కారంభించడమున్నూ వుంటుంది. కాని, ఈరీతి మనుష్యులు అరుదుగానే వుంటారు. వీరిపొగడిక కెంతఅర్థం వుంటుందో, తెగడికకూ అంతే. వీరు రసపరవశు లెన్నఁటికీకారు. అలాటి పరవశత్వమే వుంటే, దాన్ని ద్వేషం ఆఁపఁగలుగుతుందా? ఆఁపడానికి గుండెలున్నాయా. "స్మృతిః క్వచ రతిః క్వచ క్వచ తవాళి శిక్షవిధిః" అని రసమంజరిలో సురతానంద మోహితనుగూర్చి వుదాహరించాఁడు. శత్రుపక్షమందు వున్న పూర్వసిని నరకాసురుఁడు ప్రేమించడాన్నిబట్టి యీవిషయం నిర్ణయించవచ్చును. శ్రవణానందంలో వేశ్య నాయిక కనక, రసాభాసదోషం వస్తుందని వివదించేవారు లేకపోలేదు. వారికీ యితర విజ్ఞులకూ బోలెఁడు భేదం వుంటుంది. రసాభాసం అయితేనే కవిత్వం చెడ్డదవుతుందా! ఆపక్షంలో మనుచరిత్ర గతేమిటి? దేవతాస్త్రీ కనక వేశ్యాత్వదోషం నివర్తిస్తుం దంటారా? అంతమాత్రంతో విత్తమాత్రప్రయుక్తాఽనేకపురుషానురాగ దోషం నివర్తించదు. ( సవనతంత్రమ్ము లుంకువలు మాకు ) కాని, అందుకూ వొప్పుకొన్నా, తనయందు అనురాగం లేశమూలేని ప్రవరుణ్ణి

ప్రేమించడ మేమిటి? రసాభాసం కాదా? పిమ్మట తనయందు లేశమూ ప్రేమలేని గంధర్వునితో (ప్రవర రూపధరునితో) వరూధినికి సమాగమం రసాభాసం కాదా? దీన్నికూడా యేలాగో సవరించుకుందాము. భారతంమాట చెప్పండీ, ప్రధాన నాయకులు పాండవులకు వుమ్మడిదమ్మడి భార్య వొక్కతే వుండడం పేరేమిటి? ("మహాత్ములు పాండవు లెగ్గ ఱుంగరే?" అని ప్రశ్నించాడు పాపం మునిమన్మఁడు) రసాభాసం కాదా? అందుచేత రసాభాసయైనంతమాత్రంలో కవి కవిత్వానికి లోటు రాదు. యథాశాస్త్రంగా రచించవలసివస్తే, శకుంతలా దుష్యంత సమాగమం రాత్రికి మార్చవలసి వస్తుంది. కాళిదాసుకి యీమాత్రంకూడా తెలియకే మట్టమధ్యాహ్నం వారి కిద్దఱికీ సమావేశాన్ని చిత్రించాఁడా? అతఁడు వ్రాస్తూవున్నది నాటకంకదా? "అన్యథావా ప్రకల్పయేత్" అని లాక్షణికుల అభ్యనుజ్ఞకూడా వుంది — ఆయీ విషయాన్ని గూర్చి యింతమాత్రమే వ్రాస్తే చాలదు. కవి దేన్నిచిత్రించినా, దాన్ని హృదయంగమంగా చిత్రించడమే కావలసింది. మొత్తంమీఁద మాట లోఁతు సంగతు లెఱుఁగని విమర్శకులవల్ల సామాన్య కవిలోకానికి కొంతచిక్కు కలుగుతూ వుంది. ఆ విమర్శకులు తమలో తాము యేశంకలో చేసుకొని వూరుకోక, ఆశంకలు సిద్ధాంతాలనుకొని పత్రికల కెక్కిస్తారు. వాటిని చూచి, సామాన్యులు భ్రమపడతారు. కళాపూర్ణోదయంలో కలభాషిణి నాయికగా వుండడం బాగులేదని వొకరంటారు. దానికిన్నీ కారణం రసాభాసదోషమే. నేను అది లేదని సమర్థించడానికి పూనుకోవడం లేదు. అది వున్నపద్ధతికూడా జనరంజకంగా వుంటే, ఆదరణీయమే అంటాను. మేఘసందేశం పుణ్యగాథ కాదంటూ వివదించేవారు కొందఱున్నారు. దానికి కొందఱు అక్కడక్కడ దేవాలయాదుల వర్ణన లున్నాయి గనక ఆదోషం వివరిస్తుం దని జవాబు చెప్పడంకలదు. నే నంటానుగదా? పుణ్యకథలు కవికి పరలోకసుఖాన్ని కలిగించినా, వాటినే పట్టుకు వేళ్ళాడే పద్ధతిని కవి కవిత్వం చెప్పనక్కఱలేదు.

"రామకోటి" వ్రాసుకుంటేనే చాలును. వొక రంటారు కదా, శ్రీవణానంద మసత్కావ్యము. దీనిలో కవికుమారుఁడు నాయకుఁడు, అంటూ ప్రారంభించారు. కవికొడుకు గాదు, కవే నాయకుఁ డనుకుందాం, కవిగాని, కవికుమారుఁడుగాని నాయకుఁడైతే అసత్కావ్య మవుతుందని యెక్కడవుంది ? యివి రసవిముఖుల మాటలు. కనక నానా రసాలతో కవికి సంబంధం వుండడం ఆవశ్యకమని ఆయాకవుల ప్రవృత్తిని బట్టి తేలుతుం దంటాను. కొన్ని కావ్యాలయందు ప్రాధాన్యంగానున్నా, కొన్ని కావ్యాలయందు వుపసర్జనంగానున్నా రసాభాసం వుంటూనే వుంది. ఆది కావ్యమైన - రామాయణంలో కూడా, అప్రధానంగా రసాభాసాన్ని ప్రవేశ పెట్టే వున్నాఁడు వాల్మీకిమహర్షి. సీతారావణులకు సంబంధించిన శృంగార మేలాటిది ? అది శుద్ధ రసాభాసమే. దాన్ని తొలగించే యెడల, రామాయణమే లేకపోవలసి వచ్చి - మూలచ్ఛేదీ తవపాండిత్య ప్రకర్షః అయి, "రఘుకుల కథైవ వార్తా మయతే" అనే మురారివాక్యం ప్రత్యక్ష మవుతుంది. మంచి శృంగారంవల్ల నేర్చుకొనే నీతి కొంత వుంటుంది. రసాభాసశృంగారంవల్ల నేర్చుకొనే నీతి కొంతవుంటుంది. కనక, పూర్వోక్త శంకలు శంకించే వారిని వుపేక్షించ వలసి వుంటుందని జిజ్ఞాసువులకు నాసలహా. మా మా రచనలను గూర్చి వివరించే సందర్భంలో అవాంతరంగా యీ రసాభాస విషయం వచ్చి, పెరిగింది. మళ్ళా ప్రకృతానికి వచ్చి వ్రాయఁదగ్గది వ్రాస్తున్నాను. యెంత మేము కలిసి కవిత్వంచెప్పినా, యిద్దఱిలో వొకరు చెపుతూవుంటే యేదో తోచినపదం మార్చి కొంతా, మార్చక కొంతా, రెండోవాడు వ్రాయడమే అనుకోవాలి గాని, ప్రతీ అక్షరమూ యిద్దఱినోటా వెలువడే వుంటుం దనుకోవడం పొసఁగదు. దూర దూరంగా పది పన్నెండు ఆమడలలో ఉన్నప్పుడు సాఁగిన రచనలని గూర్చి చెప్పేదేమిటి ? అలాటి రచనలలోకూడా యిద్దఱిపేరులూ వున్నవి.

"ఒక్కరు రచియించిరేనియును గాఁదగుఁ దిర్పతి వేంకటీయమై" అంధ్రీకృత నాటకాలన్నీ యీతరగతిలోవే. వాట్లల్లో కొంచెం తేడాపాడాలు

వున్నట్టు మా పరిభాకరశాస్త్రి అప్పుడప్పుడు అంటూ వుండేవాడు. దాని క్కారణం యథాలాభంగా అనువదించడమే గాని, పాండిత్యలోపం కాదు. 'జితకాశి' శబ్దం శబ్దరత్నాకరంలో కూడా వుంది. దీన్ని చంటి కూనకూడ చూచుకోవడాని కవకాశం వుంది. దాన్ని నేనుగాని తి. శా. గాని చూచుకోవడం చేతకానివాళ్ళమని యేమాత్రిం లోకజ్ఞత్వంఉన్నా, వ్రాయడం పొసగదు. యీలాటి ప్రమాదాలు కొన్ని ఉన్నట్టు మా శిష్యులద్వారాగానే మాయిద్దరికీ తెలిసి, చాలాకాల మయింది. పునర్ముద్రిణంలో అనగా ఆంధ్రీకృత నాటకాలు సవరిద్దామని అనుకున్నాం గాని, అవి అంతగా ఖర్చయ్యేవి కాకపోవడంచేత తి. శా. గారి జీవితకాలంలో పునర్ముద్రిణ భాగ్యం వాట్లకు పట్టనేలేదు. కీ. శే. వేదం వెంకటరాయ శాస్త్రుల్లుగారు జితకాశిని తప్పన్నారని నేను విన్నాను. అది తప్పే కనక, వారితో ముఖా ముఖిగా కాని, పత్రికాముఖంగా గాని నేను వివాదపడలేదు. దానితో నాకు సంబంధం లేదని అనలేదు. కడుపుమంట కల్పన కర్థముంటుందా ! తత్త ధాస్తాం. నాజీవితకాలంలో-షష్టిపూర్తి ముద్రిణం వారు వాట్లనికూడా వొక సంపుటంగా విభజించి, ముద్రింపఁదలచి, సంస్కరించి యివ్వవలసిందని నన్ను కోరారు. కాని, నాస్థితి అప్పటికి చాలా శోచనీయంగా వుండడంచేత నే నాపని పెట్టుకోలేదు - దానితో వారు నిరాశులై వాట్ల ముద్రిణం చాలా కాలం నిల్పి వుంచారు. యెంతకాలం వారు నిల్పి వుంచినా వారికి నావల్ల కలిగే సహాయం లేకపోయింది. తి. శా. కొడుకు అవధాని ముద్రారాక్షసం సరిచూచి, నావద్దకయితే తెచ్చి, వినమన్నాఁడుగాని, దాన్ని నేను బాగా నిఘాగా వినలేదు. (స్వస్థేచిత్తే బుద్ధయ స్సంభవంతి) మఱికొన్ని మాసాలకు నేనుకొంత ఆరోగ్యం కలిగి (గుడ్డిలో మెల్లవంటి ఆరోగ్యమే) వైద్యం నిమిత్తం బందరువెళ్ళి వున్న రోజుల్లో మృచ్ఛకటిక ముద్రిణం ఆఁగిపోవలసి వచ్చిందని శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు బలవంత పెడితే, దాన్ని అతని సహాయంతో సంస్కరించాను. కాని, ఆ సంస్కారంకూడా నాపూర్వపు చేదస్తాన్ని పురస్కరించి చేసిందిమాత్రిం కాదు — ఆయీ

నాటకాలమట్టుకు సంస్కరించేభారం మా ప్రభాకరశాస్త్రి మీఁదపెట్టి చాలా కాలం నిరీక్షించారు షష్టిపూర్తి ముద్రణంవారు. అతఁడల్లా బాలరామాయణం సగభాగం మాత్రం సంస్కరించి యిచ్చాడఁట! తక్కిన సగమున్నూ యింకా యెన్నాళ్ళు ముద్రణం ఆఁపేదని సంస్కరించకుండానే, యథాపూర్వంగానే ముద్రించారు. ఆయీ సంస్కరణం తెమలక్కే యెప్పుడో ముగియవలసిన షష్టిపూర్తిముద్రణం నిన్నమొన్నటిదాఁకా ముగియనే లేదు. యిప్పటికింకా కొంత తరవాయే. సరస్వతీపత్రికలో ప్రకటింపఁబడ్డ వాట్లలో నల్లా పాండవ విజయం వొక్కటి మాత్రమే నేను సంస్కరించి, బందరు భైరవ ప్రెస్సులో పునర్ముద్రణం చేశాను. దాన్ని వెక్కిరించే వోపికగాని పాండిత్యంగాని వుంటే నేను లోఁగడ చూపినట్లే నాప్రతాపాన్ని లేనివోపిక తెచ్చుకొని చూపిస్తాను. ఆయీ భయం వుండఁబట్టే కాఁబోలును ఆలాఁటి వాట్లమీఁదకు రాక, నామకః నాపేరు వున్న దానిమీఁదకి రావడం. యీ వుపాయం బాగానే వుంది. లోఁగడ నాపూచీ పూరాగా వున్నదాని మీఁదకి వచ్చి, పొందిన నష్టిని యిప్పుడేనా తెలుసుకోవడానికి అభినందిస్తూన్నాను. నేను చూడక పోయినా ముద్రారాక్షసాంధ్రీకరణం పునఃపాకానికి దింపి తి. శా. గారిని అతిక్రమిస్తారని నేను అనుకోను. యితర్లమాటేలా వున్నా, ఆక్షేపణకుఁ బూనుకొన్నవారు బొత్తిగానే సమర్థులుగారని సప్రతిజ్ఞంగా చెపుతాను. తి. శా. గారు యెంత "అశ్రద్ధపితాళ్ళకు ఆకతాయి తర్పణం"గా తెనిఁగించిన తెనుఁగయినా, ఆక్షేపించఁబూనినవారి అనువాదానికిఁ దీసిపోదనే నానమ్మక.

"ఎంతతగ్గిన మిరియాలుం జొన్నలసరిగావే" అన్నాఁడు నాచన సోముఁడు. యెక్కడేనా వ్యత్యాసాలు వుంటే, వుంటాయేమో అనే అనుమానంచేత నే నీలాగు వ్రాస్తున్నాను గాని, పరిశీలించి వ్రాసే వ్రాఁత కాదిది. యెప్పుడో అవసరమయితే పరిశీలిస్తాను. నిజమైన ప్రమాదం వుంటే, ప్రమాదమే అని వొప్పుకుంటాను. "తలపయి నున్న దెవ్వతె" అన్నచోట నీతలపయి అని వుండాలి అన్న మాదిరిని శంకించే చొప్ప

చంటు శంకలే అయితే. వాట్లబండారాన్ని బయటఁ బెట్టి "వీళ్ళజోలికి వెళ్ళకూడదు వెడితే మాటదక్కదు" అని డిటో ప్రకారం పశ్చాత్తాప పడేటట్టు చేస్తాను. కాని, యీవాదంమాత్రం యేపత్రికాకూడా స్వీకరించదని భయపడుతూన్నాను. ఆక్షేపకులు దీన్ని ప్రస్తుతం ప్రచురించే పత్రికను బట్టియ్యేవే ప్రసిద్ధపత్రికలకు యీ నామధేయమందు వున్న గౌరవ ప్రపత్తులు వెల్లడి అవుతూన్నాయి. ఆక్షేపకులకు తప్పులు కానివి తప్పులుగా పొడకట్టడానికి వున్న కారణసామగ్రిని

శ్లో. పాండిత్యలోపవశతః ప్రబలావలేపదోహా
దహంకృతివశాచ్చ వృథాఽస్మదీయేకావ్యే
శతం బత సహస్రమపి ప్రదోషా
ఈర్ష్యావశా దవగతా అభవన్ ప్రమాదాత్.

అనే శ్లోకంలో వ్యాఖ్యానించి వున్నాను. అనేకవ్యాసాలలో ఋజువు చేసి కూడా వున్నాను. అందుకే యితరకృతంమీఁదకివెళ్ళి, ఆయన అశ్రద్ధవల్ల లాభ మేమేనా కలుగుతుందేమో అనుకోవలసివచ్చింది. భవతు. ఆలాభం కూడా గూటల్లోకి వచ్చినప్పుడు అదీ తెలుస్తుంది. అంతేనేకాని, తి. శా. యెక్కడ? మనమెక్కడ? మనమల్లా కారణాంతరంచేత వెం. శా. కంటేనే అధికులం గాని, తి. శా. కట్టి సంబంధం లేదు కనక లొచ్చవు తామని యెందుకు తోఁచలేదో అనుకుంటాను నేను. "అత్ర కారణం భవితవ్యతైవ, నాఽన్యత్" భజగోవిందానికి యుక్తమైన వయస్సులో యెందుకు యీ డుకృఙ్‌కరణే వ్యాసంగం? అందుకు సామగ్రి వుందేమో అంటే, అదిన్నీ లేదాయె. ఆఖరికి మనుచరిత్రలో వుండే (శిరస్సరఘురీ) ప్రయోగంగాని, (ఉదారగుణాఢ్యులు మదీయలగు) అనేప్రయోగంగాని వెదకి చూచుకోవడానికి వోపిక లేదాయె. అమరవ్యాఖ్యానంలో ఘురీ అనే రూపాంతరం వుందనే సంగతిన్నీ తెలియదాయె. తుదకు శబ్దరత్నా కరంకూడా చూచుకొనే విధానమేనా చక్కగా తెలియదాయె. (యీతుది

విషయానికి లోకు లాశ్చర్యపడతారని నే నెఱుఁగుదునుకాని, నేను ఋజువు చేస్తాను ) యెందుకు యీ గిల్లి ఖజ్జాలు ఓంశాంతి శ్శాంతిః.

ఈ అనుబంధం పైవ్యాసాన్ని సంపూర్తిచేసి పోస్టుకు పంపుతూ, ప్రోసీ వొకమాటు తెలుఁగు 'ముద్రారాక్షసం' చూచే పంపుదామని తోఁచి భీరువాలు వెదికించాను. పరీక్షకు పాఠ్యంగా నిర్ణయించడంచేత దగ్గఱ వున్నమట్టుకు ఖర్చయిపోయినాయి. తప్పిజాబి నిల్చింది, వొకటి దొరికింది. స్థూలదృష్టిని చదివి చూచాను. అక్కడక్కడ కొన్ని ప్రమాదాలు కనపడ్డాయి గాని, వాట్లను శుద్ధపత్రికలో సవరించారు. అయితే, యిప్పటి ఆక్షేపకులు ఆ సవరణను కూడా పరిశీలించక పోవడం నాకు అనుభూతమవడంచేత అవికూడా జాబితాలోకి యెక్కేవే అనుకున్నాను. ఆదిద్దుఁబాటులో వొకటి రెండు అనవసరంగా దిద్దినవి కనడ్డాయి. అవసరమైనవి కొన్ని సవరించనూ లేదు — వాటిని చూపుతాను.

(1) "సుఖమనక యెవఁడు భయపడుచున్ భ్రమించు" అనేదాన్ని
"సుఖ మన కెవండు భయపడుచు" అనిన్నీ,

(2) "ప్రభువు లందగరు చూవె" అనేదాన్ని
"ప్రభు లనం దగరుచూవె" అనిన్నీ

(3) "ధృత కశాఘాత భీతవై" అనేదాన్ని
"ధృతకశాఘాతభీతిమై" అనిన్నీ

సవరించుకోవలసిం దని విద్యార్థిలోకాన్ని హెచ్చరించుచున్నాను. ఆక్షేపకులేదో పనికల్పించుకొని పాటుపడుతూనే వుంటారు. వారికి యీ సవరణలు వుపయోగించవని యెఱుఁగుదును. మఱిన్నీ నేనిప్పుడు సంస్కృత నాటకాన్ని దగ్గఱపెట్టుకొని అనువాదాన్ని చదవలేదు. యిది చదువుతూ వుంటే కేవలమూ స్వతంత్రరచనగానే తోస్తుంది గాని, అనువాదంగా తోఁచనే తోఁచదు. యీరీతిగా అనువదించుట తి. శా. కే చెల్లినది. కొన్నిచోట్ల మూలాతిక్రమణం వుంటే వుంటుందేమో ? సంస్కృతం ప్రస్తుతం నాకు

లభించకపోవడంచేత దాన్నిగూర్చి వ్రాయడానికి అవకాశం లేదు; ఆవిషయం వ్రాయడానికి నేను పూనుకోనున్నూ లేదు. తి. వెం. కవుల అనువాదం — "మక్కికిమక్కి" తెలుఁగు కాదని ప్రాజ్ఞలోక మెఱిఁగిన విషయమే. శ్రీనివాసవిలాసంలో

"ఒక్కెడఁ జక్కనౌ పదము నొక్కటిఁ జేర్చిన ముచ్చటౌ, మఱిం
కొక్కెడ నున్నదాన సగముంచి రచించిన ముచ్చటౌ, మఱిం
కొక్కెడ నున్నదాన సగముంచిన మేలగుఁ దెల్గొనర్చుచో
'మక్కికి మక్కి'యన్నటులు మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగున్ ?"

తి. వెం. కవులు స్వతంత్రించి యీమార్గం తొక్కినట్లనుకొంటారేమో ? కాదు సుమండీ ?

"ఒక్కయెడన్ సమానముగ నొక్కొకచోట విశేషరీతిగా
నొక్కెడఁ దగ్గుగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపఁగాఁ
జక్కఁగఁ జేసి రెల్లకవిసత్తము లాంధ్రముఁ జేయునప్పు డా
ఫక్కియె మేము పట్టినది పండితులార ! పెనంగఁబోకుఁడీ !"

అని మా ఆంధ్రీకరణ విధానాన్నిగూర్చి యెలుఁగెత్తి చెవి నిల్లుగట్టుకొని పోరుతూవున్నప్పటికీ, లోఁగడ యుద్ధాని కాహ్వానించి, అందులో పరాభవాన్ని పొందినవారు దాన్ని యేలాగో జీవితకాలంలోనే భర్తీచేసుకుందామనే తలఁపుతో — "యీ పద్యంలో - చా అనేదానికి ప్రతిపదం లే" దనీ "ఆపద్యంలో తూ అనేదానికి ప్రతిపదంలే" దనీయేదో కలహబీజాన్ని పెంచుతూనే వుంటారు - (పోనీ విద్యావాదంగదా ? అంగీకరిద్దామంటే, అది అంతతో ఆఁగదు. చతురుపాయాలకూ దిగుతుంది) యీ ఆంధ్రానువాదం ఆ తూ - చా - తరగతిలోది కాదు. చూడండీ మచ్చు —

"ఉపల సంఘట్టన గ్లపిత గంగానదీ శీక రాసారంబు శీతనగము
నైకరాగస్ఫుర న్నవమణిస్థగిత తీరాంతరాళము దక్షిణార్ణవంబు
వానరానీకసంవలితోరుకుంభీ సురావాసితములు తాళీవనములు
నంద నందన కథా నందైకమగ్న నాగరిక వారము ద్వారకాపురంబు

హద్దుగాఁ గల భూవలయంబునుండి
వచ్చి రాజులు భవదీయపాదయుగళి
కాంగుళీగర్భముల నుత్తమాంగ గత మ
ణిప్రభా తతిచేత నిఁడింతుగ్రగాత."

యీ సీసం యేశ్లోకానికి అనువాదమో నేనింతవఱ కాశ్లోకాన్ని యెఱుగను. కాని, యిది స్వేచ్ఛగా తెనిఁగించిం దవుతుంది గాని — "ముక్తస్య ముక్తార్థః" అనే తెగలో తెలుఁగుమాత్రిం కాదని ఘంటా పథంగా చెప్తాను. సీసపద్యానికి సరిపడేటంత "మేటరు" వుండేవృత్తాలు సంస్కృతంలో వుండవు. బహుశః యీపద్యార్థం సంస్కృతంలో శార్దూలంలో వుంటుం దనుకుంటాను - పద్యం నడక యేలావుందో? పరిశీలించాలి సహృదయులు. "లంకణాలబోటు" మాదిరిగానే నడుస్తూ వుందో, "పంజాబు మెయిలు"లాగే వుందో? పరిశీలించేవారంటూ వుంటేనేకాని, కవి కష్టం గట్టెక్కదు. "నీ వున్నావు చాలదా?" అంటారేమో? నాకు యిందులో "ఆత్మాఒఒశ్రియదోషం" వుంది - నేను యీ ముద్రారాక్షసాన్ని గూర్చి తూర్పో? పడమరో? యెఱక్కపోయినా, నాపేరుకూడా దీనిలో అనువాదకకర్తృత్వ బోధకంగా వుండడంచేత అభినందించడానికి జంకవలసి వస్తూవుంది. అందుచేత యితర సహృదయులను సంబోధించవలసి వచ్చింది. అప్పుడప్పుడు (అత్యావశ్యకమయితేనే అనుకోండి) ముట్నూరి కృష్ణారావుగారొకరు నిర్మొగమాటంగా యీ లాటికవుల కర్మాలనుగూర్చి (తిడతారేమో అనే భయం పెట్టుకోకుండా) వున్న యధార్థాన్ని కుండ పగలఁగొట్టినట్టుగా (విపులంగా గాదు) సూత్రప్రాయంగా వివరిస్తూ వుంటారు. ప్రస్తుతపద్యాన్నిగూర్చి ఆయన వూరికే - "కాగితాలు నలుపు చేసినట్టే" అభిప్రాయపడతారో? నాతో యేకీభవిస్తారో? చూడాలని వుంది - "అప్రతిషిద్ధ మనుమతం భవతి" గానేనా సరే, తెల్పితే చాలును. వెనక వాకవిషయంలో శ్రీయుతులు రెడ్డిగారిని నేను ప్రశ్నిస్తే, వారి న్యాయాన్నే గౌరవించారు. యేదో వాకపద్యం మచ్చుకు వుదాహరించాను-

నాటకమంతా యీలాటి ధారతోనే వుంటుంది. ఆనాటకమే కాదు, బాల రామాయణమూ, మృచ్ఛకటికా యీ శైలిలోనే తెలిఁగించాఁడు తి. శా.; బాలరామాయణంలో గద్యలో నాపేరుకూడా వున్నా ప్రస్తావనలో లేదు. తి. శా. పేరుమాత్రమే వుంది. అయినా దాన్నికూడా చెళ్ళపిళ్ళ తెలుఁగే అనేవారు వున్నారు. ఆయీ కారణంచేతనే నేను - "ఒరులు వచ్చని నాదు గరువఁబు సడలింపఁ జాలె నెవ్వని మనీషాబలంబు" అని అతనిజీవితా నంతరం జరిగిన సానుభూతిసభలో ప్రశంసించి వున్నాను. యిట్టి చక్కని కవిత్వాన్ని చెప్పిన అతనిపేరు పూర్తిగా విడిచి - "దీనికి చెళ్ళపిళ్ళ తెలుఁగు" అంటూ యేకకర్తృకంగా అపవదించే వారిఁతను నేనుగాని, నిజ మెఱిఁగిన యితరసహృదయులుగాని సహించడం యేలాగు? పేరా? మా యేర్పాటును బట్టి నాదికూడా వుందే అనండి. అంతమాత్రంచేత అసలు గ్రంథకర్తపేరు తుడిచిపెట్టుకు పోవలసిందేనా? యెంత ఘోరం?? యెంతఘోరం??? యీలాటిఘోరానికి (నిజంపూర్తిగా యెఱిఁగివుండిన్నీ చేసే ఘోరానికి) లోకం యేలా సహిస్తుంది? సర్వసాక్షి భగవంతుఁ డేలా సహిస్తాఁడు? యింత కాకపోయినా, కొంత ఘోరాన్ని యిప్పటి నాటకులు చేస్తూన్నారు. మా నాటకం ప్రదర్శించడానికి చేసే అడ్వర్టైజు మెంటులో మాపేర్లే ఉండకుండా చేస్తారు. వారు దానికి జవాబు - "జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా?" అని చెబుతా రనుకుంటాను. దానితోటి వారిప్రవృత్తి సమర్థింపఁ బడుతుంది. "తి. వెం. కవుల తెలుఁగు" అంటే మునిఁగిపోయిం దేముటో? అలా గనేయెడల తమరు సమర్పించే కట్నాలూ కానుకలూ యిద్దఱికీ చెందవలసి వస్తుందని యీ కుకల్పనకి దిగ వలసివచ్చిం దనుకుంటాను. అందుకే వున్న యథార్థాన్ని (లోకంలో పలువు రెఱిఁగినదాన్నే) నేను తెల్పివున్నాను - సరస్వతీ పత్రికతోటిన్నీ, శ్రీపోలవరం జమీన్‌దారుగారితోటిన్నీ సంబంధం వున్న రచనలలో - (1) బుద్ధచరిత్ర (2) పాండవవిజయం — యీ రెంటిలోనూ తప్ప, వెం, శా. కవిత్వం యితర గ్రంథాలలో లేదు. యిందులో బుద్ధచరితం

రచన నాఁటికి యింకా మాలో వొకరు శ్రీవారివద్ద ప్రవేశించనేలే దని ఆ పుస్తకపీఠికే చెపుతుంది. రెండోదాని రచననాఁటికి ప్రవేశించడం జరిగింది. మొట్టమొదట యేకకర్తృకంగానే పుట్టింది. పిమ్మట ఉద్యోగం విడదీయడంచేత, చెఱిసగం కవిత్వం వెంకటశాస్త్రిది వుండడం తటస్థించింది. యిదంతా దివాకరాస్తమయంలో వివరించే వున్నాను. యెఱిఁగి తొక్కే అపమార్గానికి యేవీ అడ్డురావు. యథార్థ నిర్ణయాన్ని తెల్పే మనస్సు కూడా దీనిలో కలగఁజేసుకోదు. ఆ యీవిషయం ముద్రారాక్షసంలో బుద్ధిపూర్వకంగా అసత్య కల్పనలలో పాలుగొన్న పాత్రలవల్లనే తెలుసుకోవచ్చును. కాబట్టి విస్తరింపను. యిదివఱకు వుదాహరించిన సీసం సంస్కృత సమాసభూయిష్ఠంగా వుండడంచేత, సంస్కృతాన్ని అనువదిస్తూ సంస్కృతాన్నే వాడితే యేలాగ? అనుకొనేవారికి నన్నయాదులను యీప్రశ్న అడిగిచూడం డని జవాబు చెపుతూ తెలుఁగుపదాలు విస్తరించివున్న పద్యాన్నికూడా మచ్చుచూపు తూన్నాను ––

మ. "అతనిం జంపుటకోస మొక్కవిషకన్యం బంపఁగా దానఁ బ
ర్వతకున్ జంపి తదర్థ మీఁదగిన సామ్రాజ్యంబు మాన్పించె శ
త్రుతతిన్ దీక్ష్ణరసంబులన్ బ్రబలులం జంపించెఁ దద్యుక్తి నా
మతియు న్నీతియుఁ గూడ మౌర్యునికె సంపాదించె శ్రేయోగతుల్."

ఈపద్యం నేను యథాలాభంగా వుదాహరించిందే గాని, వెదకి యేర్చి యిచ్చింది కాదు. యిది సరస్వతికోసం వ్రాసిం దన్నందుకు – "తిరుపతి వేంకటేశ్వరులు...., కృష్ణభూవరుఁడు సరస్వతీసతి కుపాయన మన్నటు లాచరించుటన్" అనేది తెల్పుతుంది. వ్రాస్తే చాలా వ్రాయాలి. అవసరమెంతో అంతే వ్రాశాను. స్వస్తి.



# కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు

( ది 8—2—1941 సం॥రం కృష్ణాపత్రిక నుండి )

ఈయనకు ఈ బిరుదు ( కీ॥ శే॥ అనేది ) యింతత్వరలోనే వస్తుం దని అనుకోలేదు గాని యింతకన్న క్వాలిఫికేషన్సు వున్నవాళ్ళం చాలా మంది కనిపెట్టుకొని వున్నామనిన్నీ వారివారిని గౌరవించాక వీరి కీ బిరుద ప్రదాన గౌరవం జరుగుతుందనిన్నీ అనుకుంటూ వుండేవాణ్ణి. అదేనా యెప్పు డనుకున్నానంటే : సుమారు యేఁడెనిమిది మాసాలనాడు యీయన మా యింటికి రావడం తటస్థించింది. అప్పుడు యిద్దరమూ వృద్ధులమే కనక వొకరి శారీరక ధర్మాలు వొకరు అడిగి సంప్రతించుకోవడంలో ఆ విధంగా నేను అనుకోవడం తటస్థించింది. "తానొకటి తలిస్తే దైవం వొకటి తలుస్తాఁడు" కనక అనుకున్నట్టుగాక అన్యథాగా జరిగింది. భవతు-

"ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసులట్టె భ్రష్టులై
రెందఱు రాజులేగిరి మరెందరు యోగులు జోగులైరి"

అనే పద్యంలోవున్న జాబితాలో యీ రావుగారు యే తరగతిలో చేరతారని ఆంధ్ర కృష్ణ వగైరా పత్రికలలో సంపాదకీయ వ్యాసాలు ఈయన స్వర్గతినిగూర్చి విచారాన్ని వెలిపుస్తూన్నాయి ? అంతేకాకుండా యీయనకు యేదో జ్ఞాపక చిహ్నాన్ని కూడా యేర్పరచడానికి శిఫారసు కూడా కొన్నిపత్రికలు చేస్తున్నాయే, కారణమేమై వుంటుంది ? యీయన అంతటి ప్రఖ్యాతపురుషుడా ? అని సందేహంతోచింది. అయితే నేను యీయనతో లేశమున్నూ పరిచయం కలవాణ్ణి కాను. యీయన్ని గురించి యే కొంచెమో వినడం లేకపోలేదుగాని ఆ వినేటప్పుడు గూడా అంత ఆదరంతో చెవులొగ్గి వినలేదు. దానిక్కారణం ఆయన త్రోవలకూ మా త్రోవలకూ ఉత్తర ధ్రువానికీ దక్షిణ ధ్రువానికీ వున్నంత భేదం వుంటుంది. ఎప్పుడూ కలుసుకున్నట్టున్నూ లేదు గాని సుమారు 16 సం॥ లకు పూర్వం నేను కొవ్వూరు యేదో సభకు వెళ్ళినప్పుడు చూడడం తట

స్థించింది. వీరు ఫలానా అని శ్రీయుతులు తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారు నాతోచెప్పినారు. యిటీవల మొన్నమొన్న 'గిడుగా? పిడుగా?' వ్యాసం వ్రాసిన కొలదిరోజులలో అందులో యేదో వక వాక్యంలో వున్న వక అక్షరం దగ్గిరవున్న (?) యీలాటి గుఱుతునుగూర్చి అడగడానికి పనిగట్టుకొని (నన్ను అడగడమే నిమిత్తంగా పెట్టుకొని) వీరు మా వూరు దయచేశారు - అడిగారు - అది అచ్చుపొరపాటని చెప్పినాను, అంతే మళ్లా కొవ్వూరు దయచేశారు - అప్పుడేనా వీరి విశిష్టగుణాలు నాకేమిన్ని తెలిసినట్టు లేదు కాని సత్యవాక్యతత్పరుఁడని మాత్రం కొంచెం హృదయానికి తట్టింది. అంతే. యిటీవల రెండు మూఁడు సార్లు కలుసుకోవడం తటస్థించిందిగాని వీరి విశిష్టగుణాలు తెలిసినట్టులేదు - నిన్న మొన్న పత్రికలలో సంపాదకీయాలలో వీరినిగూర్చిన సంగతులు కొన్ని చదివివున్నాను- అందులో వాట్లను బట్టి చూచినా యింతగా లోకం దద్దరిల్లవలసినట్లు కనపడలేదు. చరిత్రలు వ్రాయడాన్నిపట్టి యీయనకు యింతటి యోగ్యత కలిగిందని ఆ యా సంపాదకీయాల వల్ల కొంత తేలుతుంది. నా వుద్దేశంలో యీ చరిత్రలు వ్రాయడానికి విశేషగౌరవం యివ్వడం అభిమతం కాదు. కొన్నాళ్ళయిన తరువాత వ్రాయవలసివస్తే కొంత పరిశ్రమ చేయవలసి వస్తుందిగాని ఆ యా చరిత్రలకు సంబంధించిన పురుషులు యెప్పటిదప్పుడే శ్రీ గాంధీగారులాగు వ్రాసి అట్టేపెట్టేయెడల యిటీవల వ్రాసే వారికి "నల్లేరుపైబండి" లాగు నడిచిపోతుంది గాని అట్టే పరిశ్రమ చేయవలసి వుండదుకదా ? యీ అభిప్రాయం పూర్వపండితుల చేదస్తానికి సంబంధించింది - నేను ఆ చేదస్తంలోవాణ్ణే. యిప్పటివారి అభిప్రాయంలో ఆయీ చరిత్రకారులకు పెద్దస్థానం వున్నట్టు కనపడుతుంది - యీయన వ్రాసిన చరిత్రలు అన్నీ నేను చూడలేదుగాని యేవో కొన్నిమాత్రం యీ మధ్య (సంవత్సరానికి లోఁగడనే) కంగా బంగా చదివి వున్నాను. అవి గ్రాంధికభాషలోనే వున్నాయి గాని చాలాచోట్ల వ్యావహారిక ప్రయోగాలు (శోభస్కరం వగైరాలు) కనపడడంచేత ఆంధ్రంలో మంచి

ప్రవేశం వున్నట్టు నాకు తోఁచలేదు - అయితే దేన్నిబట్టి యీయన పత్రి కాధిపతుల ఆదరానికి పాత్రుఁడు కావలసి వచ్చింది ? అని నాలోనేను తర్కించడానికి మొదలు పెట్టాను. ప్రత్యక్ష ప్రమాణంకంటె వొక్కప్పుడు అనుమాన ప్రమాణానికి ప్రాధాన్యం యివ్వవలసి వస్తుంది - యీయన్ని గుఱించి వ్రాసినవారందఱూ యేదో "గోడమీఁదిపిల్లి" వాటంగా వ్రాస్తూ వచ్చారే కాని యీయనయందుండే విశిష్టత్వాన్ని స్పష్టపరచినట్టు లేదు. నేను యిదివఱలో యీయనవ్రాసిన చరిత్రలు కొన్ని కంగాబంగా చదివి వున్నానని వ్రాసేవున్నాను. అందులోవున్న భాషాశైలి అలావుండనివ్వండి. విషయం ప్రధానంగా పుచ్చుకుందాం. ఆయా సందర్భాలు నిరూపించే టప్పుడు యీయనకు దొరికిన ఆధారాలనుబట్టి యెంత వ్రాయవలసి వస్తుందో అంతా నిర్మొగమాటంగా కుండ పగలగొట్టినట్లు వ్రాయడమే కాని వారువారు యేమనుకుంటారో అనే సందేహం యీయనకు లేశ మున్నూ వున్నట్టు తోఁచదు - ప్రాచీనులనుగుఱించి వ్రాసేటప్పుడయితే యేలా వ్రాసినా అంత చిక్కుగాని కొంత చిక్కుగాని లేకపోవచ్చునేమో కాని తాత్కాలికులనుగూర్చి వ్రాయవలసివస్తే యెంత నిజమైతేమాత్రం నిర్మొగమాటంగా వ్రాయడం చాలా కష్టం. యీలాటి సందర్భాలలో శ్రీ వీరేశలింగంపంతులవారొకరు సాహసించి వ్రాసేవారు. వొక సంద ర్భంలో శ్రీ పంతులవారు అలా వ్రాస్తేనే శ్రీ పోలవరపు జమీందారుగారు తిరుగఁబడి ఆర్యమతబోధినీ పత్రికద్వారా కొంతకాలం వాదోపవాదాలు జరిగిస్తూవచ్చారు. ఆ వీరేశలింగంగారికి యీ రావుగారు శిష్యులైనందుకు వారివలెనే లోకానికి తాను నమ్మిన సత్యాన్ని తెలుపుడు చేయడంలో లేశ మున్నూ వెనుదీయకపోవడం పూర్తిగా అలవడిందని నాకు తోఁచి యీయన లోకుల ఆదరానికి పాత్రుఁడు కావడానికి యిదే ముఖ్యకారణం అయిందని నిశ్చయించుకున్నాను - అయితే యీమాత్రంచేత లోకు లాద రిస్తారా ? అంటారేమో అలా అనేవారు విజ్ఞులు కారనుకుంటాను. సత్య మును తాను తెలుసుకోవడమే చాలును. అలా తెలుసుకున్నదాన్ని వున్న

దున్నట్టుగా లోకానికి జంకుగొంకులు లేకుండా తెలియపఱచడమనేది సామాన్యం కాదుగదా! సామాన్యులనుగుఱించి వ్రాసే వ్రాతలయితే ఫరవాలేదుగాని యెక్కడెక్కడ్నుడు రాజకీయాదులను గూర్చి వ్రాయవలసి వస్తే వ్రాసినది సత్యదూరం కాకపోయినా పెద్దపెద్ద కష్టాలకు లోను గావలసి వస్తుందని వేఱే వ్రాయవలసివుండదు. యే విధమైన గుణగణా లున్నా లేని సత్యవ్రతుఁడనే బ్రాహ్మణ పుత్రుఁడు తుట్టతుదకు సాక్షాత్తూ శ్రీపరమేశ్వరీ కటాక్షానికి పాత్రుఁడైనట్టు దేవీభాగవతంలో వక యితి హాసంవల్ల కనపడుతుంది. కనుక వకసత్యం యేమనిషియందు వుంటుందో ఆ మనిషి పరమపూజ్యుఁడుగా లోకంచేత ఆరాధింపబడతాఁ డన్నందుకు సంశయించవలసింది లేశమున్నూలేదు. సత్యమంటే సామాన్యగుణం గాదు. ఆ గుణము యెన్నో అశ్వమేధాది మహాక్రతువులు చేసినవారికంటే కూడా మనుష్యుణ్ణి పరమపూజ్యుణ్ణి చేస్తుందని పంచమవేదము భారతం ఘోషిస్తూవుంది.

క. వెలయంగ నశ్వమేధ
మ్ములు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూఁపఁగ సత్యము
వలననములు సూపు గౌరవంబునఁపేర్మిన్.

తే. గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యమ్ముతో సరియుగావు
ఎఱుఁగు మెల్లధర్మమ్ముల కెందుఁబెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు.

యీ ఘట్టంలో సత్యాన్నిగుఱించినవి యింకా కొన్నిపద్యాలు వజ్రపు తునకలవంటి వున్నాయి. అవకాశంవుంటే వ్యాసం చివర వుదాహరిస్తాను. లేదా? చదువరులే భారతంలో చూచుకుంటారు. వీరభద్రరావుగారు వేద శాస్త్రాలు చదవకపోయినా యజ్ఞయాగాదులు చేయకపోవడం అలా వుండఁగా అవి చేసేవారియందు, సంఘసంస్కారుల తరగతిలో చేరినవా

రవడంచేత, అంతగాని, కొంతగాని పూజ్యభావం లేనివారైనా వీట్లన్నిం టిని తలదన్నే సత్యాన్వేషణమందు బద్ధకంకణులై ప్రవర్తించడంచేత యీ లోకంలో వుండేవారికేకాదు ఆ లోకంలో వుండేవారిక్కూడా గౌర వించ తగ్గవారైనారని నే ననుకుంటాను. వేదవిహితాచారాలలో యేకొన్నిం టినిగాని ఆచరించకుండా సత్యతత్పరతతో నిష్కల్మషమైన అంతరంగ శుద్ధితో జీవితాన్ని గడిపిన వారికి అనాయాసమరణం తటస్థించడం అను భూతంగా కొన్ని దృష్టాంతాలు కనపడతాయి. వాట్లల్లో కొన్నిటివి అప్పు డప్పుడు వ్యాసాలలో వుదాహరిస్తూనే వచ్చాను - యిక్కడ వక పుణ్యపురు షుణ్ణిగూర్చి కొంచెం ప్రస్తావిస్తాను - సోమంచి భీమశంకరం గారిని బహుశః యెఱుగనివారంటూ మన ఆంధ్రదేశంలోనే వుండరనుకుంటాను. ఆయన జీవితాన్నిగూర్చి వ్రాయవలసివస్తే ఒక పెద్దపుస్తకమే వ్రాయ వలసి వస్తుంది. ఆలా వ్రాస్తే అది కలగూరగంపగా కనపడుతుంది-పైగా ఆయన అన్నగారి కుమారుడు సీతారామయ్యగారు (పెద్దప్లీడరు) గాని ఆయన కొమాళ్ళుగాని (పేర్లు జ్ఞాపకంలేదు వీరున్నూ ప్లీడర్లే అనుకుం టాను) నా తాళం పడతారేమో అని భయంకూడావుంది. అయితే శంకరం గారి ఆస్తిలో నాకేమిన్నీ భాగం రాలేదుగాని యీ సీతారామయ్యగారి కంటె వేనే శంకరంగారికి అభిమానస్థానం అని సీతారామయ్యగారే యెఱుఁ గుదురు. చెప్పొచ్చేదేమంటే అట్టి శంకరంగారు యిఁక నాలుగైదురోజు లకు పరమపదిస్తారనగా కాబోలును నేను ఆంధ్రభాషా పరిషత్ సభకు అధ్యక్షుడుగా వెళ్ళి యేకొంచెమో జబ్బుగావున్న శంకరంగారిని సందర్శిం చాను. స్వయంగా చపాతీలు (వొకవిధమైన గోధుమరొట్టెలు) వొత్తు కుంటూ నన్నుచూచి - "యేమోయి వెంకటశాస్త్రీ దండిభొట్ల రామమూర్తి శాస్త్రి తండ్రి నాకు జాతకంలో అఱువైయేళ్ళు ఆయుర్దాయం వ్రాశాడు. ఆ వ్రాత ప్రకారం నేడో రేపో పరిసమాప్తి పొందవలసి వుంది. ఈమధ్య ఆయన కుమారుఁడు. రామమూర్తిశాస్త్రి కనపడ్డాడు. ఆ జాతకం చూచి మా నాన్నగారు యెందుకు అలా వ్రాశారో గాని యింకా జాతకంమీద

ఆయుర్దాయం కనపడుతున్నది అన్నాడు. నీ వేమం" టూవంటూ జాతకం చేతికిచ్చాడు. నేను "శంకరరంగారూ, వారి ప్రిజ్ఞలో యెన్నోవంతు ప్రజ్ఞ కూడా లేనివాణ్ణి జాతకం చూడడ మెందుకు, మీ వోపికనుపట్టి చూస్తేనే యింకా ఆయుర్దాయం వున్నట్టు స్పష్టమవుతూ వుంది" అన్నాను. మఱి నాల్గురోజులకో వారంరోజులకో కీ॥ శే॥ బిరుదు శంకరరంగారికి వచ్చేసింది. అనాయాస మరణమని కూడా ఆప్తులవల్ల విన్నాను. వేదశాస్త్రిలకున్నూ అందుండే సదాచారాలకున్నూ ఆయనకే కాదు యీకాలంలో నూటనాట నెక్కడో యేవక్కరికో తప్ప బ్రాహ్మణమాత్రుల కెవ్వరికీ సంబంధం లేదుగాని కొందఱికి - అయ్యో అనాచారంగా వర్తిస్తూన్నాంగదా అనే పశ్చాత్తాపమేనా వుంటుంది. శంకరరంగారి అంతరంగంలో యేముండేదోగాని పైకి ఆలాటి పశ్చాత్తాపంకూడా వున్నట్టు నాకు గోచరించలేదు. సత్యవాక్య తత్పరత్వం మాత్రిం (ప్లీడరుగా వుండీ కూడా) విశేషించి పాటించడం యెఱుగుదును. దీనికి యెన్నో వుదాహరణాలైతే యివ్వగలనుగాని గ్రింథం విస్తరిస్తుంది. ఆ యీ సత్యవాక్య తత్పరత్వమే యీయనకు "అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్" అనే మహాభాగ్యాన్ని సంఘటించిందని నేను అనుకున్నాను. మాఘమాసంలో వుదయం వేళ కొంత మంది నీరుకాసు బ్రాహ్మలు తమరు స్నానం చేయకుండానే వాళ్లు వాళ్లు స్నానంచేస్తూవుంటే మంత్రిలు చెప్పడం ఈయన సారటుమీద (అప్పటి కింకా మోటార్లురాలేదు) షికారు పోయివస్తూ చూచి కమిటీసహితంగా సారటుదిగి ఆ బ్రాహ్మలని మీరు స్నానం చేయకుండా వాళ్ళను స్నానాలు చేయిస్తూ మంత్రిలు చెపుతున్నారా అనిబజాయించే టప్పటికి ఆ బ్రాహ్మలు పటాపంచలై పరుగెత్తారు. యిది కళ్ళారా నేను చూడలేదుగాని ఆరోజుల్లో యేలూరిలో శంకరరంగారి యింటిలోనే ఆయన కోరికమీద ఆరోగ్యార్థం మందు పుచ్చుకుంటూ వున్నాను - చెప్పేదేమిటంటే యితరగుణా లేలాటి వేనా సత్యవాక్యతత్పరత్వం అన్ని సుగుణాలకంటే యెక్కువది. అది యిహ పరలోకాలు రెంటినీ అవలీలగా జయిస్తుంది. సత్యమంటే వట్టిఅల్లాటప్పా

గుణమా ? "సత్యం తపః" అన్నాడుకదా వేదపురుషుడు. దీన్నిబట్టి యెవఁడు సత్యవాక్యతత్పరుఁడుగా జీవితం గడుపుతాడో వాఁడు తపస్వి ఔతే అని తేలుతుంది. తపస్వికి ఉత్తమలోకావాప్తి కలుగుతుందని చెపితే విశ్వసింపని ఆస్తికుడెవడు ?

తపస్సులు అనేకవిధములు, శాంతిగా వుండడం, దానశీలుడుగా వుండడం, యెల్లప్పుడున్నూ వేదమో శాస్త్రమో పురాణమో యేకరువు పెడుతూ కాలక్షేపం చేయడం యింకా యీలాటి మంచిపనులు చాలా వున్నాయి. యివి అన్నీ తపస్సుకిందకే వస్తాయన్నట్టు వేదపురుషుఁడు "ఋతంతపస్సత్యంతవః" అనే వాక్యంలో తెల్పి వున్నాఁడు. అన్ని మార్గాలూపట్టి చరించే మహానుభావులున్నూ వుంటే యెక్కడేనా వుంటారేమో కాని యిందులో యేవొక్కటేనావుంటే వాఁడు యిహపరలోకాలు జయిస్తాఁడనడానికి లేశం కూడా సందేహంలేదు. జయించడమంటే యేమిటి? యెవని మరణమునకు వాఁడి పెళ్ళాం బిడ్డలు మాత్రమే కాక యే చుట్టరికమూ లేని యితర ప్రపంచంకూడా విచారిస్తుందో వాఁడు యిహలోకాన్ని జయించినట్టు, అనగా స్వాధీనపఱచుకొన్నట్టు. యెప్పుడైతే యిహలోకంలో "సర్టిఫికట్టు" వస్తుందో అప్పుడు పరలోకంలో స్థానం వుత్తమమైనదేదో వుందనుకోవడానికి యింద్రద్యుమ్నాది మహారాజుల చరిత్రలు తోడ్పడుతూన్నాయి. మన రావుగారికి యిహలోకంలో సర్టిఫికట్టు వచ్చినట్టు పత్రికలద్వారా కనపడుతూ వుంది. యీసర్టిఫికట్టు యీయన సత్యాన్వేషణపరాయణుఁడని యీయన వ్రాసిన చరిత్రగ్రంధాలవల్ల లోకం గ్రహించడంవల్ల కలిగిందని నే ననుకున్నాను. ఆ మధ్య వకరెవరో (జ్ఞాపకం బాగాలేదు) యీయన్ని గుఱించి నేను సామాన్యరీతిగా మాట్లాడుతూవుంటే అన్నాఁడుకదా ! యేమండోయి ? వీరభద్రరావుగారు సత్యం వ్రాయడంలో తల యెగిరిపోతుందనేటప్పుడు కూడా భయపడరుసుమండీ? ఆంధ్రుల చరిత్రలో కొన్ని కులాలనుగుఱించి వ్రాయవలసి వచ్చినప్పుడు అందులో శూరత్వానికి ప్రసిద్ధి వహించిన వక కులానికి కళంకాన్ని

ఆపాదించేమాటలు చారిత్రికంగా వ్రాయవలసి వచ్చిందనిన్నీ, అది ప్రచు రణకాకమున్నే ఆ కులంవారిలో ప్రసిద్ధులు కొందఱువచ్చి అలా వ్రాయ కుండా బ్రతిమాలినారనిన్నీ, వున్న యధార్థం వ్రాయకపోతే చరిత్ర యధార్థంగా దాఁచిపెట్టినదిగా వుండి లోకుల విశ్వాసానికి దూరమవుతుంది కనక వున్నదున్నట్టే ప్రకటించడం తప్పదనేటప్పటికి ఆ కులస్థులకు కోపంవచ్చి అయితే నీ జీవితాన్ని కాసుకో మన్నారనిన్నీ, దానికి కూడా రావుగారు జంకనే లేదనిన్నీ చెప్పివున్నాఁడు. దీనిలోవున్న యధార్థాన్ని చదువరులలో యే కొందఱేనా యెఱిఁగి వుంటారేమో అని నేను విన్న మాటలు వుదాహరించాను. యీయన బాల్యమందు అంతో యింతో కవిత్వం కూడా చెప్పేశక్తి కలవారై యేవోకొన్ని పద్యాలు సమేతూ వ్రాసేవారని అంధ్రిలో వ్రాసిన వ్యాసంవల్ల గోచరిస్తుంది. భవతు. పద్యమే చెప్పాలని నియమం వుందా యేమిటి కవికి ? గద్యం చెపితేమాత్రం కవి కాఁడా? పద్యమేనా సరే, గద్యమేనా సరే, చదువరులను మైమఱపించే శైలిలో వ్రాయఁగలిగితే వాఁడికి కవులలో విధిగా స్థానం వచ్చి తీరుతుంది. యీయన వ్రాసిన చరిత్రగ్రంథాలు గద్యమయములే అయినా ఆ యా ఘట్టాలు తన్మయత్వాన్ని కలిగిస్తాయని పలువురనఁగా విన్నాను. నేను చదివినది మిక్కిలి స్వల్పంగాని చదివినంతలో ఆగుణం వున్నట్లే నాకున్నూ తోఁచింది. సత్యవిషయంలో దొరికిన ఆధారాలు మోసపుచ్చే పద్ధతిని తప్ప స్వబుద్ధిచేత లేశంకూడా యీయన అడుగుదాఁటఁడు. క్షత్రియులకూ రెడ్లకూ, వెలంవారికీ రెడ్లకూ సంబంధ బాంధవ్యాలున్నట్టు రావుగారు కొన్ని ఆధారాలనుపట్టి రుజువుచేసి యున్నారు. యీ కాలంలో అయితే యీ సంబంధ బాంధవ్యాలు అంత చిక్కు తెచ్చేవి కావు గాని, ఆ కాలంలో ఆ యా శాఖలవారు అంగీకరిస్తారనడానికి నేనే కాను యెవ్వరూ అంగీకరించరు. అయితే రావుగారు చూపిన ఆధారాలు అనుల్లంఘనీయాలుగా వున్నాయి. అందుచేత కిక్కురు మనక రావుగారి సిద్ధాంతాన్ని విశ్వసించవలసిందే అని నే ననుకున్నాను. అయినా నాకు

చారిత్రిక పరిజ్ఞానం బొత్తిగాలేదు. ఆ పరిజ్ఞానం కలవారు యేమంటారో వినవలసి వుంటుంది. యీయన జీవితం మొట్టమొదటినుంచీ యేదో వక విధమైన వడుదుడుకులకు లోనై కష్టపరంపరలతోనే జరుగూతూ వచ్చిందంటూ యీయన శిష్యుఁడు వ్రాసి వున్నాఁడు. సత్యాన్వేషణమందు బుద్ధి పెట్టుకొని సంచరించే మనిషి జీవితం యెప్పుడూ వడుదుడుకులతోనే నిండి వుంటుందంటే దానిలో ఆశ్చర్యమేముంటుంది ? "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాటలాడి" అన్నట్టుగా సత్యాసత్యవిచారంతో పని లేకుండా సంచరించే వారి జీవితానికి (పరలోకంలో మాటకేంగాని) యిహలోకంలో యేచిక్కులూ వుండవనే అనుకోవాలి గాని, బాగా ఆలోచిస్తే నాలుగు అక్షరాలు చదువుకొనికూడా సత్యాసత్యవిచారం లేకుండా యేదో స్వల్ప లాభాన్నపేక్షించి ప్రవర్తించే వ్యక్తిని యెదట కాకపోయినప్పటికీ పరోక్షమందేనా లోకం నిందిస్తుందిగాని ఆమోదించదు - దాన్నే "నడికన్న చావుమేలు" అన్నాఁడు భారతంలో. అట్టి వ్యక్తి జీవన్మృతుఁడుగా పరిగణింపఁబడతాఁడు. అందుచేత సత్యానికి వున్న విలువ సమయోచితంగా మాట్లాడడానికి వుందనడానికి యెవరు వొప్పుకుంటారు ? కాని - "యథార్థ వాదీ బంధువిరోధీ" అనేమాటకూడా తోసివేయ తగ్గదికాదు. వొకప్పుడు సత్యం వకలాగువుంటేదాన్నికప్పిపుచ్చి అసత్యమేచెప్పి పుణ్యం సంపాదించ వలసిన్నీ వస్తుంది. ఆలాటిఘట్టాలు కొన్ని వున్నట్టు పెద్దలు సర్వజ్ఞులు తెల్పివున్నారు. ఆధర్మసూక్ష్మాలలోకి కాలు పెడితిమా ? బుద్ధిమంతులు సత్యవాక్య తత్పరుణ్ణి కేవలమున్నా అసత్యాల బుంగగా తయారుచేసి తీరుతా రనడానికి సందేహంలేదు. అందుకోసం యీవ్యాసం పుట్టలేదు కనక ఆధర్మ సూక్ష్మాలు వగయిరా యిందుదాహరించి వ్యాసాన్ని పెంచ లేదు. వీరభద్రరావుగారు నిర్మొగమాటంగా సత్యాన్ని తెల్పే చారిత్రిక పరిజ్ఞాతలలో వొకరన్నదే మనకు ప్రస్తుతం కావలసింది. యీయన సంఘసంస్కార పరాయణుల తెగలో వారేగాని దానికి ప్రోత్సాహకమైన కార్యం దేన్నిన్నీ చేయలేదని శిష్యుఁడుగారే వ్రాసినారు, అందుచేత

ఋాయన ముఖ్యంగా లోకాన్ని ఆకర్షించింది సత్యాన్వేషణ తత్పరత్వం చేతనే కనక సత్యమందు యెంతవిలువ వుందో లోకం గ్రహించుకొన టానికి యీయనజీవితం ప్రోత్సాహక మవుతుందని నేననుకుంటాను. సత్యాన్ని వేదం (సత్యంవద – నానృతంవదేత్, సత్యాన్న ప్రమదితవ్యం) ప్రోత్సహిస్తూవుంది. – పురాణాలు (నానృతాత్పరంపాతకం) ప్రోత్సహిస్తూ న్నాయి. యీవిషయాలు పామరులకంటే విశేషించి తెలిసినవారు పండి తులు ; కాని పండితులలోకంటేకూడా సత్యవాక్య తత్పరత్వం పామరుల లోనే యెక్కువగా వున్నట్టు అనుభవంవల్ల గోచరిస్తుంది. దాన్నిపట్టే కాబోలును "అన్నీ తెలిసినవాళ్ళకి అమావాస్యమరణమూ, యేమీయెఱు గనివాళ్ళకి యేకాదశీమరణమూ" అంటూ వకసామెత లోకంలో అనాదిగా వస్తూ వుంది. యిటీవల మనధర్మశాస్త్రాలు ఆంగ్లంలోకి పరివర్తనమయి చిలవలూ పలవలూ బయలుదేఱిన తరవాత యెంతటి అసత్యమాడినా తప్పులేనట్టు దాన్ని తెలిసినవారు సమర్థిస్తారు. వారి యుక్తులుచూస్తే కాఁబోలు ననిపిస్తుందికూడాను. అది వారివారి బుద్ధివిశేషానికి స్ఫోరకం మాత్రమే అవుతుందిగాని యెన్నఁటికీ సత్యం అసత్యంగాని అసత్యం సత్యంకాని కానేరదన్నది పరమసిద్ధాంతం. శ్రీకృష్ణ భగవానుఁడు అప్పటి అవసరాన్నిబట్టి ధర్మరాజుచేత – "అశ్వత్థామా హతః (కుంజరః)" అని పలికించడం తుట్టతుదకు ధర్మరాజుకు తీరని కళంకాన్ని కల్గించడం మెవరెఱుఁగరు ? యెవఁడిజీవితం అసత్యవాక్యాలకు అవకాశం కలగకుండా జరిగిపోతుందో వాఁడు ధన్యుడు – " మితభాషిత్వముమాని యేల హరిపై మిధ్యాపవాదంబు పూన్చితి నీజన్మము కాల్పనే ? " అని పశ్చాత్తాప పడ్డాఁడు సత్రాజిత్తు. సత్యవాదికి మితభాషిత్వం చాలా అవసరం. యేదో శాఖా చంక్రమణంగా మాట్లాడుతూవుంటే – " సత్యాయ మితభాషిణామ్ " అనే కాళిదాసోక్తికి ఉదాహరణం కావడం తటస్థించదు. నాయెఱిఁగినంతలో వీరభద్రరావుగారు మితభాషులుగానే కనపడ్డారు. వీరితో విశేషపరిచయం వున్నవారికి గాని యీ అంశం నిర్ణయింప శక్యంకాదు. నాపరిచయం మిక్కిలి

తక్కువదని వ్రాసే వున్నాను. క్రియలో మాట ఆత్మవంచన చేసికొని లోకాన్ని ప్రతారించే స్వభావం యీయన చరిత్రగ్రంథాల్లో లేకపోవ డమున్నూ దీక్షగా ఆ యాచరిత్ర గ్రంథాలు వ్రాయడమున్నూ యీయన్ని లోకాదరణపాత్రుణ్ణిగా చేసినట్టు నాకు గోచరించింది. యీయన్నిబట్టి మనం ముఖ్యంగా నేర్చుకోఁదగ్గది సత్యవాక్యతత్పరత్వం. అట్టి సత్యవాక్య తత్పరత్వానికి తన జీవితంద్వారా లోకానికి గురుత్వ ధర్మాన్ని నెఱవేర్చిన వీరభద్రరావుగారు ధన్యులు. వీరు వృద్ధాప్యంలోనే జీవయాత్ర చాలించడం చేత విచారించ తగివుండకున్ననూ లోకంలో - "చావుకన్న దుఃఖమున్నూ పెండ్లికన్న సంతోషమున్నూ వుండదు" అనుకోవడంవల్ల విచారించడం సహజం. వారిబంధువులకు సానుభూతి తెల్పడమున్నూ ధర్మమే - "నరః పతితకాయోఽపి యశఃకాయేన జీవతి"

---

## కీ॥ శే॥ శ్రీ జయంతి పంతులుగారు

(ది 22—2—1941 సం॥రం కృష్ణాపత్రికనుండి)

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాఽస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్.

భర్తృహరి సుభాషితంలో వున్న ఆ యీ శ్లోకస్థ జయంతి పదానికిన్నీ జయంతిపంతులుగారికిన్నీ యేవిధమైన బాంధవ్యమున్నూ లేకపోయినా శ్రీపంతులవారిని చూచేటప్పటికల్లా నా కీ శ్లోకం జ్ఞాపకంవచ్చి చదివేవాణ్ణి. రామయ్యపంతులవారు స్వయంగా కవులు. కవులంటే అల్లాటప్పాకవులు గారు, భారతాది ప్రయోగ సారస్యం తెలిసిన శ్రీఅల్లంరాజు సుబ్రహ్మణ్యకవిగారి చిరకాలశుశ్రూషాభాగ్యం లభించిన మహాకవులు. సుమారు యెనభైయేళ్ళ వార్ధక్యంలో వున్నప్పుడుకూడా కవితావ్యాసంగం అంటే పంతులవారు చెవి కోసుకొనేవారు. మాజిల్లా (గోదావరి) లో,

బి. యే. ప్యాసైనవారిలో యీపంతులవారు మొట్టమొదటి బ్యాచిలోవారనో? లేక - మొట్టమొదటివారనో చెప్పుతుంటారు. లేటు శ్రీగంగాధరరామారావు బహద్దరు (పిఠాపురం) వారున్నూ వీరున్నూ సహాధ్యాయులనో సతీర్థులనో చెప్పఁగా విన్నాను. పంతులవారు నాకన్నా సుమారు 15 యేళ్ళు పెద్దలు. నా వయస్సిప్పుడు 71 జరుగుతూ వుంది - వారి వయస్సు 85 కావచ్చును. సహస్రమాసాలుకూడా అతిక్రమించాయన్నమాట. సహస్రమాసజీవి భగవత్స్వరూపుఁడు. ఉద్యోగవిషయంలో మన బ్రాహ్మణీకంలో యెంతటి ఔన్నత్యం అనుభవించాలో అంతా అనుభవించారు.

"ఆంగ్లేయులకుఁగూడఁ దగవు దిద్దిన మహాధర్మమూర్తి" కదా యీ మహాపురుషుఁడు - అగ్నిహోత్రంలో వొక కాలున్నూ మంచిగంధంలో వొక కాలున్నూ వుంచి దండనాధికారాన్ని నిర్వహించిన ధర్మమూర్తి యీ మహానుభావుఁడు - గుంటూరిసీమలో వొక సీసపద్యం యీయన్ని గుఱించి వ్రాయవలసిన ప్రసక్తి కలిగి వుదాహరించాను. విస్తరభీతిచే దాన్ని యిక్కడ చూపలేదు. సుబ్రహ్మణ్య కవిగారి నెప్పుడూ యీయన వదలడమంటూ లేనేలేదు. సుబ్రహ్మణ్య కవిగారంటే రెండో పెద్దన్నగారే అని చెప్పతగ్గవారు. మొట్టమొదట కాకినాడలో మేము శతావధానం చేసినప్పుడు శ్రీ పంతులవారు సుబ్రహ్మణ్యం కవిగారి సహితంగా దర్శనం యిచ్చారు. అప్పుడే సుబ్రహ్మణ్య కవిగారు — "పణినసూను కణాద బాదరాయణ" అన్న మనుచరిత్రపద్యంలో వున్న - పణినసూను పదాన్నిగూర్చి ప్రశ్నించారని జ్ఞాపకం. ఆయీ ప్రథమదర్శనం అయి యిప్పటికి యేభైయేళ్ళు కావచ్చింది. మళ్ళా జయసంవత్సరంలో విశాఖపట్టణంలో అవధానసభలో దర్శనం చేశాము. కీ॥ శే॥ యెల్లేపద్ది జానకిరామయ్యపంతులుగారు కోర్టు మునసబుగానున్నూ వీరు డిప్యూటీ కలెక్టరుగానున్నూ వున్నారప్పుడు. యిద్దఱూ వెల్నాటి వైదికబ్రాహ్మణులే కాని రామయ్యపంతులవారికి మీసాలు వుండేవి. జానకిరామయ్యపంతులుగారికి లేవు. వీరిద్దరికీ బావమఱఁది పరియాచకం వుండేది. మమ్మల్ని మీసాలనుగూర్చిన పద్యం

చెప్పవలసిం దన్నారు. వుండడం మంచిద్దని చెప్పమా ? మంచిదికాదని చెప్పమా ? అని సలహా చేశాను. యిద్దఱూకూడా మీ యిష్టం అన్నారు.

"మెసవుచో నన్నంపు మెతుకు లోజిక్కిన" అనే సీసపద్యం అప్పుడు చెప్పినబాపతే. ఆ వూళ్ళో దర్శించి నప్పుడు పంతులవారు నాకు ఒక సదుపదేశం చేశారు. యేమనంటే మీరు తగినంత వేషభాషలు కలిగి వుండాలి, నిరాడంబరంగా వుండకూడదన్నారు. యీ వుపదేశం యెందుకు చేయవలసి వచ్చిందంటే నేను పంతులవారి లోగిలికి వెళ్ళినప్పుడు ఒక చెంబునూ కొల్లాయిగుడ్డా మాత్రమే నావేషం. యేడునూతులవీధికి స్నానానికి వెళ్ళి స్నానం చేయకపూర్వమే పంతులవారి నివాసగృహం అక్కడికి సమీపం అని యెవరో చెప్పఁగా విని స్నానార్థం వెళ్ళిన ఆవేషం తోనే వారి లోగిటికి వెళ్ళి లోపలగుమ్మంవద్ద నిలబడి-పంతులవారున్నారా అని ప్రశ్నించాను. పంతులవారిభార్యా జవాబిచ్చారుగదా : యాయవార బ్రాహ్మఁడికి పంతులుగారి నడగడం యెందుకూ అని జవా బిచ్చారు. ఆ మాటకు ప్రతి చెప్పక నేను స్నానార్థం వెళ్ళిపోయాను. మధ్యాహ్నం పంతులుగారిని సక్రమంగానే దర్శించాము. అప్పుడు పంతులవారు పైవుప దేశాన్ని నాకు చేశారు. కీ॥ శే॥ పురాణపండా మల్లయ్యశాస్త్రుల్లుగారితో కూడా పంతులవారికి విశేషించి స్నేహం వుండేది. నిరాతంకశాస్త్రుల్లుగారని పిలిచేవారు మల్లయ్యశాస్త్రుల్లుగారిని. వారూ వీరూ యేమిటి ? సుప్రసిద్ధు లైన పండితులందఱితోటీ చాలా మైత్రి వుండేది. చేసిన వుద్యోగం పెద్ద దైనా పూర్వాచారపరాయణులుగానే వుండేవారు. ఆచారవ్యవహారాలలోనే కాదు భాషావిషయంలోకూడా పూర్వాచారపరాయణులే. నేను లాకలూ కాయ వ్యాసాలు రాయడంలో వ్యావహారికాన్ని వుపయోగించడం చూచి ఆయనికి నామీఁద కంతపూ_ర్తిగా వుండేదికోపం. వొకసారి మాయింటికి ( జయంతి గ్రంథకృతి సందర్భంలో ) దయచేసి ఆయీవిషయం నిక్క చ్చిగా నన్ను ప్రశ్నించారు. నేను నాకు వుండుకున్న వుపపత్తులు లోగడ 'కవిత్వం అంటే యేమిటి ? ' అనేవ్యాసంలో వుటంకించినవి చూపేటప్ప

టికి పంతులుగారికి సంతృప్తి కలిగింది గాని వారు మొట్టమొదటినుంచి వ్యావహారికాన్ని ప్రతిఘటించి మఱికొందఱితో జతగా వుండి ప్రచారం సాఁగించేవా రవడంచేత కాబోలు-"యేమైనా సరే మీరు వ్యావహారికంగా వ్రాయడానికి నేను సమ్మతించను" అని మూఁక వుమ్మడిగా అన్నారు. నేను దానిమీఁద — అయ్యా, నేను పూర్తిగా మీవాణ్ణీకాను గిడుగుపంతులు గారివాణ్ణీ కాను, మీవుభయులకీ — "మద్యేతిష్ఠతు మాధవః" అన్నమాదిరి వాణ్ణి అని "మురారే స్తృతీయః పంథా" గా వున్న నాఅభిప్రాయాన్ని వివరించాను. అర్థాంగీకారంగా వూరుకున్నారు. పిమ్మట నేను వారికి కృతిగా రచించిన గ్రంథం, "జయంతి"లో యెక్కడేనా టిప్పణిమాటలలో వ్యావహారికాన్ని వుపయోగిస్తానేమో అని యెంతో శ్రద్ధగా పరిశీలించే వారు: వారి అభిప్రాయానుసారంగానే నేను దానిలో యెక్కడా వ్యావ హారికాన్ని వాడనేలేదు. పంతులుగారి వుద్యోగానికి సంబంధించిన జడ్జి మెంట్లు యేవిధంగా వుంటాయో తెలుసుకోవడానికి నాకు ఆంగ్లభాషా పరిజ్ఞానం బొత్తిగా లేదుకదా! "జయంతి" మీఁద యిచ్చిన తీర్పును బట్టి వారి గడుస్తనాన్ని తెలుసుకో గలిగాను — అబ్బా! ఆవ్రాఁతనేర్పు బ్రహ్మభేద్యంగా వుంటుంది. యెవరో యీసడిస్తే యీసడిస్తారుగాక. తమకు రుచించనప్పుడు అపకారక మయినప్పుడు యేదో విధంగా అపవ దించడం సర్వేసర్వత్ర వున్నదే. దాన్నిబట్టి మంచిచెడ్డలు ప్రాజ్ఞులు నిర్ణ యించరు కనక పంతులవారికి ఆంధ్రకవిత్వమర్మాలు యెంతవరకు తెలి యాలో అంతవరకూ తెలిసివున్నాయంటే కాదనే సహృదయు లుండరనే నేను త్రికరణశుద్ధిగా విశ్వసిస్తాను. వుద్యోగధర్మాన్ని నిర్వహిస్తూకూడా బోలెడు కవిత్వాన్ని రచించి భాషాసేవకులలో అగ్రస్థానాన్ని అలంకరించిన పంతులవారి స్వర్గతికి విలపించని ఆంధ్రులుండరు గాని యీపాంచభౌతిక శరీరాన్ని యెంతవరకు అఁపఁగల్గుతాఁడు మనుష్యుఁడు

చ. పొలుపగు కోటివిద్దెలును బొట్టకుఁ బట్టెడు కూటికేకదా!

యిల జనియించి పెంపు గనుటెన్నటికేనియుఁ గాటికేకదా

కలిమి నిజంబటంచుఁ గడగానక నిక్కెదు రాయురర్థముల్
జలములమీఁది వ్రాత మనసా హరిపాదము లాశ్రయింపుమా.

బాగా వోపికతగ్గిన వార్ధక్యంలో "సూర్యరాయనిఘంటు" రచనా ప్రయత్నానికి పూనుకున్నారు. బహుపండిత సహాయాన్ని తీసుకున్నప్పటికీ అది పెద్దపనేకాక ప్రత్తిపనివంటి దవడంచేత యింకా యేమాత్రమో అచ్చు తరవాయిలో వుండిపోయింది. భవతు. నేఁడో రేపో ఆ మహాకార్యం తుద ముడుతుంది. పంతులవారు పూనడంచేతఁ గాని లేకపోతే ఆలాటిద్రవ్య దాతృసహాయం దానికి లభించేదికాదు. "ద్రవ్యద్వారాయ పుణ్యాయ" అనే అభియుక్తోక్తి సర్వథా మాన్యమే కాని పంతులవారు ఆ పుణ్యంలో అధమం సంగోరేనా పుచ్చుకోగలరని నా విశ్వాసం. పంతులవారు పూర్వాచారపరాయణులైనందుకు వారిగృహిణి కొలఁదిరోజులనాఁడే ముందుగా తోవతీసి స్వర్గంలో భర్తగారి రాకను నిరీక్షించడం వొకదృష్టాంతం కనపడుతూ వుంది. ఉపక్రమణం మొదలుకొని వుపసంహార పర్యంతమూ యేలోటూ లేకుండా నెగ్గిన జీవితం కలవారు లోకంలో బహుతక్కువగా వుంటారు. పంతులవారు అందులో అగ్రగణ్యులు. పంతులు శబ్దం పండిత శబ్దానికి వికృతిగా వైయాకరణులు భావిస్తారు. ప్రకృతి వికృతులలో యెంతభేదం కనపడుతుందో వారివారి పాండిత్యాలల్లోకూడా అంతభేదమూ సర్వేసర్వత్ర కనపడుతూనే వుండడం సుప్రసిద్ధమే. కాని రామయ్య పంతులుగారి విషయంలో యీ వ్యాప్తికి అవకాశం లేదు. అంటే యేమన్న మాట, పండితులే అన్నమాట. అనఁగా పేరుకు పంతులైనా ప్రజ్ఞకు పండితులే అని నిష్కృష్టార్థం. ఒకటి రెండూ యేళ్ళు చేసిన కృషి గాదు యావజ్జీవమూ భాషాకృషితోనే పంతులుగారు కృతార్థులైనారు - యేవిధమైనలోటూ లేకుండా యెనభై ఐదు యేళ్ళపైని ఆయుర్దాయం పట్టడం యెంతటి పుణ్యాత్ములకోగాని ఘటించదు - మఱిచాను, పంతులుగారికి సంతానభాగ్యం లేదని యెఱుఁగుదును. కాని అదిన్నీ వొక మహాభాగ్య చిహ్నమే. దరిద్రులకువలె సంపన్నులకు ఆ భాగ్యం పట్టకపోవడమే

తఱుచు అనుభూతం. భవతు, అన్నగారిసంతానాన్ని తమసంతానంగా భావించి అభివృద్ధికి తెచ్చిన (తేవడంలోనూ అంతా యింతా కాదు, తనం తవాళ్ళని చేయడమే) యీ మహనీయుఁడికి పుణ్యమూ పురుషార్థమూ రెండూకూడా దక్కినట్టయింది కదా? కడుపునఁగన్న బిడ్డలే అయితే పితార్జితాన్ని బుద్ధిపూర్వకంగా తండ్రి యిస్తే సరే, యివ్వకపోయినా ఔరసులు పిస్తోలుచూపించికూడా పుచ్చుకోవడం ధనవంతులలో అక్కడక్కడవున్నదే - "పుత్రాఏవ పితుర్హ్మరంతిహి ధనం పేృమ్ణా బలాద్వాపివా" అన్నాఁడు కుట్టికవి. అట్టి హక్కుదార్లకు యిచ్చిన ధనం తండ్రికి పుణ్యలోకావాప్తిలో సహాయపడదని వేఱే చెప్పనక్కఱలేదు. ప్రకృతం పంతులవారి స్వార్జితద్రవ్యం ఆ విధంగా వినియోగపడలేదు కనక పరలోక సాధనంకూడా అయిందని నాతలఁపు - ధన వినియోగంలో "ఆశ్రితంతు పరిత్యజ్యమునేర్దత్తంచ నిష్ఫలమ్" అనే వచనాన్ని పంతులవారు రామనామ ధేయులై నందుకు రామునివలెనే పాటించినట్లు నేను తలుస్తాను. రాములవారు అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడు సీతతో ధనం పంచిపెట్టడం విషయంలో ఆ యీసందర్భం వ్యాఖ్యానించారు. విస్తరభయంచేత దాన్నివుదాహరించలేదు. "ఉదారహృదయానాంతు వసుధైవ కుటుంబకమ్" అనేవిశేషం చాలావఱకు అన్నగారికుటుంబ విషయంలో పంతులవారు పాటించి లోకానికి వుపదేష్టలైనారు. నామకః తుట్టతుదిరోజుల్లో అన్నగారి మనుమణ్ణే అనుకుంటాను దత్తు తీసికొని పుత్రి పం తు ల సద్గతినికూడా చూరకొన్నారని కొన్ని నెలలక్రిందటనే శుభలేఖద్వారాగా తెలుసుకున్నాను. సర్వవిధాలా పంతులవారు ధన్యులు యిన్ని సుయోగాలు పట్టినజాతకం బ్రాహ్మణులలోనేకాదు యితరులలోకూడా మృగ్యమే. యూనివర్సిటీ వారు కళాప్రపూర్ణబిరుదంతో పంతులవారిని గౌరవించారు. పంతులుగారు బి. యే. ప్యాసయేనాఁటికి యింకా ఆలాటివారినీ, కాశీ వెళ్ళివచ్చినవారినీ బాజాబజంత్రీలతో సమ్మానించి తీసుకురావడం వుండేదనిన్నీ, పంతులవారి క్కూడా ఆలాటి గౌరవం జరిగిందనిన్నీ చెప్పుకోఁగా విన్నాను. నాకూ

పంతులుగారికే భాషావిషయంలో కొన్ని ప్రయోగాల విషయంలో కొంచెం మతభేదం వున్నప్పటికీ నేను వారిని శిరసావహిస్తానని అన్యత్ర వ్రాసే వున్నాను - అట్టి మతభేదాభిప్రాయాలను పురస్కరించుకొని ఆయా వ్యక్తులయందు వుండే యోగ్యతలను అపహ్నవించి అన్యథాగా అపవదించ డానికి నేను సమర్థుణ్ణికాను. పంతులవారు వట్టి కవిమాత్రమే కాదు, విద్యత్కవి, ఉద్యోగి. సంపన్నగృహస్థు, కృతికర్త, కృతిభర్త, విద్వత్కవి మిత్రులు, యథార్థవక్తలు, నిరాడంబర జీవనులు, నిష్కళంక చరిత్రులు, యుక్తదాతలు, స్వతంత్రులు - ఆ యీ విశేషాలన్నీ సూత్రప్రాయంగా యిమిడ్చిన పద్యాన్ని జయింతి పుస్తకాన్నుంచి వుదాహరించి అక్షరతర్ప ణంతోసహా దీన్ని వుపరమిస్తాను —

శా. శ్రీమంతుండవు కీర్తిమంతుఁడవు వాసిన్ బొల్చు మేల్ కైతలో
సామర్థ్యంబు విమర్శనాకృతిరహస్యజ్ఞత్వముం గల్గు వి
ద్యామాన్యుండవు జీవితంబు కవితాతన్వంగిపాల్ సేయు ని
న్నే మన్నింతు జయంతిరామసుకవీ! నిర్దుష్ట భాస్వద్గవీ.



# వేంకటనాథుని పంచతంత్రం

( ది 26—2—1941 సం॥రం ఆంధ్రపత్రిక నుండి )

పంచతంత్రం అసలు సంస్కృతంలో పుట్టింది. దాన్ని ఆంధ్రీ కరించిన కవులు యిద్దఱు కనపడుతూ వున్నారు. ఒకరిపేరు నారాయణకవి. యింటిపేరు సమయానికి జ్ఞాపకం వచ్చిందికాదు. స్కూళ్ళలో అప్పుడ ప్పుడు పాఠంగా పెట్టడం యీ నారాయణకవి పంచతంత్రానికే జరుగుతూ వుంది. యీయన కవిత్వం సలక్షణ మైనదే. కాని వేంకటనాథుని కవిత్వ పోకడ చాలా అసాధ్యంగా అంటే, జిగిబిగిగా వుంటుంది. వేంకటనాథుఁడు

క్షత్రియుఁడు, కేవల క్షత్రియమాత్రుఁడే కాఁడు. జమీన్‌దారు కూడాను - ఈయంశాన్ని గద్యలోవున్న విశేషణాలు పూర్తిగా తేల్చడం లేదు గాని వంశవర్ణనలో వున్న పద్యాలు కొన్ని సూచిస్తూ వున్నాయి - వొక్కటి వుదాహరిస్తాను.

> "క. అసహాయ సరసకవితా
> రసికుఁడ వేంకటధరావర ప్రభుఁడ గుణా
> ప్రసవప్రకాండమదవ
> ద్వసలాయిత విద్వదఖిలబంధువ్రజుఁడన్."

యీపద్యంలో వున్న "ధరావరప్రభుఁడన్" అనే విశేషణం కేవల క్షత్రియమాత్రుఁడు వేసుకోతగ్గది కాదు. ధరావరుఁడేనా అయి - వుండక తప్పదు, నాకు ప్రస్తుతం దొరికిన పుస్తకం చాలాపాఁతది. నాలుగుపుటలు మొట్టమొదటివి అసలే లేవు. ఆ పుటలలో యింతకంటె యెక్కువ సంగతులేవేనా దొరికేవేమో? యిప్పుడు దొరికినంతలో పరిశీలిస్తే జమీన్‌దారుఁడనే తేలుతుందిగాని, యే ప్రాంతంలోవుండే జమీనుకు పరిపాలకుఁడో తేలడం లేదు. (హరిహరనాథుఁడికి అంకితం చేశాఁడు కనుక - నెల్లూరిమండలం వాఁడని వూహించవచ్చు.) అయినా కవిత్వానికిన్నీ జమీన్‌దారీకిన్నీ అంత సన్నిహిత బాంధవ్యం లేదుకదా! అందుచేత దీన్ని గుఱించి విశేషించి చర్చించడం అంతగా ఆవశ్యకం కాదనుకుంటాను - కవిత్వానికల్లా ప్రధానం వొక్కరసం మాత్రమే. అది వున్న కవిత్వమైతే కవి యెంత బీదవాఁడైనా బాధకం గాదు. (కొందఱు యీకాలంలో కవిత్వానికీ దీనికీ చుట్టఱికం కల్పి కవిని యీసడించే కుతూహలం కలవారున్నారు. వారు వట్టి అమాయకులు.) దీనికి పోతన్నగారే ప్రథమసాక్షి. ప్రస్తుతం మనకు యీకవి జమీన్‌దారుఁడా? కాదా? అనే చర్చతో అంత అవసరం లేదనే దియ్యేవే - పంచతంత్రం సంస్కృతంలో వున్నా, దానికి యిది అనువాదమే అయినా యీ మహాకవి కథమాత్రమే అనుసరించి వున్నాఁడు గాని, రచన యావత్తూ స్వంతంగానే వున్నట్టు గోచరిస్తుంది ——

"పొదలు నెవ్వనిగృహంబున మనోహరభార
తీభారవహముఖద్విజకులంబు....
పక్షిమాత్రుండె వాయసపరివృఢుండు."

ఆ యీ సీసపద్యం వొక కాకిని వర్ణించింది. కాకులలో యీ కాకి రాజని వర్ణించుటచేత రాజులకుండే ఐశ్వర్యాలలో వొకటి విద్వాంసులు వచ్చి ఆశ్రయించడం కనక, అట్టి మహదైశ్వర్యాన్ని యీకవి యెంతో సుళువుగా ఆపాదించాఁడు. కాకిగూట్లో చిన్నప్పుడు కోకిలలు వుండడం మనస్సులో పెట్టుకొని పైచరణం రచించడం జరిగింది - యీ మహాకవికి సంస్కృతంలో యెంతపాండిత్యం వుందో తెలుఁగులో యెంత పాండిత్యం వుందో నిర్ణయిద్దామంటే అది సాధ్యపడేటట్టు లేదు - నన్నయాదులుకూడా ధారాశుద్ధిలో యితణ్ణి అతిక్రమించలేరేమో అని తోస్తుందినాకు. కాని వారికి వచ్చిన పేరులో యెన్నోవంతు పేరున్నూ యితనికి వచ్చినట్టులేదు.

"మ. పురతః ప్రాంజలి సాశ్రుదృగ్జలజుఁ డుత్ఫుల్లాస్యుఁ డాశ్లేషణా
చరణారంభణకేళి సత్ప్రియకథా సంప్రశ్నదత్తాధికా
దరుఁడున్ మాయి బహిర్మహామధురుఁ డంతర్గూఢహాలాహలుం
డరుదే? దుర్జనుఁ డెంత శిక్షితుఁ డపూర్వాఖర్వనాట్యోచితిన్." (1ఆ.)

"మ. నిలువం జోటులు లేవె? నీకుఁ జెపుమా! నీరాట రేవేల? హా!
తెలిసెన్ బాంధ! గతాగతైతదథ పృథ్వీభృత్పురస్త్రీకళా
కలితాస్య ద్విజరాజ బింబకృత సాక్షాత్కారసంభావనా
కలనాదూరపథప్రయాణజనిత గ్లానిం త్యజింపం జుమీ." (4 ఆ.)

ఆ యీ పద్యాలు వెతికి పరిశీలించి వుదాహరించలేదు, యథాలా భంగా వుదాహరించాను. వట్టి తెలుఁగుమాటలతో యెంతో జాతీయంగా చెప్పవలసివచ్చినా యీయన అసమానంగా చెపుతాఁడు —

"క. మగవాఁడనఁగాఁ దుమ్మెద
పొగరుంబ్రాయమునఁ గన్నపూవుల నెల్లన్

దగిలి రమియించుఁ గలదే?
మగవానికి నెందు సరిసమానము జగతిన్." (4 ఆ.)

"క. నాతోడని నన్నడుగుట
యీ తెగుఁ దెంపునకుముగిసె నిఁక నేమనుచున్
రాతికొడు కతఁడు హాలసం
జాతకిణాశ్మాతికఠిన శయమునఁ జరచెన్." (4 ఆ.)

కథాసందర్భం తెలపకుండా యేదో పద్యం తీసి వుదాహరిస్తే ప్రయోజనం లేదని యెఱిఁగిన్నీ గ్రంధవిస్తరభీతిచేత టూకీగా వుదాహరించాను. వలసినవారు పుస్తకం పరిశీలిస్తే యీకవిత్వప్పసందు తేలుతుంది. యీ కందాలలో మొదటి దానిలో వున్న "సరిసమానము" అన్నచోట పునరుక్తిదోషం ఆపాదించేవారున్నూ యీ కాలంలో వున్నారు. వుందురుగాక. సంస్కృతాంధ్రిలలో యీ కవి నిరుపమానుఁడు —

" గిరిదరీముఖబహుద్వి రదశోణితసిక్త
గండశైలము కనత్కనకపీఠి -
.... చారుతరమూర్తి, పంచాన్యచక్రివర్తి : "

యీ పద్యం మృగేంద్రుని (సింహ) ప్రభుత్వం వర్ణించేది. యేరాజు పేరెత్తుకొని వ్రాస్తే యేరాజుక్కోపం వస్తుందో? అని కాఁబోలును, గ్రంథకర్త మృగాలమీఁదా పక్షులమీఁదా పెట్టి రాజనీతిని వర్ణించాఁడు. ఆలా పిల్లిమీఁదా యెల్కమీఁదా పెట్టి రచించినా, గుమ్మిడికాయ దొంగలు తమమీఁద పెట్టుకుంటే పెట్టుకోవడానికి అవకాశం లేకపోలేదు. యీ రోజుల్లో అయితే మర్యాదనష్టిదావాలు యెన్నో దాఖలయీవే కాని, అప్పుడు జమీన్‌దార్లు వగయిరా యీలాటి నామర్దాపనులకు సిద్ధపడేవారు కారు. ఆకాలంలో అట్టి ఆచారం వున్నట్టున్నూలేదు. యిది పాశ్చాత్య వాసన. అదిన్నీకాక ఆకాలంలో యేమాత్రం జమీన్‌దారీ వున్నా దానితో పాటు నిగ్రహానుగ్రహాధికారం కూడా వుండేది. కాఁబట్టి ఫలానాకవి నాకు

మర్యాదను భంగించే కవిత్వం చెప్పాఁడని వేతొకరితో మొట్టిపెట్టుకోవలసిన ఆవశ్యకత్వం వుండేదేకాదు. పోనీ కవులు తిట్టకుండా వున్నారేమో ? అంటే, పిల్లిమీఁదా యెలకమీఁదా, పెట్టే మాత్రమేకాదు, అవసరమైతే ప్రత్యక్షంగానే తిట్టేవారన్నందుకు వకటీ రెండూ కాదు, యెన్నో దృష్టాంతాలు కనపడతాయి. వాట్లని వుదాహరించడం పెట్టుకుంటే వ్యాసం తేలదు. యేరాజున్నూ తన్ను కవి దూషించాఁడనే యీర్ష్యపెట్టుకొని యేకవినీ శిక్షించి తన అధికారాన్ని ప్రకటించు కొన్నట్టుమాత్రం లేదు - కవులంటే, ఆ రాజులకు కొంత భయం వుందని మనం అనుకోవాలి - దీన్ని మనస్సులో పెట్టుకొనియ్యేవే "బ్రహ్మకొడుకైనఁ గవులకు భయముఁజెందు" అని శ్రవణానందంలో మేము వ్రాయడం జరిగింది. రాజులే కాదు ఆనాఁటి కవులుకూడా వాదోపవాదాలలో గెల్పోడులు సంభవిస్తే వాట్లని రాజకీయోద్యోగులద్వారా తీర్చుకోవడానికి ప్రయత్నించినట్టు పండితులుగాని కవులుగాని చెప్పుకున్నట్టులేదు. (రాజకీయోద్యోగులకు పాండిత్యంతో సంబంధం వుండడం అరుదు.) యీ విశేషం నిన్న మొన్నటినుంచిమాత్రం ప్రారంభమైంది. అవడంలోనూ యేవిధంగా ప్రారంభమయిందంటారు ? శుద్ధ అభూతకల్పనలతోనే దేవుఁడున్నాఁడనే జంకుగొంకులు లేకుండానే. యేదో విధంగా ప్రత్యర్థిని అవమానిస్తే చాలుననియ్యేవే. అయితే అయిందిగాని లాభమేమేనా కనపడుతూవుందేమో ? అంటే, అదిన్నీ వున్నట్టులేదు. కాళ్ళుఱిగేటట్టు వృథాగా తిరగడమే తుదకు ఫలితం. యిప్పటికాలంలో అప్పటంత ధారాళంగాతిట్టే కవులే కనపడరు. మహిషశతకంవల్ల యీ సంగతి విస్పష్టమవుతుంది.

మహిష శతకం యెంతో ప్రాచీనంగాదు. బాగా ప్రాచీనకవిత్వం భోగినీదండకం చూడండీ ? సాత్త్వక భక్తుఁడు, భాగవతాంధ్రీకరణలబ్ధ ప్రతిష్ఠుఁడుపోతరాజుగారు వేశ్యమాతచేత రాజులను పేరుపెట్టకుండానే అనుకోండి, పడతిట్టించాఁడు - ఆ తిట్లకు అప్పటి ప్రభువు బహుశః సర్వజ్ఞ సింగభూపాలుఁడే అవుతాఁడు. ఆయిన లేశమున్నూ కలిగించుకొన్నట్టే

లేదు. అంతదాఁకా యెందుకు ? వసుచరిత్రలో యేదో సందర్భాన్ని కల్పించి కథానాయకుఁడిమీఁదపెట్టి "మాయాశీలురు చంచలాత్మలను కంపాళూన్యులు" అంటూ యెత్తుకొని కొంత దూషించి దూషించి ఆయీ దూషణాన్ని జనసామాన్యానికి అంటఁగట్టి "ఆ పైమహీపాలుర్మహావైభవ శ్రీయోగాంధులు" అని నిర్దేశించి, మళ్లా మెల్లిగా ఉపాయంగా "మగ వారిన్నమ్మగావచ్చునే ?" అని తప్పుకున్నాఁడు - ప్రస్తుత గ్రంథకర్త రాజో లేక రాజబంధువో అయివుండడం చేతకాఁబోలు - (1) కలవేమో కటకట; సత్యశౌచములు రాజులకున్. (2) నీతులున్నవా ? రాజులకున్. (3) నిర్దయుల్ ఖలుల్ తులువలు హీనమర్త్యఫలదుల్ నరవల్లభులు అంటూ బాహాటంగానే దూషిస్తూ వచ్చాఁడు. యిందులోవున్న ప్రధాన పాత్రలు మట్టుకు తిర్యగ్జంతువులేకాని అప్రధానపాత్రలు రాజులు, రాజ పుత్రికలు, రెడ్లు, తత్కుటుంబినులు, బ్రాహ్మలు, వైశ్యులు వగయిరాలుగా నున్నారు. యీ గ్రంథం సారం యెఱిఁగి చదువుకొనేవారికి యెంత రస వత్తరంగా కనపడినా సర్వసామాన్యంగా కొఱకుబడే శైలిలో లేకపోవడం చేతఁగాని ఆలాగేకాకపోతే దీనివల్ల మాకు అగౌరవం కలుగుతూ వుందనిన్నీ, దీన్ని ప్రచారాన్ని ఆపుచేయవలసిందనిన్నీ ఆయావర్ణాలవారు పాలకులకు మొఱపెట్టుకోవడం జరిగేదే అనుకోవాలి. ఇప్పుడు యిదో పంథా ప్రారం భమైంది. యిదీపాశ్చాత్యవాసనే. యీ వాసన ఈభరతఖండాన్ని అన్ని విధాలా కుంగదీసిఁది. తీస్తూవుంది. దీనితోపాటే ప్రతీదానికీ సమ్మెకట్టు వకటికదా ? ఆఁడాళ్ళందఱూ కలిసి మొగాళ్ళమీఁద సమ్మె, విద్యార్థులు మాస్టర్లమీఁదసమ్మె, కూలీలమాట చెప్పనే అక్కఱలేదు రైతులమీఁద సమ్మె, ధర్మశాస్త్రం కానివ్వండి - వేదం కానివ్వండి. దానితాతకానివ్వండి. యేవర్ణానికేనా వ్యతిరేకిస్తేసరి, దాన్ని ప్రచురించకుండా చేయడానికి ఆ వర్ణస్థులు ప్రయత్నిస్తారు. యిందులో తురకలు అగ్రగణ్యులు. యేవో వకటి బీరువోతుందేమో గాని సాధారణంగా ఆ ప్రయత్నం ఫలించే తీరుతుంది. ——

యీలాటి ప్రయత్నాలుగాని వాదోపవాదాలలో వోడిపోయిన పండి తులు రాజసభకు మొఱపెట్టుకోడంగాని ఆకాలంలోనేగాదు యీకాలంలో కూడా అంతగా వున్నట్టులేదు. కాని, వోడిపోయిన పండితులు మళ్ళా గురుశుశ్రూషచేసి చదివి జయించడానికి ప్రయత్నించడం మాత్రం వున్నట్టు కీ॥ శే॥ లు శ్రీ పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రుల్లవారి పరివృత్తివల్ల గోచరిస్తుంది. వీరు కాశీలో చిరకాలం శాస్త్రాభ్యాసం చేసి దేశానికివస్తూ తోవలో శ్రీమాడుగుల సంస్థానానికి వెళ్ళినప్పుడు ఆ సంస్థానప్పండితులు శ్రీయింద్ర గంటి గోపాలశాస్త్రుల్లుగారితో (యీశాస్త్రుల్లుగారికి మహాభాష్యం యావత్తూ జిహ్వాగ్రాన్ని వుండేదఁట ? వీరు మాపరమగురువులు శ్రీబ్రహ్మయ్య శాస్త్రుల్లుగారికి యీదేశంలో గురువులు) వాదం వచ్చినట్టున్నూ, దానిలో పరా జయం కల్గినట్టున్నూ, ఆ పరాజయాన్ని తీర్చుకొనే నిమిత్తం అక్కడినుంచే మళ్ళీ కాశీకివెళ్ళి కొన్నిసంవత్సరాలు విద్యావ్యాసంగంచేసి ప్రత్యర్థిని జయించ డానికి వచ్చినట్టున్నూ అప్పటికి కొన్నిమాసాలనాఁడు సదరు గోపాల శాస్త్రుల్లుగారు దివంగతులు కావడంచేత తమకోరిక నెఱవేరింది కాదుగదా అని విచారపడ్డట్టున్నూ పరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారివల్ల విన్నాను, కొంత మాత్సర్యంతో చేరినదే అయినా, అది నిజమైన పండిత లక్షణంగా కనబడుతుంది. ఆ యీ సందర్భాలన్నీ ఆనకట్టుకు పూర్వకాలం నాఁటివి. (యిప్పు డీగాథలు యెవరేనా యెఱిఁగినవారు చెప్పినా వినేవారు కనపడరు.) యిటీవల యెన్నోవిషయాలు యెన్నోవిధాల మార్పుచెందాయి. వాట్లతోపాటు విద్యావివాదాలున్నూ మార్పుచెందాయి. తంజాపురీ వల్లభుల ప్రభుత్వకాలంలో కుట్టికవి మహిషశతకాన్ని రాజుగారిమీఁద కోపంవచ్చి వ్యంగ్యంగా వ్రాస్తే, ఆరాజుగారు తమతప్పును తెలుసుకొని కవిని గౌర వించినట్టు చెప్పుకొంటారు - యిప్పుడు ఆలాటి కవులుగాని జమీన్‌దారులు గాని మృగ్యులే అనుకోవాలి, ప్రస్తుతగ్రంథం రాజపుత్రులకు రాజనీతిని వుపదేశించే తాత్పర్యంతో యెవరో వకరాజు కోరితే వొకపండితుఁడిచేతను సంస్కృతంలో తిర్యగ్జంతువులను పాత్రలుగా కల్పించి రచించఁబడ్డది.

కాని ఆపాత్రలద్వారా చెప్పించేమాటలు మన్వాది ధర్మశాస్త్రోదాహరణా లతో నిండివుంటాయి. కనక ఆయీ పాత్రలన్నీ మనుష్యులుగానే మనం భావించుకోవాలి. నాలుగో ఆశ్వాసంలో మహాప్రబంధానికి వుండఁదగ్గ వర్ణనలన్నీ శ్లేషయమకాది విశేషాలతో కవి చిత్రించి వున్నాఁడు. ఆకథ చెప్పుకొన్న పాత్రలు తిర్యగ్జంతువులే కాని, కథలోవున్నపాత్రలు రాచ కొమార్తె వగయిరాలు, చంద్రోపాలంభన, మన్మధోపాలంభన, వాకటే మిటి, వసుచరిత్రలో వున్న యావద్విషయాలు విపులంగానే వున్నాయి. అట్లని కవిత్వపోకడలు వసుచరిత్రనుంచి దొంగిలించఁ బడ్డాయేమో ? అంటే, అట్టిదోషంలేదు. స్వయంగానే నడిచింది కవిత్వధోరణి, వుదాహ రించవలసివస్తే చాలావుదాహరించాలి. అందుచేత కొంచెం వుదాహరిస్తాను.

"ఉ. కందళితానురాగములు గావు మనంబులు విన్నయంతలో
నందరు పారవశ్యపదమందరు చల్లఁదనం బొకింతలే
దిందున శంకరాభరణ మెట్లయితీవు శశాంక ! నీపదం
బుందుది నంతశూన్యమగుఁబో వివరింపఁగ మాటలేటికిన్ ?

యీపద్యంలో సంగీతమర్మం కొంత మనస్సులో పెట్టుకొని చంద్రుణ్ణి వుపాలంభించాఁడు కవి. నా చూచినంతలో శంకరాభరణశబ్దాన్ని యీరీతిగా చమత్కరించిన రచన కనపడలేదు - కనక కొత్తపోకడగా నెంచి అభినందిస్తూన్నాను. మేము యీవుపాలంభనాలంటూ పెట్టుకోనే లేదు. యెందుచేతంటే ? మనకు పూర్వకవులు కల్పనలు స్వల్పంగాకూడా మిగల్చక పోవడంచేతనే - లక్షణాపరిణయంలో రాజీవం అనేది శ్లేషించి వకపద్యం వ్రాశాము. అంతే. అప్రయత్నసిద్ధాలైన యమకాలకేమి ; (మీ రందంద నరుగ నరుఁ గానరుగా వంటివన్నమాట) అల్లాగే వచ్చే శ్లేషలకేమి ? శయ్యలకేమి ? రీతులకేమి ? గుణాలకేమి ? యీమహాకవి కవిత్వం పుట్టిల్లే. వుదాహరించవలసివస్తే పుస్తకమంతా తూ - చా తప్ప కుండా యిక్కడ పెట్టవలసి వస్తుంది. అచ్చతెలుఁగు పోకడ పోతాఁడా ? యితనికి సంస్కృతప్రవేశం లేదుగాఁబో లనిపిస్తుంది. చూడండీ యీపద్యం

"క. ఆడికలం బడితినో ? అం
కాడితినో ? యిల్లు ముంగిలననో తఱితోఁ
గూడననో ? నీళ్ళననో ?
కూడునె; యిల్లాలి నన్నుఁ గొట్టన్‌దిట్టన్."

యీమాటలు శుద్ధ అనాగరిక వ్యభిచారిణి పల్కే మోసపుమాటలు. యీభాగం చదివి తీరవలసిందేగాని వొకటీ రెండూ పద్యా లుదాహరిస్తే అంతమాత్రంతో తనివి తీరదు.

"చ. పలుచనిమేను నిబ్బరపుఁ బ్రాయమువాఁడవు కంచికెప్పుడుం
గలిగినరెడ్డి వింగొనఁగఁ గ ర్తవు కాపురమెచ్చు నిన్ను నే
వెలయెలనాగ పిల్వ ? దది వేడుకఁబోలిన నీకుఁ జిత్తమే
పొలఁతుకమీఁద నుండు నిది బొంకక నాకెఱుగంగఁ జెప్పుమా?"

ఆయీమాటలు వొకరెడ్డిసాని తన అమాయికపు భర్తతో వంచనా తాత్పర్యంతో పల్కేవి. ఆరెడ్డి మాయా, మర్మమూ యెఱక్క యిచ్చే జవాబు చూడండీ యెంత జాతీయంగా వుంటుందోను —

"ఉ. వొట్టవు నిక్కమేనెఱుఁగ నొండొకబోగముదానిఁ గాంచికా
పట్టణమందుఁ గూడి గడపై మనవాకిట నాడి పద్దెమున్
గట్టిన వీటిలంజె గుఱిగాఁ దిఱుగాడ నెఱుంగవేమొ నా
చుట్టఱికమ్మనం బ్రియము సుమ్మిఁక మాటలు వేయునేటికిన్."

ఆ యీ రెండుపద్యాలలో యేమాత్రమో తత్సమపదాలు వున్నప్పటికీ అవి కేవల దేశ్యపదాలకన్నాకూడా మిన్నాగా బోధపడే తెలుఁగుపదాల వంటివే ? వెనకటి కవులు కొందఱూ నేఁటికవులు కొందఱూ అచ్చతెలుఁగు కవిత్వం చెపితే అది యెక్కువ గొప్పనుకొని రచించిన ప్రబంధా లున్నాయి కొన్ని. అవి యేదో కోయభాషలా వుంటాయి. సహజధారగా వుండవు.

"పల్కువాల్ దొరగుర్రిడ్డు పనఁటులాటలపట్టు" అంటూ మొదలెట్టి మా ముత్తాతగారు వొక సీసపద్యం సీసపద్యం అంతా అచ్చతెలుఁగు

పదాలతోటే ముగించారు. పైమాటకి అర్థం బ్రహ్మాండ భాండములు విహారస్థలాలని, అర్థంగాచూపిన పదమే హృదయాకర్షకమో పద్యంలో వున్నపదమే హృదయాకర్షకమో ? విజ్ఞులు గుఱితిస్తారు. కొందఱు కవిత్వ మంటే ? యెంత గంపచిక్కుగా రచిస్తే అంత గొప్పదనాన్ని కలిగిస్తుం దనుకొంటారు. అలాటివారిని మొల్ల — "మూఁక చెవిటివారి ముచ్చట దియు" అనేసింది. ఆ యీ వేంకటనాధుఁడు కూడా - "ఆంధ్రదేశపున్ గరిత చనుంగవన్వలె" అనే సిద్ధాంతాన్నే ఆమోదించాడు. "అఱవెత గుబ్బచన్వలె" అనేపద్యం ఆంధ్రకవితా పితామహుని చాటుధారా పద్యంగా చెప్పకొంటారు. కాని కొంచెంభేదంగా యీ వేంకటనాధుఁడుకూడా ఆయీ పద్యాన్ని పీఠికలో వుదాహరించి వున్నాఁడు. యింతమాత్రంచేత గ్రంథ చోరత్వాన్ని ఆపాదించకూడదు. యీ యిద్దఱుకవులకూ కూడా ప్రాతి పదిక శ్లోకం — "నోద్రావిడే స్తనఇవ" అనో "నోఘూర్జరీ" అనో ? వొకటి సంస్కృతంలోవుంది. ఆద్రవ్యం వొకరికి పిత్రియమై వొకరికి కాక పోతుందా ? సామెతలుకూడా కవులందఱికీ సొత్తుగానే చూచుకోవలసి వుంటాయి. —

"క. అడవులు నేఱులు నవినీ
పడసినవి యెట్లు పుణ్యభాగీరథి యి
ప్పుడమిఁగల వారికెల్లను
నెడపక సేవ్యంబ కాక యిది నీయదియే ?"

(భారత — అరణ్యపర్వం)

ప్రకృత మనుసరిద్దాం. యీలాటి సందర్భాలలో గ్రంథచౌర్యాన్ని ఆపాదించడం సహృదయసమ్మతం కాదని తెలుసుకోవాలి. యీకవి "సంస్కృతంబు పచరించి" తేనో ? తెలుఁగు బొత్తిగా రానివాఁడేమో ? అనిపిస్తుంది —

"మ. పలితశ్మశ్రుశిరోజు రోగలతికోపఘ్నున్ ధనుర్భంగురున్
వలియుగ్వక్త్రనిత స్తతశ్చలిత నిస్స్వస్థో త్తమాంగున్ గర

స్థలయష్టిన్ బటలావృతాక్షు విగళద్దంతున్ వయోగర్వ ని
స్తుల యోషిత్కులమేర్పడం బరిహరించున్ మాలవానిన్‌బలెన్."

యీలా చూపడమంటూవస్తే వ్యాసం తేలదు. భారత కవిత్వం మొదలుకొని తెలుఁగు గ్రంథాలలో యేయే కవుల విశేషాలు ఆ యా కవుల కవిత్వాలలో కనపడతాయో, అన్ని విశేషాలూ వొకటే ప్రబంధంలో చూడాలంటే ? యీ వేంకటనాఁధుడి కవిత్వంలోనే చూస్తే చాలునను కొంటాను. అయితేమాత్రం యేంలాభం ? యీయన కవిత్వానికి లోకంలో తగినంత ప్రచారం వున్నట్టు కనపడదు. (యే వావిళ్ళవారేనా పరిశుభ్రంగా అచ్చేనా వేశారో లేదో ? యిటీవల) బందరు భైరవ ప్రెస్సులో యేనాఁటిదో వొక పాఁతఅచ్చు పుస్తకం నాకంట బడింది. - పడి అప్పుడే నలభైయేళ్లు కావచ్చింది. అప్పటినుంచీ సాంతంగా చదవాలనీ అనుకోవడమేగాని చదవడం తటస్థం కానేలేదు. నిన్నమొన్న దీక్షగా చదవడానికి వుద్దేశం కలిగింది. కాని మొట్టమొదట కొన్ని పేజీలు పూర్తిగా లోపించాయి, మధ్యమధ్య కొన్ని పుటలలో కొంతకొంత భాగం లోపించింది. దాన్నే చదివి యీనాల్గు మాటలూ వ్రాశాను. - యింతకవి " నభూతోన భవిష్యతి" సర్వరసాలకూ పెట్టినపేరుగా వుండే యీమహాకవి కవిత్వానికి ప్రచారం తక్కువగా వుండడానిక్కారణం అట్టే ఆలోచిస్తే, యీరచన ఆముక్త మాల్యదంత కాకపోయినా చాలాఁ భాగం నారికేళపాకంగా వుండడమే అని తోఁచింది. —

"చ. సరకులకేఁగి వేసరెఁ బసారముఁ బెట్టిన సెట్లగూడివే
సరెనడుగానఁ గానక యజస్రముఁ గూలికి మూటమోసివే
సరెమఱియుప్పుఁ గూరయును సందులఁ గొందుల నిల్చినిల్చివే
సరె నొక త్రోవయున్ ఫలమొసంగదు సెట్టిభాగ్యమెట్టిదో ?"

యీ పద్యం చాలా తేలికగా వున్నట్టే వున్నా తాత్పర్యం తెలుసు కోవలసివస్తే కొన్ని వాక్యాలకు కొంత గంపచిక్కుగానే వుంటుంది,

హంసవింశతి మాదిరిగా యీ గ్రంథంకూడా యేదేనా విషయం యెత్తు కుంటే దాని అట్టపుటానవాళ్ళు సమస్తమూ యేకరు పెట్టకుండా విర మించదు. —

"ఆలగుంపులు గొఱియలదొడ్లు లేఁబూరి
మెనుముల మినుమందు లెడ్లకదుపులు
.... .... .... .... గలిగి
కాపురము సేయు నవ్వీటఁ గాపు కొడుకు."

ఆ యీపద్యంలో వ్యావసాయకుఁడికి వుండదగ్గ పరికరాలన్నీ యేకరు వేశాఁడు. చాలా గాథలతో నిండివున్న దీన్ని పురాణమనుకోవ డానికి అవకాశం లేకపోలేదుగాని శైలిమాత్రం (కంకంటి పాపరాజుగారి శైలిచూ) పురాణశైలికాదు. యీ అంశం లోఁగడనే వుదాహరించిన కొన్ని పద్యాలవల్ల విస్పష్టమే అయినా యింకో పద్యం చూపుతాను —

"ఉ. తోషణకారణైకవసతుల్ సతులత్తఱి ఖగ్నసైంధవ
ద్వేషివిషాణ గర్భరుచి విస్ఫురితాగురుదారుఖండ సం
పేషితనూత నైణమద మిశ్ర ఘనస్తనదత్తనూతనా
శ్లేషణలీలఁ దేలుతురు శీతభయార్తుల నాత్మభర్తలన్."

యింతకంటె తేలిక శైలిగా వ్రాయడం యీ మహాకవికి చేతకాదనే అనుకోవాలి. అందుచేత దీన్ని పురాణ పాకంగా అంగీకరించడానికి వీలుపడదు —

భవతు. యేపాకమేనా కానివ్వండి ఈగ్రంథానికి ఆఖరికి ఆముక్తమాల్యదకు వున్నంతవ్యాప్తి కూడా లేకపోవడం చింతాకరం. పోనీ దీనిలోవున్న కథావస్తువు పుణ్యగాథ కాదేమో అనుకుందామా? రామాయణకథని ప్రతిపాద్యంగా పెట్టుకొన్న రామాభ్యుదయానికిమాత్రం విశేషవ్యాప్తి కలిగిందా? ఆ గ్రంథం పేరేనా కొందఱు యెఱుఁగుదురు గాని, యీ గ్రంథం పేరుకూడా కవులలోకూడా పలుమంది యెఱుఁగనే యెఱుఁగరనడం సత్యదూరం కాదు. యింకా దీని అదృష్టం కొంతమంచిదే,

లేకపోలేదు. ఆసొగసు అనుభవైకవేద్యం. వితండ వాదాలకూ ఆయా సొగసుకూ చుట్టఱికం వుండదు —

"కవితా చమత్కార గౌరవంబు
మన సెఱుంగునుగాక యెవ్వనితరంబు"

అన్నారు మాముత్తాగారు. యీలాటివిశేషాలు తెలుసుకోవడంపేరే సహృదయత్వం. నన్నయ్యభట్టు

"తే. గీ. సర్వతీర్థాభిగమనంబు సకలవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు"

అని ప్రయోగించాఁడు. ఈపద్యంలో వున్న 'యు' అనేది సముచ్చయార్థకం కాదు గనక, తప్పు అంటే? చెప్పేజవా బేమిటి? (యిట్టి ప్రయోగాలు నన్నయ్యగారి రచనలో చాలా వున్నాయి) నన్నయ్య భట్టుకు మనమాత్రం తెలివితేటలూ లేవా? అనేదే జవాబు. (యిట్టి నిరర్థక యు వర్ణ ప్రయోగపరంపర వుండఁబట్టే కాఁబోలును భారతానికి పునస్స్వయంపాక యోగం) అప్రయోగంలో వాకమాదిరి సొగసుమాత్రం వుంది. ఆసొగసు వ్యాఖ్యానించవలసి వస్తే-"యతో వాచో నివర్తంతే" అవుతుంది - యింకా యీలాటివి మఱికొన్ని వున్నాయి. వాట్లని చూపవలసి వస్తే వ్యాసం తేలదు - "కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివా నవా" దీన్ని యీలా వుంచుదాం. యీపద్యంలో "ఈవఱదాఁకా" అనే దీర్ఘాంత ప్రయోగం వకటివుంది - 'దాకన్' అని కవులందఱూ వాడుతూన్నారు. వ్యవహారంలో మాత్రం 'అందాఁకా, ఇందాఁకా' అనే అంటారుగాని, ద్రుతాంతంగా వుచ్చరించరు - ప్రకృతకందపద్యంలో - "దాఁకన్" అని సవరించినా వచ్చే చిక్కులేదు. యింకో కందపద్యంలో కూడా యీలాటి చోటే వుంది — (ముదిసి ముప్పు దనుకా మనుదే) యిక్కడకూడా 'దను కన్' అని దిద్దితే చిక్కు లేశమూ వుండదు. కానీ, యీమహాకవికి వ్యావహారిక ప్రయోగాలయందు అభిలాష వున్నందుకు యితరాధారాలు కొన్ని

కనపడతాయి. అందుచేత ఆయీ ప్రయోగద్వయమున్నూ అట్టిదే యేమో అని నేను అనుమానిస్తాను. ఆ స్థలాన్ని చూపుతాను —

"మ. అతి భాస్వత్తరకాంచనంబు చెలినా సాంగంబు, కల్యాణమా
శతపత్రేక్షణ మేను, మేరుకుధరాంచత్కూటముల్ దాని యు
న్నతవక్షోజము లేమి చెప్ప నదియంతా అంత బంగారమ
ప్రతిమం, బానరనాధుపట్టి గణుతింపన్ శక్యమే ? యేరికిన్."

యీ పద్యంలో శ్లేషచేత యావత్తూ బంగారుమయంగా సమర్థించాఁడు కవి, ఆలాసమర్థించి "అంతా అంత బంగారము" అన్నాఁడు అంటే ? యేమన్నమాట ? యావత్తూ బంగారమే అన్నమాట. గ్రాంథిక భాషలో - "అంతా" అనే దీర్ఘాంతం వుండదు. "అంతయు" అని వుండవలసి వస్తుంది - ఆ "యు" అనేది లోపించి దీర్ఘంగా పరిణమిస్తుంది వ్యావహారికంలో —

"అంతా రామమయం, యీ జగమంతా రామమయం" అనే రామదాసుకీర్తనలో తప్ప యీ దీర్ఘాంతప్రయోగం పద్యకవిత్వగ్రంథాల్లో కనపడదు - పదకవులు శ్రవణానందానికి భంజకంగా వుంటుందనిచెప్పి, వ్యాకరణాన్ని "తోసిరా" జంటారని - "పదకవులు" అనే వ్యాసంలో తెల్పివున్నాను. పదకవులే కాదు, పద్యకవులుఁకూడా దేశభాషయందు కవిత్వం చెప్పేవారు యీ లౌభ్యానికి క్వాచిత్కంగా లోఁబడతారు.

ఆయీరహస్యం తెలియనివారు కొందఱు ఆయీ మహాకవులకు తెలుఁగు వ్యాకరణమే తెలియదని వ్రాయడానికి సాహసిస్తారు. లోఁగడ వుదాహరించిన పద్యాలధోరణిచూస్తే, యీమహాకవి యెంత విద్వాంసుఁడో స్పష్టమే. అట్టివానికి యీ కంతికూన వ్యాకరణంకూడా తెలియదనుకోవడం కంటే అనుచితం వుంటుందా ? తెలిస్తే అలా యెందుకు ప్రయోగించడం అంటే వినండి - దేశభాషలో కవిత్వం చెప్పేకవికి ఆభాషలో వుండే జాతీయాలు కొన్నైనా పడక మానవు. పింగళిమహాకవి — "రోళ్ళా రోఁకళ్ళం

బాడినకూరుములు " అని ప్రయోగించాఁడు కదా! దిద్దరానిచోట, అత నికి అక్కడ - 'రోళ్ళన్' అనాలనికూడా తెలియదా? ఉదారహృదయుఁ డెవఁడేనా అంతమాట అనఁగలఁడా? అంటే ప్రాజ్ఞుఁడు వినఁగలఁడా?

"లోకోక్తీనాం భవేద్యోగో యథావ చ్ఛ్రితిరంజనమ్" అనే కారిక వల్ల యివన్నీ సమాధేయా లవుతాయి. విమర్శకులో వాక్యవిషయాన్ని మనస్సులో పెట్టుకోవాలి - యేమహాకవికేనా వంకలు పెట్టవలసివస్తే తెలుఁగులోనే కాని సంస్కృతవిషయంలో అవకాశం దొరక్కపోవడాని క్కారణం "తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది" కావడమే! చిన్నయ్యసూరి వ్యాకరణం పుట్టినతరవాత దాన్నిబట్టి సంస్కర్తలు ఆయా గ్రంథాలు సంస్కరించడం మొదలెట్టారు. ఆసంస్కర్తలలో లేదా విమ ర్శకులలో చాలామందికి చిన్నయ్యసూరి వ్యాకరణంకూడా బాగా తెలిసి నట్టు లేదు. యీ అంశం కలియుధాతువు ఇకారమధ్యం కాదని పూర్వ పక్షానికి ఆరంభించేవారివల్ల విస్పష్టపడుతుంది. చిన్నయ్యసూరిమతంలో ఇకారమధ్యం కనకనే "కలియున కత్వంబగు" అనేసూత్రంచేత అకా రాన్ని ఆదేశించి 'కలపం' అనే కృదంతరూపాన్ని సాధించాఁ డనికూడా తెలుసుకోలేనివారికి చిన్నయ్యసూరి వ్యాకరణరహస్యాలుమాత్రం తెలిసి వుంటా యని అనుకోవడం యేలాగ? యిట్టి స్వల్పవిషయాలలో పెద్ద పెద్ద మహామ్మేరుపులకు అజ్ఞత్వకల్పన చేయడానికి నామనస్సు వొప్పు కోదు. కనక, నేను అది వారు యెఱిఁగివుండిన్నీ రసలోభంచేత ప్రయో గించినట్టే భావిస్తాను - యిదే యే నన్నయ్యగారో ప్రయోగిస్తే, అందఱూ శిరసావహించవలసిందే కదా "బలిమినీయని భూమివలయపతులన్" అని వొకచోట నన్నయ్య - "ఇచ్చు" ధాతువుకు వ్యతిరేకార్థక విశేషణం, 'ఈయని' అని ప్రయోగిస్తే దానికి - ఏకదేశపతితత్వ వావంకూడా లేకుండా, అందఱూ శిరసా వహించడ మేమిటో, మఱోమహాకవి యేదేనా అసకృదావృత్తిగా వాడినా దాన్ని యీసడించడ మేమిటో? అనిపిస్తుంది నాకు. మఱిన్నీ యీ కవి - 'కండ్లు' అని ప్రయోగించాఁడు. "విల్లు

ముల్లు " మొదలైన శబ్దాలకు బహువచనంలో "విండ్లు, ముండ్లు" అయి నట్లు "కన్ను, మిన్ను" మొదలైన వాటికి 'కండ్లు, మిండ్లు' గ్రాంథికంలో లేనిమాట సత్యం, కాని యేకారణంచేతనో కన్నుశబ్దానికిమాత్రం- 'కళ్లు' అని ప్రాచుర్యంగానున్నూ 'కండ్లు' అని క్వాచిత్కంగానూ వ్యావహారికంలో ఋత్రతమౌతూ వుంది - 'కన్నులు' అనేది వ్యావహారికంలో అసలే కనపడదు - ఆయీ కారణంచేతనే మేము —

"నాకండ్లయెదుట నిన్నటిదాఁకఁ జిన్నత
నంపుఁజేష్టల సంచరింప లేదొ ?"

అని శ్రవణానందంలో సీసం నాల్గుచరణాలలోనూ వాడి గీతపద్యంలో—

"ఎంతలో నెంతవాఁ డయ్యె నెంత బుద్ధి
వచ్చె నెటువంటిసత్కీర్తి వచ్చెఁ జిత్ర
మనుచు నాతనిచర్యలే యభినుతింత్రు."

అని అనుకరణంగా ప్రయోగించి వున్నాం. అనుకరణంగా వున్న దీన్నే శంకించేవిజ్ఞులు నిరనుకరణంగా వున్న యీకవిప్రయోగాన్ని శంకించకుండా వుంటారా ? రస లౌభ్యంచేతనేకాని, ఆలా క్కాకపోతే మేము ఆలా ప్రయోగించ నక్కఱలేదు — "నాకన్నులెదుట నిన్నఁటిదాఁక" అన్నా సరిపోతుంది - అయితే లోకులలో పండితులుగాని పామరులుగాని - 'నాకళ్ళయెదుట' అంటారు గాని 'నాకన్నులెదుట' అని అనరు - యీరహస్యం తెలియక కొందఱు శంకిస్తారు - తెలుక్కవిత్వం చెపుతూ లోకవ్యవహారాన్ని పూర్తిగా దూరంగా నెట్టి రచన సాఁగించడ మంటే ? అది కేవలం అసంభవం. నన్నయ్యగారు గ్రాంథికకవి కాఁడని యెవరూ అనరుగదా ! ఆయనప్రయోగం యేవిధమైన శంకా లేదనుకొనేదే యిస్తాను, నేను శంకిస్తాను, యెవరు సమన్వయిస్తారో చూస్తాను — యిదుగో ప్రయోగం, "ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె" యీవాక్యం వ్యావహారికమర్యాదను అనుసరించి సమన్వయించుకోవలసిందేనా, గత్యంతరం వుందా ? - రాజ్యం చేయడమంటే ? అర్థం చెప్పండి చూస్తాను -

రాజ్యాన్ని పాలిస్తూన్నాఁడనేనా చెపుతారు, అప్పుడు చేయుధాతువుకు పాలించడం అనే అర్థం యెక్కడ వుందంటే అంతతో ఆఁగవలసిందేనా, సమాధానం వుందా ? (చేయు=నిర్వహించు, అని, శ-ర-లో వ్రాశాఁ డంటారా? అప్పుడు ఆలా వ్రాయడానికి ఆధారం చూప మంటేనో, వ్యవహారమే గతి కావలసివస్తుం దని వేఱే చెప్పనక్కఱలేదు) అయితే నన్నయ్య యెందుకు ఆలాగ ప్రయోగించాడంటే? వినండి-లోకంలో ఆయీ వాక్యానికి యీలాంటి అర్థం వుండడమే కారణం. "విజయం చేయుఁడు" వగయిరా నన్నయ్యగారి ప్రయోగాలన్నీ వ్యవహారంవల్ల రక్షించఁబడేవే - శబ్దశాస్త్ర విరుద్ధం కాదుగదా ? నన్నయ్యగారి ప్రయోగం అంటారేమో ? శబ్దశాస్త్ర విరుద్ధమే కావాలా ? ఆర్థిక విరోధంమాత్రం దోషం కాదా ? శాబ్దబోధోపకరణాలలో "వ్యవహారతశ్చ" అని శాస్త్రజ్ఞులు చేర్చుకున్నది యీ కారణంచేతనే "లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్" అని కవితా సామాగ్రిని నిరూపిస్తూ అన్నిటికంటేకూడా కవికి లోకజ్ఞానం అత్యావశ్యకమని చెప్పడానికి లోకపదాన్ని మొట్టమొదట వుటంకించాఁడు. ఆదికవి నన్నయ్యగారు తనకు వున్న పాండిత్య విశేషాన్ని "సంహితాభ్యాసు" వగైరా విశేషణాలద్వారా ప్రకటించుకొని, యివన్నీ లోకజ్ఞానంలేని పక్షంలో లేశమూ వుపకరింపవని విజ్ఞలోకం యీసడిస్తుందని అనుమానం కలిగి - 'లోకజ్ఞు' అన్న విశేషణంద్వారా ఆ సంశయాన్ని తొలఁగించాఁడు. యిన్ని యోగ్యతలు వున్నా, సక్కావి చీటికీ మాటికీ అబద్ధాలకి సిద్ధపడేటట్టయితే అది యిహపరలోకాలు రెండిటినీ తొలఁగిస్తుందని - "నిత్యసత్య వచను" అని కూడా విశేషణం వేసుకున్నాఁడు. ప్రస్తుతం లోకవ్యవహారం ప్రతికవి కవిత్వంలోనూ వుండి తీరుతుందనియ్యేవే. యెక్కువ రసకవి అయితే లోకవ్యవహారానికి మఱీప్రాముఖ్యాన్ని కలిగిస్తాఁడు. - వొక వాక్యం యీ మహాకవిది యిచ్చి మఱీ చర్చిస్తాను.

"ఘూకమేయూరు ? పికశారికాకలాప
కీరికాముఖఖరణ మేయూరు చెపుఁడ ?"

యీ లోకోక్తి యింకోవిధంకూడా వాడడంవుంది - దాన్ని చూపుతాను - "ఘూకానిదేవూరు ? నీదేవూరు ?" దీన్ని సమన్వయించడం కష్టం కాదుగాని, మొదటిది సమన్వయించడానికి, కొంచెం కష్టంవుందికాని దీనికున్నంత ప్రాచుర్యం లేకపోయినా మనగ్రంథకర్త వాడినదానిక్కూడా లోకంలో ప్రచారం లేకపోలేదు."సర్వపథనాః కవయః" కనక ఆయీప్రయోగంకూడా నిరాక్షేపణీయమే అని జిజ్ఞాసువులు తెలుసుకోండి. యిది యేలా కుదురుతుఁదంటారా ? నన్నయ్యగారి - "రాజ్యముచేయుచుండె" అనేది మాత్రం కుదుర్చుకొనేశక్తి లేకపోతే కుదురుతుందా ? "నిద్రపోయె" అంటే? నిద్రించుట అర్థంకాక, సుళువుగా వచ్చేఅర్థం - "నిద్రయెక్కడికో తొలఁగిపోయింది" అనే అర్థం కాకూడదా ? యిదేనా పాండిత్య లక్షణం ? ప్రకరణాదికం చూచుకోవాలి, సమన్వయించుకోవాలి. యీ మహాకవి శ్రుతి కటువుగా వుండని క్త్వార్థకసంధిని అసకృదావృత్తిగాచేసి తన సమ్మతినిచూపివున్నాఁడు. పోయిపుడు ( పోయి + ఇపుడు ) వగైరాలు చూచుకోండి. యిది నిరాక్షేపణీయమనిన్నీ భారతాది గ్రంథ సమ్మతమనిన్నీ యీకవి మాత్రమేకాక, యెందఱో మహాకవులు వాడివున్నారనిన్నీ యెఱుఁగఁదగు. యీకవి వక చోట "తుకతుక ననునవ్వకుండుదురె ? తత్త్వజ్ఞుల్" అని ప్రయోగించాఁడు. గోదావరీ మండలంలో నవ్వు విషయంలో - 'పకపక' అనే అనుకరణశబ్దం వాడడం వుంది. యీకవి నెల్లూరు ప్రాంతంవాఁడేమో? అని లోఁగడ వ్రాసేవున్నాను. ఆప్రాంతంలో నవ్వువిషయంలో — 'తుకతుక' అనేమాట వ్యవహరిస్తారని తోస్తుంది. శ—ర—నిఘంటులో యీ "తుకతుక" శబ్దానికి వ్రాసిన అర్థంవేఱు. అట్టి వ్యవహారంకూడా లేకపోతే యితనికి మాత్రం యెక్కడనుంచి వస్తుంది ? 'మధ్య' అనే సంస్కృతశబ్దానికి తత్సమ రూపం లోకంలో మధ్యము అనే దానికంటె - 'మధ్య' అని ముపర్ణకరహితానికే ప్రాచుర్యం కనపడుతుంది. చరితాదిగణం ఆకృతి గణం గనక, వ్యాకరణ సమ్మతిన్నీ వున్నట్టయింది. అయినప్పటికీ కొందఱు వృథాగా శంకిస్తారు.

"ఆకుంబొత్తికఁబెట్టితెచ్చి మఠమధ్యం జేర్చితిన్" అనే ప్రయోగాన్ని చూచేనా వారు సంతుష్టి చెందుతారని నా ఆశ - యింకోచోటకూడా "దివ్యమణి మంటపమధ్య మృగేంద్ర పీఠిన్" అని అయితే యీ మహాకవి ప్రయోగం కనపడుతుందిగాని, అక్కడ సమస్తపదం కాకూడదా ? అని వైతండికులు కొంచెం మెదలడానికి అవకాశం వుంది - కనక దాన్ని ప్రాధాన్యంగా చూడక దీన్నే చూచుకోవలసిందని జిజ్ఞాసువులను హెచ్చరిస్తాను - కవులప్రయోగాలయందు వుండే తత్త్వాన్ని యెఱుఁగని సర్వజ్ఞుల వల్ల భాషకు కలిగే నష్టియింతా అంతా కాదు. దాన్ని వారించడానికే నేను నా వార్ధక్యాన్ని ధారపోస్తూన్నాను - యీ మహాకవి అసకృదావృత్తిగా ప్రయోగించిన ప్రయోగం —

" నీ, వును నొక కార్యముఁ జెప్పుమా ?
యను డాతఁడు విహితవదనుఁడై పతిమొగమై "

అని ఆనంతర్యార్థకానికి ఉకారసంధిని చేసివున్నాఁడు, కాని యిది ముద్రాప్రమాదమేమో ? అనుకొని - " అననాతఁడు " అని దిద్దితే దిద్దవచ్చునుగాని, యీకవి విట్టివి చాలావున్నాయి. వాట్లను చూపుతాను. "వివరింపుము నావుడాత్మసంపాది" అనేదాన్ని - "వివరింపుము నాఁగనాత్మ సంపాది " అని సవరించడానికి అవకాశంవుంది — మఱోచోట - "నావుడుల్లసత్ప్రీతిన్ " అనివుంది. యిదిన్నీ ' నాఁగనుల్లసత్ ' అంటే సరిపోతుంది — యీ మూఁడు మాత్రమేకాదు; యింకా నాలుగుదాఁకా యిట్టివి వున్నాయి. యివన్నీ సంస్కర్తల ప్రమాదాలే అనడానికి నాకు సాహసం చాలడంలేదు. యింకోవిశేషం ' నావుడు, అనవుడు ' ప్రయోగాలలో పాతతాటాకు పుస్తకాలలో రాముఁడు, కృష్ణుఁడు వగైరా శబ్దాలలోవలెనే అఱసున్నకూడా వుపలబ్ధమౌతూవుందనిన్నీ ఆ పక్షంలో " నావుండు, అనవుండు " అని రూపాంతర సత్తకూడా నిరాక్షేపణీయమనిన్నీ యెవరో అనఁగా విన్నట్టు జ్ఞాపకంవుంది. (యీమాట యేపత్రికలోనేనా చదివి వున్నానేమో ?) గాని, వారెవరో మఱిచాను. భవతు. యీ విషయంలో

యేదో మతభేదం మాత్రం వెనకటి కాలంలో వుందిగాని, లేకపోలేదు అన్నంతవఱకు సత్యదూరంకాదు. జిజ్ఞాసువులు పరిశీలింతురుగాక! ఓపిక లేక "మహాత్మ్యవిధినా భారోఽయమారోపితః" తప్పనిచెప్పి ప్రతీదీ దిద్దడానికేం. అందులో ప్రయోజకత్వం కనపడదు. విచారణచేయాలి, యేవిధంచేతా కుదరకపోతే అప్పుడు వదులుకోవాలి. అప్పుడేనా మహాకవుల ప్రయోగాలు బుడబుడక్కల ప్రయోగాలనడం అపచారం. అందుకే కదా; పూర్వవ్యాఖ్యాతలు "చింత్యం" అనో "మృగ్యం" అనో వూరుకుంటారు, యీ మహాకవి పేరుతలచుకొంటే నాకు భయంవేస్తుంది. యెందుచేత? కొడతాడనికాదు. చూడండి యీ రచనాసౌష్ఠవాన్ని!

చ. వనద సమృద్ధినీరికడవంబలె నుప్పరమొప్పఁ జంచలల్
మినమిన వీనఁదోననుటిమెన్ వడిగండులు రాలెరాలెఁ దో
ల్చినుకులు దూర్పుటీ దరొలసెన్ బలిసెన్ జడివాన సోనజో
రనఁ బురవిద్విషద్గళ సహస్రభవాకృతిఁ బొల్చెఁ జీకటుల్"

చ. కనిబిసదండ పత్రపుటికాపరిపూర్ణ సువర్ణకర్ణికా
కనక ఘటీస్ఫుటీభవదఖండసహస్ర దళాతపత్రముల్
దినపకరోష్మ దీర్పనిరు దిక్కులఁ బత్రములాశ్రయింప ని
ల్చిన యలరాజహంస పటలిం గని సమ్మద వార్ధిఁదేలుచున్"

ఇట్టి ధారాశుద్ధి నూటనాట యెక్కడోగాని కవులలోవుండదు - యీలాటికవి కవిత్వంలో యెందుచేతో వొక ప్రయోగం యేవిధంచేతా సాధించరానిది పడింది. దాన్ని చూపుతాను — "అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోయంబోవ నాలోనన్" పోవుధాతువుకు భూతార్థక ప్రథమపురుషైకవచనం — 'పోయెన్' అని వుంటుందిగాని, 'పోయన్' అని వుండదు. దిద్దితే విశ్రమంచెడుతుంది. అందుచేతే అనుకుంటాను సంస్కర్తలు దిద్దకుండానే ప్రచురించారు. "ప్రమాదో ధీమతా మపి" అపిరేవకార్థకః కనక, ప్రమాద మనుకుందామంటే, యింకోచోటకూడా "అయ్యో! సీసుతుగ్రద్దదన్నుకొని పోయన్ భీతివాపోవఁగన్" అని

దిద్దరానిచోటే పడింది. యిది పాండిత్యంతో సంబంధించిన విషయంకాదు. లోకజ్ఞానంలేని వ్యాఖ్యాతలు తప్ప యీలాటిదాన్ని (యిట్టికవికికాదు యెట్టి కవికైనాసరే) పుచ్చుకొని అజ్ఞత్వాన్ని ఆరోపించరు. యింతమహాకవికి పోవుధాతువుకు భూతార్థకరూపంకూడా తెలియకుండా వుంటుందని నిశ్చయించి ఆక్షేపిస్తే, ఆక్షేపించినవాళ్ళని ప్రాజ్ఞలోకం సహించదు. అచ్చుపొరఁబాటుగాని వ్రాఁత పొరఁబాటుగాని యిది కాదు - దీన్నిగూర్చి యేమనడానికీ తోచడంలేదు. లోకానికి వదులుతూన్నాను. యిది తప్ప యీ మహాకవి కవిత్వంలో నాకు దురుద్ధరమైనది యేదీ కనపడలేదు. యిదివఱలో వుండే సందేహాలు కొన్ని యీయనవల్ల తీరాయికూడాను. భారతంలో దారశబ్దానికి ప్రయోగం "పరదారములందును" అని దొరికింది. దాన్ని - పరదారలయందును అని దిద్దితే దిద్దవచ్చునుగాని వైతండికులు వొప్పుకోరు. దారశబ్దం సంస్కృత శబ్దంలో పుంలింగం. అమరవ్యాఖ్యాత స్త్రీలింగంకూడా వుందని మహాకవి ప్రయోగం యిచ్చివున్నాఁడు - అయినా వైతండికులు యివేవీ చూడరు వాదిస్తూనే వుంటారు. వుందురుగాక, యీకవి దిద్దరాని చోట ప్రయోగించాడు.

"క. నేరము ప్రత్యక్షంబై చేరువనుండంగ సంతసిల్లినజారన్
దారన్ సాధూక్తులరధ కారుఁడు శిరసావహించు కథయిది యయ్యేన్"

దారము అని దిద్దితే స్వారస్యం చెడుతుంది. తెలుఁగులో దార అని ప్రయోగించుకొంటేనే శ్రవణసుఖంగా వుంటుందిగాని, "దారము" అని ప్రయోగిస్తే పరమాసహ్యంగా వుంటుంది. ఆయీ రహస్యం యీ మహాకవికి బాగా తెలుసును. సమాస మధ్యమందు తప్ప పుంలింగ దారశబ్దం తెలుఁగుకవులు ప్రయోగించుకోకూడదనేది పరమార్థం. యీకవి - "మన్మథ పతాకని తేంట్ల నదల్చి" అని ప్రయోగించాఁడు. యీ తత్సమాకార సంధి బహు మహాకివి సమ్మతమని పలుచోట్ల వ్యాకరించే ఉన్నాను గనుక, స్పృశించి విడుస్తూన్నాను. --

ఇఁక కొన్నిప్రయోగాలు చూపి వాట్లను గూర్చి కొంచెం వ్యాఖ్యా
నిస్తాను :

( 1 ) వేమునకుఁ బోయుపా లయ్యె వృద్ధసేవ.
( 2 ) దొరికెఁ జండాలురతోడిమైత్రి.
( 3 ) అధివసియించె న్నిజప్రియావిముఖంబై.
( 4 ) బలధిక్కృత, నాకపుల స్గవులఁ బంచిన న్నిశ్శంకన్.
( 5 ) పందకుఁగాక పలాయన, కందళి.
( 6 ) కూఁతురి, నెలుకంగా, జేసి.
( 7 ) దూతి యా, రేతిరిఁ బోయి చీర నగరీ ప్రతిరథ్యా.
( 8 ) మంచముక్రిందఁ దూఱికొని మౌనము గైకొని.
( 9 ) విటవిటీజాతి.
( 10 ) కొయ్యా లూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వ.
( 11 ) చని తనతనవాగ్వాదము, లనుదానికి శశకపింజలమ్ములు సెప్పెన్.
( 12 ) పో, రునకుఁ దుదఁ గాలు ద్రివ్వెన్.
( 13 ) నాఁటికి నది పోయె మఱుసునాఁ డుదయమునన్.

యింకా కొన్ని వ్యాఖ్యానించతగ్గవైతే వున్నాయి గాని వీట్లచర్చ చూచుకున్నాక ఆలోచించుకుందాం.

(1) నంబరు 'వేమునకున్' అన్నచోట ఔపవిభక్తిక చిహ్నం పకారాదేశంవచ్చి - 'వేఁపకున్' అని కావాలి అనేది స్థూలదృష్టులశంక-ఔప విభక్తిక వికారాలు యెక్కడోతప్ప నిత్యాలు కావుకనక శంకకవకాశం లేదని సమాధానం. ( శాస్త్రంలో అభ్యనుజ్ఞవున్నా వైతండికుల అభ్యనుజ్ఞ లేక పోవడం దేవుఁడూ పూజారీ సామెత వంటిది. ) కేవల వేముశబ్దం కాక-నేలవేముశబ్దం యింకోటి వుంది, దానికి అసలే ఔపవిభక్తిక వికారం కలగదు - యీగారణంచేతనే మేము "విందుగాఁ దగునేలవేముచెట్టు" అని దేవీభాగవతంలో ప్రయోగించాం. (యిప్పటి కింకా యెవరూ శంకించ లేదుగాని యెవరేనా ముందు ముందు శంకిస్తారేమో అని దీన్ని గుఱించి

యెత్తుకోవడం) వేఁపచెట్టుకూ దీనికీ యేవిధమైనపోలికా ఆకారంలో లేదు గాని చేఁదుగుణంమాత్రం రెండిటికీ సమానంగా కనపడుతుంది. శ-ర-లో నేలవేము=భూనింబము, అని వేఁపచెట్టు పర్యాయమైన సంస్కృతపదం 'నింబ' శబ్దంతోటే అర్థం వ్రాయఁబడింది. కాని దీనికి నేలవేఁపచెట్టు అనే ఔపవిభక్తిక వ్యవహారం లోకంలో యెక్కడాలేదు. (12) నంబరు– "పోరునకున్" అనేచోటకూడా "పోరికిన్" అనే వుండాలి అనే నియమం లేదు, వుభయమూ వుండవచ్చును. మర్మజ్ఞులు కానివారు శంకిస్తే శంకిస్తారు గాక, ఆశంక నిరాధార మని బహుమహాకవుల ప్రయోగాలు తెలుపుతాయి.

యిఁక (2) నంబరు "చండాలురతోడి మైత్రి" అనే చోట వ్రాస్తాను. చండాల అంటే? మాలవాఁడు. యీ అర్థంలో "చండాలురు" అనేది సాధువే (దీర్ఘపూర్వకసూత్రం చూ) కాని ఆయీస్థలంలో శ్లేష వుంది. రెండో అర్థం 'తుమ్మెదలు' అనేది. అప్పుడు చండ+అళి, చండాలి (లళయో రభేదః) బహువచనం చండాలులు అని మాత్రమే కావాలి. హ్రస్వాకారాంత మైనప్పుడే కాని ఇకారాంతానికి రేఫాదేశం రాదు. ఐతే యీమాత్రం ఆయీమహాకవికి తెలియకే ప్రయోగించాఁడా? శ్లేషస్థలాలలో యీలాటి నీహారలేశాలు సహృదయులు పాటించరని ప్రాచీనకవుల పోకడలు ఘోషి స్తున్నాయి. (ముసలిమానులు అనేస్థలంలో ముసలిమాఁకులు అని వుండ వలసివస్తుంది. శ్లేషగనక సహ్యం. వసుచరిత్ర చూ) యిఁక (3) వది– "అధివసియించెన్" అనేది. యిక్కడ, అధి అనేవుపసర్గ లేనిపక్షంలో వసించెన్, వసియించెన్, అనే రెండురూపాలున్నూ వొప్పుతాయి కాని, అధి వున్నప్పుడు - అధివసించెన్, అనేదేకాని రెండోది వొప్పదని శంక. బహుమహాకవులు వుపసర్గ వున్నప్పుడుకూడా ప్రయోగించి వున్నారని సమాధానం – (ప్రయోగాలు చూచుకోండి) యిఁక (4) వ నంబరు "నిశ్శంకన్" అనేది. యిక్కడ "నిశ్శంకమునన్" అనికావలసివుంటుం దని శంక. అవ్యయీభావసమాసం కనక శంకకు అవకాశం పూర్తిగా వుంది. కాని బహుమహాకవులు మువర్ణకరహితంగానే తెలుఁగులో

ప్రయోగిస్తూన్నారు. శ్రవణసుఖానికిన్నీ లోపంలేదు. కనక "చరితాది" గణంలో చేర్చుకోవలసిందని సమాధానం.

యిఁక (5) వ నంబరు- "పందకుఁగాక పలాయన"అనేచోటవుంది. శ-ర-లో పంద=పిఱికి, అని అర్థం వ్రాసి, భారతాన్ని వుదాహరించాఁడు. కాని యీమధ్య యెవరో పందశబ్దానికి పెంకెవాఁడు అని అర్థం కాని పిఱికి వాఁడు అనే అర్థం లేదంటూ వాదించారు-అందుచేత జాబితాలో చేర్చవలసి వచ్చింది కాని లేకపోతే చేర్చ నక్కఱలేదని తెలివిడి.

యిక (6) వ నంబరు— "కూఁతురి, నెలుకంగాఁ జేసి" అనేది యిక్కడ కూఁతుశబ్దానికి ప్రథమైకవచనంలోనే గాని యితరత్ర 'రు' అనేది చేరదని శంక. చిన్నయ్యసూరికి ప్రాచీనులెందఱో మహాకవులు యీలాటి ప్రయోగాలువాడి వున్నప్పంటికీ సూరి వాట్లను లక్ష్యపెట్టక నిషేధించడం అవిచారమూలక మని నేనభిప్రాయపడతాను-కొందఱు ప్రథమా విభక్తిలోకూడా యీచేదస్తానికి లోఁబడి - నేను కూఁతను (కూఁతురను అన్నమాట) నీవు కూఁతవు (కూఁతురవు అన్నమాట) అని యెంతో వికృతంగా ప్రయోగించుకొన్నవారున్నూ వున్నారు. మళ్ళా వారు శంకించే శంకలకు పారమేవుండదు. భవతు ఈవిషయంలో బహుమహాకవులను లక్ష్యం చేయకపోవడం వ్యాకర్తసాహస మనే నేనభిప్రాయపడతాను. వొకటి మనంచూచుకోవాలి - పెండ్లికూఁతురికి - అనడంలోనూ, పెండ్లికూఁతునకు అనడంలోనూ శ్రవణసుఖం దేనిలోవుందో ఆలోచించాలి. శ్రవణసుఖం లేని దాన్ని పుచ్చుకొని శ్రవణసుఖం వున్నదాన్ని త్యజించడానికి నేను యిష్టపడను. (1) మీకు సుఖమేనా ? (2) మీకు సుఖమేయా ? యీ ద్వయాన్ని పట్టి చూచుకోండి.

యిఁక (7) వ నంబరు — "రేతిరిఁ బోయి చీరనగరీప్రతిరథ్య" అనేది. యిక్కడ గట్టిశంకే వుంది. యతిస్థలంలో వుంది కనక 'రాతిరి' అని దిద్దడానికి అవకాశం లేదు. రాత్రి=శబ్దానికి వికృతిరూపం 'రాతిరి' అనే కనపడుతుంది. యీ మహాకవి 'రేతిరి' అని ప్రయోగించాఁడు. దీని

సమర్థనంనాకు యీవిధంగా స్ఫురిస్తూ వుంది. శ-ర-లో రే అంటే రేయి యొక్క రూపాంతరం అని అర్థం వ్రాస్తూ వై. అని వ్రాసివున్నాఁడు. వై. అంటే వికృతిరూప మన్నమాట. దేనికి వికృతి? అనేప్రశ్నకు సమాధానం రాత్రిశబ్దానికే అని చెప్పితీరాలి, ఆపక్షంలో రాత్రిశబ్దవికృతిరూపాలు రాతిరి, రేయి, రే అని మూఁడింటిదాఁకా శ-ర-కర్త అంగీకరించినట్టయింది. దీనివల్ల వికృతిలో ఆకారానికి ఏకారం రావడం కోశకర్త సమ్మతించినట్టుకూడా స్పష్టపడింది. యింతవఱకు వూహించినవూహ యుక్తియుక్తంగావుంటే రేతిరి అనేరూపం నిర్బాధం కాదని యేసహృదయులూ వాదించరు. విహృదయులతో యథార్థవక్తలకు లేశము అవసరం వుండదు కనక రేతిరిశబ్దం నిరాక్షేపణీయమే. అయితే శ-ర-లో యెందుకు వుదాహరించలేదు? అనేశంక వొకటి వుంది - కాని — శ-ర-లో వుదాహరించనంతమాత్రంచేతనే ఆ శబ్దం లేకపోయే పక్షంలో యెన్నో శబ్దాలు మహాకవిప్రయుక్తాలు (కళంకు వగైరాలు) లేకపోవలసి వస్తుందని యితరత్ర వ్రాసేవున్నాను. శ—ర—నిఘంటు దిఙ్మాత్రప్రదర్శకం. యెన్నో అపురూప ప్రయోగాలకు శ—ర—నిఘంటుకర్త యీ వేంకటనాథుణ్ణి వుదాహరించివున్నాఁడు. యీ "రేతిరి" ఆయనకు సమయానికి పొడకట్టలేదనుకోవాలి. యిదేకాదు; యీకవితాలూకు మఱికొన్ని శబ్దాలుకూడా శ-ర-లో దొరకవు. "వారికన్నప్పి విశేషముల్ శతము గన్పడుచున్నవి" అని దేవీభాగవత పీఠికలో వ్రాయడం యీ కారణంచేతనే అని జిజ్ఞాసువులు గ్రహింతురుగాక!

యింక (8) వ నంబరు — "మంచముక్రిందఁ దూఱికొని" అనేది. యిక్కడ "దూఱి" అంటే చాలదా? కొని అనేది అదనంగా యెందుకు? అని శంక. మంచంకిందదూఱిన వడ్రంగి స్వార్థనిర్వహణార్థం దూఱినవాఁడవడంచేత ఆత్మనే పదార్థకం కొను వుండవచ్చునని సమాధానం. యీలాటి లోయరు క్లాసుశంకలు హైయరుక్లాసులో వున్న వారని లోకులు భ్రమపడేవారు చేయడంవల్ల జిజ్ఞాసులోకానికి కొంత చిక్కు కలుగుతూవుంది.

ఆ కారణంచేత పీట్లనికూడా యెత్తుకొని వ్యాఖ్యానించ వలసి వచ్చిందని జిజ్ఞాసువులు తెలుసుకోవాలి. యిక (9) వ నంబరు - 'విటవిటీజాతి' అనేది. "నదనదీ" అని కాళిదాసు. యిక్కడ యేకశేష రావలసివున్నా సంస్కృత మహాకవులే కాదు తెలుఁగు మహాకవులూ దాన్ని పాటించినట్టే లేదు. 'నిరంకుశాః కవయః' అందుచేత యీ మాదిరి ప్రయోగాలు "శంఖునపోసినతీర్థాలు"గా సర్వత్రా చలామణీ అవుతూ వున్నాయికనక 'నచ శంకానచోత్తరమ్' (10)వ నంబరు "పెండ్లికొడుకుకు" అనేది. కొడుకునకు అనిమాత్రమే వుండాలని శంకిస్తారు కొందఱు. ఆ యీ ప్రయోగాలు భారతంలోకూడా వున్నాయన్నాఁడు తిమ్మకవి సార్వభౌముఁడు. అథవా భారతంలో లేవనే అనుకుందాం, వసుచరిత్ర, ఆముక్తమాల్యద మొదలైన గ్రంథాల్లో వుంటే చాలదా? (ఇందుకు సుదృగ్జాలంబు, వసు చరిత్ర. చెట్టు కొకరుఁడై, ఆముక్తమాల్యద) యింకో మాట వ్రాస్తాను. కొన్నిచోట్ల నకారాగమం చేసినరూపంకంటే నకారాగమం చెయ్యనిరూపమే శ్రుతిహితవుగా వుంటుంది. శాస్త్రం రెండురూపాలూ వొప్పుకొనే సంద ర్భంలోకూడా ఆ రెంటిలో వొకరూపమే శ్రుతిహితవుగా వుండేవి మఱి- కొన్ని వున్నాయి. "దూత-దూతుఁడు, తాత—తాతుఁడు" ఆయీ రూపాల్లో ప్రథమరూపానికి వున్నంత మాధుర్యం రెండోరూపానికిలేదు. లేదేమిటి? లేనేలేదు - పైఁగా యింకో విశేషం 'తాతుఁడు' అనే రూపానికి ప్రయో గంకూడా దొరక దనుకుంటాను. "హరీతాతకున్ దాతవై" యీ రామ లింగం తాలూకు పద్యంలో మొదటితాత ధాతృశబ్దభవం, రెండోది "తాతస్తు జనకః పితా" బాపతు పితృవాచకానికి తత్సమరూపం. ప్రయో గాలు వెదికితే దొరకవని నిరాశ చేసుకున్నవి వొకప్పుడు దొరకడమూ వుంటుంది. "బుక్కనం" అంటే కుక్క మొఱగడం అర్థం. దీన్ని బట్టి "బుక్కించి దుఃఖించెదన్" అని ప్రయోగించాను. 'బుక్క—భషణే, భషణం శ్వరవః' అని కౌముది. చిన్నప్పుడు రచించిన ధాతురత్నాకరంలో "స రావణ శ్వా..............బుక్కతీశ" అని ప్రయోగించడం జరిగింది.

మళ్లా యేభై యేళ్ళకు ఆయీ ప్రయోగానికి అవసరం వచ్చింది. 'బుక్కించి' అని వుపయోగపడిచాను. యీ రహస్యం బొత్తిగా యెఱక్క లేనిపోని వికల్పాలతో వాకరు లేదనుకొని ఆక్షేపించారు. వారికి సగౌరవంగా "........కౌముదిఁ జదువుం, దక్కడ నాధాతువుండు నర్థము నుండున్." అని పద్యంతో సమధానం సమర్పించాను — అరే చెడివచ్చిందిగదా! అని విచారించి ప్రయోగం చూపించ మనడం దగ్గిఱికి వచ్చింది. ప్రయోగం చూపవలసిన ఆవశ్యకత్వం యీలాటి విషయంలోనైతే అవసరం కాదుగాని జిజ్ఞాసువులకొఱకు చేసే ప్రయత్నం కనక చూపుతూన్నాను - "బుక్కనైర్థిక్కరోతి" అని జగన్నాధ పండితరాయలు ప్రయోగించాఁడు. శ్రీనాధుఁడు — "ణిశిధాత్వర్థమనుగ్రహింపఁగదవే నీరేజపత్రేక్షణా!" అని నైషధంలో ప్రయోగించాఁడు. (ణిశి, చుంబనే) దీనికి ప్రయోగాంతరం వుందో, లేదో? అసలు శంక కవకాశం లేనప్పుడు జవాబే అవసరం లేదు, కాని శంకించే వారిశక్తి సామర్థ్యాలు తెలియని జిజ్ఞాసువులు "యీశంక కేమి సమాధానం?" అని కళవళ పడతారని జవాబివ్వడం. శాస్త్రాధారం వున్నప్పుడు ప్రయోగం యివ్వనక్కఱలేదన్న సంగతి — "శాస్త్రం బలవదుచ్యతే" అనే కారికవల్ల స్పష్టమే. శాస్త్రాధారం లేనిచోట, ప్రయోగం చూపవలసి వస్తుంది. (అప్రయుక్తదోషం లాక్షణికులు వుదాహరించినా కవులు దాన్ని పాటించడం చాలా తక్కువ.) యీ కట్టుఁబాట్లు శాస్త్రజ్ఞుల శుశ్రూష వుంటేనేకాని బోధపడవు. యిదివిషయాంతరం. 'పెండ్లికొడుకుకు' అనే దాని సాధుత్వాన్ని వుపపాదిస్తూ మఱికొంతదూరం నడిచాం. యీనకారాగమం తత్సమాలకూడా తీసివేస్తూన్నారు గాని మహాకవులు, నామట్టుకు తత్సమేతరాలకే యెక్కువ హృదయంగమంగా కనపడుతుంది -

యిఁక (11) వ నంబరు - "తనతనవాగ్వాదములను" అనేది - యిక్కడ - తనతన, అనడంకంటె తమతమ, అంటే లోకానుకూలంగా వుఁటుంది కాని తిక్కన్నగారు "తనతనమది నున్న తెఱఁగు తథ్యము చెపుఁడా!" అని ప్రయోగించడంచేత యీలాటి వ్యవహారంకూడా తెల్గు

దేశంలో కొన్ని ప్రాంతాలలో వుందనుకొని సంతుష్టిపడాలి. కవిత్వ మంటే ? అందులోనూ దేశభాషాకవిత్వమంటే ? లోకవ్యవహారాన్ని వదులుకొని నడవడం అసంభవం. యెక్కడోకొన్ని - "అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ" మాదిరి పద్యాలుంటే వుండ నివ్వండి - తక్కిన పద్యాలో ? "ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెదనంచు" అనే మాదిరివేకదా ! భవతు.

యిఁక (13) వ నంబరు - "మఱుసునాఁడుదయమునన్" అనేది విచారిద్దాం. శ-ర-లో, 'మఱుస' శబ్దం కనపడింది. ఔపవిభక్తికం గనక దానికి టివర్ణం చేరిన రూపం "మఱుసటినాఁటివేకువ" అని చూపించి, వృత్తియందు అంత్యాక్షరలోపం వస్తుందని నిరూపించి 'మఱునాఁడు' అని వుదాహరించాఁడు శ-ర-కర్త. అందుచేత వుకారం అచ్చుతప్పనుకొని "మఱుస" అన్నదే ఖాయంచేసుకొన్నప్పటికీ ఔపవిభక్తిక వికారం టివర్ణకం చేర్చకుండా యీ మహాకవి యేలా ప్రయోగించాఁడో అనేది కొంత విచార్యం. లోకవ్యవహారం వుందనుకుందామా ? కవి నివాస గ్రామాలలో వుందేమోకాని సాధారణంగా నేను తిరిగిన ప్రాంతాలలో "మఱుసునాఁడు" ప్రయోగం వినపడలేదు. గ్రంథాలలో కనపడలేదు - కాని ఔప విభక్తిక వికారాలు నూటతొంబది తొమ్మిది వఱకూ ఐచ్ఛికాలే కనక యెందుకు టివర్ణకం చేర్చావు కావని కవిని నిర్బంధించి అడగడానికి మనకి అధికారంలేదు. యింకోవిశేషం, కొన్నిటికి ఈ ఔప విభక్తిప్రత్య యాలు చేరిస్తే అసహ్యంగా వుంటాయి చూడండి "ఇల్లాలు" రూపమే హృదయంగమంగా వుంటుందో, "ఇంటియాలు" రూపం హృదయంగ మంగా వుంటుందోను? కాని ఛందోబద్ధంగా రచనసాఁగించేటప్పుడు యెంతటి వశ్యవాక్కుగల కవికేనా కొంత కక్కుర్తి పడవలసి వస్తుంది. అందుచేత యీ "మఱుసనాఁడు" కవికి ప్రయోగించ వలసి వచ్చిందనుకోవాలి. నేని ప్పుడువిచారణచేసిన రూపాలేవీ "నచశంకానచోత్తరాలే" అయినా ఈపిదప కాలంలో వీట్ల తత్త్వంతెలియని పూర్వపక్షాలు కనపడడంచేత కొంత చర్చ

వ్రాయవలసి వచ్చిందని జిజ్ఞాసువులు తెలుసుకొందురుగాక! ఒకచోట యీ మహాకవి కవిత్వంలో —

" ఆపాతాళ గభీరపయోపూర్ణ మహాప్రవాహమైనను "

అని ప్రాసస్థానంలో కనపడుతూవుంది. "పయఃపూర్ణ" అని వుండడం తప్పదు. ఆ పక్షంలో యతిబాధ సవరణ అవుతుందిగాని ప్రాస చెడుతుంది. నాకుదొరికినపుస్తకం చాలాపాఁతది. యిటీవల బహుశః సంస్కర్తలు దీన్ని " జ, లాపూర్ణ మహాప్రవాహమైనను " అని దిద్దేవుంటారను కొంటాను. యిట్టి స్వల్ప విషయాన్నెందుకెత్తుకున్నానంటే? పెద్దపెద్ద పండితులే ఈ సకారాంతవిషయంలో మనోతృప్తి - వగైరాలు వుచ్చరించ డంకలదు. " కోకాలః కోధర్మః " అనడం అందఱూ యెఱిఁగిందే (ఇది సకారాంతంకాదుగాని కాకపోయినా యెవరో మహాపండితులు యెప్పుడో పొరఁబడి పలికారు) అలాగే యీ మహాకవికికూడా దొర్లిందేమోనను కొన్నాను. యీలాటి నీహారలేశాలు భ్రాంతివల్ల ప్రతికవికీ యేమాత్రమో దొర్లుతూనేవుంటాయి. 'భ్రాంతిగడవంగ శక్యమే బ్రహ్మకేని?' వీట్లని బట్టి కవి విద్వత్కవి కాఁడనుకోవడంకంటే అపచారంవుండదు. విద్వత్కవే కాకపోతే —

"ఉ. ధీరగరుత్సమీరణహతిన్ సలిలంబులఁజల్లి దృష్టదు
ష్టోరగకోటి జీవితములూడ్చి, తిమింగిలతద్గిలాదివా
శ్చారములన్ గనజ్జఠర జజ్వలనార్చులవ్రేల్చివార్ధి ని
స్సారముఁజేసి క్రిమ్మఱ నొసంగుచుఁద్వద్వని తాండపిండముల్"

యీలాటిధార నడుస్తుందా? యీమాటను గరుత్మంతుఁడు వొక టిట్టిభం (తీతువు) తో పల్కేవి. కవిత్వంమాట ఆలావుండఁగా- "తిమింగిల తద్గిలాది వాశ్చారములు " అనే మాదిరి సమాసగ్రథనం సామాన్యకవికి వశమౌతుందా? తేలికగా అర్థస్ఫూర్తిని కలిగించే పద్యాలు యీకవి రచనలో చాలా తక్కువ —

"సీ. భార్యలేక యొనర్చు పండుగు దండుగు
కులకాంత పెట్టనికూడు గేడు
పత్నితోఁ బలుకని పలుకులు చిలుకులు
గృహిణిలేనికబంధకేలిజాలి
జాయవాటింపని సరసముల్ విరసముల్
ప్రాణేశ్వరికిఁగాని పాటుచేటు
దయితకై చేయని ప్రియములు భయములు
వల్లభవెలియైన యిల్లుముల్లు

ముద్దుకులకాంత సుద్దులే ప్రొద్దువినని
చెవులు గవులు వృథావేయుఁజెప్పనేల ?
అకట ! సతిలేని బ్రతుకేల ? యర్థమేల ?
వాహనములేల ? కరులేల ? వసుధయేల ?

యీలాటి తేలికశైలి పద్యాలు క్వాచిత్కంగా వున్నాయి వున్నా మొత్తంమీఁద కవిత్వం కొంత కఠినపాకంలోనే వుంటుంది. కొత్తకొత్త సామెతలు యీమహాకవి కవిత్వంలో కనపడతాయి. వొకటి వుదాహరిస్తాను. "జైనవాని చేతి పేను చందమైతిన్" యీసామెత నాకు కొత్తదిగా కనిపించింది - దీనికర్థం చంపాచంపఁడు వదిలీపెట్టఁడని తోస్తుంది. జైనులు జీవహింస చేయరుకదా ? యీసామెతలు వొక్కొక్క ప్రాంతంలో వొక్కొక్కమాదిరిగా వుంటాయి. నైజాందేశంలో గద్వాలా, ఆత్మకూరు ప్రాంతంలో కొన్నివిన్నాను. (1) "ఆలూ బిడ్డలూ లేనివాఁడికి ఆంజనేయులే గతి, (2) అలులేనివాఁడికి ఆత్మకూరుగతి" ఆయీ సామెతలను ఆధారంగా చేసుకొని కవి యేప్రాంతంవాఁడో నిర్ణయించవచ్చును కాని కవులలో యెవ్వరో తప్ప దేశాటనం చేయనివాళ్లు వుండరు గనక ఆనిర్ణయం వొక్కొక్కప్పుడు వుపయోగించదు. యీమధ్యనే వొకరు నన్నయ్యభట్టునుగూర్చి కొన్ని హేతువులు వుపపాదిస్తూ తుట్టతుదకు

అతని నివాసగ్రామం ద్రాక్షారామగ్రామంలో వొకభాగమనిన్నీ, అతని యింటిపేరు వాడ్రేవువారనిన్నీ సిద్ధాంతీకరించారు. ద్రాక్షారామప్రాంతంలో రాజరాజనరేంద్రుఁడు నన్నయ్యకు గ్రాసవాసోదైన్యం లేకుండా కొంత భూదానం లేదా గ్రామమే అనుకుందాం యిచ్చివుంటాఁడంటే విశ్వసనీయం కాకపోదు గదా ? వాడ్రేవువారిలో - అనఁగా యీవిమర్శకులు యేవాడ్రేవు వారి కుటుంబానికి నన్నియను చెందచేశారో - ఆకుటుంబంలో తఱుచు సుందరనామధేయులు చాలామంది కనపడతారనిన్నీ ఆనామానికే నన్నియ అనే పేరుకూ వొకటే అర్థం కనక వారూ వీరూ వకటే వంశంవారనిన్నీ ఆయన వ్రాశారు. (యిది వారి హృదయం విశ్వసించి వ్రాసే వ్రాఁతేఅయినా యెవరినో సంతోషపెట్టడానికి వ్రాసినట్టు నాకు స్ఫురించింది) దీన్ని కాదనడా నికికాని అవుననడానికిఁగాని యెవరికి వశమవుతుంది ? నన్నియపదంలో సౌందర్యరూపమైన అర్థం యిమిడీ వున్నంత మాత్రంచేత ఆసౌందర్యాన్ని ఆపదంతోటే ఆవంశస్థులు గ్రహింపవలసి వుంటుందిగాని దానికి పర్యాయ పదమైన సుందరశబ్దంతో గ్రహించవలసి వుంటుఁదా? అంటే, తృప్తికరమైన జవాబు కనపడదుగాని యింతమాత్రంచేత ఆవిమర్శకుల సిద్ధాంతంయావత్తూ నిరస్తంకాదు. యింకా చాలా వుపపత్తులు ఆయన చూపివున్నారు. ఆవుప పత్తులు యీసౌందర్యం పేరిలో సంక్రమింప చేసిన మాదిరివిగా లేవు. నన్నయ్యకు రాజరాజనరేంద్రుఁడు అగ్రహారాదికం యిచ్చి గొప్పగా సమ్మానించవలసి వస్తే దానికి తగ్గతరుణం యెప్పుడవుతుంది? భారతాంధ్రీ కరణ సమాప్తిలో కావాలి "శారదరాత్రులు" తోటే నన్నయ్యజీవితం సమాప్తమైనప్పుడు కృతిభర్తకు ఆలాటిసుకృతం యెట్లు తటస్థిస్తుంది ? అనేదికూడా వొకసందేహమే కాని యీలోఁగా నన్నయ్య సొంతధనంతోనే కుటుంబభరణం చేసుకొంటూ, లేదా ? "శీతేనాధ్యుషితస్య - నోహియతేశ ర్వరీ" అన్న మాతృగుప్తకవీంద్రుని మాదిరిని చిక్కుపడుతూ భారత రచన సాఁగించివుంటాఁడా ? అనేదిన్నీ వొక శంక కలుగుతుంది. కాని యీలోఁగా సమృద్ధిగా - దినవెచ్చం వగయిరా సప్లయి జరగడం మాకు

అనుభూతం. అయితే మాఅనుభవాన్ని నన్నయ్యకు అంటఁగట్టడమున్నూ అంత యుక్తిసహం కాదు - యేమో ఆకాలంలో యేంజరిగిందో? అతీత విషయాలు నిర్ణయించడం కష్టసాధ్యం. సుమారు యిప్పటికి యిరవై యేళ్ళనాఁడు వొకరు "హస్తినాపురం వొక చిన్నపల్లెటూరు" గా తేల్చారు విమర్శించి; అందుకు యేదో వొక హేతువు దుర్యోధనుఁడు పుట్టినప్పుడు దివాణంలోకి నక్కకూఁతలు వినపడడం, వుపపాదించారు. ఆయీ హేతువునే వుపపాదించి వేఱొకరు హస్తినాపురం మహాపట్నమే అని నిర్ధారణ చేశారు. తణుకులో నన్నయ్య యజ్ఞం చేశాఁడన్నదిన్నీ నిల్చేది కాదు. భారతరచనారంభానికి పూర్వమయితే సోమయాజిపేరు గద్యలో తగలాలి. పరమందనడానికి అవకాశమే లేదు. విషయం విషయాంతరంలోకి దేఁకి చాలా సేపయింది —

సామెతలను పురస్కరించుకొని కవి నివాసం నిర్ణయించడం అంత యుక్తిసహం కాదనేదే ప్రకృతం. నెల్లూరిప్రాంతం వాఁడైతే కావచ్చునని మొట్టమొదట వ్రాసే వున్నాను. యీకవినిగూర్చి - యింకో సంస్కృత సంధినిగూర్చి కొంచెం వ్రాసి యీవ్యాసాన్ని ఆఁపుతాను.

"గరీయః క్షుద్బాధా" అని యీకవి వకసమాసంలో వాడివున్నాఁడు. యీసంధి శాస్త్రసమ్మతమే కాని దుష్టంకాదుకాని అక్కడికి గుక్కవిడవ్వలసి వస్తుంది. దానితో వాచాసౌష్టవం కొంత చెడుతుంది. అది ఆలంకారికులు దోషంగా పరిగణిస్తారు. కవులకు అందరి సమ్మతితోటీ సమ్మతం వుంటుంది. వొక్క శబ్దశాస్త్రజ్ఞులతో మాత్రమే కాదు-(అహోభారో గురుః కవేః) ఆలంకారికులు మూతి విఱుస్తారని యెఱిఁగివుండిన్నీ కవులందఱూ దీన్నివాడుతూనే వున్నారు—"ఉద్వేల్ల ద్భుజవల్లి కంకణఝణత్కారః క్షణం వార్యతామ్" అన్నాఁడు వొకకవి. యేలాటి చోటంటారు? యెంతో మృదుపాకంతో నడిపించిన శ్లోకంలోనే 'ఏతాసా మరవింద సుందర దృశాం ద్రాక్చామరాందోళనాత్' అనేది దీనికి పూర్వవాక్యం. సహృదయులు ఆయీ రచనామార్దవాన్ని గుఱితిస్తారు, కనక విస్తరించను. లాక్ష

ణికులలో యేకొందఱో తప్ప కవికష్టాన్ని గుఱుతించ తగ్గవారుండరనే నేననుకుంటాను. అందుచేత వారు తోఁచినట్లల్లా "ఆర్డినెన్సు" వలె కొన్ని శాసనాలు సృష్టిస్తూ వుంటారు. వాట్లను ఆమోదించేభారం కవుల మీఁద వుందని లాక్షణికు లభిప్రాయ పడ్డప్పటికీ తుదకు ఆలా జరగదు. సర్వత్రా కాకపోయినా క్వాచిత్కంగా - శాసనోల్లంఘనమే ప్రత్యక్ష మౌతూవుంటుంది. ఆలాటి సందర్భంలోనే వ్యాఖ్యాతలు, "నిరంకుశాః కవయః" అంటూవుంటారు. ఆయీమాట వ్రాసే వ్యాఖ్యాతలు గ్రంథ కర్తనీ యేమీఅనలేరు, లాక్షణికులనీ యేమీఅనలేరు. బాగాఆలోచిస్తే "ఆర్డినెన్సు" మాదిరిగావుండే శాసనాలు అతిక్రమించడం "నిరంకుశత్వం" లోకి చేరవనియ్యేవే నేననుకుంటాను. అశ్లీల దోషోద్ఘాటనం చేయడంవిషయంలో కొందఱు లాక్షణికులు చూపిన - స్తనశల్యపరీక్ష మిక్కిలీ అనుచితంగా వుంది. అది సమ్మాన్యమే అయితే సంస్కృతకవిత్వంలో-విరోచన-శేఫాలికా కేశవ - లోనైన కొన్ని మంచి శబ్దాలున్నూ తెలుఁగులో - పాఱు-పుచ్చు- మొదలైన ధాతువులున్నూ అసలే తుడిచిపెట్టుకు పోవలసి వస్తుంది. కవులలో యెవరేనా వీట్లని ప్రయోగించడం మానుతూ వున్నారేమోఅంటేః అలామానినట్టు లేదు, లేనేలేదు. కాఁబట్టి ప్రాజ్ఞులైన విమర్శకు లెవ్వరూ ఆ యీ రీతిని అశ్లీలాపాదన చెయ్యరు కనక నేను ప్రస్తుతకవి కవిత్వంలో ఆధోరణికి పోలేదని విజ్ఞులు గుఱుతిస్తారుగాక! స్వస్తి.



# చౌదరిగారి చిన్నసందేహాన్నిగూర్చి

( ది 16—4—1941 సం॥రం ఆంధ్రపత్రిక వీక్లీనుండి )

దీన్నిగూర్చి సూక్ష్మదృష్టితో విచారిస్తే వారికే అవగత మయ్యేది. "స్థూలదృష్టుల శంక" అన్నదానిలోనే నాతాత్పర్యం యిమిడి వుంది. యీ వేముశబ్దాన్ని పూర్వవైయాకరణులు ఔపవిభక్తికంగా పరిగణించి

ఔపవిభక్తిక సూత్రానికి ఉదాహరణంగా "వేము + చెట్టు—వేఁపచెట్టు" అని చూపివున్నారు. ఆ వైయాకరణు లెవరంటారా? వెంకయ్యవ్యాకరణ మనే పేరుతో యిప్పటికిన్నీ అమలులో లేదా, అచ్చులో వున్న టీక యెవ రిదో ఆ యెలకూచి బాలసరస్వతులవారు. 'వెంకయ్య' గారి పేరు రావ డానిక్కారణం వ్రాస్తే చాలా పెరుఁగుతుంది. యిటీవల— 'బాలవ్యాకర ణానికి' చిన్నయ్యసూరి - చిన్నయ్యసూరి అనే పేరుకూడా దాన్నిబట్టి వస్తే వచ్చివుంటుందేమో? బాలసరస్వతులు ఔపవిభక్తికప్రత్యయాలను యేకరుపెడుతూ — 'టి - ంటి - త్రి - ప' అని చూపి వుదాహరించారు. యీమాట నేఁటికి 60 యేళ్ళనాఁడు నేను యానాం నీలపల్లి స్కూల్లో ఫోర్తుక్లాసులో చదువుకునేనాఁటి ముచ్చట. యిప్పుడు చౌదరిగారి సాహసో క్తులకు బొత్తిగా "పట్టపగ్గాలు" కనపడక, వోహో ఆనాఁటి-"వెంకయ్య వ్యాకరణం" యింద్రద్యుమ్నుఁడి (భారతం చూ.) యశస్సులాగ అంతరిత ప్రాయ మైనట్టు వుంది - ఆలాగే కాకపోతే చౌదరిగా రంతవారు "పకారా దేశము ఔపవిభక్తిక చిహ్నమని యేవ్యాకర్త శాసించెను?" అని నిర్భ యంగా పత్రికద్వారాగా శంకించఁగలరా? అనుకోవలసి వచ్చింది. యీసర్ఛికమైన శంకవల్లనే ధ్వనిత మవుతూ వుంది, చౌదరిగారు బహు వ్యాకరణాలు చదివినవా రనే అంశం. అందుచేత, వెంకయ్యవ్యాకరణం అంతరించింది కాఁబోలునని విచారిస్తూవుండఁగా విశ్వనాథ (కవిసమ్రాట్టు) శిష్యుని సమ్మాన మంటూ రాజమండ్రినుంచి యెవరో వచ్చి నన్ను వెంటఁ బెట్టుకు వెళ్ళారు. "టవునుహాలు" లో సభ జరిగింది. ఆ హడావడిలో నేను వెంకయ్యవ్యాకరణం యిక్కడ దొరుకుతుందా? అని శ్రీ అడవి శంకరరావుగారిని ప్రశ్నించాను. వారు వెదికి తెచ్చి యిచ్చారు. ఆదరా బాదరా దీపంవెలుఁగున తీసి చూస్తినిగదా! అందులో 'టి-ంటి-త్రి-ప' అని నేను నాచిన్నతనంలో లోకల్‌ఫండు స్కూల్లో చదువుకున్న పాఠానికి కొంచెం భిన్నంగా కనపడింది సూత్రం. దానితో నాకు కొంచెం గుండె లటుక్కు మంది. కాని, వుదాహరణాలలోమాత్రం నా జ్ఞాపకమే స్థిరపడింది.

అదంతా వ్రాస్తే వ్యాసం పెరుఁగుతుంది. ఐతేమాత్రం తప్పుతుందా? నాజ్ఞాపకం వుదాహరించానుకదా! యిటీవల మాఱిన మార్పు చూపుతాను —

'టి-ంటి-తి మొదలైనవి' అని వుంది. కాని, వుదాహరణం యివ్వడంలో - "పాఁపతేఁడు, వేఁపచెట్టు" అనిమాత్రం వుదాహరింపఁబడింది. సరే! స్థూలదృష్టులు అన్యథా భ్రమపడతారేమో? కాని, సూక్ష్మదృష్టులకు- "అవ్వా గుఱ్ఱమూ వకటే" అని తోస్తుందనిన్నీ నేను అఱవైయేళ్ళకు పూర్వం స్కూల్లో చదువుకొన్న యెడిషన్ పుస్తకం కాకపోయినా ఇటీవల మార్పుచెందిన(భారతాదులన్నీ ఈలాటి మార్పులు చెందుతూనే వున్నాయి) పుస్తకమేనా చౌదరిగారు చదివివుంటే — "యేవ్యాకర్త శాసించెను?" అని యీముసలాణ్ణి ప్రశ్నించడంగాని "వృద్ధాస్తేన విచారణీయచరితాః" అంటూ యేదో యీసడింపులు ధ్వనించేటట్టు వుట్టంకించడం గాని యింకా యింకా యేవేవో "గమనింపులు" గాని "గిమనింపులు" గాని బయలుదేఱేవి కావుగదా! అని నాలో నేనే సమాధానపడ్డాను. దీనితో చౌదరిగారి ప్రధాన ప్రశ్నానికి తగిన జవాబిచ్చినట్టయింది. యిఁక నల్లా చిన్నయ్యసూరి — పఙ్వర్ణకం ద్వారాగా సమర్థించిన 'వేఁపచెట్టు' వగయిరాలు, బాలసరస్వతి ఔపవిభక్తికాలల్లో చేర్చడమేమి? అని చౌదరిగారు శంకించవలసి వుంటుంది? కాని, అందుకు నేనుత్తరవాదిని కావలసి వుండదు. తెలుఁగులో బహువ్యాకరణాలు నేర్చివున్నట్టే సంస్కృతంలో కూడా బహువ్యాకరణాలు చూడడమో లేక తత్తత్సంప్రదాయాలు వినడమో. లేక అట్టిగురువుల శుశ్రూషేనా చేసివుండడమో, తటస్థిస్తే శంకకే అవకాశం వుండదు. (ప్రమాణానామనేకత్వేపి ప్రమాయస్త్వైకత్వాత్) ఇవేవీ లేకుండానే పూర్వపక్షాలకుపక్రమించడం పేరే "స్థూలదృష్టిత్వం" అది కలవారే - 'స్థూలదృష్టులు' యిది చాలా బాధకం. భారవి - "సహసా విదధీత న క్రియాం" అని వూరికేనే అన్నాఁడా? చౌదరిగారు నా చేదస్తపువ్యాసాలు శ్రద్ధగా చదవడానికి అభినందించక తప్పదు. ప్రశ్నించడానిక్కూడా డిటో యద్దేవచేస్తూ ప్రశ్నించడానికి తగినసమాధానం కనపడదు. యశస్సంపా

దనా సక్తిగా భావించవలసివుంటుంది. అదికూడా అభినందనీయంగా శ్రీవిక్టోరియా మహారాణీగారు భావించిన ట్లొకయితిహాసంవుంది. (ప్రసిద్ధః పురుషోభవేత్) అనే సూక్ష్మోపాయం కొందఱవలంబిస్తారు. కాని, యిదిన్నీ స్థూలదృష్టిత్వమే. చౌదరిగారు యింకో శంక చేశారు. అది యిది - "పకారాదేశము ఔపవిభక్తిక చిహ్నమని శాస్త్రిలవారు అనుటలో ఆధార మేమి ?" అని ఘట్టిగా ప్రశ్నించారు. యిదిన్నీ (వెంకయ్యద్వారాగా) దత్తోత్తరమే. యిక వేమునకున్ అనుమాట వేఁపకున్ అని శంకించు స్థూలదృష్టులు (గ్రంథరచనలో) అసలు వుందురా ? అనేది వుత్తరించాలి. నేను 'స్థూలదృష్టులు' అని మకుటం పెట్టికదా! ఆయీ వ్రాఁత కుపక్ర మించాను. స్థూలదృష్టులు చేయని శంక లంటూ వుండనేవుండ వని నేను రికార్డుద్వారా ఋజువు చేస్తాను. గ్రంథరచన చేతనై నంతమాత్రంలో వారిస్థూలదృష్టిత్వం అంతరిస్తుందా ? అది సర్వకల్ల. సమాసంలో మాత్రమే రాఁదగ్గ పజ్వర్ణకమే అనండి (చిన్నయ్యసూరిమతంలో)పకార ప్రత్యయమే అనండి (బాలసరస్వతులమతంలో) కేవలవేముశబ్దానికి యెందుకు వచ్చింది కాదు ? అని శంకించడం పేరే స్థూలదృష్టిత్వం. ఆలా శంకించక పరిశీలించి శంకించేవారిని స్థూలదృష్టు లనడానికి యెన్నివేల గుండె లున్నాయి ? యీ స్థూలదృష్టులను గూర్చిన యితిహాసా లెన్నో వున్నాయి. కొన్ని సూచిస్తాను —

(1) "గురోస్తు కర్ణే సరటా ప్రవిష్టా"

(2) "సవతి తల్లితద్దినం, సవతితండ్రితద్దినం"

(3) "బావ కాశీలో చదువుకు వచ్చినా శుద్ధవెఱ్ఱిముండాకొడుకే" (వొకటీ రెండూ యేళ్ళు కాదు 12 యేళ్ళు) యింకా చాలా వున్నాయి. యివన్నీ విద్యనేర్చికూడా పరిశీలన లేనివాళ్ళనుగూర్చి పుట్టిన యితిహాసాలే. వీరిలో యెంతెంతవారేనా వుంటారు. ప్రత్యక్షంలో ఋజువు చేస్తే, మీరు అత్యాశ్చర్యపోతారు. వీరివల్ల నేను పడుతూవున్నబాధ మీకు గోచరించి విచారపడతారుకూడాను. యిందులో 2 వ నెంబరుమాత్రం విద్వాంసులకు

సంబంధించేది కాదు – అది సామాన్య సంసారికి సంబంధించేది. వీట్లని సక్రమంగా వివరిస్తే చాలా స్థలం ఆక్రమిస్తుంది. ముఖాముఖీని వ్యాఖ్యానిస్తాను. నాకుతెలుఁగు వ్యాకరణజ్ఞానం లేదని మీరిదివఱకే తెలుసుకున్నారుగదా ? (లేకపోతే వాదానికి దిగరు) సంస్కృతవ్యాకరణజ్ఞానం కూడా డిటో అనుకోండి. యీలాటి యితిహాసాలుమాత్రం బోలెఁడు వచ్చును – స్థూలదృష్టిత్వమనేది మనిషికి పుట్టుకతోఁటే ఆవిర్భవిస్తుంది. అది పిమ్మట యెంతచదువు చదివినా, యెంత గ్రంథరచన సాఁగించినా వదలనే వదలదు. (బావ కాశీలోవుండి పన్నెండేళ్ళు పుస్తకాలన్నీ పాఱఁజదివితే మాత్రం) యెక్కడికిపోతుంది ? (కాశీగమనమాత్రేణ నాఽన్నంభట్టాయతే ద్విజః) యింతకూ వెంకయ్య వ్యాకరణమంటూ వొకటి ఆంధ్రభాషా ప్రపంచంలో వుందని వినేనా వుంటే, చౌదరిగారు యీవ్యవసాయానికి వుపక్రమించేవారే కారు. తదభావజ్ఞానంమీఁద ప్రసక్తాను ప్రసక్తంగా మఱికొంతవ్రాశారు చౌదరిగారు – అది తిరస్కారకంగావున్నా క్షంతవ్యం —

యేవ్యాకర్త శాసించాఁడో ? తెల్పడం జరిగింది. యీపైని ఆవ్యాకర్త వున్నాఁడు, చౌదరిగారున్నారు, యేంజరగాలో అదే జరుగుతుంది. నాకెందుకు ? సంస్కృతంలోకూడా రూపసిద్ధి ఒకటే అయినప్పటికీ ప్రక్రియాభేదాలు, సారస్వతం, ముగ్ధబోధ వగయిరా వ్యాకరణాలవల్ల తేటపడతాయి. అవన్నీ వ్యాఖ్యానిస్తే వ్యాసం పెరుఁగుతుంది. పయిఁగా చిన్నసందేహానికి యింత పెద్దవ్రాఁతెందుకనే స్థూలదృష్టులకు జవాబు చెప్పడం కష్టం. మఱికొన్ని సాహసోక్తులు చౌదరిగారి వున్నాయి— "వేమునకుమాత్రము పజ్వర్ణకము రాని రూపములు కనరావు" అనేది వొకటి. వాట్లలో యీమాట – సమాసమందైనను అని వుపక్రమించి వ్రాసింది. దీన్నిగుఱించి వ్రాస్తే చాలా వ్రాయాలి. మఱొకప్పుడు చూచుకుందాం "యేవ్యాకర్త శాసించెను ?" అన్నశంక నివృత్తమయితే, దానితో జిజ్ఞాసువులు తృప్తిపడతారు. ప్రధాన మల్లని బర్హణన్యాయాన్ని

బట్టి యివన్నీ దానితోపాటు తప్పకొనేవే. వేములూరు, వేములవాడ్య అనేరూపాలు సమాసాలే, గ్రామ్యాలు కావు. గ్రంథాలలో యెక్కినా యెక్కకపోయినా వీట్లని తోసి రాజనడానికి వీలులేదు. యిందులో ఒకటి భీమకవిగారి యింటిపేరు యెక్కితే పద్యంలోకూడా యెక్కేవుందేమో? (వేములవాడ భీమకవి వేగమె) భవతు. తరవాత చూచుకుందాం. స్థూల దృష్టులు అని నేను పుటంకించికదా? అదిని వ్రాఁత కుపక్రమించింది. దానికి కొంత వ్యాఖ్యానం చేశాను. తృప్తికలిగితే మీరూనేనూకూడా ధన్యులమే. ఆలాక్కాక అస్థూలదృష్టులను ప్రత్యక్షంగా సందర్శించాలంటే దానికి వుపాయం చెపుతూన్నాను — మావూరు వొకసారి దయచెయ్యండి. వారివారిశంకలు నావద్దవున్న రికార్డులోన్నుంచి తీసి, మీకు చూపుతాను - అవి బొత్తిగా నిస్సారాలు కావడంచేత యేపత్రికగాని ఆదరించకపోవడం చేత స్వంతంగానే వారువారు అచ్చువేసుకుని నాకు పంపివున్నారు. అవి చూచినపిమ్మట అస్థూలదృష్టులెవరో మీకు గోచర మవుతుంది. అప్పుడు అందులో కీర్తిశేషులు కాకుండా వున్నవారిని మీరు సందర్శించి యిప్పుడు నన్ను ప్రశ్నించినట్టు కాక, చాలవినయంగా — "అయ్యా? యేమిది యింత అనుచితపుశంకలు శంకించారు దేవరా? మీవంటివారిట్టి శంకలు చేయవచ్చునా?" అని ప్రశ్నిస్తే తగిన సమాధానమే వస్తుందో యేమవుతుందో! మీకే అనుభూత మవుతుంది.

"విమలమధుర మనోహరవృత్తి వెలయు
వారిఁబొడఁగన బుధులెంతదూరమైనఁ, బోవుదురు"

కనక మీరు తప్పక వారివారిని సందర్శించడం ఆవశ్యకం. ఆలా సందర్శిస్తే నేను రికార్డు చూపడంవల్లనేకాక, వారిముఖతః కూడా వింటే మీకు - "అసలువుందురో?" వడ్డీకే వుందురో? అనే సందేహం సమూలమూ తీరుతుందని యింత నొక్కి వక్కాణించడం. అట్టిస్థూలదృష్టులు అసలు లేనేలేకపోతేనే ఆలా శంకించి సమాధానం వుపపాదించాననేనా మీసందేహం? అవును. మీపాండిత్యబలం మీకు అట్టి సందేహాన్ని కల్గిం

చింది. కనక, అవిన్నీ యుక్తమే (కోడిగుడ్డంత బంగారం) వారిపేళ్ళు వుదాహరించడానికి నాకు భయం. ఆభయస్వరూపాన్ని ముఖాముఖీని వ్యాఖ్యానిస్తాను. నాకు కోర్టులవెంట తిరగడం యిష్టంలేకపోవడమే కాదు; దానికి అనుకూలించే వోపిక పూర్తిగా తగ్గి యిప్పటి కప్పుడే నాలుగైదేళ్ల దాఁటవచ్చింది. యింతమాత్రానికే భయమా ? అంటారేమో ? "అవస్థా పూజ్యతే రామ!" అన్నమాట మీరెఱిఁగే వుంటారు; కేసంటూ యెవరి మీఁదేనా యెవరేనా పెట్టకనేపోవాలి గాని, పెడితే అందులో యేమీ లేక పోయినా అధికారి విచారించి తీరాలి. జయాపజయాలమాట యేలావున్నా తిరగలేక చావాలి. యిప్పటి విద్యావివాదాలు కోర్టుకు దారితీస్తాయి. వారి రూల్సుకున్నూ మన — "ఔపవిభక్తిక ప్రత్యయాలకూ" బొత్తిగా సంబంధం వుండదు. (శారదాబిల్లు విషయంలో పండితుల శాస్త్రాలగతి యేమవుతూవుంది.) అందుచేత అనుచితపు శంకలు శంకించే స్థూలదృష్టుల నామధేయాలు యిందులో వుటంకించడానికి భయపడి, మిమ్మల్ని దర్శన మిప్పించమనవలసి వచ్చింది. మీకు నేను తెల్పినపిమ్మటనేనా ఫలానా వారు చెప్పారని మీరు మళ్ళా ఆవలివారితో నివేదించి కయ్యం పెంచ కూడదు. యిదంతా (సీక్రెట్) యెందుకంటారు మీకుతెల్పేది "అసలు వుందురా ?" అనే మీసందేహాన్ని తీర్చడానికే. "వున్నారండోయి!" అని మీయంతట మీరే నాతో చెప్పితీరతారనే నానమ్మకం. యితరవిష యంలో అట్టి అసంబద్ధపు శంకలు చేసేవారు వుంటారేమో ? కాని, ప్రస్తుత మైన ఔపవిభక్తిక విషయంలో వుండరనుకున్నారేమో ? మీకు ఆయీవిష యంలోకూడా వున్నారని ఋజువుచేస్తాను. చేయలేకపోతే మీకు వృథాగా తోవఖర్చులు తగిలించినట్టవుతుందని నాకు తెలుసును. ఆపద్ధతిని ఆఖర్చు నేనేభరిస్తాను. విద్యావిషయంలో మాకు వుండుకున్న శ్రద్ధాభక్తులు గమ నించి ఈస్థూలదృష్టులవల్ల నేను యీవార్ధక్యంలో పొందుతూవున్న కష్టనిష్ఠూ రాలను మీవద్ద వెళ్ళఁబోసుకోవడానికే యింతగా మిమ్మల్ని అభ్యర్థిం చడం. మీఅంతకాదుకదా ? మీలో శతాంశమేనా యీవిద్యావివాదాల

వారేనా యింతతేలికగా యీసడించినట్టు లేదు. అథవా యీసడించారే అందాం, అదీ దోషమే అవుతుందిగదా! గ్రంథవిమర్శనం చేస్తూ వ్యక్తి దూషణ చేసేవారు మనభారతీయులలో లేకపోలేదు. వారిని అభినందించే వారుమాత్రం వున్నట్టు లేదు. నీచంగానే చూస్తూ వున్నారు. భవతు. యీవిషయం మఱొకప్పుడు అవసరమైతే చూచుకుందాం. చౌదరిగారి తాత్పర్యం యీవెంకయ్యాని (ప్రస్తుతపు వెట్టివెంకయ్యాతో పాటు అంటే చెళ్ళపిళ్ళతోపాటు) అధఃకరిస్తే తుండూ తుపాకీ యెగిరిపోతుందనిన్నీ, దానివల్ల మొట్టమొదట తమరు పొందిన పొరబాటు సవరణ అవుతుం దనిన్నీ వూహించి, యీవంకరమార్గం తొక్కినట్టు స్తనంధయులకుకూడా స్పష్టమవుతూ వుంది. "సమాధానం కాదనలేను" అన్నంతతో విరమిస్తే చాలా బాగా వుండేది. మళ్ళా - "కాని" అని యెత్తుకొని వ్రాసినమాటలు మొదట కలిగించిన సంతోషాన్ని కూఁకటివేళ్ళతో పెకలించాయని వ్రాయక తప్పక వచ్చింది. యేదో విధంగా తమరు పొందిన ప్రమాదాన్ని సమర్థించేయత్నం సహృదయత్వాన్ని తొలఁగిస్తుందికదా! అందులో వీరయ్య అనికూడా వుటంకించి పరిహసించడానికి నాకు చాలా పరితాపం కలిగింది. నాకు పరితాపం కలిగితే, యేంప్రయోజనం? చౌదరిగారు సంతోషపూర్వకంగానే వ్రాసి వుంటారు. ఆయీవాక్యానికి పూర్వం డెబ్భై యెనభై పంక్తులు తెలుఁగు వ్యాకర్తల పేళ్ళతోటీ, వారిసూత్రాలతోటీ, వుదాహరణాలతోటీ అలంకరించి, యీవాక్యం యెత్తుకొని - "సమాధానం కాదన లేను" అని వ్రాయడంవల్ల అన్నివ్యాకరణాలు పరిశీలించినా, దీన్ని కాదనడానికి అవకాశం చిక్కింది కాదని చింతిస్తూ ఆమాట వ్రాసి వున్నట్టు స్పష్టపడుతూనే వుంది. అయితే - "కాని" అని యెత్తుకొని యేదో వ్రాయడం యెందుకందామా? దాన్ని వ్యాఖ్యానిస్తే చౌదరిగారి హృదయం నొచ్చుతుంది కనక అది ప్రసక్తమైనప్పంటికీ లోకానికి వదులుతూన్నాను. వెంకయ్యవ్యాకరణ మంటే? యేవెట్టివెంకయ్యదో కాదనిన్నీ, అది నన్నయ్యసూత్రాలకి బాలసరస్వతులవారి టీకబాపతులో

దనిన్నీ తెలుసుకోవడానికి తగ్గంతవఱకు యిదివరలోనే వ్రాశాను. యింక వల్లా బాలసరస్వతుల పేరురాక, వెంకయ్యపే రెందుకు వచ్చిందో (అవసరం లేకపోయినా) వ్రాస్తాను. సరస్వతులటీకను యీవెంకయ్య(బహుశః యీయన స్కూళ్ళయినస్పెక్టరో, సూపర్వైజరో అయివుండాలి.) గారు అచ్చు వేయించారు. టైటిల్ పేజీలో - "తా - వెంకయ్యచే ముద్రింపఁబడి" అని వుండడంవల్ల - దీనికి 'వెంకయ్య వ్యాకరణం' అని పేరు వచ్చింది — తా అంటే, 'తాడినాఁడ' అని అభిజ్ఞులవల్ల విన్నాను. ఆ పుస్తకంలోవున్న 'అభ్యాసము' అనే మకుటమున్నూ, దానికింద వుండే కొద్దిపాటి మాటలూతప్ప యేలేశమున్నూ, యీయనది అంటే, స్వకపోలకల్పితం లేదు. అచ్చువేయడంవల్లనే యీయనకి పేరు రావడమనేది- "పుణ్యైర్యశో లభ్యతే" అనే అభియుక్తోక్తికి వుదాహరణంగా చూచుకోవాలి. హైదరాబాదా సికిందరాబాదాలమధ్య వొక పెద్దచెఱువు వుంది - దాని చుట్టుకొలత మూఁడు ఆమడకు తక్కువ వుండదు. దాన్ని నిజాం పాదుషాలలో యేతానీషాపాదుషాగారో తవ్వించి వుంటారుగాని, వారి పేరుతో దాన్ని వాడడం లేదు - "హుసేనుసాగరం" అనే పేరుతో దాన్ని వాడతారు. యీ హుసేను దాన్ని తవ్వించేటప్పుడు దానికి సంబంధించిన యే చిన్నవుద్యోగంలోనో వుండి వుంటాఁడు. అంతమాత్రంచేత అతని పుణ్యం మంచిది కనక, అతనికి పేరువచ్చింది. ప్రస్తుతంకూడా ఆలాగే మన వెంకయ్యగారికి పేరు వచ్చిందనుకోవాలి. అనామకులు సనామకులవడానికి యేవో యీలాటివే జత పడుతూ వుంటాయి. వ్యాఖ్యానిస్తే వ్యాసం పెరుగుతుంది. దీన్నిగుఱించి యింతవఱకేనా వ్యాఖ్యానించడం నాచేదస్తాన్ని తెల్పడానికేకాక, కొంత చారిత్రకవిషయాన్ని తెల్పడానికూడా పనికివస్తుంది కనక, చదువరులు యీసడించి బహిరంగలేఖల ద్వారా పత్రికవారికి తమ అసమ్మతినితెల్పి, నెనువెంటనే పత్రికవారివల్ల తృప్తికరమైన జవాబు పొంది తూష్ణీంభావాన్ని వహించవలసి వుండదని తలుస్తాను. చాలాదూరం వచ్చాం. యేదో విషయం వ్రాయడానికి వుపక్ర

మిస్తే దానిలోనే - "సరాగ్రిజు పెళ్ళిలో గురాగ్రిజు కొౕకపోఁచ "గా యితర విషయాలుకూడా వుటంకిస్తేనేకాని, నాకు జరగదు. ఆలాగే కాకపోతే, ప్రత్యేకించి వారివారికి శీర్షికలు పెట్టి వ్రాయవలసి వస్తుందికదా ! భవతు. మన వెంకయ్యగారిని యెవ్వరూ యింతవఱకు యీసడించినట్టులేదు. చౌదరిగారు కూడా యీసడించే తాత్పర్యం కలవారుకారు. వారు పడ్డ ప్రమాదాన్ని యీయన బయట పెట్టడంచేత మనస్సులో వెంకయ్యమీద ఆగ్రహం వచ్చి (సర్వస్స్వార్థం సమీహతే) యీసడించడానికి వుపక్రమించారు. అంతమాత్రంచేత వెంకయ్యగారియందు గౌరవం లేనివారనిన్నీ, తలంచకూడదు - నేను సూత్రప్రాయంగా - (ప్రమాణానా మనేకత్వేఽపి ప్రమేయస్యైకత్వాత్) వగయిరాలు వుదాహరించి బాగానే బోధించి వున్నాను. అదిన్నీకాక, దీనిలో బోధించడానికేంవుంది. ఓనామాలువచ్చినవాళ్ళకూౘడా తెలిసేదే. చౌదరిగారు యీ పాత పుస్తకం వుందని యెఱక్కౘ యశోఽర్జనకై కృషి చేశారు పాపం ! "తెలుఁగునకున్న వ్యాకరణదీపము చిన్నది" అని మాత్రమే కాక, ఇంకా ఇంకా యేమేమో దేవీభాగవతపీఠికలోనూ, పాణిగృహీతపీఠికలోనూ వుటంకించే వున్నాను. వుంటేమాత్రం చౌదరిగారికి పూర్వపక్షం చేదామనే కుతూహలం వున్నప్పుడు దానికి నేనెంత గ్రంథం దేనిలో వుటంకిస్తే యేంప్రయోజనం ? అందుచేత "రంగంలో" యీ వెంకయ్య యెంతవఱకు నిలుస్తాఁడో ? చూస్తారనుకుంటాను. ఆలా చూడడానికి యెందఱో యువకులు వైయాకరణు లున్నారుగదా ! వారితో చూస్తే బాగుంటుందనుకుంటాను. నేను జవాబు చెప్పవలసింది తరవాయి వుంచకుండా చెప్పేవున్నాను. సెనగలు తిన్నాను చెయికడుక్కౘన్నాను. యిఁక చౌదరిగారు వుపక్రమించఁబోయేది - "కర్ణాటకలహం" అంటే ? యేమిటో తెలుసుకోవలసి వస్తే, మళ్లా చాలా వ్రాయాలి. కావలిస్తే మృచ్ఛకటికలో చూచుకోండి. యేదో మిషకల్పించుకొని పోట్లాటకు దిగడానికి ఈ లోకోక్తి యేదేశంలోనో వుందని తోస్తుంది. భవతు. చౌదరిగారు-

"వేములవాడ - వేములూరు" అని నేను సమాసంలో పకారాదేశం రానిరూపాలు చూపిస్తే, దాన్నిగూర్చికూడా వ్యాఖ్యానించవలసిందని విధించారు. దానికి వారికి వుపోద్బలకవాక్యం యేమిటంటే? "వ్రాయవలసింది చాలకలదు" అని నేను వ్రాయడమే అని తెల్చివున్నారుగాని, వారికోరిక "నీ నెత్తిమీఁద తేలు వుందంటే ? నీ చేత్తోటే తీసివేయి" మన్నట్టు వుందని మనవి చేస్తాను. నేను మీరు అనవసరంగా - "చెట్టుకొట్టి నెత్తిని వేసికొన్న" సామెతగా సమాసంలోకూడా పజ్వర్ణకం రానిరూపాలు వేపకు లేవంటూ వ్రాస్తే, మీ అమాయికత్వాన్ని కనిపెట్టి నేను "వేముల వాడ - వేములూరు" అని సమస్తపదాలు చూపి వున్నాను. దీనిమీఁద మీరు అవి సమాసాలు కావనో, అందులో వున్న - "వేములు" నింబార్థకాలు కావనో మార్గంతొక్కి - "సమాసమందైనను" అని వుపక్రమించి వ్రాసిన మీవాక్యాన్ని నిలవఁబెట్టుకో వలసి వుండఁగా, దాన్నిగూర్చికూడా నన్నే వ్రాియవలసిందనడంలో యేమి న్యాయంవుందో ? ఆలోచించుకునే భారం మీమీఁదే పెడుతూ వున్నాను. జిజ్ఞాసాతాత్పర్యంతో ఆయీ మాట వ్రాిశామంటారా ? అలా అనండి. అలాగే అంటే వొక మాదిరిని తోవకి వచ్చినట్టే కాని, ఆ వాక్యధోరణి ఆలాటితాత్పర్యాన్ని వెలిపుచ్చకపోయినా నేను వెలిపుచ్చుతుందనియ్యేవే అంగీకరించి, యీక్రిందిమాటలు నిష్కల్మష బుద్ధితో భగవంతునిముఖం చూచి వ్రాిస్తాను.

అయ్యా, చౌదరిగారూ! వొక్కసారినన్ను మీరు చూస్తే, నా ప్రస్తుతస్థితిగతులు మీకు వెల్లడవుతాయి. యీరీతికి వచ్చి అప్పుడే అయిదాఱేండ్లు కావచ్చింది. కూర్చుని పదిపంక్తులుకూడా వ్రాియలేను. యేదేనా వ్రాియవలసి (వుత్తరందగ్గిఱనుంచీ)వస్తే, పరుండే వ్రాిస్తాను. పెన్సిలుతో తప్ప పరుండి వ్రాిసేవ్రాఁత జరగదు. ఫౌంటెన్ పెన్నుకూడా నాకు తోడ్పడంలేదు. బళ్ళనితోలడానికి తగ్గన్ని వ్యాసాలు నావి యిప్పటికి పత్రికలలో పడ్డవి వున్నాయి. యివన్నీ పరుండి పెన్సిలుతో గిలికినవే. యీ స్థితికివచ్చిన తరవాత - సుశీల వగయిరా కొన్ని పుస్తకాలుకూడా వ్రాశాను.

అయిదాఱువేల పద్యాలకు తక్కువగా వుండవు వాట్లల్లో. యిదంతా పెన్సిలు వ్రాఁతే. యిట్టినన్ను నా జాతకాన్నిబట్టి కొందఱు వాదానికి ఆహ్వానించడం తాము యెఱగంది కాదు - యేదో కాలక్షేపార్థం - "వేంకటనాధునిపంచ తంత్రాన్ని" గుఱించి పిచ్చాపాటీమాటలు వ్రాసుకుంటే, దాన్ని ఆమోదించడం మీకు యిబ్బందిగా తోఁచి - "వేసినట్లల్లా వూరుకుంటే వెఱ్ఱివాఁడే గెలిచాఁడు" అన్న సామెతగా వుంటుందనే అర్థాన్ని - "వృద్ధాస్తే" అనే శ్లోకంద్వారా ధ్వనింపఁ జేస్తూ - "చిన్న సందేహము", అనే పేరుతో పెద్ద పూర్వపక్షానికే వుపక్రమించారుగదా! ఆ శ్లోకానికినీ ప్రస్తుత విషయానికిన్నీ వున్న సాంగత్యం — "కుర్వీతబుధసోమయోః" అనే మాదిరిదేమో, యిప్పుడేనా పరిశీలించవలసిందని హెచ్చరిస్తాను. నేను తమ దర్శనం చేయకపోయినా, నాకంటే తాము వయస్సులో చిన్నలే అనుకుంటాను. "అహం బాలోఽపినమే బాలా సరస్వతీ" అనే న్యాయాన్నిబట్టి వయస్సాచిన్నలే అయినా, విద్యలో పెద్దలే అయినా కావచ్చును. మీరు డెబ్భైయెనభై పంక్తులలో వుదాహరించిన తెలుఁగువ్యాకరణా లున్నాయే? వాట్లని నేను బొత్తిగా యెఱగనని వ్రాస్తే; (దీనిలో కొంత నిజం వున్నా) మీరూ విశ్వసించరు, లోకమూ విశ్వసించదు గాని, మీవలె నేను విద్వాన్ వగయిరా పరీక్షలిచ్చి డిగ్రీ సంపాదించినవాణ్ణి కాకపోవడంచేత అందులో మీకున్నంత అనుభవం నాకు లేదని వొప్పుకుంటాను. కాని, ప్రస్తుతం మిమ్మల్ని సమాధాన పరచడానికి ఆయా వ్యాకరణాలతో లేశమూకూడా అవసరం లేదని మీరే వప్పుకున్నారు. (కాదనలేను చూ) కనక, దాన్ని గూర్చి వ్రాయనక్కఱలేదు. యేదో వ్రాఁత పెరిఁగిపోతూ వుంది. ఇంత అసమర్థత్వంలోవున్న యీ వృద్ధుణ్ణి మీకు వ్రాయవలసినంత వ్రాసి తృప్తిపఱచినవాణ్ణి యింకా యేదో (మీరు వ్రాయవలసినదానికన్నమాట) వ్రాయవలసినదనడంలో యేమిన్యాయముంది? వ్రాస్తే వేళ్ళు సొట్టలు పడి బాధిస్తూన్నాయి. భగవంతుఁడింకా (సభలలో యెక్కువమందికయితే కాదు) కొలఁదిపాటిమందికి వినఁబడేటంత వాగ్ధాటినీ దానికి తగ్గంత

బుద్ధిపాటవాన్నీ మిగిల్చివున్నాఁడు. వ్యయప్రియాసలకు సంశయింపక, త్వరలోనే (ఆలస్యాదమృతం విషం, శుభస్యశీఘ్రం, దేవో నజానాతికుతో మనుష్యః) దయచేయండి. మీవాక్యాలు యిట్టి సామరస్యానికి అనుకూలించేవిగా లేకున్నా, యేదో జయేచ్ఛతో యింకా వుద్యోగించేవిగా కనపడుతూవున్నా ఈవయస్సులో నేను దానికి దోహదం చేయడం యుక్తంగా వుండదు కనక; వ్యంగ్యార్థాన్ని వదలుకొని మీవిజ్ఞప్తి - మనవి వగైరాలకు వాచ్యార్థాన్నే స్వీకరించి యిట్లు వ్రాయవలసి వచ్చింది. యీమధ్యనే మీ సీమవారికే వొకరికి సేలుజోడుకూడా సిద్ధంచేసుకొని, బహుమతీచేయడానికి ఆహ్వానించి వున్నాను. వారు బహుమతీ పుచ్చుకోతగ్గంతకవిత్వం (తిట్టుకవిత్వమే అనుకోండి, అయినాసరే) నన్ను వుద్దేశించి రచించి వున్నారు కనక వారిని ఆవిధంగా ఆహ్వానించాను. తాము అట్టి కార్యాన్ని చేయలేదు. ప్రస్తుతం నావల్ల యేదో కొంత తెలుసుకునే కోరికతోమాత్రమే వున్నవారు. అందుచేత యీ విధంగా అహ్వానించాను. యీ ఆహ్వానాలు చూచి (యెవరో అక్కఱలేదు) నాశిష్యప్రశిష్యులే వెఱ్ఱిగా భావిస్తారనిన్నీ అనుమానం తగులుతూవుంది. కాని, ఆలా వాళ్ళు భావించడంకూడా యుక్తమే. వయస్సా? డెబ్భై యొక్కటి దాఁటుతూవుంది. దేహబలమా? చాలా లోపించింది. అసలు మావంశానికా? "చెళ్ళపిళ్ళవెఱ్ఱి" అనే బిరుదనామం (యెవరినీ ఆశ్రయించి సంపాదించింది కాదు.) వుంది. "ముది మది తప్పితే మూఁడుగుణాలు" అంటూ సామెత వకటి వుంది. అందుచేత శిష్యులు వగయిరా ఆవిధంగా అనుకుంటేకూడా సంశయించేది లేదు. వ్రాసే వోపిక తగ్గి, మిమ్మి రమ్మన్నాను. వాచా వుపన్యసిస్తాను మెల్లిగా. వచ్చి వొకటి రెండు రోజులుమాత్రం నాకు అతిథిగా వుంటే చాలును. మీరు యేమేమి అడిగినా, (నాకు తెలిస్తే) జవాబు చెబుతాను. లేదా? తెలియదని స్పష్టంగా వక్కాణిస్తాను. అంతేకాని, కిందపడ్డా మీఁది వాణ్ణే అని కర్ణాటకలహానికిఁగాని పిడివాదానికిఁగాని అథాత్తువాదానికిఁగాని దిగను. నాకు వాటియందు పరమాసహ్యం. అయీ సందర్భం యిది

వఱకే నా వ్యాసాలవల్ల తమకు గోచరించి వుంటుంది. సవిమర్శంగా చదవక, యథాలాభంగా చదివివుంటే గోచరించక పోవచ్చు. ఆ పక్షంలో యిప్పుడు గోచరించితీరుతుందని వక్కాణిస్తూన్నాను. నేనెక్కడేనా పొరఁబడి అపప్రయోగంచేస్తే (భ్రాంతేః పురుషధర్మత్వాత్, భ్రాంతి గడవంగ శక్యమే బ్రహ్మకైన) అది భ్రాంతిమూలకమో, పాండిత్యలోప మూలకమో అని వొప్పుకోవడమే నా ప్రకృతి. కాని, చెప్పొద్దూ? మఱి వాట్లలో యే కొన్నిటినో మార్గాంతరం తొక్కి సాధించడమున్నూ (కద్రాజం, మరుద్భూపాలుఁడు, మృతాయితుఁడు వగయిరాలు చూ) వుంటుంది. అట్టి సందర్భంలో యథార్థాన్ని మఱుఁగుపఱచేది లేదు. ఆ యీ సందర్భాలన్నీ ప్రస్తుతం (సఖ్యంసాప్తపదీనం) వాదోపవాదాలనుబట్టి ఆప్తులుగా వున్న మీకు శ్రుతపఱచడానికి యిది తరుణం. త్వరలో దయచేయండి. యేదో కపటం అనుకోకండి. ఇంతే ఆశీర్వచనములు. స్వస్తి.

---

## రాణా ప్రతాపసింహ చరిత్ర

( ది 6—4—1941 సంగరం ఆంధ్రదైలీపత్రిక నుండి )

.......................................................................................

మాయెడ్వర్డు పట్టాభిషేకపద్యంలో - "మండలో దారఫణీంద్రకాంతలు తదక్షర," అన్నచోట "ఇక్కడ యతి భ్రష్ట మయినది" అని ఆక్షేపించేటప్పటికి "అయ్యో: యెంతటి మహాపండితుఁడికి యెంత స్వల్పవిషయంలో, అందులోనూ వ్యాకరణవిషయంలోనే యేలాటి పొరఁబాటు వచ్చింది (ప్రమాదో ధీమతా మపి అపి రేవకారార్థకః)" అని విచారించి జవాబు వ్రాస్తూ, "అయ్యా? యిక్కడ యతి భ్రష్టం కాలేదు. దేవరవారి మతి భ్రష్టం అయింది. మనుచరిత్రలోవున్న - ఉదారగుణాఢ్యులు మదీయలగు ప్రాణసఖుల్, అనే ప్రయోగం చిత్తగించండి" అన్నాము. (ఆయన

చాలా కటువుగా మమ్మల్నిగూర్చి నిందించడంచేత మేము కొంచెం దుడుకుగా జవాబిచ్చాము) ఆయన మొదట చాలా దూఁకుడుగానే దండు వెడలినా న్యాయమైన విద్వత్త కలవాఁడు కనక అంతతో వూరుకోవడం జరిగింది. అది చూడకే అనుకోవాలి మళ్ళా వొకరికి శంక కలిగింది నాలు గేళ్ళ నాఁడు, అప్పుడూ ఆజవాబే పిష్టపేషణం చేసి వూరు కున్నాను. మనుచరిత్రి తప్ప మఱోప్రియోగం భారతాదు లెంతవెదకినా యిప్పటికి నాకు దొరకలేదు. యెందుకు దొరకా లంటాను. ఉద్ అనేది ప్రాదుల లోది. యతి ప్రాదియతి, అప్పకవి వుదాహరించాఁడు అయినా శంకించడ మెందుకంటే ? ఆయీశంకకు నాకు జవాబే కనపడదు (నశబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ, అన్నాఁడు మురారి) చదువు వేఱు పరిశీలకత్వం వేరు అని పలుచోట్ల వ్యాఖ్యానించి వున్నాను — మఱిన్నీ యీయన (11) నీవాడ నన మను,, అని వొకచోట వాడినాఁడు - దీనిఅర్థం నీవాఁడ నని పలుకు మనుము అని, అగ్బరుచక్రివర్తి ప్రితాపమహారాణానుగూర్చి పంపే సందేశంలోది. యీవాక్యం - లోకంలో ఆయీ అర్థమందు దీన్ని యీలాగే వాడతారు గాని విడఁదీస్తే - నీవాఁడన్ - అనము - అను అని విడఁదీయవలసి వస్తుంది - అప్పుడు, అనము అనేది వ్యతిరేకార్థకోత్తమ పురుష బహువచనం కావలసి వస్తుంది. శబ్దం నిర్దుష్టమే కాని అర్థసమ న్వయం యేలాగ ? అయితే యీవాక్యం తప్పందామా ? అనడానికిన్నీ వల్లకాదు. వూఁక వుమ్మడి సమన్వయం చెప్పుకొని " లోకోక్తీనాం భవే ద్యోగో యథావచ్ఛ్రితిరంజనం, అనుకుంటే సరిపోతుందని నా ఆశయం. (అనము అన్నదాన్ని అనుము చేస్తే ఏచిక్కూ వుండదు) లోకాన్ని దిక్కుగా చూచుకోవలసిన వాక్యాలు అన్నీ యిన్నీ కావు. కవులకవిత్వా లలో వందలూ వేలూ వున్నాయి. చూపవలసి వస్తే పరిశిష్టమైన ఆయు ర్దాయం చాలదు, సరికదా ? కొంత అప్పుతెచ్చుకున్నా చాలదు. లోకంలో పుట్టి లోకంలో పెరిగి లోకులతో కలిసి మెలిసివుండి లోకులకొరకుచెప్పే కవిత్వంలో లోకమర్యాదలని పట్టి సమన్వయించుకోవడం తప్పవుతుందా ? కాదు. చూడండి యీవాక్యం.

"తలయంటెన్ సరసీరుహాక్షునకు గాంతారత్నమొక్కర్తు," యీపద్యం లోవున్న - తల - అంటు. యీరెండుమాటలూ వేఱువేఱుగావుంటే తల= శిరస్సు, అంటు=ముట్టుకొను అని మాత్రమే అర్థం వస్తుంది. రెండు పదాలూ కల్పితేనో నూనెతో శిరస్సు మర్దనం చేసింది అనేఅర్థం వస్తుంది. (సున్నం తెలుపు పసపు పచ్చనా, రెండూకలిపితే ఎఱుపు) అసలు వాక్యంలో నూనెగాని ఆముదంగాని నెయ్యిగాని వుందా ? లేదుకదా ? యీలాటి స్థలాలలో లోకానుసరణమే శరణ్యమని తెల్పడానికే ఆయీవాక్యం యెత్తుకున్నానుగాని గ్రంథకర్తలని వెక్కిరించడానికి కాదు. మఱిన్నీ యీయన. (12)"ఇరువదియైదు పుత్రికుల నిర్వదినల్వురు" అని వొకచోట అమహత్తునకు వేసే విశేషణం ( ఇరువదియైదు రూపాయీలు ) వేశారు - ఇరువదియైదుగురు అంటేనే శ్రవణసుఖంగా వుంటుంది. కాని భాగవతంలో పోతరాజుగారు యిట్టివి చాలా చేసివున్నారు. అందుచేత యేమీ అనడానికి వీలు కవపడదు. (ఇట్టి వ్యవహారంకూడా రాయలసీమ ప్రాంతంలో వుందేమో) విస్తరభీతిచే భాగవత ప్రయోగాలు వుదాహరించ లేదు. మఱిన్నీ యీయన (13) మఱచి తింకొకమాట — (మఱచితిన్ + ఇంకొక) అని వుత్తమ పురుష యికారానికి సంధి చేసినారు. దీన్నిగూర్చి సూత్రవ్యాఖ్యాతలు కొంత చర్చించారు గాని తుదకు సంధికల్పరాదనే సిద్ధాంతీకరించారు. మధ్యమపురుషేకారానికీ చేసి ఉత్తమపురుషేకారానికీ సంధి చేస్తూవుంటే అదా ? యిదా ? అనే సంశయం కలగడం తటస్థిస్తుంది. కనుకనే దీన్ని కవులు తెగించి వాడినట్లు లేదు. బొత్తిగా వాడలేదనిమాత్రం చెప్పలేను. హృదయంగమంమాత్రం కాదు. కనుక యిది వచ్చేకూర్పులో సవరించడమే యుక్తం, మఱిన్నీ యీయన వొకచోట — (14) " జన్మ చరితార్థమయ్యె " అని ప్రయోగించారు." జన్మము కృతార్థమయ్యె " అని అనలేక కాదు ఆలా ప్రయోగిస్తా; రూపద్వయ (జన్మ - జన్మము) సత్తజన్మ శబ్దానికి వుంటేనే బాగుంటుందనియ్యేవే అని తోస్తుంది. చిన్నయ్యసూరి జన్మకర్మశబ్దాలకు ప్రత్యేకించి నిషేధించినమాట యీయనకు తెలియదా ?

తెలుసును. తెలిసిన్నీ ప్రయోగించడానికి కారణం లోకవాడుకే. లోకంలో వాడుక వుందాయె శాస్త్రంలో గణపాఠం (చరితాది) ఆధారంవుందాయె. సూరిగారు దీన్ని యెందుకు నిషేధించాలి. దీనిమాటకేం కర్మశబ్దానికి రూపద్వయసత్తలేకపోవడంవల్ల వచ్చే హాని అంతా యింతా కాదు. కొన్నిచోట్ల మువర్ణకంతో కల్పితే పరమాసహ్యంగా వుంటుంది.

(1) "వాడు తండ్రికి కర్మ చేస్తున్నాడు".

(2) ఆధాతువులో కర్తయేది కర్మయేది.

ఆ యీ స్థలాలలో మువర్ణకం చేరిస్తే హృదయంగమం కాదు. ఆ యీ విషయం పోతరాజునుగూర్చిన వ్యాసంలో విస్తరించినట్లు జ్ఞాపకం. అయితే సూరికి యీమాత్రం తెలియదా? అంటారేమో వినండి చెపుతాను. వ్యాకరణాలమీద వ్యాఖ్యానాలు వ్రాసే విద్వాంసులు అంతో యింతో కవులుకూడా అయి వున్నా వారు కవికష్టాన్ని గాని, పదసారస్యాన్నిగాని గమనించడంలో చాలా వెనక పడతారనే నేను అనుకుంటాను. (అట్టివారు కవులైనా కానివారిలోనే జమ) కొన్నిచోట్ల ప్రయోగబాహుళ్యాన్ని పట్టి కలం నడుపుతారు. వారు కొన్నిచోట్ల నిక్కచ్చిగా శాస్త్రానికే ప్రధానం యిస్తారు. దీన్ని ఋజువు చేయవలసివస్తే కొన్ని తావుల గ్రంథం పెరుగుతుంది. భట్టోజీదీక్షితులు యెందతో భాష్యవ్యాఖ్యాతలు (సుమారు నూఱుగురేనా వుంటారు) వ్యాకరణ శాస్త్రంలో గ్రంథకర్తగా ప్రసిద్ధికెక్కిన (విద్యారణ్యకర్త) మాధవాచార్యులు, దండి (కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ న సంశయః) మహాకవి, తార్కిక మహాపండితలోకం సరేసరి, యిందఱు సెనగపప్పులాగు వాడిన పద్యంలో కాదు వచనాలలో కాలీన శబ్దాన్ని అపభ్రంశమనడం యెందుకు వచ్చింది - పోనీ సూత్రాధారం లేక అలా అనవలిసి వచ్చిందనుకుందామా? (అపాణినీయమంటే బాగుండేది) ఆపద్ధతిని-ప్రేంఖోళ మొదలైన శబ్దాలకు ప్రకృతిప్రత్యయాలు రెండున్నా కూడా వూహించుకోమనడ మెందుకు? వాట్లనుకూడా దీనితోపాటు అపభ్రంశాలని తోసిరా జనరాదా? ఆయీ శంకకు సమాధానం భాష్యకారులు

యేదో సందర్భంలో వక్కాణించిన-“స్వాతంత్రేచ్ఛస్యమునే ర్నియోక్తు మశ క్యత్వాత్ ” అనేదే. ( దీక్షితాదులు మునితుల్యులే ) సంస్కృతభాషలో నుంచి కాలీన శబ్దాన్ని తొలఁగించాలంటే అధమం నూఱుగురు వ్యాఖ్యాత లనేనా నెట్టి బహిష్కరించాలి. ఋషి. వ్యాసుఁడు భారతంలో వాడి వున్నాఁడు, ఆయనకి వ్యాకరణం (పాణినీయం) రాదుగదా ! మఱోవ్యాక రణం వచ్చి వుంటుంది. వారు వాడినా దాన్ని మనం వాడరాదు. వాడితే యేదో ప్రత్యవాయం వస్తుందనేవారు కొందఱు; భవతు. దీన్ని మఱొకప్పుడు చూచుకుందాం. జన్మశబ్దంమాటకేం గాని కర్మశబ్దానికి రూపద్వయం (కర్మ - కర్మము) అని వుండితీరాలి. ఆలా వుండకపోతే భాషకు చాలా నష్టం. స్వల్పంలో అర్థం భేదించే స్వభావం ప్రతీభాషకూ వుంటుంది.

(1) రాజుగా రున్నారా ? - రాజావా రున్నారా ? యీరెండింటి లోనూ రెండోప్రయోగం గౌరవాపాదకం.

(2) అమ్మగారు - అమ్మవారు - అయ్యగారు - అయ్యవారు, ఆయీ ప్రయోగాలలో వుండే తారతమ్యం వివరించ నక్కఱలేదు. ప్రస్తుతం జన్మశబ్దం మువర్ణవిరహితంగా ప్రయోగించడం తప్పుకా దనియ్యేవే. మఱిన్నీ యీయన (15) “వాసర వార వత్సరములు ” అనే ద్వంద్వంలో వారశబ్దాన్ని లోకంలో వాడుకొనే సప్తదిన పరిమితకాలపరంగా వాడి నారు. అమరకారుడు దినవాచకాలల్లోకూడా వారశబ్దాన్ని చేర్చలేదు. పర్యాయపరంగా ప్రయోగాలు (వారాన్ త్రీనభిషుణ్వతే) దొరుకుతాయి. యేవాచస్పత్యంలోనేనా దినపరంగాకూడా వుంటే వుందేమోగాని (శ-ర-లో వుందిగాని అది గీర్వాణంవారు పట్టరు) సప్తదినవాచకంగా తెలుగుదేశం లోనే వాడుతూన్నట్టు తోస్తుంది. (యిది యింకా విచార్యం) మొత్తం వారాలు యేడు కావడాన్ని బట్టి యీవ్యవహారం వచ్చినట్టు తోస్తుంది. ఆదివారం సోమవారం వగయిరాలలో రోజుపరంగా కనపడుతూ - వుంది. ఆది + వారం అని కర్మధారయ చేసుకోవాలి. తక్కిన సోమవారాదులు ఆయాగ్రహాల పేళ్ళతో సంబంధించి వున్నాయి. షష్ఠీతత్పురుషలు సంధ్యా

వందనంలో భానువాసరే అని వాసరపదంతో చెప్పుకుంటారు. ఆదివార శబ్దం సంస్కృతమే అయినా వారాలలో మొట్టమొదటిది అనే అర్థం కర్మ ధారయ సమాసద్వారా వస్తూవున్ననూ అభిమానదేవత సూర్యుడు. దానిలో ప్రతిఫలించక పోవడంచేత కాబోలు కర్మపరులు ఆదివారే అని సంక ల్పంలో చెప్పుకోవడం లేదు. అంతమాత్రంచేత ఆశబ్దం దుష్టంకాదు. సంస్కృతశబ్దాలు కొన్ని తెలుగులోకి వచ్చి అన్యార్థాన్ని సంపాదించు కున్నట్టున్నూ కనపడుతుంది. అట్టిశబ్దాలలో నిజశబ్దం వొకటిగాతోస్తుంది. సంస్కృతంలో దీనికి సత్యము అనే అర్థం లేదుగాని లాక్షణికంగా వ్యాఖ్యా నిస్తే సత్యార్థకత్వం వస్తుందని నాకు తోస్తుంది. భవతు. అది యిప్పుడు ప్రస్తుతం కాదు. శుద్ధసంస్కృతరూపంగా వుండికూడా అర్థిశబ్దం, సంస్కృ తంలో వున్న అర్థాన్ని వదులుకొని మరోఅర్థాన్ని యిస్తూవుంది. (దీనికి శ-ర-చూ) కేవలమూ శుభసామాన్యవాచకమైన శోభనపదం గర్భాధాన (శుభవిశేష) వాచకం కావడాన్ని గూర్చి లోగడ కొన్ని వ్యాసాలలో వివరించే వున్నాను. పరిశుద్ధమైన దామోదరశబ్దం యెవరు పుణ్యంగట్టు కున్నారో శుద్ధదరిద్రుణ్ణి చెప్పడం మొదలెట్టింది. "సామ్రాజ్యవధూటి చేరజనునే నిర్భాగ్యదామోదరున్." 'దామ - ఉదరే యస్యసః' అనే వ్యుత్పత్త్యర్థం యెక్కడికో పోయింది. యోగాద్రూఢి ర్బలీయసీ సముదా యార్థం ఆదేశమయింది. భాషాకవులకు ఆయావ్యవహారిక పదాలు దొర లడం తప్పదు. దేశభాషాకవులకేకాదు, దేవభాషా కవులకు కూడా తత్తద్దేశ పదాలు (ఇంగాలం వగైరా) దొర్లినట్టు అక్కడక్కడ వ్యాఖ్యాతలు తెల్పుతూ వచ్చారు. ప్రస్తుత గ్రంథకర్త తురుష్కభాషా పదాలు చాలావాడ వలసి వచ్చింది. ఆయారాజుల నామధేయాలు దేశాలపేళ్లు పట్టణాలపేళ్లు స్త్రీలపేళ్లు సమస్తమూ ఆ భాషలోనే వున్నాయి. వాట్లని మార్చడం యెట్లా? కొన్ని సంస్కృతభాషా సంపర్కం కలిగివున్నా (తేజసింగు వగైరా) అవిన్నీ అపభ్రంశంగానే వున్నాయి. అట్టి శబ్దాలవిషయంలో గ్రంథకర్త బాధ్యుడు కాడని విజ్ఞులెఱిగినదే. ఒకచోట. "సైన్యబల మల్పమనే కాని,"

అని క్త్వార్థక సంధి కనపడుతూవుంది. అక్కడ "అనికాని" అన్నా అర్థానికి భంగం లేదు. కాని ఎకారఘటితంలో కొంతసొగసు వుంది. కాబట్టి తీరికూర్చొని బహుమహాకవి సమ్మతమైనదాన్ని దిద్దుకోనక్కర లేదనే నా ఆశయం. యెన్నో లోకోక్తులు సమయోచితంగా రసోచితంగా యీయన వాడివున్నాడు. అందులో కొన్ని గోదావరీ మండలంవారికి అపరిచితాలు. అట్టిది ఒకటి చూపుతాను. యీ లోకోక్తికి 'పాండవబీడు' మాప్రాంతంలో — "అయ్యవార్లగారి నట్టిల్లు" పర్యాయంగా వుంటుం దేమో? అనుకుంటాను. ఇది వాడినచోటు — "వట్టి 'పాండవబీడు' మేవాడసీమ." సందర్భాన్ని బట్టి చూస్తే శుద్ధదరిద్రప్రదేశ మనియ్యేవే తేల్తూవుంది. యింకాకొన్ని యీలాటివే వున్నాయి. ఒకచోట వ్యావహారిక పదం, "ఒక వెయికండ్లఁ జూడవలె" అని వాడఁబడింది. యిదికూడా లోకోక్తికి అనుకరణమేగాని ప్రమాదం గాదు. 'కన్నుల' అని సవ రిస్తే అందంచెడుతుంది. అనుధాతువు లేకుండాకూడా అనుకరించడాన్ని గూర్చి ప్రౌఢవ్యాకరణం చూచుకోండి. మఱిన్నీ - "ఎండక న్నెఱుఁగక యుండి యింద్రాణి చాయను దేవభోగమ్ము లనుభవింప" అని యొక రాణివాసాన్నిగూర్చి యీయన శచీదేవితో పోల్చి వర్ణించినాఁడు. వేద పరిభాషలో ఇంద్రాణి అంటే? విధవరాలు అనే అర్థం వుందనిచెప్పి దీన్ని అశ్లీలంగా శంకించేవారు లేకపోలేదు. (యీకారణంచేతే వాకరు శక్రాణి అని ప్రయోగించారు.) కాని అట్టి వారికోసం ఆయీ శబ్దం భాషలోన్నుంచి తొలగించడానికి యే సహృదయుఁడున్నూ అంగీకరించఁడు. గనుక విస్త రించ నక్కఱలేదు. యీ శంకలు నిస్సారాలు, ఇది అశ్లీలా పాదకమే అయితే (దీనికోసం వ్యాకరణసూత్రం యెందుకో) అసలు వేదంలో ఇంద్రాణీ వాఽవిధవా అన్న వాక్యంలో అవిధవా అని పదచ్ఛేదం గాని, విధవా అని కాదు. యీ విధంగా అశ్లీలాలు ఆపాదించే యెడల సూర్య వాచకమైన - "విరోచన" శబ్దంకూడా భాషలోన్నుంచి తొలగించవలసి వస్తుంది. విరేచనార్థమందు పామరులు విరోచన శబ్దాన్ని వాడతారు. పామ

రుల తెలివిలోపాన్ని బట్టి పండితులను ఆక్షేపించడంకన్న పామరత్వం వుండదని వ్రాయాలా? శాంతం పాపమ్. యేవో యీలా కెక్కరిస్తూ వుంటే యీ కవికేకాదు, భారతకవులకే బోలెఁడు దోషాలు వుద్ఘాటించవచ్చు నని చిరకాలంనాఁడే 'అపూర్వకవితావివేచనం'లో వ్యాఖ్యానించడం పాఠక లోకం యెఱిగిందే. "యెఱిగిన దానిని మఱువ కనుష్ఠించునది." అనే నన్నయ్యగారి ప్రయోగం "అనుష్ఠించు" వైదిక పరిభాషను పట్టి అశ్లీలా ర్థాన్నే యిస్తుంది. ఇంకో విశేషం - ఒకదేశంలోనే ఒక ప్రాంతంవారి మాటలు వేరొక ప్రాంతంవారికి అశ్లీలాపాదకాలుగా వుంటాయి. (ముందఱికి దొబ్బె దండ్రికి మొ్రక్కుమనుచు) యిందులో దొబ్బు కొన్ని ప్రాంతాలలో అశ్లీలం. యింతదాఁకా యెందుకు? 'లేచు' కొన్ని ప్రాంతాలలో (వాడు లేచాఁడు) మృతార్థకం. ఆట్టే పరిశీలిస్తే ఈ అశ్లీల ప్రకరణం లాక్షణికు లెందుకు ప్రారంభించారో అనిపిస్తుంది. సంస్కృతంలో సాధన శబ్దం అశ్లీలార్థకం. ఎందుకు దాని కట్టి దుర్యోగం పట్టిందో? తెలిసినవారు కొద్దిమంది మాత్రమే వుంటారు. ఇక యీ చర్చనుండి విరమిస్తాను. స్థాలీపులాకంగా యీ రాజశేఖరకవి కవిత్వాన్నిగూర్చి కొన్ని మాటలు వ్రాశాను. (ఇంకా 'అన్నరో' వగైరా ప్రయోగాలను గూర్చి చర్చించాలి. మఱొకప్పుడు చూదాం.) ఈయన దేశభక్తిపరవశుడే కాని కులాచారాలయందు పట్టుదలకలవాడు. యీ విషయం కవిత్వంలో సర్వత్రా గోచరిస్తుంది. సంస్కృతభాషలోకూడా మంచి ప్రవేశం కనపడుతుంది. తెల్గుమెట్రిక్యులేషన్ వఱకూ చదివిన పాఠశాలలోనే అభ్యసించి వుండాలి. కవి కాబోయేవాఁ డెవడున్నూ భాషాప్రవేశానికి విశేషించి గురువు నపేక్షించడు. శాస్త్రాభ్యాసం కావలసివస్తేనే గురువుల నపేక్షించడం. కాళిదాసంతవాడుకూడా ప్రామాణ్యవాదం చదువుకొనేటప్పుడు "నమః ప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే" అన్నాఁడని శాస్త్రప్రాశస్త్యవాదులు చెపుతూ వుంటారు. సంస్కృతంలోగాని తెలుగులోగాని (యెక్కడోతప్ప) శాస్త్ర విరుద్ధ ప్రయోగాలు లేని యీయన కవిత్వంచూస్తే ఉభయభాషాసాహి

త్యంలో ఈనాఁటి కవులలో యీయనకు మంచి స్థానమే వస్తుందని నాకు తోస్తుంది. సంస్కృతానికి చాలినంత వ్యాకరణం వుంది గనక దాన్ని అభ్యసించి రచనసాగిస్తే ప్రమాదవశంచేతనైతే తప్ప తప్పులు దొర్లవుగాని తెలుక్కి అలా కాదు. యెంత వ్యాకరణం చదివినా ప్రయోజనంలేదు. వ్యావహారికభాష కావడంచేత ఎక్కడో యేదో నీహారలేశం దొర్లుతూనే ఉంటుంది. దీనికి లక్ష్యజ్ఞానమే యెక్కువ అవసరం. అది లేనివారిగతి శోచ్యంగా ఉంటుంది. భారతంలోనే వ్యావహారిక ప్రయోగాలు కనపడతాయంటే, యితర గ్రంథాలమాట చెప్పేదేమిటి ? ఆ యీవిషయం యితర వ్యాసాలలో వ్యాఖ్యాంచిందే కనక యిక్కడ విస్తరించేదిలేదు. చటుక్కున 'తెలుగేకాదా ?' అంటూవుంటారు. సంస్కృతపండితులు. సంస్కృతంలో వ్యాఖ్యాత కావడానికిగాని, రచయిత కావడానికిగాని యెంత పరిశ్రమ చేయాలో అంతకు పదిరెట్లయినా యెక్కువ పరిశ్రమచేస్తేనే కాని తెలుగులో వ్యాఖ్యాత కాలేడు.

తే. గీ. తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుబెకాని
సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁజాలు
దాని, కిద్దానికో రెంటఁదగులవలయు.

అని వ్రాయడం చాలాదూరం ఆలోచించి వ్రాసిందే. "ఆంధ్రభాషామయం కావ్య మయోమయ విభూషణమ్" అని సంస్కృతప్పండితులు తత్త్వం తెలియకుండా ఆక్షేపిస్తే "గీర్వాణారణ్యసంచారి విద్వన్మత్తేభ శృంఖలమ్" అని జవాబు చెప్పడం యెంతో సమంజసంగా (తిడితే గుద్దినట్టు) వుంది, తెలుగే అని యీసడించడం తేలికే. దాన్ని విమర్శించి నిగ్గు తేల్చవలసివస్తే తలప్రాణం తోఁకకు వస్తుంది. యేదో అల్లిక అల్లి పాఱవేయవచ్చును గాని వ్యాఖ్యానించి నిగ్గు తేల్చడం పయిపయిన లేదు - యెందఱికో ఆ యీ కష్టసుఖాలు తెలియక యెందఱినో అవమానించారు. కీ. శే. గిడుగుపంతులుగారు జీవితాన్ని యావత్తూ ధారపోసి అనిష్టైతు

కాక్షేపణల తత్త్వాన్ని తేల్చి నిష్కళంకమైన కీర్తిని సంపాదించుకున్నారు. నిజమైన వ్యాఖ్యానశక్తి ఆ బ్రాహ్మడికేవుంది. వొక్క క్షణమూ కూడా వ్యర్థంచేయకుండా జీవితాన్ని భాషకోసం వ్యయించిన నిష్కల్మష హృదయుడు రామమూర్తి పంతులుగారే. ఆయన యెవరినిగాని వృథాగా ఆక్షేపించినట్లు లేదు. ఆక్షేపిస్తేనో? దానికి జవాబు చెప్పినవారున్నూ లేరు. ఆయీ రాణాచరిత్రం ఆయన చూచివుంటే చాలా సంతోషించేవారు. యెంతేనా వ్రాసేవారుకూడాను. నాకు తెలిసినంతలో విమర్శించాను. గ్రంథ కర్త నా చూపిన కొలదిలోపాలు దురుద్దేశపూర్వకములుగా భావించఁడని తలుస్తాను. నాకున్నూ ఆయనకున్నూ వ్యక్తిగత ద్వేషం లేశమున్నూ లేదు. ఉన్నప్పంటికీ దాన్ని కవిత్వ విమర్శనంలో వినియోగపరచేదో నా ప్రకృతి అట్టిదికాదో లోకానికి తెలుసును. నీహారలేశాలకేమి, అవి లేనికవి యెవడు? యీనాటి ధన్యకవులలో యీయన చిటికెనవేలిమీదకి వచ్చేవాడు గాని అల్లాటప్పావాడుకాడు.

> శ్లో. కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః,
> తరుః ప్రసూతే పుష్పాణి మరు ద్వహతి సౌరభమ్.



## అ భ్య ను జ్ఞ

(ది ?—8—1941 సంꣲర త్రిలింగ సన్మానసంచికనుండి)

కాళిదాసు కుమార సంభవములో పంచమ స్సర్గలో " త్రియంబకం సంయమినందదర్శ " అని ప్రయోగించివున్నాడు. కనుక సంస్కృత కవులే కాదు. తెలుగు కవులేకాదు. అందఱూ త్రియంబక (త్ర్యంబక శబ్దానికి పర్యాయంగా ) శబ్దాన్నినిరాఘాటంగా వాడుకోవడానికి అభ్యనుజ్ఞ యిచ్చి నట్టయిందనీ నవకవులు తెలుసుకోవాలి. దీన్నిగురించి యీ మధ్యనే " త్రియంబక శబ్దవిచార " మనే వ్యాసంలో (నాళం కృష్ణారావుగారికి

యిచ్చే సంచికకు యిచ్చినదానిలో) విస్తరించడంచేత యిక్కడ చాలా సంకుచితంగా వ్రాయడమైనది. కాళిదాసుకు ఆధారం "త్రియంబకంయ జామహే" అనే వైదిక ప్రయోగమున్నూ, తదనుసారంగా పుట్టిన స్కాందాది పురాణస్థాలు, "త్రియంబకః పాతుతృతీయయా మే" మొదలయినవిన్నీ. అవి ఆర్షాలుకదా ? అవి లౌకిక కవులకు అనుసరణీయాలవుతాయా ? అనేశంకకు సమాధానంకూడా యితరత్రా యీయబడింది. దీనితో పాటుగానే 'కృత్రిమపుత్రిక' శబ్దంకూడ చూచుకోండి. పుత్రికాశబ్దం ఆకారాన్త స్త్రీలింగంగా వుండవలసివున్నా కాళిదాసు కుమారసంభవ ప్రథమసర్గలో 'కృత్రిమపుత్రికైశ్చ' అని ప్రయోగించడంచేత యీప్రయోగంకూడా "శంఖునపోసినతీర్థం" వంటిదయింది. ఆశ్లోకంలో "కృత్రిమపుత్రికాభిః" అన్నప్పటికీ కాళిదాసుకు క్షతిలేదు. లేకపోయినా 'పుత్రికైః' అని ప్రయోగించడానికికారణం లలితామాహాత్మ్యములో వుండేప్రయోగమే లలితోపాఖ్యానంలో నేనుచూచి యాభైయేళ్లు కావచ్చింది. ప్రస్తుతం ఆగ్రన్థం నాదగ్గిఱ లేక ఆశ్లోకం వుదాహరించలేదు. కావలసినవారు ఆగ్రంథంలో చూచుకోండి. క్షతిలేనప్పటికిన్నీ "పాంచాలికాపుత్రికాస్యాద్వస్త్రదంతాదిభిఃకృతా." అని అమరనిఘంటుఘోషిస్తూన్నప్పటికిన్నీ (అమరుడుకాళిదాసుకన్న నవీనుడనేపక్షంలో మరివకకోశంలో యీశబ్దంవుండకపోదు) వీట్లనన్నిటినీ తోసిరాజనీ కాళిదాసు పుంలింగంగానో నపుంసకలింగంగానో ప్రయోగించడానిక్కారణం లలితోపాఖ్యానప్రయోగమే అనిచెప్పకతప్పదు. నామవాచకాలు. ఆర్షాలైనప్పటికీ ఆయాఋషులేలావాడివున్నారో ఆలావాడడంలోనే స్వారస్యవుంది. గాని అన్యథాకరించడంలో స్వారస్యంలేదని కాళిదాసుతాత్పర్యం అయివుంటుందని దీన్నిబట్టిమనం గ్రహించుకోవలసివుంటుంది. నామవాచకాలు దిద్దివాడుకోవలసివచ్చేయెడల మారుతశబ్దాన్ని మారుదశబ్దంగా మార్చివాడవలసివుంటుందనీ ఆవ్యుత్పత్తికి (మా + రుద = శోకింపకుము.) సంబంధించిన యితిహాసంవల్ల స్పష్టపడుతుంది. ఆటబొమ్మల్ని చెప్పే కృత్రిమ పుత్రికశబ్దంమాత్రమే హ్రస్వాంతంగా ప్రయోగించడం కాళిదాసు

కుగాని వేఱొక మహాకవికిగాని అభిమతంగాని వ్రుత్తివాచకంగా వుండే వ్రుత్తికాశబ్ద విషయములో దీర్ఘాంతంగానే వుండడం యిష్టమనీ ఆ యా ప్రయోగాలవల్లనే స్పష్టపడుతుంది. యీ మధ్య భారతిలో వకరు "ముగ్ధి మాదిష్యమనిజ్ మృగ్యః" అనే ఆలంకారిక వామనుని సూత్రాన్ని వుదాహరించి యేదో కొంత చర్చించి శ్రీనాధాదుల గ్రన్థాలనుంచి ప్రౌఢిమ, లోనైన ప్రయోగాలు కొన్ని యిమనిజంతాలు వుదాహరించి - "ప్రౌఢియే కాని 'ప్రౌఢిమ' సంస్కృత కావ్యములలో బ్రచుర ప్రచారమున గానరాదు" అంటూ వ్రాసి వూరుకొన్నారు. ఆయీ వ్యాసము వ్రాసిన చౌదరీగారి పరిశీలనకున్నూ, మహాకవి ప్రయోగాలయందువున్న గౌరవానికిన్నీ, నా సంతోషాన్ని ప్రకటిస్తూ (చట్టన బుడబుడక్కల ప్రయోగాలంటూ అనడానికేం ఎవరువడితే వారనవచ్చునుగదా) "ప్రౌఢిమ"కు నేను సంస్కృత కావ్యాలలో చూచిన ప్రయోగాన్నికూడా చూపుతూ వున్నాను. "ఇంధానే భవపీతి హోత్రనివహే కర్మౌఘచండానిల ప్రౌఢిమ్నా బహుళీకృతే (మూకపంచశతి, మందస్మిత స్తబకం ౯౪)" యింకా నేను ఆ యీ ప్రౌఢిమ ప్రయోగాన్ని సంస్కృత కవుల కవిత్వంలోనే చూచి వున్నాను. గాని ప్రస్తుతం జ్ఞప్తిలోవున్నది యిది మాత్రమే అవడంచేత దీన్నే యిచ్చి చౌదరీగారి పరిశీలకత్వాన్ని మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను. పూర్వ సంస్కృత మహాకవులు వాడివుండడంచేతనే చౌదరీగారుదాహరించిన శ్రీనాధ, పింగళి, కృష్ణరాయ, ప్రభృతి, మహాకవులు వాడిరనియు - "సంస్కృతము మాట యెటులయినను" అని సంశయింప నక్కరలేదనియు శ్రీ చౌదరిగారిని హెచ్చరించుచు నిప్పటి బ్రాహ్మణ విమర్శకులలో నెందఱి కన్ననో చౌదరిగారి విమర్శనా ధోరణి యనేక విధాల శ్లాఘనీయమని కూడా మనఃపూర్వకముగా అభినందిస్తూన్నాను. నామరూపాలుగల యే మహాకవిగాని, యేదేనా ప్రయోగిస్తే ఆ అపురూప ప్రయోగం ఆ మహాకవికి పూర్వమందువుండే యేమహాకవి గ్రన్థంలోనో వుండి తీరుతుందని మనం తెలుసుకోవాలి. కాని ఆ యా ప్రయోగాలు

వెదకడం మాత్రం అందరికీ సాధ్యంకాదు. ఆ యీపని చేతకాకే కొందఱు వృథాగా ఆ ప్రయోగంలేదు ఈ ప్రయోగంలేదంటూ (వూరికే అనడం కాదు సప్రతిజ్ఞంగా కూడాను) పలికి లేనిపోనిచిక్కులోపడి దానికోసం జీవితాన్నంతనూ ఖర్చుపెట్టవలసినవారై కూడా కృతార్థులు కాకపోవడం తటస్థపడుతూ వుంటుంది. ('కలవు, లేవని పెనగ శక్యంబె ! భారతాదులను లేనిపదములు నవని గలవె;' దేవీభాగవతము) చౌదరిగారు వ్రాసే ధోరణి లేనిపోని ప్రతిజ్ఞలతో చేరినది కాదు. అందుచేత ఆయనకోసం యీవ్యాసంలో యిన్ని వాక్యాలు వ్రాయవలసి వచ్చింది. యీ అవాంతరపు వ్రాతవల్ల తేలిన సారాంశం ఆలంకారిక వామనుడు పనికిరాదన్నప్పటికీ "ప్రౌఢిమ" మొదలయిన ఇమనిజంతాలు మహాకవి ప్రయోగ సిద్ధాలై "శంఖున బోసిన తీర్థాలు"గా పరిణమించడంచేత యిప్పటి కవులందఱూ ప్రయోగించు కోవచ్చుననీ అభ్యనుజ్ఞ సంపాదించుకొన్నట్టయింద నియ్యేవే. సంస్కృత కవుల కవిత్వంలో కోమలీ - అని స్త్రీవాచకంగా వున్న పదాన్ని యెక్కడా నేను చూడలేదు. సుమారు 55 ఏళ్ళనుంచి నేను ఆ యీ లక్ష్యాలు వెదకే వుద్యోగంలో పనిచేస్తూన్నాను. యిప్పటికింకా జీతము బత్తెములేని యీ నౌకరీనుండి తొలగింపబడనే లేదని పత్రికా పాఠకులందఱూ ఎఱిగిందే. యీమధ్యనే వొకరు నాయందు దయపుట్టి యీ వుద్యోగాన్నుంచి విర మించవలసిందంటూ ఎంతో గౌరవం కనపరుస్తూ యెవరిపేరనో (నేరుగా నన్ను వుద్దేశించలేదు) బహిరంగలేఖ వ్రాస్తూ సూచించారు. అది చూచి నేను 'బ్రతుకు జీవుడా' అని బ్రహ్మానందపడ్డాను. కాని ఆయన సూచన బొత్తిగా ఆమోదించ తగినది కాదనిన్నీ, అవిచారమూలకమనిన్నీ, దాని వెనువెంబడినే కొన్ని వాక్యాలు కనపడ్డాయి. అందుచేత మళ్ళా యేదో కొంత వ్రాయవలసి వస్తూవుంది. తత్తథాస్తాం, కోమలీ శబ్దాన్నిగూర్చి వ్రాస్తూవున్నాను. ఆ యీ శబ్దం తెలుగు భారతంలో యెక్కడపడితే అక్కడే కనపడుతుంది. శ—ర—నిఘంటులో దీన్ని సంస్కృతశబ్దమని వ్రాయక పై, అని తద్భవాలలో చేర్చాడు. దీన్నిబట్టి బహుగ్రిద్ధ దృష్టగా

వున్న ఆ నిఘంటుకర్తకుకూడా సంస్కృతంలో దీనికి ప్రయోగం దొరకనే లేదని స్పష్టమే. మళ్లా — "కోమల" శబ్దాన్ని ఎత్తుకొని —సం—అనియే వ్రాశాడు. శ—ర—నిఘంటుకర్త అకారాన్తమయినపుడు సంస్కృతం కావడ మేమిటో యీకారాన్తమయినంతలో తెలుగవడమేమిటో అనే శంకకు తృప్తికరమయిన జవాబు కనపడదు. నామట్టుకు "కోమలీ" అని సంస్కృతంలో యెక్కడో వుంటుందనిన్నీ దాన్ని బట్టే నన్నయాదులు తెలుగులో — కోమలి పదం ప్రయోగించి వుంటారనే అనుమానం యిప్ప టికీ వదలనేలేదు. ఒకరికి కనపడని ప్రయోగం మరివొకరికి కనపడడం కలదు. యీ ప్రయోగాలు వెతకడం "పత్తిపని" అంటే? చాలా శ్రద్ధతో నిర్వర్తించ తగ్గది. యీమాట శ్రద్ధకలిగి పరిశీలించే ప్రయోగ ద్రష్టలకు మాత్రమే సంబంధించేది, కొందతో? అబాలగోపాలమూ యెఱిగిన రామశబ్దంకూడ లేదని వాదించేవారుగా వుంటారు. (తేభ్యో మహద్భ్యో నమః — తేకేన జానీమహే,) వారిని "అయ్యా? వాల్మీకి రామాయణంలో వుంది." చూడండి అని హెచ్చరిస్తే, వారు—ఆప్రయోగం "రామోరాజీవలోచనః" అనేదేకాదా? అది నేనున్నూ యెఱుగుదును. అది ఆర్షం. కనక మనం ప్రయోగించడానికి అర్హంం కాదంటారు — ఋషి ప్రయోగించినదల్లా ఆర్షమే అయినా — "ఆర్షత్వాత్సాధుః" అనే వ్యాఖ్యా తల వాక్యంలోవుండే ఆర్షపదం కేవలయౌగికం కాదు. (పంకజాదివత్) యోగరూఢం. శాస్త్రవిరుద్ధమై ఋషిప్రయుక్తమైనప్పుడే ఆపదం వుప యోగపడుతుంది గాని "పిడుక్కీ బియ్యానికి, వకటే మంత్రం" గా వుపయోగపడదు, యీవిశేషం ఏవకరిద్దఱికోతప్ప తక్కిన విమర్శకులంద ఱికీ తెలిసే వుంటుంది. గనుక విస్తరించేది లేదు. ఆర్షశబ్దానికి వుదాహర ణాలు ఏలాటివంటే ? :— 1. భద్రంకరణేభిః, 2. బ్రాహ్మణాసః, పితర స్సోమ్యాసః, ఆయీ ప్రయోగద్వయం కేవలం వైదికం, ఋషిర్వేదః తత్సంబంధి ఆర్షం, యిక ఋషిప్రయోగాలు గృహ్యా, వగైరా ల్యబం తాలున్నూ మఱికొన్నిన్నీ — ఇవి తెలుగు కవులను బాధించేవి కానేకావు,

"లక్ష్మణో లక్ష్మివర్ధనః" యీలాటివి తెలుగుకవులనుకూడా బాధిస్తాయి- లక్ష్మిశబ్దము స్త్రీప్రత్యయాన్తం కాని, స్త్రీలింగం. స్త్రీప్రత్యయాన్తం కూడా వుందని యేవ్యాఖ్యాతో వ్రాసినట్లు జ్ఞాపకం. సంస్కృతంలో ప్రయోగించుకొనేవారికి గౌరీ శబ్దంకంటె కొంచెం భిన్నమని తెలుసుకో వలసి వుంటుంది. గాని తెలుగు వారికి ఆశబ్ద మెట్టిదో యిదీ అట్టిదే, వాల్మీకి యీకారాన్తంగా లేక ఇకారాన్తం (హ్రస్వాన్తం) గా కూడా ప్రయోగించడం ఆర్షమనుకొని అస్మదాదులు "లక్ష్మి" అని సమాస మధ్యములో వాడుకోగూడదనుకొనేవారికి కౌముదీ వ్యాఖ్యానం (బహుశః తత్త్వబోధినే అవుతుంది. అది తెలుగులిపి, మైసూరులో యేభైయేళ్ళకు పూర్వం అచ్చుపడ్డది) లో వున్నపంక్తులు చూచుకుంటే సంశయం నివర్తి స్తుంది; నావద్ద ఆపుస్తకం వుండేది గాని సమయానికి దాన్ని యెవరో యెరువుపట్టుకు వెళ్ళడంచేత లక్ష్మిశబ్ద సాధుత్వానికి సంబంధించిన అక్ష రాలు యిక్కడ వుదాహరించ లేకపోయినాను. కావలసినవారు దానిలో చూచుకోండి. ప్రస్తుతం వక్తవ్యాంశం యేమిటంటే, ఋషిప్రోక్త గ్రన్థా లలో వున్నంతమాత్రంచేత యావత్తు ఆర్షమనుకోకూడదనిన్నీ దాన్ని గురించి యింతగా పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవలసి వుంటుందని య్యేవే. ఆలాగే కాకపోతే రామశబ్దంకూడా యిటీవలికవులకు వాడుకోవ డానికి అధికారం లేకపోవలసే వస్తుందనీ లోగడ తెలిపేవున్నాను. సంస్కృతశబ్దాలనుగూర్చి కొన్నిటికి పెద్దలఅభ్యనుజ్ఞను తెల్పడం కొంచం జరిగింది. కనక యిక తెలుగుశబ్దాలనుగూర్చి కూడా సూత్రప్రాయంగా ముచ్చటించుకుందాం. ముందుగా గుప్తార్థప్రకాశికనుంచి వక వాక్యాన్ని వుదాహరించి మరీ చర్చించుకుంటే బాగుంటుంది. "చేసికొని, చదివి కొని ఇత్యాదిక్త్వాంతములకు బదులుగా చేసుక — చదువక — ఇత్యాది క్త్వాప్రత్యయాంత సంగ్రహరూపంబు, లనన్తామాత్య, తిమ్మకవ్యప్పక వ్యాది లాక్షణికులచే దమగ్రన్థంబులయందు వాడంబడినవి. రూపంబు సూత్రంబున నిరూపింపబడలేదు," అని వొకవాక్యం వ్రాసి అనన్తా

మాత్స్యడు మొదలు అప్పకవి వరకు లక్షణగ్రన్థక ర్తల గ్రన్థాలనుంచి 25 వుదాహరణలుచూపి – "అప్రతిషిద్ధ మనుమతం భవతి" గా తమసమ్మతిని తెలిపివున్నారు కల్లూరి మహాశయులు. యీవిద్వన్మౌళి పాణినీయశాస్త్రపారంగతు డగుటచేత ఆశాస్త్రమర్యాదనుబట్టి లాక్షణిక ప్రవృత్తి సూత్రంతో పాటు ప్రవర్తకం అయితీరుతుంది గదా. అని యెఱిగినవాడవడంచేత కిక్కురుమనకుండా వూరుకొని యిష్టంవుండి యేకవేనా ప్రయోగించివుంటే యెవరూ ఆక్షేపించకూడదు అన్నఅంశాన్ని స్పష్టపఱిచినప్పటికీ, ఆయీ ప్రయోగాలు తప్పని (బుడబుడక్క) ఆక్షేపించి జాబితాలు పెంచుకొనేవారి అభిజ్ఞత్వాన్ని యెంత అభినందించినా యింకాయింకా అభినందించవలసే వుంటుందిగదా! కవిత్రయంవారు వాడని మాట సత్యం. అంతమాత్రంచేత ఆప్రయోగం వదలుకోవలసినదేనా! ఒకరుగాదు యిద్దఱున్నూ కాదు, చాలామంది. లాక్షణికులకు కలగని (భారతకవులు వాడలేదనేది) శంక మనకెందుకు కలగాలి. కనక ఆయీ ప్రయోగాలు నిరభ్యంతరంగా వాడుకోవచ్చుననే అభ్యనుజ్ఞ వుందనే తెలుసుకోవాలి. ఎవరేనా మేము భారతకవులు వాడిన ప్రయోగాలు తప్ప వాడేది లేదని ప్రతిజ్ఞబూని రచన సాగించే స్వయంపాకస్థులు వుండేయెడల వుండడానికి అభ్యంతరం లేదు. వారు అలావుండవచ్చు. రైలెక్కమనే వారుండేవారు (యిపుడుకాదు కొన్నాళ్ళకిందట) యెక్కినా దానిలో కూర్చున్నంత సేపూ వూటనుకూడా మింగకుండా ప్రాణాలు బిగబట్టుకూర్చుని రైలుదిగిన తరువాత పంచగవ్యప్రాశనతోసహా శాస్త్రోక్తప్రాయశ్చిత్తము జరుపుకొని పరిశుద్ధులైనవారినిన్నీ కొందఱిని బ్రాహ్మణుల మాత్రమేకాదు (వెలమ జమీన్దారులలోకూడా) ప్రత్యక్షంగా యెఱిగివున్నాను. ఇది విషయాన్తరం. బహులాక్షణిక మహాకవి సమ్మతమై వొక వ్యాకరణవ్యాఖ్యాత ఖండించలేక వూరుకొన్న పూర్వోక్తప్రయోగాలు ఆక్షేపించడం మహాపరాధమని దీనిసారాంశం; యిప్వస్తప్రయోగాలు మందలింపు, మేళగింపు – బిగింపు – లోనైనవాట్లనిగూర్చి యేదోవ్యాసంలో చాలా చర్చించివున్నాను. కాబట్టి

ఆప్రయోగాలకుకూడా మహాకవుల అభ్యనుజ్ఞ వుందనిమాత్రమే యిక్కడ వ్రాస్తే చాలుననుకుంటాను. ఇతరభాషాప్రయోగాలు కలగూరగంపగా వుండే తెలుగుమాటకేమి ? మడిగట్టుకొన్నపుడే వాడుకోతగ్గ సంస్కృత భాషలోకూడా క్వాచిత్కంగా మహాకవులు వాడుతూ వచ్చారు.

"సుభేదారస్య మద్ద్రోహిణః" (మహిషశతకము) వగయిరాలు చూచుకోండి. ఆ యీ అభ్యనుజ్ఞ పుట్టుపేరులకున్నూ వుద్యోగద్వారా(జడ్జి, కలెక్టరు మొదలయినవి) వచ్చినవాట్లకున్నూ మాత్రమే. "భూమీనాథ షహాబదీన" (మహిషశతకము) చూచుకోండి. మనం సంస్కృతంలో కవిత్వం చెబుతూవున్నాంగదా ? అని అయీనామధేయాలు మార్చి రచన సాగిస్తే యింక అడుగుతారు ఆరచన సౌదభ్యం "అహో స్వామిరూప మడగనా ?" అన్నట్టే వుంటుంది. తెలుగులో ప్రయోగవైచిత్ర్యాలను గూర్చి వ్రాస్తూ మధ్య అవాన్తరముగ సంస్కృతాన్ని గూర్చి కొంచెం వ్రాశాను. ఆభాషని నడిపించినట్టు దీన్ని నడిపించడం సాగదు. దానికి చాలినంత వ్యాకరణం వుంది. దీనికో ? లేదు - వుండడానికి వీలున్న కనపడదు. యిది నాలుగువిధాలుగా విభజిస్తూ మళ్ళా దేశ్యాన్ని రెండువిధాలుగా విభజించి - అన్యదేశ్యానిక్కూడా కొన్ని సీట్లు రిజర్వుచేసి వుంచారు వ్యాకర్తలు. ఆవిభజించేనాటికి తురకానికి యింకా ఆవశ్యకత్వం కలగే లేదు. అప్పటికి యీఆన్ధ్రభాషా ప్రవాహములో వచ్చి కలసిన ఉపనదు లేవో (యితరభాషాపదావళి అన్నమాట) చారిత్రజ్ఞానం కలవాళ్ళకేగాని నాబోట్లకు గోచరించదు. తరువాత తురుష్కభాషాపదాలు వాడుకలో వుండేవి చేరడానికి మొదలుపెట్టాయి. పిమ్మట పారిస్సు, గ్రీకు, వగయిరా కొన్నిభాషాపదాలయితే దీనిలో చేరవలసిన ఆవశ్యకత్వం కొంత కలిగింది. గాని ఆయీప్రభుత్వాలు "పుబ్బలోపుట్టి మఖలో మాడేవిగా" పరిణమించడంచేత కవుల రచనలలోకూడా చేరవలసిన యోగ్యత వాట్లకు కలగలేదు. సుమారు నూటయేభై యేళ్ళనుంచి పాదుకొనివున్న ప్రభుత్వం యింగ్లీషుప్రభుత్వం కనుక యింగ్లీషుపదాలు కొన్ని మనభాషలో చేరడం

తప్పని సరి అయిందని వొప్పుకోక తప్పదు. మేం మడిగట్టుకొన్నాం. అని భీష్మించుకున్నా ఆయీపదాలు కొన్ని కవిత్వంలో దొర్లుతాయన్నమాటే. తురుష్కప్రభుత్వ కాలంలో తురకభాష చేరితే వొప్పుకున్న తెలుగుభాష ఇంగ్లీషుప్రభుత్వకాలంలో ఇంగ్లీషుపదాలు కొన్నిచేర్చుకోవడానికి యేవగించుకొంటుందని భాషాస్వభావవేత్తలు యెవరూ అనుకోరనే నావిశ్వాసం. "....వారాంగన సాక్షాత్కారపు బటికంపు బొమ్మగావలె జుమ్మీ" అన్నాడు నరసభూపాలీయంలో వకసందర్భంలో. తెలుగుభాషవైఖరికూడ ఆలాటిదిగానే కనపడుతుంది. ఆయీ కష్టసుఖాలన్నీ బాగా వోడ్చి వడపోసియ్యేవే —

ఉ. కాలముబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశభా
 షాలలితాంగి మాఱుటట సత్కవిసమ్మతమౌట నన్యదే
 శ్యాలను దేశభాషగలవౌటను నౌచితిబట్టి మేము క
 బ్బాలను వాడుచుంటి మిది పండితులేగతి నొప్పకుందురో.

అని సుమారు యిప్పటికి నలభైయేళ్ళనాడే వ్రాయవలసి వచ్చింది- "పూర్వకవీశ్వర వాక్ప్రయోగదక్షుడు. కరుణామతి యెవ్వడతడు కవియన బరగున్" అని కవిలక్షణములో పూర్వకవిప్రయోగవేతృత్వం అత్యావశ్యకమని వ్యక్తీకరించి వున్నా కొందఱు యీవిషయములో చాలాసంకుచిత హృదయులుగా వుండడం శోచనీయం. పూర్వులంటే? యెవ్వరు? తనకు యేమాత్రం పూర్వులేనా సరేనా? అధమం వకనూతేళ్ళైనా పూర్వులు కావలసి వుంటుందా? అంటే? వినండి. నామతంలో వకసంవత్సరం పూర్వుడైనాసరే, అనియ్యేవే. కాని ఆకవి విద్వత్కవిగా మాత్రంవుండాలి. యేదో గణ యతిప్రాసలు గుదిగూర్చడం మాత్రమే చేతనయినవాడై ధర్మ, ధర్మి, భావంగాని, సుశబ్దాపశబ్దవిచారంగాని తెలియక తెలియని వాడు తెలియనట్టు వూరుకోక యేవో కుశంకలు చేసేవాడైతే మాత్రం ఆకవి ప్రవృత్తిగాని నివృత్తిగాని భావికవులకు ప్రవృత్తి బోధకాలు కావు. విద్వత్కవి అయిందీ, కానిదీ, తెలుసుకోవాలంటే యెవరికోతప్ప యితర్లకు

అంత కష్టములేదు. రచననుపట్టి (మారువాళీవర్తకులు పూటా రూపాయిని గుర్తించినట్టే) క్షణంలో గుర్తించవచ్చును. యీపరిజ్ఞానమే ప్రామాణ్యానికి అవసరంగాని పూర్వత్వంగాని మఱీ పూర్వత్వంగాని మఱిమఱి పూర్వత్వంగాని లేశము ప్రయోజకం కాదు. ఒక విద్వాంసుడు (యీయన ప్లీడరు కూడాను) కవులలో తారతమ్యాలను నిర్ణయిస్తూ వుపయోగించే మాటలు నవ్వుపుట్టించేవిగావుండేవి. వాట్లనివుదాహరిస్తాను. ప్రశ్నోత్తరాలు-

ప్ర.: అయ్యా? చేమకూరకవిని గుఱించి మీయభిప్రాయమేమి?

వు: వాడా? అబ్బో? అమ్మమొగుడు.

ప్ర: అల్లసానికవో? మఱి.

వు: చెప్పేదేమిటి, అమ్మమ్మ మొగుడు.

యిదేమాదిరి పదాలతో ఆయన గురుత్వ లఘుత్వాలు నిర్వచిస్తూ వుండేవారు. యిది విషయాంతరం. కాళిదాసునాటికే యీబాధ పూర్తిగ వున్నప్పుడు మనరోజుల్లోమాత్రం వుండదా? (పురాణమిత్యేవ న సాధు కావ్యమ్ చూ.) కాళిదాసు చెప్పిన సమాధానంవల్ల పూర్వత్వ నవీనత్వాలనుబట్టి కవిత్వపు మంచిచెడ్డలు నిర్ణయించడం ప్రాజ్ఞేతరలక్షణమని య్యేవే. మంచికవిత్వమయితే అది తనకాలంలోదైనాసరే ప్రయోగాది సందర్భాలలో దాన్ని వరవడిగా బెట్టుకోవడానికి యెవరో కాదు, కాళిదాసే అభ్యనుజ్ఞ యిచ్చినట్లయింది. తిక్కన్నగారు - 1 తనమయం 2 మెదడు ప్రోవులమయం అంటూ ప్రయోగించారు. యింకోకవి - అపరంజిమయం అని దాన్నిబట్టి ప్రయోగించుకుంటే రసజ్ఞులు ఆమోదించాలి. కాని ఆ రెండుమాటలకే కాని మఱోమాటకు ఆ "మయట్ప్రత్యయం తగిలించకూడ" దని వాదించడం అభినందనీయముకాదు. (చెవికి యింపుగా వుండడం మాత్రం చూచుకోవాలి) అన్నిటికి ఆది కవిసమ్మతినే చూపవలసినదంటే చూపడం సాధ్యపడుతుందా "ద్రాక్షవాటి కవిరాక్షసు" డాలాటి నియమం చేస్తే చేశాడు కాక, అది "శారదాబిల్లు" లాగ కవిలోకంలో బహువిరాళంగా అమలుజరుగుతూ వుండడం అందరూ యెఱిగిందే! దేనిదాకానో

యెందుకు? తెలుగుపదాలమీద యీ "మయ" ప్రత్యయాన్ని వుపయోగించడానికి నన్నయ్యగారి సమ్మతిని చూపమంటే తిక్కన్నగారు (అకాలంలోనే అనుకుందాం) చూపగలరా? యింతవఱదాకా చర్చించు కొనేశక్తి లేక గుంటపూవులు పూసినమాదిరి శంకలు చేస్తూవుండడం శోచనీయం అప్పకవి వ్రాసిన కవిలక్షణం స్వకపోల కల్పితం కాదు. చాలా ప్రాచీనమే. అహోబలపండితుడు వుదాహరించిన "సత్కులీన శ్శుచిర్దక్షశ్ఛన్దో వ్యాకరణాదివిత్" అనేశ్లోకానికి తెలుగు. ఆశ్లోకంలో వున్న సత్కులీనః, అనేపదానికి అప్పకవి-'ధరణీసురుడు' అని తెలిగించడం బుద్ధిపూర్వకంగా చేసిన మోసం. అప్పకవి నాటికి బ్రాహ్మణేతరులలో కవులు లేరేమో అనుకుందామంటే రాయలు మొదలైనవారు పలువురు వున్నారు. రాయలు ఆముక్తమాల్యదాకర్త కాడని అప్పకవి తాత్పర్యం కాని అది న్యాయమైనది కాదు. న్యాయమైనదే అయినా అతడొక్కడు తగ్గితేమాత్రం అప్పకవి వ్రాత బ్రతుకుతుందా? బ్రతకదు.

క. వెంకనప్రతిష్ఠకోలెటి
వెంకటరామయయె హేతువే? అట్లగుచో
బొంకి కృతకృత్యతనుగను
టం కెడిగలరెందఱేని అన్యులు శిష్యుల్. (యిటీవలిచర్య)

ఇదేమాదిరిని అప్పకవి వ్రాత పొల్లవుతుంది. కవిత్వం శిల్పంగదా? అదిన్నీకాక సహజంగా ఆవిర్భవించేది, గానంమాదిరిది. దీనికి జాతి నియమం బెట్టడం అనాలోచితం కాకపోదు. పోనీ మూలంలో ఆలా వుందేమో? అంటే? అదిన్నీ కనపడదుకదా? సత్కులీనులంటే బ్రాహ్మణులేకాని క్షత్రియాదులు కారని యేప్రాజ్ఞులు చెప్పరు. వ్రాస్తే చాలా వ్రాయాలి. ప్రస్తుతం వ్రాయడానికి పూనుకొన్నది యిదికాదు. బ్రాహ్మణ కవిగాని బ్రాహ్మణేతరకవిగాని మంచిగా కవిత్వం చెప్పినవాడైతే అతణ్ని యిటీవలివారు అనుసరిస్తారు. ఇంతే నిష్కృష్టాంశం. రసవిహీనంగా వుండే కవిత్వమేనాసరే, లక్ష్యలక్షణజ్ఞానంకల కవిదయితే అది అన్యులకు

(ప్రయోగవిషయంలో మాత్రమే) అనుసరణీయం కావడానికి అభ్యన్తరం వుండదు. కాని నీరసకవిత్వం భాషాప్రపంచకంలో చిరస్థాయిగా వుండడమే సంఘటించదు. కాని అట్టిపీడ భావికవులకు తగలనే తగలదనేది పర మార్థం. కొనుధాతువుకు 'క' అనేది ఆదేశంగాచేసిన ప్రయోగవిషయంలో కల్లూరివారి ఆశయాన్ని వ్యాఖ్యానించే సందర్భములో మఱికొంత యితర విషయము నడిచింది. యిక క్త్వార్థకేకారసంధి విషయంలో వీరి తాత్ప ర్యాన్ని కొంత ముచ్చటించుకుందాం - కల్లూరివారు క్త్వార్థకసంధినిగూర్చి భారతప్రయోగాలుకూడా చూపి వాట్లకు పాఠాన్తరసత్తను నిరూపించి తరువాత కవిత్రయేతర ప్రయోగాలుకూడా చూపి కొంత చర్చించి అంత తోగత్వా "ఈప్రయోగంబులు నిరాకరంబులు" అని విరమించారు. వీరివ్యాఖ్యానము చాలాచోట్ల భాష్యప్రాయంగా అంటే కొంతస్వతంత్రించి వుండడం కలదు. ప్రస్తుతం సూత్రాభిప్రాయంలో యేకీభవించి వూరు కోవడానిక్కారణం కొంత చింత్యం. యేమంటే? యితరకవులమాట అలావుండగా "....పురోహితుడితనికి నెల్లపనులు నెఱిగించిపుడే" అనే భారతప్రయోగంకూడా కనపడుతూ వుండగా యెందుకు స్వతంత్రించలేక పోయారో? అలాస్వతంత్రించే యెడల బహుమహాకవుల ప్రయోగాలు గౌరవించినట్లయ్యేదికదా? ఆయీమార్గం భట్టోజీ దీక్షితులంతవానిక్కూడా సమ్మతమైనట్లు - ప్రాగ్భూర్యాద్మా సూత్రవ్యాఖ్యాన సందర్భంలో కాశికా కారాదులు ఉపసర్గే అనేపదాన్ని అనువర్తించి వుండగా దానివల్ల నైషధ ప్రయోగం "దయాన్" అనేది సంరక్షింపబడకపోవలసి వస్తుందని యోజించి తద్రక్షణార్థం దాన్ని అనువర్తించక పోవడం మనోరమా వ్యాఖ్యానంవల్ల విస్పష్టమే కనుక లక్ష్యానురోధంగా వ్యాఖ్యాతలు ప్రవ ర్తించడం శాస్త్రజ్ఞ సమయమే కాని అయుక్తమార్గం కాదాయె. అట్టి స్థితిలో పాణినీయ నిష్ణాతులైన యీమహాభాగులు (వీరినినేను మహా భాగులుగా ప్రశంసించడం మహాపరాధంగా పరిగణించి నన్ను నెపపెట్టి దూషించేవారున్నూ యీకాలంలోవున్నారు. "కాలాయనమః కలవికరణా

యనమః" ) బహు మహాకవి ప్రయోగానురోధంగా వ్యాఖ్యానించకపోవడం ఆశ్చర్యకరంగా కనపడుతూవుంది. ఆలాగే వ్యాఖ్యానించేపక్షంలో "క్త్వార్థేతో నకదాచన," అనేకారికాతాత్పర్యం అన్యథాగానేవున్నా, లక్ష్యానురోధంగా వ్యాఖ్యానించే వీరికికొంతసహాయంచేసేది. ఆసహాయం యేలాంటిదంటే ? - క్త్వార్థేతః క్త్వార్థక ఇకారానికి కదాచ యెప్పుడున్నూ (సంధి) నేతివా, రాదనే మాటలేదు. అనగా యెప్పుడేనావస్తే రావచ్చుననే స్వారస్యం తీసుకో వచ్చును. ఆరావడం యెలాంటిస్థలాలలోఅంటే ? యెక్కడ ఈసంధి చేస్తే శ్రవణ కటువుగానుండదో అక్కడన్న మాట. ఆ యీ తాత్పర్యంతోనే అనుకుంటాను అడిదం సూరకవిగారు, " ఇడగవచ్చునుల్యప్పు పైనిత్వ సంధి మాత్రమొక్కొక్కచోటను...." అనివ్రాయడం తటస్థించింది. అయితే యిక్కడవొకమాట వ్రాయడం మఱిచాను. కల్లూరివారుదాహరించిన కారిక 'క్త్వార్థేతోనభవేత్సదా' అనివుంది. దీనిలో నేనుచూపిన లక్ష్యానురోధ వ్యాఖ్యానానికి అవకాశంకనబడదు. నాకు యేకారణంచేతనో "క్త్వార్థేతోనక దాచన" అన్నపాఠమే నోటికివచ్చును. నాతెలుగువ్యాకరణపాండిత్యం చిన్న వ్పుడుస్కూల్లో చదువుకొన్న వెంకయ్యవ్యాకరణానికి సంబంధించినదిన్నీ తరువాత భారత లక్ష్యాలకు సంబంధించినదీకాని ఆన్ధ్రశబ్దచింతామణి కానీ అథర్వణకారికలుగానీ చిన్నయసూరివ్యాకరణంగాని చదివి సంపాదించు కొన్నదికాదు. ఆపద్ధతిని నాకీకారిక యేలానోటికివచ్చింది ? అనిశంక కలు గుతుందని యెఱుగుదును. యెవరో చదువుతూవుండగా వినడంవల్లనే వచ్చివుంటుందనుకోకతప్పదు. ఆ యీవూహనిక్కమే అయితే నాకువచ్చిన పాఠంకూడా వొకటివుందనుకోవలసివస్తుంది. యీవూహకు అడిదం సూర కవిగారి "ఇడగవచ్చునుల్యప్పుపై" అన్నవ్యాఖ్యానంచేయూతనిస్తూవుంది. ఆయీవిధంగా సూరకవిగారుక్త్వార్థేత్సంధికి సమర్థనోపాయంచూపడానిక్కా రణం భారతాదిమహాకవుల లక్ష్యాలే అన్నందుకు ఆపద్యంలోనేవున్న "కవి జనానుమతిని" అన్నపదంబోధకంగావుందని వేఱేవివరింపనక్కఱలేదు. కారికలోపాఠభేదంవున్నప్పటికీ మొట్టమొదట నిషేధతాత్పర్యంతోనే అది

పుట్టిందనుటయధార్ధమే. పాణినీయసూత్రాలుకూడా సూత్రకర్త అభిప్రాయం వాకలాగువుండగా వ్యాఖ్యాతలు లక్ష్యానురోధంగా అన్యధాగా వ్యాఖ్యానించడం సుప్రసిద్ధమేకనుక నాయీవ్యాఖ్యానాన్ని పాణినీయవేత్తృత్వమున్నూ బహుమహాకవి లక్ష్యగతరామణీయకతా వేత్తృత్వమున్నూ, కలపండితులు సమ్మతిస్తారని నానమ్మకం. యింకాచాలా వ్రాయవలసి వున్నప్పటికీ యీ అభ్యనుజ్ఞావ్యాసాన్ని యింతటితో ప్రస్తుతం ముగిస్తూన్నాను. ఆ యీవ్యాసం జగత్ప్రసిద్ధులున్నూ భాషోద్ధారకులలో నగ్రగణ్యులుగా మనయావదాంధ్రదేశమున్నూ ఏకవాక్యతగా శిరసావహించతగ్గవారున్నూ అయినశ్రీవావిళ్లవేంకటేశ్వరశాస్త్రిల్లుగారికి మద్రాసుకొందిరోజులలోకాన్కగా సమర్పించబోయేసంచికలో ముద్రించేకోర్కెతో శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయులు గారు తే 15 వ జనవరి 1941 సం॥ దీకిలోగానే అందజేయవలసిందని గడువేర్పఱచి వుత్తరంవ్రాయుటచే సంగ్రహంగానే దీన్నిముగింపవలసివచ్చింది. వెంకటేశ్వరశాస్త్రుర్లుగారుభాషోద్ధారకులుకావడంచేత వారికిసమర్పించేకానుకసంచికకు యిచ్చేవ్యాసం భాషావిషయకంగానే వుండడంయుక్తమని నాకు తోచి యిట్టివ్యాసంపంపివున్నాను.

నాకు వ్రాసినజాబులో "తమకుచితమని తోచినది జ్ఞానవిషయమైవాకవ్యాసమును వ్రాసి పంపగోరెదము " అని వున్నది. ఇతరవిజ్ఞానాలన్నిటికీ భాషావిజ్ఞానమే మూలవిరాట్టు కాబట్టి నేను దీన్ని పంపినట్టు కూడా విజ్ఞులు తెలుసుకుంటారని నావిశ్వాసం శ్రీవెంకటేశ్వరశాస్త్రుర్లుగారి యశస్సుతోపాటుగా ఆయన ఆయుర్భాగ్యంకూడా నిరామయంగా వర్ధిల్లుగాక అని ఆశీర్వదిస్తూ ఆపుతాను. స్వస్తి.

---

# నాచన సోమనాధుడు

(ది 10–12–1941 సం॥రం ఆంధ్రపత్రికవీక్లీనుండి)

ఈ మహాకవి కవిత్రియంతర్వాత కవిత్రయ మంతవాఁడుగా పేర్కోఁదగ్గవాఁడని పలువురు విమర్శకు లభిప్రాయపడ్డారు. విమర్శించి వారివారి అభిప్రాయాలుకూడా పత్రికలద్వారా వెల్లడించినట్టు పీఠికవల్ల తెలియ వస్తుంది. కాని, వారివారి విమర్శనలు నాకెప్పుడూ లభించలేదు. ప్రథమాశ్వాసంలో యేకొంచెమోతప్ప, యెప్పుడుగాని యీతని ఉత్తర హరివంశకావ్యం నేను సమగ్రంగా చదవనేలేదు. కీ. శే. వీరేశలింగం పంతులవారు యీ సోమనాధుణ్ణి కవిత్రియంవారికంటే కూడా అధికుణ్ణిగా నిరూపించి వున్నారు. "మహాఋషీణాం మతయశ్చ భిన్నాః" ప్రస్తుతం నేను చదివిన వావిళ్ళవారి ముద్రిణ ప్రతికి పీఠిక వ్రాసిన వేటూరి ప్రభాకర శాస్త్రి – "ఎఱ్ఱాప్రగడ కవితకు గల ప్రసాదగుణము సోమనాధుని కవితకు లేదు" అని వ్రాసి యున్నాఁడు. నాకుఁగూడా అట్లే తోఁచినది. ఎంతకఠినమైన ప్రాసయెత్తుకున్నా సరే నిరాఘాటంగా పద్యం సాఁగిపోవడమే కవికి ఉత్కృష్టత్వాన్ని కలిగించదు – కఠినప్రాసతో పద్యాన్ని పూరించడానికి సంస్కృత పాండిత్యం ఆవశ్యకం గనక అట్టి పాండిత్యం విశేషించి వున్నట్టు దానివల్ల స్పష్టపడుతుంది. కవికి పాండిత్యంతో అవసరం లేదని నేనైతే చెప్పేదిలేదు గాని (అట్టివారి చిక్కులు నాకు అనుభవంలో ఉన్నప్పు డాలా చెప్పఁగలనా?) తావన్మాత్రింతో కవికి ఉన్నత స్థానం లభించడం దుర్ఘటం. "నీమగఁడంత యెక్కుడె? మనీషులు భూసురులంత తక్కువే?" (యెఱ్ఱాప్రగ్గడ భారతం.) అన్న మాదిరి పద్యాలవల్లనే యెఱ్ఱా ప్రిగ్గడ కవిత్వానికి ఉన్నత స్థానం సంప్రాప్తమయింది గాని, సమాసభూయిష్ఠంగా కవిత్వం చెప్పడంవల్ల కాదు. యెక్కడో ప్రతీకవీ తన పాండిత్యం చూపడానికి కొన్ని పద్యాలు సమాసభూయిష్ఠంగా వుండేవి రచిస్తూ వుండడం వారివారి కబ్బాలవల్ల తెలుస్తూనే వుంటుంది. అందులో తగినంత పిండి వుండి కూర్చిందేదో, అట్టిది కాని దేదోకూడా విచక్షణత్వం

గల విమర్శకులు గ్రహించఁగలిగి వుంటారు. ప్రస్తుతకవి సంస్కృతంలో అసాధారణ పాండిత్యం కలవాఁడనీ అఖండ ధారాశుద్ధి కలవాఁడనీ గ్రంథంలో చెఱిసగం పద్యాలు సాక్ష్య మిస్తాయి. వీరేశలింగం పంతుల వారు అట్టి సమాసాడంబరానికి మోమోటపడేవారు కాకుండా వుండిన్నీ యీయన్ని కవిత్రయంకన్నా మిన్నారచయితనుగా పేర్కొవడానిక్కారణం నాకింకా బాగా గోచరించిందికాదు. యీ మహాకవి సామెతలు చాలా వాడివున్నాఁడు, అచ్చ తెలుఁగు పద్యాలుకూడా కొన్ని చెప్పివున్నాఁడు కాని, పనిపడ్డప్పుడు మురారినాటకంలో వున్న -

" ఉద్దామ ద్యుమణి ద్యుతి వ్యతికర ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ నిష్కూజకోయష్టయః "

అన్న మార్గంలోనే యెక్కువ అభిమానాన్ని చూపిస్తాఁడని నాకు తోఁచింది - సంస్కృత విభక్తులతోడనే చాలా పద్యాలు రచించి వున్నాఁడుకూడాను. ఆ యీ శైలి యెంతో పిండి వుంటేనేకాని సర్వసామాన్యులకు నడిచేది కాదనిన్నీ యెఱుఁగుదును గాని; కవిబ్రహ్మ తిక్కన్నకి పిండి లేకపోవడంచేతనేనా ? " ఎవ్వానివాకిట నిభమదపంకంబు రాజభూషణరజోరాజి నడఁగు " అన్నమాదిరిశైలిలో కవిత్వాన్ని నడుపుతూవచ్చాఁడు? - నన్నయ్య కొత్తగా తెలుఁగులోకిఅడుగు పెట్టవలసివచ్చి పెట్టినా గురుశుశ్రూషచేసి అభ్యసించినవిద్య యావత్తూ వేదశాస్త్ర సాహిత్యాత్మకం కావడంచేత తిక్కన్నగారికంటే విస్తరించి సంస్కృతంలో కవిత్వాన్ని నడిపించినా - ' ప్రసాదగుణం ' వదలుకొన్నట్టు గోచరించదు - చూడండి " పరమవివేక సౌరభ....ముదం బొనరం గొనియాడి వేడుకన్ " ఇత్యాదులు ప్రసాదగుణాన్ని త్యజించినట్టులేదు. సోమనాథుని సంస్కృత సమాసగ్రథనం మాత్రమే కాదు తెలుఁగురచనకూడా కొంత దురవగాహంగానే కనపడుతుంది. కొంచెం వుదాహరిస్తాను - " భసితాలిప్తవపుత్త్రిపుండ్రనిటల ప్రత్య గ్రరుద్రాక్షదా, మసముజ్జృంభితవేషులై " ఆయీ పద్యం తేలికప్రాసలో వుండడంచేత తక్కిన విశేషణాలన్నీ సంస్కృత

పదసంఘటితాలే అయినా నన్నయ్యగారి రచనలాగే ప్రధానవిషయం సులభంగానే గోచరిస్తుంది. కొన్నిటిలో సుళువుగా గోచరించదు. కవిత్రయం వారు వాడని తెలుఁగుపదాలు యీయన వాడినట్టు పీఠికలో వ్రాయఁబడింది. ( యీ విషయం పరిషత్పత్రికలో చూ. ) ఆ పదాలకు నాఁటికాలపు వ్యావహారికభాషే యీయనకు గురుత్వం చేసిందనుకోవాలి. సామెతలుకూడా మా గోదావరీ మండలంలోనే కాక కృష్ణా గుంటూరు మండలాలలోకూడా వాడుకలో లేని వెన్నో యీయన వాడినట్టు కనపడుతుంది. కొంచెం చూపుతాను. (1) "మారిఁ దనయింటికి రమ్మను వానికేమియుం గఱపినన్" "మరిడమ్మను తనంతట తానుగా యింటికి ఆహ్వానించేవాఁడు" అని పైసామెతకు తాత్పర్యం. యీసామెత మా ప్రాంతంలో లేదుగాని యించుమించు యిదేఅర్థాన్ని బోధించేవి కొన్ని వున్నాయి - (1) కాళ్ళని పోయేదాన్ని నెత్తిని రుద్దుకున్నట్టు - (2) కొఱవితో తలగోక్కున్నట్టు లోనైనవి వున్నాయి. ( చెట్టుకొట్టి నెత్తిని వేసికొన్నట్టు వగైరా చూ. ) యీ రెండోదాన్నికూడా యీమహాకవి వాడేవున్నాఁడు. "కొఱవిన్ దల బరికికొన్న కొఱడులుగారే" మఱిన్నీ సమానార్థబోధకాలుగా వుండే సామెతలు దేశభేదాలనిబట్టి యెన్నో కనపడతాయి. పరిషత్పత్రికలో కాఁబోలును వీట్లని కొన్నాళ్ళకిందట యెవరో ప్రచురించి వున్నారు. అది చదివినవారికి యీవిషయం చాలా భాగం గతార్థ మవుతుంది గాని, యెక్కడికెక్కడ? యీ సామెతలంటే వొక పెద్ద సముద్రం. వీట్లని నిశ్శేషంగా తెల్పడానికి యెవ్వరికీ శక్యంకాదు - మా వైపువాళ్ళకి కొత్తదిగా తోఁచే దాన్ని వొకదాన్ని చూపి యీవిషయం ముగిస్తాను - "మద్దులు మునింగి పాఱ వెంపళ్ళు తమ కెంతబంటి యనుట" యీ లోకోక్తి ( సామెత )కి మావైపున - "ఏనుఁగులు యేటఁ గొట్టుకుపోతూ వుంటే నక్క పాటిరే వడిగిందఁట" అనేది వాడతారు. మద్దిచెట్లు తఱుచుగా యేటిలంకల్లో వుంటాయి. అవి చాలా పెద్దజాతిలోవి. వెంపలి అనేది చాలా చిన్నది. రెండోదానిలో వున్న యేనుఁగులకూ నక్కలకూ వుండే తార

తమ్యమే యీ రెండింటికీ వుంటుంది. యితని గ్రంథం ఆశ్వాసాలే అయినా 18 పర్వాల భారతంలోకూడా వెదికితే యిన్ని లోకోక్తులు దొరకవనే నాకు తోస్తుంది. యితణ్ణి వసుచరిత్రకర్త యీవిధంగా సమ్మానించివున్నాఁడు.

" మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు పోషింపన్ మహా
మహులై సోఁముడు భాస్కరుండు వెలయింపన్ సొంపు చెన్నారు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్."

యీ ఆంధ్రభాషా ప్రపంచకానికి యితఁడు చంద్రుఁడివంటివాఁడుగా వున్నాఁడన్నమాట. ఆ యీ పద్యంలో శ్రీనాథుణ్ణి ఇతనికన్న ముందు పేర్కొన్నప్పటికీ యింతకంటె అతఁడు ప్రాచీనుఁడు కాఁడు. యితఁడు కవిత్రియంలో యెఱ్ఱన్నగారికి యించుమించు సమకాలీనుఁడుగా విమర్శకులు తేల్చివున్నారు - వసుచరిత్రపద్యం శ్లేషప్రధానం కనక శ్రీనాథుణ్ణి ఆలా పేర్కొవలసి వచ్చింది. కవితాగోష్ఠిలో శ్రీనాథుఁడికంటె యితఁడు యద్విధంగానూ తీసిపోయేవాఁడు కాకపోయినా, అతని కున్నంత పేరు మాత్రం యితనికి లేదు. యితఁడొక్కఁడేకాదు; మంచి సమర్థులై చక్కని కవిత్వం చెప్పికూడా, లోకుల దృష్టిలో వెనకఁబడ్డ కవులు యింకా చాలా మంది వున్నారు - (1) సంకుసాల నృసింహకవి. యితని కవిత్వం యెంతో ప్రౌఢంగా రసవత్తరంగా వుంటుంది. లాక్షణికత్వంలో యేమేనా కొదువేమో అంటే ఆవిషయంలోనూ లోపంలేదు - " ఆఁకటి కమృతంబుఁ బిదికి కొనఁగ శృంగములు లేని మొదవు మారంగశాయి " అనే శైలిలో వుంటుంది కవిత్వం. అయితే యేమి, రాఁదగ్గంత పేరు రాలేదు. రామాభ్యుదయకర్తకుకూడా పేరు డిటో. కొంతకాలాన్నుంచిగాని అంతకు పూర్వం పింగళి సూరన్నగారికికూడా మను వసుచరిత్రకవుల కున్నంత పేరు వున్నట్టే లేదు - " కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః" ఉత్తమరసగ్రాహకులవల్ల కవుల కవిత్వరహస్యాలు బయటికి రావలసి

వుంటుంది. అయితే, నిన్న మొన్నటిదాఁకా సూరన్నగారి కవిత్వరసాన్ని గ్రహించతగ్గవారు లేకే పోయినారనిన్నీ యిటీవలనే ఆవిర్భవించారనిన్నీ అంటే మాత్రం ప్రాజ్ఞలోకం విశ్వసిస్తుందా? విశ్వసించదు. నాకు తోఁచినమాట వ్రాస్తాను. మునుపు అష్టాదశవర్ణనలతో నింపడమూ చతుర్విధ కవిత్వపోకడలూ వుండడమే కావ్యసామగ్రిగా పరిగణించే వారనిన్నీ, యిటీవలివారు దానికంటేకూడా కథాకల్పనకి యెక్కువ ప్రాధాన్యం యిచ్చి వుండడవల్ల సూరన్నగారిపేరు యెక్కువగా పైకి వచ్చిందనిన్నీ నేను అనుకుంటాను. సూరన్నగారి కవిత్వం అలా వుంచి పాండిత్యాన్నిగూర్చి మాట్లాడుకున్నా శ్రీనాథాదులకన్న హెచ్చుతుందేమో గాని లొచ్చుగాదు. యెంతపాండిత్యమూ లేకపోతేనే రాఘపాండవీయం తుద నెగ్గుతుందా? పైఁగా వొకమాటు చదివితే తెలుఁగుగానూ వొకమాటు చదివితే సంస్కృతంగానూ పరిణమించే కవిత్వం చెప్పడానికి పాండిత్యం మాట అలా వుండఁగా, యెంత వోపికవుండాలి? అయితే ఆ యీవోపిక వల్లా ఉభయభాషల్లోనూ అపారమైన పాండిత్యంవల్లనూ సూరన్న గారిపేరు పైకి వచ్చిందందామా? అది సర్వకల్ల. రసవత్తరమైన కవిత్వం చెప్పడంవల్లనే కొంత ఆలస్యంగానేనా సూరన్నగారిపేరు పైకి వచ్చిందని నేననుకుంటాను. - అందులోనూ కథాకల్పనలో అద్వితీయుఁడని పాశ్చాత్య విద్యానిష్ణాతులచేత కూడా గౌరవింపఁబడడంచేత యీకాలంలో సూరన్న గారిపేరు మఱీ అగ్రస్థానానికి వచ్చింది. కొందఱు ఈ సూరన్నగారి కథాకల్పన బాగా లేదంటూ వ్రాసినవారున్నూ వున్నారు. ఆ వ్రాసినవారి వ్రాఁత యేది చూచినా యెందుకూ కొఱగానిదిగానే వుంటుంది. అంతేకాక పోతే పింగళి సూరన్నగారిని - యెందులో అంటారు కథాకల్పనలో ఆక్షే పించడానికి యెవరు సహిస్తారు? అయితే ఆ ఆక్షేపణ సుప్రసిద్ధ పత్రికలో పడలేదు. ఆ కారణంచేత యెవరోతప్ప చూడనే లేదేమో అని కూడా అనుకోవచ్చును. వక్తవ్యాంశం సూరన్న వంటి కథాకాల్పనికులు మృగ్యు లనియ్యేవే. వసుచరిత్రపద్యంలో మన సోముఁడు చంద్రుఁడైతే, యీ

సూరన్న సూర్యుఁడుగా వుంటేనే బాగుండేది గాని భట్టుమూ_ర్తికంటే యిటీవలి వాఁడవడంచేత ఆ భాగ్యం యితనికి పట్టింది కాదు. భట్టుమూ_ర్తి సోముణ్ణి సోముణ్ణి ( చంద్రుణ్ణి )గా భావించి గౌరవి_స్తే, వీరేశలింగంగారు వాగనుశాసనస్థానంకంటే కూడా యితనికి అగ్రస్థానం యిచ్చి గౌరవించారు.

చిన్నయ్యసూరి - " చిచ్చఱకన్ను మూసికొని " వచ్చిన సోఁముడే ( ఈశ్వరుఁడే ) సోముఁడన్నాఁడు. భవతు. ఆంధ్రవాఙ్మయంలో యీ సోఁముడు సుప్రసిద్ధుఁడన్నందుకు పైవారి పొగడ్తలు సాక్ష్యమిస్తాయి. యిట్టి మహాకవి ప్రయోగాలు కూడా మాన్యాలు కావనుకొనుటకన్న దురహంకార మంటూ వుంటుందా ? వుండదు. కనుకనే యితణ్ణి వరవడిగా పెట్టుకొని పింగళి లోనైనవారు ప్రవ_ర్తిస్తూవచ్చారు - " అంతనుం, డిన్నెల సన్నగిల్లెనది నిక్క_ము గాదని యందురేని" అనే విజయవిలాస ప్రయోగం మన సోఁముడుగారిని బట్టి ప్రయోగించుకొన్నదే. " కృతఘ్నా ః యిది న్నోరే ః " (సోమునిహరివంశం) ఈ స్థలంలో ఇది + యున్ - అనియుండఁగా సముచ్చయద్వయములో నొక సముచ్చయము యు అనేది లోపించినదనుకొంటే సరిపోతుంది - " యు—ను సముచ్చయములు " అనే వ్రాస్తూవచ్చారు పూర్వ వ్యాఖ్యాతలు. ఈ సముచ్చయశరీరాన్ని గూర్చి యిటీవల చాలా మతభేదాలు బయలుదేఱినాయి. వాట్లని గూర్చి యిచ్చట వివరించేది లేదు. విజయవిలాస ప్రయోగానికి ఆధారం చూపినట్టయింది. దీనికేకాదు పై ప్రయోగం మార్గదర్శకం మనుచరిత్రలోని " తల్లిందండ్రియు " అన్నదానికికూడా యిదే మార్గదర్శకం - ' తల్లి + యున్ + తండ్రి ' అని యుండఁగా పూర్వవత్తుగానే యు లోపము. ఇతఁడు దీనికేకాదు - " అప్పాచెల్లెంద్రు " వగైరా అచ్ఛికద్వంద్వసమాసాలలో సంస్కృతంలో ప్రసిద్ధదేవతా ద్వంద్వాలలోవలెనే దీర్ఘం రావడానిక్కూ_డా మార్గదర్శకుఁడే " పెన్నిధిఁగని పొంగుచున్న పేదలక్రియ నయ్యన్నాదమ్ములఁగని "అయీ ప్రయోగఁ శ్రవణసుఖంగా వుండడంచేతనే సోముఁడు వ్యావహారికమైనా ప్రయోగించాడు; రసమెఱిఁగిన కవిగదా ? సోముఁడు. " త్రిదోషహారం

తిప్పతీఁగె " మాదిరిగా చెప్పేకవిత్వమే ఐతే " అయ్యన్నన్ దమ్మునిగని" అనియ్యేవే ప్రయోగించేవాఁడు - ఈ సముచ్చయలోపానికి కుత్రిచిత దీర్ఘం చేయడానికి మార్గదర్శకులు కవిబ్రహ్మ తిక్కన సోమయాజి. " నమ్మినమ్మక " అనే ప్రయోగాన్ని నిన్నమొన్న దిద్దడం జరిగింది - ఆ దిద్దడంలో మూలంలో వుండే అర్థంకూడా చెడిందని మేము మొఱ పెట్టడం అంతాయెఱిఁగిందే. కొందఱు మిడిమిడి జ్ఞానంతో 'పండితాయతే'లు యీగో ( శబ్ద )హత్యా మహాపాతకాన్ని చేయడం జరుగుతూ వచ్చింది. యీ పాతకానికి ఆలాయపడ్డ వాళ్ళల్లో లక్షణ గ్రంథ కర్తలలో మొట్ట మొదటివాఁడు - అప్పకవి. యితఁడు యేం పుట్టిమునిఁగిందని రలలకు యతి విషయంలో అంత పట్టుపట్టవలసి వచ్చింది. ? పాణినీయంలో - ' రేఫోరలయోస్సంజ్ఞా ' అంటూ స్పష్టంగా వుందాయె. సర్వత్రారేఫకు చెప్పిన ఆదేశాదులు లకారానికి వస్తూ వున్నాయాయె, మహావిద్వాంసులు - ' రలయోరభేదః. ' అని అంగీకరించి వ్యాఖ్యానిస్తూన్నారాయె. యిట్టి స్థితిలో అప్పకవి యెందుకో శ్రీనాథాదుల ప్రయోగాలు దిద్ది యీ అభేదం పనికిరాదన్నాఁడు. వీలున్నంతలో అనవసరమైన సంకెళ్ళు పెట్టుకోవడంవల్ల వచ్చే సుయోగం లేశమూ కనపడదు భాషకి; యింకొకటీ విశేషం, ఆయా కవులు బుద్ధిపూర్వకంగా ప్రయోగించిన ప్రయోగాలను - " ప్రమాద ప్రయుక్తాలు "గా అపవదించి దిద్దడంకూడానూ, తమ కిష్టంలేకపోతే ( జిహ్వాకోరుచీ పుర్రెకోగుణమూను ) ఆయన ప్రయోగిస్తే ప్రయోగించాఁడుగాక - " నాకది యిష్టంగా లేదు " అంటే కొంత బాగుండేది. పూర్వ మహాకవులు సంస్కృత భాషాప్రత్యయాలనుకూడా తెలుఁగులో వ్యావహారికాన్నిబట్టి క్వాచిత్కంగా వాడుకుంటూ వచ్చారు - 'వెలఁది - వెలఁదుక - పొలఁతి పొలఁతుక - నాతి - నాతుక ' ఇత్యాదులు చూచుకోండి. ఇవి స్వార్థేక ప్రత్యయసదృశాలే, తత్పరత్వమందు పూర్వాక్షరానికి (ఇకారానికి) ఉకారాదేశం అధికం. దీన్ని యీలా వుంచుదాం. వికారార్థమందువచ్చే - మయట్ప్రత్యయాన్ని తిక్కన్నగారు శిష్టవ్యవహారంలో వుందిగదా; అని

భారతంలో వాడుకున్నారు. దానింబట్టి యెఱ్ఱన్న వాడుకున్నాఁడు (త్రిలింగ లక్షణశేషం చూ.) మన సోమనాథుఁడుకూడా "తనమయము" అని వచనంలో వాడుకున్నాఁడు. నన్నయ్య వాడలేదు. తిక్కన్న నన్నయ్య వాడనిమాట లెన్నో వాడినాఁడు. (ఆపైని స్వంతతుర్రైఁ తనదు పాండితి చూపెను దిక్కయజ్వ దేవీభా. చూ.) యెఱ్ఱన్నకూడా డిటో - ఈత్రి మూర్తులు వాడనివి శ్రీనాథుఁడు కొన్ని 'ఎనభై, అఱవై' యిత్యాదులు వాడివున్నాఁడు. ఇవి గ్రామ్యాలు కావనేది లేదు. గ్రామ్యమైనా మహాకవి ప్రయుక్తమైతే నిర్దుష్టమవుతుందని శబ్దశాస్త్రం ఘోషిస్తూన్నప్పుడు యింకా ఆ శబ్దాలకు వెలి యెందుకు? లాకలూకాయ కవులు శబ్దజ్ఞానం లేని కవులు తమనీడ తాము తొక్కికొని భయపడే కవులు - యింత మాత్రంచేతనే తమకు అగ్రస్థానం వస్తుందని భ్రమించే కవులు - ఆ మహాకవి పరిగృహీత ప్రయోగాలుకూడా వదులుకొందురుగాక. (ఆలా వదులుకోలేదు సరికదా యెన్నో వ్యావహారికాలు వాడుకోవడం జరిగిందికూడాను) తదితరులు వదులుకోవడ మెందుకంటాను. చూడండీ? మన సోమనాథుఁ డెంతటి రసజ్ఞ హృదయుఁడో తెల్పడానికి నా మనస్సుకు నచ్చింది వొకటి వుదాహరించి చర్చిస్తాను —

క. "మనుజాశనులఁట! బలులఁట!
మునులఁట! యాగంబులఁట నమోవిశ్వసృజే
విన మింతకుమున్నెన్నఁడుఁ
గనికని కొత్తెవ్వఁ డింటికంబము సేసెన్"

యీ పద్యంలో అనుకరణం లేకుండానే సంస్కృతవాక్యం "నమో విశ్వసృజే" అన్నది ప్రయోగించాఁడు మన నిక్కపుఁ గవిసార్వభౌముఁడు, అతనికి నన్నయ్యభట్టీయ సూత్రం "అనుకృతే" అన్నదికూడా తెలియదనడానికి యెవరికి నోరాడుతుంది? యిది దేన్నిబట్టి పుట్టిందంటే? లోకంలో యేదో యీలాటి అనుచిత విషయం మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యగా "అయ్యో! దేవుఁడ" అనడం వుంది. (రామానుజ! శివ!

నారాయణ! ఇత్యాదులుకూడ యీసందర్భంలో వాడుదురు) దానివల్ల తన మనస్సులో వుండే అసహ్యం అంతా వెల్లడి అవుతుంది. అను ధాతువుతో చేర్చ నక్కఱలేదు. చేరిస్తేనో రసం చెడుతుంది.

"రసప్రలుబ్ధ ధియః" అనే మాటకు ఉదాహరణం కాఁదగ్గ కవు లంటే? యీలాటి కవులే. నన్నయ్య 72 ఆర్యా శ్లోకాలు కాఁబోలును ఆంధ్రభాషానుశాసనానికి చెప్పివున్నాఁడు. తావన్మాత్రంలోనే యీ మహా సముద్రం యిమిడిందా? వాఁడి ధర్మమా అని "అథర్వణుఁడు" చాలా భాగం లోటు తీర్చాఁడు. తీరిస్తేమాత్రం యితర కవుల ప్రయోగాలు దాఁకా పోవద్దు. కవి త్రయంవారి ప్రయోగాల వఱకేనా అన్నిటికీ ఆధారం కలిగిందా?

చ. "నరునకు .... .... .... .... చుట్ట మెవ్వరు?"

దీన్ని సాధించఁ గలమా? చుట్టమేమో ఏకవచనం, ఎవ్వరు బహువచనం. విశేషణ విశేష్యభావం యెట్లా? "అనుక్త మన్యతో గ్రాహ్యం" కనక సంస్కృత భాషామర్యాద ననుసరించి "లింగ సంఖ్యా.... విశేషణవిశేష్యయోః విభక్తిః పునరేకా చేత్" అనుకుంటే చక్కఁగా సరిపోతుంది. (సంస్కృత భాషామర్యాద సర్వత్రాపనికిరాదు కొన్ని చోట్లనే) యింత బా ధెందుకు? చుట్ట మెవ్వఁడు అనుకుంటే కుదరదా? అంటారేమో అలా దిద్దేవారినిగూర్చి మాట్లాడు కొనే టప్పుడే "నమో విశ్వసృజే" అని వాక్యమధ్యమందు నమస్కరించవలసి (అనుకరణం లేకుండానే) రావడం. "కావలయున్" అనేదానికి రూపాంతరం 'కావ లెన్" అన్నది లేదని వాదిస్తూ భారత ప్రయోగం. "శ్రీ గావలె నంచు" అన్నది చూపేటప్పటికి-'శ్రీ గాఁదగునంచు' అనిదిద్దుతా మనడమూ ప్రాస చెడుతుందనడమూ లోఁగడ జరిగినవే. ప్రస్తుతం అట్టి చిక్కేవస్తుందని తెలివిడి, ఇతర భాషలకి యిట్టి ఆధారం వుందో లేదో గాని తెలుఁగుకు వుంది. వున్నప్పటికీ అట్టి ప్రయోగాలుకూడా దిద్ది, స్వార్థనిర్వహణానికి ప్రయత్నించడం లేక పోలేదు. ఈ మహాకవి కవిత్వంలో "లోఁగిలి"

శబ్దం అసకృదా వృత్తిగా కనపడుతుంది. ఇది శబ్దరత్నాకరంలో అకార మధ్యంగా 'లోఁగలి' అని వుదాహరించి యతి స్థానంలో ప్రయోగం చూపించాఁడు కాని, ఇకార మధ్యంగా వాడుక వున్నట్టుకూడా వ్రాశాఁడు. కాని ఇకార మధ్యాని కున్నంత శ్రవణ సుఖం అకార మధ్యానికి కన పడదు. ఆ కారణం చేతనే కాఁబోలును సర్వత్రా యీ ముద్రణంలో ఇకార మధ్యంగానే వుంచేశారు సంస్కర్తలు. యిక్కడమాటకేం గాని - 'పేదసాదలు' అనే సుప్రసిద్ధ ప్రయోగాన్ని శబ్దరత్నాకరంలో యెవరోకవి 'పేదసాదులను' అని యతిస్థానంలో ప్రయోగించాఁడని చెప్పి, ఉకార మధ్యం చేయడం చాలా అన్యాయం,

1. వేఱువెల్లఁకులు
2. పేదసాదలు
3. చెట్టుచేమలు.

లోనైన తోవాసప్పదాలకు పూర్వపదంకంటే భిన్నార్థకత్వం వుంద నుకోవడం కంటె అజ్ఞత్వం వేఱొకటి వుండదు. భారతంలో దుర్యోధ నుణ్ణి వెదకడం సందర్భంలో యీ — 'చెట్టుచేమలు' పదప్రయోగం వుంది. అక్కడ 'చేమ' శబ్దానికి పూర్వపదానికి వున్న అర్థం కంటె భిన్నమైన అర్థం వుండేటట్టయితే దుర్యోధనుఁడు తొండో, బల్లో, పిల్లో, యెలకో కావలసి వస్తుందిగాని, రాజరాజ లక్షణాలతో వుండే, 'మహా పురుషుఁడు' కాఁడు. ఈలాటి విప్రతి పత్తులు విచారించక దిద్దే దిద్దుఁ బాట్లనుగూర్చి యిదివఱకే యెక్కడో వివరించి వున్నాను - యెన్నివిధాల పరిశీలించినా - 'పేద' శబ్దానికి తోవాసంగా - "సాద" శబ్దమే రుచిస్తుంది గాని "సాదు" శబ్దం రుచించదు. త్యాగరాయకృతి - "నీదాసాను దాసుఁడ" అన్నదానిలో అనుపల్లవిలో - "పేదసాదలందు నీకు "అనియే వుందిగాని, దాన్ని సహృదయులుగాని వైతండికులు - "పదకవిత్వమా?" అనిచట్టన యీసడిస్తారు. వివాదాస్పదమైన యీ ప్రయోగం మాట కేమి గేయాన్నుంచి దేన్ని - అఖరికి "రామ నీ సమాన మెవరు?"

అనేది వుదాహరించినా ఆలాగే యీసడిస్తారు. యీ త్యాగయ్యగారి వాక్యంలో - "సమానము" అనేది అమహత్తు. "ఎవరు" మహత్తు, పైఁగా బహువచనం. మొదటిది యేకవచనం కనక విశేష్య విశేషణభావం సరిగా లేదని చెప్పి - 'సమాను లెవరు ?' అని దిద్దేవారున్నూ వున్నారు. అందుకే కాళిదాసే కాఁబోలును, " శుష్కాణాం పరిపీడనం నసహతే. శాస్త్రేషు ఖిన్నాత్మనామ్." అన్నాఁడు, కవితారసాస్వాదనాన్ని గూర్చి ప్రసంగిస్తూ. సమానమెవరు ? లోఁగడ చూపిన భారతం -చుట్టమెవ్వరు ? అనేదానిచేత సమాహితమని తెలుసుకోండి — 'శుష్కాణాం' అన్న కాళిదాసోక్తికి అర్థం శుద్ధరస విహీనులు అని పిండితార్థం. (శాస్త్రంలో పండితులే అయినా, రసజ్ఞులు కానివారు పనికిరారు. పండితులు కానివారో, బొత్తిగా పనికిరారు) ప్రసక్తాను ప్రసక్తంగా — 'యు' అనే సముచ్చయలోపాన్ని గుఱించి వ్రాస్తూ చాలా దూరం వచ్చాం. ఆ ప్రయోగం మాత్రమే కాకుండా యీ సోమనాథుఁడింకా అట్టివి మఱికొన్ని చేసి వున్నాఁడు. " ఏమీయెఱుఁగఁడు " ఇచ్చట " ఏమి—యు " అని వుంటే యు అనేది లోపించి దీర్ఘంగా పరిణమించింది. " ఏమియు నెఱుఁగఁడు" అని దిద్దితే దిద్దఁబడకపోదు గాని, తిక్కన్నగారి — " నమ్మినమ్మక " ప్రయోగమందు గౌరవంగల యీ మహాకవి ప్రయోగాన్ని దిద్దడం మహాపచారంగా పరిణమిస్తుందని పరిష్కర్తలు సాహసించలేదు. "విందులు సందడి లేనిముంగిలిందియ్యములేని చాగమును" ముంగిలి + యున్, అనివుండఁగా యులోపమే యిక్కడాను ; (పెద్దతడవుననుండిం బూని వగయిరా లింకా వున్నాయి చూచుకోండి) ఇఁకమఱివొకటి ప్రస్తావిస్తాను— " నీకుమారకుల నేలోకమ్మునందున్నఁ దెత్తునీ కింతేల ?" ఇది శ్రీకృష్ణుని వాక్యం; ఇట నీ + కుమారకులన్ అని విడఁదీయక, శుష్కహృదయులు నీకున్, మారకులన్ అని ఛేదించి అపార్థకల్పన చేయడానికి సిద్ధపడడానికేంగాని-విద్యా వయోవృద్ధులు కొందఱు కుమారకశబ్దానికి ప్రపంచకంలో యెవ్వరూ కొడుకులు అనే అర్థం చెప్పకూడదని శాసించి యేమేమో

వ్రాస్తూవుంటారు. 'యౌవనవంతులు' అనే అర్థం మాత్రమే ఆ కుమారకశబ్దానికి వస్తుందిగాని కొడుకులు అనేది రాదని వారి తాత్పర్యం. ప్రస్తుతం యౌవనవంతులనే అర్థం చెప్పేటట్టయితే కుదరదు. ఈ కొడుకులు పసిపాపలుగాని యౌవనవంతులు గారు. కుమారశబ్దానికి యౌవనవంతుఁడనే అర్థమే కాని - కొడుకు అనే అర్థం లేదు అని శంకించువారు యీ పృథివిపుట్టింది మొదలు యీ యిరవయ్యోశతాబ్దంవఱకూ పుట్టనే లేదు. కుమారశబ్దానికి సర్వసాధారణంగా తెలిసే అర్థం; కొడుకు అనేదే. ఈశ్వరపుత్రుఁడు స్కందుఁడు రెండోది. మూఁడోది యౌవనవంతుఁడు అనేది -

"పేరు వరూథిని యందుఁ గు, మార !
ఘృతాచీ తిలోత్తమాహారిణీ ! "

అనే పద్యంలో వున్న కుమారుఁడు మాత్రం కొడుఁకు గాఁడు. యెక్కడో క్వాచిత్కంగా చెప్పవలసిన యీ అర్థాన్ని పురస్కరించుకొని కాళిదాసు "కుమారకల్పం సుషువే కుమారమ్" అని రఘువంశంలో ప్రయోగించిన ప్రయోగాన్నైనా గమనింపక - కుమారశబ్దానికి కొడుకు అనే అర్థం లేదనిన్నీ, కుమారశబ్దతద్భవమైన కొమరుఁడు అనేదాని కంతకంటే లేదనిన్నీ ఆ శబ్దానికి స్త్రీలింగ రూపమైన కుమారీ శబ్దానికిఁ గాని దాని వికృతరూపం కొమిరె అనే దానికిఁగాని కూఁతురు అనే అర్థం రానేరాదనిన్నీ యౌవనవంతురాలు అనే అర్థమే వస్తుందనిన్నీ "కొమిరె మనోవిచారము" అనే వసుచరిత్రపద్యానికి "కూతురియొక్క" అని వ్యాఖ్యాత వ్రాసిన అర్థం తప్పనిన్నీ, చేసే వాదం మన సోమనాథకవి నాఁటికి పుట్టలేదని యీతని ప్రయోగాలు చెపుతూవున్నాయి. (1) కోలుపడితిఁ గుమారున్ (2) కుమారులం గొనివచ్చుట (3) ఆ రమణికి నుదయించు కుమారుఁడు ఈకుమారశబ్దాలకన్నిటికీ "కొడుకులు" అనే అర్థమేకాని, మఱో అర్థం చెబితే కుదరదు - అయితే సర్వసాధారణంగా అక్షరాస్యులందరికీ తెలిసే యీ విషయం యింత విస్తరించి వ్రాయడం

యెందుకు ? అని ప్రతీ విజ్ఞుఁడున్నూ శంకిస్తాడని యెఱుఁగుదును. కాని నాకు దీనితో యింతగా పనిపట్టడంచేతనే యింతగా వ్రాశానని తెల్విడి - యీ మహాకవి సామాన్యుఁడుకాఁడు. కవిత్రయంకంటేకూడా సమర్థుఁడని చిన్నయసూరి ప్రభృతులచే గౌరవింపఁబడ్డవాఁడు. ఇట్టివాఁడు వాడిన ప్రతీ అక్షరమూ నేఁటికవులకు శిరసావహించతగ్గదే కాని, తిరస్కరించ తగ్గది కాదు.........." వీర గ్గోపించిన నంతకుండు చెడు " ఈ ప్రయోగాన్ని గూర్చి ప్రౌఢవ్యాకరణంలో చర్చించాక మళ్ళా యిక్కడెందుకు యెత్తుకున్నానంటే ? చిన్నయసూరి స్థూలదృష్టిని - " తెలుఁగులమీఁది సాంస్కృతికములకు గసడ దవాదేశము రాదు " అని వ్రాసి వున్నాఁడు. ఆలా వ్రాయుటకు కారణం - వాఁడు చక్రపాణి అన్నచోట వాఁడు సక్రపాణి అనే కర్ణకఠోరరూపం కావలసి వస్తుందనియే. దీన్నిబట్టిచూస్తే చిన్నయ్య సూరికి శ్రవణకఠోరంగా వుండే ప్రయోగం వ్యాకరణ సమ్మతమైనప్పంటికీ అంగికారం కాదని స్పష్టంగా తెలుస్తూవుంది. సూరి నిన్న మొన్నటివాఁడు. తనకు పూర్వులైన కవులలో సుప్రసిద్ధులైనవారి ప్రయోగాలకే ముప్పుమూఁడే వ్రాఁత వ్రాయకూడదు. ( విలువగల కవుల లక్ష్యమ్ములె తామీభారమెల్ల మోయఁగవలయున్ ) నాచన సోమనాథుని ప్రయోగం కర్ణకఠోరంగాలేదు దిద్దడానికి వీలిచ్చేదిన్నీ కాదు. అందుచేత కకారమునకీ నిషేధం వర్తించకుండా జాగ్రత్త పడవలసింది. ఎందఱు చిన్నయ్యసూరులు నిషేధించినా, సోమనాథుని ప్రయోగానికి క్షతిలేదు. సుమారు అయిదాఱు వందల యేళ్ళ నాఁటి మహాకవికి భవిష్యత్కాలంలో రాఁబోయే నిషేధం గోచరించడం అసంభవం కనక సూరిగారిని బట్టి ఆ ప్రయోగం కాదనడం అపహాస్యాస్పదమని యెంచి, త్రిలింగ లక్షణశేషకర్త సూరిదే ప్రమాదమనిసూచించెను. "ఏనవెనాకూఁతురినబె " అని సోముని ప్రయోగంకనపడుతూవుంది. దీనికి ఫుట్నోట్సులో "ఏనీనవెనాకూఁతును" అని పాఠాంతరంగా వుటంకించారు. యిదిసూరిగారి వ్యాకరణాన్నిపట్టి సంస్కర్తలుచేసి వుంటారు - కానిగ్రంథకర్తకుయిది అభిమతమని తోఁచదు.

మొదటిపాఠంలోవున్నంతసుఖం యీపాఠంలోలేదు. అందుచేతే పూర్తిగాదిద్ద డానికిసాహసించ లేకపోయినారు. దీనికి సంస్కర్తల నభినందిస్తాను. యెంద రోమహాకవుల ప్రయోగాలు యిట్టివి నేనుచదివి వున్నాను. సూరిగారి సంకు చిత దృష్టిచేతనే దీనికీ చిక్కు తటస్థించినది. కొందఱు కవులు-'కూఁతురను' అనుటకుబదులు - కూతురిని - అని ప్రయోగించు కొన్నట్లు కనపడుతుంది. సర్వత్రా రేఫశ్రుతం కావడం వ్యవహార రీత్యా అనుభూతంగా కనపడుతుంది. యీ ప్రయోగం శాస్త్రీయమే అయినా " ద్యూతక్రీడకుఁ గొండొకనేతున్ " అన్నదానివలెనే వుంటుంది గాని ( క్రీడకు....నేతున్, అన్నచోట చాలా వ్రాయాలి మఱొకప్పుడు చూచుకొందాం ) హితవుగా వుండదు. వుండక పోయినా పలువురు " పరప్రత్యయనేయ బుద్ధులు " కవులలో వుండంచేత సోమనాధుఁడంతవాఁడు మహాకవి ప్రయోగించిన - " కూఁతురిన్ " అనేది గర్హ్యం కావలసి వచ్చింది. చిన్నయ్యసూరి యేమన్నాఁడూ ? అంటూ యెదురుకొనేవారేగాని-చిన్నయ్యసూరి యెప్పటివాఁడు, యెంతటివాఁడు ? సోమనాధుఁడెప్పటివాఁడు, యెంతవాఁడు సూరిమాట ప్రమాణీకరించి సోమనాధుడి ప్రయోగాన్ని దిద్దడమేనా ? అనే విచారం యుక్తియుక్తమా, కాదా ? అని విచారించేదిక్కు కనపడదు. సూరిగారన్నారు గనక అదే గ్రాహ్యము అనడం పరిపాటై పోయింది. " బుధజన ఇవగ్రామ్యసదసి " అనే అభియుక్తోక్తి ప్రత్యక్షమయి, " పదుగురాడుమాట పాటియైధరఁజెల్లు" అనే తోవలోకి వస్తుంది. సోమనాధుఁడు - " అతీవ భుజక్రమ విక్రమ క్రియాఘనులు " అన్నాఁడు - నా జీవితకాలంలో యిప్పటికి చూచిన దీలా టిది మఱొకటి లేదు. దీన్ని చట్టన తప్పనేవా రుంటారు. " అతీవ " అనేది అవ్యయము. ఇది లాక్షణికావ్యయమా ? ప్రతిపదోక్తమా ? అనే విచారం యిప్పుడు వద్దు. అది సంస్కృతంలో బాహాటంగా వాడేదే కాని, నన్నయాదులు - " అతి " అన్నంతవఱకే వాడుకోఁగలిగారుగాని, దీన్ని వాడుకోలేదు. " అతీవ + భుజవిక్రమః, సుప్సుపేతి సమాసః" అంటే సరిపోయేదే. అయినా కొత్తగా వుండడంచేత తగినంత వ్యుత్పత్తి

లేనివారు శంకించడానికి అవకాశం లేకపోదు. తీరా జవాబు చెప్పవలసి వస్తే యేముంది? "నచశంకా నచోత్తరమ్" "వడ్లగింజలోది బియ్యపు గింజ" అన్నమాదిరిగా వుండేదే అయినా అవ్యుత్పన్నులకు పెద్ద పూర్వ పక్షాలుగా గోచరిస్తాయి. పెద్దనమ్మికతో శంకించి, "బ్రహ్మదేవుఁడు దిగిరావాలి దీన్ని సమర్థించడాని" కంటూ సాహసోక్తులతో శంకించడం జరుగుతుంది. తుదకు చెప్పదగ్గ ప్రత్యుత్తరం లేక - "మూఁడే కాళ్లు" అనే వాదందగ్గిఱకి రావడమేకాక - "శల్యతుల్యో విపాకః" అన్న భర్తృ హరి శ్లోకానికి ప్రథమలక్ష్యంగా పరిణమించవలసి వస్తుంది.

నన్నయ్యగారి - "ఎవ్వనియేని ముఖామృతాంశుబింబమ్మున" అనే సాధ్యసమాసం కూడా యీలాటి ప్రౌఢప్రయోగమే. వీట్లనిగూర్చి చర్చించ వలసివస్తే చాలా పెరుఁగుతుంది. ఉపన్యసించడం కొంత సుళువు. శుశ్రూష చేసి తెలుసుకోతగ్గవే కాని, యివి పూర్వపక్షులుగా వుండి తెలుసుకోతగ్గవి కావు. నన్నయ్యగారి ప్రయోగాన్ని - భారతవిశేషాలలో వుదాహరించినట్లు జ్ఞాపకం. ఈ మహాకవి — "సంగరమ్మునకు నుత్సవము కేగెడు క్రియన్" అని ప్రయోగించాఁడు. నామట్టుకు ఈ నగాగమం లేని ప్రయోగాలు తెలుఁగు శబ్దాలలో మాత్రమే యింపుగా వుంటాయి. "ఆగమశాస్త్ర మనిత్యమ్." అని వుండడంచేత యీ మహాకవి పర్జన్యవల్లక్షణ ప్రవృత్తిగా సార్వత్రికంగా అభిప్రాయపడ్డాఁడు. కృష్ణదేవరాయాదులు —

(1) చెట్టుకొకరుఁడై
(2) సిగ్గుకు సిగ్గులేదు

అంటూ ప్రయోగిస్తూవచ్చారు. ఆయాకవులు బుద్ధిపూర్వకంగా మహాకవిప్రయోగానుసారం వాడుకున్న ప్రయోగాలను కాదనడంకంటె అపచారం వుండదు. యిఁక - "హృదిఁ జైతన్యము వొందఁ దెప్పిఱి నిషాదేశుండు" అనేదాన్ని గూర్చి వ్రాస్తాను. యీ హృదిఅన్నది హృచ్ఛ బ్దానికి సంస్కృతంలో సప్తమ్యేకవచనం. తెలుఁగులో దీనిమాదిరివి — "భువి దివి నీవలనఁ బొడమె" అనేవి రెండుమాత్రమే కనపడతాయి.

సంస్కృతంలో సప్తమి తెలుఁగులో ప్రథమంగా అవతరించిం దన్నమాట. దానికి ద్రుతాన్ని చేరిస్తే తెలుఁగులో సప్తమిగా మాఱుతుంది. యీహృది అనేది సోమనాధుఁడు యతిప్రాసలు రెండూ బాధించేచోట ప్రయోగించాఁడు, కాని దిద్దేవారికి - "ఎద" అని సవరిస్తే కుదరకపోదు - కాని సంస్కరించేవారు సాహసించ లేదు. సోమనాధునికి పూర్వులుకూడా వాడే వుంటారని నాకు తోస్తుంది. వెదికే వోపిక వుండాలి, విచక్షణులు వెదకుదురుగాక - యింకో ప్రౌఢమార్గం సోమనాధుఁడు తొక్కింది చూపుతాను-

"ప్రణుతింతు నో న్నమో భగవతే వాసుదేవాయ....

సూకరాయ నమో యనుచు నుతింతు"

యీ సీసపద్యంలో నమో అనేవఱకూ సర్వమూ సంస్కృతమే కాని మొట్టమొదటమాత్రం — "ప్రణుతింతున్" అనేది తెలుఁగువుంది. తుట్టతుదనున్న అనుకరణం దీన్నికూడా సమర్థిస్తుందని తెల్విడి. ఇట్టిది యిప్పటికి నా కెక్కడా కనపడలేదు. లోఁగడ వుదాహరించిన - 'నమో విశ్వసృజే' ప్రయోగాన్ని బట్టియ్యేవే పిల్లలమఱ్ఱి "అంటితి నమశ్శివాయ పాపాత్మురాలిన్" అని అనుకరణరహితంగా ప్రయోగించుకొన్నాఁడు. ఆప్రయోగమేమి, దానికి ప్రోత్సాహకంగా వున్న సోమనాధుని ప్రయోగమేమి యెంతేనా శ్రవణపేయంగా వున్నా అనుకరణం లేదు కనక పనికి రావనుకొనేవారు మానుకుంటే మానుకోవచ్చును గాని — "పూర్వకవి ప్రయోగదక్ష" లైన యితరులను వెక్కిరించకూడ దని నా తాత్పర్యం. ఈసోమనాధుని వచనరచన విలక్షణమైన పోకడలో వుంటుంది —

వ. " .....ఒడిచియు.....బొడిచియు.....తాఁకించియు.....సోఁకించియు.....ఘట్టించియు......ధట్టించియు......అప్పళించియు......ఉప్పళించియు.....తాచియు....వైచియు...." పద్యములలోవలెనే వచనములలో కూడా ప్రాసనియమం ఈ మహాకవి పాటించుననడానికి పైచూపినమాదిరి వెన్నో లక్ష్యాలు చూపవచ్చును. గ్రంథవిస్తరభీతిచేత మానితిని — తత్సమాకారసంధి ఆముక్తమాల్యదలో కృష్ణరాయలు, భాగవతములో

పోతన్నగారూ మఱికొందఱు (పిల్లలమఱ్ఱి వగయిరా) మహాకవులున్నూ చేసినట్టు కనపడుతుంది. దానికి యితఁడే మార్గదర్శకుఁ డన్నందుకు ఒక ప్రయోగం చూపుతాను - " తలిరులో ? కరికరంబులో ? కుంకుమప్రభో ? " ప్రభ + ఓ ' అని వుండఁగా సంధిచేశాఁడు. దీనిని పాఠాంతరముగా నుదాహరించి సంస్కరించినవారు ' కుంకుమప్రభయో ' అన్నకుంటి పాఠమునే అసలు పాఠముగా ప్రచురించిరి. కాని తత్సమసంధి చేసిన పాఠమే హృద్యముగా నున్నదని సహృదయులు గుఱుతింపకపోరు. ఇత నింబట్టియే భాగవతకర్త " సంపదేటికి " అనిన్నీ, పిల్లలమఱ్ఱిమహాకవి ' వీరమాతఁట ! ' అనీన్నీ శ్రీకృష్ణదేవరాయలు " చేష్టుడిగె - గంగను కాసె " అనిన్నీ వాడుకొని యున్నారు. కొన్నిచోట్ల, ఈతత్సమాకారసంధి చేస్తేనే బాగుంటుంది కాని చేయక యడాగమం చేస్తే పరమాసహ్యంగా వుంటుంది —

' నిందా నెత్తిపైకెక్క ' అన్నప్రయోగమే హృద్యమో ? ' నిందయా ? ' అన్నదే హృద్యమో ? సహృదయులకు గోచరిస్తుంది. దీన్ని యీలావుంచి కుమారధూర్జటి కవిత్వంలోన్నుంచి తీసి వకహృద్యమైన ప్రయోగాన్నిగూర్చి లోఁగడ చర్చించే వున్నా, ప్రసక్తి కల్గింది కనక మళ్ళా కొంచెం చర్చిస్తాను —

" పదునాల్గు కోటులేనా ? " అని దిద్దరానిచోట ప్రయోగించి వున్నాఁడు - ' కోటులు + ఏ + ఆ ' అని వుండఁగా నకారాగమంవచ్చి ఆరూపం కావాలి. నకారాగమానికి సూత్రంలేదు - (తెలుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది) అందుచేత - ' కోటులేయా ? " అనిఅవుతుందని మిడిమిడిజ్ఞానులు అభిప్రాయపడి, శుద్ధపత్రికలో తమప్రయోగాన్ని (ప్రశంసయేనా అనేదాన్ని ప్రశంసయేయా ! అని) దిద్దుకోవడమున్నూ, ఆలా దిద్దుకో నక్కఱలే దబ్బాయీ ! అని బోధించడమున్ను నేఁటికి ముప్పైయేళ్ళనాఁడే జరిగింది.

"ద్రుతోపజీవులు" కొన్ని యిట్టివున్నట్టు అహోబలపతి సూచించి వున్నాఁడని జ్ఞాపకం. పింగళిమహాకవి లోనైనవారిప్రయోగా లెన్నో వీటి సజాతీయాలు కలవు. భగవంతుఁడు తగినంత జ్ఞానంయిస్తే సంతోషమే. ఆలా యివ్వనిపక్షంలో అసలే జ్ఞానశూన్యత్వం అనుగ్రహించాలి గాని, మిడిమిడి (జ్ఞానలవదుర్విదగ్ధత్వం) జ్ఞానం యివ్వడం యెంతో హాన్ని కలిగిస్తుందని తెల్పడానికి పైనిచూపిన ఉదాహరణం చాలు నను కొందును. యతివిషయంలో యిట్టిదే వకటి చూపుతాను - "వాం, ద్రేనిఁ దరించునట్లు కరుణింపవలెన్." అనుచో యతిభంగమని వాదం వచ్చింది. యిచ్చట — వాండ్రు + ఏని అని విఱుగుతుంది కనక అచ్చుకే యతి పెట్టాలిగాని హల్లుకి పెట్టకూడదని వాదం. చూడండి యిది యెట్టి పరిశీలనమోను? సులక్షణసారంలో ఇంచుగాగమ యతి అంగీకరించి వుదాహరణా లిచ్చివున్నాఁడు. దాన్ని అప్పకవి కూడదు, పనికిరాదన్నాఁడు. ఆఖండన అవిచారమూలకంగా కనపడుతుంది. గుప్తార్థప్రకాశికలో కల్లూరి వారు భారతాన్నుంచి ఉదాహరణాలుచూపి ఇంచుగాగమయతి శాస్త్రసమ్మతమే కాక మహాకవి సమ్మతంకూడా నని వ్యాకరించి వున్నారు. అయినప్పటికీ ఆ తోవని సమాధానం చెప్పనక్కఱలేదు. అప్పకవీయంలో — 'ఏని' అనేచోట సంధి చేసినప్పుడు 'ఉభయయతి' చెల్లునని లక్షణంవ్రాసి-

క. "పెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁ డేనియుఁ దుదిఁ దా
నిట్టట్టులనక నెమ్మది
నెట్టన హరిఁ బలుకఁ గలిగెనేని మహాత్మా!"

అని ఉభయానికీ సరిపడ్డ లక్ష్యాన్ని శేషధర్మగ్రంథాన్నుంచి యెత్తి చూపివున్నాఁడు - 'ద్రే' అనేదానికి వెనక అనుస్వారం వుంది. బిందు పూర్వకమైన, 'ద్రే' కరుణించులోవున్న 'ణి' అనేదానికి యతిచెల్లడానికి ఆటంక మేముంటుంది? యింతమాత్రం పరిశీలనలేక — "తప్పుల కుప్ప, అనిన్నీ, యేమో అనిన్నీ, బ్రహ్మదేవుఁడు రావాలి దీనిసమర్థనాని

కనిన్నీ ప్రగల్భవాక్యాలు వ్రాసి పరాక్రమించే వ్రాఁతలకు యెంత చింతించినా సంతుష్టి కలగనే కలగదు. యిట్టి వ్రాఁతలవల్ల కేవలకవులుగా వుండేవారికి వచ్చేచిక్కు అంతా యింతా కాదు - ప్రబోధచంద్రోదయంలో "సర్వజ్ఞా ఇతి దీక్షితా ఇతి చిరప్రాస్తాగ్నిహోత్రా ఇతి బ్రహ్మజ్ఞా ఇతి పండితాఇతి దివాధూర్తైర్జగ ద్వంచ్యతే." అన్నాఁడు వొకానొకసందర్భంలో. ప్రస్తుతంకూడా అలాటివంచకత్వమే (బుద్ధిపూర్వకం కాకపోయినప్పంటికీ) సంఘటిస్తూ వుంది. "మహాజనో యేన గత స్స పంథాః." కనక నామరూపాలున్నవారు పేరుప్రతిష్ఠలున్నవారు యేదేనామాట వ్రాయవలసివస్తే యెంతో ఆలోచించి కాని వ్రాయకూడదు. వ్రాస్తేనో? అది సామాన్యులకు మిక్కిలీ బాధకంగా పరిణమిస్తుంది. లోకంలో వేయికొక్కరుంటారో వుండరో? కవులలో తగినసామగ్రిభాగ్యం కలవారు అనేకులు పరప్రత్యయనేయబుద్ధులే కనక అవిమృశ్యకారులైన విజ్ఞులను గూర్చి పొరఁబాటు సిద్ధాంతాలు వెలిఁబుచ్చవద్దని ప్రార్థించి మఱివొక విషయం వుపక్రమిస్తాను. భారతంలో తిక్కన్నగా రొక సద్గురావృత్తాన్ని పూర్తిగా వొకచే సమాసంగా పూరించారు. ఈ సోమనాథుఁడున్నూ అదే విధంగా, "గాండీవారావ" అని ప్రారంభించి తుట్టతుదకు "సంతానముంగానన్నైతిన్" యీ సమాసాల కూర్పునుగూర్చి నాకు తోఁచినమాటలు కొన్నివ్రాస్తాను — ఆరభటీ వృత్తికిన్నీ తేజోగుణానికిన్నీ యీ సమాసగ్రథనం స్ఫోరకంగా వుంటుంది. అంతేనేకాని, దీనివల్లవచ్చే విశేషం అంతగా కనపడదు. భవభూతి దీన్ని కొంచెంగా —

శ్లో. గుంజత్కుంజకుటీర కౌశికఘటాఘూత్కార వత్కీచక
స్తంబాడంబరమూక మౌకలికులః క్రౌంచాభిధోఽయం గిరిః.

అంటూ గౌరవించినట్టు తోస్తుందిగాని కాళిదాసు దీనియం దాదరం చూపినట్టులేదు. దీన్నిబట్టి కాళిదాసుని ఈసడించేవారున్నూ వున్నారు. ఇతరులమాటకేం కొన్నియేళ్ళకిందట నేనూ వారిలో వొకఁడనే. ఈలోపాన్ని తీర్చడానికి 'కవికంఠపాశం' అనే పుస్తకం కాళిదాసవిరచితం

వొకటి వున్నట్టు కొందఱు చెప్పడం కలదు. అది ముద్రితమయింది కూడాను. విద్యార్థిదశలో దాన్ని చదవడంకూడా తటస్థించింది. దీర్ఘ సమాసగ్రథనమే కాక నాల్గోచరణాన్ని యే అక్షరంతో మొదలుపెడితే దానితోటే తదాదిపదాలతోటే పూర్తిచేయడంకూడా వొకవిశేషం — "ఖడ్గీవ ఖగరాజవత్ఖచరవత్కాకోలవ త్కాకవత్" ఈమాదిరినే ప్రతి శ్లోక చతుర్ధ చరణమూ ముగియడం. అర్థంవుందో లేదోగాని చెప్పినవారు లేరు — అర్థమే చెప్పఁగలవా రంటూ సర్వత్రా వుండేయెడల దానిపేరు (కవికంఠపాశం) నేతిబీఱకాయ కావలసి వస్తుందిగదా! ప్రస్తుతం మన సోమనాధుడు సంస్కృత సమాసాలు గుప్పడంలో అందెవేసిన చేయనే చెప్పాలి —

"కుందగిరిమల్లికా... కాంతివినిమయంబై" అని వచనంలో నున్న దీర్ఘసమాసంలోవున్న అక్షరాలు లెక్కిస్తే సుమారు 183 వఱకూ వున్నాయి. విస్తరభయంచేత యావత్తున్నూ వుదాహరించలేదు. అలాంటిసమాసాలు వొకటీ రెండూ కావు, శరపరంపర-చూచుకోండి. సమాసగ్రథనానికి తెలుఁగు కవులలో అగ్రగణ్యుఁ డని చెప్పఁదగిన నన్నయ్యగారు కూడా యింతింత "కొండవీటిసీమచేంతాళ్లు" ప్రయోగించినట్టులేదు. ఈపరిశ్రమకంతకూ ఫలితం కవికి సంస్కృతంలో అపారమైన పాండిత్యం వుందిసుమా! అని లోకానికితెలియడమే కాని, యితరం నాబుద్ధికి కనపడలేదు. సంస్కృతపాండిత్యం కచ్చాపచ్చాగా సేకరించి పెద్దపాండిత్యం వున్నట్టు నటించే "ఆంధ్ర కవులు" యీ 19—20 శతాబ్దాలలోతప్ప అంతకు పూర్వం లేనే లేరేమో అని వారివారికవిత్వాలవల్ల గోచరిస్తుంది. కనుపర్తిఅబ్బనా మాత్యుఁడు కొన్ని దీర్ఘ సమాసాలైతే వాడివున్నాఁడు గాని, ఆసమాసాలవల్లనే అతనికి సంస్కృతపాండిత్యం నిర్దుష్ట మయినది కాదని స్పష్టపడుతుంది. ఇతనికి మార్గదర్శకుఁడుగావున్న కర్ణరసాయనగ్రంథకర్త పాండిత్యం యితని పాండిత్యంవంటిది కాదు, నిర్దుష్టం. కాని,మృదుపాకంలో అబ్బనామాత్యుఁడే ఘనుఁడు. సంస్కృతపాండిత్యం విశేషించి వున్నంతమాత్రంచేత కవిత్వం

రసవంత మవుతుందని చెప్పడానికవకాశం లేదు. ఆమహాయోగమల్లా ఆదికవి నన్నయ్యగారికీ పిమ్మట శ్రీనాథుడికీ పట్టింది. ప్రస్తుతం మనసోమనాథుఁడికి యీ సమాసాడంబరంవల్ల పెద్దపేరు వచ్చినట్టునేననుకోను-యింకేమంటే "అంజెడవు గాక నను( జెం.తంజేరఁగనీక యెంత తగ్గిన మిరియాలుం జొన్నల సరిపోవే" యీలాటి పద్యాలవల్లనే పేరు వచ్చిందని నాతలఁపు. పాండిత్యం లేకనే వున్నట్టు నటించే కవులుమాత్రం దైవవంచితులు. ఇతఁ డెత్తినకఠినప్రాసలు చాల వున్నాయి.

ష్ఠ, వ్య, ంజ్వ, మ్న, ంఖ మొదలైన ప్రాసలతో అవలీలగా పద్యాలు పూరించిన యితని ధారాశుద్ధి అత్యద్భుతం. అందులో-ంజ్వ, ప్రాస యితని కవిత్వంలోనే తప్ప నే నిప్పటి కెవరికవిత్వం లోనూ చూచిన జ్ఞాపకం లేదు. ఆయీకఠినప్రాసలు యితఁడు కేవలంగా పాండిత్య ప్రకటనార్థం యెత్తినట్టు కూడా కనబడుతుంది. యితనికవిత్వంలో వున్న ఉచ్చమల్లి వగయిరా కొన్నిమాటలకు సందర్భోచితమైన అర్థం వ్రాసి యితనిపద్యమే వుదాహరించడంచేత ఆపదం యితఁ డితరత్రా చూచి ప్రయోగించిందికాదనిన్నీ ఆనాఁటి వ్యవహారంలో వుపలబ్ధమై వుంటుందనిన్నీ అనుకోవలసి వుంటుంది. కొందఱు కవులు యీలాటి వ్యావహారికాలు వాడుకోవడమూ ఆప్రాంతంలో వుంది. యీప్రాంతంలో వుంది యీపదం అని వ్యాఖ్యానం వ్రాసుకోవడమూ అయితే వుందిగాని, మళ్లా వృథాగా యితరుల మీదఁకి కయ్యానికి వుపక్రమిఁచడం శోచ్యం. 'నగ్నిక' అనే అర్థంలో వాడినపైపదము జుగుప్సాత్మకమైన అశ్లీలాన్ని కలిగించేదే అయినా ఆ ప్రకరణం అట్టిదే కనక దోషం లేదని లాక్షణికసమయం. ఈమహాకవి సొగటాల పాళీ ఆడడంలో ప్రయోగించిన ప్రయోగాలు ప్రస్తుతం అనుభవంలోలేక, అర్థం కావడం లేదు.

లోహటంబులు-పరదాళములోనైన మాటలకు శ-ర-లో అర్థం వ్రాయనే లేదు. ఈకవి 'వెంద్రుక' అనే పదాన్ని-మిక్కిలీ స్వల్పమనే అర్థంలో వాడియున్నాఁడు. దిద్దడానికి అవకాశం లేదు. ప్రాసస్థానం.

వీట్లకు నిఘంటు చూపవలసిందనే పూర్వపక్షులున్నూ వుంటారు. పైఁగా ప్రయోగం మఱివొకకవిది చూపు మంటారు. వారికి జవాబు చెప్పడంకంటే అవివేకం వుండదు. భారతంలో "అందఱు" అనే అర్థంలో వొకచోట— 'ఎవ్వరు' అని ప్రయోగింపఁబడింది. ప్రకరణవశంవల్లనూ ఉచ్చారణ స్వరం వల్లనూ ఆస్థలంలో అట్టి అర్థం సుళువుగానే వస్తుంది. కాని, అంతమాత్రం చేత దానికి అది పర్యాయ పదం కాదు. అందుచేత నిఘంటులో ఆ అర్థం దానికి వ్రాయరు. భారతవిశేషాలలో దీన్ని యెత్తుకున్నట్టు జ్ఞాపకం. తిక్కన్నగారు యిదే అర్థంలో - "ఈఁగకాలియంత" అనిఁ వాడినారు. మనసోమనాథుని ప్రయోగానికి - "వాలాగ్ర శతభాగస్య శతధా కల్పిత స్యచ" అనే ఉపనిషద్వాక్యం మార్గదర్శకం అవుతుంది. ఇదే అర్థంలో సోమనాథుఁడు 'ఈఁగలతిండి' - పదం వాడినాఁడు. తిక్కన్నగారికి లోకవ్యవహారమే ఆధారం. ఈఁగకాలుకంటేనున్నూ తలవెండ్రుకకంటే నున్నూ, సూక్ష్మపదార్థాలు వున్నా వాట్లని కవులు సూక్ష్మార్థంలో యెత్తు కున్నట్టు లేదు. ఇఁక మఱివక ప్రయోగాన్నిగూర్చి చర్చిస్తాను —

"తత్కార్యముకై" ఇక్కడ - తత్కార్యముకున్ ఐ అని పదచ్ఛే దము చేసుకుంటే, నగాగమాన్నిగూర్చిన చర్చ వుంటుంది. కాని కొరకు కై చతుర్థి అనుకొనేపద్ధతిని — "నచ శంకా నచోత్తరమ్." అనవసరమే అయినా యింకొక ప్రయోగాన్నిగూర్చి వ్రాస్తాను.

"క. వసుదేవుని నాహుకునిన్
వెస సాంబుని నుల్మకునిని విపృథునికై నే
యు సభాక్షకు నందకునిని
నసమానబలాఢ్యులైన యదువులనెల్లన్."

పై పద్యంలో గీట్లుంచినచోట్లు తిక్కన్నగారి 'ఏనిని' ప్రయోగం వంటివి - ఏనిన్ + ఇ, ఏనిని ద్రుతానికి స్వత్వం. ప్రస్తుతం ఉల్మకున్, ఉల్మకుని ఉల్మకునిన్, ఉల్మకునిని, ఇట్లే వందకునిని అన్నదియు

నెఱుంగునది. ఈప్రయోగం పుట్టింది మొదలు యింతదాఁకా ఆక్షేపించిన వారు లేరు. నేఁడు దీనియోగం యీలాపట్టి పదచ్ఛేదంచేసి వ్యాఖ్యానించ వలసి వచ్చిందని విచారింపవలసివచ్చింది. విచారిస్తే యేముంది ? యేమీలేదు.

"వడ్లగింజలోది బియ్యపుగింజ". ఈమహాకవి గజిబిజించు, పటుతళించు మొదలైనవి కొన్ని అపురూపధాతువులు వాడినాఁడు. శ-ర-లో వాట్లకి యితణ్ణే ఆధారంగా ఉదాహరించారు. మఱిన్నీ యీకవి వీఁడుగో అనే అర్థమందు - 'వీఁడుగొమ్మని చేసాచె' అని ప్రయోగించె. వీఁడుగో అనేదానిలో 'గో' సరళం. ఇది పరుషమేమో ? కొనుధాతురూపమేమో. విమర్శకులు పరిశీలింతురుగాక.

వీడుగో వాఁడుగో, ప్రయోగాలకంటె ప్రకృతప్రయోగమే శ్రవణ సుఖంగా కనపడుతుంది. మఱిన్నీ యీ మహాకవి - "త్రికోణమణి మంటప" అని మూఁడుకోణములుగల అనేఅర్థమందు వాడుకున్నాఁడు. పండితులదృష్టిలో యీ శబ్దమందు లేశమూ దోషం లేకపోయినా పామరులదృష్టిలో దోషం లేకపోలేదు - 'చంద్రరేఖావిలాపం' అనే పచ్చిబూతు పుస్తకంలోనే కాదు మఱి కొన్నిచోట్లకూడా ఈ పామరవ్యవహారాన్నే కవులు అనుసరించారు. ఈ కోణశబ్దానికి త్రిశబ్దంతో బంధుత్వం కలిపితేనే ఈ దురర్థం వస్తుందిగాని (షట్కోణవగయిరా, చూ.) యితర సంఖ్యావాచక బాంధవ్యంలో యేదోషమూలేదు — దేనికంటేకూడా లోకవ్యవహారం బలీయం అంటే కాదనేవా రుండరు. కనకనే మేఘసందేశంలో - 'ఘాస శ్యామాన్' అనేపాఠం మనతెలుఁగుదేశంలో కనపడుతుంది. నాగరలిపిలోనో ? 'శష్పశ్యామాన్' అనే యథాశ్రుతపాఠమే కనపడుతుంది — మనదేశంలోతప్ప యితరత్ర యీశబ్దానికి దురర్థం వున్నట్టు లేదు. ప్రకృతం విచారింపఁబడే - 'త్రికోణ' పదానికి యౌగికార్థద్వారాగా దురర్థం రావడానికి యేకొంచెమో అవకాశమేనా వుందిగాని, ఘాసార్థకమైన శష్పశబ్దానికి అట్టి అవకాశం లేశమూ లేదు. యెవరో పండితులు —

"నాకు గడ్డిపఱక పోతే యెంత లక్ష్యమో అది పోయినా అంతే లక్ష్యం" అనే అర్థంలో ఆ పదాన్ని వాడితే, దాని యథార్థం తెలియని పామరులు దురర్థంగా భ్రమించి (అనడ్వాహౌ అంటే పొట్లకాయలని భ్రమించినట్టు) నిక్షేపంవంటి యీ శబ్దానికి యీలాటి దురవస్థ తెచ్చిపెట్టినట్టు విస్పష్టం - యేలాగయితే యేమి యిప్పుడాశబ్దాన్ని తెలుఁగుదేశంలో వెలేసినట్లయింది - పరికృత "త్రికోణ" శబ్దంకూడా అట్టిదేకాని, మనసోమనాథుని నాఁటి కింకా దీనికీ చిక్కు వచ్చినట్టు తోఁచదు. ఆకారణంచేతనే వాడుకున్నాఁడు - లేదా? ఈతఁడు వుండే కడపమండలంలో అసలే యిట్టిదురర్థం యీపదానికి లేదో? నన్నయ్యగారు గోదావరీమండలంవాఁడే కదా! ఆయన — "అనుష్ఠించునది" అని ప్రయోగించారు. మామండలంలో సర్వత్రా యీ "అనుష్ఠించు" దురర్థంలో వాడడం వుంది. అయితే ఆయన కాలంనాఁటికి వుందో, లేదో? యీవిషయం సుఖసుఖాల తేలేది కాదు. కొన్ని పుట్టుకతోనే (పుచ్చు - పాఱు - లోనైనవి) దురర్థాన్ని నెత్తిని బెట్టుకు పుట్టినవిన్నీ వున్నాయి. భారతంనిండా అవే. వారికి యీమాత్రమూ తెలియదా? బాగా పరిశీలిస్తే యిట్టి శంకలు. శంకించడం సహృదయలక్షణం కాదనే నిష్కర్షగా చెప్పవలసివస్తుంది. యింకా యీ కుళ్ళం కలతో — "రామునితోఁక పీఁకి" మాదిరిని ముడిపెట్టేవి కొన్ని కనపడతాయి. అట్టివి సంస్కృత పండితులుకూడా అంగీకరించి చర్చించడం చూస్తే ఆశ్చర్యంగా కనపడుతుంది - "చకాశే పనసప్రాయైః పురీషండ మహాద్రుమైః" వగయిరాలు చూడండి. ఇంకా లోఁతుకు పోతే - "కేశవ" శబ్దం పనికిరాదు. 'శివ' శబ్దంకూడా 'శవ' శబ్దస్ఫోరకం అవుతుందని వదులుకోవలసి వస్తుంది —

"ఈశార్థమంభసి" భారతప్రయోగం దేనికో స్మారక మనవలసి వస్తుంది. (కృతపంచాంగ వినిర్ణయో నయః వగయిరాలు కూడా చూ.) శేఫాలికాశబ్దం అసలే పనికిరాదు. యింకావున్నాయి యిలాంటి నిక్షేపం వంటి శబ్దాలు. ఇవి వ్యవహారతః దుష్టాలుకావు. పరికృతం విచారింప

బడే - "త్రికోణ" శబ్దం వ్యవహారతః దుష్టంగా వుంది కనక కవులు ప్రయోగించకపోవడమే మంచిది. అయితే యీ మహాకవి యెందుకు ప్రయోగించాఁడంటే? వినండి. యీ వ్యవహారాలు వొక్కొక్క-దేశంలో వొక్కొక్క-విధంగా వుంటాయి. గద్వాల ప్రాంతంలో లేచు ధాతువు మృతార్థకం, గోదావరీమండలంలో ఆ అర్థమందు పోవు ధాతువును వాడతారు. మావైపున దొబ్బు ధాతువు కొంత దురర్థకంగా వున్నా దొంగతనం అనే అర్థంలోమాత్రం స్త్రీలుగూడా వాడతారు. పోతరాజుగారు

1. "ముందటికి ద్రొబ్బెఁ దండ్రికి మ్రొక్క-మనుచు"
2. "రంగక్షోణిం బడద్రొబ్బెఁ గృష్ణుడు వెసన్ గంసు న్నృపోత్తంసున్"

అని ప్రయోగించారు. ఆప్రాంతంలో యీ ధాతువు గ్రామ్యార్థకం కానట్టే మనసోముని కాలంనాఁటికి ఆయీపదం దురర్థకం కాలేదనిగాని, ఆప్రాంతంలో దీనికి దురర్థమే లేదనిగాని సమాధానం చెప్పుకోవాలి. "పునస్సంధాన" పదము గర్భాధానార్థమందు మామండలంలో పండిత పామరసాధారణ్యేనా వాడడంవుంది. ఆత్మకూరు సంస్థానంలో వుండే పండితులు యీపదానికి అర్థమేమిటని ప్రశ్నించారు. వారివైపున "ప్రయోజనం" అనేపదాన్ని యీఅర్థమందు వాడతారు. మనతెలుఁగుదేశంలో శోభనము అనేపదం వాడతా రందఱూకూడా. తెలుఁగుదేశంలో పుట్టి పెరిఁగినవారుకూడా దీన్ని ఆక్షేపిస్తే యేమనేది? దేశభాషాకవిత్వం చెప్పేవారికి - గ్రామ్యాలు తప్ప తక్కి-నవ్యావహారికపదాలన్నీ వాడుకోవచ్చునని ఆయాకవుల ప్రవృత్తి చెపుతుంది - (కేవలగ్రామ్యపదముల నేవగించి, దేవీభాగవతం చూ.) "నిర్భాగ్యదామోదరున్" వగయిరా మహాకవి ప్రయోగాలు చూచుకోండి, శ్రీమహావిష్ణువు నామాలలో వకటిన్నీ - దామ - వైజయంతీ - ఉదరే, యస్య, సః, దామోదరః, అనే చక్క-ని అవయవార్థం వున్నట్టిదిన్నీ, దీనికిట్టి దరిద్రరూపార్థకత్వం యేలావచ్చిందంటే? వ్యవహారమే బలీయమని సమాధానం. ఈలాటి దురర్థం — ఇంద్రాణి వగైరా మఱికొన్ని శబ్దాలకు్కూడా వుందిగాని, ఆయీ శబ్దా

లను కవులు వదులుకున్నట్టు లేదు-బొత్తిగా జుగుప్సార్థకాలయితే (అదేనా వారివారి పాంతంలో వుంటేనే) కవులు ఆశబ్దాలు వదులుకోవడమువుంది- మొత్తం యీవిషయంలో పామరులకే పండితులు జంకవలసి వుంటుంది. బాగా ఆలోచిస్తే యెప్పుడూ పామరులదే బలంయెక్కువ. కవులలోకూడా పండితకవులు మిక్కిలితక్కువ. యేమంటారా ? కవిత్వం మనిషికి పుట్టుకతోనే పుడుతుంది - సంస్కృతభాషలో అంతమాత్రంచేత రచన సాగించడం పొసఁగదుగాని దేశభాషలో యేవో సొంతంగా కావ్యాలూ నిఘంట్లూ చూచి "పుంసివా కొమ్మెక్కి ఇత్యపులు గూయఁగా కోనంగుఁ దేయఁగా....అప్యేకదంతుండు ఆడఁదొడఁగె" అంటూ రచనసాఁగుట కభ్యంతరము లేదు. ఆలాంటిస్థితిలో గురుశుశ్రూష చేసి శాస్త్రాభ్యాసం చేయడం యెవరికోగాని సంఘటించదు - కాని ఆలాటికవులు తమతమ సంశయములు విద్వత్కవుల నాశ్రయించి తీర్చుకోవడంకలదు. కొందఱో ఆలాచేయక సర్వజ్ఞత్వాన్ని నటిస్తూ యీలాటి మహాకవుల ప్రయోగాలను బట్టి ప్రయోగించిన ప్రయోగాలనే మొదట తెలియక ఆక్షేపించి పిమ్మట మార్గాంతరం లేక "సహేంద్ర తక్షక" న్యాయాన్ని అవలంబించి ఆయీ మహాకవులను కూడా దూషించడం శోచ్యం. యీమహాకవికి సంస్కృతంలోగాని తెలుఁగులోఁగాని వున్న పాండిత్యం యెంతో నిర్ణయించి చెప్ప డానికి ఆకాలపు మహాకవులకేగాని యీపిదపకాలంలో కవులమనిపించు కొనే అస్మదాదులకు లేశమూ అలవికాదు-అట్టి కవిశేఖరుఁడు యేది ప్రయో గించినా అందఱూ శిరసావహించడమే నాకు అభిమతం. నాలెక్కేమిటి? శ్రీనాథాదు లందఱూ శిరసావహించినట్టు వారివారి గ్రంథాలు ఘోషిస్తూవు న్నాయి. ప్రసాదగుణంమాత్రం తక్కువ అని కొందఱు వ్రాసింది నిజమే. అప్పటికాలంలో యీలా వుంటేనే (నారికేళపాకంలో) కాని మెచ్చేవారు కారేమో ——

"కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభాషాలలి తాంగిమాఱుట" సత్కవిసమ్మత మని అందఱున్నూ అంగీకరిస్తారు.

ఈసందర్భం మహాభారతం మొదలు నేఁటిదాఁకా వుండే పుస్తకాలు సవిమర్శంగా చదివితే విస్పష్టమవుతుంది- క్రియలోమాట- యీలాటిమహాకవుల ప్రయోగాలు వ్యాకరణాన్ని శిక్షించడం యుక్తంగాని, నిన్న మొన్న పుట్టిన వ్యాకరణాలు (అసమగ్రాలు) ఆయీకవుల సుప్రయోగాలను శిక్షించడం యుక్తంకాదు, ఆలా శిక్షించవలసివస్తే అది- "గ్రుడ్డు పిల్లను వెక్కిరించడం" కనక విస్తరించ నక్కఱలేదు. ఓపిక వుంటే యీపైని శైవకవుల నిగూర్చి వ్రాయాలి చూచుకుందాం.

కొన్ని గ్రామ్యములను మహాకవులు వాడుతూ వున్నట్టు లోఁగడ సూచించి వున్నాను. కాని, ఆ వాడడాన్ని గుఱించి కొన్నిమాటలు వ్రాయవలసి వుంది - కవులు యేలాటిచోట్ల వాట్లను వాడతారంటే అక్కడ ఆ పదమే వాడితే శ్రవణసుఖంగా వుంటుంధనిన్నీ అన్యం వాడితే శ్రవణసుఖంగా వుండదనిన్నీ తోఁచినప్పుడే వాడతారు - 'పదునాల్గు కోటులేనా?' అన్న ప్రయోగాన్ని గూర్చి లోఁగడ వ్యాఖ్యానించి వున్నాను. పదునాల్గు కోటులేయా? అని దాన్ని దిద్దితేనో? చెప్పవలసిందేమి? సర్వాసహ్యమే అనుట నిర్వివాదమేకదా; 'సంవత్సరన్నఱ' అన్నది దిద్దవలసివస్తేనో? సంవత్సరము + అఱ, కనుక రెండును కల్పితే, 'సంవత్సరపుటఱ,' కావలసి వస్తుంది. ఆయీ ప్రయోగం హృద్యమేనా? వ్యాకరణాధారము లేకున్ననూ మొదటిదే వాడుకోవలెను. (1) ఎనమన్నూఱు (2)తొమ్మన్నూఱు (3) ఒకానొక (4) యదాయదలు (5) పదాపదలు, ఎనిమిదిన్నఱ తొమ్మిదిన్నఱ ఇవన్నీ లోకవ్యవహారంవల్లనే సమాధేయాలు. అథవా యిందులో కొన్ని భారతంలో వున్న కారణంచేత యేదో వక సూత్రం స్పష్టమై వుందనుకున్నా, అది నిన్న మొన్నటిదేకదా? నేఁ డింకొకటి వ్యాకర్తలు సృష్టించుకోవలసిందేగాని, చెవికి కంటకంగా వుండేటట్టు ప్రయోగించుకోఁ గూడదు——

ఇఱవై - అఱువై డెబ్భై వగయిరా ప్రయోగాలు ఇరువది అఱువది డెబ్బది అని ప్రయోగించుకున్నప్పటికీ సొంపు చెడదు. చెడకపోయినా

శ్రీనాథుఁడు సవరించడానికి వీలుగానిచోట మొదటిరూపాలే వాడడంచేత 'అనింద్య గ్రామ్యాలు' గాఅవి కవులకు శిరోగ్రాహ్యాలే కాని, పరిత్యాజ్యాలుకావు - ఆకాలంలో వీట్లని గుఱించి శంక రాకుండా వుండదు - తగిన సమాధానం చెప్పేవుంటాఁడు ఆసార్వభౌముఁడు. అతఁడు "పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడ డిండిమభట్టుకంచు ఢక్క" అని నిరాటంకంగా చెప్పికోఁదగ్గవాఁడు గాని పిండి లేనివాఁడు కాఁడుగదా! పనిలో పని - తెలియక కొందఱు తప్పనుకొనేది యింకోటి వుదాహరించి చర్చిస్తాను. ".... క్రూరవశుఁడై మనుజుండూహాపోహ లెఱుంగక" అని భాగవతంలో శ్రవణసుఖ మెఱిఁగిన పోతరాజ శిష్యుఁడు నారయ కవీంద్రుఁడు ప్రయోగించాఁడు. 'ఊహశ్చ, అపోహశ్చ' అని ద్వంద్వం ఊహాపోహములు, ఊహాపోహలు అని రెండురూపాలూ (చరితాదిరాకృతి గణః) సాధువులు. కాని, ఉువర్ణక సహిత రూపంకంటె రహితరూపమే (ఊహాపోహలు అనేదే) శ్రీవణసుఖంగా వుంటుంది. పైఁగా శిష్టవ్యవహారోపలబ్ధంకూడాను. అందుచేతనే రసమెఱిఁగిన నారయమహాకవి — "ఊహాపోహ లెఱుంగక" అని వాడుకున్నాఁడు. దూత-దూతుఁడు, అనే రూపద్వయమున్నా శాస్త్రతః నిర్దుష్టమే అయినా దూత అనేదానిలో వున్న సుఖంలో యెన్నో వంతున్నా డువర్ణక సహితంలో కనపడదు. ఈలాటిదే—— 'తాతుఁడు—తాత' అనేది (తాతస్తు జనకః పితా) వొకటివుంది. ఛందో బద్ధకవిత్వాలలో ఈ నియమంపెట్టుకుంటే కాపరం తుదనెగ్గదు గాని, జరిగినంతలో శ్రవణసుఖానికే ప్రయత్నించడం సరసకవులపని— 'హరీ; తాతకున్ దాతవై' అని రామలింగం ప్రయోగించాఁడు — దీనిలో వకతాత ధాతృశబ్దభవం, వొకటో? పితామహవాచకం దేశ్యం, లేదా అదీకూడా తద్భవమే అనుకోవచ్చును. రామలింగంకూడా శ్రవణసుఖాన్ని గూర్చిచాలా పాటుపడతాఁడు - శ్రీవణసుఖం యెక్కడవుంటుందంటారు? (ననాకే నచ పాతాళే) లోకంలో శిష్టులు వ్యవహరించుకొనే మాటలు వాడుకోవడంలోనేవుంటుంది —— ఆ శబ్దాలలో నూటికి తొంభైనిర్దుష్టాలు ( క్షమాపణ

వగైరా చూ ) అయితేయేమి ! “ నిస్సారా పృథివీ నిరౌషధిలతా నీచా మహత్వం గతాః ” అన్నమాదిరిని మన పాండిత్యాలు నానాఁటికి—‘ అబ్రవీత్పురాణ ’ రీతిలో వుండేవికావడంచేత ఆయా సుశబ్దాలకు అపశబ్దాలనే అపప్రథ కల్గించడం జరుగుతుంది. చూడండి— ‘లవలేశము’ అనే వానిగతి యేలా వుందోను శ్రీమద్భాగవతంలో— “కుర్వంతి కామ సుఖ లేశలవాయ” అని వుందాయె, రామలింగం — “ లెక్క యెఱుంగరాదు లవలేశము దానికి నట్టివాఁత ” అని ప్రయోగించాఁడాయె, భాగవత వ్యాఖ్యలో— “ లేశస్యాప్యణ్వంశాయ ” అని స్వారస్యాన్ని నిరూపించి వుండె. ఇట్టి సుప్రయోగాన్ని తప్పనుకోవడానికి మన పాండిత్యలోపమే కారణమనుకోక యేమనుకోవాలి ! ఆ రోజులలో దీన్ని యెవరూశంకించి వుండరనే నాతలపు. కర్మంచాలక శంకిస్తేనో రామలింగం చెప్పే జవాబు యెంత ఘాటుగావుంటుందో అంతా యెఱిగిందే. నేను ఆఘాటుగా జవాబివ్వడాన్ని అభినందించేది లేదుగాని, అతని లోకజ్ఞత్వాన్ని అభినందిస్తాను. ప్రగడరాజు నరసరాజుని పట్టుకు తిట్టినట్టు చదివే పద్యంలో యేముంది ? అన్నీ తిట్లేకదా ! అట్టి తిట్లవల్ల కవికి కలిగే యశస్సేముంటుంది ? గాని కొందఱు చేసే కుశ్శంకలకు మాత్రం కోపంరాకపోదు, అంతవఱకు వప్పుకోవాలి. వచ్చినా మెల్లగా ప్రయోగాలు వెదకి చూపి శంకించేవారిని సమాధాన పరచడమే యుక్తం. కొందఱికి అసలు సరుకు లేకో యేమో తిట్టడమే అలవాటు. ఆలా తిట్టేవారిని మళ్లాతిట్టకపోతే తమ ప్రజ్ఞకు లోప మనుకొనేవారున్నూ వుంటారు. కాని, వారిని ప్రాజ్ఞలోకం ఆమోదించదు. తప్పుకానిదాన్ని గాని అయినదాన్ని గాని యెవరేనా యెఱిఁగో యెఱక్కో తప్పని అంటే అది తప్పే అయితే సత్యం తెలిసి వొప్పుకోవడమే నామతం. భంగ్యంతరంచేత దాన్ని సాధించడానికి వీలుంటేకూడా యథార్థాన్ని అంగీకరిస్తూ ఆసాధనోపాయాన్ని తెల్పడం యుక్తం. యింకోటి - యెవరినేనా మనం తెలిసో తెలియకో శబ్దమో అర్థమో తప్పు పట్టడం జరిగినప్పుడు ఆవలివారు ప్రయోగమో, సూత్రమో

కోశమో చూపితే దాన్ని ఆమోదించి తృప్తిపడడంలో ఆత్మకు సుఖం వుంటుంది గాని - "మనం తప్పన్నది తప్పుకాకపోయెనే?" అనే మాత్స ర్యంతో వృథాగా యేదో (అయుక్తికమేనాసరే అప్రామాణికమేనాసరే) వ్రాస్తూనే వుండడానికి ప్రయోజనం లేదనే లోకంతోపాటు నేనూ అనుకొనే వాణ్ణి గాని, యిటీవల నేను కనిపెట్టిం దేమంటే లోకమంతా స్వతఃపరి జ్ఞానం కలదిగానే వుండదు కనుక "పరప్రత్యయనేయబుద్ధు" లేనా మన పరిశ్రమకు సార్థక్యం కలిగించకపోతారా? అనే వూహతో వారు వారు అట్టి పరిశ్రమ చేస్తూ వుంటారని గ్రహించాను. కాని, యథార్థం (మొట్ట మొదట తెలియకపోయినా పిమ్మట) తెలిసికూడా దాన్ని మఱ్ఱ పెట్టి కప్పిపుచ్చి యేదో వ్రాస్తూ వుండడం సామాన్యులను బాధిస్తుంది గనక, ప్రమాణబుద్ధి కలవారెవరున్నూ అట్టి వాదాన్ని ఆమోదించకూడదు. ఈ సందర్భంలో మార్కొండపాటి చతుష్టయంలో కీ. శే. లక్ష్మీనారాయణ శాస్త్రుల్లుగారికి పెద్దపేరు వుండేది - ఆయన జీవితకాలంలో యెన్నఁడూ వాక్కు-మాటైనా ప్రమాణ ప్రమితం కానిది ఆయన నోటమ్మట దొరలనే లేదనే సమకాలీనులైన పండితులే చెప్పుకొనేవారు. ఆయనే కాదు నిజమైన పాండిత్యం కలవారెవ్వరూ అపమార్గంలో లేఖినిని నడపరు - కాని, యిత రులు హేలగానేనా యేకొంచెమో అప్రమాణవాదం కూడా చేయడం (మయిజల్పతి కల్పనాధి నాధే, చూ.) వుంటే వుంటుందేమో కాని, సదరు శాస్త్రుల్లుగారు మాత్రం - "లీలలందును బొంకులులేనివాఁడు" అనే భాగవతోక్తికి ప్రథమ లక్ష్యంగా యావత్తు జీవితాన్ని గడుపు కోఁగలిగినారంటే? యెవరికి ఆశ్చర్యం కలగదు? అట్టి మహానుభావులని ఆదర్శంగా పెట్టుకొని జీవితం గడుపుకోవడంకంటె నిజమైన కవికి కావలసిందేమిటి! నన్నయాదులందఱూ అట్టి సత్య తత్పరులే "నిత్య సత్యవచను మత్యమరాధిపాచార్యు" అని వ్రాసుకోఁగలగడానికి ఆయన తపసెట్టిదో? ఆ నన్నయ్యగారికంటేకూడా పై చేయిగా (కొందఱిచేత) పేర్కొఁబడే మనసోమనాథుని అదృష్టం ఇంతా అంతా అని నిర్ణయించ

డానికి యెవరికి శక్యం (సర్వజ్ఞ) బిరుదు ధరించిన యీ మహాకవి కవిత్వాన్ని అల్పజ్ఞుఁడనైన నా బోటి అవగతం చేసుకోవడంకూడా చాలా కష్టమే అనిపించింది. యింత వయస్సయిందిగాని నేను సోమనాథుని కవిత్వం శ్రిద్ధగా చదవవలసిన ప్రిసక్తి కలగనే లేదు. నేను అభిమానంగా చదివే కవిత్వాలు కొన్ని వున్నాయి. యిది ఆ కవిత్వాలలోదికాదు. ప్రిస్తుతం మారెండవ చిరంజీవి యేదో పరీక్షకు వెడుతూ దీన్ని పాఠం చెప్పవలసిందన్నాఁడు. అందుచేత శ్రిద్ధగా పరిశీలించవలసి వచ్చింది. వస్తే మాత్రిం పాషాణపాకంలో వున్న కొన్ని పద్యాలు సమన్వయం కానేలేదు. మనకు తిన్నగా సమన్వయమేకాని కవిత్వాన్ని గూర్చి వ్రాస్తూ తెలిసీ తెలియని జ్ఞానంతో "అది తప్పు ఇది తప్పు" అని మొదలెడితే లోకానికి నా అజ్ఞానాన్ని తెల్పుకొన్నట్టవుతుందేమోనని నాకు తెలిసినంతలో ఆయా ప్రియోగ విశేషాలను గూర్చి సమర్థనాన్నే కనపఱిచాను - "తెలియనివన్నీ తప్పు" అనడంకంటే యిది నాకు సుఖమనిపించింది. నానిరూపణం యుక్తంగా వుంటే విజ్ఞలోకం మన్నిస్తుంది. - లేదా చెప్పేదేమిటి? "యద్భావి తద్భవత్యేవ" ఇంతకూ నేను అన్యథాగా వ్రాసినా యెదురు కాని, "దానికదీ దీనికిదీ" అని సమర్థనాలు చూపడానికి సోమనాథుఁడు లేఁడుకదా అంటారేమో? అట్టే! యీ వూహ సమంజసం కాదు. కవివుంటే కవిమీఁద బాధ్యత వుంటుంది కాని లేనిపక్షంలో ఆభారం లోకమే వహిస్తుంది - వహించిమందలించి తీరుతుంది. యీ విషయం గుర్తించే యీ మహాకవినిగూర్చి యీ మాటలు నాలుగూ వ్రాశాను.



## "ఏని" శబ్దసమాచారం

(ది 30–11–? సం॥రం ఆంధ్రపత్రిక డైలీ నుండి)

"దిద్దకుడయ్య భారతము." (విస్తరించి కలగూరగంప చూ.) 40 ఏళ్ళకిరిందట పత్రికద్వారా యిలా మొరపెట్టుకోవలసి వచ్చింది యెందుచేతనంటారా? వినండి.

"నమ్మమి మృత్యువు" అనే తిక్కన్నగారి పద్యంలో వున్న – "నమ్మి నమ్మక" అనే నిక్షేపంవంటి ప్రయోగాన్ని దిద్ది సంస్కర్తలు మూలంలో వున్న అర్థాన్ని భస్మీపటలం చేశారు. మళ్ళా యిప్పుడు మొర పెట్టవలసి దాన్ని వుపక్రమిస్తున్నాను – ఆస్థలాలు చూపుతాను —

క. నను దగియెడు నతిథింగా
మనమున యోజించి నీవు మన్నించెదవే
నిని వచ్చెద నీపాలికి
ననఘాసంగ్రామ మొసగు మాతిథ్యముగన్. కర్ణ-2-ఆ

క. తనకై కాదే? మది నా
ల్లనుగోరుటవినుము దా బ్రశయ మొందినయే
నిని వారనియుద్యోగ
మ్మునకు ఫలంబేమి రాజపుంగవ! చెపుమా? శల్య-1-ఆ.

"జనకుడు............................................తేరెనే
నిని బటుశోకవేగమున నిర్భరవేదన జెందకుండునే?" సౌప్తిక-2-ఆ.

(ఆయా ప్రయోగాలే మన్నుగొట్టుకుపోతే ప్రపంచమే పోతుం దని నామనోనిశ్చయం) యీ మూడుప్రయోగాలూ దిద్ది భారతాన్ని పాడు చేస్తేనేకాని వాకరు తాము పొరపడి ఆక్షేపించిన ఆక్షేపణ నిల్చే వుపాయం లేదు. అయితే యీ విషయంలో మా పాండిత్యలోపాన్ని మేము సవ రించుకోవడమే యుక్తమో? కవిబ్రహ్మని సవరించుకోమనడం యుక్తమో?

సహృదయులు పరిశీలించాలి. అక్కడ యింకోమాట రాయాలి. అప్రయో
గాలు తిక్కన్నగారివి కావనిన్నీ యెవరో (వారిపుట్టి మునిగినట్లు) ఆలాటి
పాఠాలు ( కావు కావు అపపాఠాలు, శాంతం పాపం ) కల్పించి వుంటా
రనిన్నీ అందుచేత వాట్లను సవరించడం తిక్కన్నగారికి న్యూనతాపాదకం
కాదనిన్నీ ( హృదయపూర్వకంగా కాదు ) పైకి వొక సాకు కల్పిస్తే
లోకానికి ఆగ్రహం రాదని వారి యూహ. లోకానికి ఆగ్రహం వచ్చి
మాత్రం విష్ణుచక్రం ఏం చేస్తుంది ? కవిత్రియంవారి భారతం బాగాలే
దంటే యెవరో ( ము - కృ - రావు ) తప్ప ఉన్నదున్నట్లుగా మాట్లాడిన
వారున్నారా ? దక్షిణాది గాయకుల మెప్పు ( రొంబ కష్టించాడు పాపం )
వలె ఆమోదాన్ని చూపేవారు కొందఱూ, యెదట వొకలాగూ కాస్త
మొగం చాటైనాక యింకోలాగూ మాట్లాడేవారు కొందఱూకదా; ఇట్టి
ప్రపంచంలో తిక్కన్నే తప్పు వ్రాశాడంటే మాత్రం యెదుర్కొని
నిర్మొగమాటంగా మాట్లాడే దిక్కూ మొక్కూ అంటూ ఉందా? లేదు లేనే
లేదు. అందుచేత యీవాదం యిలా అవిచ్ఛిన్నంగా సాఁగడం.

( క్వచిత్ క్షోణీంద్రో న నియామకం ) "ఏని" అనేది ద్రుత
ప్రకృతికమా, లేక కళా అనే విచారం మనకిప్పుడు వద్దు. దిద్దవలసిందనే
వారి ( వారి మతంలో కళేకదా ? ) మతాన్నే శిరసావహిద్దాం. అప్పుడు
కూడా - "ఏనిని" అనేది సాధువే. యీ ఏని ద్రుతప్రకృతికమా ? లేక
కళా ? అని సంధిగ్ధావస్థలో (కొందఱికే) ఉంటే 'ఉంటుందేమో' కాని,
"ఏమి" అనేది అందఱికీకూడా కళేకద; కవిబ్రహ్మగారు - ఏమిని -
అని ప్రాసస్థానంలో ప్రయోగించి వున్నారే. వారు ప్రయోగించారుకదా ?
అని నేనుకూడా పలుచోట్ల - ఏనినితోపాటు ఈ ఏమిని - అనేదాన్ని కూడా
శనగపప్పులాగ ప్రాసస్థానంలో బుద్ధిపూర్వకంగా వాడివున్నాను. ఆక్షేప
కులు దీన్ని (ఏమిని) ఆక్షేపించక దాన్ని (ఏనిని) మాత్రమే ఆక్షేపించ
డంలో ఏదో పాండిత్య విశేషం వుండాలి. అది మనకు గోచరించేది
కాదు సరే.

(నాకు పూర్తిగా అవగతమే కాని వ్యాఖ్యానించడానికి యెందుకో జంకుతాను) "ఏనిని" అనేదాన్ని తప్పన్నందుకు భారతాన్ని దిద్దితే గౌరవం దక్కుతుందే అనుకుందాం. "లవలేశములు" అనేదాన్ని తప్పన్నందుకు (బ్రహ్మదేవుఁడు దిగివచ్చినా సాధువు కానేరదు) భారతాన్ని భరతం పట్టడం అవసేఅయింది కనుక యీ మాటేంచేస్తే బాగుంటుందంటారు? భారతంతర్వాత భాగవతం (భట్నావళ్యా మస్తక స్సన్నివిష్టః) కనక దానిభరతాన్నికూడా గట్టిగా పడితేనేకాని మన ప్రమాదం కవిలోకానికి తెలియకుండా కప్పిపుచ్చడం సిద్ధించదు. (యత్నే కృతే యది నసిద్ధ్యతి కోత్ర దోషః). తెలుగు భారతాన్ని దిద్దడంకంటె సంస్కృతభాగవతాన్ని దిద్దడం (యతిప్రాసల గోల లేదు కనక) మతీసులువు. ఆ స్థలాన్ని చూపుతాను.

"కుర్వన్తి కామసుఖ లేశలవాయ దీనాః." అయితే ఈ స్థలంలో – "అణో రప్యణ్వంశాయ" అంటూ వ్యాఖ్యాత (తర్కవ్యాకరణాది శాస్త్రజ్ఞుఁడు) వ్యాఖ్యానించాఁడుకదా! దీన్ని దిద్దడం యేలాగ? అంటే? వినండి – (న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి).

"చచ్చుతర్కం, పుచ్చుతర్కం" మన్నేంచేస్తుంది? ఏలాగో మనం అన్నమాట నిల్పేప్రయత్నం మనం చేయక తప్పదు కదా? "సర్వ స్స్వార్థం సమీహతే" ఒకటి రెండు పుస్తకాలయితే ఒకటి రెండు వ్యాఖ్యలయితే (కొమిరెకూఁతురు, వసుచరిత్ర వ్యాఖ్య చూ. యీ అర్థం తప్పని వాదం.) యేలాగో దిద్దుతాం. ఆంధ్రకవితా ప్రపంచమున్నూ గీర్వాణకవితాప్రపంచమున్నూ యావత్తూ దిద్దితేనేకాని మనవాదం గట్టెక్కేటట్టు లేదుకదా? కాగతిః?

అలమతివిస్తరేణ. యిలాటి నిర్దుష్టప్రయోగాన్ని (దేవతలు ధర్మవర్తులు తప్పనిన్నీ, ధర్మవృత్తులు అని దిద్దాలనిన్నీ ఆత్మకూరు సంస్థానంలో పిడివాదం) దిద్దాలన్నవారే మమ్మల్ని యేనుగంబారీమీద ఓహో కాదుకాదు పొరబాటు – మదురుగోడమీఁద యెక్కించి వూరేగింపు చేశారు.

( ఈ మదురుగోడకు "అరణ్యరోదనం" చూ. ) తేభ్యో మహద్భ్యో నమః. యీ మదురుగోడ పూరేగింపుకు ముచ్చటపడేవారిని గూర్చి బెజవాడలో వొక షాహుకారిని అడిగితే తెలుస్తుంది. యే పాతతాటాకు పుస్తకంలో నేనా ఆయీ యేనిని అన్యథాగా వున్నట్టు చూపితే ఆయీవాదం జీవిస్తుంది. కాని అందాఁకా జీవించదు. దీన్నిగురించి వ్రాయవలసి వస్తే యెంతేనా వ్రాయాలి. దినపత్రిక సారస్వతానికి యేర్పడ్డది కాదు. విసుక్కుంటుందేమో అని భయం.

"ఏనిని" ప్రయోగానికి సాప్తికంలో వెదికితే యిరవై నకార ప్రాసలు కందాలే కాఁబోలును కనపడ్డట్టున్నూ అందులో యెక్కడా లేనట్టున్నూ సుమారు మూఁడేళ్ళనాఁడు రెండుపుటల పైచిల్లర యితర దూషణ వాక్యాలతో నింపినవారు యిప్పుడు విధిలేకే అనుకుందాం ప్రయోగాలు మట్టుకు వున్నట్టేనా అంగీకరించడ మనేది - మహాభాగ్యంగా నేను సంతోషిస్తూన్నాను - ప్రియం నః ప్రియం నః యింతమాత్రమేకాదు యింకో విశేషం. చచ్చినట్టు నీవు సవరించుకొనుము నిన్ను పండితులు ఛీ, ఛీ, అనుచున్నారు. చవటా, దుర్జాతీ, పెద్దమ్మ, వగైరా మర్యాదలు వర్జించి నాకు - "గార్ల" తో విందుచేయడమే కాకుండా ప్రధానవిషయం మృదువైన మాటలతో వ్రాయఁగలిగినందులకు (ఇట్టివ్రాఁత యీ జన్మలో నేను వీరిది చూస్తాననుకోలేదు. అందుచేత యింతగా సంతోషించడం) వారిని మిక్కిలిగా కొనియాడుతూ వున్నాను. యిఁకనల్లా వారు ప్రమాదపడి తొందరపడి తప్పు లన్నమాటను నిల్పుకోవడానికి పరిశ్రమ చేస్తున్నారు. (1) సహసావి దధీత నక్రియాం (2) ఉచిత మనుచితంవా.....శల్యాతుల్యోవిపాకః యధార్థం మొదట తెలియక అన్యథాగా వ్రాసినా యిప్పుడుయధార్థం తెలిసింది కనక కొండత్రవ్వి యెలకనిపట్టే ప్రయత్నంమానితే బాగుండును. ఇంతప్రయత్నం చేసి ఏనిని అనేది తప్పేఅని సాధిస్తేమాత్రం స్వార్థం సమర్థించు కున్నట్లవుతుందా ? యింకా వీటితాతలూ ముత్తాతలూ వున్నాయికదా (1)బుక్కించు (బుక్కనై ర్ధిక్కరోతి అని పండితరాయలు) (2) యతించు, (3)నిర్ఘర

శబ్దం స్త్రీలింగంలో లేదు. వుంటే నిర్ఝరిణీ అని కావాలి. వగైరాలో? యివన్నీ బాధకాలే. నాకున్నూ ఆక్షేపకులకున్నూ వుండుకున్న సంబంధం చాలా గరీయమైనది - కాబట్టి వారు తప్పుకానిది తప్పన్నా నేను కిక్కురు మనకుండా వూరుకోవలసింది. శాస్త్రం చూపడంగాని ప్రయోగాలు చూపడంగాని వారిని నిందించడం కాకపోయినా అర్థాత్తూ అన్యథాగా (వారి పాండిత్యలోపాన్ని తెల్పినట్టుగా) పరిణమించడంచేత కవితా సామ్రాజ్య పరిపాలకులకు నామీద ఆగ్రహం కలిగింది. అందుచేత - "శేషం కోపేన పూరయేత్" కవక దూషించడానికి ప్రారంభించారు. (యిప్పుడు భార తాన్ని స్వార్థం నిమిత్తం దిద్దవలసిందనే వారి దిద్దుబా టెట్టిదో? నాకు తెలుసును. శ్రీ గావలెనంచు, అనే తిక్కన్నగారి ప్రయోగాన్ని లోఁగడ వీరు శ్రీ గాఁదగునంచు అని దిద్దుతామన్నారు. ప్రాస చెడింది. అని తెల్విడి) ప్రస్తుత వ్యాసంలో దురుసుమాటలు లేకపోవడానికి ముఖ్య హేతువు పత్రికవారి సౌమనస్యమే ఏమో? అనికూడా నేనభిప్రాయ పడుతున్నాను.

ఆక్షేపకులు నేను - సుశీలలో కొన్నిచోట్ల ఏనియున్, అని ప్రయో గించినట్టున్నూ ఆ ప్రయోగించడం తమవిమర్శనవల్ల సంభవించినట్లున్నూ వ్రాశారు. నిన్నమొన్నటి రచన గనక సుశీల, వారిమాట ఆపాతరమణీ యంగా, కొందరికి కనపడవచ్చును. ఇంత కెంతో కాలంనాఁడు ప్రచురిం చిన నా గ్రంథాలలో "ఏనియున్, అనే ప్రయోగాలు శరపరంపరగా వున్నాయి, అది వారు చూడలేదు - నాకు సంస్కృతభాషకు పలువురు గురువులున్నమాట సత్యం, తెలుఁగుకో? స్వయమాచార్యత్వమే అని ఏదో వ్యాసంలో లోఁగడ వివరించివున్నాను. ఏనిని అనేదిన్నీ సాధువే, ఏనియున్ అనేదిన్నీ సాధువే, యెప్పుడంటారు? యీ మాట; ఏని, అనేది కళ అనేపక్షంలోనే కాదు, ద్రుతప్రకృతిక మనుకొనే పక్షంలోకూడా సుమండీ? వివరించవలసివస్తే సహృదయలోకం - "గుడ్డువచ్చి పిల్లని వెక్కిరించింది" అంటారని సంకోచిస్తూన్నాను. యింతకూ తిక్కన్నగారి

ప్రయోగాలు దిద్దడం యుక్తమే అనే పండితులు పైకి వచ్చినప్పుడుగాని నేను వీరితో విస్తరించి ప్రసంగించేది లేదు.

"ఏకు లొడికినదానికీ వస్తాఁడు" కదా? తిక్కన్న, తిక్కన్న, తిక్కన్న, కవిబ్రహ్మ, కవిబ్రహ్మ, కవిబ్రహ్మ. (1) "భారత మాంధ్ర సత్కవులపాలిటి వేదము. (2) తెలుఁగునకున్న వ్యాకరణదీపము చిన్నది, (3) విలువగల కవుల లక్ష్యమ్ములె తామీ భారమెల్ల మోయఁగవలయున్" అని చిరకాలంనాడే మొరపెట్టుకున్నాం. యింకోమాట వ్రాస్తాను, తెలియక తప్పనడంలో లేశమున్నూ దోషంలేదు. యదార్థం తెలిశాకకూడా వాదానికి శాంతి చెప్పకుండా వృథాగా పత్రికలకు పనిచెప్పడంగాని స్వద్రవ్యం ఖర్చుపెట్టి యేవో అనుచితపుతిట్లు తిట్టి ప్రచురించడంగాని ప్రయోజనం లేకపోవడమే కాకుండా, యెంతేనా ఆపని అపకారమని మనవిచేస్తూ, నిజమైన తప్పు నాకు ఎవరుచూపినా దాన్ని సవరించుకోవడమే కాకుండా ఆలా చూపినవారు నాతలమీఁదనుండి యెగిరిపోయే బిరుదులు గలవారే కానక్కఱలేదనిన్నీ సామాన్యులైనా వారిపేరు నేను కృతజ్ఞతా స్ఫోరకంగా ప్రకటించే స్వభావం కలవాణ్ణే అన్నందుకు సుశీల పీఠికలోనే కొన్ని అక్షరాలు సాక్ష్యమిస్తాయనిన్నీ మనవిచేస్తూ దీనికిప్పటికి స్వస్తి చెపుతూన్నాను.

---

# గ్రాంథికమా? వ్యావహారికమా?

(౧ 14–12–38 సం॥రం ఆంధ్రవాణినుండి)

"విశ్వవిద్యాలయ పరీక్షలందు గ్రాంథిక భాషనే వ్రాయవలెనను నిబంధనకలదు. నేడు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారికి కళాప్రపూర్ణ బిరుదమిచ్చినందువలన వారి గ్రామ్య వాదమును వారు గౌరవించినవారగుచున్నారు. అందుచేత విశ్వవిద్యాలయపరీక్షలందు గ్రాంథిక నిబంధనను

తొలగించుట కాక్షేపణ యేమియు నుండనక్కఱలేదు. శాసనముల పరిశోధించిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారును, స్వయముగ వాడుక భాషలో తీర్చి వ్రాయుచున్న శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారును విద్యార్థుల కట్టినిబంధన యుండనక్కఱలేదని యంగీకరింతురని నమ్మెదము." అని 1–12–38 తేదీ గురువారపు ఆంధ్రదిన పత్రికా సంపాదకీయంలో వున్న పై వాక్యాలు శ్రీ గిడుగువారి వ్యావహారిక భాషావాదాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు శిరసావహించినట్టున్నూ, దాన్ని జయంతి పంతులుగారున్నూ, నేనున్నూ ఆమోదింప వలసినట్టున్నూ తెల్పుచున్నవి. జయంతివారు గిడుగువారి వాదాన్ని బొత్తిగా ఆమోదించేవారు కారనేది సర్వపండితులును యెఱుఁగుదురు. ఇకనేనో? మాకు రఘువంశం మొదలు కొని విద్యా ప్రదాతలైన పండితులతో పాటు కొంతవఱకుమాత్రమే వారి వాదాన్ని ఆమోదించేవాణ్ణి అనే విషయం "కవిత్వమంటే యేమిటి?" అనే వ్యాసంలో స్పష్టంగా వ్రాసి వున్నాను. అందులోనుంచి ముఖ్యమైన మాటలు యిక్కడ మళ్ళా వుదాహరిస్తాను - "అయితే ఈ గ్రంథాలకు (వ్యావహారిక భాషా పుస్తకాలకన్నమాట) పాఠశాలల్లో ప్రవేశం కలిగించవలసిందనే వారితో నేను చేరను. ఏమంటే? ఈ భాష సులభమే కనక గురువులబోధతో దీనికి అవసరం వుండదు. విద్యార్థిదశకాస్తా దీని పఠనంతో సరిపోతే గురుశుశ్రూషచేసి తెలుసుకొనే విషయాలు మిగిలిపోతాయి. కాఁబట్టి గ్రాంధికభాషనే పాఠశాలల్లో వాడుకచేయడం మిక్కిలి అవసరం. ఇది పత్రికల్లో వాడుటలో ఆక్షేపణలేదు. ఉపన్యాసాలలో వాడుటకూ ఆక్షేపణలేదు." ఆయీ నా వాక్యాలవల్ల వ్యావహారికభాషా విషయంలో నేనెంతవరకామోదించేవాణ్ణో విజ్ఞులు గుఱుతిస్తారు. ఆవ్యాసములో యింకా యెన్నో వాక్యాలు నాఅభిప్రాయానికి సంబంధించిన వున్నాయి. వాట్లనన్నిటినీ వుదాహరిస్తే వ్యాసముచాలా పెరుగుతుంది. కాఁబట్టి వలయువారు "లఘుకావ్యములు" అనే సంపుటములో చదువుకోవలసిందని సూచిస్తాను. పంతులుగారు గ్రాంథికభాషను-పూర్తిగనిరసిస్తారు.

ఆ నిరసనము నాకునచ్చదు. వారు లోకాన్ని మోసగించేతలంపుతో అట్టి నిరసనాన్ని వుపపాదించడము లేదని నేను యెఱుఁగుదును. అదిపూర్తిగా వారునమ్మినదే. ఆనమ్మినదాన్నే లోకానికి బోధిస్తూవున్నారు. కళాప్రపూర్ణ బిరుదప్రదాన సమయములో పింగళిలక్ష్మీకాంతముగారు, పంతులవారిని గూర్చి చేసిన వుపన్యాసములో, వారి గ్రాంథికభాషాపాండిత్యాన్ని గూర్చి కూడా నాల్గుమాటలుపన్యసిస్తే ఆంధ్రపత్రికవారు అపోహపడడానికి అవకాశములేకపోయేది - "గిడుగా పిడుగా" అనే వ్యాసములో సుమారు సంవత్సరమున్నరనాడు నాకు శ్రీపంతులవారి పాండిత్యమందు అనగా గ్రాంథికభాషాపాండిత్యమందు వున్న విశ్వాసాన్ని వెల్లడించివున్నాను.

"మయిజల్పతి కల్పనాధినాధే
రఘునాధేమనుతాంతదన్యధైవ"

అన్న మాదిరిది పంతులుగారి గ్రాంథికపాండిత్యం. అట్టివారు వ్యావహారికభాషకు సామ్రాజ్య పట్టాభిషేకం చేయడానికి కొంతగాని, మఱి కొంతగాని ప్రయత్నించినంత మాత్రంచేత వారికిచ్చేబిరుదం అందుకే యిచ్చినట్లు తలపవలసి వుండదు. వారి గ్రాంథికభాషా పాండిత్యం జగత్ప్రసిద్ధ వ్యాఖ్యాతలు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రులవారికి పయిచేయిగా వుండునని పంతులువారి "బాలకవి శరణ్యం" చదివిన ప్రతి విద్వాంసునకున్నూ బోధపడి తీరుతుంది. పందొమ్మిదో శతాబ్దానికి వెనకా ముందూ కూడా పరిశీలిస్తే వేదం వారి వంటివారు - అన్ని ప్రజ్ఞలు కలవారు మృగ్యులో లేక అసలే దొరకరో అంటే వొప్పనివారుండరుగదా? అట్టి వారు శ్రీ కొక్కొండవారి కవిత్వంలో చూపిన ఆక్షేపణలను అవలీలగా, న్యాయంగా, లాక్షణిక సమ్మతంగా సమర్థించిన గిడుగు పంతులుగారికంటే అతిశయించ తగ్గ గ్రాంథికభాషా పండితులీ కాలంలో యెవరున్నారనే ప్రశ్నకు జవాబు రావడం చాలా కష్టం. వ్రాస్తే చాలా వ్రాయాలి. పంతులవారికి శ్రీ యూనివర్సిటీవారు ప్రసాదించిన "కళాప్రపూర్ణ" బిరుదము వారి సమిష్టి పాండిత్యానికి మాత్రమే సంబంధించదు. అందు

చేత యూనివర్సిటీవారు గ్రాంథికభాషా నియమాలను పరీక్షాసమయాలలో గాని యితరసమయాలలోగాని వుల్లంఘించవలసిన యావశ్యకతగాని, దానికి శ్రీ జయంతి పంతులుగారుగాని, చె. వెం. శా. గాని ప్రోద్బలం చెయ్యవలసిన ఆవశ్యకతగాని లేదనిమనవిచేయుచున్నాను. గిడుగువా రెప్పటికీ వ్యావహారిక భాషోద్ధరణ ప్రయత్నాన్ని విరమించరు. జయంతి వారెన్నటికీ ఆ వుద్యమాన్ని ఆమోదించే వారుకారు. నేనో? ఈ వుభయులనీ కూడా అనుసరించి యెవరితోనూ వివాదపడకుండా కాలక్షేపం చేసేవాడిగా వుంటాను. మామాతత్త్వం యింతే. వూరికే పైకి గిడుగువారిమీఁదకి దాడివెడలుతారే కాని కొందరు – వారెవరున్నూ వ్యావహారికభాషను యెందులోనూ వుపయోగించకుండా వుండేవారేమో? అంటే ఆలాటివారు కారు. కానే కారు. అట్టివారల్లా వక్క. మ. మ. ఉ. య. శ్రీ కొక్కొండ పంతులుగారు మాత్రమే. యావజ్జీవనమున్నూ గ్రాంథికభాషనే వాడుక చేస్తూ కాలం గడిపిన వారింక మఱి వక్కరు కనపడరు. వాదానికి దిగవలసివస్తే శ్రీ గిడుగువారితో వారు దిగవలసింది. దిగారో, లేదో, నాకు తెలియదు. ఇతరులకు, అనగా అస్మదాదులకు వాదార్హత లేదని నా తలంపు. యెప్పుడో, యెందుకో, యెందులోనో వ్యవహారానికి కక్కుర్తి పడుతున్న వాళ్ళే. నేనూ వారిలో వాణ్ణే. కేవలాద్వైతవాదులు శ్రీశంకరులు వ్యవహారావస్థ అనిన్నీ, పరమార్థావస్థ అనిన్నీ అవస్థాద్వయాన్ని అంగీకరించినట్లు నేను దీనికి కూడా అవస్థాద్వయాన్ని అంగీకరించి, ఉభయకవి మిత్రత్వానికి పాత్రుణ్ణయినానని అన్యత్ర విస్తరించి వుండడంచేత యిక్కడ విస్తరింపక యింతతో ముగిస్తున్నాను. స్వస్తి.



# భా ష

( దీపావళి సంచిక ఆనందవాణినుండి )

అంటే? వొకళ్ళ మనస్సులో వుండే అభిప్రాయాన్ని వొకళ్ళకు తెలపడానికి సాధనం. యిది యేగురువుదగ్గిఱగాని శుశ్రూషచేసి నేర్చుకో నక్కఱలేదు. దానంతట అదేవస్తుంది. ఆరావడంలో తనతల్లిదండ్రులూ తద్దేశస్థులూ యేభాష మాట్లాడుకుంటారో అదేవస్తుందిగాని యితరభాష రాదు. సంస్కృతం యే నాఁడూ దేశభాషగా వుండక పోవడంచేత అది రావాలంటే గురు శుశ్రూషచేసి అభ్యసించవలసి వచ్చింది. తెలుఁగువాళ్లకు తెలుగుగాని అఱవవాళ్ళకు అఱవంగాని యీలాగే తక్కిన వాళ్ళకూ తక్కిన భాషలుగాని సహజంగా వచ్చినా వ్రాయడమూ వ్రాసినదాన్ని చదవడమూ రావలసినప్రసక్తి కోసం బడులూ బడిపంతుళ్ళూ యేర్పడ్డారు.

ఆ యీ ఛప్పన్న భాషలకూ అక్షరా లెప్పుడు పుట్టాయో పుట్టించిన శిల్పి యెవ్వరో తెల్పడం నావల్లకాదు. యెవరినేనా కనుక్కోవాలి. కొద్ది కాలంనాఁడు కీర్తిశేషులైన శ్రీలింగం లక్ష్మజీ పంతులుగారు కోదుభాషకు లిపిని సృష్టించినారని మా పరమగురువులు శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రుల వారు చెప్పఁగా విన్నాను. ఆయీ పంతులవారి వృద్ధాప్యంలో మేము (తి. వెం.) శ్రీ ఆనంద గజపతి మహారాజులుంగారి సందర్శనం చేసి వున్నాము. పేరుజ్ఞాపకం లేదు. యేదోకొండజాతుల భాషకు కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారు కూడా అక్షరసృష్టిని చేసినట్లువిన్నాను.

ఇన్ని భాషలు యేలా పుట్టాయి! కరచరణాద్యవయవాలతోపాటు యావత్తు మనుష్యులకూ ఒకటే భాష యెందుకు వుండకూడదు. అనే ప్రశ్నకు జవాబుదారీ సృష్టికర్తదే గాని అస్మదాదులదికాదు.

పూర్వకాలంనుంచీ మండలానికి వొక్కొక్క భాష వాడుకుంటూ వున్నట్లు కనపడుతూవుంది. మండలం అంటే నలభైఆమడ భూప్రదేశం. అంత పరిమాణం గల దేశాన్ని పాలించే రాజుకు మండలాధిపతి అనిపేరు.

యీ మండల శబ్దానికి నలభై అనే అర్థం తఱుచు వైద్య శాస్త్రజ్ఞుల వాడుకలో శ్రుత మవుతూ వుంది. యేదేనా మందు పుచ్చుకొమ్మనడంలో వైద్యులు మండలమని అర్థ మండలమనీ లిమిటుగా వాడుతూవుంటారు.

లిపి మాటకేంగాని ఆసేతు హిమాచలపర్యంతమూ యేకభాష కాకుండా యెన్ని భాషలో యేర్పడడానికి కారణ మేమిటో? దీని వల్ల కలిగిన లాభం యేమిటో అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడం పుస్తకాపేక్షే.

ఈ పృథగ్భాషాప్రచారం మన ఆసియా ఖండానికేకాదు. యూరపు ఖండానికీ వుంది. ఆసియా ఖండంలో భాగమే అని చెప్పుకొనే చైనాచాలా పెద్దదేశం. దానిలో అనేక భాషలున్నాయో వొకటే భాషగావుందో? నాకు తెలియక పోయినా పలువురికి తెలిసే వుంటుంది.

మనకు పరమ పూజ్యమైన సంస్కృతంలో ఆయీభాషలనుగూర్చిన పుట్టుపూర్వోత్తరాలను వివరించే పుస్తకం యేదీ వున్నట్టు వినడంలేదుగాని ఇంగిలీషులో వుందని విన్నాను. ఆ పుస్తకంలో మొత్తం యావత్తు భాషలకూ తల్లి భాష ఫలానా అని చెప్పక సంస్కృతభాషకూ లేటిన్‌భాషకూ సోదరభావాన్ని వ్యాకరించినట్లు తజ్ఞులు చెప్పఁగా విన్నాను. అది పాశ్చాత్యుల అభిప్రాయం. మనలో విజ్ఞులు మాత్రం అన్నిభాషలకూ తల్లి సంస్కృత భాషే అన్నారు. కొందరు సంస్కృతశబ్దం, డిద్ధబిద్ధడబిద్ధాది శబ్దాలవంటిదికాదు. అది యోగరూఢం కనక అసలు వుండే యేదోభాషను సంస్కరిస్తే ఆ యీ పేరు యేర్పడ్డట్టు తోస్తుందంటారు. వాల్మీకి విరచితమైన షడ్భాషాచంద్రికలో ఆ యా భాషాభేదాలనుగూర్చి వుందికాని చాలా కాలంనాఁడు చూడడంచేత అందులో వున్న విషయం యేమీజ్ఞప్తిలోలేదు.

" అష్టభాషా వాగనుశాసనుఁడు " అనే పేరు నన్నయ్యకు రావడానికి కారణం సంస్కృత ప్రాకృత భాషల వ్యాకరణాలన్నీ ఆయనకు హృత్కవిలిగా వుండడమే అని చెప్పనక్కఱలేదు.

ప్రాకృతం జనుల నోళ్ళల్లో పడిన పిమ్మట సంస్కృతానికి వచ్చిన పేరని పలుమంది అభిప్రాయం, కాని కొందఱు ప్రాకృతాన్ని " సరస్వత్యా

బాలభాషితమ్" అనిన్నీ దాన్ని సానపట్టి బాగుచేసిన భాషకనక సంస్కృత మయిందనిన్నీ చెపుతారు. అయీ తుట్టతుదివారి సమర్ధనం చాలాయుక్తి యుక్తంగా కనపడుతుంది.

ఎక్కడో కొంత మేనమామ పోలికలు కనపడినా యెవరికి వారే యమునాతీరే అన్నమాదిరిని భాషలు సృష్టించడానికి ఆసృష్టికర్తకే తప్ప తదితరులకు శక్యంకాదనే చెప్పాలి. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదులున్నూ తదితరావయవాలున్నూ అన్నీ వొకటే అయినా వొకవ్యక్తికి వేరొకవ్యక్తికీ పోలిక లేకుండా సృష్టించిన సృష్టికర్తకు ఒక్కవాలిసుగ్రీవులే కొంచెం కళంకాన్ని కలిగించారు. ఆమాత్రంపోలిక మనభాషలలోనూ యితరఖండ భాషలలోనూ కూడా వుండక పోదు. మాతా మదర్ - భ్రాతా బ్రదర్ - దుహితా డాటర్, ఈలాటి ప్రకృతి వికృతి సామ్యాన్ని బట్టి పరిశీలిస్తే ఇంగ్లీషుభాషకు మాత సంస్కృతమే కావచ్చుననుకోడానికి అవకాశం లేక పోలేదు. భవతు.

ఇంగ్లీషులో ఒక్కసంస్కృతమేకాదు చాలాభాషలు చేరి వుంటాయి. యింగ్లీషులిపికి ఫ్రెంచిలిపికీ భేదమే కనబడదు ఉచ్చారణకూడా చాలాదగ్గిఱగానే వుంటుంది, ఏ. బి. సీ. డి. అని యింగ్లీషులో పల్కితే, ఫ్రెంచిలో, ఆ. బె. సే. దే. యీవిధంగా పలుకుతారు. నాపేరు చిన్నప్పుడు వెంకటచెలం. ఫ్రెంచిమాష్టరు (దొరగారు) గారు, "యెంకతసలం" అని పిల్చేవారు. యింగిలీషుకంటె ఫ్రెంచిచాలా మృదూచ్చారణ కలదిగా వుంటుంది. కౌన్సిల్ జనరల్ ఆనడానికి ఫ్రెంచిలో కోంషేం జనేరాల్, అంటారు. అయీ ఉచ్చారణ సౌకుమార్యాన్ని బట్టే కాఁబోలు ఫ్రెంచివ్యక్తీ యింగిలీషువ్యక్తి కలుసుకున్నప్పుడు క్షేమసమాచారాదులను గూర్చిన సంభాషణ ఫ్రెంచిలోనే జరగడం శిష్టాచారమని చెప్పఁగా విన్నాను.

మొట్టమొదట భాష చదువుకోకుండానే వస్తుందని వ్రాసివున్నాను. సంస్కృతభాష యేకాలంలోనూ మాతృభాషగా (యెవరో ఋషులూ దేవతలూవినా) యేసామాన్య జనులకూ యేర్పడివుండక పోవడంచేతనేమి

అనేకవిషయములు మనబుషులు ఆ భాషలోనే వ్రాసిపెట్టి వుండడంచేత నేమి మనపూర్వులు పండితు లనిపించుకోడానికి ఆభాషనే అభ్యసించే వారు, ఆ సంప్రదాయం యింకా అమల్లోనే వుంది. కాని మన తెలుగుం లోకి పురాణాలూ ధర్మశాస్త్రాలూ జ్యోతిశ్శాస్త్ర వైద్యశాస్త్రాదులూ అనువ దించి వుండడం చేత పూర్వీకులకున్నంత సంస్కృత భాషా చుట్టఱికం యిప్పటివారికి అవసరం లేదని చెప్పవచ్చు. కాని అవాంతరంగా యింకో సమస్యవచ్చి పట్టుకుంది. అది:

గ్రాంథిక వ్యావహారిక భాషావిచారణ. గిడుగు పంతులుగారు వ్యావ హారిక భాషలోనే గ్రంథరచన సాగించాలనిన్నీ దానిలోనే సహజసౌందర్యం కనబడుతుందనిన్నీ, భారతాది గ్రంథభాష కృతకభాషగాని నిజమైన తెలుంగు కాదనిన్నీ యెన్నో వుపపత్తులు చూపి వారి జీవితంయావత్తూ దీనికే ధారపోసి కొలంది నాళ్ళక్రిందటనే కీర్తిశేషులైనారు. నాయెఱుంగి నంతలో యింత పరిశ్రమ తెలుంగులో చేసినవారు లేరనే చెపుతాను.

పద్యరచనకు వ్యావహారికభాషకొంత యిబ్బెట్టుగా వున్నా గద్య (వచన) రచనకు గ్రాంధికంకంటే అనేకరెట్లు వ్యావహారికమే హృద్యమని కూడా నేను అంగీకరిస్తాను. సంస్కృత నాటకాలలో కొన్నిపాత్రలకు సంస్కృతమూ కొన్నిపాత్రలకు ప్రాకృతమూ వాడడం పండితులెఱింగిందే. తెలుగులో ప్రాకృతాన్ని వాడే పాత్రలకు వ్యావహారికం వాడుకుంటే హృద్యమని నాకు తోస్తుంది. సలక్షణమైన, గ్రాంథిక భాషరాని బుద్ధిమం తులు లోకంలో చాలామంది వుంటారు. పాపం వారు వారి అభిప్రా యాలు గ్రంథరూపంగా వెల్లడించడానికి యిప్పుడు అవకాశం లేకపోతూ వుంది. వ్యావహారికానికూడా అవకాశాన్ని కలిగిస్తే వారినికూడా ప్రోత్స హించినట్లవుతుంది.

అపశబ్దోచ్చారణవల్ల నరకం వస్తుందనిన్నీ సుశబ్దోచ్చారణవల్ల (స్వర్గేలోకే కామధు గ్భవతి) స్వర్గం వస్తుందనిన్నీ మహాభాష్యకర్త శాసించివున్నారు. ఆశాసనం సంస్కృతేతర భాషలకన్నిటికీ వర్తించేదే

కావడంచేత (సంస్కృతేతర భాషలన్నీ మ్లేచ్ఛభాషలే. మ్లేచ్ఛ అవ్యక్తేశబ్దే, అనేధాతువునుండి మ్లేచ్ఛ శబ్దం పుట్టింది) తద్రీత్యా మన తెలుగు భారత భాగవతాదుల భాష యావత్తూ మడిగట్టుకొన్నప్పుడు స్పృశించతగినది కానే కాదు. కనకనే ఆబ్దికాదులలో భోక్తలకు యిచ్చే అర్ఘ్యపాద్యాదులు సంస్కృతభాషలోనే వుండడం అందఱు యెఱిఁగినదే.

పద్యరచనలో సేనా యావత్తూ కాక అక్కడక్కడ వ్యావహారికం దొర్లితే అంగీకరిస్తే పాపం వచ్చి చుట్టుకోదనే నేను చెపుతాను. శాసనకర్తలుకూడా లోకోక్తులు వగైరాలను (లోకోక్తీనాంభవేద్యోగో యధావచ్ఛ్రితిరంజనమ్॥) అయోలక్క, ఇత్యాదులు. (అహోబల పండితీయం చూడు) అభ్యనుజ్ఞయిచ్చే వున్నారు. కనకనే మహాకవులు పింగళి ప్రభృతులు——

(1) "....రోళ్లా రోకళ్లం బాడిన కూరుము" అనిన్నీ, (2) "నుయిదాఁశేవానికిన్" అనిన్నీ (3) "పాలు విఱిగితే పెరుఁగగునే" అనిన్నీ రసస్ఫోరకంగా వాడుతూ వచ్చారు. ఆమహాకవులకు యీ స్వల్పవిషయం తెలియదని వాదించే ప్రాజ్ఞులువుంటారని యేప్రాజ్ఞుఁడూ అనుకోడనే నేను భావిస్తాను. గ్రాంథికభాషాకవులకు అగ్రస్థానం యివ్వవచ్చును. యేమంటే ఆభాష గురుశుశ్రూష (గురుకులక్లిష్టో మురారిః కవిః) సాధ్యంకనకః వ్యావహారికం పుట్టుకతోటి వచ్చేది. దీనికి యేవిధమైన యత్నమూ అక్కఱ లేదు.

ఇటీవల నవ్యసాహిత్య షరిషత్తంటూ ఏర్పడింది. వ్యావహారికభాషలో రచనలున్నూ చాలా బయలుదేఱుతూ వున్నాయి. వాక్క యునివర్సిటీవారు మాత్రం విద్యార్థులకు పాఠ్యంగా వ్యావహారికాన్ని ఆమోదించడం లేదు. యెందుచేతనంటే? సహజంగా అలవడే భాషకు గురువులెందుకని. నేను దీనికికూడా గురువులు వుండాలనే చెపుతాను. యీభాషనుగూర్చి చేప్పేటప్పుడు గ్రాంథికాన్నిగూర్చికూడా గురువులు బోధించ వచ్చును. అప్పుడు

ఆయీ వుభయానికీ వున్న తేడాపాడాలు శిష్యుఁడికి సుళువుగా అవగత మవుతాయి. మచ్చు చూపుతాను.

"కరిఁ గాచింది హుటికిన్ ద్రౌపదికిఁ గోకల్ మెచ్చియిచ్చింది దబ్బర" అనివుం దనుకోండి. యిందులో యావత్తూ సలక్షణ గ్రాంధికమే గాని కాచింది యిచ్చింది అనేవి రెండున్నూ వ్యావహారికాలు. శిష్యుఁడికి బోధించడంలో యీ రెండూ గ్రాంధికంలో అయితే కాచినది ఇచ్చినది అని వుండవలసి వస్తుంది, వొకటి కాచు ధాతువునుండి పుట్టిన రూపం. వేరొకటి ఇచ్చు ధాతువునుండి పుట్టిన రూపం. కాచుట ఇచ్చుట అనే భావార్థక రూపాలకు పర్యాయాలుగా చూచుకోండి అంటే గ్రాంధికంలో కంటే యెక్కువ వ్యుత్పత్తి శిష్యునికి కల్గడానికి అవకాశం వుంది. సలక్షణ భాషలో వున్న — దేవసములైన యనుజులతో విప్రులతో రథాళితోవచ్చి అనే పద్యాన్నిగూర్చే అయితే వీట్ల వ్యావహారిక రూపాలు బోధించవలసి వుండదు. వ్రాస్తే చాలా వ్రాయాలి.

వ్యావహారిక మంటే గ్రామ్యం. ఆగ్రామ్యంకూడా ఒకటేవిధంగా వుండదు. బ్రాహ్మణగ్రామ్యం పుచ్చుకుందామా? అంటే అదీ వొకరీతిగా వుండదు. వైదికగ్రామ్యం లౌకికగ్రామ్యం అని విభజించాలి — "ఆస్నే చూస్నివషే వొషే చెవుడషే" ఇది వైదిక (శుద్ధచ్ఛాందస) గ్రామ్యం, లోగడ చూపినది లౌక్య గ్రామ్యం, యిఁక —

ఉ. నీ దగిడీలు బాపల పసిద్ది సరే, పొగనిప్పుకంట నో
మాదుగులింటి పోయి బతిమాలితి మూడునెగళ్ళు మండుతై
లేదని తిట్టె పాపపు కలిగ్గము యిం తివరాదె: దాంట్లొ యీ
రాదఁట! యండ్రిసహ్యాలు దురాత్ములు మూర్ఖులు చంద్రశేఖరా?

ఆయీ పద్యంలో వున్నగ్రామ్యం సామాన్య గ్రామ్యం కన్నా మిన్నా గ్రామ్యం జిన్నామాదిరిది. భారతానికి భారతం వ్రాస్తా మను కోండి. గీరతమూ వ్రాస్తా మనుకోండి. యీపద్యం మాదిరిది యింకో పద్యం వ్రాయవలసి వస్తే పెద్దలు దిగిరావాలి.

అంతదాఁకా యెందుకు, ఆయీ చంద్రశేఖరశతకం అచ్చులో అస్తా వ్యస్తంగా పడింది. సంస్కరించి పునర్ముద్రిణం చేయించవలసి వస్తే నన్నయ్య చిన్నయ్యగార్ల వ్యాకరణాల పాండిత్యం లేశమూ తోడ్పడదు. జాతీయమైన వ్యాకరణ పాండిత్యం వుండాలి. అది శశవిషాణం. ఆయీ కవిపేరు తెలియదు కాని కృష్ణామండలంవాడో? గుంటూరుమండలం వాడో కావాలి.

ఉ. సేరువ వాడపిల్లి నరసిమ్మడి తీరతమోయి బోగమ
మ్మోరుల యాటసూస్తి వరిముంగల దేముఁడదెంత ? యిద్దెలో
తీరుపయాస గంటి వొకతిత్తిని గుక్కడ కూఁడు వాని కా
లూరక మొక్కబుద్దగు నహో యను మూర్ఖుడు చంద్రశేఖరా ?

ఆయీ పద్యంలోవున్న వాడపల్లి మా గో॥ డి॥ లో కొవ్వూరికి సమీపంలో వొకటయితే వుందిగాని అది నరసింహక్షేత్రిం గాదు. వెంకటేశ్వర క్షేత్రిం. ఆయా వాడపల్లిలో నరసింహస్వామి వున్నాడని యిది కృష్ణాతీరమని యెవరో సెప్పఁగా విన్నాను "కాకస్య కతివా దంతాః" యెక్కడి వాఁడో కవి ఆయా విచారం తరవాత చూచుకుందాం. యింత రసవత్తరంగా కవిత్వం చెప్పడం యెంతేనా గణనీయం. ఈ కవి యింకేమేనా రాయకుండా వుంటాడా ? వ్రాస్తే వ్యావహారికంలోనే వ్రాసివుండునో? గ్రాంథికంలో వ్రాసివుండునో ?

వ్యావహారికభాష అని యీసడించడానికేం అదిసుళువు. రచించడం చాలా కష్టం. కాంగ్రెస్సు ప్రభుత్వం వచ్చింది. ప్రపంచకంలో యెన్నఁడూ యేప్రభుత్వంగాని చేయఁజాలని (మద్యదుర్వ్యసన నివారణాదికం) మహా కార్యాలు చేస్తూవుంది.

ఆయా వ్యావహారిక భాషకు యూనివర్సిటీలో వుండే నిషేధాన్ని తొలగించే సదుపాయం చూచి అబాపతు కవులకు ప్రోత్సాహకం కావడానికి నేను శిఫారసు చేస్తూన్నాను. దీనివల్ల గవర్నమెంటుకువచ్చే ఆదాయం (మద్యనిషేధానికి లాగ) పైసాకూడా తగ్గదు.

లోఁగడ వార్తాపత్రికలలో వార్తలుకూడా వ్యాకరణయుక్తంగా ప్రచురించకపోతే యెవరు ఆక్షేపిస్తారో అని జంకేవారు. యిటీవల ఆభయం తగ్గింది. కవిలికట్టలూ జడ్జిమెంట్లు ప్రోనోట్లూ దస్తావేజులూ కవులు కదపాలూ యివన్నీ వొకచే తరగతివి. పత్రికా సంపాదకీయాలు కూడా అట్టివేఅని పత్రికా సంపాదకులు గుర్తించి చాలాకాలమయింది.

యింకనల్లా స్కూళ్ళలో ధర్డుఫారందాఁకా వ్యావహారికభాషా వ్రస్తకాలుకూడా పాఠ్యాలుగా అంగీకరిస్తే నవ్యసాహిత్య పరిషత్తువారికి ప్రోత్సాహం కలుగుతుంది. దీనివల్ల గ్రాంధికానికి వచ్చేహాని లేశమాత్రం కూడా వుండదు.



# వింత శ్లేషలు

( ది 7—10—1941 సం॥రం ఆంధ్రవాణి )

తెలుఁగు గురుముఖతః అభ్యసించింది కాకపోఁబట్టి అప్పటి లోకల్ ఫండు స్కూలులో చదువుకున్న వ్యాకరణ జ్ఞానం తప్ప విశేషించి వ్యాకరణజ్ఞానం లేకపోయినా రచన నిర్దుష్టంగానే నడిచేదిగాని యెవరేనా వొప్పే తప్పని ( పరీక్షార్థం ) ప్రశ్నిస్తే జవాబుచెప్పే పాండిత్యం లేక చిక్కుపడ వలసి వచ్చేది. యీ చిక్కు తెలుక్కి మాత్రమే. దానికోసం చిన్నయ్యసూరి ( స్వంతంగానే ) వ్యాకరణం పరిశీలించినా సంతుష్టి కలిగిందికాదు. అప్పుడుతోఁచిన పద్యమే, ' తెలుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది ' అనేది. తరువాత యీ చిన్నిచిన్ని వ్యాకరణపుఁ బొత్తములవల్ల తగినంత ప్రయోజనం కలగదని - భారతం యావత్తూ కథాదృష్టిని గాక ప్రయోగ విశేషాలు అన్వేషించే దృష్టితో చదివితే మళ్లా యీ క్రింది విధంగా మనస్సు మార్పు చెందింది —

క॥ వ్యాకరణ మొక్క త్రోవమ
హాకవులొక త్రోవ కోశమఖిలమ్మొక త్రో
వైకనుపట్టెడి సీభా
షాకావ్యమ్ములనుదలచు చదివినకొలఁదిన్
(దేవీభాగవతంచూడు)

ఆ యీ ఘట్టమంతా చదివితే యేయేవిధమైన మార్పు యేయేకారణం చేత కలిగిందో చాలా వఱకు తెలుస్తుంది. లోకంలో సంస్కృత కవిత్వం చెప్పి నెగ్గుకు రావచ్చునుగాని తెలుఁగు కవిత్వంచెప్పి నెగ్గుకురావడం కష్టసాధ్యమని పూర్తిగా తట్టింది. "దేవుఁడిపెళ్ళికి అంతాపెద్దలే" అన్నట్టు యీ తెలుఁగుకు అందఱూ అధికారులే, ప్రతీదీ ప్రయోగంమీఁదే ఆధారపడి వుంటుంది నాకన్న లేదా మాకన్న చాలా పెద్దలే మంచికవులు ప్రశ్నించారుకదా - 'కావలెన్' అన్న ప్రయోగం సాధువేనా? అని ప్రశ్నించారు. పేరు ప్రకటించడం బాగుండదు. అప్పుడు నేను కావున శాంతి - శ్రీగావలెనంచు అనే వుద్యోగపర్వపు పద్యం వుదాహరిస్తే సహృదయులు కనక సంతోషించారు. (వారు భారతం చదవనివారా? చదివినా ప్రయోగ జిజ్ఞాసతో చదివివుండరు) యింకొకరు (అస్మత్కావ్య గురువులలో మొట్టమొదటివారు) 'ఇటువంటి అటువంటి' యీ రూపాలు గ్రామ్యాలుకావా? అని ప్రశ్నించారు. కావు, గ్రాంధికాలే. "ఎటువంటినేర్పరి విశావిటు నల్లుఁడు" (విజయవిలాసం) అని చదివితే సంతోషించి ఆశీర్వ దించారు. ఆ యీ మాదిగ మంచానికి తలగడ దిక్కేదో? కాళ్ళకడ దిక్కేదో తెలియదు. నన్నయ్య తిక్కనాదులు అసకృదావృత్తిగా వాడిన- వలవదు (వలదుకు రూపాంతరం) అనేది ప్రశ్నించి ప్రయోగాలు చూపినా అభిప్రాయాన్ని మార్చుకోనివారున్నూ కొందఱున్నారు. ఆత్మ కూరు విద్యావివాదం మాకు చాలా వుపకరించింది. అడిగేటప్పటికల్లా భాగవతంచూపడమే. చూపింది కాదనిమాత్రం ఆ పండితులనడంలేదు. అందుకు వారిని యెంత శ్లాఘించినా శ్లాఘించవలసే వుంటుంది. దీన్ని

యీలా వుంచుదాం. రసికానందం వ్రాసింది మొదలుకొని సంస్కృత కవిత్వానికి స్వస్తి చెప్పి తెలుగులోకి దిగాం. అంతకు రెండేళ్ళనాఁడు బందరు థియేటరు మిత్రులకోరికమీఁద ఆశువుగా రచించిన శుకరంభా సంవాదం తెలిఁగించడం. అంతట్లో అనివార్యంగా - శ్రవణానందరచన వచ్చిపడడం ఆరోజుల్లోతత్కాలోచితంగా కొన్ని కీర్తనలూ తోహరాలూ వుండే లీలాశుక చరిత్ర రచించడం మాత్రమేకాదు. కొందఱికి దాన్ని వుపదేశించడం కొన్నిచోట్ల ఆ శిష్యులు దాన్ని ప్రదర్శించడంకూడా జరిగింది. కాని దాన్ని ముద్రించి ప్రకటించడం జరగలేదు. యెందుచేతనంటే? పండితకవులు పరిహసిస్తారనే సందేహం చేతనే - తోహరా (1) శ్రీలీలా సుక దివ్యచరిత్రము చిత్తముల లరఁగ వినుఁడీ. (2) శ్రీకాకుళమను పురవరమొక్కఁడు చెన్నలరెడు సీధరలో. (పైభాగం జ్ఞాపకంలేదు) కీర్తన ఆటతాళం. కాంభోజి తలుపు మూసిపెట్టి తరుణీమణిరొ? నా తలంపు చిన్నఁబుచ్చకే (పైని జ్ఞాపకంలేదు) శ్రవణానందమూ యీహరికథా అయినకొద్దిరోజులలోనే - దేవీభాగవతం ఆంధ్రీకరించడం అది కొంత భాగం అయిన తరువాత - (1) శ్రీనివాస విలాసం(2) లక్షణాపరిణయం వగయిరాలు రచించడం, మధ్య మధ్య అవకాశం కలిగినప్పుడల్లా దేవీభాగవతం రచించడం యీలా కలగా పులగంగా జరగడంచేత దేని తరువాత దేన్ని రచించామో నిర్ణయించడం కష్టసాధ్యం. వీటి రచనానంతరం - బుద్ధచరిత్ర. యిది యీలా వుంచుదాం, శ్లేషకవిత్వాన్ని గూర్చి వ్రాస్తూ ప్రసక్తాను ప్రసక్తంగా కొంత దూరం మాఋపుంతలో నడిచాం- అనేకులు శ్లేషకవిత్వం రచించారు - 'ప్రత్యక్షర శ్లేషమయం సుకావ్యం చకేరసుబంధు స్సుజ నైకబంధుః' అన్నాఁడు సుబంధుఁడు 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అని పేరు మ్రోఁగిన బాణుని శ్లేష చెప్పనే అక్కఱలేదు. తరవాత — (1) ద్వ్యర్థి, బత్ర్యర్థి యింకా చతుః, పంచ పఱకు వెళ్ళిన వారున్నూ వున్నారు. యిన్నిటిలోనూ చమత్కారాలు, అందాలు చందాలు యెన్నో వున్నాయిగాని నాకు ——

శ్లో॥ అజీర్యదఘనాశనం దృఢగదాకరం దేవి !
యత్పురాణమపి పూరుషంపునరలంఘనం పుష్యతి
తదేతదిహ పాతున స్తవ కటాక్షదివ్యౌషధం ఫణీంద్ర
శయజీవికే భవవిపన్మయా దామయాత్.

ఆ యీ లక్ష్మీసహస్ర శ్లోకం నచ్చినట్లు యేపీ నచ్చవు. యిందులో భక్తివుంది. అందం వుంది. చందంవుంది. యెన్ని సులక్షణాలలోవున్నాయి. ప్రసాదగుణం కూడావుంది. శ్లేషలో యీ గుణం వుండడమంటే బంగారానికి పరిమళం వుండడమే. యీ శ్లోకం కటాక్ష స్తబకంలోనిది. హేఫణీంద్రశయజీవికే-అని లక్ష్మీదేవికి సంబోధన. ఫణీంద్రశయ=శేషఫణియందు శయనించే ( విష్ణువునకు ) జీవికే=ప్రాణప్రియురాలవైన ఓ శ్రీ మహాలక్ష్మీ ! అని వాస్తవార్థం. తోఁచే అర్థమో ! పాముమీఁద పరుండేవాణ్ణి కూడా యే అపాయమూ రాకుండా బ్రతికించేశక్తిగలదానా ! అని అమ్మా ! తవ=నీయొక్క కటాక్షదివ్యౌషధం=కటాక్షమనెడి మంచి యౌషధము ( ఒకానొక ) పురాణమపి = ముసలివాఁడైనప్పటికీ పురుషం = మనుష్యుణ్ణి, అలంఘనం = లంఘనాలు కట్టకుండానే పుష్యతి = రక్షించుచున్నది. ముసలివానికి లంఘనాలు కడితే తట్టుకోలేఁడుకదా ! అయితే ఆ పురాణపురుషుఁడు ముసలివాఁడు మాత్రమే కాఁడు. దృఢగదాకరుఁడు దృఢ = చలింపని, గద = రోగమునకు, ఆకరుఁడు = స్థానభూతుఁడు ( కూడానఁట! ) అనఁగా యేదో దీర్ఘరోగంతో కిందా మీఁదా పడి నలుగుతూవున్నాఁడని భావమూ యింతమాత్రమేకాదు. అజీర్యదఘనాశనుఁడు అజీర్యత్ = జీర్ణంకాని అఘన = కొంచెమైన, అశనం = తిండికలవాఁడు అనఁగా కొంచెం తింటాడు కాని ఆతిన్నది జీర్ణంకాదు ( అజీర్ణే భోజనంవిషం ) యిట్టివాణ్ణి లంఘనాలు కట్టకుండానే నీ కటాక్షదివ్యౌషధం కాపాడి రక్షిస్తూ వున్నదికదా ? ఆ కటాక్ష దివ్యౌషధము నః = మమ్ములను ఏకత్వమందే బహువచన మని ( అస్మదోర్ద్వయోశ్చ ) కాని, లేదా అస్మత్పుత్ర పౌత్రాదులను అని కాని చెప్పికోవచ్చును.

పాతు = రక్షించుఁగాక, అయితే ఆ ముసలివానికేదో రోగం వుంది పైఁగా అజీర్తి. అది యెంత కొంచెంతిన్నా అరగనివ్వదు. యిది యీలా వుండగా పాములతో సంబంధం. అట్టివాడికి ఆ ఔషధం ( కటాక్షాత్మకం ) వుపకారం చేస్తే చేస్తూఁది. నీకేమి రోగం వుంది అంటే - భవవిపన్మయాదామయాత్, సంసారమునందలి విపత్తులున్నవే తద్వికారమైన రోగము నుండి నన్ను రక్షించుగాక. యేరోగమునుండి నన్ను రక్షించుగాక? యే రోగముకన్నను - సంసారమే గడ్డురోగం, కనకనే ఉపనిషత్తులు మృత్యుపదం తో సంసారమును వ్యవహరిస్తూ వచ్చాయి ( సమృత్యోర్మృత్యుం. చూ. ) కనక యీ రోగమును కుదిర్చిన మందే మందుగాని యితర రోగములను యేగచ్చాకో పుచ్చాకో నూఱి యిస్తే కుదిరిస్తాయి ఆమందులు. సరే బాగుంది. నా కటాక్ష దివ్యౌషధం, యే ముసలివాణ్ణో బ్రితికించినట్లు లేదే అంటే ఆ ముసలాణ్ణి చూపుతూ వున్నాఁడు భక్తుఁడు. పురాణమపి పూరుషం = పురాణ పురుషుణ్ణి, అనఁగా శ్రీ మహావిష్ణువును —

ఈయన దృఢగదాకరుఁడు కాఁడా? ధృఢమైన గదానామకమైన ఆయుధము, కర = చేతియందు కలవాఁడేకదా? ఇదముపలక్షణం. శంఖచక్రగదాధారీత్యర్థః. గదశబ్దము పుంలింగమైతేరోగార్థకము(రోగవ్యాధిగదామయాః.) స్త్రీలింగమైతే ఆయుధమర్థము, మఱిన్నీ అజీర్యదఘనాశనుండు. అజీర్యత్ = జీర్ణింపని యెన్నఁటికీ నశింపనిపన్నమాట, అఘ = పాపములను,నాశనమ్ = నశింపఁ జేయువాఁడన్నమాట.ఆయీవిశేషణాలు చక్కఁగా శ్రీ మహావిష్ణువునకు సమన్వయిస్తూన్నాయి. కవిలేఖిని కద్దేమిటి? నిరామయా యుర్భాగ్యాలను భక్తులకు ప్రసాదించే నిరామయుణ్ణిఅజీర్తివ్యాధిపీడితుణ్ణిగా సమన్వయించింది. ఏవిధమైనక్లిష్టకల్పనలూ అక్కఱలేదు- అయితే పురాణపురుష పక్షంలో భార్య ఉపచారాదులు భక్తితో చేసి అనాదరించకుండా చూడడం చక్కఁగానే సమన్వయిస్తూ వుందిగాని శ్రీ మహావిష్ణువు సర్వ జగద్రక్షకుఁడుకదా! ఆయన్ని ఆయనభార్య రక్షించడంలేదా! పోషించడం యేం బాగుందంటారేమో! శాక్తేయుల మతంలో త్రిమూ

ర్తులూ శక్తికి అధీనులే అనిన్నీ ఆమె సహాయంవల్లనే వారు తమతమ కృతులు ( సృష్ట్యాదులు ) చేయఁగలుగుతూ వున్నారనిన్నీ పురాణాలు చెపుతాయి—

ఉ. ఈవు సృజింతువంచు మఱియేఁ గరుణించి భరింతు నంచు గౌ
రీవిభుఁడాగ్రహమ్మునహరించు నటంచు జనుల్ వచింతురీ,
త్రోవలు తప్పుత్రోవలు, బుధుల్ మనలన్ సృజియించె నొక్క తే
జోవతి ఆదిశక్తి యనుచున్ వచియింతురుగాదె పుత్రకా !

మఱిన్నీ —

క. మృడునకుఁ దామసి తాఁదో
డ్పడె రాజసి నీకుఁదోడుపడెసాత్త్విక తో
డ్పడె నాకటుగాకుండినఁ
గొడుకా? యొకగవ్వకైనఁ గొఱగాదు సుమా.

ఆయీ మాటలు విష్ణువు బ్రహ్మతో చెప్పేవి. అయితే లక్ష్మీసహస్ర కర్త శ్రీవైష్ణవుఁడు. ఈయన నారాయణ పరత్వాన్ని అంగీకరించేవాఁడుగాని ఆయన భార్యయందు ఆయన్ని పట్టిన గౌరవమేకాని, స్వాతంత్ర్య ప్రయుక్త గౌరవం కలవాడుగా వుండఁడనే శంక కవకాశంలేకపోదు. యీలాటి విష యాలలో కవులు 'జంగానివా? దాసరివా....అంటే,' అన్నసామెతను అనుస రించేవర్తిస్తారు. దానికి ఆధారం "సార్వపధీనాః కవయః" అనే అభి యుక్తోక్తియేగాకుండా యింకాయేదేనా ఆధారంకూడా మతరీత్యాకవికి ఉంటే వుంటుంది. కవితా సారస్యాస్వాదనం చేదస్తంగాసల్పి వాసనచూచే వారికి యేలా చెడువాసన వస్తుందీ ? యిదీ అంతే.

"....కల్హారైః పరికల్పితేవ లలితామాలా కవే ర్భారతీ శుష్కాణాం పరిపీడనం నసహతే" కదా ? (విద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్-ప్రిధ్వంసాభావము, చూ.) ప్రసక్తాను ప్రసక్తంగా మఱికొంతదూరం వచ్చాం. మనకు ముఖ్యంగా ప్రస్తుతం చూచుకోతగ్గది శ్లేషకవిత్వం.

దాన్ని యీవేంకటాధ్వరి యెంతఅందంగా చిత్రించాఁడో సహృదయులు గుర్తిస్తారు. యమకంకూడా యీయన కదళీపాకంలో చిత్రిస్తాడు. లేని పోని చిక్కులుండవు.

శ్లో. ప్రాతరంబుజ విడంబిలోచనాం మాతరం త్రిజగతాముపాస్మహే
శీతరమ్య కరుణావలోకనై ర్యా తరంగయతి మంగళానినః

యిది సంస్కృతమే అయినా తెలుఁగులో కొంచెం పాండిత్యం వుండే సామాన్య కవులకూడా భావం అవగత మవుతుంది. లక్ష్మీ సహస్రం యావత్తూ మంచిపాకంలోనే నడిచినా అందులోనూ తత్రోఽపిచ చతుర్థోంకః అన్నట్టు కటాక్ష స్తబకంవుంటుంది.

"నిద్రాతి స్నాతి భుంక్తే చలతి కచభరం శోషయత్యంతరాస్తే" అన్న శ్లోకం యెంత స్వభావోక్తిగా వుందో విజ్ఞులు పరిశీలిస్తారు. శ్లేష కవిత్వాన్ని గూర్చి వ్యాఖ్యానించడానికి వుదాహరించిన శ్లోకాన్నిగూర్చి యేకొంచెమో వ్యాఖ్యానించడం జరిగింది. తక్కింది విజ్ఞులు అనుక్త మన్యతో గ్రాహ్యంగా గ్రహిస్తారు. నేను వుదాహరించిన శ్లోకాన్ని తఱచుగా (అర్థంయెఱింగి) పఠించే వారికి నిరామయాయురారోగ్య భాగ్యములే కాక యేదో అనిర్వచనీయమైన ఆనందంకూడా కలుగుతుం దని నావిశ్వాసం మాత్రమేకాదు అనుభూతికూడాను. ఆ ఆనందం కవితా రసాస్వాదనానికి సంబంధించినది. దాని స్వరూపం చెప్పడానికి నాకు చేతకాదు. అనుభవైకవేద్యం ఈశ్వరో వేత్తివానవా అయితే శ్లేషకవిత్వా నికి లాక్షణికులు ఉత్తమకవిత్వంగా యెందుకు అంగీకరించారు కారు అంటారేమో ? వ్యంగ్యకవిత్వంముందర యిది పనిచేయదు - అందుచేత దానికి అగ్రతాంబూలం యివ్వడం తప్పదు - శ్రమలేకుండా అది విశేషా ర్థాలను వివరిస్తుంది - లోపల నిగూఢమైన భావాలను స్ఫురింపచేయడంలో ఆ వ్యంగ్యరచనకు ఆదేసాటి. గోవర్ధనాచార్యులు - "అసతీ సత్కవి సూక్తిః కాచ ఘటీచ త్రియంవేద" అన్నాడు తన మనస్సులోవున్న

భావాన్ని జారస్త్రీ వ్యంగ్యోక్తులచేతనూ అట్టిచేష్టలచేతనూ సుళువుగా వెలువరిస్తుంది - కాచఘటీ అంటే గాజుకుప్పె, అది తనహృదయంలో వున్న దీపాన్ని పైన వున్నట్టే కనపరుస్తుంది, ఆలాగే సత్కవిసూక్తిన్నీ వ్యంగ్యమర్యాదచే గూడార్థాలను స్ఫురింప చేస్తుంది. అందుచేత శ్లేష కంటేనే కాదు అన్ని కవిత్వాలకంటేకూడా ఆ వ్యంగ్యకవిత్వం అగ్రస్థానానికి వస్తుంది.

"తే. గీ. కుందనమువంటి మేను మధ్యందినాత
పోష్ణహతిఁ గ్రాఁగెవడదాఁకె నొప్పులొలుకువదనము...."

యీ మనుచరిత్ర పద్యంలో యేవిధమైన కవితాచమత్కారమున్ను లేకపోయినా యెంతో చక్కని వ్యంగ్యం వుంది. అతిథి సత్కారాన్ని యీవిధంగా గృహస్థుల భార్యలు చేయరు-యిది సంసారిణికాదు, కాముకురాలు అని స్పష్టంగా తెలుస్తూవుంది - అతిథియొక్క సౌందర్యవర్ణన అప్రయత్నంగా యిందులో యిమిడింది — (1) కుందనమువంటి మేను (2) వొప్పులొలుకు వదనమూ యీ రెండువాక్యాలూ పద్యాన్ని స్వర్గలోకానికి పంపిస్తూన్నాయి, నాయకురాలు ప్రౌఢ అనికూడా అవే తెల్పుడు చేస్తున్నాయి, అయితే లక్ష్మీసహస్రశ్లోకంలో శ్లేషమాత్రమే కాక యిట్టి వ్యంగ్యంకూడా కొంత వుంది. దాన్నికొంచెం వివరించి ముగిస్తాను.

ఒకానొకముసలివాణ్ణి రోగిష్టివాణ్ణి భార్య చక్కఁగా ఆదరించి ప్రతికిస్తూ వుందనే అర్థం వాచ్యంగా వుంది - యీవాచ్యార్థం — "అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు సురుచిరంబగు భార్యయసూవె" అనే భారతపద్యార్థాన్ని (వ్యంగ్యార్థా న్నన్నమాట) స్ఫురింపచేస్తూవుంది. అందుచేత లక్ష్మీసహస్రశ్లోకం శ్లేషకేకాక వ్యంగ్యానికికూడా లక్ష్యమే. విజయ విలాసకవి పెట్టేశ్లేష మఱీ అద్భుతంగా వుంటుంది - (1) మరుఁడో? యనఁగా నరుఁడుండె నయ్యెడన్. నరుఁడు = అర్జునుఁడు. మరుఁడో? = మన్మథుఁడేమో? — అనఁగా (మన్మథునియంత అందగాఁడన్నమాట) అని వాక అర్థం. రెండో అర్థం. మరుఁడు = మన్మథుఁడు, ఓయనఁగా కేకలు

వేయుచుండఁగా అనఁగా ఉద్రేకమును కల్గించుచుండగా అనేది. ఆయీ శ్లేషకు నిఘంటులు వగైరా పరాపేక్షలేదు (2) "రామరామా ? యటంచు నారాజసుతుఁడు కృష్ణ ? కృష్ణా ? యటంచు నాకీరవాణి" అర్జునుఁడు రామ ? రామా ? అంటున్నాడు అనఁగా మనోహారిణియైన ఓసుభద్రా అని (మనస్సులో నన్నమాట) స్మరించుచున్నాడని అంతరార్థం. బాహ్యార్థం వ్రాయనక్కఱలేదు - ఆ సుభద్ర కృష్ణ కృష్ణా ? అని స్మరిస్తూ వుందఁట, కృష్ణశబ్దానికి అర్జునార్థకత్వం కలదు. జతుకాష్ఠశ్లేష హృద్యమే. కవి యెంతో శ్రమపడి రచించాడనే దాన్ని బట్టి కవిత్వానికి గౌరవం రాదు. యెంత అప్రయత్నంగా ధార దొర్లుతుందో అంత స్వారస్యం కనపడు తుందని నాతలఁపు - శ్లేష విషయంలో తేలికగా రచన సాఁగడం యే కొందఱికో కాని సర్వేసర్వత్ర కుదరదు - వెంకటాధ్వరి పుట్టుకతోడనే శ్లేషకవిగా అవతరించిన మహాకవి - యితని రచన యావత్తు యిహపర సంపాదకమే కనక - "ఇహంబును బరమున్ మేలగు గొందఱకు" అనే శంభుదాసుని నిర్ణయం యీతనికి సమన్వయించుటచేత యితఁడు ధన్యుఁడు. యీ నాల్గుమాటలూ యీయన కవిత్వాన్ని గూర్చి వ్రాయడంవల్ల - "వయంచ కృతిన స్తత్సూక్తి సంశీలనాత్"



## చూళిక

( 1945 అక్టోబరు భారతి పత్రిక నుండి )

చూళిక అంటే యేమిటో కొంచెం వ్యాఖ్యానించవలసిన ప్రసక్తికలిగి వ్యాఖ్యానిస్తూన్నాను. యెందుకు ప్రసక్తికలిగిందో వివరించడం ప్రస్తుతం కాదు యెవరో (జిజ్ఞాసాతాత్పర్యంతోనే అనుకోవాలి) ప్రశ్నిస్తారు. వారికి మాత్రమే చెపితే అంతే-ఆవొక్కరికి తెలియడమే కాని అంతకంటే అధికసంఖ్యాకులకు తెలియదు. పత్రికాముఖాన్ని ప్రకటిస్తే పదిమందికీ

తెలుస్తుందని వ్యాసరూపంగా ప్రకటిస్తూన్నాను. ఆయీపదము నాటకసంప్రదాయజ్ఞులకు సులభంగా తెలిసేదే.

విష్కంభం, ప్రవేశకం, అంకాస్యం ఆయీపదాలకు చూళిక సహోదరి. వాట్లవల్ల నాటకానికి జరిగే ప్రయోజనం యేలాటిదో (వృత్త వర్తిష్యమాణకథాసూచనన్నమాట) దీనివల్లకూడా ఆలాటిప్రయోజనమే కలుగుతుంది. ఆయీచూళిక సర్వమూ పండితరాయల కవిత్వంలాగ అన్యాపదేశంగా వుంటుంది. తెలుఁగులో స్వతంత్రించి రచించిన నాటకాలే లేవు. యేకొంచెమో వున్నప్పటికీ అవి "రంగాలూ మోర్మేనులూ"గా వుంటాయి గాని ప్రాచీనసంప్రదాయంగా వుండవు. అందుచేత పూర్వసంప్రదాయాన్ని అంతో యింతో అనుసరిస్తూ వ్రాసిన మాపాండవవిజయంలోన్నుంచే దీనికి వుదాహరణం చూపవలసి వచ్చింది. తుట్టతుది అంకంలో కాఁబోలు (పుస్తకం దగ్గిఅలేదు. అందుచే పాఠభేదంకూడా రావచ్చు. ప్రధానాంశం చూచుకోఁగోరుతాను) ఆయీ పద్యం వుంటుంది—

"ఆఅనిలోఁతు నీటికొల నక్కడఁబూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి దిప్పు డా
నీరజమందుఁ దా మిగులు నేఁయొకరే కటు లయ్యెనే నలం
కారములౌనె! యా కొలను గాని సరోజముగాని భూమికిన్."

ఆయీ పద్యం యావత్తూ చూళికకు వుదాహరణం. చూళికకు లక్షణం తెరలో నున్న పాత్రలచే కథాసూచన (అన్యాపదేశంగా) చేయుట. ఆయీ వాక్యం సంజయునిది. అప్పటికి దుర్యోధనుఁడొక్కఁడు వినాగా ధృతరాష్ట్రపుత్త్రు లందఱూన్నూ వీరస్వర్గాన్ని అలంకరించారు.

"పలపలని మూకఁలోఁగాల్
నిలువక గుజ్జుమ్ము డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుఁ డౌచు నొక్కఁడు
తొలఁగి చనియె నేమి సెప్పుదుం గురునాథా."

ఆనేస్థితిలో వుంది కౌరవ పక్షం. అప్పుడు పైవిధంగా విలపించాఁడు పాపం సంజయుఁడు. దీనికి వ్యాఖ్యానం అవసరం లేదు. ఇది తి. వెం.కవుల కవిత్వం. ఆబాలగోపాలమూ అక్షరాస్యులందఱికీ తెలిసేదే. అయినాదీనిలో కొందఱు విద్వాంసులూ, కవులూ యేవో శంకలూ, సమాధానాలూ ముచ్చటించుకొంటూ వుండఁగా విన్నానని శ్రీయుతులు పిరాట్ల సత్యనారాయణగారు చెపుతూ "అయ్యా! యీ పద్యంలో 'ఆఱని' అనే విశేషణం యెందుకండీ" అని ప్రశ్నించేటప్పటికి నాకు ఆశ్చర్యం కలిగింది. యెందు చేతంటారా? ఈసత్యనారాయణగారి తెలుఁగుసాహిత్యం అల్లా టప్పా సాహిత్యం గాదు. ఈయనకు భారత భాగవత రామాయణాదులలో వుండే ముఖ్యఘట్టాలేకాదు, మనువసుచరిత్రలలో ఘట్టాలేకాదు అన్నీ కంఠో పాఠం. మాపద్యాలే కాదు, వచనాలుకూడా యీయన తూ-చా తప్పకుండా వొప్పచెపుతారు. యిందులో అత్యుక్తిలేదు. కవిత్రియకృతభారతం ఆలా వుండగా, జంగంకథగా యెవరో మహాకవివ్రాసిన భారతం (విరాటపర్వం మాత్రమే) యీయన ముఖతః నేను విన్నాను. యీయన ధారణాశక్తికి నేనుఆశ్చర్యపడ్డాను. యీయనకు యిప్పుడు జంగంకథగా పాడే బొబ్బిలి కథ గాక వేఱొక జంగంకథగా పాడేబొబ్బిలికథ కంఠతఃవచ్చును. నేను విన్నాను. కొన్ని విశేషాంశాలు ఆయీ కథలో గోచరించాయి. యే మాత్రం రసంగా వున్న కవిత్వమేనా సరే యీయనకు నోటికి వచ్చితీరుతుంది. "యత్ర యత్రరసవత్త్వమ్" అని వ్యాప్తికూర్చడానికి యీయన పనికి వస్తారు. పూర్వగ్రంథాలలో చాలా భాగం యీలాటి రసజ్ఞుల మూలంగానే నిల్చివున్నా యనుకోవచ్చును.

> "....లోకులరసనలె
> ఆ కులుగా నుండునట్టియవి వో కవితల్"
> "ఆనీరసపుఁగావ్యశవముల
> దూరమునన పరిహరింపుదురు నీతిజ్ఞుల్" (కవికర్ణ)

అన్న సంకుసాల మహాకవి వ్యర్థవచస్కుఁడు కాఁడు. తత్తథాస్తామ్. అయీ సత్యనారాయణగారు యింతటి నీరసపు శంకచేస్తే ఆశ్చర్యం నాకే కాదు-యెవరికేనా కలిగితీరవలసిందే. తర్వాత నేను "అయ్యా! యీ 'ఆజని' విశేషణం వ్యర్థంగా ప్రాసకోసం పడ్డదికాదు. యిక్కడ యీకాలనుపదంవల్ల గ్రహించతగ్గది కౌరవవంశం. ఆయీవంశం ధృతరాష్ట్రి పుత్త్రులతో అంత రించక పాండవులద్వారా చిరకాలం నిల్చివుండడాన్ని సూచిస్తూ ఆవిశేషణం వాడఁబడింది. "సంభవ వ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్" అని నాహృదయాన్ని వ్యాకరించాను. అప్పుడు ఆయన యీశంక స్వకపోల కల్పితం కాదనిన్నీ, తనకన్న విశేషజ్ఞులు చేస్తూవుండఁగా విని మిమ్మల్ని అడిగినాననిన్నీ చెప్పినారు. అలాగైతే మన జీవితకాలంలో మన అభిప్రా యాన్ని వెల్లడించడం యుక్తంగా వుంటుందని యీ కాస్త వ్రాశాను. "జీవతః కవేః ప్రష్టవ్యమ్."

ఆయీ చూళికా పద్యంవంటి పద్యం ఆ పాండవ విజయంలోనే కాదు - మా భారత నాటకాలలోనే లేదేమో ? ఆయీ పద్యమే వ్యర్థపద భూయిష్ట మయే యెడల యిఁక అందులో ఆఁగే పద్యమే వుండదు. అయినా కవికి వున్న అధికారం యెంతవఱకంటారు ? యేదో తోఁచింది వ్రాసేటంతవఱకే. ("రసాంరసవిచారము మాయది కాదు" చూ.) తక్కిన యావత్తు బాధ్యతా రసజ్ఞ లోకానిదే. అందుచేతనే "సహృదయాః ప్రమా ణమ్" అంటారు వ్రాసివ్రాసి కావ్యవ్యాఖ్యాతలు; సహృదయ శబ్దానికి సామాన్యంగా అయే అర్థం హృదయం కలవారు అని మాత్రమే. కాస్త శాస్త్రసాహిత్యం కలవారికి అయే అర్థం "ప్రశస్తమైన (నిర్దుష్టమైన) హృదయం కలవారు" అనేది. ('భూమవిందా ప్రశంసాసు' చూ.) అలాగే కాకపోతే లోకంలో హృదయం వుండడం సమస్తప్రాణి సామా న్యంకదా ? శాస్త్రజ్ఞత లేనివారికి "నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ, పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే" అన్న శ్లోకం సరిగా సమన్వయిస్తుందా ! తత్తథాస్తామ్. "ఊరుమతీకన్యా" వగయిరా

ప్రయోగాలన్నీ యిట్టివే. లోకంలో పాండిత్యం వున్నచోట సర్వత్రా సహృదయత్వం వుండదు. సహృదయత్వ పాండిత్యాలు భిన్నాధికరణాలు కావనిన్నీ, సహృదయులే పండితులు, పండితులే సహృదయులు అనీలేని సామానాధికరణ్యాన్ని చెపుతారు గాని అది నాకు రుచింపదు. పక్షపాతాది దోషరహితమైన హృదయం కలవారై, మంచి సాహిత్యం, అనఁగా " అబ్రవీత్పురాణ " వ్యాకర్తలకుండే సాహిత్యంవంటిది కాని నిశితమైన సాహిత్యం యెవరికి వుంటుందో అట్టివారి వ్యాఖ్య యీ లోకంలోనే కాదు స్వర్లోకంలోకూడా గౌరవింపఁబడుతుంది. అంతో యింతో శబ్దశాస్త్ర ప్రవేశం వుంటేనేకాని వ్యాఖ్యకు అధికారం వుండదు. మచ్చుచూపుతాను. " సమానినీ సంసహతేఽన్యసంగమమ్ " యిది భట్టికావ్యంలోది. స్త్రీ (తన భర్తకన్న మాట ) అన్యసంగమమ్ = అన్యపురుషసాంగత్యమును సహించదు అని శాస్త్రసాహిత్యం లేనివారు వ్యాకరిస్తారు. యథాశ్రుతంలో అన్యస్త్రీ సాంగత్యమును సహించదు అని అర్థం రావాలి. శాస్త్రసహాయం లేనిదే యేలా వస్తుంది అభిమతార్థం ? శాస్త్రం సమగ్రంగా చదివినవారికికూడా "సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః." అన్న వార్తికం సమయానికి జ్ఞప్తికి రావాలి. అప్పుడు అభిమతార్థసిద్ధి కలుగుతుంది. అందుకేకదా ఒక విద్వన్మహాకవి " జనిత్వా కింను స్యాత్కిమపి యది శాస్త్రం నవిదితమ్ " అన్నాఁడు. అభియుక్తోక్తి వొకటి యీలాగు వినఁబడుతూ వుంది : " మహాభాష్యం వా పాఠయేత్ మహారాజ్యంవా పాలయేత్ " మహారాజ్య పరిపాలన వాపక్షంగా మనపెద్ద లంగీకరించారు. దీనివల్ల మన పూర్వులకు శాస్త్రాధ్యయనమందు యెంతటి అభిమానం వుండేదో వ్యక్తమవుతుంది.

యేదో సహృదయశబ్దాన్ని వ్యాకరిస్తూ ప్రసక్తంగా మఱో వుంతలోకి దిగినట్లుంది. ఆయీ సహృదయులమీఁద యెక్కువగా ఆధారపడేది కవిత్వమేకాని యితరం (శాస్త్రం) కాదు. శాస్త్రం వారివారి పాండిత్యాన్నిబట్టి పూర్వపక్షసిద్ధాంతాలు చేసికోవడానికి అవకాశం వుంటుంది. కవిత్వమో ?

రసవంతమా కాదా అనే విషయం కేవలమూ సహృదయాధీనం. కొంచెం మచ్చుచూపి చర్చిస్తాను. యెఱ్ఱాప్రెగ్గడ —

" ఈ లోకమయగుఁ గొందఱ
కాలోకమ కొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా :
యేలోకము లేదుసూవెఁ యిలఁ గొందఱకున్ "

అంటూ వొక పద్యం రచించాఁడు. యీ పద్యం చదువుకున్నప్పు డల్లా నాకు వొళ్ళు పులకరిస్తుంది. యిది సంస్కృత భారతంలో వున్న దాన్నిబట్టే రచించాఁడో, లేక స్వకపోలకల్పితంగానే రచించాఁడో! నేనెప్పుడూ పరీక్షించి చూడలేదు. యెందుకు నీకు వొళ్ళు పులకరిస్తుందో చెప్పుమంటే నేను చెప్పలేను. చెప్పలేక వూరుకోను. వూరుకోక యేంచేస్తా నంటే ? పైమీఁది బట్ట మెడకు చుట్టుకొని అలా ప్రశ్నించే మహనీయుల కాళ్ళకు " ఉరసామనసా....ప్రణామోఽష్టాంగ వుచ్యతే " చేస్తాను. అయీ విషయంలో అంతకంటె కర్తవ్యంలేదు. ముమ్మాటికీ లేదు. యేమన్నాఁడు? దశరూపకంలో " తస్మైనమ స్స్వాదుపరాఙ్మఖాయ " అనలేదా ? నేనుదా హరించిన భారత పద్యంలో యేవిధమైన వ్యంగ్యం గాని, శబ్దాలంకారం గాని, అర్థాలంకారంగాని లేనట్టే నాకు తట్టుతుంది. అయితే యీజగత్తు నాతోటే వుందా యేమిటి ? యేదో వ్యంగ్యం దీనిలోకూడా వుందనేవారు బయలుదేఱితేనో ? అందుకేకదా ' నాకు తట్టుతుంది ' అనవలసి వచ్చింది? యీలాటి చోటకూడా వ్యంగ్యాలు తీసి పెద్దపెద్ద వుత్తరాలు వ్రాసి సమా ధానాలు కోరేవారున్నూ బయలుదేఱి కోలాహలం చేస్తున్నారు. తేభ్యో మహద్భ్యోనమః. వారి సాహసం వర్ణనీయం. అయీ విషయం — అనఁగా పైభారత పద్యంలో వ్యంగ్యమేదేనా వుందా లేదా అనే విషయం తేల్చ వలసివస్తే యెవరికి అధికారం వుంది ? ' సహృదయాః ప్రమాణమ్ ' అనడంకన్న గత్యంతరం లేదు. లేని వ్యంగ్యం వుందనడం యెందుకు ప్రసక్తమవుతుంది అని ప్రశ్నిస్తారేమో ? వున్న కుళ్ళంతా అక్కడే

వుంది. సహృదయమాత్ర గోచరమైన యీవిషయంలో యెవరేలాటి పిడివాదం చేసినా చలామణీ అవుతుందికదా ? "కాదన్నవాఁడు కరణం" ప్రమాణములలో నొక ప్రమాణం ఆప్తవాక్యం. కాని

" ఆప్తవాక్యంబు విశ్వాస్యమంటివేని
ఆప్తుఁడెవ్వఁడో ? తెలియంగ నలవియగునె ?"

( దేవీ భా. ౪ స్కం )

"ఆప్తస్తు యథార్థవక్తా" అట్టి యథార్థవక్తలు లోకంలో వుంటారా అని సంశయించి యీ భారం మనుష్యులమీఁద పెట్టక "వేదాః ప్రమాణమ్" అని, అంత మాత్రంతో సంశయ నివృత్తి కాకపోవడంచేతనే కదా వేదాలకు అపౌరుషేయత్వాన్ని కల్పించవలసి వచ్చింది. యిదంతాదేని మీద వచ్చింది ? "సహృదయాః ప్రమాణమ్" అనేదాని మీఁద. అక్షరాస్యులందఱూ సహృదయులు కారు. నిష్కళంకహృదయులైన విద్వాంసులే సహృదయ శబ్దవాచ్యులు. అయితే లోఁగడ చూపిన భారత పద్యం "శుష్కోవృక్ష స్తిష్ఠత్యగ్రే" అన్నట్టు ( అయ్యవార్లగారి నట్టిల్లులాగు ) వుంది. దీనిలో వ్యంగ్యార్థాన్ని తీయడం కష్టసాధ్యంకాదా ? అంటే వినండి - అబద్ధానికి అర్థమేమిటి ? సహృదయైకగమ్యంకదా యీ "అస్తి నాస్తివిచికిత్స". అందుచేత ఆత్మవంచనకు వెఱవకపోతే యిష్టం వచ్చినట్లల్లా వాదింపవచ్చు. ( ముఖమస్తీతి వక్తవ్యం. అథాతో బ్రహ్మజిజ్ఞాసా. నీయమ్మజిజ్ఞాసా. సా....సా....సా....) కొందఱు "అందులో యేదోవుంది కాఁబోలును. లేకపోతే ఆయన అలా అంటారా" అనుకొనేవారున్నూ వుంటారు. అందుచేతనే "కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివానవా" అనవలసి వచ్చింది. ఆ యీ విషయం వాదంవల్ల తేలదు. ఈ లోకంలోనేతేలదనికూడా చెప్పడం సాహసం కాదు. కొన్ని వ్యంగ్యాలు గ్రంథకర్తకు అభిప్రేతములు కాకుండా స్ఫురించేవిన్నీ వుంటాయి. మచ్చు చూపుతాను —

" సోమయాజుల మార్గంబు సొంపుగనక
పిన్నపెద్దల మర్యాద పేరుకొనక

భట్టురీతిని వాపోవునట్టి వట్టి
కాకవులు కాకవులు నొక్కకడుపువారె." (శ్రవణా)

యిందులో శబ్దశక్తిమూలకమైన ధ్వనివల్ల తిక్కన, సినవీరభద్రుఁడు (పిల్లలమఱ్ఱి), పెద్దన్న వీరు స్ఫురిస్తున్నారు. ఆ పద్ధతిని భట్టు పదమువల్ల వసుచరిత్రకర్త కాఁడని నేను యెంతగా ప్రమాణంచేసి చెప్పినా ప్రయోజనంలేదు. నిజానికి నాకు భట్టుమూర్తికి ఆ దెబ్బ తగలడం స్వప్నేపీ యిష్టంలేదు. ఆ పదం వేయని పద్ధతిని ఆ పద్యం సరసంగా పూర్తికాదు, పోనీ, పద్యమే మానుకోరాదా - యీ పూజ్యపూజావ్యతిక్రమం యెందుకంటే: మాముత్తాతగారు (పెద్దకవీంద్రుఁడై పేరు చెందినవాఁడు పిన్న ముత్తాత నర్సన్నగారు) కాకవులను గూర్చి వ్రాస్తూ "కాకవులు, ఘూకవులు (గుడ్లగూబలు) నొక్క గూటివారే" అన్నారు. ఆ పద్యంమాదిరి పద్యం చెప్పాలని చిన్న నాఁటినుంచీ నాకు కుతూహలం. అసలే మానితే ఆ ఫుబలాటం తీరడం యెట్లా? అందుకోసం యీ పాపానికి వొప్పుకోవలసి వచ్చింది. నాకు పెద్దన్నగారి మనుచరిత్రమీఁదకంటె భట్టుగారి వసుచరిత్రమీఁదనే (యిప్పుడు కాదు, ఆవయస్సులో. యిటీవల మాఱింది అభిప్రాయం) పక్షం జాస్తీ. అట్టి స్థితిలో ఆత్మాభిప్రాయ విరుద్ధంగా అలా యెందుకు వ్రాస్తానంటాను. చెప్పొచ్చేదేమంటే? స్ఫుటంగా దుర్వాసనగాని, సువాసనగాని కొడుతూవున్నప్పుడు అన్యథా అపలపిస్తే (అది నిజమైనా సరే) దాఁగదు. "నహికస్తూరికామోద శ్శపథేన నివర్తతే"

యేదో చాలాదూరం వచ్చాం. వ్యంగ్యానికేనా తోవా తెన్నూ వుండాలి. అంతేకాని గుడ్డెద్దు జొన్నచేను మాదిరి వీలుపడదు. "అస్తమేతి గభస్తిమాన్" అయీవాక్యం వాళ్ళవాళ్ళ మనస్సుకు, వృత్తికి, శీలానికి అనుగుణంగా యెన్నో సందర్భాలను స్ఫురించేటట్టు చేసిందంటే అది సహృదయు లామోదిస్తారుగాని "మహదైశ్వర్యాభివృద్ధిరస్తు. అష్టపుత్ర బహుధనమస్తు. దీర్ఘాయుష్యమస్తు" అని ఆశీర్వదిస్తే "యీ ఆశీ

ర్వచనంలో యిదివఱకు ఆ యీ సంపత్తులు లేవు కనక యివి క్రొత్తగా కలగాలని ఆశీర్వదించినట్లయింది " అని వ్యంగ్యంతోనే బుద్ధిమంతు లున్నారని నేనెఱుఁగను. కాని యిటీవల అట్టివారున్నట్లు గోచరించింది. యిది కాలం చేసిన సాయం. "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ " భవతు. ప్రకృతమనుసరామః. సహృదయులను గుఱించిన్నీ, వ్యంగ్యాన్ని గుఱించిన్నీ యేకొంచెమో ప్రసక్తానుప్రసక్తంగా ముచ్చటించినట్లయింది. విశేషణంఅంటే యేమిటో, దాన్ని కవిత్వంలో యేవిధంగా వ్యాఖ్యాతలు పాటించాలో, శాస్త్రంలో యేవిధంగా పాటించాలో కొంచెం వివరిస్తే "ఆఱనిలోఁతు నీటికొలను" అనే పద్యంలోవున్న "ఆఱని " అనే విశేషణం యెందుకు అనే ప్రశ్నకు సమాధానం యిచ్చినట్లవుతుంది. వ్యాకరణ సూత్రాలలో వుండే తు - చ వగయిరాలకుకూడా సార్థక్యం చెప్పితీరాలి. తార్కికుల అనుగమాలకుకూడా డిటో. మీమాంసశాస్త్రంలో తౌతాతిక మతం అంటూ వొకమతమే బయలుదేఱినట్లు ఆశాస్త్రజ్ఞులవల్ల విన్నాను. ఆమతం 'తు' అనే అవ్యయానికి ఒకానొక బుద్ధిమంతుఁడైన శిష్యుఁడు చక్కని సమన్వయం కనపఱిచి చూపేటప్పటికి గురువుగారు సంతోషించి ఆశిష్యుణ్ణి 'తుతాత' అని సంబోధిస్తూ వచ్చారనిన్నీ, పిమ్మట అతఁడు యేర్పఱచిన సిద్ధాంతాన్ని తౌతాతికమతంఅని వ్యవహరించడం కలిగిందనిన్నీ గురువులద్వారాగా వినడం. శాస్త్రంలో సమన్వయించినంత నిక్కచ్చిగా విశేషణాలకు సార్థక్యం చెప్పవలసిందని నిర్బంధిస్తే చెప్పనూలేఁడు; చెప్పవలసినదిన్నీ లేదు. "శుష్కాణాం పరిపీడనం నసహతే శాస్త్రేషు ఖిన్నాత్మనామ్ " అన్నారు కాళిదాసుగారు. శ్రీనాథుఁడు "విద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్ ధర్మాసనంబుండి ప్రధ్వంసాభావము ప్రాగభావమనుచున్ దర్కింతురు " అని గేలిచేశాఁడు. యెవరో వొకమహాకవి "వయం వకుళమంజరీ గళదరీణ మాధ్వీఝరీ ధురీణ శుభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే " అన్నాఁడు. వాసవదత్తలో "సత్కవికావ్యబంధ ఇవ అనవబద్ధ తుహినః. " అంటూ గ్రీష్మఋతువును వర్ణిస్తూ తు+

హి + వ ఇత్యాది పాదపూరణమాత్ర ప్రయోజకములు సత్కవుల కవిత్వా లలో దొరలవని సూచించాఁడు. అది శ్లేషలో వాడిన వాక్యం. దానిని అంత నిక్కచ్చిగా పాటించడం యుక్తిసహం కాదు.

"బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామజఘనాయ దిగంబరాయ
శార్దూల దివ్యనఖభూషణ భూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే"

ఆయీ శ్లోకంలో శార్దూలపదానికీ, నఖపదానికీ మధ్య "దివ్య" అనేది పాదపూరణానికేనా, లేక ఆవశ్యకమా ? అంటే ఛందోవాఙ్మయంలో ఆమాత్రం సహ్య మనేదే సరసమైన జవాబు. పెద్దపులిగోళ్లల్లో కొన్ని చెడ్డవిన్నీ వుంటాయి కనుక తన్నివృత్త్యర్థం అనిన్నీ చెప్పేవా రుంటారు. కాని వారు చేదస్తులలోనివారు - అతిసాహసులు.

"స్వాధీనో రసనాంచలః పరిచితాశ్శబ్దాఃకియంతఃక్వచిత్
క్షోణీంద్రోననియామకః పరిషద శ్శాంతాస్స్వతంత్రంజగత్
తద్యూయంక వయోవయం వయమితి ప్రస్తావనాహుంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మగర్జతవయం మౌనవ్రతాలంబినః"

'శార్దూలనఖభూషణ' అంటే నఖపదం మంచిదానికీ, చెడ్డదానికీ కూడా సామాన్యంగా వాచకమైనా భూషణానికి వుపయోగించుకొనేది. అందులో శ్రీకృష్ణమూర్తివంటి వానికి ఉపయోగించుకొనేది చెడ్డదేల కావలెను కనుక విశేషణం అంతగా ఆవశ్యకం కాదు. యింకా దీనిలో చేస్తే పిచ్చిశంకలు కొన్ని చేయవచ్చు. రసజ్ఞులుచేయరు. శుష్కపండితులు చేస్తారు. తేభ్యో మహద్భ్యో నమః.

"సంభవవ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్" — ఆ యీ శ్లోకార్థం వాల్మీకికి తెలియదా ? తెలిస్తే "తంతు దేశం నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః" అంటాఁడే ? రాముఁడూ, లక్ష్మణుఁడూ ఏకోదరు

లేనా? కవితాసమన్వయం వేఱు; శాస్త్రసమన్వయం వేఱు. యింతతో దీన్ని ఆఁపుతాను.

మా పాండవవిజయంలోని 'ఆఱనిలోఁతు' విశేషణం శాస్త్రాలలో విశేషణాలమాదిరిగా సమన్వయించినా బీరుపోదు. యెంత లోఁతైన కొలనైనా యే ద్వాదశవర్షక్షామమో తటస్థిస్తే ఆఱి (యెండి) పోవచ్చును. ఇది అప్పుడుకూడా యెండదన్నమాట. ఆ యీ పద్యం చూళికకు వుదాహరణం అని లోఁగడనే వ్రాశాను. మఱికొన్ని సందర్భాలు జిజ్ఞాసువుల కుపకరిస్తాయని వ్రాశాను గాని లేకపోతే యింత వ్రాయనవసరం లేదు. యావత్తూ అన్యాపదేశం. యీ నీరజం కుశేశయమ్. 'సహస్రపత్రం కమలంశతపత్రం కుశేశయం' దుర్యోధనాదులు నూర్గురూ నూఱురేకులు. అప్పటికి దుర్యోధనుఁడే మిగులు. తక్కినది సున్నకు సున్న హళ్ళికి హళ్ళి.' ఇంతతో ఆఁపుతాను. 'నచశంకా నచోత్తరం.'

---

# విద్య

(ది ?–11–1946 సం॥ర అభ్యుదయ నుండి)

"విద్య రానివాడు వింతపశువు" "విద్యావిహీనః పశుః" "విద్యారూపం విరూపాణామ్" యిత్యాదులు యెన్నో అభియుక్తోక్తులు, విద్యను గూర్చి బోధిస్తాయి. విద్యని సంపాదించడం చాలాకష్టం. పూర్వకాలంలో గురుశుశ్రూషచేసి విద్యని సంపాదించుకొనేవారు. ఇప్పుడు ఆసంప్రదాయం చాలావఱకు నశించింది. ద్రవ్యం యిచ్చి కొనుక్కుంటూన్నారు హోటళ్ళ మాదిరిని "స్కూళ్ళూ కాలేజీలు" యేర్పడ్డాయి. శుశ్రూషకు సంతోషించి చెప్పే గురువులులేరు. అయితే పూర్వం విద్య ధనికులకన్న బీదలకే అందుఁబాటులో వుండేది. యిప్పుడు ధనికులకే కాని విద్యలభించదు.

ఓ - నా - మాల వఱకు వుచితంగా నేర్పుతారు గాని అదల్లా పంతుళ్ళ జీతానికి మాత్రమే. యింకా ఇతరఖర్చులు చాలా వున్నాయి. పూర్వం విద్యార్థివేషం వేఱు, యిప్పుడు వేఱు. యీనాటివేషం కొంచెం గొప్ప విత్తంవుంటే కాని తుద నేగ్గేది కాదు.

నాచిన్నతనంలో యానాం (ఫ్రెంచి టవున్) లో కొన్నాళ్ళు చదువు కున్నాను. పుస్తకాలు స్కూలువారే యిచ్చేవారు. ఆస్కూల్లో మాతృ భాషకూడా చెప్పినా ఫ్రెంచి ప్రధానంగా చెప్పేవారు. ఇప్పుడు విద్య చాలా వ్యాప్తిలో వుందనిన్నీ ఆకాలంలో నూఱుమందిలో యేవొక్కరికో తప్ప విద్యాలబ్ధి వుండేది కాదనిన్నీ చెప్పుకోవడం అంతా యెఱిగిందే. యిది సత్యదూరం కాదు. యిప్పటివిద్యాభ్యాసం - లేదా, విద్యావిధానం - "రష్యా రాజ్యపరిపాలన" వంటిది. దేశంలోవుండే ఐశ్వర్యం, యావన్మంది ప్రజ లకూ అంతోయింతో "తిలాపాపం తలో పిడికెఁడు" అన్న మాదిరిది. అప్పటిది సామ్రాజ్యతత్వానికి అనుకూలించేది. యెవరో కొందఱు మహా విద్వాంసులుగా వుండేవారు. తక్కినవారు శుద్ధ శూన్యులుగా వుండేవారు. వేదమంతా తల్లకిందుగా వచ్చినవారిలో యెందఱో నిశానీదార్లు వుండేవారు. ఆబాపతువారిలో శేషించిన -కూబంధువులు వొకరు యీమధ్యనే 90 యేళ్ళ ప్రాయంలో స్వర్గస్థులైనారు. వేదపండితులలోనే కాదు యీమాదిరివారు షట్ఛాస్త్రజ్ఞులలో కూడా వుండేవారు. వారు చదువుకున్న శాస్త్రాలన్నీ అచ్చు పడినా దేవనాగరలిపిలో వుండడంచేత అది చదవడం మట్టుకు నేర్చుకుని మాతృభాషలో కృషి చేసేవారు కారు. అందుచేత చేవ్రాలు చేయవలసివస్తే కొంత పుస్తకాపేక్షగా కనపడేది. మా పరమగురువులు కార్డు వ్రాయవలసి వస్తే శిష్యులద్వారానే. మళ్ళా పాండిత్యం - 'షడ్దర్శనివేది చర్ల బ్రహ్మయ శాస్త్రి గురువరేణ్యుఁడు ధరాభరణ మాకు ' యిది విషయాంతరం.

యిప్పుడు అందఱికి (ఆఁడాళ్ళకీ మొగాళ్ళకీ) ఆబ్రాహ్మణ హరిహర జన పర్యంతమూ అంతో యింతో అక్షరజ్ఞానాన్ని మనకు బ్రిటిషు ప్రభుత్వం కలిగించినమాటనే విశ్వసిద్దాం. కృష్ణలోనో, గోదావరిలోనో

యేనుఁగు యీఁత లోఁతు నీరు వుండడంకన్న ప్రతిగృహములోనూ నీటి పంపు వుండడం సుఖకరం కాదని యెవరంటారు? యిది ఆపాతరమణీయం తత్తథాస్తామ్. అయితే యిప్పుడు స్కూళ్ళల్లో బాలబాలికలకు చెప్పే పుస్తకాలని గూర్చి కొంచెం వ్రాయడానికి పెట్టుకున్నాను గనక యితరం జోలికి పోక దాన్నే వ్రాస్తాను. ఆ యీ పుస్తకాలల్లో వుండే పద్యాలు ప్రాచీనకవులవే చాలాభాగం. కొన్నినవీనులవీ వుంటే వుంటాయి. తెలుఁగుభాషకు "యతిప్రాసల నిర్బంధం" వుండడంవల్ల యెంతటి మహాకవి రచించిన పద్యమేనా సరే కొన్ని నిరర్థకాలో సార్థకాలో మాఱు మూలపదాలు కలిగి వుంటుంది. వుటంకిస్తాను —

"ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిల కొండమీఁదికిన్"
ఆ యీ పద్యంలోవున్న మొట్టమొదటిపదం ఒడికము. (ప్రథమకబళే మక్షికాపాతః) అనేది నిఘంటు చూచి అర్థం చేసుకోవలసిందే గాని సుఖ సుఖాల బోధపడేది కాదు. యతికోసమూ ప్రాసకోసమూ వుపయోగించవలసి వచ్చింది.

స్కూలుఫైనలు లోపు విద్యార్థులకు యీలాటి పదాలతో వున్న పద్యాలు ఆహ్లాదకరంగా వుండవు. మాస్టరు బోధించినా వాడుకలోది కాకపోవుటచేత లోయరుక్లాసు కుఱ్ఱలలో యే వొకనికో తప్ప జ్ఞాపకముండదు. ఆ యీ ఒడికం అనేది నేను నేఁటికి మూడు పుష్కరాలకు పూర్వం (40 వత్సరాలకు ముందు) స్వయంగా గీరతంలో

"కడియము జేనిగ్రామ మది కాపురమౌఁగద నాకుఁ; బూర్వమం
దొడికపుఁగైత కెవ్వఁడు మహోదధి, మత్ప్రపితామహానుజుం
డెడపక జేనిసన్నిధికి నేగకె కాలము పుచ్చె; నప్పుడా
తఁడు గల చోటికే నృపవతంసుఁడువచ్చె రసజ్ఞుడౌటచే"
— (ఇతిహాస పర్వం చూ.)

అనే పద్యంలో నైతే ప్రయోగించి వున్నాను గాని సరియైన అర్థం యిప్పటికీ తెలియదన్నది యథార్థం. అయితే ఆ యీ పదం చెడ్డనిబోధి

స్తుందా ? మంచిని బోధిస్తుందా ? అని ప్రశ్నించుకుంటే మంచినే బోధిస్తుం దనే ధైర్యంతో వాడివుంటాను. కవిత్రియంలో ఎఱ్ఱన్నగారి కవిత్వంలో దీన్ని చూచిన జ్ఞాపకం. యీలాటి వుజ్జాయింపు జ్ఞానంతో వాడిన పదాలు కొన్ని "అనడ్వాహాల" కథనుజ్ఞప్తికి తెచ్చేవిగా పరిణమించి అపహా స్యత్వానికి దారి తీయడమూ క్వాచిత్కంగా సంఘటిస్తుంది. వుదాహరించి మరీచర్చిస్తాను—

"హరుని యంకమునందు మురువుమీర వసించు
బాహులేయునికాంతి నోహటించి"

యీసీస చరణంలో వున్న "ఓహటించి" అనేది "జయించి" అనే అర్థమందు మాచేత (తి॥ వెం॥) వుపయోగింపబడింది. కాని వుజ్జాయింపు టూహతో వాడిన యీపదం కేవలం వ్యతిరేకంగా పరిణమించినట్లు కొన్నా ళ్ళకుగుర్తించి తర్వాత — "బాహులేయుని కాంతిపటిమ మించి" అని దిద్దుకున్నాం. దీన్ని గూర్చి వ్రాయవలసివస్తే చాలావ్రాయాలి మా క వితా సంసారంలోయీలాటి తబ్బిబ్బులు చాలా వుంటాయి. ఒకటి మచ్చుకు వుదాహరించాను ప్రధానాంశం వినండి.

అంతవాళ్ళం యింతవాళ్ళం మీసాలు పెంచాం. గెడ్డాలుపెంచాం. కవిత్వానికి మా ముందు నిల్చేవాళ్ళు (చిల్లర కవులలో జేరబోము చూ.) యెక్కడోగాని లేనేలేరంటూ, అహంభావాన్ని వెళ్ళగ్రక్కేవాళ్ళని బుట్టలో బెట్టేపదాలు లోయరుక్లాసు కుఱ్ఱలకు అజీర్ణం చేస్తాయి గాని సుఖవుగా జీర్ణించవు. అందుచేత ఆలాటి పదాలతోవున్న పద్యాలుగాని, వచనాలుగాని లోయరు తరగతి పిల్లకాయలకు పఠనీయాలుగా యేర్పరచడానికి నేను యిష్టపడను. అచ్చతెలుగే అయినా తెలుగు దేశంలో పుట్టిపెరిగిన కుర్రా డికి అగమ్య గోచరంగా వుండే భాష (కృతకభాష) కొంత వుంటుంది. వుదాహరిస్తాను "పల్కుటాల్ దొరగుర్రిడ్డుపనఁటు లాటలపట్టు" ఈసీసం యావత్తూ యిట్టి అచ్చతెలుగే. బ్రహ్మాండ భాండములు విహారస్థలములు అనుటకు మా "పిన్నముత్తాత నర్సన్నగారు" ఈవిధంగా ప్రయోగించారు.

యిట్టి కృతకభాష మాతృభాష కానేరదు కనక లోయరుక్లాసు కుఱ్ఱలవిష యంలో యిట్టిపద్యాలు వుపకరించవు. తత్సమ తెలుఁగేఅయినా—

"దేవసములైన అనుజుల
తో విప్రులతో రథాళితో వచ్చి అర
ణ్యావాసము జేసెదు ధర
ణీవల్లభ! నీవు ధర్మనిష్ఠిత బుద్ధిన్" (భారతం)

ఈ మాదిరి పద్యాలు లోయరుక్లాసు కుఱ్ఱలకు అనుకూలిస్తాయి. నా చిన్నతనంలో లోకల్‌ఫండుస్కూల్లో నాలుగో క్లాసులో ఈ పద్యం చదువుకున్న జ్ఞాపకం. ఆ వయస్సులోకూడా యించుమించు ప్రతి పదార్థంకూడా వంటఁబట్టింది కనకనే యింకా జ్ఞప్తిలో వుంది. ఆయీ పద్యంలో యడాగమం చేయడం మానేసినవి రెండుప్రయోగాలు వ్యాకరణ విరుద్ధాలు కనపఱిచాను. యెందుకంటే లోయరుక్లాసు కుఱ్ఱలకు వ్యాకరణపు కట్టుబాటు చాలావఱకు తగ్గించడమే వుపకారకం. యడాగమమే కాదు ద్రుతప్రకృతికసంధి వికారాలుకూడ తగ్గించిన భాషాయోషయే ఆయీ కుఱ్ఱలకు తల్లిగా వుండి అభివృద్ధిలోకి తెస్తుంది. శైశవావస్థలో ద్రవపదార్థాలు జీర్ణకోశానికి అనుకూలించినట్లే భాషకూడా (యించుమించు వ్యావహారికమన్నమాట) ద్రవపదార్థసదృశంగానే వుండడానికి నేను యిష్టపడతాను. లోయరుక్లాసు కుఱ్ఱలకు మాత్రమేకాదు. స్కూలుఫైనలు వగయిరా పైతరగతుల విద్యార్థులలోకూడా వ్యాకరణం అంటే చుక్కెదురుగానే వుండే బుద్ధిమంతులను నేను చాలా మందిని యెఱుఁగుదును వ్యాకరణమన్నప్పుడు అన్నిటికీ సమన్వయించుకోవలసినదే కాని సంస్కృతానికి మాత్రమేఅనుకోరాదు. మామూలు మాటలకు సంబంధించక అచ్చులనీ హల్లులనీ యేమోఅనీ (తుమున్నర్థకం చేదాద్యర్థకం వగైరా) యేమో అనీ చెప్పవలసివస్తే ఆయీ మాటలు పైతరగతుల విద్యార్థులకున్నూడా యినపగుగ్గిళ్ళుగానే వుంటాయి. నా తెలుఁగుటీచరీ రోజుల్లో నేను యీబాజరబందీ పడలేక స్కూలు ఫైనలు క్లాసుకు సమేతూ చిన్నయసూరి

వ్యాకరణం వగైరాలు చెప్పక, టూకీగా ముక్తసరిగా మూడు నాలుగు మాటలతో వాళ్ళ కాంపోజిషను తుదనెగ్గేటట్టు చేసేవాణ్ణి. సంవత్సరం పొడుగునా తావన్మాత్రానికి సంబంధించిన తప్పులే దిద్దడం - ఆసూత్రాలు (1) ఉకారసంధిసూత్రం. (2) అకారసంధి (3) ఇకారసంధి. ఇంతే నా తెలుఁగు వ్యాకరణం. ఇందులో మొదటిది కంపల్సరీ. రెండు మూడులు మీయిష్టం. యీ విషయం యెక్కడో లోగడ వ్యాఖ్యానించే వుంటాను. కనకనే స్పృశించి విడుస్తున్నాను. యిటీవల లోయరు కుఱ్ఱల పఠనీయాలు సంధుల నియమం కొంత తగ్గించి వుండడం గోచరించింది. అది అభి నందనీయమే. వచ్చే ( 1947 ) సంవత్సరాన్నుంచి భూగోళం వగయిరాలు కూడా మాతృభాషలోనే బోధించే యేర్పాటు కాంగ్రెస్సువారు చేస్తారని ఏదో పత్రికలో చదివినట్లు జ్ఞాపకం. ఆ యీ మార్పును సర్వథా అభి నందిస్తూ నాకు తోచిన సలహానుకూడా సూచిస్తాను. మాతృభాష అంటే యెవళ్ళకేనా వ్యావహారిక మవుతుందిగాని గ్రాంథికం కాదు. కనక లోయరు క్లాసులకు నాగరికుల వ్యావహారికంలో బోధిస్తే మఱీవీలు. వ్యావహారికమన్నా గ్రామ్య మన్నా వొకటే. గ్రామ్యంకూడా ఆయా దేశాలనిబట్టి కులాలనుబట్టి శాఖలనుబట్టి నానా విధాలుగా వుంటుంది మనకి ప్రస్తుతం లోయరుక్లాసులకు వాడుకో తగ్గది, నాదృష్టిలో లౌకిక గ్రామ్యం కనపడుతూ వుంది. వైదికగ్రామ్యం బొత్తిగా అర్థాన్నంగా వెఱ్ఱిగా వుంచుంది వుదాహరిస్తాను.

"ఆస్నే ! చూస్నివషే ! వొషే ! చెముడషే ! అష్ట్లాగషే ? యేమిషే?
విస్సావఝ్ఝులవారి బుఱ్ఱినష ? ఆవిస్సాయి కిస్సారుషే
విస్సం డెంతటివాఁడె యేశ్ళుపదషే ? వేయేశ్ళకౌ మంచి వ
ర్చెస్నే ? అందురు వైదికోత్తమ కులస్త్రీ లాంధ్రదేశమ్మునన్"

ఆ యీ భాష నాచిన్నతనం నాటికి ( దాసువారి తెలుగునాడు. చూ.) బాగా ఛాందసుల యిళ్ళలో వాడుకలో వుండేది. యింట్లో బట్టలూ, వీధి బట్టలూ, స్కూలు బట్టలు వగైరా కేటాయింపులతోపాటు బాజార్లలో

గవ్వల మారకంతోపాటు యింకా మఱికొన్ని సందర్భాలతోపాటు పైని చూపిన భాషకూడా అంతరించినట్లే. యింకా హతశేషం యే బ్రాహ్మణాగ్రహారంలోనేనా వుపలబ్ధమైతే అవుతుందేమో : స్కూళ్ళలో ఆయీ భాషతో వ్యవహరించ వలసివుండదు. లౌకిక గ్రామ్యంలో పఠనపాఠాలు జరిగేటట్టు చేస్తే అది గ్రాంధికభాషకు దగ్గఱగానే వుంటుంది. సంగీతకవుల కవిత్వానికి లౌకికగ్రామ్యానికి యెంతో వ్యత్యాసం వుండదు. వుదాహరిస్తాను-

(1) ఉండేదే రాము డొకఁడు వూరక చెడిపోకెమనస : ॥ఉండే॥

(2) అంతారామమయం యీజగ మంతా రామమయం॥

త్యాగరాయలవంటి గేయకవి, రామదాసువంటి గేయకవి వాడిన భాష మన లోయరు క్లాసు పిల్లకాయలకు పనికిరాదని నేను చెప్పను. అయీ గేయములలోవున్న వ్యాకరణ వ్యత్యాసాలూ, (1) ఉండేదే (2) వూరక (3) అంతా వగయిరాలు ఉండెడిదే ఊరక అంతయు అని సవరించి కొంచెం చూపితే విద్యార్థులకు అయీ రెండిటికీ వుండే తేడా పాఠాలు సుళువుగా బోధపడతాయి.

"అథవా ప్రతిపక్షస్య వాచయిత్వాబహూన్ గుణాన్
తజ్జయాన్నాయకోత్కర్ష వర్ణనంచ క్వచిన్మతమ్"

ఆ యీ కేచిన్మతానికి నేను చూపిన మార్గం అనుకూలిస్తుంది. తప్పులేవో గురువు శిష్యుఁడికి బోధిస్తే సవిశేష న్యాయంచేత వొప్పులు చెప్పకుండానే బోధపడతాయి. నపరదారాన్ గచ్ఛేత్ - నకలంజం భక్షయేత్ - నానృతం వదేత్ అని పాపకార్యాచరణం నిషేధిస్తే పుణ్యకార్యం తెల్పకుండానే తెలుస్తుంది. యీ మార్గం వేదసమ్మతంగాని నూతనంగాదు. వేదం కొన్ని ధర్మాలు విధిముఖేనా బోధించింది. కొన్నిటిని నిషేధముఖేనా బోధించింది.నిషేధానికి లోఁగడ చూపినవి వుదాహరణం. తక్కినదానికి వుదాహరణం చూపుతూ వున్నాను. "స్వర్గకామో యజేత సంధ్యా ముపాసీత మాతృదేవో భవ" ఇత్యాదులు.

గేయకవిత్వంలో పద్యకవిత్వంలో కంటె యెంతో వ్యత్యస్తప్రయోగాలువుండవు. మారుమూల యతులూ ప్రాసలూ వుండవు - "కృపగలదా? మాముద్వ గోపాలబాల" ఈమాదిరి యతులు క్వాచిత్కంగా వుంటాయి ఋకారానికి ఇ-ఈ-ఎ-ఏలు చెల్లడం శాస్త్రప్రసిద్ధమైనా 'కృ' అనే దానికి కో, గో, అనేవే శ్రవణసుఖంగా కనపడతాయి. పదకవులు శ్రవణసుఖాన్నే యెక్కువగా పాటిస్తారు. ఇదివిషయాంతరం.

ప్రస్తుతం లోయరు క్లాసు పిల్లకాయలకు లౌకిక గ్రామ్యభాషతో చరిత్రాదులను బోధించడమే నాకు సర్వథా యుక్తంగా కనపడుతూవుంది అనేది. యెంత తేలికలో తెలుక్కి వ్యాకరణం రచించినా లోయరుక్లాసు కుఱ్ఱలకు బోధపడదని నేను గుర్తించాను.

ఈఅనుభవం ఒకటి రెండేళ్ళని కాదు. సుమారు 13 యేళ్లు తెల్గు టీచరుగా వుండి సంగ్రహించింది. వ్యావహారికభాష వాడుకచేయడంవల్ల నరకం వస్తుందనే భయంనాకులేదు. ఎంత మడిగట్టుకున్నా లోకంలో పుట్టి పెరిఁగే వాళ్ళకు లౌకికభాషతో సంబంధం అనివార్యం. గ్రాంధికభాషలో పాండిత్యం లేనివాళ్ళలో యెందఱో వారి వారి అభిప్రాయాలు బహిర్గతం చేయడానికి యీకట్టుబాఁటు బాధకంగా వుంది. యిది తొలగడం లోకానికి కొంత మేలు.

పద్యకవిత్వంగాని, గద్యకవిత్వంగాని వ్యావహారికభాషలో హృద్యంగా రచించేవారుంటే నేను వారిని ద్వేషించేవాణ్నికాను, ధూర్జటి- "అంతా సంశయమే" అంటూ పద్యం యెత్తుకున్నాఁడు. శ్రీనాథాదులు తుట్టతుదకు-కవి బ్రహ్మ తిక్కన్నంతటివాఁడు వ్యావహారికానికి చోటివ్వక తప్పిందికాదు.

"నికృష్టంపుం జంపుచంపి" అనో యిదేమాదిరిదో కవి బ్రహ్మ ప్రయోగం యెక్కడో వ్యాసంలో వ్యాకరించినట్లు జ్ఞాపకం—— కాంగ్రెసు ప్రభుత్వం లోఁగడ శృంగార గ్రంథాలకు నిర్నిమిత్తంగావచ్చి చుట్టుకున్న నిషేధాన్ని తొలఁగించి పుణ్యంకట్టుకుంది. ప్రస్తుతం వుప్పుపన్ను తొలఁగించ డానికి సంకల్పించింది. వ్యావహారికభాషకు లోయరుక్లాసు పిల్లలకు అభ్య

నుజ్ఞ యిస్తుందని నేను ఆశిస్తున్నాను. పూర్వంకంటె నాన్‌బ్రామిన్సు విద్యార్థులు యెక్కువగా పాఠశాలలో చదివే యీకాలానికి యీఅభ్యనుజ్ఞ చాలా వుపకారకం.

ఈ వ్యావహారికభాషా బహిష్కరణానికి చాలామంది పెద్దలు లోఁగడ పాటు బడ్డారు. వారిలో కొందఱు గతించినా కొందఱింకనూ సజీవులు. వారుకూడా లోయరుక్లాసు పిల్లకాయలకు అభ్యనుజ్ఞ నిస్తారనే నేను విశ్వసిస్తాను. పత్రికాసంపాదకీయాలే కాక వార్తలుకూడా వ్యాకరణ సమ్మతంగా ప్రచురించఁబడి వుండే రోజులు నేను యెఱుఁగుదును. వొక్క కొక్కొండ పంతులవారి జీవితం ఆ నియమనిష్ఠలతో నెఱవేఱింది. సామాన్య లోకులకు అపహాస్యాస్పదంగా వున్నప్పటికీ ఆయన వ్రతాన్ని నిరపాయంగా జరుపుతున్నారు. వారికి గ్రాంధికభాషంటే యెంత పట్టుదలో మళ్ళా — గిడుగు పంతులుగారికి వ్యావహారిక భాషంటే అంతకు మించిన పట్టుదల. నాకో, ఉభయులూ మిత్రులు కనక నేను యీవుపాయం ద్వారాగా—ఉభయ కవి మిత్రి బిరుదు ధరిస్తూన్నానని నేటికి 12 ఏళ్ళనాఁడు కృష్ణాపత్రికలోని 'కవిత్వమంటే యేమిటి?' అనే వ్యాసంలో వ్యాకరించినట్లు జ్ఞాపకం అప్పటికీ యిప్పటికీ కూడా కాలంచాలా భేదించింది. దాసు శ్రీరామకవిగారు నాకన్న కొంత పెద్దలు.

"ఈ యినుకోలు బళ్ళకడ నింగిలిపీసులు పీసుపాసుగాఁ
గూయఁగఁజొచ్చి, ఆ మయిల గుడ్డలు వంకెఁ దగిల్చిరండుమొ
ఱ్ఱో యన నాలకింప రిసిరో? కలికాలము కాలె రామ రా
మా! యను వృద్ధురాలయిన స్మార్తవితంతువు మాటిమాటికిన్"

ఆయీ పద్యంలో వుటంకించినమాదిరి స్మార్తవితంతువులు నేఁడు కీర్తిశేష పదవిని పొందినట్లే. అప్పుడు యింగ్లీషును యింగిలిపీసుగా అపవదించే ఛాందసగృహాలన్నీ యిప్పుడు చిత్రంగా మాటివున్నాయి. ఇప్పుడు యే యిల్లు చూచినా కాఫీ, టీ, సిగరెట్టు, క్రాఫింగు, జందెపు రైకలు, సబ్బులు యీవిధంగా మార్పుచెంది వున్నాయి. ఇంకా యేకరు పెట్టవలసివస్తే చాలా

వున్నాయి విశేషాలు. మునుపెవరు నికృష్టులో వారిప్పుడుత్కృష్టులు— "బాపఁడు బుఱ్ఱలన్ గొఱుగవచ్చును" (సుశీలచూ.) యిట్టికాలంలో లోయరు క్లాసుకుఱ్ఱల విద్యావిధానంపట్ల యీమాత్రం సడలింపును అంగీకరించక పోదు ప్రాజ్ఞలోకమని నేను భావిస్తాను. కొన్ని సంధినియమాలు కూడా లోయరుక్లాసు కుఱ్ఱలకు నియమించే పాఠ్యగ్రంథాలలో పాటించ నక్కఱలేదని లోఁగడ వ్రాసివున్నాను. ఆయీ విషయాన్ని కొంచెం సోదాహరణంగా వ్యాకరించి దీనికి స్వస్తిచెపుతాను—

"నేఁటి సంగరమునఁగుంతిభోజు సుతకంటెను గోడలు వీరమాతగన్" ఆయీ పద్యభాగంలో ద్రుతప్రకృతిక సంధివల్ల కుంతి గుంతిగానూ కోడలు గోడలు (ఇంటిగోడ) గానూ మార్పుకలిగింది; లోయరు క్లాసుకుఱ్ఱల పాఠ్యపుస్తకాలలో—"నేటిసంగరమున కుంతిభోజుసుతకంటెను కోడలు వీరమాతగన్" అనే ముద్రించడం మంచిది. యిక్కడ అపార్థసూచన లేదు గాని కొన్నిచోట్ల యీసంధి చారుణ్ణి జారుణ్ణిగానూ తనుజుణ్ణి దనుజుణ్ణి (రాక్షసుఁడు) గాను మారుస్తుంది. ఆయీ చర్చ యెప్పుడో యితరత్ర విపులంగా వ్యాకరించిందే.

యీమధ్య లోయరుక్లాసు పిల్లకాయలపుస్తకాలు చూడడం తటస్థించి ఆయీ స్వల్పమార్పు జరిగితే బాగుంటుందనితోఁచి యీనాలుగుమాటలూ వ్రాశాను. ఆదరణీయమని తోస్తే ఆదరిస్తారు లేదా వుపేక్షిస్తారు. స్వస్తి.

## కొప్పరపు కుమారకవుల అవధాన సందర్భంలో

( ది 3—2—1945 ఆంధ్రవాణినుండి )

—: ఆ శీ ర్వ చ న ప ద్యం :—

ఉ. కొప్పరమన్న గోపురము గోపురమన్నను వాఙ్మి వాస మీ
యొప్పులకుప్ప లిర్వురు నయోన్నతులందు జనించినారు వి

ద్వ్యాప్తులైన సత్కవుల యాదృతి గాంచి యశస్సుచే దిశల్
గప్పుచు వృద్ధి నందెదరుగాక చిరాయువు తోడు నీడగన్.

ఆ యీ పద్యము నేను యెవరికి ఆశీర్వచనంగా చెప్పి సభకు పంపి తినో ఆసందర్భాన్ని మొట్టమొదటి చరణమే వ్యాఖ్యానిస్తూవుంది. అందు చేతనే అనుకుంటాను శిష్యుడు పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి అర్థం చెప్పా లని యెంత యత్నించినా— సభాధ్యక్షులు చాలా పట్టుపట్టి ఆటంకపఱిచి నట్లు తత్రిత్యులు వచ్చి చెప్పగా విన్నాను.

ముంజేతికంకణం వలెవున్న దీనికి వ్యాఖ్యానం అక్కఱ లేదని పట్టుపట్టిన పరమ పూజ్యులు— అధ్యక్షులతో నేను యేకీభవిస్తూ కూడా అర్థాన్ని వ్రాస్తూవున్న నన్ను అధ్యక్షులు క్షమించకపోరు. సభ్యులందఱూ విద్వాంసులుగా వుండరు. మనః-అబ్జం యీ రెండున్నూ కలిస్తే అనగాసంధిస్తే మన అబ్జం'..మనోఽబ్జం. అనేరూపద్వయంలో యేది సాధువు? యేదికాదు అనేసంశయము 75 వత్సరాల ప్రాయంలో వున్న నన్ను పీడించి పీడించి తుదకు మనఅబ్జం సాధువు కాదని తెలుసుకోగలిగాను. ఆ సభలో యేవాక రేనా నావంటివాళ్ళున్నవారికి యీపద్యం వ్యాఖ్యానాన్ని అపేక్షిస్తుందేమో అని వ్రాస్తూన్నాను. అదిన్నీకాక యెవరో వొకరు అర్థం చెప్పబోవడమూ- అధ్యక్షులు వారించడమూ జరగడంచేత సభ్యులలో అనేకులకు ఈపద్యంలో యేవో గూఢార్థం యెవరినో బాధించేది వుంది కాబోలును అలాగే కాక పోతే— అధ్యక్ష మహాశయులు యెందుకు వారిస్తారు అనే శంక వుద యించడానికి అవకాశం పూర్తిగా కలిగింది. అది నేనే వ్యాఖ్యానం చేస్తే- వడ్లగింజలోది బియ్యపుగింజ అన్నట్టుగా విడిపోతుంది. అదిన్నీ కాక—

జీవితః కవేః ప్రష్టవ్యమ్ అని వుండడంచేత నేను శ్రీయుతులు రెడ్డిగారిచేత అధ్యక్షుడుగా ప్రేమపూర్వకంగా ఆహ్వానింపబడి సభకు యెట్లో వస్తానని చెప్పిన్నీ అశక్తతచేత వెళ్ళలేక పోయినా జీవించివున్న వాడనగు టచేత కొందఱేనా నన్ను దీని అర్థమేమిటని ప్రశ్నింపక పోరుగదా అని ఈనాలుగు మాటలున్నూ వ్రాస్తున్నాను—

అర్థం :— కొప్పరము = అనగా, గోపురము, గోపురశబ్దము, తద్భవములో కొప్పరముగా, మాఱినదన్నమాట. గోపురపు అనే తత్సమ పదములో వుంటే— గోశబ్దం నానార్థకం. ప్రస్తుతం గోశబ్దం వాక్పద్ది పర్యాయంతీసికుంటే వాక్కునకు అనఁగా సరస్వతీ దేవికి నివాసము అనే అర్థం వస్తుంది. దీనికి గీర్వాగ్వాణీ సరస్వతీ అనే అమరం తోడు పడుతుంది. ఆయీసందర్భంలో తార్కికుల, లక్షితలక్షణ ఆశ్రియణీయం. ఇంతవఱకు నేనుపద్యంలో మొదటిచరణంలో వ్యాఖ్యానించే వున్నాను. నేను యెవరిని గుఱించి ఈపద్యంవ్రాశానో వారివూరుపేరు కొప్పరము, వారి ఇంటిపేరున్ను కొప్పరపువారే కనుక చక్కఁగా సమన్వయిస్తుంది. యేలా గంటే నివసించే గ్రామమేమో సరస్వతీనిలయం. పుట్టినవంశమేమో ఆలాగే సరస్వతీనిలయమే. యీయొప్పుల కుప్పలు యిర్వురున్నూ, అందున్ = అట్టి సుప్రసిద్ధ వంశమందు జనించినారు అని సమన్వయము. విద్యాప్పతులు = విద్యాసముద్రులు అని. ఈబాల కవులకు నయోన్నతులతో పాటుగా విశేష ణంగా చేసుకొన్నా చేసుకోవచ్చు. లేదా ఇంకా ఆరురుఙులు కనుక సుకవులకు విశేషణంగా చేసిన్నీ సమన్వయింప వచ్చును. తక్కిన ఆశీర్వచన భాగము మిక్కిలి సుగమంగా నుండడంచేత అక్షరాస్యుల కందఱకు సుగమమే. అందున్ అన్నచోట "సర్వనామ్నాం బుద్ధిస్థత్వోప లక్షిత ధర్మావచ్ఛిన్నే శక్తిః" అనేది ఆశ్రయణీయం. ఇంతే. స్వస్తి.

## అనుబంధము

పైనివ్రాసిన దానిలో మనోజ్ఞ శబ్దగత సంధినిగూర్చి కొంచెము స్పృశించి విడిచాను. వ్యాకరణ ప్రవేశము యేమాత్రిమూలేని సాహిత్య పరులుగాని కవివరులు గాని దాన్ని బాహాటంగా మనోజ్ఞం అని సుఖవుగా వాడుకొంటూనే యుంటారు. యెవరేనా సుప్రసిద్ధులు. మనఅజ్ఞం అని ప్రయో గిస్తే అది కొంచెమేనా వ్యాకరణం వచ్చినవారికి ఈ ప్రయోగంకూడా సాధువే కాఁబోలునని సంశయాన్ని కలిగిస్తుంది. యీలాటి సందర్భాల్లో

వ్యాకరణం బాగా చదివినవాళ్ళకంటే భాషామంజరీ సమాప్తా తెగలోవున్న పండితులే మెరుగని నేననుకుంటాను. యెందుచేతనంటే కౌముది యావత్తు కంఠపాఠంగా వచ్చినవాణ్ణి ఫలానాశబ్దం చెప్పవలసినదని అడిగితే యెన్నో సూత్రాలు జ్ఞాపకంవస్తేనేగాని కాపరం తుదనెగ్గదు. తదితరులకో శబ్దమంజరి జ్ఞాపకముంటే చాలు. ఈమాట నేను యెంతో అనుభవంమీద వ్రాసే మాట. యీమనఅజ్జం అన్న ప్రయోగం చూచినప్పుడు ఇదికూడా సాధురూపమేమో అని చాలాసేపు భ్రాంతి పడ్డాను. తెలుఁగు కవిత్వానికీ సంస్కృత కవిత్వానిక్కూడా పాణినీయం ఆవశ్యకమేగాని అందులో మొదటిదానికి కారక భాగంతో బొత్తిగా అవసరం వుండదు. సంధులుకూడా విశేషించి తెలియనక్కరలేదు గాని సమాసాలలో అవసరం కలుగుతుంది. తెలుగు కవిత్వం చెప్పేవారు వారాణసీ పురపతింభజ విశ్వనాధమ్-మాదిరిగా యే అష్టకాలో చెప్పడంలో అంత చిక్కులేదుగాని తదితర ఫక్కీని రచించే రచనకు దిగితే ప్రతిపదమందూ తొట్రుపాటు తప్పదు. సమాసాంతములు సమాసాశ్రయములు ఆత్మనేపద పరస్మైపద భేదము, సేట్కు, అనిట్కు ధాతుప్రభేదము పదవ్యవస్థలోనైనవి వుభయులకునూ తెలిసేవుండాలి. బాగా పరిశీలిస్తేసంస్కృతం వారికంటే తెలుగు వారికి యెక్కువ భారం కనపడుతుంది. ఆహేతువు చేతనే

> "తెలుఁగు తెలుఁగని యద్దానదిగుపెకాని
> సంస్కృతమ్మనకన్న కష్టమ్మహెచ్చు."

అని వ్రాయవలసి వచ్చింది. ప్రసక్తాను ప్రసక్తంగా కలిగిన దీన్ని గూర్చి యిప్పుడు ఇంతకన్న విస్తరించి వ్రాసేదిలేదు. మతొకప్పుడు చూచుకుందాం. కొంతసేపు పరిశీలించినమీద మనఅజ్జం సాధువుకాదని తెలిసికోగలిగాను. యీసంశయానికి కారణం కొంత వార్ధక్యం కూడా అని విజ్ఞులకు నావినయపూర్వక విజ్ఞప్తి. స్వస్తి

---

# కీ॥ శే॥ గూడూరు వియ్యన్నగారు.

( ది 3-3-1945 సం॥రం ఆంధ్రవాణి నుండి )

పరోపకారః పుణ్యాయ. అను శ్లోక పాదమునకు లక్ష్యముగా జీవితాన్ని గడుపుకొన్న వారిలో యీ ప్రాంతమునందలి ఆయుర్వేద వైద్యులలో వియ్యన్నగారు ఒకరని గట్టిగా చెప్పవచ్చును. ఈయన దేవతా భక్తి గురుభక్తి, ఇవి చాలా శ్లాఘ్యములు. మృత్యుంజయ జపము చెయ్యకుండా యీయన యెవరికీమాత్ర యిచ్చేవాడుకాడు. దీన్నిబట్టి "తచ్ఛాంతి రౌషధైర్దానైర్జప హోమసురార్చనైః" అనే శ్లోకార్థమునందు యీయనకు యెంతటి ప్రామాణ్యమున్నదిన్నీ తెల్లము. ఈయన వైద్యశాలకు మృత్యుంజయుని పేరే వుంచ బడింది. ( మృత్యుంజయఫార్మసీ ) ఈయన అమృత హస్తి. వైద్యునకు యెంతశాంతి, యెంతదయ, యెంతదాక్షిణ్యము వుండవలెనో అంతా యీయన యందు మూర్తీభవించిందనుటకు సంశయములేదు. ప్రతి సంవత్సరమూ యీయన ధన్వంతరి వ్రతము బహు భక్తి శ్రద్ధలతో చేసి అన్నదానాదికము విపులంగా జరపడం నేను కళ్ళారా కొన్ని వత్సరములనుండి చూచివున్నాను. ఈయన రమారమీ 50 వత్సరములప్రాయంలో మొన్న దివంగతుఁడయినాఁడు. నేటికి 12 ఏండ్ల పూర్వము నన్ను యీయన యెఱిఁగినా నేను యీయన్ని బొత్తిగా యెఱఁగను. సాక్షాత్తు శిష్యులుగా వుండే పింగళి, కాటూరి వగైరాలకన్న యీ యేకలవ్య శిష్యుఁడు నాయందు భక్తిప్రపత్తులను మిక్కిలిగా చూపించేవాఁడు. ఇతని వల్ల నేను చాలా వుపకారాన్ని పొందివున్నాను. దాన్ని వివరించవలసి వస్తే గ్రంథము పెరుగుతుంది. దీన్ని గూర్చి షష్టిపూర్తికి పిమ్మటిది యైన నా జీవిత చరిత్ర యిటీవలిచర్యలో విస్తరించి వున్నాను. యీయన అన్న కుమారుని ప్రేమించుట నాకు చాలా అపురూపంగా వుంటుంది. ఉదార చరితానాంతు వసుధైవకుటుంబకమ్ - యీయన అన్న కుమార్డు చిరంజీవి నమశ్శివాయ తన పినతండ్రిగారి యశస్సును నిల్పువాఁడై

పెద్దల యాశీర్వచనమునకు పాత్రుఁడై ఆయురారోగ్య భాగ్యములు గలిగి వర్ధిలుగాక యని ఆశీర్వదించుచు వియ్యన్నగారి స్వర్గతికి వీకన్నను నేనెక్కుడుగా విచారించుచుంటినని సానుభూతిని దెల్పుచున్నాఁడను. బహుశః యీవియ్యన్నగారిని యెఱిఁగిన వారందఱు యీ యకాల మరణమునకు విచారింపకుండ నుండరు. యీయన కోర్కెమీఁదనే సుమారు సం॥నాఁడు మృత్యుంజయ స్తవాన్ని గేయధోరణిలో నేను రచించివున్నాను. కొంచెె ముదాహరిస్తాను. - నీపేరు విన్నంతనే పాఱు నాపత్తు లేపాటి రూపాటి మృత్యుంజయా! మృత్యుంజయా! పాహి! — సమాప్తి

---

## 'కృష్ణరావు మునివంటివాడు'

( ది 21–7–1945 సం॥రం కృష్ణాపత్రికనుండి )

మ. మితభాషిత్వము సత్యతత్పరత నీమీఁదన్ గదా నిల్చి జీ!
 వితమున్ దాల్చెడి, నీవు వానిబ్రతుకున్ ద్వేషింతువే ? ఆ పతి
 వ్రత లేమౌదురా చూడవైతివి, పరబ్రహ్మంబవై పోతి; వీ!
 క్షితి నీయట్టిఁడు వానికిన్ దొరకునే! కృష్ణా! జగన్మండనా॥

1903 సం॥లో నేను తలవనితలంపుగా బందరు హిందూ హైస్కూలుకు ( అప్పటికి కాలేజీ కాలేదు ) తెలుఁగు పండితుఁడుగా వెళ్ళాను. వెళ్ళి సుమారు పదమూడేళ్ళు ఆ స్కూలు పండితుఁడుగా వున్నాను. నా టీచరీ ముచ్చట్లు, అప్పటి నా స్కూలు శిష్యులు, పరమానందయ్యగారి కథలలాగు చెప్పుకుంటూ వుంటారు. ఆ కథలలో వొక కథతో మన కృష్ణారావుగారికి సంబంధం. నాకు అచ్చాఫీసువాపతుక్కులు బోలెఁడు మంది చేతులో వున్నప్పంటికీ దమ్మిడీనస్యపొట్లం కొనుక్కోవడానిక్కూడా రాబ్రిసన్పేటకు స్వయంగా వెళ్ళడమే అలవాటు. తోవలో రావుగారి ఆఫీసు వుండడంచేత తప్పకుండా అక్కడికి వెళ్ళేవాణ్ని. కృష్ణారావుగారు

బ్రిహ్మసామాజికులని నా అభిప్రాయం. నాకు ఆ మతస్థులంటే చుక్కెదురు. అందుచేత యేదోచర్చ ప్రారంభంఅయ్యేది. దానితో పుణ్యకాలం కాస్తా (స్కూలుపైమన్నమాట) గతించిపోయేది. అప్పుడు తొందరగా ఇంటికివచ్చి స్నానాదికం నెరవేర్చుకొని, స్కూలులో నెమరువేసుకొనే పద్ధతిని రెండు మెతుకులుతిని స్కూలుకు కొంత ఆలస్యంగా వెళ్ళేవాణ్ణి. నేను స్కూలు వదలి యిప్పటికి ముప్పైయేళ్ళు వచ్చే ఫిబ్రివరికి నిండుతాయి. తరచుగా హెడ్మాస్టర్లు – (1) కృష్ణమాచార్యులుగారు (2) ముత్తయ్యరుగారు (3) వెంపటి నరసింహంగారు – వీరి దర్శనం క్రొత్తలో రోజువిడిచి రోజు చొప్పున స్వప్నంలో అవుతూనే వుండేది. యిటీవల నెలకూ రెండునెలలకూ అవుతూవుంది. కృష్ణారావుగారికీ మాస్కూలుకీ నా యెఱింగినంతలో ఏ సంబంధమూ లేకపోయినా నా స్కూలు పైమును భంగించడం ప్రతినిత్యమూ జరిగేపనిగా యేర్పడడంచేత రాత్రి సినిమా ప్రదర్శనంలో తెల్ల తలపాగాతో కృష్ణారావు కూడా ఆ త్రిమూర్తులతో పాటు ప్రత్యక్షం అయేవాడు. అప్పటికి సినీమాలు మూగనోములో వుండేవి గనుక కృష్ణరావుగారి స్వరూపం మఱీ– స్వభావోక్తికి ఉదాహరణగా వుండేది. కృష్ణారావుగారే కాదు, శ్రీయుతులు డాక్టరు పట్టాభిగారు, అవటపల్లి నారాయణరావుగారు వీరు కూడా నాకు దృశ్యప్రబంధంలో దర్శనమిచ్చేపాత్రలే. మతాన్నిబట్టి వీరికీ నాకూ చుక్కెదురు. అందుచేత అప్పుడప్పుడు కొంత ముదురు పాకంగానే వాదించుకొనేవాళ్ళం. అయినా రోజూ (యెప్పుడోతప్ప) కలుసుకోవడం తప్పదు. నేను బందరు వదిలిపెట్టేవఱకూ కృష్ణరావుగారికీ నాకూ యించుమించు చుక్కెదురే. దానికి కారణం గుంటూరి సీమవివాదలలో – (1) యధార్థవాది, (2) సత్యవాది, అనే మాఱుపేర్లతో శుద్ధాబద్ధాలువ్రాసే వ్యాసాలు కృష్ణలో ప్రకటింపబడేవి; యధార్థవక్తలు పంపేవి బుట్టదాఖలయేవి. అందుకు కారణం కృష్ణారావుగారు కారు. వేతాకరు, ఆయన పేరు నేను – "కృష్ణారాయా వచి యింపుమయ్యా మనయీ........ వెట్టిడో!" అని ఆరోజుల్లో ఆవేశంతో

వొకరోజు వుదయం అత్యాశవులో పలికిన శతకంలోనే బొట్టుపెట్టి వూరు కున్నప్పుడు యిప్పుడు మాత్రం ప్రకటించడం యెందుకని వుపేక్షిస్తున్నాను- శృంగార గ్రంథాలకు ఆంక్షవిధించే రోజుల్లో ఆ యీ గుప్తనామకుఁడు - భ - కుమారస్వామిశాస్త్రి అనే పేరుతో యేవో అసంగతాలు ప్రచురించే వాఁడు. నేను కృష్ణారావుగారిని నిక్కచ్చిగా ప్రశ్నించేటప్పటికి అసత్య మాడడం స్వప్నంలోకూడా చేఁతకాని యీ - కృష్ణారావుగారు. యిది కల్పిత నామమని సూచించారు. ఆ పిమ్మటనే ' భవితవ్య మెఱుంగు రాస భకుమారుండా ' అనే మకుటంతో కొన్ని పద్యాలు బయలు దేరాయి.

కృష్ణారాయా ! అనే మకుటంతో వున్నపద్యాలు నూటింటిలో అయిదు కాఁబోలును, వేమవరాగ్రహార శతావధాన పీఠికలో ప్రకటిం చాను. అందులో వొక "పేరా బ్రహ్మమతంబు నీది, అది నే ప్రేమింపన్!" అన్న దానిలో ' నీయోగ్యతవగయిరా సుగుణాలు నాకు మిక్కిలిగా ఆరాధ్యములు ' అని శత్రుకోటిలో వుండే నేను 'శత్రోరపి గుణా వాచ్యాః' అని వ్రాయక తప్పనిసరి అయిన యీయన యోగ్యతనుగూర్చి వ్రాయ వలసివస్తే నాకే కాదు, యెవరికీ "యతోవాచో నివర్తంతే" కాకతప్పదు. నాయెడల యింతటి ఆంతరంగిక మిత్రుఁడు లేనేలేఁడన్న సంగతి నేను బందరు వదలి స్వగ్రామానికి వచ్చేటప్పటి సభలనుగూర్చి వ్రాసిన సంపాదకీయ వ్యాసంవల్ల తెల్లమయింది. క్రియలోమాట బందరులో వున్నంతకాలమూ మత వైషమ్యాన్ని బట్టియేమి, ప్రతిపక్షుల అసత్యాలు పరిశీలింపక ప్రచురించడాన్ని బట్టియేమి పయికి మాట్లాడుకుంటూవున్నా అంతరంగంలో నాకు ( ఆయనకుకాదు ) ద్వేషమే. యీయన మనో నైర్మల్యాన్ని యెప్పుడు తెలుసుకున్నానో ఆ సందర్భం తెలిపే వున్నాను. యీయన గురుశుశ్రూషా పూర్వకంగా ప్రస్థానత్రయం చదివిన వేదాంతి. బ్రహ్మ సమాజమువారిలో యిట్టివారు అరుదుగా వుంటారు. బ్రహ్మ సమాజమతము ఆస్తికమతాలలోది కాని నాఽస్తికాలలోది కాదు. యజ్ఞయాగాది కర్మలేవీ వారు విశ్వసింపరు. కృష్ణరావు మునివంటివాఁడు.

మునులకు వుండఁదగిన సుగుణాలన్నీ ( కర్మశ్రద్ధతప్ప ) మూర్తీభవించి వున్నాయి. పత్రికా ప్రవర్తకులలో నింతటి ప్రతిభాశాలి యిదివఱకు లేఁడు. యెడిటోరియల్ వ్రాయవలసివస్తే యీయనే వ్రాయాలి. పద్య కవిత్వం యీయన చెప్పలేకపోయినా యీయన్ని నేను మహాకవిగా వొప్పుకుంటాను. సంపాదకీయాలు రెండో కాదంబరీకవనమే. నీరసకవిత్వం అంటే యీయనకు తలమంట. నిర్మొగమాటంగా తన అంతరంగాన్ని వెలిపుచ్చ డానికి జంకేవాఁడుకాఁడు.

ఈయనకు తెలుఁగు సంస్కృతం ఇంగ్లీషు యీ మూడు భాషలలో చాలా మంచి ప్రవేశం. యివి గురు శుశ్రూషాలబ్ధాలు; యిక సత్యం, శౌచం, శమం, దమం - వగయిరా సుగుణాలు '.వెన్నతోడ బెట్టినవి.' మౌనం ఆ యీ సుగుణా లన్నిటికీ వన్నె తెచ్చింది. యింకోటి, "యత్రా కృతి స్తత్ర గుణాః, యత్రగుణా స్తత్ర సంపదః." యీయన నవీనాచార పరాయణుఁడైననూ గృహం ( గృహిణీ గృహముచ్యతే ) యావత్తూ పూర్వాచార పరాయణమే. యీ అంశం సుమారిప్పటికి యెన్మిదేండ్ల నాఁడు వీరియింటికి వెళ్ళుటచే తెలుసుకోగలిగాను - కృష్ణారావుగారివయస్సు దాదాపు సప్తతి (70). యిట్టి తరుణంలో స్వర్గతినందుట విచార్యంకాదు గాని సాక్షాత్కరించిన మహాలక్ష్మివలె నుండు అర్ధాంగి నెఱింగినవారు విచారింపకపోరు - ఓం శాంతి శ్శాంతిః

షరా:— యిప్పటికి సుమారు 50 యేళ్ళకుముందు బులుసు పాపయ్య శాస్త్రుర్లుగారు ( మంచినీళ్ళప్రాయంగా వేదవ్యాఖ్యానం 'విద్యారణ్యం యేకరు పెట్టేమహావ్యక్తి' ) స్వర్గతిచెందినప్పుడు తత్పుత్రులు (తత్తు ల్యులు) ప్రకాశశాస్త్రుల్లుగారు విద్యారణ్యంపోయిందని దుఃఖించినట్లు చెప్ప కోగావిన్నాను. యిప్పుడో, యెడిటోరియల్ పోయిందని పత్రికా పాఠకులు విచారిస్తారని తోస్తుంది. అంతేకాని కృష్ణారావుగారు జీవించివున్నట్టే, అంతే. నరః పతితకాయోఽపి యశః కాయేన జీవతి ॥



# భారతాంధ్రీకరణ కాలపరిమితి

( ది 13—1—1946 సం॥రం ఆంధ్రపత్రిక డైలీనుండి )

........................................................................

మొత్తం పద్ధెన్మిది పర్వాలుగదా భారతం? ఇందులో కొన్ని చిన్నవీ వున్నాయి. యావరేజీని గ్రంథపులెక్క (32 అక్షరాలకు గ్రంథ మని ప్రాచీనుల సంజ్ఞ) సపాద లక్ష అని వినడం. స్కాందంకూడా యింత సంఖ్యలోనే వున్నట్టు వినడం. ఆయా సంఖ్య భిన్న భిన్నంగా కూడా శ్రుత మవుతూవుంది సంస్కృతంలో మాదిరిని తెలుగులో లెక్క పెట్టడం కుదరదు. లెక్కపెట్టే ఆచారమున్నూ లేదు. ఋషులు శార్దూలాది శ్లోకాలు కూడా వాడినా విశేషించి అనుష్టుప్ఛందస్సుతోనే గ్రంథం నడిపేవారు. వేదంలో ఉపనిషద్భాగంలో కూడా పెద్దపెద్ద శ్లోకాలు కనపడతాయి.

"నిత్యంసా పద్మహస్తామమ వసతుగృహే సర్వమాంగళ్యయుక్తా"
"త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వన్దే ముకున్ద ప్రియామ్"

ఈ శ్లోకపాదాలు శ్రీసూక్తంలోవి. ఈ సూక్తాలుకూడా వేదభాగాలే అనుకుంటాను. క్రియలో మాట వేదంలో యావత్తు ఛందస్సులకు వుదాహరణాలు వుంటాయి కాని కొన్నిటికి ఖిల సంహితలో వెదకవలసి వుంటుందేమో? మనకు ప్రస్తుతం కావలసింది. గ్రంథసంఖ్య అనుష్టుప్పునుబట్టి సంస్కృతంలో వుందిగాని తెలుగులో ఆ సంప్రదాయంలేదన్నదియ్యేవే.

అనుష్టుప్పు వంటిది తెలుగులో లేదేమో అంటే సరీగా ముప్పైరెండక్షరాలే వున్నది వుందోలేదో గాని దానిమాదిరిది ద్విపద వొకటి కనపడుతుంది. చాలామంది తెలుగుకవులు ద్విపదలోనే రచన చేయడాని క్కారణం అనుష్టుప్పు దృశ్యాన్ని బట్టే అనుకోవాలి.

"ఉన్నాడు తడవుగా నున్నాడతండు
మన్నాడు నిన్ను దెమ్మన్నాడటన్న."

యది యిరవై మూడక్షరాలల్లోనే యిముడడంచేత అనుష్టుప్పుకంటె తొమ్మిదక్షరాలు చిన్నది. క్రియమాట సంస్కృతంలో వున్న లెక్కకీ, తెలుగులోవున్న పద్యాలలెక్కకీ సామ్యం కుదరదని తేలుతుంది. అందు చేత సంస్కృతంలో లక్షగ్రంథం తెలుగులో యాభై లేదా అఱవై వేల లోకి వస్తుంది. శ్రీనాథుడు వ్రాసినట్లు (ఉచితంబు పరిగ్రహించియు అనుచితంబు త్యజించియూ) ఆంధ్రానువాదంలో కొంత ప్యాకేజీకిందపోతుంది. ఆపద్ధతిని లక్షలోవున్న సంస్కృతం తెలుగులోకి వచ్చేటప్పటికి పద్య సంఖ్య నలభై వేలలోకి దిగుతుంది. సంఖ్య తగ్గుతుందిగాని బరువుతగ్గదు.

నన్నయాదుల తెలిగింపు శ్రీనాథుని నైషధపు తెలిగింపువంటిదే కాని "మక్కికి మక్కి" తెలిగింపుకాదు కనక నలభై వేలకన్న లోప్పే అనుకుందాం. ఆ యీ అనువాదం వసుచరిత్రమాదిరి యమకాలూ, గమకాలూ, శ్లేషలూ వగయిరా బాజరబందీతో కూడిందికాదు. పురాణపాకమే కనక రోజు 1-కి మూడు నాలుగుగంటలు మాత్రమే వర్కుచేసినప్పంటికీ అత్యాశుకవులవలె కాక కొంత తక్కువ ఆశుధారలో నడిచిననూ ఆనాలుగు గంటలలోనూ నలభై పద్యాలేనా తేలకపోవుగదా ? ఆపద్ధతిని మధ్యమధ్య యితర వ్యాసంగానికింద కొన్నిగంటలు తీసివేసినప్పటికి నెల 1-కి వేయి పద్యాలు సగటున సుమారు తేలకపోతాయా ? యెంత తీసివేసినా —

క. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళితోవచ్చి యర
ణ్యావాసము చేసెదు ధర
ణీవల్లభ ? నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్.

అనే మాదిరి ధారాప్రవాహంలో దొర్లే నన్నయ్యగారికి గాని —

క. "సంజయ మురభంజనుని ధ
నంజయునిం జీరికిం గొనడు కర్ణుం డిం

త్రుం జెనకిమైన గెల్తు న
నుం జచ్చెనె ? యట్టివాడునుం గయ్యమునన్"

అనేమాదిరి ధారాప్రవాహంలో రచన సాగించే తిక్కన్నగారికిం గాని—

క. ఈ లోకమ యగు గొందర
కాలోకమ గొందరకు నిహమ్మును బరమున్
మేలగు గొందరకధిపా ?
యేలోకము లేదుసూవె ? యిలగొందరకున్

ఈ మాదిరి ధారాప్రవాహంలో రచన సాగించే యెర్రన్న గారికి గాని సాలుకు పదివేల పద్యాలేనా అట్లీస్తు గిట్టకపోవంటే కాదనేవారుండ రన్నేనాధైర్యం. అం..........................................................

..........................................................................................

కృష్ణరాయశాస్త్రిల్లుగారు సహృదయులు గనుక నన్ను శత్రుకోటిలో జేర్చక మిత్రకోటిలో జేర్చికొన్నారని వారి యోగ్యతను గౌరవించక తీరదు. మా ఖండన మండనాలు జరిగి ముగిసిన పుష్కరకాలంనాడు వీరు నన్ను సాలూరుకు (వారినివాసంకాబోలును) సమ్మానార్థంకూడా ఆహ్వానించి నట్లున్నూ, అసమర్థతచేత నేను వారి కుతుహలాన్ని నెరవేర్చలేకపోయి నట్లున్నూ జ్ఞాపకం. యిందలి సత్యాసత్యములు శాస్త్రిలుగారే నిర్ణయింప గలరు. వీరివ్యాసంలోని కొన్ని మాటలు చూపి, నేనేమేనా వ్రాయవలసి వుంటే వ్రాస్తాను:—

(1) శ్రీచెళ్లపిళ్లవారినిగూర్చి యెంతేనావ్రాయవలయును (2) శ్రీవారినిగూర్చి వ్రాయునపుడు దృక్పథము మార్చికోవలయును. దృక్పథములు సంస్కరించుకొనకున్న గోతిలోబడును (3) రామకృష్ణులట్లు తిరుపతి వేంకటకవులు యుగపురుషులు. "అప్రతిషిద్ధ మనుమతము" కావునకవితా ప్రపంచమున వీరే యుగపురుషులు, ఇతరులు కారని నొక్కిచెప్పుదును. కినియకుడు..........ఆలక్షణములు వీరియందున్నవో లేవో పరిశీలింపుడు

(4) ఈసమయమున "కలౌ వేంకటనాయకః" అన్నట్లు తిరుపతి వేంకటక
వుల ప్రతిభ విజృంభించెను. "నారాయణభట్టు, నన్నియభట్టులలాగు...."
(5) శతావధాన వ్యాజమున నానారాజసందర్శనమును జేసి భువనభోంతరా
ళముల "ఆంధ్రదివ్యజోతుల" వెలిగించిన మూర్తులు (6) వర్తమాన మహా
కవులకందఱకును ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ఈతిరుపతివేంకటకవులే
గురువులు.... నారాయణభట్టే తిరుపతిశాస్త్రిగారు; చెళ్లపిళ్ళవారు నన్నియ
రూపమువారు (7) ఆజంటలోవిదంట చెళ్లపిళ్లవారు. ఈతనిప్రత్యేక ప్రతి
భయు నప్రతిమానము...ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు నన్నియయు,
శ్రీచెళ్లపిళ్లవారును.... కేవలనన్నియ రూపమనుటకును వలను గాదు.
ఇంకను మఱికొందఱు కవులు "ధూర్జట్యాదులు వీరియందు గానవత్తురు.
కేవల నన్నయావతారము....కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు
చెళ్లపిళ్లవారురసికులు. సత్యాన్వేషణమునందు వీరికి పట్టుదలయెక్కువ
గుటచే. ......"

విద్వన్మహాకవులారా ! కృష్ణరాయశాస్త్రిగారి వ్యాసమంతయూ
యిలాటి వాక్యములతో నేనడిచింది. యిది నన్ను శ్లాఘించడానికి పుట్టింది.
యీయన వొకానొకకాలంలో నాకు శత్రువుగా యెదుర్కొని యుద్ధ చే
యడం కూడా రెండో నెంబరు వాక్యంలో ధ్వనిస్తూనే వుంది. (ఆరెండో
నెంబరువాక్యంలో తొందరపాటు విమర్శకులకు మంచి సలహా యిచ్చి
వున్నారు. కాని వినరు వారు) పరిశీలింపుడు. నేడు నాకు 76వయేడు నడచు
చున్నది. నేను పుట్టి బుద్ధియెఱిగిన నాటినుంచి పండితులతో వాదోప
వాదాలు చేయడం అందరూ యెరుగుదురు. నన్ను ప్రతిఘటించినవారిలో
యింతటి చక్కని పూర్వపక్షాలు చేసిన వ్యక్తి వేరొకరుకానరారని బాహువు
లెత్తి యేలాటిసభలో నైనా సరే వక్కాణించి సమర్థించడానికి జంకేది
లేదని చెప్పుతూన్నాను. ఈయనపూర్వపక్షాలు సమదర్శనిలో చూస్తే యీ
యన శక్తిసామర్థ్యాలు వ్యక్తమవుతాయి. నన్ను శ్లాఘించడం చేత నేను
మళ్లా శ్లాఘించడమో? యిది నిజాన్ని పురస్కరించుకొని శ్లాఘించడమో?

అప్పుడు విస్పష్టమవుతుంది. యేమయినప్పటికీ ఆయననన్ను శ్లాఘించిన వాక్యాలు (అన్నీ కాకపోయినా) తగుదునంటూ మళ్లా నేను యీవ్యాసంలో వుటంకించు కోవడం కొంత అపహాస్యాస్పదమేఅంటాను.

అయితే ప్రస్తుతం—శ్రవణానందం నాచరిత్ర అని వ్యాఖ్యానించి, తద్వారాగా నన్ను అధఃకరించే పరమపూజ్యుల వ్రాత (తనపేర్మి ప్రకటించుకొనెడి నద్దిఅనేది) యెంత శ్రోత్రియంగావుందో, (తమపాకంబు స్వహ_స్తపాక గతిచూ) తదితరులది యెంత సొగసుగా వుందో ? లోకానికి తెల్పుడు చేయడానికే నేను ఆయీ వాక్యాలు స్వీకరించవలసి వచ్చింది.

కృష్ణరాయ శాస్త్రిగారుకూడా నా బాల్య చాపల్యాన్ని వుపేక్షించలేదు. "ధూర్జట్యాదులు - చెళ్ళపిళ్ళవారు రసికులు" అనే మాటలతో వారి అభిమతాన్ని సూచించి వున్నారు. వారు అందుకోసం వ్రాయకపోయినా నాకు అనుమతి కలగవచ్చునుగదా ? నన్ను కృష్ణరాయశాస్త్రి గారు రసికుడు అన్నారుగాని నేను ఆయన వ్రాతనుబట్టి ఆయన్ని రసికాగ్రేసరుడని నమస్కరిస్తున్నాను. ఆయన హృదయంలో లేశముకూడా దురభిప్రాయం లేదు లేదు లేదు. దురభిప్రాయంతో కొందరు ప్రైవేటు విషయాలు యెత్తుకోవడమున్నూ చారిత్రకంగా కనపడుతుంది. బాణుడు హర్ష మహారాజ దర్శనానికి వెళ్లినప్పుడు "భుజంగ" అని ఆ మహారాజు బాణుణ్ణి అవమాన పఱచడానికో, చమత్కారార్థమో సంబోధించి నట్లున్నూ, బాణుడు "కామే భుజంగతా" అని ప్రత్యుత్తరం (శ్లేషగా) యిచ్చినట్లున్నూ హర్ష చరిత్రలో చూచినట్లు జ్ఞాపకం. ఇక్కడ శ్లేష వ్యాఖ్యానిస్తే చాలా చోటు ఆక్రమిస్తుంది. పదచ్ఛేదంమాత్రం చూపుతాను. "కా-మే-భుజం-గతా" అని విడదీస్తే "యేస్త్రీ నా చెట్టపట్టు కొని యుండగా నీవుచూచి నన్నిట్లు సంబోధించినావు" (మనో భువశ్చాపలతా ప్రసంగే కావా కథా మానుష లోకభాజాం" జాగర్త) అని రాజును మళ్లా ప్రశ్నించినట్లవుతుంది. "కామే-భుజంగతా" అని రెండు పదాలుగా మాత్రమే ఛేదిస్తేనో ? కామ పురుషార్థ విషయంలో భుజంగత్వం

(విటత్వం) వుంటే వుంటుంది గాక ప్రస్తుతం దాని ప్రసంగంతో నీ కేంపని వుందని రాజును దెకాయించునట్లు తేలుతుంది. రాజు బాణుడు వేశ్యాలో లుడని విని యిట్లు ప్రశ్నించాడనే రహస్యం భుజంగ పదంతో సంబోధించ డంవల్ల గోచరిస్తూ వుంది. "భుజంగో విటసర్పయోః" అని కోశం. జారత్వం వేఱు, విటత్వం వేఱు, పరకాంతాగామిని జారపదం చెపుతుండి. అది మహాదోషమనిన్నీ, రెండవది సామాన్యదోషమనిన్నీ పురాణా లలోవుంది.

క. పరదారగమన మొప్పదు
పురుషుల కది యెల్లపాపములకన్న నరే
శ్వర ! పరమాయుస్సంక్షయ
కరంబు తద్వర్జనంబు కడుమేలరయన్

జారచోరులను శిక్షించే అధికారం రాజుకు వుందనిన్నీ, తన దోషం దానిలోది కాదు. గనుక రాజు తన్నేమీ చేయలేడనిన్నీ యెఱిగి బాణుడు నిర్భయంగా జవాబిచ్చాడని తెల్లం. కవులకు పారకీయకదోషం లేనట్టున్నూ. క్వాచిత్కంగానేనా పండితులకు ఆ యీ దోషం వున్నట్టున్నూ కీ. శే. లు శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులవారి ముఖతః విన్న "పండిత రీతిః పరదేశగతిః పరదారరతిః పాలాశవిధి," అనే శ్లోకం తెల్పుతుంది. నిష్కళంకంగా జీవయాత్ర నడిస్తే మంచిదే. లేనిపక్షంలో దానికంటె యిది గుడ్డిలో మెల్ల. యేమేనా - యిట్టి విషయాలు ఉదారులు యెత్తరు. యెత్తితేనో ? ఇంతమాత్రనే - కుప్రింకెనె ? తద్యశః ప్రసర కోమలశీతల సాంద్రచంద్రికల్. ( గీరతం చూ. ) అయితే కృష్ణరాయశాస్త్రిగారు దురు ద్దేశంతో దీన్ని స్పృశించారా ? లేదు. వారి వాక్యాన్ని ( రసికుడు అనే దాన్ని ) నేను అభినందిస్తున్నాను. నా మీసాల పద్యంలో వున్న ప్రథమ పురుష ప్రయోగ సవరణనుగూడా నేను శిరసావహిస్తున్నాను. "కవి వరుల్ మముగెల్వుడు గెల్చిరేని - అనే వాక్యంలో 'గెల్చితిరేని' అని వుండవలసింది. మధ్యమ పురుషక్రియకనుక" అని మీరు సూచించింది

సమంజసమే. ఆ పద్యం ఆశువులో రాజసభలో పెద్ద పండిత యుద్ధంలో నడిచింది. అందుచేత తొందరలో ఆలా పొరబడింది. ఇటీవల ముద్రిణంలో గెల్తురేని అని నేనున్నూ సవరించే వున్నాను - అని విన్నవిస్తూ యింకొకటి నా స్వంత వ్యాకరణరీత్యా యిక్కడ వుపపత్తి వుంది. దాన్నిక్కడ చూపుతాను. (తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది గనుక "అనుక్త మన్యతో గ్రాహ్యం") యుక్తంగా వుంటే గ్రహించండి; లేదా త్యజించండి అని మనవి చేస్తున్నాను. ఆవుపపత్తి యెట్టిదంటే ?- సంస్కృతంలో యెదటి వ్యక్తిని సంబోధించడానికి యుష్మచ్ఛబ్దం వొకటిన్నీ భవచ్ఛబ్దం వొకటిన్ని వుందని పండితులెఱిగిందే. యీ రెండిట్లో గౌరవ విపక్ష వున్నప్పుడు భవచ్ఛబ్దాన్ని వాడుతూ వుంటారు. అప్పుడు క్రియాపదం ప్రథమ పురుషలోనే వుంటుంది. యిక తెలుగులోనో ? గౌరవం అన్యథాగా ప్రకటించుకోవాలిగాని యింత స్వల్ప భేదంలో కుదిరే వుపాయంలేదు. యుష్మచ్ఛబ్దార్థకం 'నీవు' బహువచనం 'మీరు' భవచ్ఛబ్దానికీ యింతే యిక్కడ "మీరు" అనేది ప్రయుక్తం కాకపోయినా క్రియాపదాన్నిపట్టి అధ్యాహారం కాకమానదు. అధ్యాహృతమైన "మీరు" అనేది భవచ్ఛబ్దార్థక బహువచనం అనుకుని యెదుటివారిని గౌరవించి సంబోధించే వుద్దేశంతో ఆయీ విధంగా ప్రథమ పురుష క్రియ వాడవలసి వచ్చిందని వేఱొకచోట పాండవాశ్వమేధంలో "మీరలుండిరనెడి కారణమ్మునవె" అన్నచోట సమాధానం చెప్పినట్లు జ్ఞాపకం. యిక్కడ 'గెల్తురేని' అన్నట్లే అక్కడ యిటీవల ముద్రిణంలో 'మీరలుంటి రనెడి" అని దిద్దితిని. సదుద్దేశంతో ప్రశ్నిస్తేయిచ్చే జవాబునాది యిదే విధంగానే వుంటుంది. అట్లు గాక యేదో విధంగా ప్రశ్నిస్తే మాత్రం మరో విధంగా వుంటుంది.



# గురుశిష్య ప్రశిష్య నాటకం

( ది 17–3–1946 సం॥ర జన్మభూమినుండి )

" ఈకాలములో విమర్శకులే కాదు యితరులు ( అస్మదాదులు ) కూడా వానికి పోలరు. మురారికి వృద్ధప్రపితామహుడుగా వుంటాడు. వెనకటి కాలంలో కృష్ణరాయల ఆముక్తమాల్యదకు వచ్చిన స్థానం యీకాలంలో వీనికి వస్తుందని నా విశ్వాసం. "

( ఘుసాలి గురువున్నూ పడుచు శిష్యుఁడూ ప్రవేశింతురు )

శిష్యు : నమస్కరించును.

గురు : సర్వత్ర విజయోస్తు, (బాగా పరిశీలించి) యెవరు నాయనా? నువ్వు,

శిష్యు : నేను మీశిష్యపరమాణువను, విశ్వనాథ సత్యనారాయణను.

గురు : (సంతోషముతో కౌఁగిలించుకొని) నువ్వా! నాయనా! చట్టన ఆనవాలు కట్టలేకపోయాను! యేదో పనిమీఁద వచ్చినట్లున్నావు.

శిష్యు : చిత్తం. పనిమీఁదే వచ్చాను. ( పుస్తకం విప్పి ) యీ మంగళాచరణం చిత్తగించండి.

గురు : (చూచి) బాగానేవుంది చూచాను, నిక్షేపంలావుంది దీనికేమి ?

శిష్యు : బాగా చిత్తగించి సెల వియ్యాలి. ముఖప్రీత్యర్థంగా సెలవీయవద్దు, దోషజుష్టంగావుంటే అచ్చయినాసరే దిద్దుకుంటాను. కాగితాలు నష్టమైనాసరే కంపోజునష్టమైనాసరే, ప్రస్సు స్వంతప్రస్సే, యింటికాళ్ళకు అద్దేమిటి ?

గురు : బాగానే చూచాను. నాకేమీ దోషం కనపడదం లేదు. భగవంతుఁడు తేజోమయుఁడు కనక వెలుఁగు పదంతో నిర్దేశించడం యుక్తమే. ప్రయోగాలు నూర్లు వేలు, తేజస్తద్వతో రభేదాద్వ్యవసాయః తేజోవాచకమైన వెలుఁగుపదం తేజోవంతుణ్ణి బోధిస్తుంది. " సరాశిరాసీ న్మహసాం మహోజ్వలః ( నైషధం ) జొపవారి

కోఽయం ప్రయోగః అభేదాధ్యవసాయం చేయడంవల్ల యెక్కువ తేజస్సు కలవాఁడని ఫలితం. కవితా సంప్రదాయం చక్కగానే వుంది. నా కేమీ తప్పు గోచరించడం లేదు.

శిష్యు : చిత్తం. అక్షరదోషా లున్నాయేమో? చిత్తగించాలి.

గురు : (నవ్వి) ఆరింట యా-మూడింట రా-అయిదింట-హా యీబాప తేనా నీ వడిగేది ? యివి మాబాల్యగురువులు ఆమధ్య నాజాతక చర్యలో గ్రంధాదిని వున్న పద్యంలో చూపడానికి ఆరంభించారు శ్రీకారంతో ప్రారంభించిన మంగళాచరణంలో ఆయా విచారణ మనావశ్యకం. ఇంతవఱకు తెలియనికవి ఎక్కడా వుండఁడు, తూల రాశిమివానలః, దోషాలు యేకరువు పెట్టిపెట్టి "లక్షమేకంతు దోషాణాం గురుః కేంద్రే వ్యపోహతి, అనడం యెఱుఁగవా ? అది ముహూర్తవిషయం, జాతకవిషయంలోకూడా బాలారిష్టాలు కన పరచి సర్వాపవాదకంగా గురుశుక్రకేంద్రస్థితి వగయిరాలు చూపు తాఁడు. ప్రస్తుతం —

క. శ్రీకారము కృత్యాదిని
ప్రాకటముగ నున్నఁజాలు బహుదోషములం
బోకార్చి శుభము లొసఁగును.

కనకనే మాఘంలో — "శ్రియఃపతి శ్రీం" అనిన్నీ భారవిలో — "శ్రియః కురూణాం" అనిన్నీ మూఁడో అక్షరం దోషాపాదకం వున్నా శ్రీకారం ఆదిని వుండడంచేత చిక్కులేదని వ్యాఖ్యాతలు దోషోద్ఘాటన చేయక శిరసా వహించారు

శిష్యు : నేను మనవి చేసుకున్నది తెలుఁగు రచననుగూర్చి; తాము సెల విచ్చేది గీర్వాణ విషయం కదా ?

గురు : యెఱుఁగుదు నబ్బాయీ ? యేవో యతిప్రాసలు వగయిరాలు తప్ప గణాలూ గణదోషాలూ మేటరూ గీటరూ అక్షరాలూ వాట్ల గుణ

దోషాలూ మంగళాలూ అమంగళాలూ ఛందస్సూ గిందస్సూ అంతా సంస్కృతాని కెంతో తెలుక్కి అంతే. "దేవతావాచకా శ్శబ్దాః....గణతో లిపితోపిచ." యీశ్లోకార్థం తెలుక్కి సంబంధించదని కాఁబోలును నీయాశయం, అది పొరఁబాటు. అలాగే అయితే "శ్రీభూపుత్రి" గతేమిటి? మూడింట పకారం వుందా? శ్రీకారం తద్వారకం, సరేనా, కనకనే ఆనాఁటిమహాకవు లెవరూ కిక్కురు మనలేదు సరేనా.

శిష్యు : అయ్యా! మీరేమో - "నచ శంకా నచోత్తరం" గా సెలవిస్తూన్నారు. మీగురువులు "తాఁచుపాముకన్నా మిన్నగా" అంటూ యేమేమో వ్రాసివున్నారు చిత్తగించండి, పత్రిక (దేశసేవ చూపఁబోవును.)

గురు : చూడ నక్కర్లేదు, గురువుగారి విమర్శవైఖరి నాకు చూడకుండానే గోచరిస్తుంది వారి కేదో నీమీద కోపకారణం కలిగింది అందుచేత యీ అమంగళవాక్యాలు నీకవిత్వంమీఁదకి వస్తూన్నాయి. యివన్నీ వ్యతిరేక లక్షణయా నీకు మంచిని కలిగించేవిగా పరిణమిస్తాయి దానిక్కారణం నీరచన నిర్దుష్టం కావడం వొకటి, రెండు నీపరమ గురువులు కోపంతో వుపయోగించడం యిది నేననుభవపూర్వకంగా చెప్పేమాట సుమారు పుష్కరకాలంనాఁడు నేను నాజీవిత చరిత్ర-జాతకచర్యను శ్రీరావు గంగాధరరామారావుగారికి అంకితం చేస్తూ - శ్రీగోవింద పదారవింద, అనే పద్యాన్ని ఆశీర్వచనంగా వుపయోగించాను. నామీఁద యేదోకోపంవచ్చి ఆయీ పద్యంలో నీపద్యంలోమాదిరిగానే యేవో నిందావాక్యాలు వ్యాఖ్యానించి (బాగా యిప్పుడు ఆవాక్యాలు జ్ఞాపకం లేవు,) తుట్టతుద కన్నారుగదా; "శ్రీగోవింద,"అనడంచేత ఆకృతీశ్వరునితాలూఁకు "శ్రీ గోవిందా," అవుతుందనే అర్థాన్ని సూచించే వొకఘోరమైన మాటను వుపయోగించారు. పాముకాటుమాట వంటిదే - వారి అలవాటు కవిమీఁద

కోపంవస్తే వాణ్ణి యేదో అనడంతో సరిపోను సరికదా ? వాడి కవిత్వాన్ని దూషించడంతోనూ తేలదు. వాఁడు అంకితం యిచ్చిన సంపన్నులదాఁకా ప్రసరిస్తుంది. అయితే వారికి దానివల్ల కలిగే లాభం యెట్టిదవుతుందంటావేమో ! తద్వారా గ్రంథకర్తమీఁద వారు ద్వేషభావాన్ని చూపిస్తారనిన్నీ తన్మూలకంగా వారివల్ల వీఁడికి కలిగే లాభం చెడుతుందనిన్నీ వారితాత్పర్య మయితే కావచ్చు. ధూళిః పరగ్యహోదపి. వక్తవ్యాంశం ఆ జాతకచర్య కృతిభర్త సిరిసంపదలతోనూ నిరామయాయుర్భాగ్యాలతోనూ తులదూఁగడం యెఱుఁగుదువా ? వారిపూహ యెంతవఱకు సమంజసమో దీనివల్లనే తెల్లం కాలేదా ! వారిమాటలు విమర్శ సహాలుగాఁ వుండవు. తెనాలి రామలింగం (శ్రీభూపుత్రి) పద్యాన్ని గుఱించి యేదో వెక్కిరించాఁడనీ, చేతిలో విభూతి పోసుకొని "హుంఫ్ఫుమని వూఁదియేమో అన్నాఁడనీ చెప్పుకునే పుక్కిటి పురాణం యెఱుఁగుదువా ? గురువుగారి చెయ్వులు దానికి అనుకరణాలు. యింతకూ వారికి నీమీఁద కోపం యెందుకు వచ్చింది ? అమధ్య యేదోక్షమాపణ కూడా యిచ్చినట్లు విన్నానే ?

శిష్యు : చిత్తం వారితోవివాదం అందులో కోర్టులో నాకు సర్వథా అనుచితమని తోఁచి ఆవిధంగా (మీవలెనే) - బయటఁ బడ్డాను. అయితే అంతతో అది సమసి పోయిం దనుకున్నాను. మళ్ళా చిగిరించి యీవిధంగా దండువెడలుతూ వున్నారు. చిత్తగించారా ?

గురు : దాసుఁడి తప్పులు దండంతో సరి. మళ్లా క్షమాపణ చెప్పు.

శిష్యు : యేం తప్పుచేశా నని ?

గురు : అలా ప్రశ్నించితే నీతప్పు నీవు గమనించనట్లే అనుకోవాలి. యీగమనించక పోవడం రెండోతప్పు. మొదటిది నన్నుఁగూర్చి నీకల్పవృక్ష రామాయణంలో మిక్కిలిగా కొనియాడడం తప్పు కాకపోతుందా ? యింకోటి పూహకు తగులుతూవుంది. యేదంటే !

1. సార్వభౌమ. 2. సమాశ్రిట్టు. యీపదాలు పర్యాయాలేమో? కోశంచూడు. యత్కించిత్తేనా భేదంవుంటే చిక్కులేదుగాని పక్షాంతరంలో చిక్కుండక పోదు. ముఖ్యమైనమాట నన్ను యేదో గురువని వ్రాసుకుంటే వారికి ఆగ్రహం అంతగా రాకపోవునేమో కాని, వున్నవీ లేనివీ గుణగణాలు నన్నుఁగూర్చి యేకరువు పెట్టడం వల్ల నాతోపాటు శత్రుకోటిలో చేరితే చేరవచ్చు నీవుకూడా.

శిష్య: చిత్తం. యెవరికో కోపం వస్తుందని అవశ్యకర్తవ్యాలు మానుకోవలసిందేనా? గురువును పొగిడితేనూ తండ్రికి తద్దినం పెడితేనూ కోపం వస్తే యేలాగ బ్రతకడం. పోనీయండి. నేను మంగళాచరణంలో వెలుఁగు పదార్థానికి వేసిన విశేషణాలనిగూర్చి "అది నపుంసకం యిది మరోలింగం" అంటూ యేమేమో ఆక్షేపించారు కదా! అలాటిలింగభేదం పనికిరాదా? అయితే దిద్దుకోవలసి వుంటుందేమో సెలవీయండి.

గురు: నీవు వెళ్ళినతోవ పూర్వమహాకవి సమ్మతం. రూపించేటప్పుడు లింగం భేదించడం తప్పులేదు. నీకీశ్లోకంరాదా!

> శ్లో. ఆవాస స్సంశయానాం....స్త్రీయంత్రిం కేన సృష్టం
> ..........ప్రాణిలోకస్య పాశః — భర్తృహరి.

పోనీ యీశ్లోకమేనా వచ్చునా? "కార్యేషు మంత్రీ కరణేషు దాసీ" యీశ్లోకంలోవున్న దాసీపదం స్త్రీలింగమే కనక భార్యకు సరిపోయింది. మంత్రి - యిది యేలింగం? లింగభేదం దూష్యమే అయితే - మంత్రిణి అని సవరించవద్దా! గురువులవారి విమర్శనకి అర్థం వుండదు. వారు వాడుకుంటారు దాన్ని యితరుడు వాడితేనో తప్పంటారు. మచ్చు చూపుతాను. "అవధాని ప్రభృతు లాయాచోటులకు నేగి" యిది గురువుగారిది అమృతానందం చూ. "చిద్గగనప్రాలేయాంశువున్" యిదినీది. రెండున్నూ రేఫద్విత్వానికి పూర్వమందున్న వర్ణానికి వైకల్పికలఘుత్వాన్ని అంగీకరిస్తే

నెగ్గేవే ఆలా అంగీకరించడానికి సంస్కృతమహాకవులవీ వున్నాయి ప్రయోగాలు, ఆంధ్రమహాకవులవీ వున్నాయి. " దారిద్ర్యాద్ధ్రియమేతి హ్రీపరిచితః వగయిరాలు చూ. నచశంకా నచోత్తరం. యెందుకాక్షేపించడమో అగమ్యగోచరం. అయోమయం.

'యజ్ఞయాగములు' దీన్ని గురువుగారు ఆక్షేపించారు. వాకాయన అక్షేపకులదే వుదాహరించి గట్టిగా అడిగితే యిచ్చినజవాబు నీవు చదవలే దనుకుంటాను. (అసూయలో వుందేమో చూ.) వారితో వివాదపెట్టుకోకు, నెగ్గలేవు. వారివాదానికి తలాతోఁక వుండదు. వారుచేసుకొనే అర్థాలు సరిగా వుండవు " కంజముఖీ కబరీభరోత్కరా నందదమై " దీనికి సరిగా అర్థం చేసుకోక ఆక్షేపించారు. ఇంతేకాదు. కొన్ని మఱీ అవ్యక్తంగా వుంటాయి. (కారణం శాస్త్రజ్ఞశుశ్రూష వారికి లేకపోవడమే) చుంచు అనే అక్షరద్వయాన్ని పృథక్కుగా విడఁదీసి విగ్రహాన్ని కనపఱిచారు. అది శాస్త్రజ్ఞమర్యాద కాదని నీకు తెలుస్తుం దనుకుంటాను. వారి అక్షరాలు చూపుతాను — " భక్తరక్షణకళా శ్రీచుంచువు " భక్తరక్షణమను కళాలక్ష్మికి చుంచువు అయినవాఁడు. " ఈ చుంచువు ప్రత్యయం గాని రామాదులవంటి స్వతంత్రశబ్దం కాదు. వ్రాస్తే చాలావ్రాయాలి. " న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపిప్రత్యయః. " అని మహాభాష్యం. " తేన విత్తశ్చుంచుప్చణపౌ " అని సూత్రం. చుంచుప్ చణప్ ఇవి రెండు ప్రసిద్ధార్థకములు - ప్రత్యయములు. దీన్ని విడఁదీసిన సందర్భం చాలా శోచ్యం. ఆ వర్ణద్వయానికి వారికి అర్థం తెలిసినట్లు లేదు.

" అహం కథం ద్వితీయా స్యా ద్ద్వితీయాస్యా మహం కథమ్ "
జనిత్వా కిం ను స్యా త్కిమపి యదిశాస్త్రం న విదితమ్ "

రేవతీవదనోచ్ఛిష్ట....చుంబన చుంచునా, ( మాఖవ్యాఖ్య. చూ. ) నీకవిత్వభావాలు గాని రచన గాని శైలిగాని భాషగాని, సర్వమూ రుచ్యం గాదనే అనుకుందాం. నీ కేపూర్వకర్మవల్లనో కవిత్వవ్యసనం పట్టుకుని పీడించడంచేత — " పుత్త్రులుతన కుద్భవించినఁ గురూపులు కాఁగలరంచు

భార్యతోఁ గలయిక మానునే " (లక్షణాపరిణయం చూ) యేదో పిచ్చా పాటి వ్రాసుకోవడం తప్పదు. అయీ వ్యసనం - కండూతి వంటిది. దీన్ని మానుకుందామంటే వశం కాదు. దీన్ని ఆక్షేపించేవారిని సమర్థించడం పొసగదు. అయీవుద్యమానికిఫలితం గ్రంథకర్తని యేదోవిధంగా పరాభవించడమే కావాలి అది ఆత్మకు సంఘటించేదిగా వుండకూడదు. ప్రస్తుతం అయీ దోషం యీవుద్యమానికి పట్టిందో ? లేదో ? తెలపడం వైయాకరణులపని. పెద్దలూ పూజ్యులూ అయినవారి వ్రాఁతవిషయంలో యింత వరకు సూచించడమే కానిపని. శాస్త్రవిషయం గనక విధిలేక సూచించాను. ప్రాజ్ఞలోకమున్నూ భగవంతుడున్నూ క్షమించాలి. (ఇదియీావత్తూ చుంచువు విడఁదీసిన సందర్భంలోనిది) చిరంజీవీ ! విశ్వనాథ సత్యనారాయణా ! మావలె నీవు లేనిపోని "కఋకురు బొాయికురు" వాదాలకు దిగవు. నీనాగరికత చాలావఱకు పూర్వపండిత నాగరికతకు అనుకూలించేదే. అయినా యీవ్యర్థ - వాదోప వాదాలవిషయంలో భేదిస్తుందని నాదృఢవిశ్వాసం. యిఁక మధ్యగావున్న నాకు పెద్దచిక్కు. యథార్థం వ్రాయడం తప్పదు. పండితలోకానికి జంకాలి. జంకి వ్రాస్తే గురువుగారికి వ్యతిరేకిస్తుంది. అన్యథాగావ్రాస్తే శిష్యుఁడికి వ్యతిరేకించడమే కాక పండితలోకం గర్హిస్తుంది. భగవంతుఁడూ క్షమించఁడు. అయితే వొకరు వినరుగాని నాకు రెండోవ్యక్తి వింటుంది కనక వినే వ్యక్తిని మందలిస్తాను. దీనితో యిది సమసిపోతుంది.

అబ్బాయీ ! సత్యనారాయణా ! నాశిష్యవర్గంలో కొస్త నామరూపాలు గలవాళ్ళలో నీ వొకండవు. నీకవిత్వంలో యేదో కొంత కొత్తదనం వుందనడానికి రసజ్ఞలోకమే సాక్ష్యమిస్తుంది. నీకు నీప్రయత్నం లేశమూ లేకుండావచ్చిన - కవిసామ్రాట్టు నేతిబీఱకాయ కాదు. అది సార్థకం. నీకు రచనలో తన్మయత్వం వుంది. యిందుకు "కృష్ణార్పణం." మకుటాలు సీసాలు సాక్షులు. డబ్బిచ్చి యేడిపించే పాత్రమాదిరి కవిత్వానికి తన్మయత్వం వుండదు. అన్నిటికన్నా వొకందుకు నిన్ను నేనెక్కువగా అభి

నందిస్తున్నాను - నీవు నీకవిత్వానికి సర్టిఫికెట్లకోసం ప్రయత్నించడం పెద్ద పనిగా పెట్టుకోకపోవడం నాకు అభిమతం. పోస్టేజీసహా పెట్టుకుని పుస్తకాన్ని పంపితే యెవరోగాని చెడ్డను వ్యాకరించరు దాన్ని కప్పిపుచ్చి మంచినే (లేకపోయినాసరే) వ్యాకరిస్తారు.

"తే. అన్ని పొత్తమ్ములకు మొద లెన్నిపుటలొ
నిండు నభివందనములతో దండుగకట!
ఒక్కఁడేనియు నిజమగు నూహవ్రాయఁడు...."

యీపద్యంలో వున్న ఊహ అన్నది గురువుగారు నీరచనలో తప్పుగా భావించారు నాడీ డిటో - ఊహము అనాలని వారివూహ. మువర్ణసాహిత్యంకన్న రాహిత్యమే శ్రవణసుఖదం. శాస్త్రవిరోధ మంతకంటె లేదు. వ్రాస్తే చాలా పెరుఁగుతుంది. వారు యేది తప్పని అంటారో అందులో నూటికి వకటో రెండో తప్ప యావత్తు అవచ్ఛేదకావచ్ఛేదేనా వొప్పులే అవుతాయని తెలుసుకో; దానికి ప్రయోగం యితరకవులరచనలో వెదకనక్కర్లేదు, వారిరచనలోనే దొరుకుతుంది - ప్రయోగ తప్పన్నారు వారిదానిలోనే దొరికింది. యీమాదిరివి యెన్నో వున్నాయి. అయితే యీ సందర్భంలో వారు చెప్పేయుక్తి వొకటి వుంది - చాలా అందంగా వుంటుంది - వుటంకిస్తాను "నేను సర్వజ్ఞుణ్ణి కాను. నాకు తప్పులు పడతాయి. అవి మీరుఅనుకరించవద్దు. నావి నేను దిద్దుకుంటాను" యిది ఆ యుక్తి. ఇది ఆపాతరమణీయంగా వుంటుంది. సర్వజ్ఞత్వము సాంబమూర్తిదేకదా ఇతరుని సర్వజ్ఞుఁడనుట.... అది వద్దు. కించిజ్జ్ఞులేనా కావాలా వద్దా? విమర్శనరీతి దానికికూడా అంగీకరించదే: మంచిదే. వారు తప్పు దిద్దుకుంటారు సరే. వొప్పుకూడా! భ్రమపడో; లేక వొకడికి తప్పు పట్టడం వల్లనో; దిద్దుకుంటే యితరు లెందుకు దిద్దుకుంటారనే ప్రశ్నకు జవాబు లేదుగదా? ఏనిని తిక్కన్న ప్రాసలో మూడుచోట్లవాడితే దాన్ని పట్టి ప్రయోగించుకున్న కవి యెందుకు దిద్దుకుంటాఁడు? యిది గురువుగారి అజ్ఞగదా! అని దిద్దుకోవాలి పిష్టపేషణం ఇది, వారు నీకవిత్వంలో

చూపే అర్థదోషాలుగాని శబ్దదోషాలుగాని అన్వయదోషాలుకాని నిలిచేవి కావు. నీవు కొన్నియతులలో ప్రాసలలో ప్రాచీనులకన్న భిన్నంగా వాడి నట్లు నాకూ తోచింది. అవి నీవు బుద్ధిపూర్వకంగా వాడినప్పుడు ఆక్షేపిం చడం అనావశ్యకం. ప్రమాదమయితే దిద్దుకోవడం నీకోసమే. అస్మదా దులకోసం గాదు. సౌహార్దంతో తెలిపేవారి వ్రాఁతలు వెక్కిరింపుల తోనూ ధిక్కరింపులతోనూ నిండి వుండవు - ప్రకృతం పెద్దలయినవారి వ్రాఁతలో అవి మెండుగా వున్నాయి. యేవో రెండో మూడో వారికి గట్టిగానిలుస్తాయనే బరవసా కలవి తెల్పితే వారు ప్రమాదపడినట్లయితే వారికి దాన్ని తెల్పవచ్చును. స్వంతప్రమాదమే అయితే కృతజ్ఞతాపూర్వక వందనాలతో దిద్దుకోవచ్చు. ప్రతిశంకకీ వ్రాయవలసివస్తే చాలాపెరుఁగు తుంది గ్రంథం. ప్రధాననిబర్హణ న్యాయమే అనుసరణీయమని నాకు తోచింది. నీకు నాపంథ నచ్చితే అనుసరించుము. వారికి నీమీఁద పట్టు దల వుంటే వుంటుంది. నీకు పట్టుదల వద్దు - ఇంతే ఆశీః స్వస్తి.

## అ ను బ ం ధ ము

నేను దీనిలో కలిగించు కోడానిక్కారణం శిష్యుఁడు శరణాగతుఁ డవడంగా చదువరులు భావిస్తారు. అట్లు భావించడం ఆపాత రమణీ యంగానే కనపడినా అది యథార్థదూరం. నేఁటివరకు శిష్యుఁడు నా వద్దకు రాలేదు. యీ పయినేనా వస్తాఁడో లేదో, చెప్పలేను. వానికి తీరిక లేక రాలేదని నా భావన. అయితే మొదటి ప్రశ్నోత్తరాలేమిటంటారా ? వస్తే జరిగే సంభాషణ ఆ విధంగానే కదా ! అదంతా భావన - నమ్మితే నమ్మండి. లేదా మానండి "నమ్మిన నమ్మకున్న నది నా వశమా ?" అన్నారు దాసువారు. గురువుగారి విమర్శనపడే పత్రిక, దేశసేవ నాకు రెండోది మాత్రం వచ్చింది. బహుశః పత్రిక వారేపంపి వుంటారు. యెవరో చదివినవారు విషయాన్ని తెల్పఁగా విన్నాను. లోఁగడ గురువుగారి విమర్శనాశైలి యెఁఱిగినవాణ్ణి కనక అనుమాన ప్రమాణద్వారా సర్వమూ

అవగత మయింది. గ్రంథకర్త వారికి దొరకడ్డా - పడకున్నా - వారు నాకు దొరకడతారని నిశ్చయించుకున్నాను. అంతలో యెవరో ఆరంభ పంచిక తెచ్చి యిచ్చారు. మంగళాచరణంలో గురువుగారు విశేష్య విశేణ భావాదులను గూర్చినవి బొత్తిగా నీరసంగా వున్నా చట్టన వారి అజ్ఞత్వాన్ని వ్యాకరించవు; కాని కొంచెం నిదానిస్తే అవిన్నీ డిటో. ఇక నేమిటంటే కళాచుంచువును గూర్చి వారు వ్రాసిన అక్షరాలు వారి అజ్ఞత్వాన్ని బాగా వ్యాకరిస్తూన్నాయి. చుంచువు అనే దాన్ని విడదీయడంలో సందర్భమే కాదు. దానికి ప్రతిపదాన్ని వ్రాయక పోవడం కూడా విమర్శకుల అజ్ఞత్వాన్ని గంభీరంగా వ్యాకరించింది. గంభీరంగా వుండక దీనిలోకి దిగి అనడ్వాహాల యితిహాసాన్ని జ్ఞప్తికి తెచ్చే వ్రాఁత లెందుకో అనిపించింది. ఈ ప్రయత్నానికీ వారు వున్న పొజీషనుకీ లేశమూ సంబంధం కుదిరింది కాదు. సత్యనారాయణ ప్రధానంగా చదివిందేమో యింగ్లీషే అయినా సంస్కృతంలో యిటీవల చాలా కృషి చేశాఁడు. వ్యాకరణం కూడా (కౌముది) కొంత చదివినట్లు విన్నాను. చదివాఁడో లేదో ? గాని విమర్శకులకువలె సంధి దోషాలు వీనికవిత్వంలో దొరకవు. అంతవఱకు గ్రంథ సాక్ష్యమే కాదు. వ్యక్తిసాక్ష్యంకూడా వుంది. నన్నడిగితే ప్రకృత విమర్శకులకు తోఁచినదేదో రచన ( తప్పో ఒప్పో ) సాఁగించడానికేగాని విమర్శనకు కావలసిన సామగ్రి పూర్ణానుస్వారమనే చెపుతాను - యిఁక సమాసగ్రథనం యీ కాలంలో విమర్శకులే కాదు యితరులు [అస్మదాదులు]కూడా వానికిపోలరు. మురారికి వృద్ధప్రపితామహుఁడుగా వుంటాఁడు. వెనుకటి కాలంలో కృష్ణరాయల ఆముక్తమాల్యదకు వచ్చిన స్థానం యీకాలంలో వీనిరచనకు వస్తుందని నావిశ్వాసం. మఱివాకరు మఱివాక లాగు అభిప్రాయపడితే పడతారు. భిన్నరుచిర్హి లోకః అతనికవిత్వంలో తప్పులు వుంటే అవి సవరించుకుంటే సవరణ అవుతాయికాని విమర్శకులు వెక్కిరింపఁబోయి చేసిన తప్పునకుకూడా శుద్ధాశుద్ధ పత్రిక వ్రాసుకోవడానికి యేసహృదయుఁడు సమ్మతిస్తాఁడో అని నాలో నేనే లజ్జిస్తున్నాను. (లజ్జితు

ముపిలజ్జతే చూ.) విమర్శకులకు బాగా తప్పులని ధైర్యం కలిగించేవి రెండుమూడు నిర్దేశిస్తే విపులంగా వాట్లనుగూర్చి నేను జవాబివ్వడంగాని తప్పని వొప్పుకోవడంగాని చేస్తాను. అంతేనేకాని తలా తోఁకా లేని గీట్లు పెడితే యెంతని వ్రాసేది. సత్యనారాయణ అంత అనద కాఁడని నానమ్మిక. స్వస్తి.

---

# రామాయణ కల్పవృక్షం

(ది 5-5-1946 సం॥రం ఆంధ్రపత్రిక డైలీనుండి)

వూరికే అస్తమానమూ పడుకోఁ వడంచేత యేమీ తోచక యేదో రాదామనుకుంటే శిష్యుడు కొత్తగా రచించి సమర్పించిన రామాయణ కల్పవృక్షం కనపడింది. ప్రప్రథమం ఆ యా పేరును గూర్చి కొంత చర్చిస్తాను. ఇది యేసమాసం; ఉపమితసమాసం. రామాయణం కల్పవృక్ష ఇవ అని విగ్రహం చెప్పాలి. పురుషవ్యాఘ్రః, వంటిదే యిది. అయితే వ్యాఘ్రశబ్దమూ పురుషశబ్దమూ రెండున్నూ పుంలింగాలే కనుక ఆ సమాసం యుక్తమే. ప్రస్తుతం రామాయణం నపుంసకం కనక యుక్తం కాదం టామా; అల్బే ఆ యీ శంక నీరసం. సమాసం యేదైనా విశేష్య విశేషణ భావం వుండి తీరుతుంది. సమర్థః పదవిధిః కదా? సామర్థ్యంచ భిన్న ప్రవృత్తి నిమిత్తయోః యద్వానిమిత్తానాం పదానాం పరస్పర విశేష్య విశేషణ భావాపన్నైకార్థోపస్థితి జనకత్వం. అలం పత్రికాపాఠకానాం దుర్బోధేనా నేన ప్రసంగేన.

"లింగసంఖ్యా విభేదేపి విశేషణ విశేష్యయోః
విభక్తిః పునరేకా చేద్విశేషణ విశేష్యతా.

అయితే ఆ పేరు తల్లకిందు చేస్తేనో? కల్పవృక్ష రామాయణం అవుతుంది. యెందుచేతో చెప్పమంటే చెప్పడం (హృదయైక గోచరం

కనక) కష్టంగాని మొదటి దానికంటె యీతల్లి క్రింద సమాసం హృద్యం. పేర్లు మార్చాలి. మధ్యమ పదలోప విగ్రహం. కల్పవృక్ష ( తుల్యం ) రామాయణం. ఫలితార్థం వొకటే. రాముని పవిత్ర చరిత్ర అనేకులకు ( కల్పవృక్షం వలె ) అనేక విశేషాలను తోపింప చేస్తుంది. కనకనే (1) వాల్మీకి రామాయణం, (2) అధ్యాత్మరామాయణం, (3) ఆనంద రామాయణం (4) చమత్కారరామాయణం, యీలా వ్రాస్తే వ్రాసినకొద్దీ పేర్లు స్ఫురిస్తూనే వుంటాయి. యిందులో వొకటి రెండు నెంబర్ల రామాయణాలకు కర్త వొకరే అని ఆ గ్రంథాలవల్ల గోచరిస్తుంది. కాని గాథలలో ప్రధాన పాత్రలు సీతా రాములు గాని, తక్కిన సోదరులు భరతాదులు గాని మాఱరుగాని గాథలు యేతాం పెట్టుగా వుంటాయి. ద్వాపరయుగాం తంలోవున్న వ్యాసుడు త్రేతాయుగంలో కూడా వుంటాడు. అయితే యీ శంక స్తనంధయులకు ( చంటిపిల్లలకు ) కూడా గోచరించే శంక, ఆ గ్రంథకర్తకు స్ఫురింపకుండా వుంటుందనుకోవడంకన్న అవివేకం వుండదు. కనక దాని సమన్వయ విధానం మనకు తెలియలేదనుకోవడమే యుక్తం.

ప్రస్తుతకల్పవృక్షం అసలు రామాయణ పాత్రలమీదనే, ఆపాత్రలకు సంబంధించిన గాథలమీదనే ఆధారపడి వుందిగాని మురారీ, రాజశేఖరుడూ, భవభూతీ, వగయిరా మహాకవులు నాటకరచనలో చూపిన స్వాతంత్ర్యం కలిగి వుంది. ఆస్వాతంత్ర్యం గ్రంథం చదివితే తెలిసేదే. ప్రారంభం దగ్గఱనుంచీ గోచరిస్తుంది యిప్పటికింకా నామధేయం దగ్గిఱే వున్నాం. కల్పవృక్షత్వేనా రూపించడం హృద్యమే. అయినా రూపణంలో కొన్ని విశేషాలు లేకపోలేదు. వున్నాసరే దీన్ని విశ్వనాథరామాయణం అనాలని నాసలహా. కవిపేరు సత్యనారాయణకదా యింటిపేరు పెట్టడం యెందుకంటే జవాబు చెప్పలేను గాని నాకు అలా తోచింది. యింతే నా జవాబు. నా మొదటిపేరు వెంకటచలం. కొన్నాళ్ళకు దిద్దుకుంటే వేంకటాచలం. చదువుకున్నాక వేంకటశాస్త్రి. కవిత్వం చెపితే వేంకటకవి

తుదకు వెంకన్న వెంకడు ఆఖరికి నాపేరిటి చిరంజీవి చెళ్లపిళ్ల అయినాడు.

యీ కవి తండ్రి అఖండ శివభక్తుడు. దాత, కాశీవెళ్ళి; ఆరోజులలో కాశీవెళ్ళడమంటే సుఖసుఖాల లేదు - "కాశీకి వెళ్ళినవాళ్ళు కాటికి వెళ్ళిన వాళ్ళు" అంటూ వొక లోకోక్తి సుప్రసిద్ధం, అట్టి కాశికి వెళ్ళి విశ్వేశ్వర లింగాన్ని తెచ్చి స్వగ్రామంలో ఆలయం గట్టించి అందు ప్రతిష్ఠించిన పుణ్యపురుషుఁడు. యింటిపేరు విశ్వనాధ కావడానికి హేతువిదేకాదను కుంటాను. అంతకు పూర్వమే - (ఆయీవిషయం శిష్యుణ్ణి అడగాలి) కాశీనాధునివారన్నట్లు వుండివుండాలి ఆవున్నపేరు యీ పుణ్యపురుషుడు యీ శివలింగప్రతిష్ఠద్వారా సార్థకపఱిచాడు. ధూపదీపనైవేద్యాలకు కొంత భూమికూడా యిచ్చాడు. విశ్వనాధ విశ్వేశ్వర శబ్దాలు రెండూ పర్యాయాలే కనక విశ్వేశ్వరుడు అనేపేరుతో ప్రతిష్ఠించినట్లు తోస్తుంది. ఈఅంశం మంగళాచరణంలో తుట్టతుదనువున్న 'విశ్వేశ్వరా' అనే సంబుద్ధివల్ల బుద్ధికితట్టుతుంది. వెల్గునొకడే సేవింతు విశ్వేశ్వరా అనడంచేత విశ్వేశ్వ రుడు వేఱున్నూ ఆ ఈ వెలుగు వేఱూ అని స్థూలదృష్టికి గోచరించడం దోషం కాదు. ఈ విశ్వేశ్వరుడు త్రిమూర్తులలో వొకడు. ఆ వెలుగు త్రిమూర్తులకూ అతీతం. ఉపనిషచ్ఛ్రుతిప్రతిపాద్యం. దానికి నామరూపాలు లేవు. "వన్జజ రుద్రాదులు మత్తనువుల" అని వైష్ణవులు దేన్నివిశేష్యం చేస్తారో అదే యీవెలుగు శైవులుకూడా ఆపద్యభాగాన్ని వారి పరశివ బోధకంగా వాడుకోవచ్చు.

ప్రస్తుతం తనతండ్రిగారు భేదబుద్ధితో ప్రతిష్ఠించిన విశ్వేశ్వరుణ్ణి సంబోధించి మంగళాచరణ ప్రతిపాద్యమైన వస్తువును గ్రంథకర్త శ్రీ మంజూషిక లోనైన విశేషణాలతో భూషిస్తున్నాడు.

1. శ్రీమంజూషిక 2. శ్రీ చుంచువు 3. ప్రసవంబు 4. పాత్రీ యాంశువు 5, మేఖల 6. శ్రీమంతము. ఈ ఆఱూ విశేషణాలే. తుట్ట తుదిది తప్ప తక్కిన అయిదు రూపకాలు, దాన్నిబట్టి అలంకారం రూపకం. కాని అంతతో ఆలంకారికబుద్ధి విరమించదు. భేదేఽప్యభేదరూపా అతిశ

యో_క్తిశ్చ. యింకా యేవేనా వుంటే వుంటాయేమో? ఆది అలంకారులకు వదుల్తాను. యెందుకు వదలడం అంటే? నేను కవిని గాని ఆలంకారికు డను కాను గదా?

..........................................................................................

సత్యనారాయణ కవిత్వం చాలా బింకంగా వుంటుంది.

శా. శ్రీమంజూషిక భ_క్తరక్షణకళా శ్రీ చుంచు వానంద వ
ల్లీమంజుప్రసవంబు చిద్గగనపాళ్రిలేయాంశువున్ మోక్షల
క్ష్మీమాణిక్య వినూత్నమేఖల కటాక్షీభూత నీహారరుక్
శ్రీమంతం బయి పొల్చు వెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా?

తఱచుగా శిష్యుడికవిత్వం యీ శైలిలో వుంటుంది. యింతకంటే మె_త్తనివి చాలా తక్కువగా వుంటాయిగాని బిరుసుగా వుండే పద్యాలు యెక్కువ.

"ఉ. ఒక్కడు శిష్యు డింక నొక, డో; పరికింప బ్రశిష్యుడయ్యె........
వారుచె, ప్పెక్కిరి కోకిలమ్ము లయి...." (గిరతంచూ.) వెం. శా.

ఉ. చుక్కలు రాల లేవు రవి, సోముల పోకడ మాఱలేదు నల్
దిక్కులు కూలలేదు....రామకృష్ణకవు, లర్భకు లేగతి జేయనే_ర్తురా,
ధిక్కృతవైరి వేంకటను, ధీకవిమౌళికి శృంగభంగమున్.

(తి. శా. గిరతమే చూ.)

ఆయీ మూడుపద్యాలూ బాగా విమర్శకతా తాత్పర్యంతో పరిశీలించే వారికి - గురువుల రచనకన్న శిష్యుఁడి రచన చాలా ప్రౌఢంగా వుందా, లేదా అంటే: వుందనక తప్పదు. అయితే గురువులరచన "లోకులరస నలె యాకులుగా" నుంటుంది. శిష్యుఁడిదో? అట్లుండదు. కొంతమందికే (ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా) హృద్యంగా వుంటుంది. సంస్కృతపద భూయిష్ఠంగా వుండడమే కాదు కారణం. అర్థంలోకూడా కొంత గాంభీర్యం వుంది. సమాసరచనకూడా నన్నయ్యది సుళువుగానే

వుంటుంది. "మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంప దలు" చూ. మాదికూడా చూపిస్తాను.

"మాకన్నన్ మహనీయులైన కవు లీక్ష్మామండలిన్ లేకపో
రీకాలమ్మున యుష్మదీయ కవితా ద్వీపంబు ముంచంగ న
స్తోక శ్రీక మదాశుధారకవితా తుంగార్భటీ ఘోరగం
గాకల్లోలవతీ ప్రవాహభర వేగప్రక్రియల్ చాలవో. (తి. శా.)

"ఉరువేగ స్ఫురణాగపాటన పటుద్యోవాహినీ వార్ఝరీ
పరిణాహోరభటీ పటాత్కృతులకున్ బ్రభ్రష్టసారంబు లౌ
తరుషండమ్ములు నిల్చెనేని భవదుద్యద్వాగ్ఝరాసార పు
ష్కరకోలాహలమున్ సహింపఁ గలుగున్ గా కవ్యహంకారముల్"

(వెం. శా.)

శిష్యుఁడిదికూడా, అంతగా వెదికికాదు యథాలాభంగా దొరికినదే వుదాహరిస్తాను.

"వినిపించుం బ్రతినాఁటఁ బ్రొద్దుట బహిర్వీధీ పురోద్యానధా
త్రిని నభ్యాసము సేయుచో రఘుశిశుక్రీడా భుజాస్ఫాల ఘ
ట్టన విస్ఫారిత శింజినీ పటుధనుష్టాంకార ఖాంకారముల్.
పునరాయాత పునఃప్రయాత ఖగరాడ్భూజాగ్రి ఫీట్కారముల్."

అయీ గురుశిష్యుల పద్యాలు మూడూ సంస్కృత సమాసభూయిష్ఠాలే అయినా ప్రతిపదార్థం సామాన్యులకు యిందులో యేవీ కావు కాని శిష్యుఁడిది మఱీ కొంతకష్టం. నిజంగా వ్రాస్తున్నాను: శిష్యుఁడిపద్యంలో నాలుగో చరణం ప్రతిపదార్థం చెప్పవలసిందంటే చెపుతానుగాని భావం నాకు కానేలేదు. యీ పద్యంమాత్రమే కాదు. కేవలం తెలుఁగుపదాలతో నిండిన పద్యాలలో కూడా నాకు అర్థంకానివి - లేదా భావంకానివి చాలా వున్నాయి. అలా కాకపోవడం రచననిపట్టి మాత్రమే కాదు. భావాన్ని పట్టికూడా అని నేననుకున్నాను.

అతని కవిత్వంలో ఆంగ్లకవుల భావాలు కొన్ని దొర్లుతా యనుకో వాలి. యితడు ప్రధానంగా చదివింది ఆంగ్లంగదా ? విశేషించి యితఁడు స్వభావోక్తికే ప్రాధాన్యం యిస్తాఁడు రచనలో. యేవిషయం ప్రస్తావించినసూ హంసవింశతికవి మాదిరిగావాని అట్టపుట్టాణాళ్లతో వివరించి వివరించిదుంప దెంపిగాని వదలిపెట్టఁడు. ఆయీ విషయంలో యితని అనుభూతి అపారం.

నాకు వ్యాసరచనలో యీ చేదస్తం వుందిగాని కవితారచనలో సూత్రప్రాయంగా పోవడమే యిష్టం. అందుచేత ఆభాగం నేను చేద స్తంగానే భావిస్తాన్నాను. దక్షిణాది గాయకుల రాగాలాపనవలె యేదో యింకాపాడవలసినవి కొన్ని అందాలు నిలవవున్నట్టు తోపించడమే నామతం. వీలిచ్చినంతలో శబ్దాలకు ప్రాధాన్యం యివ్వక అర్థానికే యిస్తే "పండిత పామర సాధారణ్యేనా" ఆకవిత్వం ఆనందజనకంగా వుంటుం దని నేను తలుస్తాను.

"బ్రతికిన నాల్గునాళ్ళు ఋతవాది యుధిష్ఠిరుఁడన్న మేటి కీ
రితి గలవాఁడనై ధరఁ జరించి తుదిన్నృపకోటి మెచ్చ దు
ర్గతి గనకుండ స్వర్గమునఁ గాపురముండఁ దలంచు నాకు నీ
యతు కొనరించితే కట కటా ! యదునందను పేరుమీఁదుగన్."

ఆయీ పద్యమైతే నారచన కాదు (తి. శా. ది) గాని నాకుయీలాటి రచనే యిష్టం. అయితే లోకంమాత్రం యిది తి॥ శా॥ రచన కాదనిన్నీ—

"పటుఝంఝానిల ధోరణీ రణరణ త్ప్రాగ్భార నున్నాటవీ
తటశాఖా పటలాంతరుద్గత నితాంతస్ఫారఘోరాగ్నిరు
ష్టుటనాధూపిత భస్మసాత్కృత కురుట్కాండమ్ముతో వహ్నికిన్
ఘటియింపం దలపెట్టినారుగద సఖ్య మ్మార్య చూడామణుల్."

యిది తి. శా. గారి రచననిన్నీ చెప్పుకుంటారు. "లోకము మూయను మూకుడున్నదే ?" సత్యనారాయణ కవిత్వం యావత్తూ ప్రౌఢ (కొఱుకఁబడని) శైలిగానే వుంటుందని నా వ్రాఁత కర్థం చేసుకో కూడదు. తేలికగా వుండే భాగాలు కూడా చాలావున్నాయి.

"నన్నేతాదృశుఁ జూచి మంత్రులును నానాభృత్యులున్ దూరమై
చన్న న్నీవయి నిల్పికొంచుఁ దుదియాశన్‌స్వామి! యేకాకినై
నిన్నే ధ్యానము చేసికొంచు నిటఁగా నీవచ్చితిన్ మంతువో?
నన్నున్ దేల్తువొ! దైవమున్ బురుషయత్నం బొగ్గి మార్పింపవే?"

ఈ పద్యం త్రిశంకుఁడు మాలవాఁడుగా శపింపఁబడి విశ్వామిత్రుఁడు దగ్గిఱికి వెళ్ళి యజ్ఞం చేయించవలసిందని చెప్పికొనే సందర్భం లోది. నాలుగో చరణంలో లోకోక్తి యిమిడించ బడింది. వ్రాసేది పురాణగాథే కనక నూటికి తొంభై పద్యాలూ యీ శైలిలోవుంటే సర్వులకూ అందుబాటులో వుండేది. యిపుడో? వసుమనుచరిత్రల పాకంలో వుండడం చేత కావ్యపాకంగా వుందని నాతలఁపు. వసుమను చరిత్రల పోలిక కావ్య శైలికే. నేను బందరులో హైస్కూల్లో 'బడిపంతులు' గా వున్నప్పుడు ఇనస్పెక్టర్లు నా వర్కును గూర్చి రిమార్కు చేయడంలో "యింతపండితుఁడు యీ స్కూలుకు అవసరం లే" దని వ్రాసినట్లు విన్నాను. యితణ్ణి గూర్చి నేను చేసే రిమార్కు కూడా అట్టిదే అని ప్రాజ్ఞులు భావింపఁ గలరు. (విమర్శకుఁడు అనే గూఢనాములు వినా) శిష్యుఁడని అనుగ్రహం ప్రకటించే యెడల రేపు యేదేనా కారణాంతరం కలిగి ద్వేష్యుఁడుగా మాఱితేనో? ద్వేష్యం కవిత్వంకూడా కావలసిందే కదా? అందుచేత వ్యక్తిగతమైన ఆగ్రహానుగ్రహాలు వారివారి రచనలయందు ఆపాదించడం నావని గాదు. లోకం నన్నుగూర్చి యెట్టి అభిప్రాయం కలిగివుందో నాకు తెలియదు.



# కంఠశోష

( ది 18—5—1946 సం॥రం కృష్ణాపత్రికనుండి )

వార్ధక్యంలో నాకు యీ పీడ తప్పింది కాదు. అయుక్తంగా నన్నే కాదు, యెవరిని యెవరు విమర్శించినా సహించి వూరుకోవడం నాకు చేతకాదు. అది యీ కంఠశోష క్కారణం. యిదిన్నీ కాక నాకు సాక్షాత్తు గాను ఏకలవ్యప్రాయంగాను స్కూలు ద్వారాగాను ఏర్పడ్డ శిష్య ప్రశిష్య గణం — వందా, యేభైకాదు — చాలా వుంటుంది. యేదేనా శబ్దమో అర్థమో తప్పని యెవరేనా అంటే దాన్ని గూర్చి నేనేం వ్రాస్తానో అని నా యీ విద్యావంశం నిరీక్షించడం తప్పదు. ఒక శిష్యుడు రామాయణ కల్పవృక్షమనే వొక వుద్గ్రంథం రచించాడు. అతడు సమర్థుడు, శిష్టు, ఆంగ్లభాష ప్రధానంగా చదివినా ఆంధ్రగీర్వాణాలలోనూ ఘట్టుడు. శాస్త్రజ్ఞుడుకూడాను. అవిద్వత్కవికాడు. నిషధయోగ్యుడు పెద్దలయెడ భక్తుడు. అతని మీద నా బాల్య గురువుగారి కెందుకో ఆగ్రహం కలిగి అతని గ్రంథాన్ని విమర్శనమనే పేరుతో నానా అశ్లీల వాక్యాలతోనూ దూరుట కారంభించారు. అందులో —

" శ్రీ మంజూషిక భక్తరక్షణ కళాశ్రీచుంచు వానంద వ
ల్లీ మంజుప్రసవంబు జిద్గగన ప్రాలేయాంశువున్ మోక్షల
క్ష్మీమాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూతనీహారరుక్
శ్రీమంతంబయి పొల్చువెల్గు నొకదే సేవింతు విశ్వేశ్వరా"

అనే మంగళ పద్య సంబోధనలో వి + శ్వ యీ రెంటికీ యేదో ( పక్షీ కుక్క ) అపార్థం కల్పించీ కల్పించనట్లు నటించారు. మఱిన్నీ ఆ పద్యంలో మూడు శ్రీకారాలు వున్నవంటూ వాటికి అప్రసక్తంగా వీరు విషార్థాన్ని సూచించారు. యేదో " పాముకాటు " అంటూ గ్రంథకర్తకు తాకేలాగు లిఖించారు. ఆ పద్యాన్ని వెక్కిరిస్తూ అర్థశూన్యంగా ఒక పద్యాన్ని రచించారు. యిదంతా మంగళపద్యంలో ముచ్చట - యింకో

పద్యం శ్రీ ముక్త్యాల యువరాజాగారిని వర్ణించినది. సీసంవుంటే దాన్ని వెక్కిరిస్తూ ఒక పద్యం "చిట్టూఁకదంపెనా –" అంటూ రచించి ప్రకటించి వేళాకోళం చేశారు. "చిరునవ్వు నవ్వేనా చిన్నారి ముత్యాలు" అని శిష్యుఁడి పద్యం. దీన్ని ఈ విధంగా వెక్కిరించడం యెందుకో, మంగళ పద్యాన్ని ఆ రీతిగా వెక్కిరించడం యెందుకో నాకు బోధపడలేదు. యెవరేనా కలిగించుకొని అడిగితే వారికి కోపం వస్తుంది. అందుచేత యెవరూ కలిగించుకోడానికి భయపడతారు. నేను విధిలేక కలిగించుకొన్నాను. గ్రంథకర్త శిష్యుడుగదా నాకు. నా అసమర్థత్వాన్ని రుగ్ణతాప్రియుక్తమైనదాన్ని పూర్తిగా యెఱిగి వుండిన్నీ, వీఁడు కోర్టుకు వచ్చే స్థితిలో లేడుగదా అని తెలిసి వుండిన్నీ వీడికి యిదే ప్రాయశ్చిత్తం అని భావించి వీడి పాండిత్య రోగాన్ని కుదర్చడానికి యిదే ఉపాయమని కాబోలు లీగలు నోటీసుకూడా యిప్పించి వున్నారు. ఆ యీ సంగతి బెజవాడ కోర్టు న్యాయవాదులు విని వారి అసంతుష్టిని యావన్మందీ చేవ్రాళ్ళు చేసి, శాంతి సందేశం అనే పేరుతో జన్మభూమి పత్రిక ద్వారా తెల్పి వారి కర్తవ్యాన్ని వారు నెఱవేర్చుకొని వున్నారు. గురువుగారు దానికేమి జవాబిచ్చారో నాకు తెలియదు. నేను మాత్రం వినయ పూర్వక విజ్ఞప్తి అనే శీర్షికతో వారికి జవాబును జన్మభూమి పత్రిక ద్వారానే పంపినాను. ఇది ఇప్పుడు వ్రాయబోయే వ్యాసానికి పూర్వచరిత్ర. యింతలో విమర్శకుడు అనే కల్పిత నామంతో ఒకానొకరు దేశసేవ అనే పత్రికలో తలకు తగనిమాటలు ( ఆవులూ - దూడలూ గుంజ సామెత చూ. ) వెంకటశాస్త్రిగారి విజ్ఞానం అనే శీర్షికతో వెలువరించారు. ఆయన నన్ను "చదువుకుంటే బాగుపడతావు" అనే అర్థమిచ్చే మాటలతో మందలించారు. దాన్ని నేను శిరసావహించడమైతే జరిగింది గాని అమలుజరపడానికి యీ కూప కూర్మానికి యీనాశయ్యాగృహానికి వచ్చి చెప్పేవారు దొరకడమే తరవాయి –" –అఱవై యేళ్ళువచ్చి చదువుకోక...." అనే లోకోక్తికికూడా నా వయస్సు (76 కనక) అతిక్రమించింది. భవతు.

యిప్పుడే కాదు భవిష్యజ్జన్మలోకూడా ఆ యీ చదువునే నేను అభిలషించ
డం విమర్శకుఁడుగారూ యెఱఁగే వుంటారు. అయినా వుటంకిస్తాను.

మ. జననా భావ మనుగ్రహింపు మది నీ శక్యమ్ముగాదేని పై
జననమ్మందును నాకొసంగుమెటులో సంగీత సాహిత్యముల్
................................................................కామేశ్వరీ.

యిఁక ప్రధానాంశం ప్రారంభిస్తాను. శిష్యుఁడు మంగళ పద్యంలో
పరమాత్మ తేజస్సుకు — "భక్తరక్షణ కళాశ్రీచుంచువు" అని విశేణం
వేశాఁడు. ఆయీ విశేషణానికి సంప్రదాయ విరుద్ధంగా - విగ్రహ వాక్యం
వ్రాశారు. అసలు విమర్శకులు. అది అయుక్తమని వ్రాసే నా వాక్యాలలో
"ఈచుంచువు" ప్రత్యయంగాని రామాదులవంటి స్వతంత్రశబ్దంకాదు,
అని వ్రాశాను. ఆ యీ వాక్యంలో — "ఈ" అని విస్పష్టంగా హస్త
నిర్దేశం వుంది, దానివల్ల ఆ యీ మంగళపద్యంలో వున్న చుంచువు అనే
అర్థం నియమేనా లోయరు తరగతి విద్యార్థులకు కూడా గోచరిస్తుంది.
కాని యీ క్రొత్త విమర్శకుఁడుగారికి, యద్వా వడ్డీవారికి, గోచరించక
వెం. శా. చుంచువు ప్రత్యయమే కాని భాషా ప్రపంచకంలో యెక్కడా
స్వతంత్రశబ్ద మంటూ లేనేలేదన్నాడంటూ, ప్రచారం సాఁగించారు.
దానమ్మ కడుపు కాలితే వెం. శా. కి లోకంలో - "చుంచు" అనే దుర్వాసన
గొట్టే యెలక వొకటి, లేదా యెలకవంటి ప్రాణి వుందని యీ ప్రాయంలో
కూడా తెలియదా? అంతవఱకేనా వొప్పుకుంటే దాన్నిచెప్పే శబ్దం
వుండాలా? వద్దా? శాంతం పాపం. యిట్టి విమర్శకులతో "అధాత్తు వాద"
చుంచువులతో యీ వార్ధక్యంలో వాది ప్రతివాది భావం యేదో పాపం
చేసుకోకుండానే ఘటిస్తుందా? ఘటించదనే చెప్పాలి. "ఫలాను మేయాః
ప్రారంభాః" విమర్శకుఁడుగారు నాకు కొన్నిపాపాలు ఆపాదించి వున్నారు.
దీన్నికూడా ఆ జాబితాలో చేర్చవలసిందని విజ్ఞప్తి.

ఏకాక్షరప్రదాతారం..................కోటిజన్మసు. ఆయీ శ్లోకం వుదాహ
రించారు. దీనికి అపవాద శ్లోకాలు వున్నాయి అని జ్ఞాపకం చేస్తాను.

(1) శత్రోరపి గుణావాచ్యా, దోషా వాచ్యా గురోరపి. (2) గురో రప్యవలిప్తస్య కార్యాఽకార్యమజానతః ఇత్యాదులు అపవాదులు చాలా వున్నాయి. ఉత్సర్గాపవాదలు యేవిధంగా సమన్వయించుకోవాలో మీ మాంసకులవల్ల తెలుసుకోవాలి. అదిన్నీకాక శ్లోకస్థం " అవమన్యతే " అంటే అర్థం తెలిసే వుంటుంది గాని, అది స్వయం కృతాపరాధం గాని. అన్యకృతంగాదు. యేమంటే, సర్వథా పెద్దలూ పూజ్యులూ అయినవారు వెక్కిరింపులతోనూ ధిక్కరింపులతోనూ, ప్రశిష్యుణ్ణి అవమానించడానికి వాని కవిత్వాన్ని సర్వథా అయుక్తంగానూ అనాలోచితంగానూ విమర్శన మను పేరుతో తొందఱపడి దూఱడంగదామీ 'అవమన్యతే' అనే దానికి మూలసూత్రం. ఆయీ వుద్యమం భగవంతుడు ఆమోదించే పుణ్యకార్యంగా మీకు తోఁచి దానిలో వారుపడిన పొరపాటును వివరించడం పాపకార్యంగా గోచరించడం విచారణీయం కాకపోదు. అదిన్నీ కాక ' భక్తరక్షణకళా శ్రీచుంచువు ' అనే చోట మీరు చాలా అసత్యోక్తులు వ్రాశారు. నీళ్ళలో గేదెనుబెట్టి బేరం చెప్పడమెందుకు ? మీ వాక్యాలే చూపెట్టుతాను. " శ్రీ కృష్ణశాస్త్రిగారీ ప్రథమ పద్యమందే చుంచు చిట్టెలుక చూరెలుకను స్ఫురింపజేయు చుంచు శబ్దము వేయుట మంచిదికాదను నభిప్రాయ మున...." అంటూ వ్రాస్తారే ! మీకు అసత్యమంటే లవమేనా లేశమేనా లవలేశమేనా భీతివుందా ? శివ శివ ! వారు వ్రాసింది చూపుతాను. ' భక్తరక్షణమను కళాలక్ష్మికి చుంచువు అయినవాడు ఇందు మూడు శ్రీలు ఒక లక్ష్మి ! ....శ్రీకనేకార్థములు ..........' అంటూ శ్రీశబ్దాన్ని గూర్చి వారి దృష్టి ప్రసరించిందే కాని చుంచుమీదికి ప్రసరించిందనడానికి బోధకం ఒక అక్షరం కూడా వారి విమర్శనలో లేనేలేదు. ముఖముంది అద్దముంది, యెందుకీ అబద్ధాలు వ్రాసి ఆత్మవంచనకు సిద్ధపడతారు ? "అసూర్యానామయేలోకాః" చూ.... అది విమర్శకులకు " భక్తరక్షణ కళా శ్రీచుంచువు " అనే చోట చుంచువు ప్రత్యయమనేది స్ఫురించి వుండలేదని వారు చెప్పిన ' కళాలక్ష్మికి చుంచువు అయినవాడు ' అనే

విగ్రిహమే వేయినోళ్ళతో చెప్పుతూవుంది. వ్యాకరణ సంప్రిదాయంగా విగ్రిహం తెలిసినవారు భక్త భక్తుల యొక్క, రక్షణ రక్షించడమనేది. కళాశ్రీచుంచువు కళాలక్ష్మిచే ( సంపత్తుచే ) ప్రిసిద్ధుడు అనికదా వ్రాస్తారు. 'లక్ష్మికి' అని షష్టితో విగ్రిహం చూపి చుంచువును విడదీయరు. ముందుగా కవి హృదయాన్ని వ్యాకరించి అనంతరం మార్గాంతరంచేత వచ్చే అపార్ధమో అశ్లీలమో చూపెట్టడం సహృదయ సమ్మతంగా వుంటుంది. అప్పటికీ పెద్దలు ఈ విగ్రిహాన్ని బ్రితికించినా దళదాడి మాదులవలె వమ్మగునేకాని సమన్వయించవు. కళాశ్రీకి యెలక, లేదా పిల్లి, యద్వాకుక్క, అధవా యేనుగు, సింహం. కొండ, మామిడిపండు, భగవంతుడు, నస్యం, బీడీ, సిగరెట్టు - యెందుకీ అర్ధాలు! వచ్చినవారు రానే వచ్చారు. చుంచువు స్వతంత్రిశబ్దమైనపుడు చెప్పే అర్ధం వివరించి తద్వారా వచ్చే అశ్లీల దోషాన్ని వ్యాకరించండి.

గతంలో నేను భారతాదులు చూపి సమర్ధించిన ప్రియోగాలను మీరు స్పృశించి 'భాషామంజరీ సమాప్తా' పాండిత్యాన్ని కొంత ప్రక టించివున్నారు. వాట్ల జాబితా మళ్ళీ యిక్కడ కొంచెం చూపుతాను. చిత్తగించండి:— ఝరి, బిరుదు, ఏనివి, కొమిరె, జంతువులేగిరి ( ఇట ఏగెనుకాదు ఏగిరి అనియే ), అందచందములు, శోభనం పేదసాదలు ( సాదులు కాదు ) కంజముఖీకబరీ.........నందదము, ఏతద్బొబ్బిలి, ప్రియాగ, ఊహ, దరిసెనం, రాజితప్రేమ, స్త్రీలనుగూర్చి, - పదీ ఐదూ కాదు, వందలు. ఇవన్నీ మీరు తప్పులుగా సమర్ధించే భారం పూను కొంటే నా కదే పదివేలు వీటిలో బాగా నిలుస్తాయని మీకు ధైర్యంగా వున్నవి నిర్దేశిస్తే మీకు సంతుష్టి కలిగేటట్టు జవాబిస్తాను. మీకు పూర్తి జాబితా కావాలంటే చెరలాటంలో వుంటాయి చూచుకోండి. దాని అవాం తరభాగం అరణ్యరోదనంకూడా పరిశీలించండి. సంస్కృత శ్లోకంలో ద్వితీయ చరణాంత్య తృతీయ చరణాదులకు సంధికలపవచ్చునేమో ఆలోచించండి. 'పరభృత్' అనేది కోకిలకు వాచకమవుతుందేమో విచా

రించండి. ' అవధానిప్రభృతులు ' ఏడుద్వీపాలువంటిదికాదు. మీరు బూకరిస్తున్నారు. అది సిద్ధ సమాసం. జాగ్రత్త. దేశమింకా పండితశూన్యం కాలేదు. మీ మీద చాలాభారం వుంది. అబద్ధాలుమాని పరాక్రమించండి. విషయం ప్రధానం.



# రా మా య ణ క ల్ప వృ క్షం

( ది 17–3–1947 సం॥రం ఆంధ్రపత్రిక వీక్లీనుండి )

నేను ప్రత్యక్షరశోధగా విశ్వనాథరామాయణం బాలకాండ చదివి చూచాను. గ్రంథకర్తకు యెంత సంస్కృతసాహిత్యం వుందో; యెంత తెలుగు సాహిత్యం వుందో; తబిసీలుగా - కాదు, కాదు, మూకవుమ్మడి గానేనా వివరించడానికి నాకు అంతు చిక్కలేదు.

"తత్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్" అనే నన్నయ్యగారి వాక్యం మనస్సులో పెట్టుకొని వ్రాసే వ్రాఁత గాని, యిది యేదో చిన్ననాఁడు శిష్యుఁడుగదా అనే ప్రేమతో వ్రాసే వ్రాఁతకాదు. ఆయీ శైలి పరిశీలించే యెడల నావాక్యం అభిమానప్రయుక్తమో యథార్థ జ్ఞానప్రయుక్తమో : మీకే తెలుస్తుంది.

"నిష్ఠావర్షదమోఘమేఘపటలీ నిర్గచ్ఛదుద్యోతిత,
ప్రేష్ఠేరమ్మదమాలికాయుగపదు జ్జృంభన్మహాఘోరబం
హిష్ఠస్ఫూర్జథుషండ ఘుర్ఘురరవా హీనక్రియాప్రౌఢి, ద్రా
ఘిష్ఠంబై యొకరావ మంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్."

యీ పద్యం శివధనుర్భంగ ఘట్టంలోది. యిదే శైలిలో వోజో గుణానికి ప్రథమోదాహరణంగా వరసగా మఱి నాలుగు పద్యాలున్నాయి. రసారసవిచారం పెట్టుకోవద్దు. "పంచశుభం, పంచాశుభమ్" గా తయా

రవుతారు మహానుభావులు - లోకంలో. ఆత్మవంచన లేకుండా మాట్లాడే వారు బహుతక్కువ. అందుచేత ఆవిచారానికి పోనే వద్దు.

ఆయీ, "ష్ఠా" ప్రాసతో యేదో భావాన్నిగూర్చి యేకసమాసంలో సంస్కృతవ్యాకరణ దోషరహితంగా రచన సాఁగించే తెలుఁగుకవులు వొక్కొక్క శతాబ్దానికి వొక్కరేనా వుంటారా? అనేదే నా ప్రశ్న యీ రచన పురాణపాకం కాదని వ్రాయనే వ్రాశాను. ఇట్టివాణ్ణి విద్వత్కవి అనడానికి, యే విద్వాంసుఁడు వెనుదీస్తాఁడు? "విద్వత్కవయః కవయః, కేవలకవయస్తు కేవలం కపయః" అనే అభియుక్తోక్తిలో యితఁడు మొదటి తరగతికి అర్హుఁడు కానిపక్షంలో, ఈ శతాబ్దంలో యింకొకరు కాఁగలరా? యితఁడు నాకు శిష్యుఁడంటే; యేలాటి శిషుఁడు - "స్కూలు శిష్యుఁడు" మాత్రమే. హైస్కూలు వదలి కాలేజిలో చేరి, బి. యే. ప్యాసయి, తెలుగులో యమ్. యే. ప్యాసుచేసి కాలేజీలలో లెక్చెరరుగా పని చేసినపిమ్మట రచించినరచన, యీకల్పవృక్షం. ఆకారణంచేత స్వయంకృషిచేత యెంతో పాండిత్యాన్ని అభివృద్ధి చేసుకుని, తయారయి నాఁడని వ్రాయనక్కఱ లేదు; యిందునుగూర్చి రచనే సాక్ష్యమిస్తూవుంది- ఆయీఘట్టంలో వున్న సమాసఘూయిష్ఠ పద్యాలే కాదు, సర్వత్రా యీలా టివి వున్నాయి.

తెలుఁగురచనలో నెఱసులు యేరవలసివస్తే, నన్నయ్య మొదలు పిన్నయ్యవఱకూ, సర్వులూ దొరుకడతారు. యెందుచేతంటే - తెలుఁగు "మాదిగమంచం". దీనికి తలగడదిక్కునీ, కాళ్ళకడ దిక్కునీ విభజన లేనట్టే తెలుక్కీ వొక తోవా తెన్నూ లేదు. - "కాదన్నవాఁడు కరణం" అన్నలోకోక్తి దీనిపట్ల బాగా సమన్వయిస్తుంది, సమర్థించడానికి - తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది" గదా? "నికృష్టంపుం జంపు చంపి" అనేది భారతమో, లేక భారతాన్ననుసరించిన మాపయోగమో, పుస్తకం చూడాలి. ఆయీ ప్రయోగంలో రెండు "చంపు" ప్రయోగాలే కాక, తుదను 'కెడపితి ననుమీ' అనే ధాతువుకూడా వుంది. దానికి

(కెడపితిన్) యిదే అర్థం. యిక్కడ శంకకు బోలెఁడు అవకాశం వుంది. వుంటేమాత్రిం కవిబ్రహ్మ తిక్కన్నగారి ప్రయోగాన్ని కాదనే మొనగాళ్ళంటూ వుంటారా ? – "వైయాకరణాః పిశాచాః, ప్రయోగ మంత్రేణ నివారణీయాః". అయితే ఆయీ అభియుక్తోక్తి శబ్దసాధుత్వానికే కాని అర్థికాలకు వుపకరించ దనుకుంటారేమో ? అది పొరపాటు; ఉపలక్షణతయా గ్రహించాలి, అన్యత్రి యివి యెప్పుడో వ్యాకరించిన విశేషాంశాలే ప్రస్తుతం యెంత విద్వత్కవీ తెలుక్కవిత్వంలోకి అడుగు పెడితే మిశ్రి సమాసం ప్రయోగించాఁడనో, క్త్వార్థకేకారానికి సంధి చేశాఁడనో, ఆక్షేపించడానికి అవకాశం యిస్తూనే వుంటాఁడు. – "తల వున్న వాళ్ళందటికీ పే లుంటాయి" కనక, యీ విషయం కేవలాన్వయి. దీన్ని అనుభవజ్ఞులు గణించరని, అంతేకాదు, గణించడం అభిజ్ఞతకు కళంకమని, నా ఆశయం. ఆ యీ ఘట్టంలోన్నుంచే తెలుఁగురచనక్కూడా స్థాలీపులాకంగా కొంచెం వుదాహరించి చర్చిస్తాను.

క. కప్పెడు కప్పెడు చీఁకటి
విప్పని దారిఁబడి చనుప వెడలినరీతిన్
జప్పరములు శకటమ్ములు
దెప్పలుగా నగుచు బయలుదేఱె వరుసగా.

దీనిలో రెండు పదాలు మాత్రిమే తెలుఁగు కాదు. కాని తక్కినయావత్తూ తెలుఁగే. ఇట్టిశైలిగల పద్యాలు యీ రామాయణంలో యెక్కడఁ బడితే అక్కడ దొరకవు కాన మృగ్యం. —

సీ. ముకుళీభవద్రక్త మోహనాంభోజాత
పత్త్రాగ్రకాంతి సంబంధకములు
గేహనిర్గచ్ఛత్సతీహారి పాదలా
క్షాముగ్ధవర్ణసంఘర్షణములు
కింశుకానోకహాకీర్ణ ప్రసూన సం
బాధశోభావరిమంజులములు

మాకందతరుపేటికా కిసలయ నీల
శోణకాంతి చ్ఛటాక్షోదకములు.
తే. గీ. ప్రివిలసత్కోకనద నవప్రథమపత్ర
సత్రిపారాగవల్లి కాసంశ్లథములు
పర్ణశాలా కబందక పటల నీవ్ర
గళనమృదువులు, సాంధ్యరాగములు నడచె.

ఆయీ సీసంలో వున్న సమాసాలు వినీవినడంతోనే కాదు, చక్షుర క్షరసంయోగంగా బాగా పరికించినా తాత్పర్యం కావడం దుర్ఘటమే. తుట్ట తుది చరణం సాంధ్యరాగములు అనేపదంతో చిహ్నితమై వుంది కనక పైచరణాలు యావత్తూ దాన్నే బోధిస్తాయని మూకవుమ్మడిగా అవగాహన చేసుకోవలసిందే. యింత ప్రౌఢంగా యీ పిదపకాలంలో కవిత్వం చెప్పఁగలవారు గాని. చెపితే దాన్ని ఆస్వాదింపఁగలవారు గాని, నాయెఱిఁగినంతలో మృగ్యులే. యితఁడు వుపయోగించే ప్రాసాక్షరాలు నూటికి తొంభైయినప గుగ్గిళ్ళు.

క. అప్సరసయైన మేనక
లిప్సామధుమూర్తి కాకలీకలకేకా
వీప్సాకీర్తనఁ బాడెఁ గ
కుప్సమ్మార్జనము భావకూలంకషమున్.

యీలాటి ప్రాసలు యెత్తుకొని పద్యం పూర్తిచేయడానికి పిండి చాలా వుండాలి. "ఇఁకఁ బదివే లొసంగెదను నిందుకుఁ బద్యము చెప్పు సత్కవీ" అని ప్రశ్నిస్తే-"ఇఁకఁ బది లక్షలిచ్చినను నిందుకుఁ బద్యము లేదు భూవరా!" అనే యితి హాసానికి సంబంధించిన ప్రాసతే యితఁ డెత్తుకొంటాఁడు. కవిత్వ సారస్యానికి, ఆయీ, యెత్తుకోవడం దోహదమని చెప్పేది లేదుగాని, పాండిత్యప్రకర్షకు, బోధకమని చెపుతాను. గ్రంథారంభ ఘట్టంలో —

మ. అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగమస్మాదృశం
డలఘుస్వాదురసావతారధిషణా హంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి, శిష్యుఁడయినా డన్నట్టి దావ్యోమ పే
శలచాంద్రీమయకీర్తి చెళ్లపిళ వంశస్వామికున్నట్లుగన్ "

అనే పద్యం గురువునుగూర్చి వ్రాసినా ఆత్మోత్కర్షాపాదకముగా వుందని ప్రతిపక్షులే కాదు, యితరులుకూడా ఆక్షేపించడానికి వీలుగా వుంది. — వుంటే వుందిగాక, నేను నిజంగా గర్వించడానికి పనికొచ్చే శిష్యులలో యితఁడొక్కఁడని చెపితే అసూయారహితులు వొప్పుకోక పోరనియే నా నమ్మిక. — స్వప్రకర్షనుగూర్చి కవులలో అంతో యింతో చెప్పుకోనివారు లేనేలేరు. కొందఱు కొంత గూఢంగా చెప్పుకున్నారు. కొందఱో, బాహాటంగానే ( పండితరాయలశ్లోకం "ఆమూలాద్రత్నసానోః" వగయిరా చూ. ) యింతే తేడా. దీన్ని గుఱించి. — 'కవిసింహగర్జిత ములు' అనే పొత్తంలో వివరించుటచే, సూచించి విడుస్తూన్నాను. దీన్ని గూర్చి మా ముత్తాత నరసకవిగారు —

ఉ. ఏ నిటువంటివాఁడ నని యెన్నిక కావ్యకథానులాపసం
ధానమునందు, శాత్రవ విదారణమందు, వధూసమక్ష, మా
ఖ్యానమునందు, యుక్తమటు గాన ప్రశంస యొనర్చితిన్ మదా
ఖ్యానము రామచంద్రకృప గాదె ? మహాత్మ లెఱుంగకుందురే ?"

అన్నారు, వేంకటేశ్వరవిలాస ప్రారంభఘట్టంలో; తద్రీత్యా శిష్యుఁడు చూపిన ఆత్మోత్కర్షయుక్తమే. అతని గ్రంథం నిష్కల్మ షాంతఃకరణతో పఠిస్తే, ఆ మాట వ్రాసుకోవడానికి అర్హుండే అని ప్రతీ సహృదయుఁడికీ తోఁచకపోదు. ఇప్పటికి తెలుఁగులో వున్న రామాయణా లలో యిది మంచి స్థానమే సంపాదించుకుంటుందని నా హృదయం. కథాసంవిధానంపట్ల అగ్రస్థానాన్నే అలంకరిస్తుంది. ! ప్రసాదగుణం పట్లమాత్రం —

సీ. పావనాకార ! గోదావరీదేవి ! నీ
వెఱిఁగింపు మమ్మ ! రాజేంద్రుతోడ
నో జనస్థానమహీజ సంఘములార !
నా పాటు చెప్పరే నాథుతోడ.

ఉ. ఏ జనకాత్మజన్, దశరథేశ్వరుకోడల రాముభార్యఁ జూం
డో జనులార ? అడ్డపడ రో సురలార ! సురారి కంచు నం
భోజదళాక్షి శైలవన భూములు చూచుచు నేగువేళఁ దా
నీజలరాశిఁ జూచి మది నెంత తలంకెనొ ; యేమిసేయదున్.

"చ. ఎఱుఁగుదుఁ బద్మబాంధవ కులేశుఁడు పంకజనాభుఁ డౌట........"

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడ యెగ్గొనరించిన దానికై కదా ?
చెఱఁగొని వచ్చితిన్ బిదప సీత వృథా కథ లింకనేల ! పెం
పఱ బ్రిదుకంత తీయన ఖరాదులచావున కేమి గాని నీ
మఱఁదలి బన్న మేపగిది మానిని ! యీఁగుదు సంధి చేసినన్ "

ఆ యీ శైలిలో వున్న భాస్కరరామాయణానికి లోఁగుతుంది. ప్రౌఢమార్గంలో అన్ని రామాయణాలనీ యిదే అతిక్రమిస్తుంది. అదే రామాయణగాథ ; అవే మఱికొన్ని గాథలు ; అవే పాత్రలు. అయినా కేవలం క్రొత్తవస్తువుగా తయారు చేయడమనేది యెంతేనా శ్లాఘ్యం. సంస్కృతాంధ్రాలలో అసాధారణమైన ప్రతిభను ప్రకటిస్తూ వున్న యీ కల్పవృక్షంలో - అఖండయతులు గాని, మఱికొన్ని నియమోల్లంఘనములు గాని, పాండిత్యలోప ప్రయుక్తములు కావు; అవి కేవలమూ బుద్ధిపూర్వకంగా చేయవలెనని చేసినవే. ఇతఁడు వాడిన సంస్కృతసంధులు సంస్కృత కవులుకూడా వాడనే లేదు. తత్సమరూపాలు, జనువు, ధనుసు, అనడుహాము, లోనైనవి పూర్వకవుల గ్రంథాలలో కనపడవు. తుట్టతుదిది అనడ్వాహము అనవలెనేమో ? — అని నాకు తోఁచినది. ఆ యీ విషయంలో యితఁడు బాగా స్వతంత్రించాఁడు. యే వొకటి రెండో

తప్పు తక్కినవన్నీ పూర్వవ్యాకరణానికి లోగేవే. నా శిష్యులలో యింత జిగిబిగి ధార కల కవులు లేరు సరిగదా ;, మా ( తి. వెం. ) ధారకూడా యీ విషయంలో యితని ధారకు లొచ్చే. యితని కవనాన్ని వ్యాకరించ డానికి చాలా పిండి వుండాలి. ఆ యీ నా వ్రాఁతయందలి సత్యాన్ని ప్రాజ్ఞులు గ్రహించి యితని నాశీర్వదింతురుగాక !



# శ్రీ బెల్లంకొండ రామారాయకవి

( ది 30—3—1946 సం॥రం ఆంధ్రవాణి నుండి )

బెల్లంకొండ-యీపేరుతో గుంటూరు డి॥ లో బెల్లంకొండ వొక కొండో, లేక వొకవూరోవుంది. యింతేకాదు, యీ యింటిపేరుగల నియోగుల కుటుంబాలు కూడా కొన్నివున్నాయి. అందులో వొకానొక కుటుంబం వారు నర్సరావుపేట తాలూకాలో - పైడిపాడులో వున్నారు. వీరుఅగ్రిహారీకులు; నిరతాన్నదాతలు మర్యాదస్థులు ఎబ్బెటూ్రి. "మీఁదైనాకరంబుంట మేల్గాదే" అనే పోతన్నగారి పద్యభాగానికి ప్రిథమోదాహరణంగా చెప్ప తగ్గవారు. యింకను వీరింగూర్చి వ్రాియతగ్గ విశేషాలు కొన్ని వుండక పోవు; కాని నాకు స్థూలదృష్ట్యా వినికిడివల్ల తెలిసిన వింతవఱకే. అయినా నేను ప్రిస్తుతం వ్రాియదలచింది బెల్లంకొండవారి వంశచరిత్రిం కాదు. ఆవంశీకులలోనే కొలదికాలంకిృిందటనే అవతరించిన వొకానొక - వరప్రసాదిని లేదా, సహజపాండిత్యుని అస్మదాంతరంగిక మిత్రునిగూర్చి మాత్రిమే. యీయనపేరు రామారాయకవి. గ్రింథాంతపుగద్యలలో కవి పదంతో పేరు చిహ్నితంగా కనపడుతుంది. లోకవాడుక - రామారావుగారు అనియ్యేవే. యీ యిరవయ్యోశతాబ్దంలోనే కాదు, గతించిన వొకటిరెండు శతాబ్దాలలోకూడా యిట్టిప్రతిభాశాలి; జన్మించనేలేదేమో ? యింకోమాట,

యీ రామారావుగారివంటి మహాపండితులు వుంటేవుందురుగాని, ఆయా విద్యలు కావు శాస్త్రిలు స్వయంకృషిచే స్వగృమందే యుండి —

చ. గురుకులవాసమున్ జరిపి, కూరిమి మాధుకరంబు వారముల్
జరుపుచు, నమ్మగాని యొకసాధ్విని అమ్మయటంచు బాబటం
చౌరులను గొల్చి నేర్చితిమి యొండొక శాస్త్రము పండితుల్ సెబా
సుర! యనిమెచ్చ బద్యములు శ్లోకములున్ రచియింతు మాశుగన్.

(గుంటూరిసీమ)

అనే పద్యపూర్వభాగానికి వుదాహరణం కాకుండా శాస్త్రిలు సాధించిన ప్రతిభాశాలి యీ రామారావుగారే అని చెప్పుటలో అతిశయోక్తి వుండదనే నా నమ్మిక. యీాయన సంస్కృతంలో శతాధిక గ్రంథకర్తగా వాడుక కలదు. అందులో ముద్రితమైనవి పదికూడా వుండవేమో! నేటికి సుమారు ముప్పైయేళ్ళకు పూర్వం గ్రంథకర్తగారు తమశిష్యుఁడు జూపూడి హనుమచ్ఛాస్త్రిగారిచే అభిప్రాయార్థం రెండు ముద్రిత గ్రంథాలు బందరులో వున్ననాకు పంపివున్నారు - అందులో వొకదానిపేరు - కృష్ణలీలా తరంగిణి అనిజ్ఞాపకం. యింకొకదానిపేరు బహుశః రుక్మిణీపరిణయమై వుండాలి. యివిరెండూ చాలాధారాశుద్ధికలవిగా వుంటాయి. అభిప్రాయం వ్రాసి పంపేలోగా అవాంతరం వచ్చింది - వ్యాసంతుదనుదాన్ని గూర్చి వివరిస్తాను. వివరించకపోయినా గోచరిస్తుంది —

"సాకిం నరమ్యాస చకిం నరస్త్రా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా" యీాయన జీవించిన కాలం యావత్తూ ముప్పైయాతేండ్లు మాత్రమే. భగవద్గీతా శాంకరభాష్యానికి యీాయన విపులమైన వ్యాఖ్య వ్రాశారు. దాని పీఠికలో శ్రీయుతులు పాటిబండ వేంకటరమణయ్య పంతులువారు వీరి వయస్సునుగూర్చి వ్రాసి వున్నారు. మేము (తి. వెం.) వీరిని నరసారావుపేట సభలో నొకపరి చూచాము. అంతే. అన్యోన్య సంభాషణ భాగ్యము లభించలేదు - "సతాం సద్భిస్సంగః కథమతిచ పుణ్యేన ఘటతే"

అన్నాడు భవభూతి. దీన్నిగూర్చి తుట్టతుదను వివరిస్తాను. వివరించక పోయినా గోచరిస్తుంది. యింత స్వల్పవయస్సులో యిన్ని శాస్త్రాలు సాధించి ఆ శాస్త్రగ్రంథాలమీఁద వ్యాఖ్యానాలుకూడా వ్రాయడాన్నిపట్టి చూస్తే యీయన సాక్షాత్తూ అపరశంకరాచార్యులే అని చెప్పవలసివస్తుంది. దానికి తథ్యంగా ఆదిశంకరుల గీతాభాష్యంమీఁద శ్రీరామానుజులు లోనైన విమతస్థులు ఆచార్యపురుషులు క్లిష్టమార్గములు తొక్కి ఖండించిన ఖండనలు యీయన తృణప్రాయంగా ఖండించి శంకరసిద్ధాంతాన్ని నిల్పివున్నారు. యీరామారావుగారు షష్టిగడియలూ విద్యావ్యాసంగమే చేయడాన్నిబట్టి ఆరోగ్యం లోపించి 36 వత్సరాలలోనే పరమపదించవలసి వచ్చిందనుకుంటాను. శంకరునికీ యీయనకూ యీవిషయంలోకూడా పోలికవుంది. తుదిరోజులలో శ్రీపాటిబండ వేంకటరమణయ్యపంతులవారి ప్రోత్సాహంచేత గీతాభాష్యవ్యాఖ్య కొంతవఱకు (ప్రథమషట్కంమాత్రం) ముద్రితమయింది. ఆముద్రణం ప్రారంభమైన స్వల్పకాలంలోనే గ్రంథకర్త పరమపద మలంకరించుట సంభవించింది. పిమ్మట వేంకటరమణయ్య పంతులవారు ప్రథమషట్కం పూర్తిగా ముద్రించి నుతిపాత్రులైనారు. అటుతర్వాత విశ్వదాతగారు పూనుకొని ద్వితీయషట్క తృతీయ షట్కాలు పూర్తిగా ముద్రించి పండితలోకాన్ని సంతోషపెట్టినందుకు గ్రంథకర్తనేకాక ముద్రాపకులను కూడా పండితులు మిక్కిలిగా అభినందించవలసి యున్నది. యీరామారావుగారు వ్యాకరణశాస్త్రం తొమ్మిది మాసాలలో చదివి ముగించినట్లు వినికిడి. ఆభాష్యాంతం పాణినీయం సవిమర్శంగా గురుముఖతః చదవవలసివస్తే తొమ్మిదినెలలు కాదుగదా — తొమ్మిదేళ్ళుకూడా చాలవు - యీయన చదివినవ్యాకరణం అల్లాటప్పా చదువా ? కాదు - వ్యాకరణశాస్త్రానికి శిరోభూషణమైన - సిద్ధాన్తకౌముదికి శరదాత్రి అనేపేరుతో వ్యాఖ్యానం వ్రాయడానికి తగినంత పాండిత్యంతో సంబంధించింది - పూర్వకాలంలో మహాభాష్యంమీఁద వ్యాఖ్యానం వ్రాసే కుతూహలంతో భట్టోజీదీక్షితులు ( సిద్ధాన్తకౌముదీకర్త ) తదేక

దీక్షతో గురువుగారివద్ద మహాభాష్యాన్ని మళ్ళామళ్ళా అఱవైనాలుగుసార్లు చదివినట్టున్నూ, ఆఖరుసారి చదువుతూ వుండగా - కైయటుఁడు ఆదీక్షితులుగారి గురువుదగ్గిఱకే మహాభాష్యం చదువుకునే నిమిత్తం వచ్చి తనకు దీక్షితులతో కల్పి మహాభాష్యాన్ని చెప్పవలసిందని కోరితే గురువుగారు అబ్బా? నీకితనితో సహపాఠిత్వం కుదరదు. యిప్పుడితడు చదివేది అఱవైనాల్గోసారి, నేడోరేపో విద్యార్థిత్వం చాలించి యితడు వెడతాడు; తరవాత నీకు ప్రత్యేకించి ప్రారంభించి చెపుతాను. కొలది నాళ్ళల్లో మళ్ళా రావలసిందన్నట్టున్నూ పిమ్మట కైయటుఁడు యింటికి వెళ్ళక ఆగురుసన్నిధియందే వుండి ప్రతిరోజూ దీక్షితులు చదువుకుంటూవున్న మహాభాష్య పాఠాన్ని విని ఆలావిన్నంతలో తనబుద్ధికి అవగతమై తోచిన వేవేనా విశేషాలుంటే యింటికి వచ్చి రావడంతోనే వ్రాసి భద్రపఱచేవాఁడనిన్నీ ఆవిధంగా అఱవైనాల్గవసారి దీక్షితులు భాష్యాన్ని పూర్తిగా చదివేటప్పటికి కైయటుఁడు భట్టోజీ యింకా యెప్పుడో స్వగ్రామానికివెళ్ళి తయారుచేయదలచుకొన్న మహాభాష్య వ్యాఖ్యానాన్ని అతఁడు గురుసాన్నిధ్యం వదలనిపూర్వమే సంసిద్ధంచేసి గురువుగారికి రహస్యంగా చూపేటప్పటికి గురువుగారు చాలా సంతోషించి అబ్బాయీ నీబుద్ధిమత్త అనన్యసామాన్యం. నీవ్యాఖ్యానం పండితులు శిరసావహిస్తారు. కాని భట్టోజీ యీమహాకార్యం చేసే కుతూహలంతో చాలా పట్టుపట్టి అఱవైనాలుగు సార్లు దీన్నిచదవడం నీవు విన్నదే. అతఁడు చేయదలచుకొన్న పనిని నీవు చేయడం చేత నీకేమేనా హానిచేస్తాఁడేమో? వాఁడు మహారాష్ట్రుఁడు. మహారాష్ట్రులు శూరులు గనుక నీవ్యాఖ్యానం నాకిచ్చి నీవు సత్వరంగా యింటికి వెళ్ళిపో; నేను మెల్లిగా వానికి నచ్చచెప్పి ఆయీవ్యాఖ్యానపు వ్యాపారమునుండి వాణ్ణి మళ్ళిస్తాను; నీవ్యాఖ్యానం లోకవ్యాప్తికి తెస్తాను. అని బోధించి కైయటుణ్ణి పంపించి తరువాత భట్టోజీకి కైయటుణ్ణి గురించి ఏలాచెప్పాలో ఆలాగు నయాన్ని భయాన్ని వొప్పచెప్పేటప్పటికి గుర్వాజ్ఞను బట్టి అంగీకరించాఁడనిన్నీ భట్టోజీకి వుత్సాహభంగం అయినప్పటికీ

ఆకృషి వ్యర్థంకాక శబ్దకౌస్తుభం అనే గ్రంథరచనకు కారకమయిందనిన్నీ "శబ్దకౌస్తుభం" మహాభాష్యంకంటేకూడా పెద్దది కావడంచేత చదువు కొనే వాళ్ళకు సూక్ష్మంలో మోక్షం కలిగించేటట్టు కనపడక లోగడ అజవైనాలుగుసార్లు మహాభాష్యం గురుముఖతః చదవడమేకాక శబ్ద కౌస్తుభం రచించడంవల్ల వ్యుత్పత్తి మతీయెక్కువై పాణినీయసూత్రి వార్తికభాష్యాల యావత్సారమూ పన్నెండువేల పరిమితి గ్రంథంలో యిమిడ్చి సిద్ధాంతకౌముదిని రచించి పండితలోకాన్ని వుద్ధరించినట్టు పండితపరంపర చెప్పగా వినడం. మహాభాష్యంమీఁద కైయటుఁడు వ్రాసిన వ్యాఖ్యానం కైయటమనే పేరుతో యిప్పుడు పఠనపాఠాలల్లో వుంది. దీక్షితుల శబ్దకౌస్తుభం యావత్తూ వుత్పన్నం కాలేదుగాని అష్టా ధ్యాయిలో ప్రథమాధ్యాయ ప్రథమ పాదానికి మాత్రం నిలిచివుంది. పాఠప్రవచనాలు జరగడం లేదనే చెప్పవచ్చు. చెప్పొచ్చేదేమిటంటే మన రామారావుగారు తొమ్మిదిమాసాలు తమయింట్లో పురుటహిళ్ళ రామశాస్త్రుల్లు గారు (వీరు జగత్ప్రసిద్ధులయిన భాగవతుల హరిశాస్త్రుల్లుగారి శిష్యులు, మాకన్న కొంచెం వయస్సులో పెద్దలు) అనేవారిని నిల్పుకొని వ్యాకరణ గ్రంథాలు చదివి ఆ చదువుతో శరదాత్రి అనే పేరుతో కౌముదికి వ్యాఖ్యానం వ్రాయడాన్ని పరిశీలిస్తే లోఁగడ వుదాహరించిన కైయటోపా ధ్యాయులకు దీటుగా గౌరవించవలసిన వారనడంలో అత్యుక్తి వుండదు. ఆవ్యాఖ్య ముద్రితం కాలేదు. కనక నేను చూడలేదు. గీతాభాష్యంమీఁద వ్రాసిన వ్యాఖ్యనే చూచాను. నేను చూచిన దానివల్ల యీరావుగారికి వ్యాకరణవేదాంతాలే కాక తగుమాత్రం తర్కప్రవేశం కూడా వున్నట్టు గోచరిస్తుంది. పైఁగా సంస్కృతం శ్రీమద్భాగవతంలో ప్రతిశ్లోకమున్నూ యీయనకు హృత్కవిలి, శాస్త్రసహాయంవుంది. కనక భాగవతం వ్యాఖ్యా నాలు సహాయంతో అన్వయించుకోవడంగాని దాన్ని ధారణలో వుంచు కోవడంగాని యీకుశాగ్రబుద్ధిశాలికి పొకగగనంకాదు, శాస్త్రాలు సాధిం చడమే గగనం. అందుకుగా యీయనచేసిన గురుశుశ్రూష చాలాస్వల్పం

అదేనా వ్యాకరణానికి మాత్రమే. తక్కిన వేదాంతాదులకో? కేవల స్వయంకృషే, చాలా ఆశ్చర్యంకాదా? ఉపాసనబలకుండా “అనభ్యాసే విషం శాస్త్రమ్” అనే అభియుక్తోక్తిని కాదనలేదు - సహజ పాండిత్య శాలుల కవిత్వాలు పరిశీలిస్తే శాస్త్రజ్ఞానం లేని లోపాలు కనపడుతూ వుంటాయి. యీయన మహాకవి, కాని సంస్కృతంలో రచనసాగించడం చేత రచన విశేషించి లోకవ్యాప్తికి రాలేదు. శ్రీనాథాదులు గొప్పవిద్వాంసులై కూడా అప్పటికప్పుడే (నన్నయాదులమూలాన్ని) లోకం తెలుఁగులోకి యెక్కువగా బుద్ధిని మరలించడాన్ని గమనించి తెలుఁగుకవిత్వానికే ప్రాధాన్యాన్ని యిచ్చి రచన సాగించారు యెంత సంస్కృతవిద్వాంసుఁడున్నా కాకపోతే శ్రీనాథుఁడు గౌడడిండిమభట్టును వోడించి అతని బిరుదాన్ని కంచుఢక్కాని ఫెళ్ళున పగలగొట్టించగలడా!

మన రామారావుగారు ఆగర్భ శ్రీమంతు లవడంచేత తమ కవిత్వంచేత రాజులను సంతోషపెట్టవలసిన ఆవశ్యకత్వం లేకపోయింది - అందుచేత — “తెలుఁగు మీఁదికి నంతగ రారు వారొగిని” అన్నట్లు పేక్షించినట్లు తోస్తుంది. యెన్నడూ పదచలనం చేయని వారవడంచేత యితర పండితులతో వాదోపవాదాలు కూడా తారసించలేదు. అందుచేత గ్రంథాలవల్లనే కాని జీవితకాలంలో ఆయనపేరు స్వదేశంలో తప్ప అన్యత్ర విశేషించి వ్యాపించలేదనుకోవాలి. పైఁగా కవితా సామగ్రిలో మొట్టమొదటిదిగా పరిగణితమైన — “శక్తిర్నిపుణతాలోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్” అనే లాక్షణికోక్తి యందలి లోకజ్ఞత్వం కూడా కొంత తక్కువగానే కనపడుతుంది — వారికీ మాకూ దైవవశంచేత వచ్చిన— పశ్య శబ్దవిచారంలో యిదే వారిని కొంత బాధించింది — కొంచెం యిక్కడ విస్తరిస్తాను. పోతన్నగారు తమ భాగవతంలో — కృష్ణలీలలు చాలా (యావత్తూ) పెంచి వ్రాశారు. ఆ చేష్టలు లోకంలో పెంకిరాలుగాయి కుఱ్ఱాళ్ళు కూడా చేస్తారని తోచదు - సంస్కృత భాగవతంలో వున్నదల్లా - “మేహనాదీనికురుతే” అన్నంతవఱకే; “మిహసేచనే” అనే ధాతు

పాఠాన్నిబట్టిచూస్తే మేహానం – అల్పాచమానం. ఆది శబ్దంవల్ల దానితో
సంబంధంగలది మఱొకటి వ్యాఖ్యాతలు వ్రాసింది. మీపిల్లాఁడు మా
యింటికివచ్చి మేము చక్కఁగా అలికి ముగ్గుబెట్టుకొన్న ప్రదేశాలు ఖరాబు
చేస్తున్నాఁడని గోపికలు యశోదతో చెప్పినట్లుమాత్రమే. దీన్ని
సూత్రంగా పుచ్చుకొని పోతన్నగారు చాలా భాష్యం వ్రాశారు – కాని
హేయంగా లేకుండానే వ్రాశారనుకోవచ్చును. కాదుకూడదంటే కొంచెం
హేయంగానూ వుందనేది కేచిన్మతంగాని సార్వత్రికంకాదు – ఆయన
మహాభక్తుఁడు. భక్తిపరవశత్వంలో లేఖిని ఆ విధంగా నడిచింది. అంతే.
రామారావుగారు తెలుఁగు భాగవతంచూచివుంటారని ఆ యీ విషయంలో
వారి రచనవల్ల గోచరిస్తుంది. చాలా పచ్చిగానూ మోటుగానూ విస్త
రించారు. అవి వుదాహరించడానిక్కూఁడా వీలుగావు. సంస్కృతం కనక
గాని తెలుఁగే అయితే యింకా యేలావుండేదో!–

మనుబాలికా ++ బిలేశవాత్మజో
నిదధే కరాంబురుహే మధ్యమాంగుళిమ్ ”

ఆ లీలల్లో యిది కాస్త మృదువు. యిక్కఁడనేను దీన్ని వుదాహ
రించడం దేనికంటే ? – ఆయన ధారయెంత నిరాటంకంగా సంస్కృతంలో
నడుస్తుందో విజ్ఞులకు చూపడానికే, మా మా వివాదలప్పుడు కూడా అంతటి
వానికి యీ స్వల్పాన్ని ద్రోషంగా వుపపాదించడం ఔదార్య భంగమనిచెప్పి
వూరికే బెదరించడంతోటి సరిపెట్టేవాళ్ళంగాని యావత్తూ వుదాహరించే
వాళ్ళంకాము. గాని తుదకు బయటపెట్టడం కూడా జరిగిందేమో. బాగా
జ్ఞాపకం లేదు. మూడు పుష్కరాలు కావచ్చింది. దీనివల్ల ఆయన శాస్త్రజ్ఞ
త్వంగాని వేఱొకటికాని లేశమూ భంగించవు. అసలు వివాదకు బీజం –
“ పశ్యశబ్దం ” కౌముదినిబట్టి ఆ యీ శబ్దం సాధువే. మేంతప్పనడమే
తప్పు. అప్పుడేకాదు. యిప్పుడేకాదు, ఎప్పుడూ నేను యిలాగే చెప్పటం
నలుగురెఱిఁగిందే. కౌముదిన్నీ దాని వ్యాఖ్యానం మనోరమయున్నూ
పుట్టక పూర్వం బాగా ప్రచారంలో వున్న గ్రంథం – కాశికావృత్తి – యీ

వృత్తికి మహాభాష్యం తరవాత మళ్ళా అంత గౌరవమూవుంది. కాని సంగృహీతమైన కౌముది ప్రచారంలోకి వచ్చాక యీ వృత్తి పఠన పాఠాలలో లేనేలేదు - యెవరేనా చూచుకోవాలంటే గ్రంథాలయాలలో వుపలబ్ధమౌతుంది. అంతే. యీ గ్రంథ రీత్యాబట్టి - పశ్యశబ్దం శుద్ధతప్పు వెనకాల వుపసర్గవున్న ప్రపశ్య - విపశ్య ఉత్పశ్య యివి సాధువులు. మేము సభలో అవధాన భారంలో వున్నప్పుడు తప్పనడం ఆ యీ గ్రంథాలన్నీ పరిశీలించికాదు —. యేదో వాణి అలా అనిపించింది. ఆ సమస్య రామారావుగారిని అడిగి ఆ సమస్యను తెచ్చుకున్నతఁడు యే రఘువంశమో చదువుతూవున్న విద్యార్థి గాని అంతకు పైవాఁడు కాడు. కాని మమ్మల్ని యేలాగేనా వంచించాలనే ప్రముఖుల సహాయం బోలెఁడువున్నవాఁడు. కనక మళ్లా రామారావుగారి దగ్గిఱికి వెళ్ళి తప్పుకాదు అనిపించుకోవడమే కాకుండా ఆయన్నికూడా వాదించడానికి సభకి తీసుకవచ్చాఁడు. పలువురు ప్రముఖుల కోరిక నిరాకరింప జాలక వచ్చారేకాని రామారావుగారికి రావడం యిష్టంలేదు. అప్పటికి మేమూమేము కలుసుకోకపోయినా మాకు అన్యోన్యమూ చాలా గౌరవ ప్రపత్తి వుంది. ఆలాగే కాకపోతే రావుగారు అభిప్రాయార్థం వారి పుస్తకాలు పంపడం ఘటింపదు కదా? సరే, సభలో పశ్యశబ్దం తప్పనడం జరిగింది. ఆ ప్రశ్నగాక మఱొకటి అడిగాడా విద్యార్థి. శతావధానం 12 గంటలకులోఁగా పూర్తిఅయింది. బసకు వెళ్లాక మా విద్యార్థులెక్కడో అడిగి కౌముది తెచ్చారు. చూచారు - పశ్యశబ్దం తప్పుకాదు - తప్పనడమే తప్పు అని తేలింది. వున్న తమాషా అంతా యీ పయినేవుంది. వ్రాస్తే చాలా పెరుగుతుంది. గుంటూరిసీమ సవిమర్శంగా చదివితే తెలిసేదే. దాన్ని మళ్లా తవ్వడం అనవసరం. క్రియలో మన దేశంలో వున్న సుప్రసిద్ధ వ్యాకరణ విద్వాంసులు అప్పటికి సహస్రమాసజీవులైనవారు కూడా ఆ యీ వాదంలో కాలుపెట్టడం జరిగింది. గాని తుదకు - కౌముదికన్న కాశికావృత్తికే ప్రామాణ్యం దుర్వారమయేటట్టు వాదించి; మేము విజయాన్ని సంపాదించినా ఆ యీ విజయం

జాతక గ్రహబలంవల్ల కలిగిందనడంచేత రామారావుగారికి అపజయాన్ని ఆపాదించేది కాదని నేను స్పష్టంగా వప్పుకుంటూన్నాను. మేము తప్ప కుండా గోతులో పడ్డామని ప్రతిపక్షులు భావించి యెక్కువగా పరాక్రమించారు. దైవమన్యత్ర చింతయేత్ - అయినది. పశ్యశబ్దం వొకటి ఱత్వఘటిత దుర్ణయశబ్దం వొకటి యివి రెండున్నూ నేను - "మయి జల్పతి కల్పనాధినాథే రఘునాథే మనుతాం తదన్యదైవ" అన్న మాదిరిని చేశాను. అనగా మహా విద్వాంసులు మూడువందలయేండ్లనుంచి నిర్దుష్టంగా అంగీకరించిన పశ్యశబ్దాన్ని తప్పుగా నిరూపించాను. సుమారు నూట యేభైయేళ్ళనుంచి తప్పని సిద్ధాంతీకరింపబడ్డ — దుర్ణయశబ్దాన్ని వొప్పుగా ( తెలుఁగులో మాత్రమే ) సమర్థించాను. యీ రెండు విషయాలకూ కొన్ని పుస్తకాలు చదివితే తెలుస్తుంది. కనక స్పృశించి విడుస్తున్నాను. ఎందుచేతంటే ఎంత తగ్గించి వ్రాసినా యిది ఆత్మోత్కర్షా పాదకంగా నేకనబడుతుంది గనక యీ శబ్దాలకు సంబంధించిన వాదం జరిగి యిప్పటికి మూడు పుష్కరాలు కావచ్చింది. యింతవరకు మా సిద్ధాంతమే నిల్చి వుంది. భవిష్యత్తులో యేమవుతుందో. "నందోరాజా భవిష్యతి" ఆ యీ రెండు వాదాలలోనూ నేను శాస్త్రంతోపాటు లౌకికాన్ని కూడా వుపయోగించాను. కనక యెదటివారి పాండిత్యంకంటె నా శాస్త్రజ్ఞత్వం యెక్కువదని విజ్ఞులు భావింపకుండుటకయి యిందుటంకించాను. ప్రస్తుతం రామారావుగారు విశేషించి లోకానుభవంకలవారు కాకపోవడానిక్కారణం వారు అస్మదాదులవలె కాక ఆ గర్భ శ్రీమంతులగుటయే.

నసశబ్దోనతద్వాచ్యం నసావిద్యానసాకలా
జాయతేయన్న కావ్యాంగ మహోభారో గురుః కలేః"

అని వుండడంచేత వారి కవిత్వమందు ఆ యీ లోటు కనపడితే కనపడుతుందేమో కాని, పాండిత్య సంబంధమైన లోటు లేశమూ కనపడదని నా దృఢ విశ్వాసం. కవిత్వం లోకాదరణపాత్రం కావాలంటే దానికి కావలసిన సామగ్రిలో నూటికి తొంభైవంతులు లోకజ్ఞానమనిన్నీ, తక్కిన

పది వంతులలో యే రెండు మూడు వంతులో శాస్త్రజ్ఞానాదులనిన్నీ పైని వుదాహరించిన లాక్షణిక శ్లోకం ఘోషిస్తూంవుంది. రామారావుగారు నిర్దుష్టమైన — పశ్యశబ్దాన్ని లగించి సమస్య యిస్తే దాన్ని యేదో విధంగా పూర్తిచేసేస్తే తీరిపోయేది. ఆలా చేయక తప్పనడం యెందు కంటే, అ యీ సందర్భం వివరించవలసివస్తే చాలా వ్రాయాలి. అవ ధానంచేసేవాడికి వొక్క కవిత్వంతోటేకాదు, ఆశుధారతోటే కాదు, ధారణా శక్తితోటేకాదు కాపురం తుదనెగ్గదు. చాలా శక్తులు వుండాలి. సభికు లలో యే వొక రిద్దఱో తప్ప తక్కిన యావన్మందిన్నీ అవధానికి సుము ఖులుగా వుండాలి. అవధాని యెడల పృచ్ఛకులకు భయంకూడా వుండాలి. అడిగే ప్రశ్నలలో చాలా వఱకు యేవో అవకతవకలతోటే వుంటాయి. ఆలాటి ప్రశ్నలు మృదువుగానే ఖండించి, విశేషించి మనస్సునొచ్చ కుండా పృచ్ఛకుణ్ణి మందలించడంలో అద్భుతమైన చాక చక్యం వుండాలి. దాన్ని నేను ప్రాక్టికల్‌గా చూపించగలనుగాని వ్యాఖ్యానించలేను. అది అనిర్వాచ్యంగా వుంటుంది - అదే ప్రతిభంటారు. సర్వాతీతమైన ధారణా శక్తిన్నీ ఆశుకవితాశక్తిన్నీ వున్నమీఁదట ఆయీప్రతిభ వుండాలి. అవధా నికి "ప్రజ్ఞాం నవనవోన్మేష శాలినం ప్రతిభాం విదుం" మొత్తంసభలో యే కొందఱోతప్ప, యావన్మందిన్నీ అవధానిపక్షంలో వుండేటట్లు చేసు కోవాలి, అల్పసంఖ్యాకులు విరోధులైనా అప్పుడు చిక్కుండదు, మళ్లా ప్రస్తుతం అందుకుంటాను - నాకు రామారావుగారుపంపిన సమస్యలో వున్న పశ్యశబ్దం వ్యాకరణ విరుద్ధంగా ( స్థూలదృష్ట్యా ) తోచింది. అయితే వెనకాల యేదో వుపసర్గ చేరిస్తే వొప్పుగానే పరిణమిస్తుందంటారేమో! అప్పుడు దాని తర్వాతవున్న అపశ్య అనేది తప్పవుతుంది. అప్పటింత వఱకే గోచరించింది - యీ నా వూహ కొన్ని వందల యేండ్లనాడయితే న్యాయ్యమేకాని యిటీవలకాదు. అంటే సిద్ధాంత కౌముదితో తృప్తిపడితేనే సుమండీ. ప్రతి శాస్త్రగ్రంథకర్తా తనకు పూర్వ సిద్ధాంతాలని అంతో యింతో ఖండిస్తూనే వుంటాఁడు. సవిమర్శంగా పరిశీలిస్తే ఆఖండనలలో

కొన్నే నిలుస్తాయిగాని అన్నీ నిలవవు. ఆ కారణంచేతనే యథాలాభంగా నేను కార్యాంతర నిమగ్నుడనై యుండి యుండి అన్నమాట తుట్టతుదకు శిలాక్షరంగా పరిణమించింది. యీ వాదంలో బాగా పరిశీలిస్తే యెవ్వరూ వోడినట్లుకాదు. యేమంటారా? కౌముదిని పశ్యశబ్దం సాధువే కనక రామారావుగారు వోడవలసివుండదు. కాశికావృత్తినిబట్టి, వట్టి పశ్యశబ్దం తప్పేకనక నావాదానికి భంగంలేదు — యిక గ్రంథకర్త లిద్దఱిలోనూ విచారిస్తేనో? నైషధగ్రంథకర్త ప్రయోగం (ధయాన్) సాధించాలి కనక కౌముదిలో దీక్షితులు వట్టిప్రయోగం వప్పుకున్నాఁడు. కాశికా వృత్తిని ఖండిస్తేనేకాని నైషధప్రయోగం సాధువుకాదు. అయితే దీక్షితులు కాశికావృత్తిని ఖండించేటప్పుడు అతని కాలంనాటికి పూర్వగ్రంథాలలో నెక్కడేనా నైషధప్రయోగంవంటి ప్రయోగం చూపించవలసి వుంటుంది. దీక్షితులు మనోరమా వ్యాఖ్యానంలో చూపినది అట్టిప్రయోగమే. కాశికా వృత్తికి చాలా ప్రాచీనమేకాని అది "యథాపశ్యః పశ్యతో రుక్మవర్ణమ్" అనే వేదశ్రుతిలోది కావడంచేత (ఛాందసత్వాత్సాధుః) పనిచేసిందికాదు. యీగొడవ యెంత తలిసీలుగా వ్రాసినా పత్రికాపాఠకులలో పలువురికి రుచించదు. క్రియలోమాట — యీక్షణంవఱకు కౌముదీగ్రంథకర్త కాశికా వృత్తిని ఖండించడంలో న్యాయం కనపడకపోవడంచేత కాశికాకారుఁడే గెలిచాఁడన్నమాట. మేము నాటిసభలో యివన్నీ జ్ఞప్తిలో వుంచుకొని ఆశబ్దం తప్పనకపోయినా దైవవశంవల్ల అవి మాపక్షాన్ని బలపఱిచి మావాదాన్ని (యెంతెంత పండితులు యెదటిపక్షంలో నిల్చిపోరాడినా) నిల్పి మాగౌరవాన్ని కాపాడినాయి. అప్పటి సంగతి సందర్భాలనుబట్టి కొంత తవ్వి యెలకని పట్టవలసి వచ్చిందిగాని ఆలాగే కాక ఋజుమార్గంలోనే ఆవలివారు వుండేపక్షంలో అయ్యా! పరిశీలింపక అవధానపుతొందరలో ఆలా అనవలసి వచ్చిందంటే అంతటితో అది సమసిపోయేదే; ఆయీ మాదిరి సందర్భాలు సాయంచేస్తుందనే కారణంచేత కవికి శాస్త్రాభ్యాసం ఆవశ్యకమని లాక్షణికులు వ్రాశారుగాని కవిత్వ "రసారసాలకు" శాస్త్రం

వల్ల వచ్చేమెఱుఁగు లేశమూ వుండదనే నేను చెప్తాను. కవికి లక్షణం చెపుతూ "సత్కులీన శ్శుచిర్దక్ష చ్ఛందో వ్యాకరణాదివిత్" అనిశాసించారు - యిందులోవున్న గుణాలలో యేవొకటి రెండో వుంటేనే కవిత్వం చెప్పి మెప్పందే వాళ్ళిప్పు డెందఱో వున్నారు. యింతగా కాకపోయినా క్వాచిత్కంగానేనా పూర్వమూ వుండేవుంటారు. సత్కులీనులంటే బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యంవారే అనే నియమంతో పనిలేదు. ముద్దుపళని యెవరు? శుచిః అనేది. అలాటి వ్యర్థవిశేషణమే. స్నానం చేయనివాళ్ళంటూ వుండనే వుండరు. సకాలంలోనే చేస్తే శుచిత్వానికి కారణమై అకాలములో చేస్తే అట్టిది కాకపోతుందా? నన్నడిగితే కవిత్వానికి అన్నిటి కంటెనూ అవశ్యకం లోకజ్ఞత్వం (లోకజ్ఞు భారతం చూ) అంటాను, దేశాటనంవల్ల గాని లభించదు. అది ఆగర్భశ్రీమంతులకంటె రిక్తులకు యెక్కువగా సంఘటిస్తుంది. మాపరమగురువుగారు "నాకు అన్నప్రాశనకు ద్వితీయవిఘ్న" మనేవారు గనక కవితాసామగ్రిలో దారిద్ర్యాన్ని కూడా చేర్చవలసి వుంటుందంటాను. (దారిద్ర్య మన్న విస్తారఁబు తిరుగగావలె దేశదేశాలవెంబడి శ్రీవెలయంగ సత్కవిత జెప్పెడివాఁడన బండితుండునుం గావలె........సకలమ్ము నెఱుంగగావలెన్. నానా రాజ చూ) ప్రస్తుతం మన రామారావుగారికి యీలోటు తప్ప పాండిత్యాదికంలో లేశమూ లేదని వొప్పుకోడానికి శంకలేదు. గీతాభాష్య వ్యాఖ్యానంలో విశిష్టాద్వైతమతానికి సంబంధించిన పంక్తులు చాలా తీవ్రంగా ఖండిస్తారు. యేదో మనస్సులో క్రోధం పెట్టుకొని వ్రాస్తూ వున్నట్టుకూడా స్ఫురిస్తుంది. సమకాలీనుల కయితే తప్ప అట్టి క్రోధాదులకు ఆవశ్యకత వుండదు గదా? దీనిక్కారణ మేమైవుండునో అని విచారిస్తే వీరు వైష్ణవమతం (చాలాకాలంనాఁడు పుచ్చుకున్న నియోగికుటుంబంలో వారనిన్నీ అనాదిగా గురువులుగావుండే వారికుటుంబస్థులు వచ్చినప్పుడు వారికీ వీరికీ యేవో గురుశిష్య మర్యాదలలో వివాదకారణాలు కలగడంచేత కొంత వైమనస్యం యేర్పడిందనిన్నీ కొందఱు చెప్పగా విన్నాను.) బహుశః

యిది సత్యదూరం కాకపోవచ్చును. వొకసుప్రసిద్ధ వైదికమతానికి మార్గ దర్శకులుగా వుండే శేషావతారం రామానుజులుగాని తాదృశులే అయిన శ్రీవేదాంత దేశికులుగాని యీయనముందు (వాదమేవస్తే) నిలవగలరో? లేదో? అనేమాదిరిని మతగ్రంథాలలో రామారావుగారు కృషిచేసినట్టు ఆయన వ్రాంతధోరణి చెపుతుంది. యిట్టివానికి మిక్కిలి సామాన్యులు గురువులమంటూ వెళ్ళడం విడంబనగానే వుంటుంది. అయినా పూర్వుల గౌరవాన్ని మన్నించవలసిందే అందామా? అయితే ఆపూర్వుల సిద్ధాంతా లను కూడా యీయన తృణప్రాయంగా ఖండించే సందర్భంలో అది మాత్రం యేలా సంఘటిస్తుంది. యీయన బొట్టుమాత్రం నిలువుబొట్టు పెట్టేవారు. తక్కినయావత్తూ స్మార్తమతాచారమే. యింతటి విద్వాం సుఁడు, యింతటి ప్రతిభాశాలి, యీయన సమకాలీనులలో మృగ్యుఁడనే చెప్పవలసి వస్తుంది. అంతో యింతో యీయనకు వ్యాకరణంలో గురుత్వం చేసినవారిని మా మావాదోపవాదాలలో తెలియడంచేత యిందులో పేర్కొ న్నాను. అసలు సంస్కృతభాషా ప్రవేశానికి యెవరో (నిమిత్తమాత్రం) గురువులుంటారు కాని వుండకపోరు. "అనుక్తమన్యతో గ్రాహ్యం"

"శ్లో. ఆకురుదేశం విచరే ర్మాకురు పరవాది నిర్జయేశంకామ్
స్వీకురువరమేకంమే వ్యాకురు భోవత్సశాస్త్రాణి"

అని పండితరాయలకు దేవి వరమిచ్చినట్లు చెప్పుకుంటారు. మన రామారావుగారి పాండిత్యం అట్టిదే. యీయన హయగ్రీవోపాసకులు. వీరివెన్నో గ్రంథాలు అముద్రితములే. యెవరేనా పుణ్యంకట్టుకొని పైకి తెస్తే బాగుండును. శతాధికమంటే, అందులో చాలాభాగం చిన్నవిగానే వుంటాయి. [యేఅయిదారో పెద్దవిగా ఉంటాయి. తక్కినవి సంఖ్యాపూర కాలే. ఆధ్యుఁడొక్కఁడున్న నందఱు పూజ్యులే. లెక్కమీఁదనున్న లెక్కి నట్లు ప్రధానాలే పైకివస్తే బాగుండును. భవతు. యే వేంకటరమణయ్యా పంతులవంటివారో యేనాగేశ్వరరావు పంతులవారివంటివారో పూనుకోకపో తారా? కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ.

# దుర్యోధనుడు

( ది 3-4-1946 సం॥ర జన్మభూమినుండి )

భారతం చదివేటప్పుడు ప్రతివారూ ఇతనియందు ద్వేషాన్నే ప్రకటిస్తూ వింటారు. కాని ఆదరంతో వినరు. ధర్మరాజుయందు ఆదరం చూపిస్తూ వింటారు. చరిత్ర వ్రాసే వ్యాసమహాముని కూడా ధుర్యోధనుణ్ణి ప్రేమించినట్లు కనపడదు. పాండవులు దుర్యోధనాదులకంటే దగ్గఱ చుట్టాలేమో అనుకుందామా? వుభయులూ మనుమలేకాని అందులో తేడాలేదు. అట్టి సందర్భంలో వ్యాసులకీ పక్షపాతం యెందుకుండాలి? పేర్లుకూడా చెడ్డతనాన్ని సూచించే దుర్ అనే అవ్యయంతోటే ధార్తరాష్ట్రులలో చాలా మందికి ఉపయోగించాఁడు వ్యాసులు; దీనిక్కారణం ఏమైవుంటుందో? కొంచెం విచారిద్దాం.

'గుణాః పూజాస్థానమ్' అని వుండడంచేత వ్యాసునకేమి, లోకానికేమి పాండవులయందు పక్షపాతం కలిగి వుంటుందని అనుకోవడానికి అవకాశం కనపడుతుంది, కాని యీ సందర్భంలో ధర్మరాజుకన్న దుర్యోధనుఁడు తీసిపోతాఁడా? భారతంలో దుర్యోధనుని యందు చెడ్డ గుణాలు జారత్వాదులు వున్నట్లు వ్రాయలేదు. ఇంకా బాగా పరిశీలిస్తే స్వార్థంకోసం ధర్మరాజు అబద్ధమాడినట్లు కనపడుతుంది. అయీ దోషం చేయవలసిన ఆవశ్యకత దుర్యోధనుఁడికి వచ్చినట్లే లేదు. మఱి యింక యే దుర్దోషాన్ని పురస్కరించుకొని దుర్యోధనుణ్ణి లోకం యీసడిస్తూ వుంటుందో, తెలుసుకోవాలంటే, చట్టన జవాబు చెప్పడం కష్టం. చిన్నప్పటినుంచీ పాండవులయెడల దౌర్జన్యంగా వర్తించడమే దుర్యోధనునికి పెద్ద దోషం అనుకొందామా? ఆ దోషం జ్ఞాతిత్వ ప్రయుక్తం. తన తండ్రిమీఁద వున్న రాజ్యం తనకే సంక్రమించాలికాని పినతండ్రి కొడుకులకు దానిలో భాగం వుండకూడదు అనే కారణాన్ని పట్టి ఆ ద్వేషం కలిగింది. ధృతరాష్ట్రునిమీఁద వున్న రాజ్యం పాండురాజుమీఁదనే వుంటే

ఆ ద్వేషం దుర్యోధనాదులమీఁద పాండవులకిన్నీ కలిగేదేమో ? మాతా పుత్రి విరోధాయ హిరణ్యాయ నమోనమః '. అయితే యిఁక దేన్నిబట్టి లోకానికీ, కవులకూ కూడా ద్వేష్యుఁడు కావలసి వచ్చిందో ? ఆలోచించాలి. దీనికి యెంతో ఆలోచించ నక్కఱలేదనే నేననుకుంటాను. యేమంటారా ? "నూఱునోములూ" అన్న సామెతగా సమస్తసుగుణాలనీ చెడఁగొట్టే దుర్గుణం దుర్యోధనుడిదగ్గిఱ వుంది. ఆ దుర్గుణంవల్లనే దుర్యోధనుఁడు సర్వవిధాలా చెడిపోయాఁడు. ఆ దుర్గుణం లోకమందఱూ యెఱిఁగిందే. దానిపేరు చెప్పమంటారా ? అసూయ. దీన్నిగుఱించి వాకపుత్పలమాలిక చాలాపెద్దది మాచే రచించి ప్రచురింపఁ బడింది. నానారాజసందర్శనంలో వుంటుంది. కావలసినవారు దానిలో చదువుకుంటే దాని మాహాత్మ్యం బాగా తెలుస్తుంది - భారతంలోనే ఒక పద్యం వుంది —

క. పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు.......... ......
అన్నరుఁడు తెవులులేని వేదనంపడు నధిపా !

దుర్యోధనుఁడికి యీ బాధే పట్టుకుంది - భీముఁడికి అంత పరాక్రిమ మెందుకుండాలి ? అర్జునుఁడికి ధనుర్విద్యలో అంత నైపుణ్యం యెందుకుండాలి ? ఆలాటి నేర్పూ, ఆలాటి పరాక్రిమం నాకెందుకు లేక పోవాలి ? అనే బాధే పట్టుకొని - దుర్యోధనుణ్ణి యేమిచెయ్యాలో అది చేసికాని విరమించనే లేదు. యీ అసూయ జంగమాలకే కాదు స్థావరాలకి కూడా వున్నట్టు కాశీఖండంవల్ల తెలియఁ బడుతుంది —

"కంటికి నిద్ర వచ్చునె; సుఖం బగునే రతికేళి; జిహ్వకున్
వంటక మించునే.... శాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్."

వింధ్యపర్వతానికి మేరుపర్వతాన్ని తనకన్నా లోకం యెక్కువగా మెచ్చుకుంటారనే కారణంతో అసూయపుట్టి చాలా ప్రయత్నంచేసి ఆఖరికి అత్యుచ్ఛ్రియః పతన హేతుః అయి అధః పాతాళంలోకి అణఁగఁ

పొక్కఁబడింది. మేరువుపర్వతంకన్న పెరగడమైతే పెరిగింది గాని యెంత పెరిగినా గులకరాళ్ళూ, రప్పలూ, చెట్లూ, చేమలూ యివేగా తనలో వుండే బండారం. బంగారం కావలసివస్తే మేరువు దగ్గఱికి వెళ్ళ వలసిందే, వట్టి పేకేజీ సరుకుతో కొందఱు గాయకులు కచేరీ చాలాసేపు చేస్తారు. ఆ కచేరీలో ప్రారంభమైన కొంతసేపయినాక చూస్తే మిగిలేది- మద్దెలవాఁడూ, వంతవాయిద్యంవాయించే ఫిడ్లరూ వీరికి తప్పని విధి గనక వీరు మిగులుతారు. రాత్రిచేసే సభ అయితే గ్యాసులైట్లతాలూకు మను ష్యులుకూడా మిగులుతారు. పనిలోపని, గానసభలనిగూర్చి రెండుము క్కలు రాస్తాను. ఈ సభలు రక్తికట్టాలంటే గాయకుఁడికి చాలా లోక జ్ఞానం వుండాలి. లోకజ్ఞానం కవికే గాని గాయకుఁడికి అవసరం లేదను కొంటారు కొందరు. అది పొరబాటు. గాయకుఁడు తాను చిన్నప్పటి నుంచీ, గురువుదగ్గఱ చెప్పుకున్న సరళి దగ్గఱనుంచీ ప్రారంభిస్తే వినేవా ళ్ళకు విసుగేసి వూడని బాడతారు. రక్తిలోకి వచ్చేదాఁకా యే కొంచెమో తానవర్ణాదికం పాడి వెంటనే ప్రధానభాగంలోకి రావాలి. ఇది విషయాం తరం. మేరువుతో సమానంగానో, అంతకన్నా హెచ్చుగానో వింధ్య పర్వతం పెరిగినా బంగారం లేని వింధ్యకు మేరువుకు వచ్చినమాదిరి పేరు ప్రతిష్ఠలు యెక్కడి నుంచి వస్తాయి. మేరువులో బంగారమే కాదు, రత్నాలూ వజ్రాలూ, నీలాలూ, వకటేమిటి? నవరత్నాలూకూడా దొరుకు తాయి. అష్టదిక్పాలకుల పట్నాలు దానిమీఁదనే వున్నాయి. వింధ్యలో యెంతగా పరిశీలించినా వట్టి గులకరాళ్ళే! వెలగల పదార్థం లేదు—

'నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకుబెళుకు రాళ్ళు తట్టెఁ డేల?

అన్నాఁడు వేమన. రస (బంగారు) హీనమైన వింధ్యపర్వతం బలుపు మేరువుపర్వత గౌరవాన్ని పొందటానికి పనికిరానట్లే దుర్యోధను డెంతగా ప్రయత్నించినా పాండవుల పేరుప్రతిష్ఠలమాదిరి పేరుప్రతిష్ఠలు పొందలేక పోయాఁడు. దుర్యోధనుఁడు భీముఁడికన్న గదాయుద్ధంలో

నేర్పు గలవాఁడనే అంశాన్ని వ్యాసులు దాఁచిపెట్టలేదు. భీముఁడికి నేర్పు నేది దేనిలోనూ లేదు. శుద్ధబండధోరణి —

చ. పెనుగదఁ బూని శాత్రవుల పిప్పియొనర్చుటతప్ప నెన్నఁడున్
బనిగొని యిట్టి వ్యూహములు పన్నుట విప్పుట యే నెఱుంగ నా
కనువుగ వాఁడిసూది మొనయంత సడల్చితివేని చొచ్చి య
మ్మొనగలగుండువెట్టి పడమొత్తెద మత్తగజంబు చాడ్పునన్.

(పాండవవిజయం)

యీ పద్యం మాదే అయినా భీముణ్ణి బాగా చిత్రించ గలిగినట్టు మాలో మేమే ఆనందించేవాళ్ళం. కవిత్వాన్నిగూర్చి వాక్రుక్కేప్పుడు సహృదయులలో గ్రంథకర్త కూడా చేరుటకు అనుభవజ్ఞులు అంగీక రిస్తారు. కవి పద్యం చెపితే యేలా వుండాలంటే చిత్రకారుఁడికి అది మార్గాన్ని చూపేదిగా వుండాలి. అట్టిరచన లీలాశుకుని కృష్ణకర్ణామృతా లలో విశేషించి దొరుకుతుంది —

శ్లో. వ్యత్యస్తపాద మవతంసితబర్హిబర్హం
సాచీకృతానన నివేశిత వేణురంధ్రమ్
తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్.

విషయం విషయాంతరంలోకి దూఁకుతూ వుంది. యీ కర్ణామృత శ్లోకాలమాదిరి కవితాధార బహుజన్మకృత తపఃపరిపాకం వుంటేనేకాని లభించదు. అట్టిధారవున్నకవి కవిత్వాన్ని అందఱూ కంఠోపాఠం చేస్తారు. అసలు కవివ్రాసిన పుస్తకం యేదేనా దేశవిప్లవాదులలో లుప్తమైనా అందలి పద్యాలు - "లోకులరసనలె యాకులుగా నుండునట్టివి" గా పరిణమించుటచేత ఆ రచనకు అమరత్వం సిద్ధిస్తుంది. ధ్వన్యాలోకంలో వక్కాణించినట్లు అట్టికవులు వాక్రుక్కే కాలానికి యేయిద్దరో ముగ్గురో వుంటారు గాని యెక్కువగా వుండరు — 'ద్విత్రా ఏవ కవయః ద్విత్రా

జ్యేవ కావ్యాని ' అన్న వాక్యం అల్లాటప్పాగా పుట్టలేదు. యింతకూ— "పుణ్యైర్యశో లభ్యతే" అనే అభియుక్తోక్తి సర్వథా మాన్యం. అర్జునుఁడు సైంధవవధరోజున చూపిన సాహసం యేనాఁడూ యేధానుష్కుఁడూ చూపినట్లు లేదు. అందుచేతే అనుకుంటాను భీష్మద్రోణాది మహాధానుష్కులెందఱో వున్నకాలంలో 'పార్థఏవ ధనుర్ధరః' అనే కీర్తి అర్జునుఁడికి వచ్చింది. దీన్ని విజయ విలాసకవి — "వేయునేఁటికి నలపాండవేయుసాటి వీరుఁడిఁక లేఁడు" అని వ్రాసి కూడా ఆ యీ సూత్రానికి వార్తికంగా "ప్రతి రఘువీరుఁ డొకఁడు" అని తగిల్చినాఁడు. అర్జునునకు రథము సారథి (కృష్ణభగవానులు) చక్రరక్షకులు వగైరా లోటేఁడు సాధన సంపత్తి వుంది. రామునకో, "పదాతిర్మర్త్యోసౌ సకల మవధీద్రాక్ష సకులమ్" అందులోనూ ఖరుఁడు మొదలైనవాళ్లు పద్నాలుగు వేలమంది రాక్షసులు యేక కాలమందు తగినంత సాధనసంపత్తితో వచ్చి అరికట్టి నప్పుడు వొక్కచేతిమీఁదుగా ధనుర్మాత్రసహాయుఁడై రాముఁడు వాళ్ళ నందఱినీ బిల్కు మార్చిన సందర్భం తలుచుకుంటే — "యతో వాచోనివర్తంతే." అందుచేతనే విజయ విలాసకవి వార్తికం తగిల్చి అర్జునుఁడికి కనిష్ఠికాధిష్ఠితత్వాన్ని తొలఁగించాఁడు. భీష్ముఁడు అతిరథమహారథాది నిర్ణయం చేయడంలో అర్జునుణ్ణిగూర్చి చెప్పవలసిందని దుర్యోధనుఁడు కోరితే — "అట మిన్నందినయట్టివానిపొడ వెంతన్నట్లు" అని యెత్తికొని అర్జునుఁడు వారివీరివలె ఆయీ క్లాసులలో చేరఁడు అని చెప్పినట్లైంది. అనగా నేఁటి భాషాప్రవీణ విద్వాన్ శిరోమణి వగైరా పరీక్షలలో కృతార్థులైన వారితో ప్రాచీనరీత్యా ఆ యా శాస్త్రాలు అభ్యసించినవారిని చేర్చడం యేలాటిదో నాఁటి అతిరథాది తరగతులలో అర్జునుణ్ణి చేర్చడం ఆలాటి దని భీష్మాచార్లగారి తాత్పర్యం. అయితే ఆయీ సందర్భం భీష్ముఁడు చెప్పకపోయినా దుర్యోధనుఁడికి తెలుసు. తెలిసినా తాను చక్రవర్తిగా పదుమూడేళ్ళనుంచి పరిపాలన చేస్తూ వుండడంచేత లోకంలోవున్న యోధులందఱూ నయానైతేనేమి, భయానైతేనేమి తన పక్షంలోనే వుంటారు.

మొత్తం చెత్తా చెదారం యావత్తూకలిస్తే తనసైన్యం హెచ్చుగావుంటుంది. వాళ్ళు ఐనుగురూ అత్తవారితాలూకున్నూ శ్రీకృష్ణుఁడితాలూకున్నూ కలిసి యెంత హెచ్చున్నా వొక్క అక్షోహిణీ కంటె పాండవులకు సాయంవచ్చే సైన్యం వుండదనే దుర్యోధనుఁడి తాత్పర్యం. అయీ విషయంలో దుర్యోధనుఁడు పడ్డపాట్లకు అంతూపొంతూ లేదు. లేనేలేదు; తాను సార్వభౌముణ్ణి అనే గర్వంవదులుకొని రాత్రిఅనక, పగలనక యెవళ్ళను యేలా ఆశ్రయించాలో వాళ్ళని ఆలా ఆశ్రయించి తనపక్షాన్ని చేరి హంగుచేసే టట్లు ప్రయత్నించాఁ డన్నసంగతి శల్యుణ్ణి తనవాణ్ణిగా చేసుకున్న తంత్రం వల్లనే విస్పష్టం. శల్యుఁడు సాక్షాత్తుగా నకులసహదేవులకు మేనమామ. అట్టివానిని యెదటి తనపార్టీలోకి తిప్పుకోవడంకంటే రాజకార్య ధురంధరత్వం వేఱొకటి వుంటుందా - వసుదేవుఁడు గాడిదకాళ్ళు పట్టఁడే అన్న మాట జ్ఞప్తికి వస్తుంది యీ విషయంలో దుర్యోధనుఁడి చర్య తలఁచుకుంటే, యీబాధకంతకూ కారణం పాండవులమీదవున్న - అసూయ. అట్టి అసూయే లేకపోతే భీముఁడేమి, అర్జునుఁడేమి వీళ్ళందఱూ తనవాళ్ళే. తనకే బాసటగా వుండి గౌరవిస్తారుగదా ? శ్రీరామమూర్తి - ఆంజనేయుణ్ణి తనకు బాసటగా ప్రేమించక తనకు లేని ప్రజ్ఞలు అతనికి వున్నాయని అసూయ పడేయెడల యేంజరిగేదో ? ఆలోచిస్తే తేలేదేమిటి ? సీతావృత్తాంతం తెలిసేదే కాదు. వొకవేళ గత్వాగత్వా తెలిసిందే అనుకుందాం అక్కడికి వెళ్ళి ఆమెను చూచి రూఢివర్తమానం చెప్పేవాఁడెవడు ? కర్ణుఁడితల భారతం, రామాయణం యొక్క ఆయువుపట్టు ఆంజనేయులు. లోకంలో రాజైనవాఁడు ఆంజనేయునివంటి మంత్రిని లేదా సేనానాయకుణ్ణి యెంతేనా ప్రేమించాలి. ఆలా ప్రేమించడం కార్యసాధకం. మన నవుకరు లేదా మన భర్తుఁడు కదా ? అట్టి స్థితిలో మనకంటే అతిశయించిన ప్రజ్ఞలు వాఁడియందు వుండనా అని - అసూయపడితే ప్రయోజనం లేదు. ద్రోణాచార్యులు తన కొడుకుకంటేకూడా అర్జునుణ్ణి ప్రేమించడం భారతం వల్ల మనకు తెలుస్తూవుంది. అశ్వత్థామకు చెప్పని రహస్యాలుకూడా

ద్రోణుఁడు అర్జునుఁడికి చెప్పడం చూస్తే ఆయన ఔదార్యాన్ని బోధిస్తుంది. అభిమన్యుఁడు తనవగైరాలను పీటీ చిటిగేటట్లు కొడుతూవుంటే, ద్రోణుఁడు సంతోషించినట్లే కనబడుతుందిగాని విచారించినట్లుగాని, కోపించినట్లుగాని ఆ ఘట్టంలో భారతంలో కననడదు. గుణగ్రిహణం ద్రోణాచార్యులను బట్టి లోకం నేర్చుకోవా లనిపిస్తుంది. శిష్యపుత్రిని నైపుణ్యానికీ, శౌర్యానికీ మైమఱచి అనందిస్తూ వుంటే ద్రోణుఁడు దుర్యోధనుఁడు అభిన్యుడి దెబ్బలు తినితిని సహించలేక గురువర్యా ! యీకుఱ్ఱని వధించే వుపాయం చెప్పక మీరు ఆనందిస్తూవుంటే యేలాగని అట్టే బతిమలాడేటప్పటికి విధిలేక వానిచేతులో చాపమున్నంతలో ఫాలాక్షుఁడు వచ్చినా వాఁడు లొంగడు అని చెప్పేటప్పటికి అదెంతపని ? అని కర్ణుఁడు వెనకభాగానికి వెళ్ళి (తప్పుడుపని) ఆ కాస్తా కానిచ్చినట్లు భారతంలోవుంది. ద్రోణుఁడికి యేమాత్రిం అసూయవున్నా యీ ఘట్టంలో కథ యింకోవిధంగా నడిచేది. భారతంలో వుండే యే పాత్రిని యెత్తుకున్నా తీగెదీస్తే డొంకకదుల్తుంది. మొత్తం విచారిస్తే దుర్యోధనపాత్రివల్ల తెలుసుకోతగ్గ నీతి రాజకార్య దక్షత్వంలో దుర్యోధనుఁడు చాలా మెచ్చుకో తగ్గవాడు. మానాభిమానాలు గణింపక స్వార్థనిర్వహణానికి యెంతేనా పాటుపడినవాడు. సంశయం లేదు గాని యిదంతా యెందుకు ? అసూయే లేకపోతే యీ కుటుంబకలహమే లేకపోయేదిగా ! ధర్మరాజాదులంతా తన వశంలోనే వుండేవారు. తనశక్తి సామర్థ్యాలతో అవసరమే వుండేదికాదు. అయితే ఆయీ ధర్మపన్నాలు చెప్పడం సుళువేకాని అచరించడం పుస్తకాపేక్ష.

అసూయ లేనివాఁడు పృథివిలో చాలా మృగ్యుండు. అన్నకి తమ్ముఁడిమీద, తమ్ముడికి అన్నమీఁద, తండ్రికి కొడుకుమీఁద కొడుకికి తండ్రిమీఁద గురువుకు శిష్యుడిమీద, శిష్యుడికి గురువుమీఁద ఆ యీ అసూయ వుంటూవుంటుంది. కొందఱు దాన్ని ఆపుకొని లేనట్లు పైకి నటిస్తారు. హృదయదౌర్బల్యం కలవారు చట్టన వెళ్ళఁ గక్కేస్తారు. ఇతర విషయాలలో దుర్యోధనుడు — ధీరోదాత్తుఁడే కావచ్చును గాని పాండవుల

మాట తలపెట్టేటప్పటి కల్లా అతని - ధీరోదాత్తత్వం యెక్కడికోపోయి క్షణంలో నిప్పులు తొక్కిన మర్కటంలాగు తయారవుతాఁడు. ధర్మపక్ష మని యెంచి భీష్మాదులు పాండవులను గూర్చి ఆడేమాటలన్నీ న్యాయ బద్ధాలే అయినను అతని చెవులకు శూలాలుగా కనపడి వాట్లను ఖండించడా నికి న్యాయబద్ధమైన సదుక్తులు తోఁచక - 'పిడుక్కీ బియ్యానికీ వకటే మంత్రం' పక్షపాత శబ్దాన్ని వుపయోగించి తద్ద్వారాగా ఆప్తులందఱికీ పరమద్వేష్యుఁడుగా పరిణమించాడు.................................



## పండితుల పాట్లు

( ది 25-8-1946 సం॥రం జన్మభూమి నుండి )

వీళ్లు కులక్రమాగతంగా వస్తూవున్న వేదాన్నో శాస్త్రాన్నో పిల్లలకు చెప్పుకుందామంటే ప్రస్తుతం వ్యాపించి వున్న నాగరికత ఆ విద్యకు గాని దానికి సంబంధించిన వేషానికి గాని భాషకీఁగాని బొత్తిగా అంగీక రించదు ఏ-బి-సీ-డీ-లు రానివాఁడేనా సరే సైకిలూ హిట్లరుమీసం యూనిఫారం డ్రెస్సూ యింతమాత్రం మఱిచాను నోట్లోసిగరెట్టూ యింత మాత్రమేనా వుంటేనేకాని యితరుల మాటాలా వుండఁగా పెండ్లిచేసుకున్న పెండ్లామే ఆమోదించదని వ్రాయనక్కఱలేదు. సోమయాజులుగారి కూతుఁ రేనా సరే దీక్షితులుగారి కోడలేనాసరే రవికని యజ్ఞోపవీతంగా ధరించడం ( బుజమెక్కు జందెం ) అంతా యెఱిఁగిందే. నాకు యిప్పటికి 76 యేడు వయస్సు. నా చిన్నతనంలో రవికెలు మోచేతికి బెత్తెడు సుమారు వెలితిలో వుండేవి అది పూర్వనాగరికతగానే మనం భావించడానికి అప్పటికి వున్న చిత్తరువులలో వున్న స్త్రీల రవికెలు ఆ విధంగానే వుండేవి కనక యుక్తి సహమే తరవాత యీ బెత్తెడు వెలితి -లొడితెఁడు. వెలితిలోకి దిగి కొన్నాళ్లు అమలు జరిగి ముసలమ్మలు యేవగించుకోవడందాకా దేఁకి తుదకు-" ధర

తగ్గుట హెచ్చుకొఱకె " అన్న అభియుక్తోక్తి ప్రకారం వొక్క సారిగా మోచేతికిందకి దేఁకి వొకటిరెండు దశలు అమలు జరిగింది కాని అంతట్లో మొగవాళ్ళ జందెం మాదిరిలోకి దేఁకింది స్త్రీల నాగరికత. ప్రస్తుతం వ్రాయ బూనుకొన్న విషయం. విద్యావిషయం. ప్రసక్తాను ప్రసక్తంగా యీ ఆడంగుల నాగరికతవచ్చి అడ్డుతగులుతూ వుంది. దీనికి ఫలితం పండితులు తమ బిడ్డలకు తమ విద్య చెప్పుకోవడానికి ప్రస్తుతం రాజ్యం చేస్తూ వున్న నాగరికత యేవిధంగానూ ఆమోదించేటట్టు లేదు. అనుకోవడమే ఆఖరికి యెలిమెంటరీస్కూలులో ఏ-బి-సీ-డీ లు చెప్పుకొనే బాలుఁడేనా జుట్టుపిలకతో స్కూలుకు పెడితే వాఁడి పాట్లు కుక్కలికీ నక్కలికీ యెఱుక కుఱ్ఱవాళ్ళు ఆ పిలకజుట్టును వొక్కొక్క వెంట్రుక చొ॥ వూడ బీకుతారు కనక పూర్వనాగరికత యిప్పుడు యెందుకూ పనికిరాదు. పూర్వం దానికి యెంత గౌరవమో యిప్పుడు అంత లాఘవం కనక వేద శాస్త్రాల జోలికి యెవరూ వెళ్ళడం హానికరంగా కనపడుతుంది. వాళ్ళు తుదకి "దారైరపి త్యజ్యతే" రానివ్వండి రాకపోనివ్వండి, యేలాగో ఏ బి సీ డీ లే శరణ్యంగా కనపడతాయి.

"విత్తకరీచవిద్యా" అని వుండడం చేతనైతేయేమి? పొలుపగు కోటివిద్దెలును బొట్టకుఁబట్టెఁడుకూటికే యేర్పడి వుండడం (ఇది సామాన్య వచనం విద్య జ్ఞానంకోసంగాని ధనార్జనకి కాదు) చేతనైతే యేమి అవధానులు సోమయాజులు దీక్షితులు కవిసార్వభౌములు గాయక చక్రవర్తులు యెత్సెట్రాలు సర్వులూ వారివారి చిరంజీవులకు యింగ్లీషు చెప్పించటమే శ్రేయస్కరం. యెవరేనా చాదస్తులు అలా చెప్పించని పక్షంలో ఆ కుఱ్ఱాఁడికి పెండ్లి వగైరాలు పుస్తకాపేక్షే ఐతే వైదీకం చెప్పిస్తే జీవనం జరగడానికి యే విధమైన అభ్యంతరం లేదు గాని వాఁడి వేషభాషలు కట్టుకున్న పెండ్లానికి నచ్చకపోవడం వగయిరాలు యేదో వ్యాసంలో వివరించే వున్నాను. బీ. యే. ప్యాసయి ట్రైనింగుకూడా అయి, టీచరీ సంపాదించుకొని శతమానం దాఁకా నెలకు జీతం తెచ్చుకుంటూ యింకా రెండో

మూడో ప్రియివేటు ట్యూషనులు చెప్పి నలభయ్యో యేభయ్యో తెచ్చుకొనే గృహస్థుకు తీసిపోని సంపాదన వైదీకంలో వున్న వారిని నేను కొంద ఱిని యెఱుఁగుదును. ఆంధ్రికవిత్వంలో సంస్కృతపదాలు కలిపినట్లు ఆయీ వైదీకంవారు కాస్త సైకిలు సహాయం కలవారుగా వుఁడాలి. ఆ పద్ధతిని తహసీలుదారీకి తీసిపోని జీతం కిడుతుంది. శివుఁడికి భూత, ప్రేత, పిశాచాల లాగ వీరికీ కొంత పరివారం ఆశ్రియించేది వుంటుంది. మ్యునిసిపాల్టీవారితో పాటు "జననం వారంరోజులులోగా" - అనే లిస్టుతో వీరికి సంబంధం శుభశోభనాల బాపతు ఆర్జనకూడా వీరికి వుంటుంది గాని యేలాగేనే ఇవి రెండూ వొకరు పెట్టుకోరు పెట్టుకుంటేనో దానిలో కవుళ్ళు (వైదిక పరి భాషలో లింకులకు - కవుళ్ళంటారు) దీనిలోనూ దీనిలో కవుళ్ళు దాని లోనూ తగిలి పెళ్ళి తద్దినంగానూ తద్దినం పెళ్ళిగానూ మారి ఆంధ్రికవి త్వం చెప్పడానికి మాత్రిం అలవాటుపడ్డవారు చెప్పక చెప్పక యెప్పుడో కర్మం చాలక కొన్ని సంస్కృతశ్లోకాలో లేక ఒక శ్లోకమో "జన్మాని కల్లా శివరాత్రి" గా చెపితే దానిలో తెలుఁగు సంప్రిదాయాలు తగిలి రసాభాసు కావలసి వస్తుందని యేదో వ్యాసంలో వ్రాసివున్నాను ఆవిధమైన సంశయంచేత యీవుభయమూ వొకరే చేయించడం పెట్టుకోరు దీన్నిగూర్చి మరొకప్పుడు వ్రాస్తాను. ప్రస్తుతం వైదీకంలోకూడా మంచి ఆర్జన వున్న వృత్తివుఁది గాని దీనిలో లాగ క్యాటూ వగయిరా ముచ్చటలు తీరడం వుండదు అది యీ కాలంలో వున్న జనసామాన్యానికి అవసరం. సర్వ సామాన్యంగా స్కూలు ఫైనలుతో సమాప్తి చేసే వాళ్లకన్న వివాహోపన యనాది శుభకార్యాలు క్షుణ్ణంగా చేయించే వాళ్ళ ఆర్జన తీసిపోదు. పద హారోకర్మ చేయించేవారి ఆర్జన యమ్. యే వగైరాలకూడా కొన్ని చోట్ల మించుతుంది అయితే యేమి "నా కరణిల్ దర్భలు నగ్నులుం బ్రియములైనట్లన్యముల్ గావు" అనే మాదిరిలో వుండాలి. అందుచేత అందఱూ కొత్తనాగరికతనే వారివారి పిల్లలకి అభ్యసింప జేయాలి.

కాంగ్రెస్సువారు దేశభాషలకేమో లోఁగడకంటె యెక్కువ ప్రాముఖ్యం వచ్చే వత్సరాన్నుంచి (1947) కలిగిస్తారని పత్రికలో చదివిన జ్ఞాపకం. యెంత కలిగించినా ఆ యీ స్కూళ్ళలో చదువు "విజ్ఞానం" అనడానికి నోరు తిరక్క తబ్బిబ్బయి విగ్నానం అనేది గానే వుంటుంది. యేలా వున్నా ఆ స్కూళ్ళకే పంపాలి అందులో సీటు దొరకడ మంటే యెవళ్ళకంటారు? యే ఫోర్తుక్లాసు కుఱ్ఱలకో? లేదా యే ఫిఫ్తుక్లాసు కుఱ్ఱలకో సుమండీ. పార్లమెంటుసభలో మెంబరీపదవికన్నా కష్టసాధ్యంగా కనపడుతూ వుంది. మే నెలనుంచి అంతో ఇంతో యత్నిస్తూనే వున్నాను ఆ యా స్కూళ్ళకు సంబంధించిన పరిచితులతో ప్రస్తావిస్తూనే వున్నాను గాని తుదకి మాకుఱ్ఱలకి హుళిక్కి అయి అన్ని వున్నాయి గాని అల్లుఁడి నోట్లో శని సామెత ప్రత్యక్షం అయిఁది. ఆ మాస్టర్లని ఆశ్రయించడానికి నాకు శక్తిలోపంచేత మా అల్లుణ్ణి పంపించాను గాని యేంలోపం వుందో యత్నంలో తుదకి కార్యకారి కాలేదు. యేలా ప్రయత్నించాలో యిప్పటికీ నాకు బోధపడనే లేదు. నేనూ కొన్ని యేళ్ళు బందరు హైస్కూల్లో బడి పంతులుగా వున్నవాణ్ణే. ఈ సీటు దొరక్క చిక్కుపడ్డ గృహస్థులున్నట్లు నాకు తెలియదు, ఆశ్రయణలోపమో మరో లోపమో యేదైతే యేమి సీటు లేదని తేలింది. ఇఁక ప్రయివేటుకు ప్రయత్నించాలి. ఆ పంతులు గంటో అరగంటో చెప్పి వెడితే పగలుపగలంతా కుర్రలను పశువులకాపు కాసేదెవరు? దాసుఁడి పాట్లు పెరుమాళ్ళకే యెరుక యేదో ప్రయత్న లోపం నాది వుంది వచ్చేయేఁడేనా ఆ లోపం తీర్చుకుందామంటే ఆలోప స్వరూపం చెపుతారా? అంటే? చెప్పరు. ట్రయినింగు వగయిరాలకు సీటు దొరకడం కష్టసాధ్యంగా వుండడం యెరుఁగుదును గాని యీ అక్షరాల తరగతికే సీటు దొరకడం కష్టసాధ్యంగా కనపడుతూ వుంది. ఆహా! యెంత చక్కటికాలం పోయి యెంతటి చెడుకాలం దాపరించింది మా చిన్ననాడు యిన్ని స్కూళ్ళూ లేవు యిందరు టీచర్లూలేరు యినస్పెక్టర్లూ లేరు సూపర్వైజర్లూ లేరు విద్యార్థికి ప్రధానాంశంలో యేవిధమైన లోపమూ వుండేది గాదు నేను మాతృభాషాజ్ఞానం సంపాదించుకొన్నది లోకల్

ఖండు స్కూల్లోనే. యిప్పుడు స్కూలు యేర్పడాలంటే లక్షలకి లక్షలు వుండాలి అప్పుడు పైసాకూడా లేకుండానే పని జరిగేది

శా. 'బెంచీ' లక్కఱలేదు "గేమ్సు" మొదలౌ ఫీజుల్ గనన్ రావు పొ
మ్మంచున్ శిష్యునిదోసి పుచ్చరుగుదుల్ ప్యాసైననే లాభ మీ
దంచున్నేమములేదు మీచదువునందాలోక మీలోకమున్
గాంచన్ వచ్చెడి నార్యులార! మిము మ్రొక్కన్ జెల్లు నెక్కాలమున్.

అయితే ప్రాచీనవిద్యా సంప్రదాయజ్ఞులైన పండితులింకా అక్కడక్కడ (విత్తనాలు) వున్నారు ఆ విద్వాంసులను యేకత్రి చేర్చి ఆరాధించే ధనాఢ్యులూ శ్రీ చుండూరి రెడ్డిగారు వగైరా వున్నారు గాని చదువుకునే విద్యార్థులే మృగ్యులుగా వున్నారు. ఏపండితులూ తమ పిల్లలకు ప్రాచీనవిద్యాభ్యాసానికి శ్రద్ధ చేయడం కనపడదు. నాకు యిప్పటికి కొన్ని యేళ్ళనాఁడు ప్రాచీనవిద్యలంటే యెంతో అభినివేశం వుండేది ఆ అభినివేశం అంతా యింతా కాదు ఆరోజులల్లోదే యీ పద్యం.

మ. తమపుత్రుల్ స్వమతేతరమ్ములగు విద్యల్నేర్చి పోషింతురం
చు మతభ్రష్టులఁజేయు పండితులునీచుల్గారె? వీరింక ద్రి
వ్యముకై కూఁతుల రోవెలందులుగఁజేయన్ లేరె? యెవ్వారి దూ
ఱమతేమోఁ గలికాలపు న్మహిమ వార్యంబౌనె? కామేశ్వరీ.

అని కవిత్వం చెప్పిన నేను నాకొడుకులకు కాకున్ననూ నామనమలికి బెజవాడ మహాపట్టణంలో ఏ. బి. సీ. డీ. క్లాసులో సీటుకు యేవిధంగా ప్రయత్నించాలో వుపాయం తెలియక పరాభూతుణ్ణై లజ్జిస్తూ న్నానంటే నా ప్రతిపక్షివర్గం సంతోషిస్తుందనుకుంటాను నాకే గాని యీ అభినివేశం మాతి॥శా॥కి లేదు అతఁడు తన కొడుకులకి మొదటి నుంచీ ఆంగ్లాన్నే చెప్పించాఁడు నేను సంతానం కలగడమే తడవుగా బందరు వదలి స్వగ్రామం ప్రవేశించాను. యెందుచేతంటే? పట్నంలో వుంటే సంతానానికి..........................................................

# త్యాగరాజు వైదీకి కాడా?

( ది 15–3–1947 సం॥రం ఆంధ్రవాణి నుండి )

కాదు ? యెందుచేత ? పేరులో చివర రాజశబ్దం వుండడంచేత దీన్నిగుఱించి సుమారు యేభై అఱవై యేళ్ళనాడు శ్రీయుతులు – నంది రాజు దీక్షితులుగారికిన్నీ వారి ప్రతికక్షి విశ్వపతిశాస్త్రుల్లు గారికిన్నీ నడచిన వాదోపవాద గ్రంథాలలో విశ్వపత్యసురవిజయంలోనో, మఱివాక గ్రంథంలోనో వున్న అక్షరాలు వుపకరిస్తాయి. విశ్వపతి శాస్త్రుల్లుగారు దీక్షితులుగారిని మీ శాఖలో చాలామందికి నామధేయంలో – రాజశబ్దం వుందికనక, మీరు బ్రాహ్మలే కారని అనాలోచితంగా పూర్వపక్షం చేసే టప్పటికి దీక్షితులుగారు " అయ్యా ? యీ రాజశబ్దంవల్లనే మా బ్రాహ్మణ్యా నికి భంగం కలిగే యెడల " మీలో రెండోబ్రహ్మనుగా లోకం గౌర వించే శ్రీ అప్పయ్యదీక్షితులవారి తండ్రి లేదా తాతగారు – రంగరాజదీక్షి తులుగారన్న సంగతి మీకు తెలియనే తెలియదనుకుంటాను అని దెకా యించినట్టున్ను విద్వత్పరంపర చెప్పకోగా వినికిడి. దీనివల్ల వైదీకులకు క్వాచిత్కంగా రాజశబ్దం పేరులో వుండడం అంగీకరించక తప్పదు. ఆ గ్రంథం నేను చూడలేదు కనక కొంచెం తేడాపాడాలు వున్నను అసలు సంగతి సత్యం కాకపోదు. రాజ అనే శబ్దం మాత్రం జాతి – లేదా శాఖా బోధకం కాదని దీక్షితులుగారి వాదంఅన్నంతవఱకు యిక్కడ మనం తెలుసుకోవాలి. శాస్త్రుల్లుగారి పూర్వపక్షం కేవలం అసూయాప్రయుక్తం అని వ్రాయనక్కఱ లేదు. యీ విషయంలో శాస్త్రుల్లుగారు పూరాగా బొందబడినట్లు ప్రాజ్ఞులు తెలుసుకోకపోరు. రాజశబ్దం పేరులో వున్నంత లోనే క్షత్రియులవుతారనడం అనాలోచితం కాకపోదు. ఆయన పెద్ద పండితు డయితే కావచ్చునుగాని ప్రస్తుత విషయంలో ఆయనవాదం అసం గతం, దీక్షితులవారిది సుసంగతం. చలపతిరావుగారి వూహ దీక్షితులవారి వాక్యంవల్ల పరాస్తం కాక తీరదు. వారివాక్యం వుదాహరిస్తాను.

(ఆంధ్రవాణినుండి)

"రాజుశబ్దం నియ్యోగులందే వాడబడుచున్నది గాని వైదీకులకు వాడబడుటలేదు" అన్న చలపతిరావుగారి ఏవకారార్థ కావ్యయ ఘటితమయిన వూహా స్థూలదృష్టిని సమన్వయించుకోవాలి. నియ్యోగులలో విస్తరించిన్నీ వైదీకులలో మృగ్యంగానున్నూ రాజు శబ్దానికి ప్రవృత్తి గోచరిస్తూవుంది. యిప్పుడు రావుశబ్దం మీద వున్నంతమోజు ఆ కాలంలో రాజు శబ్దంమీద వుండేదన్నమాట. మా పెద్దల్లుడు యింకా రాజుశబ్దంలోనే ఉన్నాడు-అతని పేరు పాపయ్యరాజు. యిది తాతగారి నామధేయం; అయితే తాతగారిని పాపయ్య అనే పిలిచేవారు. ఆయన చేవ్రాలు చేయడమూ పాపయ్య అనియ్యేవే. మనుమడునాటికి ఆపేరు మోటనిపించి కాబోలు రాజుశబ్దం తగిల్చి తల్లిదండ్రులు వాడుకున్నారు. హైస్కూల్లో అదేపేరు రిజస్టరయింది - యీ మాదిరిపేరు మా శాఖలో యింకొకరికివుంది. కీ॥ శే॥ లు నృసింహదేవర సోమన్నగారి కుమాళ్ళలో నాలుగోకుమారుడు బుచ్చిరాజు. యింతేకాదు నా వియ్యంకుడిగారి యింటిపేరు-అల్లంరాజువారు పిఠాపురంలోనూ గొల్లప్రోలులోనూ చేబ్రోలులోనూ యీ యింటిపేరువారు చాలామంది వున్నారు. వీరిలో యిద్దఱు పేర్రాజులు వున్నారు. వొకాయన సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు ఉప్పాడ కొత్తపల్లి నివాసులు సుమారు 60 ఏళ్ళవారు. యిప్పటికి సజీవులు. నేడో రేపో షష్టిపూర్తి జరుగుతుంది వేఱొకరు కీ॥ శే॥ లు. యీయన పదకవిత్వం చెప్పేవారు. నాలుగేండ్లనాడు పరమపదించారు. "భృగు రఘు బలరామత్రయ రూపములగని బుద్ధ కల్కిరూపముల గని జగతి పేరరాజ దాసునేలిన సుగతి వీవ కావ దేవదేవా? మఱ్ఱాకున పవళించినయ్య కిదే మంగళం."

ఆయీ గేయం ఆ పేరరాజుగారి కవిత్వమే. మా శాఖలో పరిశీలిస్తే యింకా యీ రాజపదాంకితులు చాలామంది బయలుదేరతారు. అసలు ఆయీ వ్రాతకు కారణం త్యాగరాజుగారు. యీయనపేరులో వున్న రాజ

శబ్దం శాఖాబోధక మని శ్రీ చలపతిరావుగారు అభిప్రాయపడ్డారు. స్థూల దృష్టికి అలా గోచరించడం యుక్తమే. బాగా విచారిస్తే ఆ యీ త్యాగ రాజు శివుడు. దక్షిణాదిని వున్న శివస్థలాలలో త్యాగరాజేశ్వరుడు వొకడు. బహుశః త్యాగరాజుగారి గ్రామంలోనే, వున్నాడేమో యీ దేవుడు వాకపు చేస్తే త్వరలోనే తెలుస్తుంది. ఆదేవుని పేరు తల్లిదండ్రులు కుమారునికి పెట్టికొని వుంటారు. “గాలీవానావస్తే కధే ఆగింది.” యిది నిక్కమే కనక ఆయీ శాఖావిచారం అనావశ్యకమే అనుకుంటాను. “త్యాగరాజ నుత” అని త్యాగరాజుగారు రాముణ్ణి సంబోధిస్తూ వుంటారు. అక్కడ శ్లేషగా సమన్వయించుకోవాలి. శివునకు తారక (రామ) మంత్రం ఉపాస్యం కనక శివుని త్యాగరాజుచే నుతింప బడేవాడా? అని శివపరంగానూ తన్నామధేయముగల గేయకర్తచే నుతింపబడేవాడా? అని ఆత్మపరం గానూ సమన్వయం (ఇట ముద్రాలంకారం). చలపతిరావుగారు త్యాగరాజు గారిని ఆత్మసాత్కరించుకోవడానికి అంతో యింతో హేతువు వుంది. కొందఱు యే ఆధారమూ సరియైనది లేకుండానే నన్నయభట్టును కూడా ఆత్మసాత్కరించుకుంటూ వున్నారు. అంతమాత్రమే కాదు. భారతరచన యావత్తూ “నారాయణభట్టుదే” అనిన్నీ, నన్నయ్యాభట్టు తద్దినం బెట్టేవాని తమ్ముడివంటి వాడే గాని ప్రధానుఁడు కాడనీ వ్రాసేవారున్నూ వున్నారు. వారు “తనకుల బ్రాహ్మణు” అన్న సీసం యావత్తూ ఆత్మశాఖాపరంగా వ్యాఖ్యానించ డానికి పడ్డ కష్టం చూస్తే విచారం వేస్తుంది. గోదావరి నీరు తాగేవాళ్ళకేగాని కవిత్వం అబ్బదనేవారూ వున్నారు. యీప్రాంతంలో కాదుగాని నేటికి ముప్పైయేళ్ళకిత్రం తుండూ తుపాకీ కూడా యెగర గొట్టేవ్రాఁత యింకొకటి బయలుదేఱింది. అవ్రాత నన్నయ్యాభట్టూకాదు, నారాయణభట్టూకాదు, భారతకర్త “రాజరాజ నరేంద్రుడే” అని సిద్ధాం తీకరిస్తుంది. ఆయీ రోజుల్లోనే యింకోవ్రాత బయలుదేఱింది. అది తెనాలి రామలింగకవిని విశ్వబ్రాహ్మలు ఆత్మసాత్కరించుకునే వ్రాత. దానికిన్నీ హేత్వాభాస వొకటి లేకపోలేదు. దాన్నిచూపుతాను.

"అగ్రిశాఖికా కోకిలమవు" అని పాండురంగ మహాత్మ్య పీఠికలో కృతిపతి తన్ను సంబోధించినట్లు రామలింగం వ్రాసుకున్నాడు. బ్రాహ్మణులలో శుక్లయజుశ్శాఖవారికి - "ప్రథమశాఖ" అని నామాంతరం వుంది. అది వేదాన్నిబట్టి వచ్చినపేరు. యజుర్వేదం శుక్ల, కృష్ణ అని రెండువిధాలు కావలసివచ్చింది. యెందుకు ఆయీ నామద్వయం రావలసివచ్చిందో వ్రాయవలసివస్తే గ్రంథం పెరుగుతుంది. పయిగా అది ప్రస్తుతమూ కాదు. కనక స్పృశించి విడుస్తూన్నాను. "అనుక్త మన్యతో గ్రాహ్యం' తత్త్వం యీవిధంగావుంచే. విశ్వబ్రాహ్మలు "అగ్రిశాఖ" అంటే బ్రాహ్మలలో తమశాఖే అనిన్నీ, దాని కేవో కారణాలున్నాయనిన్నీ చెపుతూ రామలింగం మావాడే అన్నారు. యింతకు వీరూవీరూ నారాయణ భట్టునూ నన్నయ్యభట్టునూ రామలింగాన్నీ త్యాగరాజునూ ఆత్మసాత్కరించడానికి ముఖ్యకారణం వారివారియందుండే విశిష్టత్వమే కారణంగాని అన్యంకాదు. వీరు అనామకులే అయితే వీరిని యింతకాదుగదా, యిందులో యెన్నోవంతూ ప్రేమించేవారు కారు.

శ్లో. స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోష స్సతు గుణగణానా మవగుణః.

అన్నాడు మురారి మహాకవి నా మట్టుకు (సముద్రమంతా కల్లయితేనా చూ) వసుచరిత్ర కర్త భట్టుమూర్తి మా ఆరామద్రావిడ శాఖఅయితే బాగుండునని అభిలాష. దానికి ఆధారాలు వెతుకుతూ వున్నాను. కాని యీలోపల నన్ను యేశాఖవారేనా ఆత్మ సాత్కరించు కుంటారేమో అని శంక కలుగుతూ వుంది లోగడ కీ॥ శే॥ లు శ్రీ గురజాడ వారు "నన్నయ్యభట్టు ఆర్వేల నియోగి" అని వ్రాస్తూ దానికి అధారం- "భారవి మా నన్నయభట్టు తిక్కకవి నేఱ్ఱాప్రగ్గడన్ గొల్చెదవ్" అని పిల్లలమఱ్ఱి వీరభద్రకవి అన్నాడని కాబోలును వ్రాశారు — యీ పద్యంలో నియోగికవి మా అనడం నిజమే అయితే యిది మంచి ఆధారమే కాని యీ పాఠం - "భారవి నా నన్నయ్యభట్టు" అని కొన్ని పుస్తకాలలో

వుందని కొందఱనగా విన్నాను. గురుజాడవారి పిమ్మట కీ॥ శే॥ లు కం॥ వీ॥ పంతులవారు వ్రాసిన కవిచరిత్రలో నన్నయ్యను నియోగిగా అనువదించలేదు. మళ్ళా నిన్న మొన్న వొక వ్రాత బయలుదేరింది - కాని దాన్ని యెవరూ ఆమోదించినట్లు లేదు. చేమకూర వేంకటకవిని, ముప్పై యిద్దఱు నియ్యోగుల సీసంలో చేర్చి వున్నారు గాని వాసిరెడ్డివారి సంస్థానంలోవుండే బ్రాహ్మణ బ్రాహ్మణేతర కవుల వివాదపు రికార్డు బయటకు వచ్చి ఆ ప్రమాదం సర్దుకోవలసి వచ్చింది - బుచ్చి వెంకు అనే వేశ్యాపుత్రుని బ్రాహ్మణకవులు ఆక్షేపిస్తే, అతడు "చేమకూర వెంకన్నకు లోపమేమి? కులమా? కవనానకు వేంకటాద్రి రాజన్న?" అని డెకాయించడం వగైరాలు ఆ గ్రంథ పీఠికలో ఉదాహరించాం చూచుకోండి. ప్రాచీన కవులనుగూర్చి ఆ యీ సందేహాలు కలగడం సహజమే. జీవించివున్న కవులనుగూర్చికూడా ఆ యీ అపోహలు కలగడం మాకు (తి॥ వెం॥) అనుభూతం. గుంటూరిసీమ తగాయిదా రోజుల్లో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిని అరువేల నియోగిగా భావించి సహాయం కోరినవారున్నారు. నిన్న మొన్న కీ॥ శే॥ లైన ముట్నూరి కృష్ణారావుగారి జీవిత చరమావస్థలో వొకరు స్వీయశాఖగా భావించి తాను నన్నువెక్కిరిస్తూ దూషిస్తూ వ్రాసిన అసంగతపు వ్యాసాన్ని ప్రకటించవలసిందని అర్థించడం వగైరా వొకశిష్యుని ద్వారాగా నేను విని వున్నాను. అన్నిటికంటే విచిత్రం వొకటి వుంది. అది నన్నయ్యభట్టుగారి యింటిపేరు — వాడ్రేవువారు అనేది—దీన్ని సాధించడానికి ఆ వ్యాసకర్త చేసిన పరిశ్రమ వుదాహరించవలసివస్తే చాలా పెరుగుతుంది. 1. నన్నయ 2. విశ్వసుందర ఆ యీ శబ్దద్వయం ఆలంబన విభావంగా పెట్టుకొని ఆయన స్వార్థాన్ని సాధించుకున్నారు. మమ్మ ( తి॥ వెం॥ ) నియ్యోగులుగా భ్రమించడానికి "వాడరేవు మా వెంకటరత్న మంత్రి" అనే శ్రవణానంద ప్రయోగం భవిష్యత్తులో సాధకం కాగలదు. ఆయన వైదీకి. క్రియలోమాట ఒక మహావ్యక్తి బయలుదేరిందంటే అందఱూ ప్రేమిస్తారు అన్నది సారాంశం.

టికి పెట్టెతాలూకువారు వచ్చి, స్టేషనులో వాకపుచేస్తే అక్కడివాళ్ళు కొంచెం ఆచోకీసూచించారు. ఈలోగా పోలీసువారికి రిపోర్టుచేసి ఆ బుద్ధి మంతురాలి యింటికి వెళ్ళి అడిగేటప్పటికి "అక్కడ పెట్టె, నేను యెవరి దైతే వారి కిద్దామని తెచ్చినమాట వాస్తవం. యిదుగో తమదయితే తీసు కోండి" అని యింట్లోనుంచి తెచ్చి వాకిట్లో పెట్టింది. అక్కడ తాళంతీసి చూడక పెట్టె యింటికి తెచ్చాక తీసి చూస్తే, రెండు నవరసుల నాగరం వొకటిన్నీ, బనారసు చీర వొకటిన్నీ తప్ప తక్కిన సాదాచీరలు వగయిరా వున్నాయి. ఆ బుద్ధిమంతురాలు చేసినపని కొంత తప్పేఅయినా, పేచీ పూచీలు లేకుండా ఆడగడంతోనే పెట్టెయివ్వడంచేత ఆపెయెదట తాళంతీసి చూడడం తటస్థించలేదు. అప్పుడు వెంటనే మళ్ళా ఆవిడ యింటికి వెళ్ళి అడిగితే, వొట్లూ, సత్యాలూ, యేడుపులూ, పెడబొబ్బలూ, ప్రారంభిం చింది. తత్త్వం పరిశీలిస్తే, మారుతాళంతో పెట్టె తెఱిచి ఆపె అంతకు ముందే జాగ్రత్తపడింది. కొంచెం చదువుకుంది. ధైర్యస్థైర్యాలు కలది. ఆ చుట్టుపట్ల కొన్ని పల్లెటూళ్ళకు వేదాంతోపదేశికురాలు. మంచి పేరు సంపాదించుకుంది. కనక ఆ గ్రామస్థులు శిఫారసుచేయడానికి ఆరంభిం చారు. సొమ్ముపోయిన గృహస్థుకూడా యేమీ అనలేక వెళ్ళిపోతూ వున్నాడు. వొకఫర్లాంగుమేరలో పోలీసువారు యెదురుపడ్డారు. ఫిర్యాదు చేసిన గృహస్థుకూ, యినస్పెక్టరుగారికీ గురుశిష్యసంబంధం వుంది. నమ స్కారాలూ, ఆశీర్వచనాలూ వగయిరా మర్యాద లయినాక, వక్తవ్యాంశం సంగ్రహంగా చెప్పి మఱి పదండి, వెడదాము అనేటప్పటికి యినస్పెక్టరు గారు మీరు దయచేయండి; మేము వెనుకనుంచి వస్తామన్నారు. తరవాత శిష్యుడుగారు రాత్రి 10 గంటలకు బంగారునాగరంతోటీ, బనారసు చీర తోటీ గురువుగారికి ప్రత్యక్షమైనారు. ఆ బుద్ధిమంతురాలు పోలీసువారికి భయపడి దొంగిలించిన వస్తువు లివ్వడమే కాక, తనమీద కేసుపెట్టకుండా బ్రతిమాలుకుని వుంటుం దనుకోవాలి, కాని, అంతతో గురువుగారి కర్తవ్యం నెఱవేరిందా! శిష్యుడినిమిత్తం యేదో కొంత వాక్సహాయం

(అనృతమయం) చేయక తప్పిందికాదు. యేదో లంచాన్నిగూర్చి వ్రాస్తూ మధ్య అవాంతరగాథలోకి కలం జారింది.

యేవో కొన్నిడిపార్టుమెంట్లంటూ లంచానికి యేకరు పెడతారుగాని పరిశీలిస్తే ప్రతిడిపార్టుమెంటులోనూ యీ లంచం కనపడుతుంది. యేవిధమైన పవరూ లేనిదికదా, స్కూలు టీచరీ. దానిలోకూడా లంచంతో నెఱవేఱే విషయాలున్నట్లు కుఱ్ఱలు (షస్టుఫారం లోపువాళ్ళు) వాళ్ళల్లో వాళ్ళు చర్చించుకుంటే శ్రుతమయినది. పూర్వం వీధిబళ్ళ రోజుల్లోను వుండేది. యీ లంచం, (ఆడవిడుపుడబ్బు చూ.) తోలుబొమ్మలాటకీ సినిమాకీ నాగరికతలో యెంత భేదం వుంటుందో యిప్పటి మాష్టర్ల చర్యకూ పూర్వపు ఆటవిడుపు డబ్బుకూ అంత భేదం వుంటుంది. ధనికుల కుఱ్ఱలలో నూటికి నూఱుగురూ కాకపోయినా, చాలావరకు యీ బాపతు డిగ్రీలవారే. యీ కలుపు దీనికి కొంతకొంత దోహదం యిస్తూవుంది. స్కూలుమాష్టర్ల జీతాలు యిప్పటికీ చాలా భాగం మాంధాతలనాడిచ్చినట్లే యిస్తూన్నారుగాని, పెంచినట్లు కనపడదు. పదార్థాల ధరవరలు అయిదాఱు రెట్లుకూడా పెరిగాయి. అందుచేత కుక్కదానం పట్టి కుటుంబరక్షణకు పూనుకోవలసి వస్తూవుంది.



## రాజయోగాలు

(ది 8—9—1948 సం॥రం ఆంధ్రపత్రిక నుండి)

జాతకశాస్త్రంలో ఆయాగ్రహసంపుటినిబట్టి కొన్ని రాజయోగాలు వ్యాఖ్యానించ బడ్డాయి. వాట్లలో వాహనయోగం ఒకవిధమైన రాజయోగం. గుఱ్ఱాన్ని యెక్కడం, గుఱ్ఱపు సారటు యెక్కడం, యెడ్లబండిని యెక్కడం యివన్నీ వాహనయోగాలేకాని, తుట్టతుదిది (యెడ్లు) కొంత బొచ్చు.

ఇవన్నీ చతుర్థస్థానాన్నిబట్టి నిర్ణయింపబడేవి. ద్వితీయాన్నిబట్టి కాబోలును, కొన్నిరాజయోగాలు వ్యాఖ్యానించ బడ్డాయి. అవి భోంచేసే పాత్రికు సంబంధించి వుంటాయి. ఆపాత్ర వెండిదా? బంగారుదా? అనే విచారణకు సంబంధించి వుంటుంది. ఆ యీ రాజయోగం మొత్తం 'యావరేజీ'ని యివి అన్నీ ధన సంపత్తిని సూచిస్తాయన్నమాట. "స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వాని పంక్తిగలదు." (శ్రీనాధుడు) ఇప్పుడు నిర్దేశించిన రాజయోగాలు గుఱ్ఱంతోటీ, యెద్దుతోటీ, వెండితోటీ, బంగారం తోటీ సంబంధించి వున్నాయి. పల్లకీ తోటీ, సవారీ తోటీ సంబంధించినవికూడా యిట్టివేకాని వాట్లని నరవాహనాలంటారు. "కుబేరో నరవాహనః" ఉత్తర దిక్కును పరిపాలించే వ్యక్తికిది పేరుగా వుంది. అయితే హరిద్వారంకాక యింకా పైనవున్న యాత్రలు (గంగోత్రి వగైరా) సేవించేవారిని చిక్కంలో యిముడ్చుకుని దర్భాసనంలాగ బుజంమీద పెట్టుకొని ఆటవికులు గమ్యస్థానం చేర్చడం వుందిగాని యీ యాత్రికులకు 'నరవాహనపదం' వర్తించడంలేదు. కారణం– యిది క్వాచిత్కం కావడమే అనుకోవాలి. అయితే, కుబేరుడు మాత్రం నరవాహన పదానికి అధికారిగా గ్రంథాలలో వాడబడడానిక్కారణం, పూర్వకాలంలో యీ మహాయోగం అతనికిమాత్రమే వుండే దనుకోవాలి. ధనవంతులుంటే వుండవచ్చునుగాని, పల్లకీలోయెక్కి సంచరించడానికి వొక్క ధనంమాత్రం చాలదు. యింకా యేవో కొన్ని విశేషాలు వుండాలి. దీన్ని గుఱించి వ్రాయడానికి వుపక్రమిస్తే ఠాంకంతా కదులుతుంది. గురుజాడ వారు (శ్రీరామమూర్తిగారు) 'రాజయోగి' అనే పత్రిక నా చిన్నతనం (మా కాకినాడశతావధానం రోజులలో) లో ప్రచురించేవారు. ఆ మాస పత్రికలో అప్పటికి పూర్వం రాజ్యంపాలించిన రాజుల రోజులలో పల్లకీ యెక్కడానికి అర్హత యే యే కులాలకి వుందో యే యే కులాలకు లేదో ఆ పత్రిక వొక మాసం ప్రత్యేకించి వ్యాఖ్యానించింది. నిమ్నజాతులలో అరుదుగా ధనాఢ్యులుండి, వాళ్ళు శుభశోభనాలల్లో పల్లకీ యెక్కవలసివస్తే రాజుగారి అభ్యనుజ్ఞ లేనిపక్షంలో మోసే జాతివాళ్ళు మోయరు.

మన మద్రాసు రాజధానిలో సవారీలుగాని, పల్లకీలుగాని మోసే జాతులు సుప్రసిద్ధంగా రెండు మూడు (చాకలి, సెట్టిబలిజీ,బెస్త)మాత్రమే వున్నాయి. కలకత్తా ప్రాంతంలో యీ వృత్తి హరిజనులదిగా వున్నట్టు మా పరమగురువులు చెప్పగా విన్నాను. ఆ పక్షంలో అస్పృశ్యత యెందుకు అడ్డు తగలలేదో ఆ విచారం ప్రస్తుతం కాదు.

కాశీలో పెండ్లికూతుర్నీ, పెళ్ళికొడుకునీ వూరేగించడం గుఱ్ఱం మీద. ఈ సందర్భం జగదేకపండితులు శ్రీ ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రుల వారి కొమార్తె వివాహంలో స్వయంగా చూచాను. పల్లకీ అంటే, జోడు కాగడాలంటే, సింహతలాటం మురుగు లంటే, యివన్నీ లైసెన్సు లేనిదే ఆ కాలంలో యెవళ్ళూ పెట్టుకోవడం అపరాధం.

ఒక మోతుబరురైతు కొడుకు జోడుకాగడాలు పెట్టుకొని యేదో శుభసందర్భంలో వూరేగుతూవుంటే రాజభటులు అటకాయించి "నీకివి యెవరిచ్చారు?" అని ప్రశ్నించడమూ, దానికి ఆ సంపన్నుడు ముష్కరంగా జవా బివ్వడమూ సుప్రసిద్ధం. "ఎవ,డిచ్చె జోడుకాగడ లవినీ తుడ, నీకు ననిన - ఆముదపుంజే నివి యొసగె........" (గీరతం చూ.)

ఈ సందర్భంలో తూ॥ గో॥ డి॥ యానాం (ఫ్రెంచిటవును) లో నేటికి సుమారు తొంభై యేళ్ళనాడు జరిగిన మానాటి గత్తరను గూర్చి నేను నా బాల్యంలో వినివున్నాను. అది యావత్తూ పల్లెజాతి పల్లకీ యెక్కడానికీ, ఆ వూరి కాపదనం అంగీకరించకపోవడానికీ సంబంధించినదే. పల్లెజాతిలో యానాంలోనేకాక ఆ చుట్టుపట్ల గ్రామాలలో (నీలపల్లి, తాళ్ళరేవు కోరంగి వగయిరా) క్వాచిత్కంగా ఐశ్వర్యవంతులున్నారు. కాపదనం తమ్ముబాధించకుండా ఫ్రెంచిప్రభుత్వాన్ని మద్దతుతీసుకొని వూరేగింపు సాగించడం మొదలెట్టేప్పటికి, ఆ వూరేగింపు తమకు అవమానంగా యెంచుకొని యానాంకాపులు తలుపులు తెఱవక యెవరి యిళ్ళల్లో వారు వుండిపోయారు. కొన్నివేల పరవాళ్లు (అగ్నికుల క్షత్రియులు) పంది, పోర, తీర్థాల

మొండి వగైరా సముద్రతీరస్థ గ్రామాలనుండి వచ్చి ఆ వూరేగింపులో పాలుగొన్నారు. ఆ వైభవం చూచి తీరవలసిందే. అని నేను 12 యేళ్ళ వయస్సులో వుండగా ఆ యుద్ధంలో నాయకులుగా వుండి ఫ్రెంచి గవర్నమెంటుచేత శిక్షింపబడి విడుదలయి వచ్చిన కాపుల తాలూకువారు చెప్పగా విన్నాను. గ్రామమంతా పోలీసులసహాయంతో వూరేగి అంతతో ఆగితే, భవిష్యత్తులో వ్రాయబోయే చిక్కు వచ్చేది కాదు. శివారు గ్రామం, కనగాలపేట (మానాటి కాపులు కొంతమంది వుండే గ్రామం) కూడా వూరేగడానికి పెట్టుకున్నారు. గ్రామంలో కాపులు యేమీ కలగజేసుకోలేదుగదా! యిక పల్లెటూరి వూరేగింపుకు మన సహాయం యెందుకని పోలీసు సిబ్బందీ తప్పుకున్నారు. ఆ గ్రామందగ్గఱ వాక కోడు (సహజమైన యేరు) వుంది. అది దాటితేకాని వూళ్ళో ప్రవేశం వీలుపడదు. ఆ కోడు రమారమీ అర్థఫర్లాంగు వుంటుంది. అక్కడక్కడ అందకపోయినా దాని గుట్టూమట్టూ తెలిసి కొంచెం యీత చేతనైనవాళ్ళకు దిగివెళ్ళడానికి అభ్యంతరం వుండదు. యెఱుగనివాళ్ళకయితే (వూళ్ళోవాడికి కాటిభయం పొరుగూరివాడికి నీటిభయం) మోసం తెస్తుంది. ప్రస్తుతం దాన్ని దాట తలచిన మఱికాళ్ళు "గోష్పదీ కృతవారాశిం" బాపతుకు దాని లక్ష్యమేమిటి? దిగి వెడుతూవున్నారు.

ఇక్కడ వాకమాట వ్రాయడం జ్ఞప్తిలో నిమిషం కింద ఉన్నదే యెందుకో మఱిచాను. వార్ధక్యం పాపాలకెల్ల భైరవుడుగా వుందికదా? దానికింద జమకట్టుకో గోరుతాను.

గ్రామంలో నా కావ్యవిద్యా ("రఘువంశము భుజంగరాద్గురు సన్నిధి నింపుమీఱగ బఠియించినాడ" గిరతం చూ.) ప్రథమగురువులు శ్రీరానుకుర్తి భుజంగరావుపంతులవారి గ్రామంకూడా ఆ కోడువడ్డునందే వుండడంచేత ప్రతిదినం రాకపోకలలో దిగి వెళ్ళవలసివచ్చేది. పుస్తకం (రఘువంశం) కొల్లాయితో నెత్తికి కట్టుకొని (అవసరమైతే యీదగలంగదా అని) దిగి వెళ్లేవాణ్ణి.

సరే. ప్రకృతం మత్స్యజీవులు కోడుదగ్గిఱకు రాకపూర్వమే మహా ప్రవాహంగా వస్తూవున్న మరకాళ్ళను చూచి భయపడి కాపులు (స్వల్ప సంఖ్యాకులు) వొక వుపాయం చేశారు. జనపనార తీసిన కఱ్ఱలు కోడు వొడ్డున రెండుగజాల పొడుగున కొన్ని మోపులు కట్టి దానిమీద తెల్లటి బట్టలు పరిచి వసంతం చల్లి ఆయుధపాణులై వాట్లదగ్గిఱ నిల్చివున్నారు. ఆ సమయానికి చిదపచిదప చీకటి తోడ్పడి మఱకాళ్ళు ఆ జనపనార కఱ్ఱమోపులు తమ తాలూకు జనం కాపులచే చంపబడ్డ శవాలుగా భ్రమించి సుమారు రెండుమూడు ఫర్లాంగులమేరలో దక్షిణదిక్కున వున్న గౌతమిని ఘూదుకొని, వొకడు పోయినతోవ వొకడికి తెలియకుండా "చెట్టుకొక రుడై" ప్రాణాలు దక్కించుకుని పాఱిపోయారు. అక్కడ గౌతమి, ధవళేశ్వరం వద్ద వున్నంత కాకపోయినా వొకమైలుకు తక్కువ వుండదు. వాళ్ళుగనక ప్రాణాలతో ఆవలివొడ్డు చేరుకున్నారుగాని యింక యెవళ్ళైనా అయితే 'నదీనాం సాగరో గతిః' కావలసిందే.

కాపులు చేసిన యీ వుపాయం బలిష్ఠులూ, అధిక సంఖ్యాకులూ అయిన అగ్నికులక్షత్రియులను యీవిధంగా పాఱదోలిన తరువాత యిక వూరేగింపులో మిగిలినసరుకు, (1) పెళ్ళికూతురు (2) పెండ్లికొడుకు, వీరెక్కిన పల్లకీ, (3) పల్లకీబోయీలు (4) పెండ్లివారి ముఖ్యబంధువులు యింతకుమించి లేరు. వీళ్ళని కనగాలపేటకాపులు జయించడాని కేముంది. గొఱ్ఱెల మందను తోలినట్లు అసలుగ్రామానికి తోలుకు వెళ్ళేటంతలో గ్రామంలో వుండే ప్రముఖులు కలిశారు. పల్లకీ విఱిచారు. శివాలయం వద్ద వున్న గోదావరీతూములో పూరఁబొఱ్ఱక్కి నానాహంగామా చేసి అగ్ని కులస్థుల యిళ్ళలో జొరబడి కొల్లగొట్టినట్లు చెప్పగా విన్నాను.

ఆ మహాకోలాహలం ఆపడానికి గవర్నమెంటు శాయశక్తులా ప్రయత్నించినప్నీ కృతకృత్యం కాలేక తుదకు బ్రిటిషుగవర్నమెంటుకు తంతి నివ్వడం జరిగిందనీ, కాకినాడనుంచి పటాలం వచ్చేలోపున గ్రామం దరిని వున్న వుప్పుటేటిలోవున్న తొట్టిపడవలూ, వేటనావలు పగయిరా

లన్నీ చిల్లులుగా కొట్టి రాకుండా కొంత ఆపినా చుట్టుపట్లనుంచి కొన్ని నావలవాళ్లు తమ నావలతో సహాయం చేసి పటాలానికి గ్రామప్రవేశం కలిగించినట్లూ తరవాత మానాటి కాపులలో ప్రముఖులైనవారిని అరెస్టు చేసి శిక్షించి నట్లు (కొన్ని యేళ్లు) చెప్పగా విన్నాను.

దీన్ని మానాటి గత్తర అని చెప్పుకుంటారు. దీనికి నాయకులుగా వుండేవారిని మానాటి కాపులనిన్నీ చెప్పుకుంటారు. యిదంతా జ్యోతిషానికి సంబంధించిన రాజయోగాంతర్గతమైన వాహనయోగాల ప్రస్తావనలో ప్రసక్తాను ప్రసక్తంగా అజతగిలింది.

రైళ్ళూ, మోటార్లూ, బస్సులూ, యింకా యెక్స్ప్రెస్సులు కుప్ప తెప్పలు ఆగర్భశ్రీమంతుడి దగ్గఱనుంచి శుద్ధగర్భదరిద్రుడుదాకా సులభ సాధ్యంగావున్న యీ రోజులలో గుఱ్ఱుపుసారటు యెక్కే సంపన్నగృహస్థు కొడుకు జాతకం చూచి యీ జాతకానికి వాహనయోగం వుందని చెపితే అపహాస్యాస్పదంగా వుంటుంది. యెందుచేత? యీ వాహనయోగం రైలు మోటారు వగైరాల ముందఱ దివిటీకింద దీపంవంటివికూడా కాకపోవడం చేత; ప్రస్తుత ప్రపంచం అనేకవిధాల మార్పుచెందడంచేత పూర్వకాలం ఋషులుగాని, యిటీవల తత్తుల్యులుగాని వ్రాసిన సందర్భాలు కొన్నిమార్చ వలసినట్లు తోస్తుంచి. పైని వుదాహరించిన కారణమే కాక సర్వులకూ లభ్యపదే సందర్భాన్ని రాజయోగంగా చెప్పడంలో విశేషం లేకపోవడం కూడా వొక కారణమే.

ముఖ్యంగా పల్లకీగాని యెక్కవలసివస్తే బోయీలచిక్కు కొంత వుంచి. అది యీ కింది గాథవల్ల గోచరిస్తుంది. జాతకచక్రంలో దానికి తగిన గ్రహసంపత్తి వున్నా బోయీలు వ్యతిరేకిస్తే ఆ యోగం ఫలించదు. యానాంసమీపం నీలపల్లెలో శ్రీ సీతారామస్వామివారికి ప్రతియేటా జరిగే కళ్యాణోత్సవాలు మన జిల్లాలలో యెక్కడా జరగవు. వొక్కొక్క వాహనం యెత్తడానికీ, మోయడానికీ అధమం అఱవైమందిదాకా బోయీలు

వుండాలి. ఆ గ్రామంలోనూ, చుట్టుపట్లా వున్న సెట్టిబల్జీలు అవాహ
నాలు మోయడం రివాజు, అ బోయీలకూ, బోగాలకూ తగాయిదావచ్చి
వాళ్ళు మేము మోసేది లేదన్నారు. తగాయిదా యేమిటంటే: స్వామివారి
తీర్థప్రసాదాలు అంతకుపూర్వం చాతుర్వర్ణ్యంవారి కిచ్చి, తర్వాత కళావం
తుల కిచ్చి తరవాత యీ బోయీలకు యివ్వడం రివాజుగా వుండేది.
యెవరో బోయీలకు మీరు చాతుర్వర్ణ్యంతర్వాత యిస్తేతప్ప అన్యథా
యిస్తే పుచ్చుకోవద్దని వుపదేశించారు. ఆ మంత్రం తలకెక్కి బోయీలు
భీష్మించుకొని కూర్చున్నారు. బోగాలు పట్టుపడితే మటివాక మేళంవల్ల
గాని, లేదా మేళంలేకుండానే గాని ఆ వుత్సవం నెఱవేఱుతుందిగాని,
బోయీలు భీష్మించుకుని కూర్చుంటే యింకోజట్టు కొత్తగావస్తే ఆకార్యం
నెఱవేఱదు. ఆ వాహనాల సామగ్రి వొక బంగాళా అంతవఱకు వుండేది.
ఆ స్వామివారి అలంకారం స్వామివారి అర్చకసోదరులలో పెద్ద సీతారా
మాచార్లగారు చేసేవారు. ఆయన పుట్టంధుడు కాని, యేలాగు అలవడిందో
ఆ స్వామిని ఆలంకరించే శక్తి అనన్యగోచరం: యే కంచివరదరాజస్వామి
వారికేనా ఆవిధమైన అలంకారం వుంటుందేమో కాని, మన దేశంలో యిత
రత్రి వున్నట్టు లేదని ఆశ్చర్యంగా చెప్పుకునేవారం. నేను చిన్నతనంలో
ప్రత్యక్షంగా ఆ కళ్యాణోత్సవాలను వీక్షించినవాణ్ణే. క్రమంగా అవి
యిప్పుడు లోపించాయి. ముక్కామల భోగయ్యగారు అనే పుణ్యపురుషుడు
స్వశక్తిచేత ఆర్జించిన ధనం వెచ్చించి ఆ యీ పుణ్యకార్యం యేటేటా
సాగించేవారు. యీ పుణ్యకార్యమే కాదు, యింకా యేవేవో పుణ్యకార్యాలు
'గోవిందద్వాదశి' వగైరాలు చేయడం నేను స్వయంగా యెఱుగుదును.
గోవిందద్వాదశికి చేసిన సంతర్పణ అన్ని పిండివంటలూ 12 లెక్కను
వుండే నియమం. అప్పుడు నేను ఆయనవద్ద సంగీతసంపాదనకు శుశ్రూష
చేస్తూన్నాను. ఆయన యావత్కాల బ్రహ్మచారిగావుండి, యీవిధమైన
పుణ్యకార్యాలుచేస్తూ వుండేవారు. సేవమోళాసంగీతంలో ప్రవీణులు'
పౌరాణికులు. యేదో కొంత పూర్వజన్మలేశం వుంటేనేకాని, యీలాంటి

పెద్దల శుశ్రూష లభించదు. (షరా) రాజయోగప్రకరణం ఆరంభించి జాతకగ్రంథాలలో ప్రక్రియకాలాన్ని అనుసరించి మార్చాలేమో దైవజ్ఞు లయిన విజ్ఞులు పరికింపగలరు. అని స్వస్తిచెప్పడాన్ని చదువరులు నాశక్తి లోపంగా తెలిసికోగలరు.



# నా త ప్పు లు

( ది 29—10—1949 సంగరంగ కృష్ణాపత్రిక నుండి )

మనిషి అంటూ వొకఁడు వున్నాడంటే వాఁడు యెంత జాగరూకుఁడుగా ప్రవర్తించే ప్రకృతి కలవాఁడైనా కొన్ని ప్రమాదాలు దొర్లక తప్పదు—శ్రవణానంద పీఠికలో—

తే. గీ. ఎచ్చటేనియు తప్పుండుటెరికేని
ధర్మమే భ్రాంతిపురుషుల ధర్మమగుట
పుటకు దెబ్బది పదోకొండు తొటుకులుండు
వారు వీరును నొక తీరువారు గారు.

అని వ్రాసివున్నాము. యితరులతోపాటు మాకున్నూ— "తలంటూ వుంటే పేలువుండకమానవు గనుక" యిదిన్నీకాక— "భ్రాంతేః పురుష ధర్మత్వాత్ దిశమస్త్వమసి" అని శ్రీ మదాదిశంకరుల వచనం వున్నది కనక యెంత బ్రహ్మాండ నాయకుఁడైనా రచనలో కొన్ని ప్రమాదాలు దొరలక తప్పదు. యిఁకనల్లా యితరుల నూఱుపుటలకు వొక ప్రమాదం దొర్లితే తదితరులకు వొక పుటకే నూఱు దొర్లడం. శ్రీ శిష్టకృష్ణమూర్తి

గారు విజయనగర సంస్థానానికి దయచేసినప్పుడు ఆ సంస్థానీకులో వారి చుట్టాలో తాము రచించిన పద్యాలు కొన్ని చిత్తగించవలసిందని వారి కిచ్చారనిన్నీ, కృష్ణమూర్తిగారు తదేకదృష్టితో చూస్తూవున్నారనిన్నీ, ఆ సందర్భంలో పద్యకర్త "అయ్యా! తప్పులా? అండి! అంత తదేక దృష్టితో పరిశీలిస్తూన్నారు" అని కొంత ధైర్యంగా ప్రశ్నించాడనిన్నీ దానికి సదరు శాస్త్రుల్లుగారు (విద్వత్కవయః కవయః) "నాయనా! తప్పులు కాదు, ఒప్పులే" అని చమత్కరించారనిన్నీ, దానిమీద, పృచ్ఛకుఁడు తలవంచుకోవలసి రావడంవగయిరా సంగతి సందర్భాలు పరమగురువుగారి వల్ల విద్యార్థిదశలో వినడం. పృచ్ఛకుడికి సదరు శాస్త్రిగారు యిచ్చిన— ఒప్పులే, అన్న జవాబు యెంత గంభీరముగావుంది, యెంత మర్మభేదకంగా వుందో వివరింపనక్కరలేదు. "అబ్బాయీ నీ రచనలో యెక్కడేనా ఒప్పనేది మందుకేనా వుంటేగదా? తప్పులకోసం వెతకడం? యెలుగ్గొడ్డుకు తంటసమన్నట్లు, లేదా కంబళీలో తింటూ వెంట్రుకలు వెదకినట్లుంటుంది నీరచనలో తప్పులు వెదకటం. కనుక నే నందుకోసం వెదకడంలేదు గాని నీవు కష్టించి రచించి నాకు చూపినపుడు, యెక్కడేనా ఒక్క ఒప్పేనా దొరక్కపోయింది గదా? అని చూస్తున్నాను" అని యిచ్చిన జవాబు— "లోటులరసనబె, ఆకులుగాసుండునట్టి యవియో? కవితల్" అని నిలిచిపోయింది. పండితరాయలు "నోచేచ్చుష్కృత మాత్మనాకృత మివ స్వాంతాద్బహిర్మాకృథాః" అంటూ ఒక కవికి సలహా యిచ్చి వున్నాడు.

శ్లో॥ "నిర్మాణేయది మార్మికోసి" అన్న శ్లోకం చాలా పెద్దది. ముఖ్యమైన భావం వ్రాస్తాను.

"అబ్బాయీ! కొంతేనా రసవంతంగా రచించడం చేతనైతేనే గద్యమో పద్యమో, రచించినది ప్రాజ్ఞులకు వినిపించు. అలా కాని పక్షంలో వ్యసనాలలో యిదిన్నీ ఒకటిగనక రచించడం జరిగినా, దానిని యెవ

రికీ వినిపించక దాచిపెట్టుకో. తెల్లవారిలేచింది మొదలు నిద్రించేలోపున యెన్నిపాపాలు (తెలిసీ తెలియకానున్నూ) నీవు చేయడం లేదు ? ఆ దోషాలు దాచిపెట్టినట్టే (యిదిన్నీ వొకటనుకొని) దాచిపెట్టుకో. దాచడ మెందుకంటే 'కాలోహ్యయం నిరవధిః' కనుక యెవరేనా అనుగ్రహించి దిద్దిపెడితే అది పండితుల యాదరణ పాత్రం కావచ్చును - సతి కుడ్యేఖలు చిత్రం."

ప్రసక్తానుప్రసక్తంగా యితరం కొంత చేరినా, తి. వెం. కవుల రచనలలో ప్రమాదాలు చూపడం ప్రస్తుతం. యతి తప్పడంగాని ప్రాస తప్పడంగాని తటస్థించినా దాన్ని ప్రాజ్ఞులు పరిగణింపరు. యిఁకనల్లా వ్యాకరణజ్ఞానంలేని ప్రయోగాలు దొరలడం, యిది పండితులు యేవగించు కుంటారు. చూపుతాను. శ్లో॥ ఏనా మనూనాకృతి భాసమానాం- విధినేవ మాన్యాం "యీశ్లోకంలోవుండే ఏనాం అనేపదం తి. వెం. కవులు అదృష్ట వంతులని, పండితులే అని విద్వల్లోకం చెప్పుకోవడానికి నిస్సంశయంగా "మూలకంఠం ముకుందం."

మొట్టమొదట కాకినాడసభ (సంపూర్ణశతావధానం)లో సీతాకళ్యాణాన్నిగూర్చి వర్ణించవలసి వచ్చినది. అన్వాదేశ సందర్భంలో గాని, ఏతచ్ఛబ్దానికి ఏన అనే ఆదేశంరాదు. అవధానరచనలో వొక పద్యానికీ యింకొక పద్యానికీ అర్థసంబంధం యేమివుంటుంది ? వొక పృచ్ఛకుఁడు కస్తూరి మీఁద యేదో శ్లోకంగాని పద్యంగాని (రెండూ వొకటేగాని వ్యవహారాన్ని బట్టి పృథక్కృ-గా వాడడం, వ్యవహారతశ్చ) చెప్పవలసిందంటే వెంటనే యింకొక ప్పృచ్ఛకుఁడు పుల్లిగడ్డమీఁద యేదో చెప్పవలసినదని కోరతాఁడు. "కించిత్కార్యం విధాతు ముపాత్తస్యకార్యాంతరం విధాతుంపునరుపాదాన మన్వాదేశః " అనే లక్షణపరిష్కారానికీ దీనికీ యేమి సంబంధం ? యీ ఏనాం, తి. వెం. కవులను బోల్తాకొట్టించిందన్నమాట. యెప్పుడు "ఏనాం

సీతాం" అని సీతకు విశేషణంగా వుపయోగించు కున్నప్పుడే. మఱివొక రీతిని సమన్వయించే పక్షములో—

"అన్వాదేశపు చిక్కు" లేదుగనుక కొంత తెరిపికి రావచ్చును. మామీఁద నిర్నిమిత్తంగా ద్వేషంపెట్టుకొని (యీ కుఱ్ఱాళ్ళకి యింతటి గౌరవమా అని అయితే కావచ్చు) వొక వృద్ధపౌరాణికుఁడు (కవిత్వహీనా స్తుపురాణభట్టాః) ఆకారణంచేత యేదో కర్ణాటకలహం కల్పించి తను కోరి నది సరిగా పూరించలేదని సభచేయించిన వారితో చెప్పి తంపిపెంచెను. అదృష్టవంతులను చెఱిపేవాడు వుండడు అనే లోకోక్తి యావత్తూ తోడ్పడి ఆ....ఏనాం. ..మాకే వినియోగించి ప్రతివాదికి అపకరించి (అః—ఇనః—యస్యాః, అని విఱిగి) యేమివ్రాసేది, యెంతో అవమానాన్ని కలిగించింది. ఆయన ఆశ్లోకానికి సంఘటించిన ఛందోదోషం ఉపజాతివృత్తం కాదనేది. నాలుగు చరణాలలో రెండు, ఉపేంద్ర, మఱిరెండు ఇంద్రవజ్ర గాను ఉండనక్కరలేదనిన్నీ, యేదోవిధంగా సంకల్పిస్తే తావన్మాత్రంచేత ఉపజాతి అవుతుందని, రఘు వంశం ద్వితీయసర్గ వ్యాఖ్యానంవల్ల స్పష్ట పడింది. ఆయన గ్రామ్యంగా అనగా యేకసక్కెంగా (కుఱ్ఱవాణ్ణిగనక) కుమార సంభవం ప్రథమసర్గేనా చదువుకున్నావా? అని ప్రశ్నించేటప్ప టికి నాకు జన్మదారభ్య అలవడిన గ్రామ్యధోరణితో "తాతగారూ! రఘు వంశం చదివికదా? యెవరేనా కుమారసంభవం చదవడం? యీ రఘు వంశం ద్వితీయస్సర్గ చిత్తగించండి" అని ఆ శ్లోకం (అథప్రజానామ ధిపః—ధేనుమృషేర్ముమోచ) తీసిచేతికిచ్చాను. యిస్తేయేముంది? పాపం ఆ బ్రాహ్మడికి పంచప్రాణాలూ "ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతిగా" మళ్లా యథాపూర్వస్థితి కలిగేనా? అని సంశయించవలసి వచ్చింది. యేం వ్రాసేది. అది చాలా వర్ణించతగిన ఘట్టం, నాకు యెన్నటికీ మఱుపు రాదు.

నా యాపత్తు ఔన్నత్యానికీ నాఁడు ఆ బ్రాహ్మఁడు చూపిన "అప్రతిపత్తి మూఢమనస్కత్వమే" కారణమని నా దృఢమైన విశ్వా

సం. సభచేకూర్చిన, కీ. శే. లు శ్రీ బాదం వేంకటరత్నం, దురిసేటి శేషగిరిరావు, బోడా రాజు, కప్పగంతుల రామశాస్త్రిలుగార్లు కూడా యీ సందర్భంలో యీ కుఱ్ఱలు అపజయం పొందుతారేమో అని చాలా భయ పడ్డారు. లోపాయకారీని కబురంపారుకూడాను. నేను వొక్కటేమాట జవాబు చెప్పేవాణ్ణి. "తప్పకుండా యీ విషయంలో మాకు జయం కలిగి తీరుతుంది. మీరుభయపడవద్దు. అవధానం పూర్తిపిమ్మట కావచ్చు ముందు ఆ యీ మాశ్లోకంలో ఆ శాస్త్రుల్లుగారు అపాదించే దోషాలు నిజం గా వున్నాయా ? అనే విషయంతేల్చండి." అనేవాణ్ణి. సభ సమకూర్చిన వారికి—— "పాపం, పిల్లకాయలే తీరా సభపెడితే పెద్ద పండితులతో వాదించి నెగ్గగలరా ? వోడిపోతే జరిగే సన్మానం జరుగుతుందా ? యేదో విధంగా జరిగితే మాత్రం అది యేమంత శోభస్కరంగా వుంటుంది, యిట్టి కవుల సభలు ధనప్రధానాలుగా నుంటాయాయె " అని యేమీ తేల్చలేక, వుపేక్షించి తాస్సారం చేసినకొలఁదీ ప్రతిపక్షంగా (తీరికూర్చున్న....పిల్లి తల) నిష్కారణంగా వచ్చిన పండితుఁడు ' మీ పండితులకూ మాకూ సభ యెప్పుడు పెట్టడం ' అని హెచ్చరిస్తూ వుండటం సభాసంధాయకులు యేమండీ? అని మమ్మ హెచ్చరించడం మేము గుట్టుగుట్టుగానే అట్టిపెట్టి "సభ పెట్టండి మీ కిష్టమైన పండితులను రప్పించండి వారి ద్వారా మా జయం మీరు ధ్రువపఱచి, కోటలో పాగావేసి తీరుతాం, నైవాత్ర సందేహః " అని సూత్రప్రాయంగా జవాబిచ్చి వూరుకోవడం. యింత కంటే విస్తరిస్తేగాని లోపాయికారీగానే కాని మేము మాలోనేనా ' త్వం శుంఠా త్వంశుంఠా ' ప్రకరణంలోకి దిగితే, సంపాదించి భద్రపఱచిన బైరాగీచిటుక ' గోడలకున్ చెవులుంటాయి కనుక ' బట్టబయలైతే అవలి పండితుఁడు పలాయనాన్ని చిత్తగిస్తే మనోరథసిద్ధికి అంతరాయం కలుగు తుందేమో అనే సందేహంచేత దీన్ని గూర్చి (పర్వత నారదులవలెనున్న) మేము కూడా ఆ శతావధాన మధ్యకాలములో మాట్లాడుకొనే వాళ్ళంకాము. కాకినాడ యీవత్తూ మాకు జయంకలగాలని వేయిదేవుళ్ళకి మొక్కేప్రేమ

తోవుంది. రేపు అవధానపూర్తికి పెద్దసభ జరుగుతుందనగా యీవేళ యీ అవాంతరసభ జరిగించి. సభలో ఆ శాస్త్రుల్లుగారికి యెంత అవమానం జరగాలో అంతాజరిగింది, దాన్ని తెలిపేదే మా 'కింకవీంద్ర ఘటాపంచానన'. ఆయన వోడిపోయిన తరుణంలో యెవరో మిడి మిడి జ్ఞానసంపన్నులు మమ్మల్ని అభినందించే వాక్యాలలో 'తిలకాష్ఠ మహిషబంధన' మన్నట్లు యీ సమాసం దొర్లింది. బిరుదులు చాలా యీలాటి సమాసాలలోనే వుండడం అనుభూతంగనుక మేము గద్యలో వాడుకుంటూ వచ్చాము. లోకంలో పరిపాటిగా యిది మా బిరుదుగా చలామణీ అవుతూ వచ్చింది. దీన్ని గురించి యెవ్వరూ మమ్మ ప్రశ్నించినవారు లేరు. సుమారు పుష్కర కాలం జరిగిన తరవాత మాయెవ్వర్తు పట్టాభిషేకాన్ని విమర్శిస్తూ ఆసందర్భంలో దీనికి శ్రీ పేరి కాశీనాథశాస్త్రుల్లుగారు — 'కొంగలు' అని అర్థం కల్పించారు, పెద్ద విద్వాంసులు చేసినవ్యాఖ్యానం కాదనడంకంటే అంగీకరించడంలోనే స్వారస్యంయెక్కువ (దీనినే అభ్యుపగమ్యవాదమంటారు) వుంటుందని కొంగలమే అని అంగీకరిస్తూ ఆ కొంగలకు ఆహారం చేపలు కావాలి కనక ఆ శాస్త్రుల్లుగారి నామధేయంలో వున్న అక్షరాలకు మేము చేపలు అని అర్థంచెప్పి, అయ్యా! శాస్త్రుల్లుగారూ "పరిణతిరవధార్యా యత్నతః పండితేన" అనే భర్తృహరి శ్లోకాన్ని జ్ఞాపకం చేశాం, మీకు యీ 'కింకవీంద్ర ఘటాపంచానన' బిరుద మెవరిచ్చారని అడిగినవారైతే తెలుగాని నేడు కాకపోతే రేపేనా యెవరేనా ప్రశ్నిస్తే మనం కాకపోతే శిష్యులో, ప్రశిష్యులో జవాబుచెప్పాలి కదా ? అని జీవితచరిత్రలో

క. ఇంకొకటి పేరికింగల
కింకవిగజసింహ బిరుదు కేవలము స్వద
త్తాంకము విద్వత్కవ్యా
ద్యంకములకు దాతలితరులని యెఱుఁగనగున్.

అని వ్యాకరించాం. యిది యావత్తూ బహిరంగమే గాని చాటూమాటూలేదు. మా వ్యాపారం చదరంగమే గాని పేకాటకాదు. యిటీవల

యేబిరుదుగాని వహించడం చాలా అపహాస్యాస్పదమని తోఁచి వాట్లజోలీ జోక్యం మానుకున్నాం. మేము వదిలినా మమ్మల్ని వదలని, శతావధాని, బిరుదాన్ని మాత్రిం చేవ్రాల్లో లిఖించుకుంటూ వుండడాన్ని సుప్రసిద్ధపత్రిక, 'కృష్ణ' నేఁటికి సుమారు 15 వత్సరాలనాఁడు వ్యాకరించినట్లు జ్ఞాపకం. ఆ పత్రికే మహామహోపాధ్యాయ బిరుదాన్ని గూర్చి కూడా వ్యాఖ్యానించినట్లు జ్ఞాపకం. నాకు యూనివర్సిటీవారు కళాప్రపూర్ణ బిరుదాన్ని యిస్తూ తెలుపుడు చేసినప్పుడు దాన్ని ధరించుటకు తగిన కళలు (చతుష్షష్టిలో) నాకు యేమాత్రిం వచ్చునని శ్రీ కట్టమంచివారిని ప్రశ్నించాను. కాని వారు దానికి తూష్ణీభావమునే వహించుటచే, నేను దీనికి తగనని తెలుసుకున్నాను. యిది యింగ్లీషునుండి పరివర్తనంపొందిన బిరుదంకనక అవయవార్థ విచారణకు లొంగదనుకున్నాను. నా తప్పులు అనే శీర్షికక్రింద దీన్ని వ్యాకరించడం, అర్హతలేని బిరుదును ధరించడం యెంతో దూరంగా వుండదు గనక విజ్ఞులు క్షమింపక పోరనుకొందును.

ఏనాంశబ్దంనాకు ధాతురత్నాకరంలో ప్రయోగించుకుంటే నిర్దుష్టమై, అవధానంలో ప్రయుక్తమైనపుడు దుష్టమై, తుదకు ఆశబ్దం, సర్వనామగణంలో వుండక యీవలికి వచ్చి బహువ్రీహి (అః విష్ణుః, ఇనః, పతిః, యస్యాస్సా, ప్రాగ్జన్మనీత్యాశయః) యై లక్ష్మికి వాచకమై నాకు లక్ష్మిప్రాపకమైనది. కనుక కొంతవిస్తరించినాను కాని యింత మాత్రించేత యెవరో కుశాగ్రబుద్ధులు తప్ప సర్వేసర్వత్రి అవగతంచేసుకోఁగలిరా? అనే శంక బాధిస్తూనే వుంది. స్కూలుశిష్యులు కాక పూర్వరీతిని గురుభ్యోనమః, అని చదివిన శిష్యులున్నారు గనుక తద్వారాగాను దీని తత్త్వం తదితరులు తెలుసుకొందురని విరమిస్తున్నాను.

శ్లో. క్లీబపుంసోస్తుదేహోఽస్త్వేకోమాతర్నతత్ర బహుచిత్రమ్
స్త్రీపుంసయోరపితథా లలితేయద్దృశ్యతే మహచ్చిత్రమ్.

శ్లో. పద్మం నయోగ్యవస్తు । స్యాదేవాత్మోపమిత్యవస్థాయామ్
ఇత్యేవ మద్రిజాతే । కంఠరవేణాంబః వక్రినేత్రింతే.

అల మతివిస్తరేణ- పై రెండు శ్లోకాలూ యెందుకు రంగానికి అవతరింపచేశానంటే వినండి. నన్ను కాంగ్రెస్సు గవర్నమెంటు తెలుఁగు ఆస్థానకవిగా మాత్రమే గావించి వున్నారు. అందుకు నేను వారికి అనేక కృతజ్ఞతాభివందనములు పొనర్చుచు అవసరమైతే సంస్కృతానికి కూడా నా కవితారచన యేవిధంగా వుంటుందో మచ్చుచూపడానికై వుదాహరించాను. "యీ మీసము రెండుభాషలకు మేమె" "అహమేవ పండితః" అనేవయస్సులోని ప్రతిజ్ఞను బైటికి తెచ్చిన నన్ను విద్వత్పరంపర అహం నపండితః అనే తరగతిలోకి తెచ్చి క్షమింతురని విశ్వసించుచు ప్రస్తుతవిషయము నుపక్రమించుచున్నాను.

మా యావదైశ్వర్యానకూ తావలమైన ఏనాం ప్రయోగం ప్రతిపక్షి ఉచ్చరిస్తే తప్పు. మేము ఉచ్చరిస్తే వొప్పు. జనకమహారాజు రామునిచే సీతా పాణిగ్రహణం చేయిస్తూ, ఏనాం, మత్పుత్రికాం, అనడంలో వెనుక సీతనుగూర్చిన ప్రసక్తి లేదుగనుక యేతచ్ఛబ్దానికి ఏనాదేశ సంపాదకమైన ఏనాదేశం రాదు. దీన్ని గూర్చి జాతకచర్యలో కొంత విపులంగా వ్యాకరించాను గాని అదిన్నీ చాలదు. యిది మాకు విజయాధాయకం కావడమేమిటి? యితరులకు తద్భిన్నత్వ ప్రతిపాదకం కావడమేమిటి అనే సంశయం కలవారు దర్శనమిప్పిస్తే సుమారు 15 నిమిషములు ముఖాముఖీని వుపన్యసించి సంతుష్టి కలిగిస్తాను. వ్రాస్తే ఎంతవ్రాసినా తేలదు. యింతకాదు గాని యింతకన్న కొంచెం తికమకతో చేరినది యింకొకటి వుంది. అది "అభణం" అనేది. దానికి వ్యాకరణ వాసన వుండాలి. దాన్ని గూర్చి తెలపడం తిరుమంత్రరహస్యం తెల్పడంవంటిదే. ముఖాముఖీని తెల్పడంలోనే స్వారస్యంవుందని ఉపదేశానంతరం గోచరిస్తుంది. నాకు తప్పుగా పడ్డదాన్ని ఇతరులు సూచించకుండానే గ్రహించి దిద్దుకోగలను. లేదా, అది తప్పే అని అంగీకరిస్తూ, శాస్త్రజ్ఞ మర్యాదననుసరించి మార్గాంతరాన్ని అవలంబించి తృప్తికరంగా వ్యాకరించగలను. చూడండి, కౌముదిలో "ఇందరివరుణ" సూత్రంలో.

"కథం బ్రిహ్మణీతి" అని శంకించి, "బ్రిహ్మణమానయతి "అని మార్గాంతర మవలంబించి సాధించఁబడిందా? లేదా? అదే విధంగా సాధించి చూపుతూ యథార్థంకూడా వొప్పుకోవడం సహృదయ లక్షణం. మచ్చుకు చూపుతాను, జాతకచర్యలో ఆరంభంలో "మృతాయితుఁడౌ సుతుడు" అని ఒక పద్యంలో ప్రియోగింపఁబడ్డది. "కుమారాయితశక్తి శాలి" అన్నదానిలో స్వరయతికి ప్రాపకం ఎలాగ లేదో దీనిలోను (మృత + అయిత) అలాగే లేదు. అయినప్పుడు ఇది ఆక్షేపణీయం కావడంలో ఆశ్చర్య మేమున్నది? కనక అప్పకవీయమాత్రిం బాగా వచ్చిన వారేనా ఆక్షేపించవచ్చు. ప్రస్తుత మాక్షేపించిన వారున్నూ అంతకన్న వ్యాకరణంలో (ముఖ్యంగా ఈ స్థలంలో) కృషిచేసినవారు కాకున్నను ఆక్షేపణయుక్తమైనది కావటంచేత ప్రయోక్తకు జవాబు చెప్పక తప్పదు.

"బ్రిహ్మణి" అనే రూపాన్ని సాధించినట్లే మార్గాంతరంచేత దీన్ని సాధించి చూపుతున్నాను.

మృతాయిత శబ్దమునకు "మృతశ్చాసౌ అయితశ్చ" అనే విశేషణ సమాసంచేసి మృతుడున్నూ, అయితుడున్నూ (శుభమును పొందువాడు) అని అర్ధంచెపితే, మృతుడుకాడు కాని మృతిపొందినట్లున్నవాడు, కొలది గడియలలో బ్రితికి భవిష్యత్తులో గొప్పయోగమును అనుభవించ తగ్గవాడున్నూ అను అర్థం. సహృదయ రంజకమైనది వచ్చి, మొట్టమొదటి అర్థంకన్నను స్వారస్యం తెచ్చును. 'స్థితస్య గతి శ్చింతనీయా' అను న్యాయముచే, అర్థాంతరం చెప్పి సమర్థించినను, 'అసలు పొరపాటే కాదు' అని నేను వాదించలేదు. ఈ త్రోవ శాస్త్రజ్ఞులు పలుచోట్ల త్రొక్కినదేకాని నేను కల్పించినదికాదు. అసలు శాస్త్రవాసనంటూ ఉన్న వారికయితే ఎక్కడనేని ప్రమాదంపడ్డా అది యథాకథంచిత్తుగా సమర్థింపబడుతుందిగాని తదితరులు ఈ త్రోవలు త్రొక్కనులేరు, సమర్థించనులేరు. అర్థము సంగ్రహించి వ్రాసితినిగాని 'మృతాయిత' శబ్దందగ్గర విస్తరించ

వలసి వచ్చినచో మృతుఁడేమిటో, అయితుఁడేమిటో (అయశ్శుభావహో విధిః) ఇంకను వ్యాకరించవలసి వుంటుంది. వ్యాకరించినా, వ్యాకరణజ్ఞుల కుఁదప్ప అది తదితరులకు సహాయంచేయదు గనుక ప్రస్తుతం ఈ విషయ మింతటితో ముగించి మరొకటి మరొకప్పు డందుకొంటే అందుకొంటాను.

---

# నేటిబిరుదుల పరమరహస్యం

(ఆంధ్రదైలీ)

అకించిత్కరాలు, ఐశ్వర్యానికీ, కవిత్వానికీ సంబంధంలేదని నా మనవి. శ్రవణానందం వెం. శా. చరిత్రే. మనుచరిత్ర పెద్దన్న చరిత్రే. ("వదలక మ్రోగు నాంధ్రకవి వామపదమ్మున నున్న నూపురం బుదిత మరాళకంఠనినదోక్తుల నేమనిపల్కె దెల్పుడీ, గుదియలసాని .... అమర నూత్న పురంధ్రులతోడ బల్కెడిన్" చూ) మేఘసందేశం, కాళిదాసుచరిత్రే యిట్టి వుత్ప్రేక్షలు లేకపోలేదు. భవతు. లోకంలో శ్రవణానందానికి వున్న పేరు సామాన్యమయింది కాదు.

క. ఒక శ్రవణానందమ్మున
నొక పద్యమునందు గల్గునొకచరణమునం
దొక యక్కరమున కిచ్చిన
సకలమ్మగురత్నగర్భ చాలునె తూపన్.

ఈ విధంగా సుకవిలోకంచేత ప్రశంసింపబడే శ్రవణానందం వెం. శా. చరిత్ర అయినంతమాత్రంచేత దాని గౌరవాన్ని గోలుపోతుందా? ఆలా గోలుపోయే పక్షంలో "తుమ్మితే నుండనిముక్కు దగ్గిన మఖం

డునె ?" అన్నారు శిష్టు కృష్ణమూర్తిగారు యింకోచోట. అది వొాక కవికుమారుని చరిత్రిఅంటూ శ్లేషించారని జ్ఞాపకం. భవతు. కవికుమారు నిది కాదు కవిదే. యెందుకీ అప్రస్తుతప్రసంగం. యిక యీ విమర్శ ఆపు తాను. మళ్ళా బిరుదుల విషయం అందుకుంటాను.

ఎవరినో పెద్దవారిని పట్టుకుంటే వారు ఆలాగే అని సభలో ఆకాస్త మాటాప్రపోజు చేస్తారు. చేసినవారు మంచో చెడ్డో? అంతటితో "గప్‌చిప్" అని వూరుకోరు. యెవరేనా ఆప్తులు రహస్యంలో దీని తత్త్వం చెప్పవల సిందని మోమోటపెడితే తత్త్వాన్నీ యేకరుపెడతారు. యీ సంగతి నేను సుగృహీతనామధేయులు కీ. శే. వైజాగు ప్రభల పంతులుగారి ద్వారా విని జీవితచరిత్రలో రిజిష్టరు చేసినట్లు జ్ఞాపకం. ఆకారణంచేత బిరుదులు స్వయం గా పెట్టుకోవడంలోనే వీలు కనపడుతుంది. "క్వచిత్ క్షోణీంద్రో ననియా మకః, స్వతంత్రిం జగత్"

మన బిరుదాల విషయంలో ప్రభుత్వం జోక్యం కలిగించుకోదు. మహామహోపాధ్యాయ బిరుదం మాత్రిమే వారి అధికారానికి లోబడేది. ఆ బిరుదాన్ని వారు (అయాచితంగానే అందాం) యిచ్చినా తన పాండిత్యం యెంతో తెలిసిన వెం. శా. దానికి వొాకదండం పెడతాడు, అందుకు ధర్మా ప్పారాయణింగారి నాటి యితిహాసం వుటంకిస్తే సరిపోతుం దనుకుంటాను.

కొత్లేటిప్రాంతం అంతా శనివారప్పేట జమీనులోనిదే. రాజాగారు ఆప్రాంతం చిత్తగించడానికి దయచేశారు. నక్కల గోలమూలాన్ని నిద్దర పట్టడంలేదు అప్పారాయణింగారికి. ఆదురవస్థలో మంత్రితో అన్నారు గదా ? "యేమిటయ్యా ! యీ దిక్కుమాలిన గోల" అన్నారు. మంత్రి రాజాగారి ధర్మస్వభావాన్ని బాగాయెఱుగు. యీ సందర్భంలో కొంత సం పాదించడాని కవకాశం వుందని కనిపెట్టి "బాబూ ! చలికాలం. ధర్మప్రభు వులకు మొఱపెట్టుకుంటూన్నాయి" అని మనవిచేశాడు మంత్రి. ధర్మప్రభువు కొన్నివందలకో, వేలకో సైనుతానులకు సెలవు దయచేయించారు. ఆ తర

వాత కూడా యీ గోల తప్పనేలేదు. రాజాగారు "ముప్పట్లిస్తిమిగదా, యింకాగోల మానలేదే" మని ప్రశ్నించారు. మంత్రి బహుతెల్వికలవాడు. 'మహాప్రభూ! దేవరవారి ధర్మమా అని సుఖపడుతున్నాము అని స్తోత్రం చేస్తున్నా' యన్నాడు. ప్రభువువారు సంతోషించారు.

నానాటికీ "మహామహోపాధ్యాయ" బిరుదంగతి యీ రీతికి వచ్చి వుందని కృష్ణవ్యాకరించిందని జ్ఞాపకం. పట్టవలసిన వాళ్ళని పట్టి చేతులో కవిత్వమంటూ వొకటి వుంది గనక మాబోటి వృద్ధులు 'బళి బళీ! మీ తాత బల్లెమ్ము చేబూని పుల్లాకు తూటుగా బొడిచినాడు.' అని కొంతకృషి చేస్తే వారు వారు లోగి శిఫారసు చేస్తే ప్రభుత్వం విదేశీయం కనుక ఆయీ బిరుదున్నూ సంపాదించవచ్చు. కాని యీ ఆశ్రయణంకన్న, యీ 'గోకులాష్టమి' సామెత సంపాదన కన్న నాకు "స్వయం రాజా స్వయం మంత్రీ" పద్ధతిని బిరుదులు సంపాదించు కోవడం నిరాక్షేపణీయమైన మార్గంగా తోచింది. అయితే యెవరేనా 'నీ కీబిరుదెవరిచ్చారు' అని ప్రశ్నిస్తేనో? అసమర్థుడికైతే పరాపేక్ష గాని ఆమాత్రం దిక్కేవుంటే సమర్థుడికి చిక్కులేదు. దేవీభాగవతంలో యేలావుందో చూడండీ.

ఉ. శక్తివిహీనుఁ డేపనికి జాలడు శక్తియె సర్వభూత సం
 సక్తత జెంది సర్వకృతి సాధనమై తనరారుచుండు నా
 శక్తియె ముక్తిసాధనము శక్తియ సర్వము శక్తిలేనిచో
 శక్తులుగారు రుద్రహరి సారససంభవ ముఖ్యనిర్జరుల్."

అనే పద్యప్రకారం 'నాశక్తి నాకిచ్చింది, నన్నడగడానికి నువ్వెవరు' అని "ఆముదపుచేనూ, రయితూ" మాదిరిగా జవాబుచెప్పొచ్చు. యీ మార్గం గిరతంలో వుదాహరించిందే. 'ఎవడిచ్చె జోడుకాగడ లవిసీతుడ? నీకు ననిన నాముదపుంజే నివి యొసగె' చూ.

యిప్పుడు ప్రతిజాతీ స్వాతంత్ర్యాన్ని కోరేరోజులు. కవులుమాత్రం పరతంత్రులుగా బిరుదులకొఱ కెందుకు వొకళ్ళని ఆశ్రయించాలి. ఆశ్రయిస్తే యిస్తారే అందాం. పిదప "పంచశుభం పంచాశుభమ్"

యీ మాత్రం భాగ్యానికి యీ పరాపేక్షెందుకని నేను ఆలోచించి స్వయం నిర్ణయసూత్రం అమలులోనికి తెచ్చి "కింకవీంద్ర ఘటాపంచానన" అనే కొత్తరకం బిరుదాన్ని యెప్పుడో 20 ఏండ్ల ప్రాయంలో, అదే నా అవసరం కలిగి ధరించాను. దానితో పని కనబడక దాన్నికూడా త్యజించి రెండు పుష్కరాలు కావచ్చిందో, అయిందో? యిప్పుడు 76 వత్సరం వయస్సు. యింకా యీ ముదిముప్పున బాలపాపచిన్నె లెందుకని తోచి చాలా కాలమైంది. "వృద్ధనారీ పతివ్రతా!"

శ్లో. "ప్రపంచచరితం విచార్య నిరతం పరాత్పరతరే రతిం కురు సఖే, నమశ్శివాయోం నమశ్శివా యోం నమశ్శివాయోం నమశ్శివాయోమ్" సర్వదా యేతన్మూలకంగానే శయ్యాగృహంలో కాలక్షేపం గాని యెవరేనా అనవసరంగా నన్ను స్పృశిస్తే మాత్రం, "అఱకం గట్టిన గంగిరెద్దురకదే? ఆత్మీయ వాద్యధ్వనిస్ఫురణం బించుక విన్నయంత.... " గీరతం చూ. పరుందేయేవో నాలుగుమాటలు వ్రాస్తూవుంటాను. వాతపిత్త శ్లేష్మాలతో పాటు సత్త్వరజస్తమోగుణాలు దేహంతో సంబంధ మున్నంతవరకు విడిచిపెట్టవని మహర్షులు సిద్ధాంతీకరించారు. దానికి యీ గజగచ్ఛపసమీకం, లేదా ఆడీబకయుద్ధమే స్పోరకం. యశస్సో? అపయశస్సో? రాదగ్గది గతమందే వచ్చింది. యిప్పుడు ఆ ప్రవాహానికి అడ్డగట్టు వేసి మడొకపుంతను నడిపిద్దామని యత్నిస్తే ('పశువాక్కో? యశమన్న గజ్జిగొని పప్పప్పప్పు చొచ్చో యనస్ వశమానే' ఇటీవలి చర్యచూ.) నడుస్తుందా?..........



# నారాయణ తీర్థులు

( జనవరి 1949 భారతినుండి )

ఆయీ పుణ్యపురుషుణ్ణి గూర్చి సంగ్రహంగా కొలదిమాసాలనాడు వ్రాసేవుండిన్నీ అందులో యీ మహామహుని కవిత్వాన్ని గూర్చి వ్రాయక పోవడంచేత భారతి రజతోత్సవమునకు మంగళ సూచకముగా వుంటుందని యీ నాలుగు మాటల వ్యాసాన్ని వ్రాస్తున్నాను.

లోగడ వ్యాసంలో పారిజాతం అనే పేరుతో లోకప్రసిద్ధిగాంచిన భామకలాపాన్ని రచించిన సిద్ధేంద్రులున్నూ, నారాయణతీర్థులున్నూ వేఱు వేఱు వ్యక్తులుగాని వొక్కరే కారనిన్నీ, కావడం యిద్దఱూ సన్యాసులే అయినా వొకరి సన్యాసం క్రమప్రాప్తం కాదనిన్నీ తెల్పబడ్డది. గృహస్థా శ్రమమందు కొంతకాలం వుండి సన్న్యసించడంచేత నారాయణతీర్థుల సన్న్యాసం "ఆశ్రమా దాశ్రమం గచ్ఛేత్" అనే ధర్మశాస్త్రానికి అనుగుణంగా ఉంటుంది.

"ఆదిని బ్రహ్మచర్యము, ననంతరమందు గృహస్థధర్మ, మా
మీద వనప్రవాస, మటు మీద యతిత్వ మటంచు బ్రహ్మ వి
ద్యాదరు లంద్రుగాదె ? తనయా, వినయమ్ముగలాడ వాగమా
పాదితమైన ధర్మము నెపమ్మున వమ్మొనరింప బాడియే"

(దేవీ భా. ౧ స్కం. చూ.)

తీర్థులవారివలె సిద్ధేంద్రులు ధర్మబద్ధంగా సన్న్యసించలేదు సరి గదా, "యదహరేవ విరజేత్తదహరేవ" అనే శ్రుతికిన్నీ అనుకూలించదు. బలవంతంమీద గదా సిద్ధేంద్రులు సన్న్యసించవలసి వచ్చింది ? ఆ యీ విషయం అంత విపులంగా కాకున్నా కొంత చర్చించినదే. యిద్దరూ కృష్ణా

తీరవాస్తవ్యులే, బ్రాహ్మణులే. వొకరు కూచిపూడి వాస్తవ్యులు; రెండవ వారి గ్రామం పేరు తెలియదు.

కృష్ణలీలాతరంగిణిలో బెజవాడ కనకదుర్గను గూర్చిన ప్రార్థన వుండడంచేత తీర్థులు ఆగ్రామంగాని, యద్వా ఆచుట్టుపట్ల గ్రామంగాని నివాసంగా కలవాడు కావచ్చును. ఓఢ్రదేశస్థమైన జగన్నాథమును గూర్చిన్నీ, ఆదేవుణ్ణిగూర్చిన్నీ తెలిపే తరంగమున్నూ తరంగాలలో వొకటి వుంది. దీన్నిబట్టి ఓఢ్రదేశస్థుడుగా భావించడమయితే యుక్తిసహం కాకపోదుగాని కవి ఆంధ్రుడే అని ధ్రువపరచడానికి అనుకూలించే ఆధారాలు గ్రంథంలో సర్వత్రా చాలా గోచరిస్తాయి. ప్రస్తుతం, రచించినది సంస్కృతగ్రంథమే అయినా ఆ యీ రచనలో తెలుగు సంప్రదాయాలు బోలెడు దొరుకుతాయి.

"అచ్యుతానంత గోవింద, అత్యంతనిర్మలానంద, విచ్యుతసంసారకంద, విశ్వమంగళ ముకుంద"

దీనిలో యతులూ, ప్రాసలూ మాత్రమే కాదు, అంత్యప్రాసలు కూడా వున్నాయి. అయితే సంస్కృత రచనకు ఐచ్ఛికంగా నియతంకాదు కనక యెక్కడేనా ఆయీ విషయం పాటించక పోవడమూ వుంటుంది.

"కలిత శ్రీకౌస్తుభకమనీయకంఠ, కరుణారసభర మిళతవైకుంఠ పరిపాలయ భువిభాగ్యవితరణ — గురుభక్త నారాయణతీర్థ శరణ"

దీనిలో కూడా "రలయోః రభేదః" అని చూచుకుంటే తెలుగుఫణితికి సరిపెట్టుకోవచ్చు, నియతం కాకపోవడంచేత యేదో విత్తంగా అంటే, "గుళ్ళో దేవుడికి అంగట్లో బెల్లం నైవేద్యం" అనేమాదిరి యతిప్రాసలు కనపడతాయి.

" మంగళాలయ మామవదేవ, పంకజాసన భావిత భావ "

దీనిలో యేదో మాదిరిని సరిపెట్టుకోవలసిందె కాని నిక్కచ్చిగా ప్రశ్నిస్తే ప్రయోజనం లేదు.

" దేవకీవసుదేవ తనూజ, దివ్యకిరీట దళితభవబీజ, సర్వయోగి విచింత్యపదాబ్జ, సంగతాఖిల సాధుసమాజ "

దీనిలో కవి అంత్యప్రాసకూడా పెట్టవలెనని తలచి యథాకథం చిత్తుగా సరిపెట్టినట్లు తెల్లం. అసలు తెలుక్కి యతిప్రాసలు సహజాలంకారాలుగా వుండవలసినవి. అందులోనూ పద్యకవిత్వంలో కంటే కూడా పదకవిత్వంలో యెక్కువ ప్రాధాన్యం వీట్లకు యివ్వవలసివుండగా....పదాబ్జ ? ........సమాజ అని సరిపెడితే హృదయంగమంగా వుండదు. అయితే ఐచ్ఛికమైన విషయంలో నిక్కచ్చిగా పరిశ్నించ కూడదు. ఈయన సంస్కృతకవియై యుండిన్నీ తెలుగు కవిత్వమర్యాదలను యింతగా పాటించడం ఆంధ్రికవనం లభించకపోయినా ఆంధ్రుడే రాదు, ఆంధ్రకవి కూడా అయివుండునని అనుమానించుటకు అవకాశం గోచరించుచున్నది. ఆంధ్ర రచనలో విశ్రమస్థానం పదమధ్యంగా నుండడం దోషజుష్టం రాదు. సంస్కృతంలో దోషజుష్టమే. 'సంతుష్టామరసమ్యగాచరిత భేరీనాదసంతుష్టవాన్ ' దీనిలో భారతంలోని, " వచ్చెం గుంతీసుతమధ్యముండు " వచ్చి ప్రత్యక్షమైనాడు కనుక " పూర్వాపరస్మార్త కర్మకలాప " యాజరులధోరణి పరిత్యక్షమైనది. జ్యోతిషంలో యివి చాలా దొరరును. సంగీత, జ్యోతిష, వైద్యకవనంలో వీట్లని పాటించనక్కరలేదని వొక కవి చెప్పినాడు. సమయానికి అది జ్ఞప్తికిరాలేదు గాని అందులో వొకదానికి వుపయోగించే ఆచార్యగోవర్ధనుని అభ్యనుజ్ఞ జ్ఞప్తికి వచ్చింది.

" కి మనార్జవేన శశినః కిం దారిద్ర్యేణ భవతి దయితస్య
గ్రంథిలతయా కి మిక్షోః కి మపభ్రంశేన భవతి గీతస్య "

ఇందులో నాలుగోచరణం సంగీత పాటకులకు "అపశబ్దభయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ" అని ఘోషిస్తున్నది. అపస్వరం వస్తే గాయకులు పాటిస్తారుకాని అపశబ్దం శ్రుతమయితేనో పాటించరు. కనుకనే "రాము డెందు దాగినాడో" అనడానికి అటువారికి నోరు తిరక్క,— "రాము డెందు తాగినాడో" అనిగాని, "తాకినాడో" అనిగాని తఱచుగా పాడుటను ఆక్షేపించక వినడం. భరతశబ్దంలో—భావ-రాగ-తాళాలు మూడున్నూ యిమిడివున్నా యెవరోతప్ప మూడిటియందూ కృషిచేయనివారుగానే వుండడమూ సర్వానుభవసిద్ధమే. ప్రస్తుత మేమిటంటే? లీలాతరంగిణీకర్త ఆంధ్రుడేకాడు, ఆంధ్రికవికూడాను అనేవి. లీలాశుక జయదేవ నారాయణతీర్థ అనే ముగ్గురు సుప్రసిద్ధకవులు సంస్కృతపద కవిత్వాన్ని లోకానికి ప్రసాదించి వున్నారు. భక్తివిషయంలో వీ రొకరికి వొకరు తీసిపోరు. రక్తివిషయంలోనూ డిటో, వ్యక్తివిషయంలోనూ అంతే. "తద్వ్యక్త మల్పా వయం". ఉత్తరదేశంలో జయదేవుని అష్టపదులకు ప్రచారం యెక్కువ. కృష్ణకర్ణామృత శ్లోకాలకీ, తరంగాలకీ మన దేశంలో ప్రచారం అధికం. అష్టపదులు సక్రమంగా సంప్రదాయ సిద్ధంగా పాడేవారు మన దేశంలో అసలే లేరన్నా అది సాహసోక్తికాదు. కర్ణామృతశ్లోకాలు—కృష్ణుని బాల్యాది వయస్సులలో బాల్యవయస్సుకు ప్రాధాన్యం యిచ్చి రచించిన శ్లోకాలు తన్మయత్వాన్ని ఆపాదిస్తాయి. కృష్ణుని జననందగ్గిరనుంచి ప్రారంభించి తరంగాలు రుక్మిణీకళ్యాణంతో సమాప్తమవుతాయి. జయదేవుని రచన యావత్తూ "రాధామాధవయోర్జయంతి యమునాకూలే రహఃకేళయః" కర్ణామృతం శ్లోకమయం. తక్కిన రెండూ పదపద్యోభయమయంగనక యక్షగాన సంజ్ఞకు తగియుండునుగాని లీలాతరంగిణిలో గద్యభాగం కూడా వుండడంచేత దీన్ని చంపూశబ్దంచేత వ్యవహరింపవచ్చునో, లేక అట్టి వ్యవహృతికి గేయాలు అడ్డుతగులునో సహృదయులు నిర్ణేత లగుదురుగాక. లాక్షణికులు "గద్యపద్యాత్మకం కావ్యం చంపూః" అని మాత్రమే వక్కాణించి యున్నారు.

పదకవిత్వానికి చోటు కనపడదుగదా? యింకొక గంపచిక్కు సహృదయులు శ్రమచేసి సిద్ధాంతీకరించతగ్గది యీ లీలాతరంగిణికి సంబంధించినది వుంది. దాన్ని చూపి స్వస్తిచెపుతాను. పల్లవి—"బ్రూహి ముకుందేతి హేరసనే, పాహి ముకుందేతి" అని తరంగగ్రంథప్రారంభ మంగళ గేయాలలో వొకగేయం కనపడుతుంది. నేను నా చిన్నతనంలో వినడం మాత్రం "పాహి గోవిందేతి" అని వినివున్నా యీషద్వైషమ్య మవివక్షితం కనక, ముకుంద శబ్దానికి గోవిందశబ్దాన్ని ఆదేశం చేయడానికి సహృదయులు వివదింపరు. యిక యిప్పుడు యీతరంగంలో ప్రస్తుతం వేటొక అవధూతగారి పేర అచ్చు ( దక్షిణదేశంలో ) పడిన కొన్ని గేయాలలో యిదేపల్లవి, అనుపల్లవి కల కీర్తనకలదు గాని నేను చిన్నతనంలో విన్న 'పాహిగోవింద' 'పాహిముకుంద' గానేవుంది. యీ భేదం పాటించవలసివుండదని వ్రాసేవున్నాను కాని "గరుడగమన నందకహస్తేతి ఖండితదశకంధరమస్తేతి" అనే చరణం అవధూతగారి దానిలో నూతనంకనబడుతుంది. తీర్థులవారిపేర నున్న యీ తరంగిణిలో యీ చరణం లేదుగాని "అచ్యుత కృష్ణ హారే రామేతి, హరి నారాయణతీర్థవరేతి" అనే విశ్వామిత్రసృష్టి కనపడుతుంది. దీన్ని విశ్వామిత్రసృష్టి యనుటకు సాహసమెట్లు కలిగిందంటే—"బాలే తవ ముఖాంభోజే" అన్నదాన్ని "రాజే, తవముఖాంభోజే" అని దిద్దిన దిద్దు బాటువంటిదే హరినారాయణలో వున్న అపభ్రంశ సంబోధన పట్టుపడుచున్నది. అయితే, దాన్ని ముద్రాప్రమాదంగా అంగీకరించి, హరే నారాయణ అన్న పాఠాన్ని అంగీకరిస్తే లయవిషయంలో చిక్కుగా వున్నప్పటికీ—

"గురువు లఘువుజేసి కుదియించి కుదియించి
లఘువు గురువు జేసి లాగిలాగి
కవిత జెప్పినట్టి కవిగులామునుబట్టి
ముక్కు గోయవలయు ద్రొక్కిపట్టి."

అన్న ఆక్షేపణకు గుఱిగావలసి వస్తుంది. అవధూతగారి గేయాలలో సర్వత్రా "హంసనిరంజన" అని వుంటుంది. తీర్థులవారి తరంగాలలో వారి పేరుకు హరి, భక్త, గురుభక్త, అనిగాని వట్టి 'శివ' అనిగాని చేర్చి తరంగాన్ని ముగించడం కనపడుతుంది. అవధూతగారి ముగింపు హంసనిరంజన అనేది యీకీర్తనలో లేకపోలేదు గాని చివర వుండక చరణాలలో మొట్టమొదటిదిగా ముద్రితమయింది. యిది సవరించడంలో అంత చిక్కు లేదుగాని కేవలం నూతనంగా కల్పితమయిన "హరి నారాయణ" అనేదే ఆలోచనీయంగా కనపడుతుంది. నా చిన్నతనంనాడు దీన్ని తరంగంగా నేను యెరుగను. నా కావ్యగురువులలో మొట్టమొదటి గురువు శ్రీ కానుకుర్తి భుజంగరావు పంతులుగారి గురువు శ్రీ ఓగిరాల రంగనాథంగారో, వారి సోదరులు జగన్నాధంగారో రచించినట్లు చెప్పుకోవడం. వీరు మా గురు గురువులకాలంలో వారే కనుక మాకంటె యెంతో పెద్దలుకారు.పిండిప్రోలు శిష్టు పాంతంవారు, పూర్వకవులను సర్వథా అనుకరించి రచన సాగించిన వారు, వీరి సాక్షాచ్ఛిష్యులు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు. వీరూ, వీరేశలింగంగారూ ఇంచుమించు సమవయస్కులు. తీగెతీస్తే డొంక కదిలింది.

నారాయణతీర్థులు చక్కని కవిత్వం చెప్పగల గాయక సార్వభౌముడు. కొన్ని తరంగాల రచనను పట్టి పరిశీలిస్తే భరతనాట్యమందు కూడా అఖండపాండిత్యశాలిగా గోచరిస్తుంది. యింతటి సంగీతసాహిత్యోభయనిష్ణాతుడు శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారే. తరవాతికవులు కాలపు "వయం వా వయమే వవా" చెప్పే దేమేటి. కృష్ణమూర్తిగారి స్వర్గతిన్నీ, నా భాగతిన్నీ ౧౮౭౦ లోనే జరిగింది. "అనప్పిండి అమ్మన్నగారి (పెద్దాపుర సంస్థాన దివాన్) తలా బట్టతల, నా మొగుడుతలా బట్టతల" అందట వొకానొక భిక్షుకుని భార్య.

"వేయిమాటల ఫలమేమి పేరులొక్క-
టైనను నదృష్టములు వేఱులై చెలంగు
సరస తిరుపతి వేంకటేశ్వర కవీంద్రి
శరణు తిరుపతి వేంకటేశ్వర, నమోఽస్తు.

షరా: నారాయణతీర్థులు వేఱు, సిద్ధేంద్రులు వేఱు, వీరు సమకాలీనులో భిన్నకాలీనులో తెలియదు. కృష్ణాతీరవాసులు. సిద్ధేంద్రయోగి రచన శృంగార ప్రధానం. తీర్థులవారిది భక్తిప్రధానం. తీర్థులవారికి పోతన్నగారికివలె గ్రంధికపాత్రలలో అంతర్భావము గోచరించును. సిద్ధేంద్రులకున్నూ డిటో. చదువరులు దీన్ని ముఖ్యంగా గమనించవలసి వుండును.

రక్షరక్ష! ఏహి ముదం దేహి–అయాహి మాధవ కృష్ణ, శ్రీ వాసుదేవ ప్రభో!



# ముసలితనపు అనుభవం

( వి 1950 సం॥రం॥ ఆగష్టు భారతి నుండి )

తరంగాలని సర్వసాధారణంగా లోకంలో వాడఁబడే, శ్రీకృష్ణలీలాతరంగిణి పేరు (కవి పెట్టినపేరు) యెవరికో కాని తెలియనే తెలియదు. ఆగ్రంధాన్ని గుఱించి నాలుగు మాటలు వ్రాయడం కొంత యీ ముసలితనానికి అలంకారంగా వుంటుందని లేఖిని చేత పుచ్చుకున్నాను. నాతోవ నాదీ దాని తోవ దానిదీ అవుతుందో ?— (౧) "తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్" (౨) "కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు"

యీ వయస్సులో కూడా యేదో శబ్దాన్ని గూర్చియ్యేవే కైపరు బొయికురు లాడుతూ శేష జీవితాన్ని కర్చుపెట్టడానికి కాలజ్ఞులు వొప్పు

కోరు " నహి నహి రక్షతి డుకృఞ్‌కరణే," (చూ). శ్రీతీర్థులవారు సంస్కృతంలో రచించినా, యీ గేయాలు సర్వేసర్వత్ర గ్రంథకర్తకు ఆంధ్ర కవిత్వమర్మజ్ఞత తెలుపుడు చేస్తూనేవుంటుంది. (రక్ష రక్ష, అసురశిక్ష, రాజీవదళాయతాక్ష, అక్షీణకృపాకటాక్ష, ఆశ్రితపక్ష సంరక్ష). అయితే తెలుగుఁలో యేదీ రచించినట్లు శ్రుతం కావడంలేదు. భవతు. శ్లోక కవి మాత్రమే కారనిన్నీ చంపు (గద్యపద్యాత్మకం కావ్యం) రచనలో ఆటి తేటిన మహాకవి మాత్రమేకాక జయదేవాది గేయరచనాదక్షులలో నొకరు గాపరిగణింపఁబడతారని విజ్ఞులు విశ్వసిస్తారు. తెలుఁగులో గేయకవులకు కొన్ని నియమాలను వుల్లంఘించడానికి అభ్యనుజ్ఞవున్నట్లే సంస్కృతంలో కూడా క్వాచిత్కంగా (కిమపభ్రంశేన భవతి గీతస్య, గోవర్ధన-చూ.) కనపడుతుంది. అనవసరంగా గ్రంథం పెరుఁగుతూవుంది. తీర్థులు గేయ మహాకవి. యీయన రచించిన గ్రంథం " శ్రీకృష్ణలీలాతరంగిణి " యిది ప్రధానంగా గేయాత్మకం. శ్లోకములు కూడ కొన్ని లేకపోలేదు.

> "ప్రహ్లాద నారద పరాశర పుండరీక
> వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్
> రుక్మాంగదార్జున వశిష్ఠవిభీషణాదీన్
> పుణ్యాని మాన్ పరమభాగవతాన్ స్మరామి."

ఇత్యాది శ్లోకరచనవలన యీయనకు చంపూరచయితలలో యెట్టి స్థానమువస్తుందో వ్యాకరించ నక్కఱలేదు. యీయన రచించిన తరంగిణిలో వచ్చేగాధ శ్రీకృష్ణజన్మదారభ్య రుక్మిణీకల్యాణంవఱకున్నూ. అయితే యీసందర్భంఁకూడా తీర్థులవారు కొంత గూఢంగా వ్యాకరించే వున్నారు. గాని ఆ యీ రహస్యం తెలిసిన వారెందఱో నేను చెప్పడానికి సాహసించ లేను. ఆ యీ రహస్యం యీ మధ్య నాకు తుట్టతుది మంగళహారతి గేయం -

" మంగళం రుక్మిణీ రమణాయ శ్రీమతే
మంగళం. రమణీయ మూర్తయేతే !
మంగళం, శ్రీవత్సభూషాయ, శార్ఙిణేం
మంగళం, నందగోపాత్మజాయ !
జయమంగళం నిత్యశుభమంగళమ్ "

యీ ప్రథమచరణంలో తుట్టతుది విశేషణంవల్ల శ్రీకృష్ణుఁడు నందయశోదలచే పెంచఁబడినవాఁడు అనే రహస్యం గోచరిస్తూవుంది, పరిశీలించండి. యిఁక రెండోచరణం -

పూతనా కంసాది, పుణ్యజనహారిణే
పురుహూతముఖదేవ హితకరాయ
నూతాయ విజయస్య సూదర ముఖాబ్జాయ
శీతకిరణాదికుల భూషణాయ ॥ జయ ॥

యీ తుట్టతుది విశేషణంవల్ల యితఁడు చంద్రవంశంగాని, గొల్లవంశంకాదని తెల్పుతూ వుంది. యిక్కడికి వంశాన్నిగుఱించినవి రెండు ముఖ్యవిషయాలు బయటికి వచ్చినట్లయింది. యిఁక మూఁడో చరణం...

" కాళీయ మౌళిమణి రంజితపదాబ్జాయ
కాలమేఘశ్యామ దివ్యతనవే !
కారుణ్యరసవర్షి నయనాం బుజాతాయ
కళ్యాణగుణరత్న, వారినిధయే
జయమంగళం నిత్యశుభమంగళం "

యీ చరణంలో కొంచెంలోతుగా పరిశీలిస్తే శ్రీకృష్ణ పరమాత్మ దయామయాంతరంగుఁడని మాత్రం తెల్లమవుతూఁది. మొత్తం మీఁద విశేషణాలవల్ల గొల్లకాడని, ఆ యీ విశేషణాలు తెల్పుతాయి. యిఁక

నాలుగో చరణం.

నవనీత చోరాయ. నందాది, గోపగో
రక్షిణే గోపికా వల్లభాయ
నారదమునీంద్రినుత నామధేయాయతే
నారాయణానంద తీర్ధగురవే

యిందులో, నారదమునీంద్రినుత అనేవిశేషణంవల్ల పరమేశ్వరావ తారం అని స్పష్టమవుతుంది. లాకలూకాయలనుగొప్పఁజేసి నారదుఁడు నుతించఁడుకదా! యిందున్నగాధ, జనన ప్రిభృతి కళ్యాణ పర్యంతమే కాని, అంతకుపూర్వంగాని పరంగాని జరిగిన విషయాలు స్పృసించలేదని పూతనాసంహారాదులు తెలుపుతూ కొన్ని విషయాలను నందాదిగోపగో రక్షిణే, అనేవిశేషణాలు తెల్పుతున్నాయి, మొత్తం యీవరేజీని పరిశీలిస్తే శ్రీకృష్ణుని బాల్యచేష్టలను తీర్థులవారు ముముక్షుజనులకుఁగాను దీన్ని, రచించి పరమోపకారం చేశారు, నేను యీ ముదిరినవార్ధకం దీనివల్లచాలా సులువుగా కాలక్షేపం చేస్తున్నాను. నా చిన్నతనంలో మా తండ్రిగారు వగయిరా, (వుప్పమాక బ్రిహ్మయ్యగారు) వీట్లను పాడుతూవుంటే విన్న జ్ఞాపకం నాకు. యిప్పుడు తరుణోపాయమయింది.

"జర రాఁబోఁగలదంచు నే నెఱిగియున్ జర్చింప లే దింతదు
స్తరమౌనం చిపుడేని యేమిచెడియెన్, దైవంబు నీపాదమా
దరువున్ జూపెను, దీని నశ్రమముగా దాఁటంగ నే నేర్తు ష్టీ
మరుతో సాగర మెట్టిదేని సుఖగమ్యంబంబ ? కామేశ్వరీ"

"తమ మక్షిద్వయ మాక్రిమించుటకునై దౌదవ్వులన్ జేరి రం
ధ్రము లన్వేషణ సేయుచున్న ముదురుం బ్రాయమ్ము వార్ధక్య, మెం
త మహారాజును దీనిబారిఁ బడుచో ధైర్యమ్ము గోల్పోవు, నెం
తమదోన్మత్తుఁడు దీనికిన్ జడిసెడిన్, నా తల్లి కామేశ్వరీ"

అల మతివిస్తరేణ. స్వస్తి.

# ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 2 | రస్వతః | రసతః |
| 19 | 20 | శబ్ది | శాబ్ది |
| 31 | 3 | అర్థా | అర్తా |
| 71 | 1 — 2 — 3 | వెంకన్న | తెంకన్న |
| 118 | 4 | న్ని  బొ | న్నిపూరించినబొ |
| 126 | 4 | బాగా | బేబాగా |
| 179 | 24 | రతః | రపః |
| 205 | 12 | ఆకవి | ఆపలి |
| 226 | 24 | శాతము | శాత్యము |
| 252 | 24 | వివరి | నివర్తి |
| 258 | 6 | దానసగము | దున్నయబులు |
| 341 | 25 | యిప్వస్త | యింప్వస్త |
| 420 | 24 | త  సం | త అహరహస్సం |
| 439 | 24 | జౌపవారి | జౌపదారి |
| 477 | 4 | ని  ప | ని బట్టి ప |
| 478 | 11 | గాని  ల | గాని అది ల |
| 505 | 26 | సంగతు | పండితు |
| 506 | 23 | దవే | దతే |
| 506 | 23 | యడ | యతి |
| [illegible] | [illegible] | వర్ధినె | వర్ధితె |

506 26 [illegible] బ్రాకెట్లు ఉన్నంత వఱకు — ఇట్లు సవరించుకోవలెను

[illegible]షయుతప్పితది క[illegible]దై — (శ్రవణా — చూ.)